శ్రీమాత్రే నమః

# శ్రీ దేవీ భాగవతము

## ప్రథమ స్కంధము

**ఓమ్ సర్వచైతన్యరూపాం తా మాద్యాం విద్యాం చ ధీమహి ।**
**బుద్ధిం యా నః ప్రచోదయాత్**

శ్లో॥ నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం ।
దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్ ॥
అచతుర్వదనోబ్రహ్మ ద్విబాహురపరోహరిః ।
అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః ॥

మా బుద్ధులను సన్మార్గము వైపు ప్రేరేపించునట్టి సమస్త చైతన్య స్వరూపము, అన్నిటికి ఆద్యురాలు, మహావిద్యా స్వరూపిణియునైన పరమేశ్వరిని ధ్యానించెదము.

భగవంతుడగు నారాయణునకు నరోత్తముడగు నరమహర్షికి సరస్వతీ దేవికి నమస్కరించి అటు పిమ్మట జయమును పలుకవలయును. పూజ్యుడగు వేదవ్యాస మహర్షి నాలుగు ముఖములు లేని బ్రహ్మ, రెండు చేతులే కలిగిన-మరియొక శ్రీమన్నారాయణుడు, నుదుట కన్నులేని మరియొక శివుడు, అనగా వ్యాసమహర్షి, బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరులతో సమానుడని భావము. అట్టి వ్యాసమహర్షికి నమస్కారము.

## శౌనకుడు సూతుని ప్రశ్నించుట

**సూత మహర్షితో శౌనకుడిట్లు పలికెను :-**

సత్పురుషుడవు ధన్యుడవునగు ఓ మహానుభావా! సూతమహర్షీ! నీవు వేదవ్యాస మహర్షి రచించిన దివ్యమైన అష్టాదశపురాణములను చక్కగా చదివిన పుణ్యాత్ముడవు. సత్యవతీ పుత్రుడగు వ్యాసమహర్షివలన రహస్య విషయములతో బాటు పురాణముల నన్నింటిని తెలిసికొనిన నీవు మా పుణ్యమువలన లభించితివి.

ఈ క్షేత్రము కలియుగ దోషములకు దూరమైనది. దివ్యమైనది కూడ. ఓ సూత మహర్షీ! ఈ మునులందరు పుణ్యప్రదమైన పురాణమును నీనుండి వినవలెనని ఉత్సాహముతో కూడియున్నారు. నీవు స్తిమితమైన మనస్సు కలవాడవై మాకు పురాణకథను వినిపించుము.

ఓ సూతమహర్షీ! నీవు అన్ని విషయములు తెలిసినవాడవు. ఏ విధమైన తాపత్రయము లేనివాడవు. నీకు భగవంతుడు దీర్ఘాయువు నొసంగుగాక ఓ మహానుభావా! వేదములతో సమానమైన పురాణమును మాకు వినిపింపుము. మానవులు చెవులు కలవారైనను, కథలలోని రుచిని గ్రహించు నేర్పుకలవారైనను దైవముచే మోసగింపబడి పురాణములను వినుటలేదు. తీపి పులుపు మొదలగు రుచుల ననుభవించి, జిహ్వేంద్రియమువలన ఆనందమును పొందుచున్నట్లు విద్వాంసులు చెప్పిన మాటలవలన చెవులకు పరమానందము కలుగుచున్నది. చెవులులేని సర్పములును శబ్దమాధుర్యమునకు ఆకర్షింపబడుచున్నవి. చెవులుకల మనుష్యులు మధురములైన, సత్కథలను సదుపదేశములను వినకపోవుటచే చెవులు లేనివారనియే చెప్పవలెను.

ఓ బుద్ధిమంతుడా! కలియుగములోని పాపములకు భయపడి ఈనైమిశారణ్య క్షేత్రమున సర్వవర్ణములవారలును పుణ్యప్రదములగు పురాణ కథలను వినగోరిన వారై ప్రశాంతములైన మనస్సులతో నీ మాటలకు యెదురుచూచుచున్నారు. ఏదోఒకపనితో ప్రతివ్యక్తియు కాలమును గడుపును. మూర్ఖులైనవారు ఆయా వ్యసనములతో కాలమును గడుపుచుందురు. పండితులట్లుగాక జీవితమును సార్థకము చేసుకొనుటకు ఉపయోగపడునట్టి శాస్త్ర విషయములను మననము చేసికొనుచు, లేక ఇతరులకు బోధించుచునూ కాలమును గడుపుదురు. పురాణములు సత్త్వగుణ ప్రధానములు, రజోగుణ ప్రధానములు, తమోగుణ ప్రధానము అని మూడు విధములుగా నీ వెరిగించి యుంటివి. అట్టి పురాణములలో శ్రీ దేవీ భాగవతము ఐదవ వేదముగను పుణ్యప్రదముగను పూర్వము నీవే చెప్పి యుంటివి. ఆ దేవీభాగవతము మోక్షము కోరువారికి మోక్షమును, ధర్మము కోరువారికి ధర్మమును, మరియు నితరములగు కోరికలను కూడ అనుగ్రహింపగలదని చెప్పితివి కదా! ఆ దేవీభాగవతమునే సవిస్తరముగా నిప్పుడు మాకు చెప్పవలసినదిగా కోరుచూ అన్ని వర్ణములువారు సావధానమనస్కులై యున్నారు. మహర్షీ! నీవు సర్వధర్మముల నెరిగిన వాడవు గురుభక్తి గలవాడవు, సత్త్వగుణ సంపన్నుడవును. అట్టి నీనుండి వేదవ్యాసునిచే చెప్పబడిన దేవీభాగవత పురాణమును వినగోరుచు న్నాము.

మహర్షీ! యెన్నో విషయములను నీవు చెప్పగా వినియున్నాము. ఐనను ఇంకను నీనుండి పలువిషయములు వినవలయునను కుతూహలముతో నున్నాము. అమృతము త్రాగువానికి తృప్తి యెట్లుండదో అట్లే నీవు చెప్పు విషయములను విన్నను మాకు తృప్తి కలుగుటలేదు. అమృతము త్రాగు వారికి మోక్షము సాధ్యముగాదు కాని దేవీభాగవతరసమును త్రాగువారికి కష్టములన్నియు తొలగి మోక్షముకూడ లభ్యమగును. అమృతపానము కొరకు మేము వేలకొలది యజ్ఞములు చేసినను శాంతి సమకూరలేదు. ఎందువలననగా యజ్ఞములుచేసి స్వర్గసుఖము ననుభవించినను చేసిన పుణ్యము నశింపగా పిమ్మట మరల భూలోకములో జన్మించుట తప్పదు. సత్త్వరజస్తమోగుణములతో కూడిన సంసార చక్రములో తిరుగువారికి జ్ఞానము కలిగిననే కాని ముక్తి ప్రాప్తించదు. కనుక అన్ని రసములతో నిండిన మోక్షప్రదమగు పవిత్రమైన శ్రీ దేవీభాగవతమును వినిపింపుము. ఈ భాగవతము మోక్షము కోరువారికి యెల్లప్పుడును ప్రియమైనది. అను శౌనకుని మాటలను విని సూతునిడిట్లు పలికెను.

# దేవీభాగవత మందలి స్కంధముల వివరణము

ఇచ్చట నున్న మహాత్ములు వేదములు వలె పుణ్యప్రదమైన శ్రీదేవీభాగవతమును గూర్చి ప్రశ్నించుట నాయదృష్టము. నేను ధన్యుడను నేనిప్పుడు వేదార్థ సమానమైన దేవీపురాణమును చెప్పెదను.

ఓ మునులారా! పరమయోగులకు ముక్తి నిచ్చు శ్రీమదఖిలాండేశ్వరి లలితా దేవి యొక్క పాదపద్మములకు నమస్కరించి నవరస భరితమగు దేవీభాగవత పురాణమును మీకు చక్కగా వివరించుదును. అన్ని వేదములందు ఆదిశక్తిగా కోరికల నిచ్చునదిగా ప్రసిద్ధి చెందిన శ్రీరాజ రాజేశ్వరి మాకు ప్రత్యక్షమై సిద్ధుల నొసంగుగాక. తన మాయాశక్తిచే సకల ప్రపంచ ములను సృష్టించి పెంచిలయింప చేయుచు లీలావినోదమును చూపుచున్న విశ్వమాతను మనస్సులో స్మరించెదను. బ్రహ్మ విష్ణువు నాభికలమలము నుండి పుట్టివాని ప్రేరణచే సృష్టిని ప్రారంభించెను. కనుక బ్రహ్మపరాధీనుడు స్వతంత్రుడుకాడు. విష్ణువు నకాధారము శేషుడు. కనుక నతడును సృష్టికాధారమని చెప్ప జాలము. మహాసముద్రజలమునకు పరదేవతయే ఆధారము కావున ఆ తల్లినే శరణు వేడు కొనుచున్నాను. బ్రహ్మ నిద్రలోనున్న విష్ణువును చూచి - యే దేవిని ప్రసన్నురాలుగా చేసికొనినో దయామృత తరంగిణియగు నామెను శరణుజొచ్చు చున్నాను. సగుణ నిర్గుణ స్వరూపిణి

ముక్తిదాయిని యగు ఆ తల్లిని ధ్యానించి సంపూర్ణ దేవీ భాగవత పురాణమును మీకు చెప్పెదను.

మునులారా! శ్రద్ధగా వినుడు. ఈ దేవీభాగవత పురాణము పుణ్యప్రదము ఉత్తమోత్తమమును. దీనిలో పదునెనిమిదివేల శ్లోకములు పన్నెండు స్కంధములు మూడువందల పదునెనిమిది అధ్యాయములును గలవు. ఈ పురాణమును చెప్పినవాడు వ్యాసమహర్షి. మొదటి స్కంధములో ఇరవై, రెండవ స్కంధమున పన్నెండు, మూడవ స్కంధమున ముప్పై, నాల్గవ స్కంధమున ఇరవై ఐదు, ఐదవ స్కంధమున ముప్పైఐదు, ఆరవ స్కంధమున ముప్పైఒకటి, ఏడవ స్కంధమున నలభై, ఎనిమిదవ స్కంధమున ఇరవైనాలుగు, తొమ్మిదవ స్కంధమున యాభై, పదవ స్కంధమున పదమూడు, పదకొండవ స్కంధమున ఇరవై నాలుగు, పన్నెండవ స్కంధమున పదునాలుగు అధ్యాయములును కలవు. ఇందు సర్గ, ప్రతిసర్గ, వంశ, మన్వంతర, వంశాను చరితములు కలవు. పరదేవత నిత్య. నిర్గుణ శివ స్వరూపిణి, విశ్వాధార, యోగగమ్య ఆమెయే పరబ్రహ్మ స్వరూపిణి. ఆమె రూపాంతరములే మహాకాళీ లక్ష్మీసరస్వతులు. అట్టి రూపముల దాల్చు లక్షణమునే "సర్గ" మని చెప్పుదురు. ఆ మూడుశక్తుల వలననే బ్రహ్మ, విష్ణు, మహేశ్వ రులుద్భవించిరి. వీరు సృష్టి స్థితిలయముల నొనర్చుచుందురు. ఈ మూడు మూర్తుల వృత్తాంత మును "ప్రతిసర్గ" మందురు. సూర్యచంద్ర వంశరాజుల చరిత్రను తెలుపుట "వంశ" మనబడును. స్వాయంభువాది మనువుల వంశ, జీవిత కాలపరిమాణముల వర్ణించుట "మన్వంతరము" ఆ మనువుల వంశ కథలను తెలుపు "వంశానుచరితము" ఈ ఐదును పురాణముల కుండవలసిన లక్షణములు. వ్యాసమహర్షి మహా భారతకథను ఒక లక్ష యిరువది అయిదువేల శ్లోకములతో రచించెను. మహా భారతమును - వేదసారమనియు నందురు - అని సూతుడు చెప్పగా శౌనకమహర్షి అడుగుచున్నాడు.

"ఓ సూతమహామునీ ! ఆ పురాణములు మొత్తమెన్ని? వాటిపేర్లు వినగోరు చున్నాము" అని పూర్వము బ్రహ్మ మాకిచ్చిన చక్రమిక్కడకు వచ్చుసరికి శిథిలమై పడిపోయినది. అందుచే నీ క్షేత్రము "నైమిశమని" ప్రసిద్ధి చెందినది. సత్యయుగము వచ్చువరకు మేమిక్కడనే యుందుము. మేమేకాగ్ర చిత్తముతో పురాణము వినగోరుచున్నాము. నీవు దేవీభాగవతమును మాకు వినిపించి దీర్ఘాయుష్కుడవై జీవింపుము. పవిత్రమై సమస్త కోర్కెలను తీర్చునట్టి భగవతికి సంబంధించిన శ్రీ దేవీభాగవతమును మాకు దయతో వివరింపుమనియు శౌనకాదులు సూత మహామునిని ప్రార్థించిరి. అంతట సూతుడిట్లు పలికెను.

# పురాణములను వ్యాసులను గురించి వివరములు

ఓ మునులారా! వ్యాసమహర్షి చెప్పిన పురాణములు పద్దెనిమిది. వాటిలో మొదటిది మత్స్యపురాణము. దీనిలో శ్లోకములు 14 వేలు, రెండవది మార్కండేయ పురాణము- ఇది అత్యద్భుతమైనది. దీనిలోని శ్లోకములు 9 వేలు, భవిష్య పురాణములో శ్లోకములు 14,500. శ్రీమహాభాగవతములో 18 వేల శ్లోకములు కలవు. బ్రహ్మాండ పురాణములో 12,100 శ్లోకములు , బ్రహ్మ పురాణములో శ్లోకములు, 10 వేల శ్లోకములు బ్రహ్మవైవర్తములో 18 వేలశ్లోకములు , వామన పురాణములో 10 వేల శ్లోకములు, వాయువు పురాణములో 24,600 శ్లోకములు కలవు. శ్రీవిష్ణు పురాణము మహాద్భుతము. అందు 23 వేలు శ్లోకములు. వరాహ పురాణమందు 24 వేల శ్లోకములు, అగ్నిపురాణమున 16 వేల శ్లోకములు, నారద పురాణమున 25 వేల శ్లోకములు, పద్మపురాణమున 55 వేలశ్లోకములు, లింగపురాణమున 11 వేల శ్లోకములు, గరుడ పురాణమున 19 వేల శ్లోకములు, కూర్మపురాణమున 17 వేల శ్లోకములు, స్కందపురాణమున 51 వేల శ్లోకములు, ఇది పురాణములు వాటియందలి శ్లోకములు, సంఖ్యయు. ఇక ఉపపురాణములు సనత్కుమారము, నారసింహము, నారదీయము, శైవము, దౌర్వాసము, కాపిలము, మానవము, ఔశనసము, వారుణము, కలికము సాంబము, నందికృతము, ఆదిత్య పురాణము, మహేశ్వరము భాగవతము, వాసిష్ఠము అనునవి 18. వ్యాసుడు పురాణములు చెప్పిన పిమ్మట సారరూపముగ మహాభారతమును చెప్పెను.

ప్రతి మన్వంతరమున ద్వారపరయుగము వచ్చును. అట్టి ద్వాపరమున శ్రీహరి వ్యాసమహర్షిగ అవతరించి వేదములను విభజించును. పురాణములను వివరించెను. ప్రతి కలియుగమందును బ్రాహ్మణులల్పాయువులు అల్పబుద్ధులుగా నుండుటచే వేదమును విభజించి వారి మేలుకొరకు పవిత్ర పురాణ సంహితలను ప్రకటించెను. ఇప్పుడేడవ వైవస్వతమన్వంతరము జరుగుచున్నది. ఈ ద్వాపరమున నా గురువైన వ్యాసుడు వేదవ్యాస పీఠమునలంకరించెను. రాబోవు ద్వాపరమున అశ్వత్థామ వ్యాసపదము నలంకరించును.

ఈ విధముగా నిప్పటికి ఇరువదియేడుగురు వ్యాసులు వచ్చి వెళ్ళిరి. అని చెప్పగా మునులు నేటివరకు వచ్చి వెళ్ళిన వ్యాసుల పేర్లను వినగోరుచున్నా మనగా సూతుడిట్లు చెప్పెను. మొదటి ద్వాపరమున "బ్రహ్మ"యే వ్యాసుడు. రెండవ ద్వాపరమున "ప్రజాపతి" తరువాత శుక్రుడు "గురు" "రవి" మృత్యులు, యింద్రుడు, సారస్వతుడు "త్రిధాముడు" "త్రివృషుడు' భరద్వాజుడు,

అంతరిక్షుడు, ధర్ముడు, త్రైయారుణి ధనంజయుడు. మేదాతిథి "వ్రతి", అత్రి, గౌతముడు, హర్యాత్ముడు, వేనుడు, వాజశ్రవుడు, సోముడు, తృణబిందువు, భార్గవుడు, "శక్తి" జాతుకర్ణి కృష్ణద్వైపాయనుడు. ఇరువది యెనిమిది ద్వాపర యుగములతో వచ్చిన వ్యాసుల గురించి చెప్పితిని. వ్యాసుడు దేవీ భాగవతమును చెప్పుచుండగా నేను విన్నాను. అది పుణ్యప్రదము. ఈ కలిసంసార పాపములను పారద్రోలునది. కోరికలను తీర్చును- ముక్తి నిచ్చును. నవరసభరితము వ్యాసుడీ పురాణమును మొదట తన కుమారుడైన శుకునకు బోధించెను. అప్పుడు నేనక్కడనే యుంటిని.

కావున దేవీ పురాణ రహస్యమును వినుభాగ్యము నాకబ్బినది. దేవీ భాగవతము సంసార సముద్రమును దాటించునావ. ఎట్టివాడైనను, యే నెపముతోనైనను దేవీ భాగవతమును విననచో నీలోకమున భోగభాగ్యముల నను భవించి చివరకు అక్షయదేవీ లోకముల నొందగలడు. ఇట్టి దేవీ భారతమను నావ నుపయోగించు కొననివాడు సంసారమును దాటలేడు.

## వ్యాసుడు పుత్ర సంతతికై పరితపించుట

ఋషులు శుకుని జన్మ వృత్తాంతమడుగగా సూతుడిట్లు చెప్పెను. వ్యాసుడు సరస్వతీనదీ తీరమున ఆశ్రమములో నివసించుచు రెండు గోరువంకలను చూచి ఆశ్చర్యపడెను. ఆ పిట్టలజంట తమ పిల్లలనోటిలో నాహారము పెట్టుచు వాటి స్పర్శచే నానందించుట చూచి పుత్రుని ముద్దాడి కౌగిలించుకొని యానందించుట యే ఉత్తమోత్తమ సుఖమనియు, పుత్రులు లేనివానికి సద్గతి లేదనియు విచారించి చింతాక్రాంతుడయ్యెను. పిమ్మట దేవతోపాసనముచే సంతానమును పొందవలెనని తలచుచుండగా నారదుడు ప్రత్యక్షమయ్యెను. అప్పుడు వ్యాసుడు దేవర్షియైన నారదుని కూర్చొనబెట్టి అర్ఘ్యపాద్యాదులచే సత్కరించి కుశలనుడిగెను. పిమ్మట నారదుడు ద్వైపాయనా! నీవేల చింతించుచుంటివో తెలుపుమనగా వ్యాసుడిట్లనెను. సంతానము లేనివారికి సద్గతులు లేవు. వానికి శాంతియుండదు. కనుక నేను దుఃఖించుచున్నానననెను. మరియు సంతానప్రాప్తికై ఏ దేవతను ప్రసన్నునిగా చేసికొనవలెను? అని ఆలోచించుచున్నాను. ఏ దేవత నాకు త్వరగా పుత్రుని ప్రసాదించగలదో దయతో తెలుపుమని వేడుకొనెను.

ఓ పారాశర్యా! నీవు నన్నడిగిన ప్రశ్ననే పూర్వము నా తండ్రి యగు బ్రహ్మ శ్రీహరి తపస్సు చేయుటను చూచి యడిగెను. అప్పుడు హరి యిట్లు చెప్పెను! వేదపారగులగు మహాత్ములు సమస్తము మూలప్రకృతియైన పరదేవత వలన

జరుగుచున్నదని భావించుచున్నారు. నీవు నేను శివుడును ఆ పరశక్తికి లోబడి యుండువారలమే. దేవి దయవలననే నేను మధు కైటభుల సంహరింప గలిగితిని. ఆతల్లి దయచేతనే కూర్మ, వరాహ, నరసింహాద్య వతారములు ధరించుచున్నాను. నాకు స్వేచ్ఛ యున్నచో నేనీ నీచజన్మల నేలపొందె దను? నేను సర్వవిధముల శక్తికి పరతంత్రుడను నేను శక్తినే యెల్లప్పుడు ధ్యానించు చుందును అని విష్ణువు బ్రహ్మతో పలికెను. కనుక ఓ వ్యాసమహర్షి! ఆదేవి పాదపద్మములను నిరంతరము హృదయమున ధ్యానించినచో నీ కోరిక తీరునని పలికెను. అంతట వ్యాసుడా దేవిని గూర్చి తపస్సు చేసెను. అని చెప్పగా మునులు విష్ణువు హయగ్రీవుడెట్ల య్యెనో తెలుపుమని కోరగా సూతుడిట్లనెను.

# శ్రీ హయగ్రీవావతార వర్ణనము

భగవంతుడగు జనార్దనుడు పదివేల సంవత్సరములు దానవులతో యుద్ధము చేయవలసి వచ్చెను. అలసిన అతడు పద్మాసనముపై కూర్చొని ధనుస్సు చివరపై వ్రాలి నిద్రించెను. ఇంద్రుడు మున్నగువారు విష్ణువు సహాయమున యజ్ఞము నొకదాని చేయదలచిరి. పరమాత్మయైన ఆ విష్ణువును దేవతలు దర్శించి యాతని మేల్కొని పుటెట్లని చింతాక్రాంతులైరి. అప్పుడు దేవేంద్రుడిట్లనెను. "నిద్రా భంగము చేయుట దోషము. అట్లు చేయ వలదు" అని అప్పుడు బ్రహ్మ యిట్లు పలికెను. నేనొక చెదపురుగును సృష్టించి దానిని యీ వింటివారిని కొరుకుట కాజ్ఞాపించెదను. అదియట్లు చేయగా వారి తెగి విల్లు విరిగి ఏర్పడు ధ్వనికి దేవ దేవుడు నిదురనుండి మేల్కొనును" అని పలికి ఆతడట్లే చెదపురుగును సృష్టించి వింటి వారిని కొరుకుమని దాని నాజ్ఞాపించెను. అప్పుడా పురుగు నేనిట్టి పాప కార్యమునేల చేయుదును? దీనివలన నాకు కలిగెడి ఫలమేమి? యని ప్రశ్నించెను. అప్పుడు బ్రహ్మ మేము చేయు యాగములో నీకు కొంతభాగము నిచ్చెదము. కనుక విష్ణువు మేల్కొనునట్లు చేయుమనగా చెదపురుగు వింటివారిని కొరికెను. ఘోరమైన ధ్వని యేర్ప డెను. విష్ణువు యొక్క కిరీటకుండలములతో శోభిల్లు తల కనబడలేదు. బ్రహ్మ రుద్రాదులు తలలేని శ్రీహరి మొండెమును చూచి యాశ్చర్యపడిరి. దేవతలెల్లరు దుఃఖింపసాగిరి. అప్పుడు బృహస్పతి ఓ మహాశయులారా! ఇట్లేడ్చిననేమి ప్రయోజనము? ఏదేని ఉపాయమాలోచింప వలయును అని పలికెను. అప్పుడు బ్రహ్మ పరదేవతయే మన కార్యము సమ కూర్చగలదు. ఆమె ముల్లోకములకు తల్లి యని పలికెను. మరియు దేవతల

కార్యసిద్ధి కొరకు జగన్మాతను స్తుతింపుడని వేదముల నాజ్ఞాపించెను. అప్పుడు వేదములు పరదేవతనిట్లు స్తుతించెను.

# వేదములు చేసిన దేవీస్తుతి

శ్లో॥ నమోదేవి మహామాయే। విశ్వోత్పత్తి కరే! శివే
నిర్గుణే సర్వభూతేశి। మాతః। శంకరకామదే ।
త్వం భూమి స్సర్వభూతానాం ప్రాణః ప్రాణవతాంతథా ।
ధీః శ్రీః కాంతిః క్షమాశాంతిః శ్రద్ధా మేధాధృతిః స్మృతిః ॥
త్వముద్గీథేఽర్ధ మాత్రాసి గాయత్రీ వ్యాహృతిస్తథా।
జయాచవిజయా ధాత్రీలజ్జాకీర్తిః స్వాహాదయా॥
త్వాంసంస్తుమోఽంబ భువనత్రయ సంవిధాన
దక్షాందయా రసయుతాం జననీంజనానామ్ ।
విద్యాం శివాం సకలలో కహితాంవరేణ్యాం ।
వాగ్బీజవాసవిపుణాం భవనాశకర్త్రీమ్॥
బ్రహ్మాహరశ్శౌరి సహస్ర నేత్ర వాగ్వహ్ని సూర్యాభువనాధినాథాః
తేత్వత్కృతాస్సన్తి తతోనముఖ్యామాతాయతస్త్వం స్థిరజంగమానామ్
సకలభువనమేతత్కర్తుకామా యదాత్వం
సృజసిజనని దేవాన్ విష్ణు రుద్రాజముఖ్యాన్ ।
స్థితి లయజననం తైః కారయస్యే కరుపా
నఖలు తవ కథంచిత్ దేవి। సంసారలేశః ॥

**స్తోత్రభావము** :- ఓ సకలభూతేశ్వరీ! శివకామినీ! విశ్వజననీ! శివాత్మికా! మహామాయాదేవీ! నీకు మా నమస్కారములు. నీవే సర్వభూతములకు మూలాకాధారము నీవే ప్రాణుల ప్రాణము. శ్రీ, క్షమ, బుద్ధికాంతి శాంతిశ్రద్ధ, మేధ, ధృతి, స్మృతి, ఇవన్ని యు నీవే. ప్రణవమందలి యర్ధమాత్రవు నీవు శ్రీగాయత్రీ దేవతవు సప్త వ్యాహృతులు, జయ, విజయ, ధాత్రి, లజ్జ, కీర్తి, దయ, స్వాహా ఇవన్నియు నీవే. దయామృత తరంగిణీ! విశ్వమాతా! ముల్లోకముల సృష్టించు భవభయ భంజనీ! వరేణ్యా! మహా విద్యాస్వరూపిణీ! వాగ్బీజనివాసినీ! అమ్మా! నిన్నెల్లప్పుడు స్తుతింతుము. హరిహర బ్రహ్మలు, యింద్రాగ్నులు, రవి, సరస్వతి, లోకాధిపతులును నీచే సృష్టింపబడిరి. ఇంతేకాదు. ఈ స్థావరజగములకన్నిటికి నీవే తల్లివి. నీవీ జగముల నిర్మించదలచి త్రిమూర్తుల సృష్టించి వారిచే సృష్టి స్థితిలయముల నొనరింపజేయుచున్నావు. నీలో సంసార వాసనలు లేశమాత్రము కనబడవు.

శ్లో॥ నతేరూపం వేత్తుం సకలభువనే కోపినిపుణో
నవామ్నాం సంఖ్యాంతే కథితుమిహ యోగ్యోఽస్తిపురుషః
యదల్పం కీలాలంకలయితుమశక్తస్సతు నరః
కథం పారావారాకలన చతురస్స్యాద్వృతమతిః
నదేవానాం మధ్యేభగవతి! తవానంతవిభవం
విజానాత్యే కోఽపిత్వమిహ భువనైకాసి జనని
కథంమిథ్యా విశ్వం సకలమపిచైకారచయసి
ప్రమాణం త్వేతస్మిన్ నిగమవచనం దేవి విహితమ్
నిరీహై వాసిత్వం నిఖిలజగతాం కారణమహెూ
చరిత్రం తేచిత్రం భగవతి మనోవ్యథయతి
కథంకారంవాచ్య స్సకలనిగమాగో చరగుణ
ప్రభావః స్వంయంప్మాత్స్వియ మపినజానాతి పరమమ్
నకింజానా సిత్వం జనని మధుజిన్మోళి పతనం
శివే కింవా జ్ఞాత్వా వివిదిషసిశక్తిం మధుజితః
హరే! కింవామాతర్దురితతతిరేషా బలవతీ
భవత్యాః పాదాబ్జేభజన నిపుణేక్వాస్తిదురితమ్
ఉపేక్షాకించే యంతవసురసమూహేతివిషమా
హరేర్మూర్ధ్నో నాశోమతమిహమహాశ్చర్య జనకమ్
మహద్దుఃఖంన్రాత స్త్వమసిజననచ్ఛేదకుశలా
నజానీమోమాళే ర్విఘటన విలంబః కథమభూత్
జ్ఞాత్వాదోషం సకలసురతాపాదితం దేవిచిత్తే
కింవా విష్ణావ మరజనితం దుష్కృతం పాతితంతే
విష్ణోర్వాకిం సమరజనితః కోపిగర్వోతివేగాత్
ఛేత్తుంమాతస్తవ విలసితం నైవవిద్మోత్రభావమ్
కింవాదైత్యైస్సమరవిజితై స్తీర్థదేశే సురమ్యే
ఘోరంతప్త్వా భగవతి! వరంలబ్ధ వద్భిర్భవత్యాః
అంతర్ధానం గమిత మధునా విష్ణుశీర్షం భవాని।
ద్రష్టుం కింవావిగత శిరసంవాసుదేవం వినోదః
సింధోః పుత్ర్యా రోషితా కింత్వమాద్యే కస్మాదేనాం ప్రేక్షసే నాథహీనామ్
క్షంతవ్యస్తే స్వాంశజాతా పరాధోప్యుత్థాప్యైనం మోదితాం మాంకురుష్వ॥

**స్తోత్రభావము:-** నీ స్వరూపమును తత్త్వమును తెలిసినవాడు యే లోకమునను లేడు. నీనా మమెంతో మధురము. ఎల్లజగత్తుల నిర్మించుటకు నీవు చాలుదువను టకు వేదములు ప్రమాణములు నీవు యే కోర్కెలు లేని దానవు. ఎల్లలోకములకు కారణ మైనదానవు. నీవిచిత్ర చరిత్ర పరమాద్భుతము. వేదములు నీ మహోజ్వల ప్రతిభ నెరుగలేవు. మేమేమి గ్రహింపగలము? ఈ విష్ణువు శిరము కనబడకపోవుట నీకు తెలియదా? మధువైరి బలమెంతటిదో తెలిసికొన గోరుచున్నావా? హరి యందే దేని దోషమున్నదా? అతడు నీపాదములనే కొలుచువాడు. విశ్వమాతా! ఈ హరి యెల్ల దేవతలలో చాల గొప్పవాడు. ఈతని విషయముననుపేక్షింప తగదు. యితని తల తెగిపడుట ఆశ్చర్యముగానున్నది. దుఃఖాకరమైయున్నది. చావు పుట్టుకల వలన దుఃఖమును తొలగించుటకు నీవే సమర్థురాలవు. మధు సూదనుని తల నతికించుటకేల జాగుచేయుచున్నావు? దేవతల యపరాధమునకు ప్రతి ఫలముగా హరి శిరస్సును త్రుంచితివా? దేవతల పాపముచే వీనితల తెగిపడి నదా? లేక బలగర్వమును హరించుటకు నీవే యితని తల త్రుంచితివా? ఇందుకు కారణ మూహింపలేకున్నాము. తలలేని దేవుని చూచి వినోదము నొంద దల చితివా? ఏదియేమైనను మాకు శ్రీహరి తల కనబడుటలేదు. లక్ష్మిపై కోపించి యిట్లు చేసితివా? ఆమె ముఖమునెట్టు చూడగలవు? నీయంశతో పుట్టిన లక్ష్మిని వేదను మును నీవు హరిని క్షమించవలయును గదా। కనుక నీవిపుడీతనికి తల ననుగ్రహింపుము తల్లీ!

శ్లో॥ **ఏతే సురాస్త్వాంసతతం నమంతి కార్యేషు ముఖ్యాః ప్రథితప్రభావాః**
**శోకార్ణవాత్తారయ దేవి దేవానుత్థాప్య దేవం సకలాధినాథమ్ ।**
**మూర్ధాగతః క్వాంబహరేర్న విద్మోనాన్యోస్త్యు పాయఃఖలు జీవనేఽద్య**
**యథాసుధా జీవనకర్మదక్షా తథాజగజ్జీవితదాఽసిదేవి!**

స్తోత్రభావము:- ఈ దేవత లెల్లప్పుడు నీకు నమస్కరించుచుందురు. లోకనాథు డైన శ్రీహరిని లేపి దేవతలను దుఃఖ సముద్రము నుండి దాటింపుము విష్ణువు తల యెక్కడ పడెనో తెలియుటలేదు. అతడు జీవించుటకు ఉపాయమేదియు లేదు. దేవతలకు జీవనమొసగు దివ్యామృతమూర్తిని నీవే కదా! యని వేదములు దేవతలతోబాటు దేవి స్తుతించినవి. అంతట సూతుడిట్లనెను. ఈ స్తోత్రమును వినిదేవి పరమానందము నొందెను. అప్పుడు ఆ శరీరవాణి యిట్లు పలికెను. "దేవతలారా! చింతింపవలదు. మీరుస్తిమితముగా నుండుడు. వేదముల స్తోత్రము నకు సంతసించితిని. ఎవడీ నా స్తోత్రమును భక్తితో చదువునో అతడు అన్ని కోరికలను పొందగలడు. ఈ స్తోత్రమును విన్నవాడు దుఃఖము

తొలగి సుఖించును. వేదములు పలికిన యీ స్తోత్రము వేదసమానము" ఈహరిశిరస్సు తెగుటకు కారణ చెప్పుచున్నాను వినుడు. ఒకప్పుడు విష్ణువు తన ప్రక్కనున్న ప్రియురాలి ముఖమును చూచి నవ్వెను. ఆమె కోపించి నీ తలతెగిపడుగాక యని శపించినది. పూర్వము మహావీరుడగు "హయగ్రీవు"డను రాక్షసుడుండెను. అతడు సరస్వతీ నదీతీరమున ఘోరమగు తపమొనర్చెను. నేనాతనికి ప్రత్యక్షమై వరమును కోరు కొమ్మంటిని. అప్పుడాతడు నాకు మరణము లేకుండునట్లు చేయుమనెను. అప్పుడు నేను మరణమెవ్వనికేని తప్పదు నీకిష్టమైన మరియొక వరము కోరు కొనుమనగా నాదైత్యుడు గుఱ్ఱము ముఖము కలవాని వలననే నాకు మరణము సంభవించునట్లు వరమిమ్మనెను.

అప్పుడు నేను నీవింటికి వెళ్లి సుఖముగా రాజ్యము చేసికొనుమని పలికి అంతర్ధానము చెందితిని. ఆ దానవుడు యింటికి వెళ్ళి వరగర్వితుడై మునులను బాధింపనారంభిం చెను. అతనిని చంపువాడెవ్వడును లేడు. కనుక బ్రహ్మ గుఱ్ఱము తలను తెచ్చి విష్ణువున కతికించును. విష్ణువు హయగ్రీవుడై ఆదైతేయుని సంహ రింపగలడు. దేవతలకు మేలు చేయగలడు. అని దేవి దేవతలకు చెప్పి యూర కొనెను. అంతట దేవతలు సంతోషించి దేవశిల్పిని ప్రేరేపింపగా నాతడు గుఱ్ఱము తలను నరికి విష్ణువు శరీరమునకు అతికించెను. ఈ విధముగావిష్ణువు హయగ్రీవు డయ్యెను. కొంతకాలము పిమ్మట మదగర్వితుడైన అరక్కసి హయగ్రీవ భగవాను నిచే యుద్ధమున చంపబడెను. ఈ శుభమైన కథను విన్న మానవులు సమస్త దుఃఖములు నశించి సర్వసంపదల నొంది సుఖింతురు. మునులు మధుకైటభవ వృత్తాంతము వివరముగా చెప్పుమని సూతుని ప్రశ్నింపగా నాతడిట్లు చెప్పెను.

## మధుకైటభుల యుద్ధ ప్రయత్నములు

పూర్వము ప్రపంచమంతయు జలమయము కాగా శేషశయ్యపై విష్ణువు నిద్రింపగా వాని చెవిగూలి నుండి బలవంతులైన మధుకైటభులను రాక్షసులిరువురు పుట్టి పెరిగి సముద్రజలములో క్రీడించుచు నిట్లు విచారించిరి. ఈ నీటికి ఆధార మేమి? ఇంతనీ రెట్లు పుట్టెను? మనమిరువుర నీటిలో నెట్లు మునిగియుంటిమి? మనలను పుట్టించినవాడెవడు? ఆతడెక్కడున్నాడు? ఎంతగా నాలోచించినను తెలియుటలేదు" అని విచారించిరి చివరకు కైటభుడు మధువుతో నిట్లనెను. అన్నా! మన మీ జలమందుండుట ఒక మహాశక్తి కారణము కావచ్చు. ఆశక్తి మహాబలము గలదని నాయభిప్రాయము. ఈ మహాజలమునకంతకు ఆమెయే

ఆధారము. ఆశక్తియే మనకు మూలాధారము కావచ్చు. అని యిట్లు వారు తలచుచున్న సమయమున ఆకాశమునుండి వాగ్బీజరూపమగు ధ్వని వినబడెను. అంతలో ఆకాశమున నొక మెరుపు కనబడెను. వారా ధ్వనిని మంత్రముగా భావించి జితేంద్రియులై వేయి సంవత్సరములు తపమొనర్చిరి. అప్పుడు దేవి అశరీర వాక్కుతో ఓ దానవులారా! మీ తపస్సుకు సంతసించితిని. మీ కోరికను తెలుపుడు. తప్పక దానిని నెరవేర్చెదనని పలికెను. అప్పుడు దానవులు తాము కోరినప్పుడు మరణించుట్లు వరమడిగిరి. దేవి యట్లేయని వారికి వరమిచ్చినది. కొంతకాలమునకు పద్మమందు బ్రహ్మవారికి కనబడెను. వారాతనితో నీవు మాతో యుద్ధమొనర్చుము లేదా వేరొకచోటకు పొమ్ము అని పలికిరి. బలవంతులగు వారిని చూచి బ్రహ్మ చింతాక్రాంతుడయ్యెను. ఆలోచించి జనార్దనుడు నాబాధలను తొలగింపగలవాడు. అని తలచి వానిని నిద్ర నుండి మేల్కొలుపుటకు నారాయణు నిట్లు స్తుతించెను.

ఓ శ్రీహరీ! మాధవా! సర్వాంతర్యామీ! లోకసృష్ట్యంతకరా! మధుకైటభులు నన్ను చంప తలపెట్టినారు. నీవఖిలాధారుడవు కదా! నీకీ విషయము తెలియుట లేదా? అని యెన్ని విధముల స్తుతించి ప్రార్థించినను వాసుదేవుడు మేల్కొనకుండగా తన మనస్సులోనిట్లు తలచెను. ఈదామోదరుడు మహాశక్తికి లోబడి మేల్కొనుటలేదు. ఇప్పుడు నేనేమి చేయను? అని యాలోచించి ఆ మహాశక్తియే నన్ను రక్షింప సమర్థురాల నిశ్చయించి యామెనే స్తుతించెదను. అప్పుడు హరి మేల్కొని నా శత్రువుతో యుద్ధము చేయగలడు. అని విష్ణు నాశ్రయించి యున్న యోగనిద్ర నిట్లు స్తుతించెను.

# విష్ణు ప్రబోధము

శ్లో॥ దేవిత్వమస్య జగతఃకిలకారణం హిజ్ఞాతం మయా సకల వేదవ చోభిరంబ।
యద్విష్ణు రప్యఖిలలోక వివేకకర్తా నిద్రావశంచగమితఃపురుషోత్తమోఽద్య॥

**స్తోత్ర భావము:-** ఓ దేవీ! ఈసర్వ ప్రపంచమునకు నీవే కారణమని సమస్త వేదములు చెప్పుచున్నవి. ఓ తల్లీ అట్లు కానిచో సమస్త విజ్ఞానమును ప్రసాదించు పురుషోత్త ముడు నేడు నిద్రకు వశుడైయుండుటేమి? యని స్తుతించెను. దేవి వెంటనే నారాయణుని శరీరమునుండి వెడలి యతని చెంత నిలుచుండెను. ఇట్లు పరదేవత యగు యోగ నిద్రదనుజులనాశమునకు తేజోనిధియగు విష్ణుమూర్తి శరీరము నుండి తొలగినది. అప్పుడు గోందుడు కొంచము మెల్లగా కదలెను. అతి కనుగొని బ్రహ్మ పరమానందభరితుడాయ్యెను.

# సర్వశక్తి స్వరూపిణి ఆరాధ్యదేవత యనుట

ఋషులు సూతమహర్షి నిట్లు ప్రశ్నించిరి. ఓమహానుభావా! పండితులు వేద శాస్త్రపురాణముల ఆధారముతో బ్రహ్మ,విష్ణు,మహేశ్వరులు ముగ్గురును పురాతన దేవతలని నిశ్చయించినారు. ఈ ముగ్గురికంటె గొప్ప దైవములేదని నిర్ణయించిరి. బ్రహ్మలోకములను సృష్టించువాడు. విష్ణువు రక్షించువాడు, రుద్రుడు లయ మొన ర్చువాడని పురాణములలో నిశ్చయింపబడినది. అయితే ఈ ముగ్గురును ఒకే మూర్తి యొక్క భిన్నభిన్న రూపములుగా గ్రహింపవలెను. ఈ ముగ్గురిలో విష్ణువు శ్రేష్ఠుడు, సమర్థుడును. ఇట్టివాడును యోగమాయకు వశుడై ఎట్లు నిద్రావస్థనందెను. అతని విజ్ఞానము స్వతంత్రత సమర్థత యెట్లు నశించినవి? ఏ శక్తిచే విష్ణువు పరాధీనుడయ్యెనో ఆ శక్తి యెవరు? ఎట్లు జన్మించినది? ఈ విషయము గొప్ప ఆశ్చర్యకరముగా ఉన్నది. ఈ సందేహమును వ్యాసమహర్షి శిష్యుడవగు నీవు జ్ఞానోపదేశముచే తొలగింపుము"అని శౌనకమహర్షి సూతమహర్షిని ప్రార్థిం చెను.

సూతమహర్షి శౌనకముని మాటలను విని యిట్లు పలికెను. ఏ ప్రమాణము చేతను గ్రహింప శక్యముకాని పరబ్రహ్మతత్త్వ మొకటి కలదు. ఆ తత్త్వమే ఆదిశక్తి. ఈశక్తి అంతటను వ్యాపించియున్నది. అగ్నియందు మండుటగాను, వాయువు నందు ప్రేరేపించునదిగాను. అనేక వస్తువు లందనేక రీతులుగ ప్రకాశించుచున్నది. ఈ శక్తిలేనిచో శివుడు శవమగును. లోకములో శక్తిలేని వస్తువు గౌరవింపబడదు. ఇట్లు అనేక స్థలములందు వేర్వేరుగ గోచరించు శక్తియే పరబ్రహ్మ స్వరూపము. బ్రహ్మాండమును సృష్టించునది. రక్షించునది చివరకు లయింప చేయునది కూడా శక్తియే. ఈ శక్తితో కూడియుండుట వలననే బ్రహ్మాదిదేవతలును ఆయాపనులను చేయగలుగుచున్నారు. ఆ శక్తిస్వరూపమే కారణములందు కార్యములందును మనకు ప్రత్యక్షముగా గోచరించుచున్నది. ఆశక్తి గుణరహిత మని, గుణసహితమని రెండు విధములుగా పండితులు చెప్పుచున్నారు.

ఈ విధముగా అంతటను మనకు కనిపించు శక్తియే పరబ్రహ్మ స్వరూపము. బుద్ధిమంతులగు పండితులామెనే ఉపాసించెదరు. విష్ణువునందలి శక్తి సాత్వికము, బ్రహ్మయందలి శక్తి రాజసము, అట్లే శివుని యందలి శక్తి తామసము. ఆయా శక్తుల ప్రభావముచేతనే హరిహర బ్రహ్మలు జగద్రక్షణాది కార్యములను నిర్వర్తింప గలుగుచున్నారు. కనుక శక్తియే ప్రపంచమును సృష్టించి పాలించి లయింపచేయు చున్నది. ఆ శక్తి ప్రభావముచేతనే దేవతలందరు తమతమ పనులను నిర్వర్తింప గలుగుచున్నారు. ఆశక్తి గుణసహితమనియు గుణరహితమనియు రెండు

విధములు. కోరికలు కలవారు సగుణశక్తిని సేవించి కృతార్థులగుచున్నారు. వైరాగ్యము కలవారు నిర్గుణశక్తిని సేవించెదరు. ధర్మార్థకామ మోక్షముల నీయగలది ఆమెయే. జనులు అజ్ఞానముచేత ఆమెను గుర్తింపలేక పోవుచున్నారు. జ్ఞానులు కూడ ఇతరులకు అజ్ఞానమును బోధించు చున్నారు. కలి పురుషప్రభావము అట్టిది. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు పరబ్రహ్మ స్వరూపమైన ఆశక్తినే ధ్యానించి తమతమ కోరికలను తీర్చుకొనుచున్నారు. వారు నిత్యము పరమాత్మ సర్వరూపమయగుశక్తినే తమ మనస్సులలో ధ్యానించుచున్నారు. కనుక విద్వాంసులు నిశ్చయముగా నెల్లప్పుడును ఆ పరదేవతయగుశక్తి స్వరూపమును సేవింపవలెను.

ఓ మునిశ్రేష్ఠులారా! సమస్త శాస్త్రములయొక్క నిర్ణయమిదియేయని గ్రహించండి. ఈ సిద్ధాన్తమును నేను వ్యాసమహర్షి నుండి గ్రహించితిని. వ్యాసమహర్షి నారదుని నుండి తెలిసికొనెను. నారదుడు తన తండ్రియగు బ్రహ్మదేవుని వలన తెలిసి కొనెను. బ్రహ్మకీ సిద్ధాన్తమును విష్ణువు బోధించినాడు. ఇతరుల మాటలను నమ్మక పండితులైనవారు, శక్తియే ఆరాధింప తగిన పరతత్త్వమని నిశ్చయముగా గ్రహింపవలెను. అంతయెందుకు శక్తిలేనివాని అశక్తత మనకు ప్రత్యక్షముగా తెలియుచునేయున్నది. కనుక ప్రాణులందరును అన్ని ప్రాణులందును గల శక్తినే తెలిసికొనవలయును.

## దేవి దయచే విష్ణువు మధుకైటభులను చంపుట

జగన్నాథుడు అగు శ్రీమహావిష్ణువు నిద్రతొలగగానే సమీపమున భయముతో వణకుచున్న బ్రహ్మదేవునిచూచి ఉరుమువలె గంభీరమగు వాక్కుతో ఓ బ్రహ్మ! తపస్సు చేయుట మాని నీవేల వచ్చితివి? చింతతో భయముతోను వ్యాకులమగు మనస్సు కలవాడవై యుంటివేల? అని ప్రశ్నించెను. అంత బ్రహ్మ, మహాత్మా! నీ చెవిలోని మాలిన్యమునుండి పుట్టిన మధుకైటభులను రాక్షసులు ఘోరాకారములతో నన్ను చంపుటకై వచ్చిరి. వారిని చూచి భయపడి నీవద్దకు వచ్చితిని. నన్ను రక్షింపుమని వేడుకొనెను.

అంతట శ్రీమహావిష్ణువు ఓ బ్రహ్మ నీవు నిర్భయముగా నుండుము. యుద్ధము చేయదలచి ఎవతో సిద్ధపడిన వారిద్దరినీ నేను చంపెదను. అని విష్ణుమూర్తి పలుకుచుండగనే బ్రహ్మను వెదకుచూ మదోన్మత్తులైన ఆ రాక్షసులిద్దరు అచటకు వచ్చిరి. మఱియు నీవు మాకు భయపడి పారిపోయి యీతని దగ్గరకు వచ్చితివా? ఇతడు చూచుచుండగనే నిన్ను చంపుదుము. తరువాత ఇతనిని కూడ చంపుదుము. కనుక నీవిపుడు మాతో యుద్ధము చేయుము లేదా మాకు దాసుడనని పలుకుము

అని వారు పలికిరి. ఆ మాటలువిని విష్ణువు 'ఓ రాక్షసులారా! నాతో యుద్ధమును చేయుడు. మదించి యున్న మిమ్ములను చంపివైచెదను. పట్టుదల ఉన్నచోరండు' అని వారితో పలికెను. ఆ మాటలు విని రాక్షసులిద్దరును నీటియందుండియే యుద్ధమునకు సిద్ధపడిరి. ఆ రాక్షసులిద్దరిలో మధువనువాడు కోపముతో శ్రీ మహావిష్ణువుతో యుద్ధము చేయుటకు వచ్చెను. కైటభుడు చూచుచూ నుండెను. మదించినమల్లులవలె వారిరువును యుద్ధము చేసిరి. మధువు అలసిపోగా కైటభుడు యుద్ధమునకు వచ్చెను.

ఈ విధముగా ఒకరి తర్వాత నింకొకరుగా విష్ణువుతో చాలకాలము యుద్ధమును చేసిరి. బ్రహ్మ ప్రేక్షకుడుగా నుండెను. ఐదువేల సంవత్సరములు విష్ణువు ఆ ఇద్దరు రాక్షసులతో యుద్ధముచేసి అలసిపోయెను. మరియు రాక్షసులు యుద్ధోత్సాహముతో నుండగా, నేనిట్లలసిపోతినేమి? అని చింతించుచుండగా మదించి యున్న ఆ రాక్షసు లిద్దరును గంభీరమగు కంఠధ్వనితో నీవు యుద్ధము చేయలేనిచో మాకు దాసుడనని చెప్పుము. చేయగలిగినచో యుద్ధమును చేయుము. ముందు నిన్ను చంపి తర్వాత నీ నాల్గుముఖాలవానిని గూడ చంపుదుము అని పలికిరి. ఆ మాటలువిని విష్ణువు ఓ రాక్షసులారా! వీరులు శ్రమపడి యున్న వారితో యుద్ధము చేయరు. ఐదువేల సంవత్సరములు మీతో యుద్ధము చేసితిని. నేను ఒకడనే, మీరిద్దరు. నేను కొంచెము విశ్రమించి మీతో యుద్ధము చేయుదును అని పలుకగా వారిద్దరును మరల యుద్ధము చేయవలయునని కొంతదూరములో కూర్చుండిరి. విష్ణుమూర్తి వారు మరణించక పోవుటకు కారణ మేమి?అని ఆలోచించి 'విద్యా స్వరూపురాలు, అన్ని కోర్కెలను తీర్చునట్టి శక్తి స్వరూపమును శరణువేడెదను. ఆమె యనుగ్రహము లేనిచో నేపనియు నెరవేరదు'అని ఆలోచించుచుండగా ఆకాశమందు మంగళ స్వరూపురాలగు శక్తి కనిపించెను. వెంటనే యోగవేత్తయగు శ్రీమహావిష్ణువు చేతులు జోడించి ఆ రాక్షసుల సంహరించుటకై భువనేశ్వరియైన శక్తి స్వరూపమును వరములనిచ్చు నట్టి యామెనిట్లు స్తుతించెను.

శ్లో॥ నమోదేవి! మహామాయే! సృష్టిసంహారకారిణి ।
అనాదినిధనేచండి భుక్తి ముక్తిప్రదే శివే ॥
నతే రూపం విజానామి సగుణం నిర్గుణం తథా ।
చరితానికుతోదేవి! సంఖ్యాతీతాని యానితే ॥

మహామాయా స్వరూపురాలవు, సృష్టిని లయమును చేయుదానవు, చావు పుట్టుకలు లేనిదానివి. దుర్మార్గులపై కోపించుదానవు ఇహపరలోకము లందు

నానందము నిచ్చుదానవు మంగళ స్వరూపురాలవు అగు ఓ దేవీ! నీకు నమస్కారము. నీ సగుణరూపమునుగాని, నిర్గుణరూపమును గాని నేనెరుగను. లెక్కకు మించిన నీచరిత్రల విషయమిక చెప్పనేల వినుము. నేను నిద్రకు వశమ గుటచేతనే నీ ప్రభావమును గుర్తించితిని. నీవు నన్ను విడిచిపెట్టగనే నేను మేల్కొని అనేక విధముల యుద్ధము చేసితిని. అలసిపోయినవాడనై నీ నుండి ఆరాక్షసులు వరములను పొందిరని అలసటలేకుండా వారు యుద్ధము చేయుటచే గ్రహించాను. కనుక రక్షకురాలవైనతిని. నిన్ను శరణువేడుచున్నాను. యుద్ధముతో అలసి దుఃఖ పడుచున్న నాకు సహాయము చేయవలసినదిగా ప్రార్థించుచుంటిని. వరములను పొంది మదించియున్న ఆ రాక్షసులు నన్ను చంపుటకు సిద్ధముగా నున్నారు. ఇప్పుడు నేనేమి చేయుదును? ఎక్కడకు పోదును?

అని ప్రార్థింపగా ఆ దేవి చిరునవ్వుతో తనకు నమస్కరించుచు నిలుచున్న జగన్నాథుడగు విష్ణువును మరల యుద్ధము చేయుమని ప్రోత్సహించుచూ క్రీగంటి చూపులతో ఆ రాక్షసులను మోహింపజేసెను. అందుకు సంతోషించి విష్ణుమూర్తి మరల యుద్ధమునకు సిద్ధమయ్యెను. అప్పుడా రాక్షసులు సంతోషముతో నాల్గు భుజములు కలవాడా! స్థిరముగా నిలిచి యుద్ధము చేయుమని హెచ్చరించిరి. కొంతసేపు యుద్ధము చేసి అశక్తుడగు విష్ణుమూర్తి దీనముగా దేవివైపు చూచెను. అంతట ఆమె రాక్షసులవైపు చూచి నవ్వుచు తనచూపులతో వారిని మోహింప చేసినది. అప్పుడు విష్ణువు, మోహములో పడిన ఆ రాక్షసులతో ఓ రాక్షసులారా! మీ యుద్ధము నాకు మిక్కిలి సంతోషము కలిగించినది. కనుక మీరు కోరిన వరము నిచ్చెదనని పలికెను. అంతట అభిమానవంతులైన ఆ రాక్షసులు ఓయీ! మేము యాచకులము కాము. నీవే కావలసిన వరమును కోరుకొమ్ము అని పలుకగానే నాచేతిలో మీరిద్దరును చావవలయును, యిదియే నాకు కావలసిన వరమని విష్ణువు పలుకగానే నీరులేని ప్రదేశము చూపినచో అక్కడ నీ చేతిలో మరణింతుమని వారు పలికిరి. అప్పుడు శ్రీమహా విష్ణువు తన తొడలను మిక్కిలి విశాలముగా పెంచి అక్కడ వారి నుంచి వారి శిరస్సులను చక్రాయుధముతో ఖండించెను. ఆ రాక్షసుల క్రొవ్వుతో సముద్రమంతయు వ్యాప్తమయ్యెను. అందువలన భూమికి "మేదిని" అని పేరు వచ్చినది. కావున మహా విద్యాస్వరూపురాలు మహామాయా స్వరూపిణి యగుశక్తియే అందరి చేతను సేవింపదగినది. ఆమెకంటె శ్రేష్ఠమగు వ్యక్తి ముల్లోకములందును లేదు. నిర్గుణశక్తిని కాని సగుణశక్తినిగాని అందరు పూజించవలెను. ఇదియే వేదశాస్త్ర నిర్ణయము.

## ఋషుల సందేహము

ముకుందుడు నిద్రనుండి మేల్కొనిన విధమును విని ఋషులిట్లు సూతుని ప్రశ్నించిరి. ఓ మహానుభావా! మాకొక మహా సందేహము కలిగినది. అదియే మనగా పండితులు వేదశాస్త్రపురాణముల ద్వారా బ్రహ్మ విష్ణు మహేశ్వరుడు ముగ్గురును సనాతన దేవతలని నిశ్చయించి చెప్పుచున్నారు. ఆ ముగ్గురికంటె పరదైవము వేరొకటిలేదని వారి నిర్ణయము. బ్రహ్మ సృష్టికర్తయని రక్షకుడు నారాయణుడని శివుడు సంహారకుడని వినుచున్నాము. వారి ముచ్చరిలో మాధవుడు శ్రేష్ఠుడు విష్ణుమూర్తితో సమానుడు వేరొకలేడు. అతడు యోగమాయచే నిద్రకు వశుడగుట యెట్లు సంభవించును? అతని విజ్ఞానమేమైనది? ఇది మాకు కలిగి సందేహము విష్ణువును జయించిన ఆశక్తి ఎవరు? దేనినుండి పుట్టినది? పరమాత్మ యగు వాసుదేవుడు కూడ నిద్రకు పరాధీనుడగుట యెట్లు సంభవము? ఇది ఆశ్చర్యకరమైన సందేహము మహాబుద్ధిశాలినగు సూతమహర్షీ మా యీ సంశయమును తొలగింపవలసినదిగా వ్యాసశిష్యుడవగు నిన్ను ప్రార్థించుచున్నాము. అని ప్రశ్నించిరి!

## వ్యాసుడు పుత్రార్థియై శివుని గూర్చి తపమొనర్చుట

ఋషులు సూతమహర్షి నిట్లు ప్రశ్నించిరి సూతమహర్షీ! వ్యాసుడు దేవీ భాగవతమును రచించి కుమారుడైన శుకునకుపదేశించెనని చెప్పితివి. వ్యాసునకు శుకమహర్షి పుత్రుడుగా జన్మించిన వృత్తాంతమును వినగోరుచున్నామని యడుగగా సూతుడిట్లు చెప్పదొడగెను. పుత్రార్థియైన వ్యాసుడు నారదుని నుండి వాగ్బీజ మంత్రము నుపదేశము పొంది నిరాహారియై నూరేండ్లు తపమొనర్చెను. అతని తపోగ్నికి దేవేంద్రుడు గడగడలాడెను. రుద్రుడాతని చూచి నీవేల భయపడుచుంటివని యడిగెను. దేవేంద్రుడు వ్యాసుడేమి కోరి తపస్సు చేయుచున్నాడో తెలియక భయపడుచుంటిని. అతని కోరిక తెలిసినచో నాకు వచింపుడని రుద్రునడుగగా నాతడు నన్ను గూర్చి పుత్రసంతతి కొరకు వ్యాసుడు తపసు చేయుచున్నాడు. అతనికిప్పుడు పుత్రుడు కలుగునట్లు వరమిచ్చెదనని పలికి వ్యాసుని సమీపించి వ్యాసమునీ! లెమ్ము నీకు జ్ఞానియు తేజోనిధియగు పుత్రుడు జన్మించుగాక యని పలుకగా వ్యాసుడు శివునకు నమస్కరించి తన యాశ్రమమునకు వెళ్ళెను.

అప్పుడు స్త్రీ సంబంధము లేని నాకు పుత్రుడెట్లు కలుగునని చింతించుచుండగా ఘృతాచి యను దేవకాంత ఆకాశములో కనబడెను. ఆమెను చూచి కామము పెల్లుబుకగా నేనీమె యందాసక్తి చూపినచో పూర్వము

పురూరవుడు ఊర్వశిని కామించి చివర కామెచే తిరస్కరింపబడెను. అట్లే యగుదు నేమో యని తలచెనని చెప్పగా ఋషులు పురూరవుడెవరు? ఊర్వశి యెవరు? అతడెట్లు కష్టాలపాలయ్యెను? ఆ కథ మాకు వినిపింపుమని సూతుని కోరిరి. అప్పుడు సూతుడిట్లనెను.

## బుధుని జన్మవృత్తాంతము

బృహస్పతి దేవతలకు గురువు. అతని భార్య తార. ఆమె మంచి సౌందర్యవతి పడుచుతనమందున్నది. ఆమె యజ్ఞము చేయుచున్న చంద్రుని యింటికి వెళ్ళి అతని కంటబడెను. ఆమెను చూడగనే చంద్రుడు కామాతురుడయ్యెను. ఆమెయు నాతని కాంచికామ పీడితయయ్యెను. వారిరువురును యథేచ్ఛగా క్రీడించుచు నెన్నియో దినములు గడిపిరి. ఈ విషయము తెలిసి బృహస్పతి తారను తీసికొని రమ్మని తన శిష్యుని పంపెను. చంద్రునకు వశురాలై ఆమె రాలేదు. ఎన్నిమార్లు శిష్యులను పంపినను ఆమె రాకపోవుటచే తానే చంద్రునింటికి వెళ్ళి యాతనిని నిందించి యిప్పుడైన నాభార్యను పంపుమనగా చంద్రుడు బ్రాహ్మణుడు కోపముచే పూజింపరాని వాడగును. ఆమె కామసుఖార్థిని. కొన్నాళ్ళిచటనే యుండి మీ యింటికి రాగలదు. అని పలుకగా నచటనే నిలిచి కోపము మితిమీరగా నిన్ను శపించి భస్మము చేయుదునని బృహస్పతి మండిపడెను.

అంతట చంద్రుడీమె నాకు తగినదిగాని నీకు తగినదికాదు. నేనీమెను విడు వను. నీచేతనైన పని చేసి కొనుమని పలుకగా బృహస్పతి దుఃఖించి వేగమే యింద్రుని వద్దకేగెను. అతడర్ఘ్య పాద్యాదులతో పూజించెను. దీనుడుగా నున్న గురువును చూచి యింద్రుడు మహాభాగా నీవు శోకార్తుడవైతివేల? నీచింతయేమి? నీవు నా గురుడవు. లోకపాలకులు దేవసైన్యము నీ యధీనము బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నీకు సాయమొనర్చెదరు. మీకష్టమును వేగవెల్లడింపుడని యడుగగా సురగురు నిట్లనెను. నా భార్యయైన తారను చంద్రుడు వశపరచుకొని మరల నాకిచ్చుటలేదు. నీవే నాకు దిక్కు, నేను మిక్కిలి కష్టపడుచున్నాను. నాకీ విషయమున సాయమొ నర్చుము'అని అప్పుడింద్రుడిట్లనెను. ధర్మజ్ఞా! మహామతీ! నీవింక దుఃఖింపకుము నేను నీదాసుడను- నీకాంతను తెప్పించి యిచ్చెదను.

ఇప్పుడే దూతను పంపెదను. అతడు నీభార్య నీయనిచో సైన్యముతో నాతనిపై యుద్ధమునకు వెడలెదను" అని యిట్లు సురాచార్యు నోదార్చి చంద్రుని వద్దకు దూతను పంపెను. దూత మాటలు విని చంద్రుడు ఈమెకు నాయందే అనురాగ మున్నది. ఇట్టి దానిని విడిచిపెట్టుట న్యాయము కాదు. నీవు పురందరునితో

నేను తారను విడువను నీకు చేతనైన పని చేసికొనుమని చెప్పుము అని పంపి వైచెను. అంత పురుహూతుడు దూతమాటలు విని యుద్ధమునకు సిద్ధమయ్యెను. శుక్రాచార్యులు చంద్రునకు మంత్రశక్తితో సాయమొనర్చుదుననెను. శివుడు బృహస్పతి కండగా నిలిచెను. రాక్షసులు కూడ చంద్రునకు సహాయుద్ధమున పాల్గొనిరి. ఘోరమైన దేవదానవ సంగ్రా మము చాల సంవత్సరములు జరిగినది.

అప్పుడు బ్రహ్మదేవుడు శుక్రుని మందలించి చంద్రుని సమాధాన పరచి యప్పటికే గర్భవతియైన సురాచార్యుని భార్యను వాని కప్పగించునట్లు చేసెను. అంతట బృహస్పతి తన భార్యను స్వీకరించి తన యింటికి వెళ్ళెను. దేవదానవులు తమతమ నివాసములకు వెడలిపోయిరి. కొన్ని దినములకు తార కుమారుని కనెను. ఆతడు చంద్రుని పోలియుండెను. బృహస్పతి శిశువునకు జాతకర్మాదుల నిర్వర్తించెను. అంతట చంద్రుడు నా కుమారునకు నీవు జాతకర్మాదు వేల చేసితివని దూతచే నడిగించెను. అప్పుడు బృహస్పతి నా కుమారుడే యని సమాధానమిచ్చెను. ఆ వివాదమును మాన్పుటకు పరమేష్ఠి మరల వచ్చి రహస్య ముగా తార నడిగి వాస్తము తెలిసికొని శిశువును చంద్రునకు అప్పగించెను. చంద్రుడు సంతోషముతో కుమారునెత్తికొని యాతనికి "బుధు"డని పేరు పెట్టి తన యింటికి చేరెను. బ్రహ్మ తన లోకమున కరిగెను. ఇది బుధుని జన్మవృత్తము.

# సుద్యుమ్నుస్తుతి -పురూరవూ జననము

బుధునకిల యనుకాంతయందు పురూరవుడు జన్మించెను. అతడు ధర్మా త్ముడు. వాని జన్మ వృత్తాంతము వినుడు! పూర్వము సుద్యుమ్నుడను రాజు కలడు. అతడు సత్యవాది జితేంద్రియుడును. ఒకనాడు గుఱ్ఱము నెక్కి అతడు ధనుర్బాణములు చేతబట్టి వేటకు వెళ్ళెను. అనేక పశువులను సంహరించుచు కుమారవనమున ప్రవేశించెను. సుందరమైన యావనమందు సుద్యుమ్నుడు స్వేచ్ఛగా విహరించుచు సంతసించుచుండెను. అప్పుడు అకస్మాత్తుగా స్త్రీ యయ్యెను. అతని మగ గుఱ్ఱముకూడ ఆడ గుఱ్ఱమయ్యెను. అందుకాతడు మిక్కిలి బాధచెందెను. అని చెప్పగనే ఋషులు సుద్యుమ్నుడు స్త్రీగా నేలమారెను. కుమారువ వనమందాతడేల విహరించెను? పిమ్మట నతడేమి చేసెను? వివర ముగా నంతయు తెలుపుమని కొరగా సూతుడిట్లనెను.

పూర్వము సనకాది యోగి పుంగవులు శివుని దర్శించుటకు వెళ్ళిరి. అప్పుడు శివుడు పార్వతితో క్రీడించుచుండెను. గిరిజ ఋషులను చూచి తలవంచుకొని శివుని ఒడినుండి దిగి వణుకుచున్న శరీరముతో నిలుచుండెను. ఋషులు పార్వతి

శివులను చూచి అప్రదేశము విడిచి నారాయణాశ్రమమునకు చేరిరి. శివుడు పార్వతి సిగ్గుచే బాధపడుచుండుటను చూచి నేటినుండి ఎవడైన నీ వనమున ప్రవేశించినచో నాతడు స్త్రీయగునని శాపమిచ్చెను. సుద్యుమ్నుడీ శాపము నెరుగక వనమందు ప్రవేశించి స్త్రీ యయ్యెను. ఆ స్త్రీగా మారిన వానికే "ఇల" యని పేరు బుధుడాయిలను చూచి కామించెను. ఇలయునతని ప్రేమించెను. వారిరువురకు పురూరవుడు జన్మించెను.

పిమ్మట ఇల వసిష్ఠుని ప్రార్థింపగా నాతడు ఇలకు పురుషరూపము కోరి శివుని గూర్చి తపస్సు చేసెను. శివుడు తన మాట యసత్యము కాకుండునట్లు ఒక నెల పురుష రూపము, మరొక నెల స్త్రీ రూపముతో నుండునట్లు నుగ్రహించెను. స్త్రీగా నున్నప్పుడు అంతఃపురమందే యుండుటవలన ప్రజలు సంతోషపడకుండిరి. కొంత కాలమునకు తన కుమారుడగు పురూరవుని రాజుగా చేసి తానరణ్యమునకు వెళ్ళెను. రమణీయమైన యావనమందు రాజు నారదుని వలన దేవీమంత్రము నుపదేశము పొంది భక్తిశ్రద్ధలతో నిరంతరము జపించుచుండెను. అంతట దేవి ప్రసన్నయై ఆతనికి సాక్షాత్కరించెను. ఆ రూపము చూచి రాజానంద భరితుడై యిట్లు స్తుతించెను.

శ్లో॥ దివ్యంచతే భగవతి ప్రథితం స్వరూపం
దృష్టంమయా సకలలోకహితానురూపమ్ ॥
వందేత్వ దంఘ్రికమలం సురసంఘసేవ్యం
కామప్రదం జనని చాపి విముక్తి దంచ॥
కోనేత్తి తేంబభువిమర్త్య తనుర్నికామం
ముహ్యం తియత్రమున యశ్చసురాశ్చసర్వే
ఐశ్వర్యమేత దఖిలంకృపణేదయాంచ
దృష్ట్వైవ దేవి సకలంకిలవిస్మయోమే॥
శంభుర్హరిఃకమలజోమఘవారవిశ్చ విత్తేశవహ్నివరుణాః
పవనశ్చసోమః జానంతినైవవసవోపితవ
ప్రభావంబుధ్యేత్కంథతవగుణానగుణోమనుష్యః॥
జానాతివిష్ణురమితద్యుతి రంబసాక్షాత్
త్వాంసాత్వికీ ముదది జాంసకలార్థదాంచ
కోరాజసీంహర ఉమాంకిలతామ సీంత్వాం
వేదాంబకేనతు పునఃఖలు నిర్గుణాంత్వామ్॥

క్వాహంసుమందమతిరప్రతిప్రభావః
క్వాయంతవాతిని పుణోమయి సుప్రసాదః॥
జానేభవాని! చరితం కరుణాసమేతం
యత్సేవకాంశ్చదయ సేత్వయిభావయుక్తాన్ ॥
వృతస్త్వయాహరి రసావనజేశయాపినైవా చరత్యపిముదంమధుసూదనశ్చ॥
ఫాధేతవాది పురుషః కిలపావకేనకృత్వాకరేణచకరోతి శుభే పవిత్రే॥
వాంఛత్యహెలా హరిరశోక ఇవాతి కామం
పాదాహతిం ప్రముదితః పురుషఃపురాణః॥
త్వంతంకరోషిరుషితా ప్రణతంచ పాదేదృష్ట్వాపతిం సకలదేవనుతం స్మరార్తమ్॥
వక్షస్థలేవససిదేవి సదైవతస్య పర్యంకవత్సుచరితే విపులేతి శాంతే॥
సౌదామనీవసుఘనే సువిభూషితేచకింతే వాహనమసౌ జగదీశ్వర్యోపి॥
త్వంచేజ్జహాసి మధుసూదన మంబ!
కోపాన్నైవార్చితోపిసభవేత్కిలశక్తిహీనః॥
ప్రత్యక్షమేవ పురుషం స్వజనాస్త్యజంతి
శాంతం శ్రియోజితమతీవగుణైర్వియుక్తం
బ్రహ్మాదయస్సురగణాః సతుకింయువత్యో
యేత్వత్పదాంబుజ మహర్నిశమాశ్రయంతే
మన్యేత్వయైన విహతాఃఖలు తేపు మాంసః
కింవర్ణయామితవశక్తి మనంతవీర్యే॥
త్వం నాపుమాన్నచపుమాన్ ఇతిమే
వికల్పోయాకాసిదేవిసగుణావను నిర్గుణావా॥
తాంత్వాం నమామి సతతంకిలభావయుక్తో
వాంఛామిభక్తి మచలాంత్వయి మాతరంతే॥
ఇతి స్తుత్వామహీపాలోజగామ శరణంతదా
పరితుష్టాదదౌ దేవీతత్రసాయుజ్యమాత్మని॥
సుద్యుమ్నస్తుతతః ప్రాప్తఃపదం పరమకంస్థిరం
తస్యాదేవ్యా ప్రసాదేన మునీనామపి దుర్లభం॥

**స్తోత్ర భావము** :- సమస్తలోకములకు మేలు కలిగించు నీ రూపదర్శనభాగ్యము నాకు నేటికి ప్రాప్తించినది. నీ పాదములే నాకు రక్షకములు. అవి కోరికలనిచ్చునవి. ముక్తి నిచ్చునవియును నీ దివ్యరూపము సురలను, మునులను సమోహింప

జేయును. సామాన్యమానవుడెట్లెరుగ గలడు. నీ మహిమ తెలియరానిది. ఈ దీనునిపై దలచియున్న సంపదల నిచ్చితివి. ఇదంతయు నాకాశ్చర్యము కలిగించు చున్నది. హరి హరబ్రహ్మాదులెవ్వరును నీ ప్రభావమెరుగజాలరు. విష్ణువు కూడ నిన్ను లక్ష్మిగనే తలచును. బ్రహ్మరుద్రుడు కూడ నీ నిర్గుణ స్వరూపము నెరుగ జాలరు. నీ మహోజ్జ్వల చరిత్రను నీ దయామృతసాగరముగా భావింతును. ఓ లక్ష్మీ నీవు హరిని వరించితివి. పురుషోత్తముడు నీచే పాదము లొత్తించు కొనుట తగదని నీపాదముల నొత్తుచుండును. అతడు నీ పాదతాడనమును కోరుకొనును. అతడు నీకు నమస్కరించినను నీవాతని పాదతాడన మొనర్తువు. నీవాతని వక్షస్థలముపై కాంతుల విరజిమ్ముచుందువు. నీవాతని విడిచినచో నాతడు శక్తి హీనుడగును. బ్రహ్మాది దేవతలు నీభవ్యపాద పద్మముల భజింతురు. వారే మణి ద్వీపము చేరి యువతులుగ మారుదురు. నీ దయచే మరల పురుషులగు చుందురు. నీవు స్త్రీ పురుషాది చిహ్నములు కలదానివి కావు. నిన్నే మ్రొక్కెదను. నీయందే నిశ్చల భక్తియున్న చాలును. ఈ ప్రకారము ఆరాజు స్తుతింపగనే శ్రీదేవి ప్రసన్నురాలై అతనికి మోక్షము ప్రసాదించినది. అని సూతుడు ఋషులకు సుద్యుమ్నస్తుతిని వినిపించెను.

## (ఊర్వశి పురూరవుల చరిత్ర)
## పూరురవ ఉపాఖ్యానము

సుద్యుమ్నుడు స్వర్గస్థుడు కాగా పురూరవుడు ప్రతిష్ఠానపురమందు ప్రజారంజ కముగ రాజ్యము చేయుచుండెను. అతడు సర్వధర్మములు తెలిసినవాడు. సర్వ రాజగుణశోభితుడును. ఆతని రూపమును గుణములను విని ఊర్వశి వానిపై మోహము కలదాయెను. ఆమె రెండు గొఱ్ఱెలను పోషించుమని వానికి వప్పచెప్పెను. మఱియు నేయి మాత్రమే నాకాహారమని పలికి యా రాజుతో కలిసియుండెను. సంభోగ సమయమున తప్పనితర సమయమున దిగంబరునిగా నిన్ను చూడను. నా యీ నియమములకు భంగము వాటిల్లిన మరుక్షణమే నిన్ను విడిచి వెళ్ళెదనని చెప్పెను. పురూరవుడా నియమములకు అంగీకరించి యామెతో విహరించుచుం డెను. చాల సంవత్సరములామెతో గడపినను మోహము తగ్గక నిమిషమైన ఆమెను విడువక కాలము గడుపుచుండెను.

ఎంతకాలమైనను ఊర్వశి స్వర్గమునకు రానందున దేవేంద్రుడు రాజునింటగల గొఱ్ఱెల జంటను దొంగిలించి ఊర్వశిని కొనిరండని గంధర్వులను పంపెను.

గంధర్వులు కటికచీకటిలో రాజునింట ప్రవేశించిన గొఱ్ఱెల నపహరించి ఆకాశమున కెగురుచున్నప్పుడు గొఱ్ఱెలు అరచినవి. ఆ యరపులు తన గొఱ్ఱెలవేయని ఊర్వశి నా ప్రతిజ్ఞను భంగము చేసితివి.

కనుక నేను నిన్ను విడిచి వెళ్ళుచున్నానని యామె వెళ్ళుచుండగా పురూరవుడు దిగంబరుడుగా నామెను వెనుదగిలెను. ఊర్వశి దిగంబరుడగు రాజును చూచెను. గంధర్వులు గొఱ్ఱెలను విడిచి వెళ్ళిరి. ఊర్వశి తన నియమమును బట్టి రాజును విడిచి వెళ్ళిపోయెను. పురూరవుడు ఊర్వశిపై మక్కువతో దుఃఖించుచు దేశదేశములు తిరుగుచుండెను. కురుక్షేత్రమున మరల ఊర్వశి కనిపించెను. అప్పుడు రాజు కామార్తుడై దిక్కులేని వానివలె బోరున దుఃఖించెను. అంతట ఊర్వశి రాజా! నీవు మూఢుడవైతివి. నీ జ్ఞానమంతయునే మయ్యెను? స్త్రీలతో స్నేహముతోడేళ్ళ తో స్నేహమునకు తీసిపోదు. రాజు దొంగలను కాని, స్త్రీలనుగాని నమ్మియుండ రాదు. కావున నీవికనింటికి వెళ్ళి దిగులు మాని సుఖముగా నుండు మని యెంత చెప్పినను దేవవేశ్యపై వలపుచే శోకార్తుడాయెను. ఇది పురూరవుని సంక్షిప్త చరిత్రము అని సూతుడు మునులకు- మునులకు వివరించెను.

# శుక్ర మహర్షి జన్మవృత్తాంతము

వ్యాసమహర్షి యిట్లు ఆలోచించుచుండగా ఘృతాచి తనను వ్యాసుడు శపించునేమో యని చిలుకరూపము దాల్చి అటనుండి వెడలిపోయెను. వ్యాసుడామె యందులగ్నమైన మనస్సుతో అరణిని మథించుచుండగా దానినుండి యుజ్జ్వల తేజస్సుగల కుమారుడు జన్మించెను. వ్యాసుడు పరమేశ్వరుని యనుగ్రహముగా నా బాలుని భావించి యత్యంతప్రేమతో గంగలో స్నానము చేయించగా దేవతలు పుష్పవర్షము కురిపించిరి. అంతరిక్షము నుండి శ్రీశుకుని కొరకు దివ్యకృష్ణాజినము దండకమండులువులు నేలపై పడినవి. వ్యాసుడతనికి ఉపనయన సంస్కార మొనర్చెను. శుకుడు బృహస్పతిని గురువుగా భావించి బ్రహ్మచర్యమును యథా విధిగ పాటించెను. వేదరహస్యముల నెల్ల గ్రహించి తండ్రి వద్దకు వచ్చెను. శుకుని చూచి వ్యాసుడు పరమానందభరితుడాయెను.

వ్యాసుడు కుమారునకు వివాహము చేయదలచి చక్కని మునికన్యను వధువుగా నిశ్చయించి శుకునితో ఓ మహామతీ! నీ విద్యాభ్యాసము పూర్తియైనది. ఇక చక్కగా గృహస్థుడవగుము దేవపితృయాగము లొనర్చుము నీవు గృహస్థుడవైనా కోర్కె తీర్చుము. నా తపస్సుకు ఫలముగా నీవు నాకయోనిజుడవై పుట్టితివి. నీకొఱకు నేను ఘోరతపస్సు చేసితిని. నీవు తండ్రినగు నా మాట పాలించుము.

అని పలుకగా విరక్తుడైన శుకుడు మహారక్తుడైన తండ్రితో ధర్మజ్ఞుడనైన మహామతీ! నేను శిష్యుడను నీవాజ్ఞాపించిన పని చేయుదునని బదులు పలికెను. అప్పుడు వ్యాసుడిట్లనెను. కుమారా! నీకై నేను నూరు సంవత్సరములు తపస్సు చేసితిని. రాజును ధనమడిగి తెచ్చి నీకిచ్చెదను. నీవు యౌవన సుఖముల ననుభవింపుము అని పలికెను.

# శుకుని వైరాగ్యము - వ్యాసుడు శుకునకు శ్రీదేవీ భాగవతముపదేశించుట

ఈ మాట విని శుకుడు వివాహము చేసికొని స్త్రీకి వశుడై పుత్రదారాదులచే సంసారమున బంధింపడి యెన్నటికిని ముక్తి పొందని స్థితినాకేల? అయోనిజుడనైన నేను పునర్జన్మను కోరుటలేదు. నాకు గురువైన బృహస్పతి సంసారబద్ధుడై యుండుటచే ఆతని విడిచి నీవద్దకు వచ్చితిని. దుర్లభమైన మానవజన్మమెత్తి వేదశాస్త్రములు చదివి సంసారబద్ధుడైనచో ముక్తి నెవడు పొందును? నేను సంసారమునకు భయపడుచున్నాను. నాకు బ్రహ్మతత్త్వమును యోగశాస్త్రమును బోధింపుము. స్త్రీలు భోగములతో ధనవీర్యముల నపహరింతురు కుటిలవచనములచే మనస్సును హరింతురు. అట్టి స్త్రీ నెవడు కోరుకొనును. మూర్ఖుడే భార్యను కోరును అని పలికెను. వ్యాసుడు వాని మాటలకు చింతాగ్రస్తుడై దుఃఖించెను. శుకుడు విద్వాంసుడైన వ్యాసునకు కూడ మోహము కలిగించు నీమాయ యెంతగొప్పది? యని యాశ్చర్యపోయెను. హరిహరబ్రహ్మలను సైతము మోహపెట్టునట్టి మహాద్భుత మాయాశక్తిని శరణు వేడుచున్నాను. అని దేవిని ధ్యానించి తండ్రితో ఓ మహామనిషీ! ఎల్లరకు తెలియజెప్పు నీవే సామాన్యునివలె దుఃఖపడుట సమంజసము కాదు అని పలుకగా వ్యాసుడు మహాభాగా! నీవు నేవ్రాసిన శ్రీ మహాభాగతము చదువుము అది బ్రహ్మ సమ్మితము. ఆ పురాణము నా మనస్సున కెంతో ఇష్టమైనది. ఆ భాగవతము వినినచో సదసద్వికము కలుగును. నీవు దానిని శ్రద్ధగా చదువుము అని శుకునకు చెప్పెను.

# శ్రీ శుకుడు మిథిలకు వెళ్ళుట

జీవన్ముక్తుడుయై రాజ్యపాలనమొనర్చుట విచిత్రమైన విషయము కనుక అట్టి జనకమహారాజును చూడు వేడుక కలుగుచున్నది. నా సందేహములు పోగొట్టుకొనుటకు మిథిలానగరమునకు వెళ్ళెదనని శుకుడు పలికి చేతులు జోడించి తండ్రి పాదములకు నమస్కరించి నాకు ఆజనకుని చూడననుజ్ఞ నిమ్మని పలుకగా

వ్యాసుడు కుమారునికాగిట చేర్చుకొని నీకు కళ్యాణమగుగాక చిరంజీవిని కమ్ము తిరిగివత్తునని మాట యిచ్చి క్షేమముగ వెళ్ళిరమ్ము. నీవచటి నుండి యెక్కడకును వెళ్ళవద్దు. నీ ముఖమును చూడనిచో నాకు శాంతియుండదు. నాకు నీవు ప్రాణము లోని ప్రాణము. జనకుని చూచివచ్చి యిచటనే వేదాధ్యయనము చేయుచు సుఖముగా నుండుము అని పంపెను. శుకుడు తండ్రికి ప్రదక్షిణ నమస్కారము లొనర్చి త్వరగా బయలుదేరి మార్గమధ్యమున తాపసులను యోగులను వానప్రస్థు లను శైవవైష్ణవ సౌరశాక్తమతస్థులను దర్శించుచు మూడేండ్లు ప్రయాణించి మిధిలా నగరమును చేరి సదాచార సంపన్నులను కళాసమృద్ధిని దర్శించెను. రాజద్వారము వద్ద కాపలాకాయు ద్వారపాలకుడు- నీవెవడవు? ఎక్కడ నుండి వచ్చితివి? ఏ కులమువాడవు నీకిచట పనియేమి? యని ప్రశ్నింపగా శుకుడు సమాధానము చెప్పక ఒక ప్రక్క నిలబడి యుండెను.

ద్వారపాలకుడు శుకుని జ్ఞానిగా బ్రాహ్మణ శ్రేష్ఠునిగా గుర్తించి బ్రాహ్మణోత్తమా! నీకు పనియున్నచోటకు స్వేచ్ఛగా వెళ్ళవచ్చు నిన్నడ్డగించిననా యపరాధమును క్షమింపుమని పలికెను. శుకుడు నీవు నీ ధర్మమును నిర్వహించితివి. దీనిలో అప రాధమేమియు లేదు అని పలుకగా ద్వారపాలకుడు శుకుని అడిగి తన సందేహ ములు తీర్చుకొనెను. ద్వారపాలకుడు శుకుని మాటలు విని అతని మహాజ్ఞానిగా గ్రహించి చక్కని రాజమార్గమున లోపలకు ప్రవేశపెట్టెను. శుకుడు నగరములో రాగ ద్వేషకామలోభ మోహాములతో దెబ్బలాడు మనుష్యులను చూచుచు ముందు నకు సాగి రాజమందిరములో ప్రవేశించెను. అచట కూడ ద్వారపాలకుడు అడ్డ గింపగా వెనుకటి వలె నిలిచియుండెను. క్రమముగా సమాధిలో నిమగ్నుడయ్యెను. కొలది నిముసములలో జనకుని మంత్రి వచ్చి చేతులు జోడించి రాజభవనములోని రెండవ ద్వారమున శుకుని ప్రవేశింపజేసి అతిథిమర్యాదలు నెరపెను. మరియు వారస్త్రీలను వాని సేవకు నియమించి బయటకు వచ్చెను. అచటి స్త్రీలాతనిపై మోహము కలవారై వెంటనే జితేంద్రియునిగా తెలిపి పూజించిరి. ఆ కాంతలాతనికి మధుర పదార్థములను సమీపమందుంచిరి. అలంకరించిన పాన్పునమర్చిరి. శుకుడు సాయం సంధ్య నుపాసించి సమాధిలో మునిగెను.

అట్లొజాము ధ్యానించి రెండు జాములు నిద్రించి మేల్కొనెను. ప్రాతఃకాల క్రియలు నిర్వర్తించి బ్రహ్మ తేజముతో వెలుగొందుచుండెను. జనక మహారాజు గురుపుత్రుడగు-శ్రీశుకుని రాక విని మంత్ర పురోహితులతో అతని వద్దకు వెళ్ళి ఆసనముపై కూర్చుండబెట్టి ఆవునొసగి క్షేమ సమాచారమడిగెను. శుకుడు కూడ రాజును క్షేమ సమాచారమడిగెను. పిమ్మట సుఖముగా కూర్చొని యున్న శుకుని

చూచి రాజు ఏ కోరికయు లేని నీవు మా యింటికేమి కోరి వచ్చితివని ప్రశ్నించెను. శ్రీశుకుడిట్లనెను.

"రాజా! మా తండ్రి గృహస్థాశ్రమము స్వీకరింపుమనుచున్నాడు. ఇది బంధము కాదని ఆతడెంతయో చెప్పినాడు. కాని ఆతడే సంసారబద్ధుడగుట వలన ఆతని మాట పెడచెవిని పెట్టితిని. ఈ విషయమున నామనస్సు సందిగ్ధముగా నున్నది. మా తండ్రి నిన్ను దర్శించినచో నా సందేహము తొలగునని చెప్పెను. నీ మాటలు విని మరల తన వద్దకు రమ్మని మా తండ్రి చెప్పినాడు. నా తండ్రి యాజ్ఞచే నీ పట్టణమునకు వచ్చితిని. నేను మోక్షార్థిని. నాకు కర్తవ్యముపదేశింపుము. ముక్తికి కారణము తపమా? వ్రతమా? యాగమా? స్వాధ్యాయమా? తీర్థసేవనమా? యిందేది తగినదో తెలియజేయుము అని ప్రశ్నించెను.

## జనకుడు శుకునకు కర్మమార్గము పదేశించుట

జనకుడు శుకునకిట్లు చెప్పెను. "బ్రాహ్మణశ్రేష్ఠుడా! మోక్షము కోరువాడు మొదట ఉపనీతుడై గురుకులమందు వేదము నభ్యసింపవలయును. సాంగవేద వేదాన్తములు చదివి గురుదక్షిణ నొసంగి సమావర్తన సంస్కారము నొంది వివాహితుడై సంతానమును కనవలయును. అగ్నిహోత్రాదుల నొనర్చుచు మితహితసత్య భాషణము కలవాడు కావలయును. ఆశలేనివాడై శుచియై నిత్యసంతోషిగా నుండ వలయును. ఆరోగ్యవంతులైన పుత్రపౌత్రులతో వర్థిల్లవలెను. పిమ్మట తన సర్వస్వమును భార్యా పుత్రులకర్పించి కామక్రోధాదుల నరికట్టి తపస్సు చేయుటకు వాన ప్రస్థము స్వీకరింపవలెను. అటు పిమ్మట అగ్నుల నాత్మారోపణము చేసికొని పరమ వైరాగ్యముతో శాంతుడై నాల్గవ సన్యాసాశ్రమము స్వీకరింపవలెను. వైరాగ్యము కలవానికే సన్యాసాశ్రమము స్వీకరింపనర్హత కలదు. ఇది తిరుగులేని పద్ధతి వేదసమ్మతము కూడ. క్రమముగా నొకయాశ్రమము నుండి వేరొక యాశ్రమము నవలంబించుట, శిష్టులిష్ట పడిన మార్గము" అని వివరించెను.

శుకుడామాటలు విని జ్ఞానకారణమైన నిర్మల వైరాగ్యము కలవాడు కూడ ఆశ్రమక్రమము ననుసరింపవలెనా? వనమందుండ వచ్చునా యని ప్రశ్నింపగా జనకుడిట్లనెను. "ఇంద్రియ వాసనలు మిక్కిలి బలవత్తరములైనవి. పక్వము కాని హృదయమున వికారములు రేకెత్తించుచుండును. సన్యాసియై పతితుడైన వానికి సద్గతులుండవు. మనస్సు బలవత్తరమైనది. విషయలంపటుల కదివశము కాదు. కనుక ఆశ్రమముల క్రమముననే సంసారమును గెలువవలెను. గృహస్థుడు కూడ కలిగిన వానికి సంతసించుచు నిత్యతృప్తుడై హర్ష శోకములు లేక సర్వసముడై

యుండవచ్చును. అట్లున్నవాడు నిశ్చయముగ ముక్తుడగును. నేను రాజ్యమేలు చున్నను జీవన్ముక్తుడనై యుంటినిగదా!" అని పలికెను.

అంతట శుకుడు మహారాజా! మీ బోధను విన్నప్పటికిని నా సందేహము తొలగుటలేదు. భూపాలా! నేను గుణముల కందనివాడను. నా హృదయము వైరాగ్యముతో నిండి యున్నది. నాకు ప్రాపంచిక విషయములతో పనియేమి? నీవు ముక్తుడనైతినని తలచుచున్నావు. అది వట్టిడం బాచారమేయని నాకు తోచుచున్నది. నీకొకప్పుడు ధనచింత మరొకప్పుడు శత్రుచింత కలుగుచుండును గదా! నీవు నిశ్చింతుడ నెట్లగుదువు. పూర్వము "నిమి"యను మీ వంశమందలి రాజు వసిష్ఠుడును పరస్పరము శపించుకొనిరని వింటిని. ఆరాజు విదేహుడైతే గురువేల శపించును? ఇదియంతయు వింతగా నాకు తోచుచున్నదని పలికెను. అప్పుడు జనకుడిట్లనెను.

నీవు కారడవికి పోవదలచుచున్నావు గదా! నీకచట ఆహారచింత తప్పునా? దండ అజనముల చింతయుండదా? అట్లే నాకిచట రాజ్యచింతయు నుండును. నాకు యేవి కల్పములు సంశయములును లేవు. సుఖముగా భుజింతును హాయిగా నిద్రింతును బద్ధుడను కాను. స్వతంత్రుడనను జ్ఞానముచే సుఖముగా నుందును. నీవు నిన్ను బద్ధునిగా భావించి దుఃఖించుచు న్నావు. నీవిక యిట్టి యనుమానము మాని స్థిర బుద్ధివై సుఖముగా నుండుము. నేను బద్ధుడనను కొన్నంతకాలము నీకు ముక్తి హుళక్కి నేనీ ధనరాసులను, భవనాలను, రాజ్యమును నావికావనితలచి సుఖముగా నుందును" అని శుకుడు జనక మహారాజు హితవచనములనువిని యాతని అనుమతితో తండ్రి యాశ్రమమునకు తిరిగి వచ్చెను. వ్యాసుడు కుమారుని అమితానందముతో కౌగిలించుకొని క్షేమమడిగెను. ఆపవిత్రాశ్రమమున శుకుడు వేదాధ్యయనము చేసి సర్వశాస్త్ర పారంగతుడాయెను.

## శ్రీశుకుని గార్హస్థ్యము

పిమ్మటనతడు వరియను కన్యను వివాహమాడి యామెయందు నలుగురు పుత్రులపొందెను. వారు వరుసగ కృష్ణుడు గౌరప్రభుడు భూరిదేవశ్రుతుడను వారలు. పిమ్మట "కీర్తి" యనుకుమార్తెను కని యామెను విభ్రాజ పుత్రుడగు అణుహునకిచ్చి పెండ్లి చేసెను. అణుహుని కుమారుడు బ్రహ్మదత్తుడు. అతడు బ్రహ్మజ్ఞానము గల రాజయ్యెను. అతడు కొన్నాళ్ళకు రాజ్యము కుమారునకిచ్చి బదరికాశ్రమము చేరి పరిపూర్ణ బ్రహ్మజ్ఞాని యయ్యెను. శుకుడు నారదుని యనుగ్రహముచే కైలాసమునకు వెళ్ళి యచట నిర్వికల్ప సమాధిలో నిమగ్న

డయ్యెను. తరువాత నాతడు కొండశిఖరము నుండి పైకెగిరెను. ఆకాశవీధిలో రెండవ సూర్యునివలె ప్రకాశించెను. వ్యాసుడు పుత్రవియోగముచే మహాదుఃఖము ననుభవింపగా శివుడు వాని నోదార్చి యంతర్ధానమయ్యెను. వ్యాసుడు తన యాశ్రమమున కేగెను. పిమ్మట సరస్వతీ నదీతీరమున ఆశ్రమము నిర్మించుకొని తనకు సోదరులిరువురు కలిగి రని తెలిసి సుఖముగా నుండెను.

# వ్యాసుని కార్యాచరణము

అసితుడు దేవలుడు వైశంపాయనుడు జైమిని సుమంతుడు మొదలగువారు వ్యాసునివలన విజ్ఞానము నార్జించి యాతని యనుమతితో వెడలిపోయిరి. వ్యాసుడు తన యాశ్రమమున తపమొనర్చుచుండెను. వ్యాసుని సోదరులలో పెద్దవాడు చిత్రాంగదుడు రెండవవాడు విచిత్రవీర్యుడు. వీరిరువురి కంటె పూర్వము జన్మించినవాడు భీష్ముడు. చిత్రాంగదుడు యుద్ధములో గంధర్వునిచే చంపబడెను. పిమ్మట విచిత్రవీర్యుడు రాజయ్యెను. వివాహమును రాజ్యమును త్యాగము చేసిన భీష్ముడు తన సోదరుడగు విచిత్రవీర్యునకు వివాహము చేయ సంకల్పించెను. కాశీరాజు పుత్రికలకు ముప్పురకు స్వయంవరము జరుగుచుండ నచటి రాజుల జయించి యా ముప్పురను తన రథముపై తీసికొని వచ్చెను. ఆ కన్యలను తల్లి యగు సత్యవతికి అప్పగించెను. ఆ కన్యలలో పెద్దది నేను పూర్వమే సాల్వరాజును వరించి యున్నానని చెప్పగా భీష్ముడు తల్లితో, మంత్రులతో నాలోచించి యామెను ఇష్టమైనచోటికి వెళ్ళుమని విడిచిపెట్టెను. ఆ కన్య సాల్వుని వద్దకు వెళ్ళగా నాతడు తిరస్కరించెను.

పిమ్మట భీష్ముని వద్దకు ంగా నామె తల్లిదండ్రుల వద్దకు పొమ్మ నెను. తక్కిన యిద్దరును విచిత్రవీర్యుని భార్యలైరి. విచిత్రవీర్యుడు తొమ్మిదేండ్లు విలాసముగా గడపి క్షయరోగముతో మరణించెను. తరువాత సత్యవతిభీష్ముని సూచన పై వ్యాసుని రావించి పెద్దకోడలిని వాని వద్దకు సంతతికై పంపెను. ఆమె కన్నులు మూసికొని నందున గ్రుడ్డివాడు జన్మించెను. సత్యవతి దుఃఖించి రెండవ కోడలిని వ్యాసుని వద్దకు పంపగా పాండువర్ణమువాడు పుట్టెను. అతడు రాజుగా నుండత గడని మరియొక మారు కోడలిని ప్రోత్సహింపగా నామె వ్యాసుని తేజస్సు ముందు నిలువలేక దాసిని వ్యాసుని వద్దకు పంపగా నామె చక్కని కుమారుని కనెను. ఆ ముగ్గురిలో మొదటివాడు ధృతరాష్ట్రుడు, రెండవవాడు పాండురాజు, మూడవవాడు విదురుడు. ఇట్లు సూతుడు మునులకు వ్యాస వంశోత్పత్తిని వివరించెను.

# ద్వితీయ స్కంధము

## మత్స్యగంధి జన్మ వృత్తాంతము

ఋషులు సత్యవతీ వ్యాసుల జన్మవృత్తాంతమును వినగోరుచున్నామనగా సూతుడు పరమ సత్యజ్యోతియైన పరదేవతకు ననుసరించి యిట్లు చెప్పెను. పూర్వము ఉపరిచరడును రాజు తపస్సు చేయగా ఇంద్రుడు సంతసించి యాతనికి స్ఫటిక విమానము నిచ్చెను. ఆతడు ధర్మనిత్యుడని లోకప్రసిద్ధినొందెను. అతని భార్య గిరిక. ఆమెకైదుగురు కుమారులు.

ఒకనాడు తండ్రి చెప్పగా వేటకు వెళ్ళిన సందర్భమున ఋతుమతి యగు భార్యను స్మరించుటచే స్ఖలితమగు వీర్యమును మఱ్ఱియాకులో భద్రపరచి డేగద్వారా తన భార్యకు పంపెను. మఱ్ఱియాకులోనిది మాంసము కావచ్చునని వేరొక డేగ డీకొనెను. ఆ పోరాటములో మఱ్ఱియాకు యమునానదిలో పడెను. ఆ సమయమున బ్రాహ్మణశాపముచే చేపయైన అద్రిక యను దేవకాంత ఆవీర్య మును గ్రహించి గర్భవతియై జాలరివారికి దొరకినది. దానిని కోయగా ఒక బాలుడు, ఒక బాలిక వెలువడిరి. జాలరివాడు బాలబాలికల నిరువురిని రాజునకు చూపగా రాజు బాలకుని తీసికొని బాలికను జాలరికిచ్చి వైచెను.

ఆ బాలుడు పెద్దవాడై మత్స్యదేశమునకు ప్రభువయ్యెను. బాలిక జాలరి యింట కాళిమత్స్యోదరి యను పేరుతో వన్నెకెక్కినది. ఆమె శరీరము చేపల వాసన కలిగియుండుటచే ఆమెకు మత్స్యగంధయను పేరు వచ్చెను. ఇద్దరు పిల్లలను కనుటవరకే చేప రూపము కనుక అద్రిక మరల దేవకాంతయై వెడలి పోయెను. మత్స్యగంధ యను కన్య దాశరాజు నింటనే పెరిగి పెద్దదాయెను. తండ్రి యింటనే యుండి పనులెల్ల చక్కపెట్టుచుండెను.

## వ్యాస మహర్షి జన్మ వృత్తాంతము

పూర్వమొకప్పుడు మహా తేజస్వియగు పరాశర మహర్షి తీర్థయాత్రలు సేవించు చు యమునా తీరమునకు వచ్చెను. అచట నొక కిరాతుడు భోజనము చేయు చుండెను. ముని వానితో నన్నీ పడవలో నది యావలిగట్టునకు చేర్చుమనెను. అతడు తన కూతురగు మత్స్యగంధను తెప్పపైన మునిని ఒడ్డునకు చేర్చుమనెను. ఆమె నతనిని తన పడవలో నెక్కించుకొని అవలివడ్డునకు వెళ్ళసాగెను. దైవ

యోగమున పరాశరుడా యువతిని చూచి కామాతురుడై చేతితో నామె చేయిపట్టు కొనెను. అప్పుడు సిగ్గుతో ఆ యువతి నీ తపస్సునకు పవిత్రతతకు కులశీలము లకును చేపలకంపుగల నేను తగను. నాపై నీకిట్టి కామమేల కలిగినని ప్రశ్నించెను. మరియు నతని కామాతురతను చూచి నన్నా ఒడ్డునకు చేర్చువరకు నిగ్రహముతో నుండు మని మునితోననెను. ఆమె వణకుచు నా శరీర దుర్గంధము వెట్లు సహించెదవు అని పలుకిన వెంటనే ముని యనుగ్రహమున యోజనగంధ సుందరి యు నయ్యెను. మునియామె చేతిని పట్టుకొనగా మునివల్లభా! లోకమంతయు చూచున్నది నా తండ్రియు చూడగలడు. కనుక చీకటి పడునంతవరకాగుమని పలుకగా ముని వెంటనే యాప్రదేశమంతయు మంచుతో నిండిన దానిగా నొనర్చెను. అప్పుడామె నేను కన్యను గర్భవతినైనచో తండ్రికేమని చెప్పుదును? నాగతి యేమి కావలెను? అని ప్రశ్నింపగా మునివర్యుడు నీకన్యాత్వమునకు భంగముండదనియు లోకముగాని తల్లితండ్రులుగాని యీ విషయము నెరుగ కుందురనియు పలికెను.

ఆ పిమ్మట నా యువతి నీవంటి పుత్రుడు నాకు కలుగునట్లు వరమిమ్మనగా అట్లే వరమిచ్చెను. మహర్షి యంతటనామె ననుభవించి అతిశీఘ్రముగ వెడలి పోయెను. సత్యవతి సద్యోగర్భమున నచటనే పుత్రుని కనెను. ఆ పుట్టిన కుమారుడు వెంటనే పెద్దవాడై నేను తపస్సు చేయుటకు వెళ్ళెదను నీవు కోరినప్పుడు వచ్చి కనిపించెదనని పలికి వెడలిపోయెను. అతడే వ్యాసుడు. దీవిపైపుట్టినందున ద్వైపాయనుడను పేరు వచ్చినది. సత్యవతియు తండ్రి వద్దకు వెళ్ళెను. విష్ణ్వంశ వలన పుట్టినవ్యాసుడు మహర్షియై వేదముల విభజించి మహాభారతమును పురాణ సంహితలను విస్తరించెను. తన ముఖ్యశిష్యులైన సుమంతుడు, పైలుడు, వైశం పాయనుడు, అసితుడు, దేవలుడు మొదలగువారిచే తన గ్రంథములను చదివించెను. సూతుడిట్లు మీకన్నియు చెప్పితినని ఋషులతో పలికెను.ఋషులు సంతసించిరి.

అంతట ఋషులు సత్యవతి శంతనున కెట్లు భార్యయయ్యెను? శంతనుని మొదటి భార్యఎవరు? వసువు భీష్ముడుగా శంతను పుత్రుడయ్యెను? భీష్ముడు పెద్దవాడుండగా విచిత్ర వీర్యుడు రాజెట్లయ్యెను? విచిత్రవీర్యుని మరణానంతరము సత్యవతి కోడళ్ళకు పుత్రులనెట్లు కలుగజేసెను? భీష్ముడేల పెండ్లి చేసికొనలేదు? ఈ విషయములన్నియు వ్యాసశిష్యుడవైన నీవు వివరించి మా సందేహముల నివారింపవలసినదిగా కోరుచున్నా మనగా సూతుడిట్లు మునుల ప్రశ్నలకు సమా

ధానములిచ్చెను. పూర్వమిక్ష్వాకు వంశమున మహాభిషుడను చక్రవర్తి యుండెను. అతడు సత్యవంతుడు ధర్మశీలి. అతడు వేయి అశ్వమేధయాగములు చేసి స్వర్గమలంకరించెను.

ఒకనాడాతడు బ్రహ్మసభకు వెళ్ళెను. దేవత లెల్లరువచ్చిరి. గంగాదేవి కూడ బ్రహ్మ కొలువునకు వచ్చెను. అప్పుడు పెనుగాలి వీచగా ఆమె ఉత్తరీయముపైకి లేచెను. దేవతలెల్లరు తలలు వంచుకొనిరి. మహాభిషుడు మాత్రము ఆమెను తేరిపార చూచెను. గంగ తనయందు ప్రేమ గలవాడాతడని గ్రహించెను. బ్రహ్మయిది చూచి నీవు మనుష్యలోకమున రాజుగా పుట్టుమని మహాభిషుని శపించెను. గంగను కూడ భూమిపై పుట్టుమని శపించెను. వారిరువురును బ్రహ్మను వదలి బయలుదేరిరి. పురువంశరాజగు ప్రతీపునకు మహాభిషుడు పుత్రుడు కాదలచెను. అదే సమయమున అష్టవసువులు తమ భార్యలతో వసిష్ఠుని ఆశ్రమములో విహారని నోదములలో ఓలలాడుచుండిరి. ఆ వసువులలో "ద్యో" అనువాని భార్య వశిష్ఠుని ఆశ్రమమందలి ఆవును తన చెలికత్తె కొరకు తెమ్మని భర్త నడిగెను.

అంతట "ద్యో"మరికొందరు వసువులను వెంటబెట్టుకొని మునియైన వసిష్ఠుని లెక్కచేయక అతని నందినీ ధేనువును అపహరించెను. ఫలములు మొదలగువాని కొరకు మరియొక చోటకు వెళ్ళిన వసిష్ఠమహర్షి తన యాశ్రమమునకు వచ్చి ఆవు కనబడక అంతటను వెదకెను. ఆవెక్కడను కనబడలేదు. ధ్యానములో వసువులు గోవు నపహరించిరని తెలిసికొని వారిని మానవులుగా పుట్టుడని శపించెను. వారు వేడు కొనగా వసిష్ఠుడు ఒక్కొక్క సంవత్సరము వ్యవధానముతో ఒకరి తరువాత నొకరుగ జన్మించి వెంటనే మరణింతురు. నాయావు నపహరించిన వాడు మాత్రము చాల కాలము భూలోకములో చాలకాలము నివసించునని శాపవిమోచనము చెప్పెను.

వసువులిట్లు శపింపబడి వెళ్ళుచుండగా దారిలో గంగాదేవి వారికి కనిపించెను. గంగ కూడ శాపమునకు గురియై దుఃఖించుచుండెను. వసువులామెకు నమస్కరించి నీవు స్త్రీరూపము ధరించి మాకు తల్లివి కమ్మని పలికి నీవు శంతను మహారాజునకు భార్యవగుము. పుట్టగానే మమ్ము గంగలో పడవేయుము అట్లు చేసిన మాకు శాపవిముక్తి యగునని చెప్పగా ఆమె అంగీకరించెను. వసువులు స్వస్థాన ములకు వెడలిపోయిరి. మహాభిషుడు ప్రతీపునకు కుమారునిగ జన్మించెను. అతడే శంతనుడు. అతడు ధర్మాత్ముడు, సత్యసంధుడు. ఆరాజు ప్రతీపుడు

సూర్యుని స్తుతించుచుండగా గంగాజలము నుండి అందగత్తె యగు యువతి బయటకు వచ్చెను. మరియు రాజుకుడితొడ పై కూర్చుండెను. రాజు నాయను మతి లేకయే నీవు తొడపై కూర్చొంటి వేలయని యడుగగా నిన్ను నేను ప్రేమించి వచ్చితిననగా కూడి తొడపై కొడుకులు, కోడండ్రు కూర్చొనవలెను. కనుక నాకు కుమారుడు జన్మించిన పిదప నాతని వరింపుమని చెప్పగా నామె వెడలిపోయెను. రాజు ఆమెనే తలచుచు తన భవనమునకు వెళ్ళెను. కొంతకాలమునకు ప్రతీప మహారాజు పుత్ర సంతానము కలవాడయ్యెను. అతడు పెద్దవాడై వేటకు వెళ్ళగోరు చుండగా వెనుకటి గంగా వృత్తాంతమును చెప్పి నీకామె కనబడినచో నేమియు ప్రశ్నింపక ఆమెను ధర్మపత్నిని చేసికొనుము. నీవామెనే ధర్మపత్నిగ స్వీకరించి సుఖముగా నుండుము అని చెప్పెను. పిమ్మట ప్రతీపుడు తపస్సు చేసి స్వర్గస్థుడు కాగా శంతనుమహారాజు ధర్మముతో ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించు చుండెను.

## శంతనుడు గంగను పెండ్లియాడుట

శంతనుడు వేటకు వెళ్ళి అచట రూపయౌవనములతో ప్రకాశించు నొకజవ రాలిని చూచి తండ్రి చెప్పిన యువతి ఈమెయే కావచ్చునని తలచెను. శంతనుడు ఆమెపై అనురాగము కలవాడాయెను. గంగానది కూడ మహాభిషుడు చెప్పిన రాజితడే యని తెలిసి చిరునవ్వుతో రాజువద్ద నిలిచెను. శంతనుడు నాకు ధర్మ పత్నివి కమ్మని యామెను కోరెను. అప్పుడు గంగ రాజానీవంటి యుత్తముని యే స్త్రీ కోరదు? కాని నేనే పనిచేసినను నీవు కాదనకూడదు. నీవీ ప్రతిజ్ఞ నెరవేర్చినచో నీకు భార్య కాగలనని చెప్పగా నాతడంగీకరించెను. అంతట నామె రాజువెంట అతని ప్రాసాదమునకు వెళ్ళెను. అప్పటినుండి వారిరువురుననేక భోగముల ననుభవించుచు పరస్పర ప్రేమాతిశయముతో నానందించుచుండిరి. ఇట్లు గంగా దేవి మానవ యువతిరూపమున శంతనునకు పత్నియయ్యెను.

## గాంగేయుని జన్మ వృత్తాంతము

కొంతకాలము గడువగా గంగ గర్భవతియయ్యెను. వసువును పుత్రునిగా కనెను. ఆమె కనినవెంటనే ఆ శిశువును గంగలో పడవేసెను. అట్లే రెండవ కుమా రుని చేసెను. ఇట్లు మొత్తమేడుగురు కుమారులను గంగపాలు చేసెను. శంతను మహారాజు బోరున దుఃఖించి యిట్లయిన నావంశము స్థిరపడుటెట్లు? ఈ

పాపాత్మురాలు ఏడుగురు కొడుకులను నీటిలో కలిపినది. ఒకవేళ నన్నీమె వదలి వెళ్ళిన వెళ్ళుగాక ఎనిమిదవ పుత్రునైన చావకుండ నివారించెదనని నిశ్చయించుకొనెను. వసిష్ఠమహర్షి యావు నపహరించిన వసువే ఎనిమిదవ పుత్రుడు జన్మింపగా రాజామెపాదములు పట్టుకొని ఈ కొడుకునైన వదలి పెట్టుమని ప్రార్థించెను. గంగ ఎన్ని చెప్పినను వినక శిశువును తీసికొని పోవప్రయత్నించుచుండగా రాజు దుఃఖావేశమును పట్టలేక పాపిష్ఠురాలా! నీవే పాపాత్ముని కడుపున చెడపుట్టితివో గదా! ఇక నీవుండిన నుండుము పోయిన పొమ్ము నా పుత్రుడిక్కడనే యుండగలడు అని పలికెను.

అంతట గంగ నీవు చేసిన శపథము భగ్నమైనది నిన్నిదే వదలి వెళ్ళుచున్నానని వసువుల శాపమును చెప్పి తల్లి పెంపకము శిశువున కత్యావశ్యకముగాన యౌవనము వచ్చువరకు వీనిని పెంచి నీకు అప్పజెప్పగలనని పలికి శిశువును తీసికొని యంతర్ధానమయ్యెను. శంతనుడు దుఃఖార్తుడై తన భవనమున నివసించుచుండెను. శంతనుని ఎనిమిదవ శిశువే గాంగేయుడు భీష్ముడనియు పిలువబడువాడు. శంతను మహారాజు భార్యాపుత్రుల వియోగములచే లోలోనకుములుచు రాజ్యపరిపాలన సాగించుచుండెను. కొంతకాలము గడువగా శంతనుడు వేటకు వెళ్ళి మహిష సూకరాది మృగముల వేటాడుచు - తిరుగుచు గంగాతీరమున నారిసారించి బాణములు విడుచుచున్న సుకుమారుడైన కుమారుని చూచెను. ఆ బాలుని బాణప్రయోగ మందలి హస్తలాఘవము సాటిలేనిది. ఆతని రూపము మన్మథుని సిగ్గుపరచును రాజా బాలుని చూచి ఆశ్చర్యపోయెను. ఆ బాలుని నీవెవరి పుత్రుడవని యడుగగా ఆ బాలుడు వెంటనే అదృశ్యుడయ్యెను. ఈతడు నా పుత్రుడే కావచ్చు ఇపుడేమి చేయుదును? అని చింతాక్రాంతుడై శంతనుడు గంగను స్తుతించెను. ఆమె ప్రసన్నురాలై వెనుకటి రూపముతో దర్శనమిచ్చెను.

అప్పుడు రాజు గంగా! నా బాలుని నాకు వేగమే చూపుమని కోరగా గంగ రాజా! బాలుని చూడుము. ఈతడే నీ పుత్రుడు వీని నింతకాలము పోషించి నీచేతిలో పెట్టుచున్నాను. ఈ గాంగేయుడు మహాతపస్వి నీ కులమునకు వన్నె తెచ్చువాడు. ఇతడు వేదములను ధనుర్వేదమును చక్కగా చదివెను. వసిష్ఠమహర్షి వద్ద సకలవిద్యా బుద్ధులను నేర్చినాడు. అన్నిటియందు నేర్పరి. నీవికనీతని పుత్రునిగా స్వీకరించి సుఖముగా నింటికి వెళ్ళుమని పలికి రాజునకు పుత్రు నర్పించి అంతర్ధానమును చెందెను.

శంతను మహారాజు మితిమీరిన ఆనందముతో కొడుకును కౌగిలించుకొని రథముపై కూర్చొనబెట్టుకొని తన నగరమునకు బయులుదేరెను. రాజు హస్తినాపురములో ఘనముగా పుత్రోత్సవము కానించెను. సకలసద్గుణోపేతుడగు పుత్రుని యువరాజు చేసి శంతనుడు గంగను కూడ మరచి సుఖముగా నుండెను. ఈ యితిహాసమును శ్రద్ధగా వినువారికి పాపములు నశించి శుభములు సుఖములు సమకూరును అని సూతుడు చెప్పెను. ఋషులు సత్యవతి శంతనుని భార్య యెట్లు అయ్యెనో తెలుప గోరుచున్నామని యడుగగా సూతమహాముని ఆ కథనిట్లు చెప్పనారంభించెను

# శంతనుడు సత్యవతిని వరించుట

శంతనుడు గాంగేయునితో సుఖముగా కాలముగ కాలము గడుపుచు నొక నాడు కాళిందీ నదీతీరమందలి వనములందు వేటకు వెళ్ళెను. అతడు దివ్యమైన పరిమళమునా ఘ్రాణించి ఆ సువాసన వచ్చువైపు చూచుచుండెను. ఇది యే పుష్పము యొక్క పరిమళమును గాదు. అద్భుతముగా నాసికను సంతోషపెట్టు చున్నది. అని యావనమంతయు కలయదిరిగెను. అంతలో నొకచోట అందమైన వనితను చూచి యీమె శరీరము నుండియే అపూర్వ పరిమళమునా ఘ్రాణించు చుంటినని నిశ్చయించుకొనెను. ఆమె సౌందర్యమునకు యౌవన సౌగంధ్యముల కాశ్చర్యపడి యామెవద్దకు వెళ్ళి నీ వెవ్వరి కన్యవు? నీవు వివాహితవా? అ వివాహితవా? నిన్ను చూచి నేను కానువశుడనైతిని. అని రాజు పలుకగా నామె చిరునవ్వు నవ్వుచు ఓ రాజా! నేను పల్లెవాని కూతురను. తండ్రి యాజ్ఞ ప్రకారము నడుచు దానను. ధర్మము కొరకు నేను నీటిలో నావ నడుపుచుందును. నా తండ్రి యిప్పుడే యింటికి వెళ్ళినాడు. అని చెప్పగనే కామాతురుడగు రాజు నేను కురువంశ ప్రభువును నన్ను భర్తగా చేసికొనుము. నాకు ప్రస్తుతము భార్యలేదు. నిన్ను చూచినా మనస్సు పరవశించినది అని పలుకగా దాశకన్య నేను స్వతంత్రురాలను కాను. మీరు శీఘ్రమే మాతండ్రి నన్ను మీకు యిచ్చి వివాహము చేయునట్లు ఆయనను అడుగ గోరుచున్నాను. మా తండ్రి నన్ను మీకు దానము చేసినచో వశవర్తిని యగు భార్యనయ్యెదను. నన్ను కూడ మన్మథుడు బాధించుచున్నాడని తన భావమును స్పష్టము చేసినది. కామాయత్తుడగు శంతనుడు దాశరాజునింటికి వెళ్లి ఆ కన్యను తనకిమ్మని కోరెను.

అప్పుడు దాశరాజు నాకన్యను మీరు కోరుట సంతోషకరమే కాని నా కూతురునకు పుట్టుకొడుకే నీ తరువాత రాజు కావలెను. ఇతర కుమారుడు

రాజు కాకూడదు - అని చెప్పగా రాజు చింతాక్రాంతుడయ్యెను. గాంగేయునికి రాజ్య మీయకుండుటెట్లు? అని విచారించును సమాధానమీయలేదు. రాజు కామాతురుడై యింటికి వెళ్ళి స్నానభోజనములను నిద్రను కూడ విడిచి బాధపడు చుండెను. గాంగేయుడాతని దుఃఖమున కారణమడిగెను. తండ్రి చింతను పోగొట్టి ఆతని నుద్ధరింపని కొడుకు పుట్టియేమి ప్రయోజనము? నీ మనస్సులోని విషయము తెలియ జేసినచో దానిని సాధించి మిమ్ము సంతోషపెట్టెదని పలుకగా మహారాజు సిగ్గు నణుచుకొని కుమారా! నాకు నీవెక్కడవే సంతానముగుట విచారము కలిగించుచున్నది. ఇదియే నాచింతయని చెప్పెను.గాంగేయుడు తండ్రి మాటలు విని మంత్రులతో రాజు సిగ్గుచే సరిగ చెప్పుట లేదు. మీరాతని మనస్సు నెరిగి నాకంతయు వివరముగా చెప్పినచో వెంటనే అన్ని పనులు చక్కపెట్టి తండ్రి మనస్సునకు శాంతిని చేకూర్చెదనని పలికెను.

వారు రాజు చింతాకారణమును తెలిసి కొని గాంగేయునకంతయు చెప్పిరి. గంగాసుతుడు వెంటనే మంత్రులను వెంట బెట్టుకొని దాశరాజు వద్దకు వెళ్ళి నాతండ్రికి నీకూతురు నిచ్చి భార్యగా చేయుమని కోరెను. ఆతడు తన మనుమనికే రాజ్యమీయవలయుననగా గాంగేయుడు తాను రాజ్యము చేయననియు వివాహము కూడ చేసికొనననియు ప్రతిజ్ఞ చేసి భీష్ముడని ప్రసిద్ధిని పొందెను. దాశరాజు తన కుమార్తెను శంతనునికిచ్చెను. సత్యవతికి - పరాశరుని వలన నింతకు ముందుగనే - వ్యాసమహర్షి జన్మించినట్లు శంతను మహారాజునకు తెలియదు. సత్యవతీ శంతనులకు కుమారులిరువురు కలిగివారు కాలవశమున మరణించిరి. అంబిక కనులు మూసికొని వ్యాసుని వలన ధృతరాష్ట్రుని కనెను. మరొకతె వ్యాసుని చూచి వెలవెలబోవుటచే పాండురాజు పుట్టెను. మూడవమారు దాసి వ్యాసుని సంతృప్తుని చేసినందున సత్యవాదియగు విదురుడు జన్మించెను. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడగుటచే పాండురాజు రాజాయెను. విదురుడాతని మంత్రియయ్యెను.

ధృతరాష్ట్రునకు భార్యలిద్దరు. ఒకతె గాంధారి. రెండవది వైశ్య స్త్రీ. పాండు రాజునకు కుంతిమాద్రి యను విరువురు భార్యలు గలరు. గాంధారికి నూర్గురు కొడుకులు, వైశ్యకుమారుడు, యుయుత్సుడు. కుంతి కన్యగా నుండి సూర్యుని వలన కర్ణుని కనెను. తరువాత నామె పాండురాజునకు భార్య యయ్యెను. అని చెప్పగా ఋషులు సూర్యుని వలన కన్యయైన కుంతికి కర్ణుడెట్లు జన్మించెను? ఆమెకు పాండురాజుతో వివాహమెట్లయ్యెనని ప్రశ్నింపగా సూతుడు సమాధాన

మిట్లు చెప్పెను. శూరసేనుడను వాని కూతురు కుంతి. ఆమె చిన్నతనము నుండి కుంతి భోజుడను రాజు శూరసేనుని ప్రార్థించి కుంతిని తన కుమార్తెగా చేసికొనెను. ఒకనాడు దుర్వాసోమహర్షి చాతుర్మాస్యదీక్ష జరుపదలచి కుంతి భోజు నింటికి వచ్చెను. అప్పుడు కుంతి మునీశ్వరునకు సేవచేసి యాతని సంతుష్టుని చేసెను. ముని యామెకొక దివ్యమంత్రమునుపదేశించెను. ఆ మంత్ర ప్రభావముచే ధ్యానింపబడిన దేవత ప్రత్యక్షమై కోరికలను సఫలమొనర్చును. కుంతి మంత్ర ప్రభావము నెరుగదలచి ఉదయించిన సూర్యుని చూచి మంత్రము నుచ్చ రింపగా సూర్యుడు మానవాకారముతో నామెవద్దకు వచ్చెను. కుంతి యాశ్చర్యము నొంది భయముతో కంపించి నమస్కరించుచు మీ దర్శనము నేను సంతసించితిని. ముని యిచ్చిన మంత్రమహిమ నెరుగ కోరిమమ్ము పిలిచితినని పలికెను.

సూర్యుడును - నీ కన్యాత్వము చెడకుండునట్లు చేయుదును, నావంటి కొడుకు నీకు కలుగునని ఆమెను పొంది కోరినవరము నిచ్చి వెడలిపోయెను. తరువాత కుంతి కొన్నాళ్ళకు రహస్యమందిరమున కవచకుండలములతో కూడిన అందమైన బాలుని కనెను. లోకాపవాదమునకు వెరచి యాబాలునొక పెట్టెలో నుంచి దాదిచేత నదిలో వదలిపెట్టించెను. అధిరథుడను సూతునకా పెట్టె దొరకగా నాతడు తన భార్య రాధకు అందులోని బాలుని పెంచుమని యిచ్చెను. ఆతడే కర్ణుడను పేర ప్రఖ్యాతినొందెను.

## పాండవుల జన్మ వృత్తాంతము

కొన్నాళ్ళకు కుంతికి స్వయంవరమేర్పరుపగా అందామె పాండురాజును వరించెను. మద్రరాజు కుమార్తె మాద్రియునాతనికి రెండవ భార్యయయ్యెను. ఒకనాడు పాండువేటకు వెళ్ళి మృగరూపముతో క్రీడించుచున్న మునిని బాణముతో చంపెను. ఆ ముని కోపించి స్త్రీ సంగమమున నీవు కూడనిట్లే మరణింతువని పాండురాజును శపించెను. పాండురాజందులకు దుఃఖపడుచు రాజ్యము విడిచి వనవాసము చేయుచుండెను. అతని సేవకై కుంతీమాద్రులు కూడ వాని వెంట వెళ్ళిరి. పాండురాజు తపస్సు చేయుచు ధర్మశాస్త్రమును వినునప్పుడు పుత్రులు లేనివారికి సద్గతి యుండదని విని పుత్రసంతతి పొందుటకు కుంతితో నిట్లనెను. నీవు మహాముని దయతో పుత్రుని కనుము. నా యాజ్ఞచే నీకు దోషముండదు' అని పలికెను. అపుడు కుంతి యిట్లనెను.

మహారాజా! పూర్వము దుర్వాసోమహర్షి నాకొక మంత్రమునుపదేశించెను.

అది నాయొద్ద కలదు. ఆ మంత్రప్రభావముచే నేనాహ్వానించిన దేవత నీముందు ప్రత్యక్షమై కోరికను తీర్చివెళ్ళును. అని పలికి భర్త యనుమతితో ధర్మదేవతను స్మరించినది. ఆతని యనుగ్రహముచే ధర్మ రాజును పుత్రునిగా పొందెను. పిమ్మట వాయుదేవుని యనుగ్రహముచే భీముని దేవేంద్రుని వలన అర్జునుని ఒక్కొక్క సంవత్సరముకు ఒక్కొరిని సంతానముగా పడసెను. మాద్రి తనకు సంతానము లేకపోయెనని విచారించుచుండగా కుంతి మాద్రికా మంత్రము నుపదేశించెను. మాద్రిఆమంత్రముతో అశ్వినీదేవతల నాహ్వానించి వారివలన నకులసహదేవులను నిరువురు కుమారులను కనెను. ఇట్లు పాండురాజునకు ఐదుగురు పుత్రులు సంభవించిరి.

పిమ్మట నొకనాడు పాండురాజు కామార్తుడై మాద్రిని కౌగిలించుకొని శాప కారణముగ మరణించెను. కుంతీ మాద్రు లిరువురును దుఃఖించుచుండగా మునులు వచ్చి పాండురాజునకు గంగా తీరమున దహనసంస్కారము చేసిరి. అంతట మాద్రి తన పుత్రులను కుంతికి అప్పచెప్పి సతీధర్మమును పాటించుచు పాండురాజుతో సహగమనము చేసినది. ఆచటి మునులు పాండవులచే పాండు రాజు అంత్యక్రియలను దానధర్మాదుల చేయించి కుంతిని పాండవులను హస్తినా పురమునకు తీసికొని వెళ్ళిరి. వారి రాకవిని గాంగేయుడు, విదురుడు, ధృతరాష్ట్రుడు ప్రజానీకము వారిని చూడబోయిరి. జనులకు పాండురాజు శాపము పొందెనని యెరుగక ఈ కుమారులెవ్వరని యడుగగా వీరు కురువంశమున పుట్టిన సుర కుమారులని చెప్పి వారి విశ్వాసమునకై దేవతలనాను ప్రార్థించిరి. అప్పుడు యింద్రాదిదేవతలు- వీరు మాకు కుమారులే. పాండురాజు - అనుమతితో - కుంతియందు - మావలన కలిగిరి. వారు మా బిడ్డలే వీరని చెప్పిరి. భీష్మాదు లందరు వారిని ఆదరించి పోషించిరి. ఈ విధముగా కుంతీ కుమారులు భీష్మునిచే పరి రక్షింపబడిరి.

# దేవి దయవలన పాండవాదులు మృతవీరులను చూచుట

పంచ పాండవులకు ద్రౌపది పతివ్రతయైన భార్య. ఆమెకైదుగురు కుమారులు గలిగిరి. అర్జునుడు శ్రీకృష్ణుని యనుమతితో సుభద్రను హరించి తెచ్చి భార్యగా చేసికొనెను. అభిమన్యుడు ఉపపాండవులును మహాభారత యుద్ధమున వీరస్వర్గము లంకరించిరి. అప్పుడు అభిమన్యు భార్య గర్భవతి. అశ్వత్థామ బాణాగ్ని నుండి

వాసుదేవుడా శిశువును కాపాడెను. అతడు పరీక్షిత్తను పేర ప్రసిద్ధినొందెను. ధృతరాష్ట్రుడు తన కుమారు లెల్లరు మరణింపగా పాండవుల రక్షణలో నుండెను. భీముని పరుషవాక్కులకు దుఃఖింతుడై జీవించుచుండెను. గాంధారియు నక్కడనే యుండెను. ధర్మరాజు వారిరువురకు పరిచర్య చేయుచుండెను. విదురుడు మంచి మాటలను ప్రబోధించు వారివద్దనే యుండెను. ధృతరాష్ట్రుడు తన కొడుకులకు అంత్యక్రియలకై ధనమును కోరగా విదురుడు ధర్మరాజునకామాట చెప్పెను.

ధర్మరాజు భీముని పరుషవచనములను లెక్కచేయక తక్కిన ముగ్గురితో సంప్రదించి చాలధనము నిచ్చెను. ధృతరాష్ట్రుడంత్యక్రియలు పూర్తిచేసి విదుర, కుంతీ, గాంధారులతో నరణ్యమునకు పోయెను. సంజయుడు కూడ వారితో బయలుదేరెను. పాండవులు నివారించినను కుంతి వనమునకు వెళ్ళెను. వారు గంగాతీరమున శతయూపాశ్రమము చేరి అక్కడ పర్ణకుటీర మేర్పరచుకొని యచట తప మొనర్చిరి. వారు వెళ్ళిన రెండేళ్ళకు ధార్మికుడైన ధర్మరాజు వారి యెడబాటు నోర్వలేక నేను కలలో బలహీనురాలనుగా కుంతిని చూచినాను. మన తల్లిని చూడవలెనని నామనస్సు కోరుచున్నది. మహాత్ములగు విదుర సంజయులను పితరులను దర్శించి రావలెనను కొనుచున్నాను. మన మందరము కలసిపోవుట యుక్తమని తోచుచున్నది. అని పలుకగా పాండవులు ద్రౌపది సుభద్ర ఉత్తర నగరజనులు శతయూపాశ్రమము చేరిరి.

అచట విదురుడు మాత్రము కన్నబడ లేదు, అతని గూర్చి ధర్మరాజు ధృతరాష్ట్రునడిగెను. ధృతరాష్ట్రుడాతడెక్కడో ధ్యానము చేయుచుండునని చెప్పెను. మరునాడు తీవ్ర తపస్సుచే కృశించిన విదురుని చూచి ధర్మరాజు నమస్కరింపగా విననట్లు స్థాణువువలెను నాతడుండెను. ఒక్కక్షణములో విదురుని నుండి యొక మహాద్భుత తేజము వెడలి ధర్మరాజులో లీనమయ్యెను. ధర్మరాజు విదురునిని మరణమునకు దుఃఖించి వానికి దహనసంస్కారము చేయబూనగా నశరీరవాణి యాతని శరీరమును దహింపవల సిన పనిలేదని పలికెను. అంతట పాండవులు గంగలో స్నానము చేసి ధృతరాష్ట్రునకు జరిగిన విషయమును తెల్పిరి.

పిమ్మట పాండవులు పౌరులును వెనుకటి యాశ్రమమునకు వచ్చిరి. అప్పుడు వ్యాసమహర్షి నారదుడు కొందరు యితర మునులును పాండవుల వద్దకు వచ్చిరి. అప్పుడు కుంతివ్యాసుని చూచి తపోధనా! ద్వైపాయనా! నాకు కుమారుడైన కర్ణుని చూడవలెనని కుతూహలముగా నున్నది. నాకాతనిని చూపించుము - ఇందుకు నీవే సమర్థుడవు అని పలుకగా గాంధారి దుర్యోధనుని వాని సోదరులను చూపించు

మనెను. సుభద్ర అభిమన్యుని చూపుమనెను. అంతట వ్యాసుడు గంగా తీరమున ప్రాణాయామము చేసి యాదేవిని హృదయ కమలమున ధ్యానించి ధర్మరాజాదులను రావింపగా వారు గంగలో స్నానము చేసి పరిశుద్ధులైరి. వ్యాసుడు పరదేవత నిట్లు స్తుతించెను.

ఓ బ్రహ్మరూపిణీ! మణి ద్వీపవాసినీ! నీకు నమస్కారములు నేను మరణించిన వారిని చూపలేను నీవే యామృతవీరులను చూపింపుమనగా భువనేశ్వరి స్వర్గమునుండి మృతవీరులను రావించి యక్కడి వారికి చూపెను. అట్లు చనిపోయి మరల కనబడిన తమ యాప్తబంధువులను కుంతి గాంధారి సుభద్ర ఉత్తర పాండవులు చూచి ముగ్ధులై శ్రద్ధాంజలి ఘటించిరి.

పిమ్మట వ్యాసుని అమిత మహిమచే వచ్చినవారు మరల తమతమ స్థానములకు పంపబడిరి. ఈ విధముగా పాండవులు దేవి దయవలన ఇంద్రజాలమువంటి దృశ్యమును చూచిరి. తరువాత నందరు తమతమ నివాసములకు వెళ్ళిరి. ఆనాటికి మూడవదినమున ధృతరాష్ట్రుడు గాంధారీ కుంతీ సహితుడై వనమందలి దావాగ్నిలో పడి భస్మమయ్యెను. సంజయు డంతకు పూర్వమే ధర్మరాజును ధృతరాష్ట్రుని వదలి తీర్థయాత్రకు వెళ్ళెను.

ఈ విషయములు నారదుని వలన తెలిసికొని ధర్మరాజు మిగుల దుఃఖించెను. కౌరవుల నాశము పిమ్మట ముప్పదియారేళ్ళకు యాదవులెల్లరు ప్రభాసతీర్థము నమసరించిరి. శ్రీకృష్ణుడవతారము చాలించుట విని వసుదేవుడు భువనేశ్వరీదేవిని ధ్యానించుచు ప్రాణములు వదలెను. అర్జునుడు మరణించిన యాదవులకు తగినట్లు దహనాది సంస్కారముల నొనర్చెను. అష్టమహిషులు శ్రీకృష్ణునితోపాటు దహనము నొందిరి. రేవతితో బలరాముడు నగ్నిలో దహింపబడెను.

అర్జునుడు ద్వారకనుండి జనులను వెడలించిన పిమ్మట సముద్ర మా పట్టణమును ముంచి వైచెను. అర్జునుడు అని రుద్ధుని కొడుకును ఇంద్రప్రస్థ పురమునకు రాజుగా చేసెను. తరువాత అర్జునుడు తన కష్టములనన్నిటిని వ్యాసునకు చెప్పి దుఃఖించెను. చోరులు కృష్ణుని భార్యల సొమ్ములను హరించిరి. వ్యాసునిచే నోదార్చబడి అర్జునుడు తేజోహీనుడై జరిగిన దంతయు ధర్మరాజునకు తెలిపెను. ధర్మరాజు ముప్పది యారేండ్లు వయస్సు గల పరీక్షిత్తునకు పట్టము గట్టెను. పిమ్మట తమ్ములతో ద్రౌపదితోడనుహి మాద్రికి వెళ్ళి యచటనే ప్రాణములు వదలిరి. పరీక్షిత్తు పరమధార్మికుడు రాజర్షి.

# పరీక్షిత్తు శాపగ్రస్తుడగుట

పరీక్షిత్తు అరువది యేండ్లు చక్కగా పరిపాలించెను. ఒకనాడతడడవి కేగెను. అచట వేటాడుచు మధ్యాహ్నము వరకు తిరుగుటచే నాతడాకలిదప్పికలచే బాధపడ జొచ్చెను. దగ్గరలో ధ్యాననిమగ్నుడైన యొక మునిని చూచి జలమిమ్మనెను. అతడు సమాధిలో నుండి మాటాడలేదు. పరీక్షిత్తు దప్పికచే కలిమాయవలన కోపించి యచట చచ్చిపడియున్న పామును మహర్షి మెడలో వేసెను. మునిధ్యాన నిశ్చలుడై అట్లే యుండెను. రాజు ఇంటికి వెళ్ళెను. ఆ మునికుమారుడు శృంగి మహా తేజశ్శాలి గొప్పశక్తిమంతుడు. అతడు తన మిత్రులతో ఆడుకొనుచుండెను. ఆ బాలుని మిత్రుడొకడు నీ తండ్రి మెడలో నెవడో పాము వేసెనని చెప్పగా మునికుమారుడు కోపముతో వెంటనే దోసిలితో నీటిని తీసికొని నా తండ్రి మెడలో చచ్చినపామును వేసినవాడు తక్షకుని కాటుకు గురియై యేడుదినములలో మరణించుగాక యని శపించెను. మునికుమారులు కొందరు రాజభవనమునకు వెళ్ళి మునికుమారుడిచ్చిన శాపమును రాజునకు తెలిపిరి.

అంతట పరీక్షిత్తు శాపము తప్పదని తెలిసి వృద్ధులైన మంత్రుల రావించి శాపవిషయమును చెప్పి పూర్వమొక ముని మరణించిన తన భార్యను సగ మాయుస్సు నిచ్చి బ్రతికించుకొనెను. అట్లేదే నొకయుపాయము నాలోచింపుడు. ఏ యుపాయములేనిచో దైవమునే దిక్కుగా నమ్ముకొందునని పలికెను" అన్ని విని మంత్రులు ఆయుస్సు నిచ్చి ప్రియురాలిని బ్రతికించుకొన్న మునిఎవ్వరో ఆమె యెట్లు మరణించెనో తెలుపుడని కోరిరి. రాజా వృత్తాంతము నిట్లు చెప్పెను.

# రురుముని ప్రియురాలిని బ్రతికించుకొనుట

భృగుమహర్షి భార్య "పులోమ" ఆమె అందాలరాశి. ఆమెకు చ్యవనుడను పుత్రుడు కలిగెను. చ్యవనునకు శర్యాతి కూతురు సుకన్య భార్య. సుకన్యయు సుందరాంగి. వారి కుమారుడు ప్రమతి. అతని భార్య "ప్రతాపి." ఆమె కుమారుడు రురువు. ఆ కాలములో "సూర్యకేతుడ"ను మహర్షి యుండెను. అతడు విశ్వావసు వలన మేనకకు జన్మించిన అందగత్తెయగు బాలికను ప్రమద్వరయను పేరు పెట్టి పెంచుచుండెను. కొంతకాలమునకు ప్రమద్వర సర్వలక్షణ శోభితయగు యువతి యయ్యెను రురుమహర్షి యొకనాడా యువతిని చూచి కామార్తుడాయెను. అతని తండ్రి దిగులుతో నుంటివేమని కుమారుని ప్రశ్నింప నాతడు స్థూలకేతు

నాశ్రమమందున్న ప్రమద్వరను నాకు భార్యగా చేయుమనెను. ప్రమతి స్థూలకేశుని తో మాట్లాడి రురువునకు వివాహము నిర్ణయించెను. వివాహమునకు ముందే నిద్రించుచున్న ప్రమద్వర నొకపాము కాటు వేయగా నామె మరణించెను. స్థూల కేశువు మిక్కిలి దుఃఖించుచుండెను. రురువా సన్నివేశమును చూచి బయటకు వచ్చి విరహాతురుడై బోరున ఏడ్చెను. కొంచెమాలోచించి యాతడు స్నానము చేసి ఆచమనమొనర్చి నేను నాగురువులను భక్తితో పూజించితినేని నాప్రియ రాలిపుడే మరల జీవించుగాక లేనిచో నేనును మరణింతునని పలికి దోసిలితో నీటిని నేలపై విడిచెను.

అంతటనొక దేవదూత రురువు వద్దకు వచ్చి నీ యాయుస్సును సగమును యీమెకిచ్చి బ్రతికించుకొనుమని సలహా యిచ్చెను విశ్వావసువు కూడ స్వర్గము నుండి వచ్చెను. విశ్వావసు, దేవదూత లిరువురు ధర్మదేవునకు రురువు సగమాయువు ప్రమద్వరకీయ నిశ్చయించి నాడని చెప్పగా ఆతడు సమ్మతించెను. దేవదూత ప్రమద్వరను రురువర్ధాయువుతో పునర్జీవితురాల నొనర్చి వెంటనే యామెను రురునకు సమర్పించెను. కనుక మణిమంత్ర ఔషధములచే ప్రాణ రక్షణము శాస్త్రసమ్మతమైన యుపాయము. అని పలికి మంత్రులను తనకు రక్షకులనుగా చేసికొని ఏడంతస్తుల మేడ నిర్మింపచేసి మంత్రులతో ఆ మేడ నెక్కెను. రాజా మేడయందే స్నాన భోజనాది సర్వకార్యములు నిర్వర్తించుచు మంత్రులతో నాలోచ నలు చేయుచు దినములు లెక్కపెట్టుచుండెను.

# పరీక్షిత్తు విప్రశాపమున మరణించుట

ఆ సమయమున మంత్రవేత్త యగు కశ్యపుడను నొక మునిధనార్థియై రాజు నకు చావు తప్పించి డబ్బు సంపాదించుటకు రాజున్నచోటకు బయలుదేరెను. ఆనాడే తక్షకుడు బ్రాహ్మణవేషముతో రాజు వద్దకు వెళ్ళుచు దారిలో కశ్యపుని చూచి నీవెక్కడకు యేమి పనిమీద వెళ్ళుచున్నావని ప్రశ్నింపగా నాతడు నా మంత్రప్రభావముచే రాజును బ్రతికించి ధనమును సంపాదింపవలెనని వెళ్ళుచు న్నాను అని పలికెను.

అప్పుడు తక్షకుడు నీకు కావలసినంత ధనము నేనే యిచ్చెదను శ్రమపడక నీవింటికి వెళ్ళుమనగా కశ్యపుడు ధ్యానించి రాజునకు మరణము తప్పదని యెరిగి తక్షకుని నుండి కావలసిన ధనమును తీసికొని యింటికి వెళ్ళెను. తక్షకుడు సర్పము లను తాపసులనుగా మార్చి రాజదర్శనమునకు పంపెను. తాను కూడ తాపస

వేషముతో మంచిఫలములను రాజునకు తీసికొని వెళ్ళుచు నొక పండులో చిన్న పురుగు రూపమున తానుదూరి యుండెను. ఆనాడు రాజ దర్శనము నిషేధింప బడుటచే మరునాడు రమ్మని ద్వారపాలకులు చెప్పిరి. బ్రాహ్మణవేషములో నున్న సర్పములు తాము తెచ్చిన ఫలములను మహారాజునకు పంపి వెడలిపోయిరి.

పిమ్మట రాజు మంత్రులతో మీరీపండ్ల నారగింపుడు. నేను కూడ నొకపండును తినెదనని యొక పండును చీల్చగా నల్లని కన్నులతో ఎఱ్ఱనిపురుగు కంటబడెను. "ఇప్పుడు సూర్యుడస్తమించును. నాకు శాపము గడచినది. నేను తక్షకవిషమునకు భయడుటయేల? యని యాపురుగును తన కంఠముపై నుంచు కొనెను. ఆ పురుగు వెంటనే భయంకర తక్షకరూపము దాల్చి రాజుమెడను చుట్టి కాటు వేసెను. మంత్రు లెల్లరాశ్చర్యపడి మిక్కిలి దుఃఖించిరి.

ఆ సర్పమును చూచి యెల్లరు భయపడి పరువెత్తిరి. రక్షకులు గొల్లున నేడ్చిరి. హాహాకారములు మిన్ను ముట్టినవి. తక్షకుని విషాగ్ని జ్వాలలు చెలరేగి రాజును నిలువున కాల్చి ప్రాణములను తీసినవి. తక్షకుడు రాజు ప్రాణములు తీసి యాకాశమున కెగిరెను. రాజు కాలిపడిన చెట్టువలె ప్రాణాలు వదలి నేలపై కూలెను. జనులెల్లరు మృతుడయిన రాజును చూచి మిగుల దుఃఖించిరి. పరీక్షిత్తు కుమారు డైన జనమేజయుడు పసినాడగుటచే మంత్రులు రాజునకు పరలోక క్రియలు జరిపించిరి. మంత్రులు పౌర జానపదులును బాలుడగు జనమేజయుని ఒక సుముహూర్తమున సింహాసనముపై కూర్చుండబెట్టిరి. జనమేజయునకు కృపా చార్యులు ధనుర్వేదమునంత యును నేర్పెను. జనమేజయుడుఅన్ని విద్యలను నేర్చి బలశాలియై పరమార్థ వేత్తయై జితేంద్రియుడై ధర్మరాజువలె రాజ్యపరిపాలన మొనర్చెను. అతనికి కాశిరాజు సువర్ణవర్మాక్షుడు వపుష్టమ యను తన కన్యనిచ్చి వివాహము జరిపెను. తన పరిపాలనచే ప్రజలను పరీక్షిత్తు సంతసింపజేసెను.

## ఆస్తీక మహాముని జనమేజయుని సర్పయాగమును మాన్పించుట

తక్షకునిచే బాధింపబడిన ఉత్తంకుడను ముని జనమేజయుని వద్దకు వచ్చి నీతండ్రిని చంపిన తక్షకునకు నీవు ప్రతీకారము చేయకుండుట న్యాయము కాదని పలికి పూర్వము రురువను మునితన భార్య పాముకాటుచే మరణించగా కనపడిన ప్రతిపామును చంపెనని చెప్పి ప్రతీకారచర్యకు ప్రోత్సహింపగా జనమే జయుడు మంత్రుల రావించి నేను సర్పయాగమొనర్చి సర్పముల నగ్నిలో వేల్చి

తక్షకునకు ప్రతీకారమొనర్ప నిశ్చయించితిని. గంగాతీరమున యాగమునకు తగిన చోటు నిర్ణయింపుడు. నూరుస్తంభములతో మండపము నిర్మింపవలెను. అందు శ్రేష్ఠమైన యజ్ఞవేదిక నమర్పదలయును. సర్పయాగము మహా ఘనముగా సాగ వలెను. ఈ యాగమందు తక్షకుడు పశువు ఉత్తంక మహర్షి హోతగా నుండ వలయును. త్వరగా వేదపారగులగు బ్రాహ్మణుల నాహ్వానింపుడు అని యాజ్ఞ యిచ్చెను. తక్షకుడీ సంగతి తెలిసి యింద్రుని రక్షింపుమని కోరగా నాతడు తక్షకు నకు భయమిచ్చెను. ఉత్తంకుడు యీ విషయము తెలిసి యింద్రునితో సహ తక్షకుని వేల్చుచున్నానని మంత్రము చదివెను. అప్పుడు తక్షకుడు జరత్కారు కుమారుడగు నస్తీకుని స్మరింపగా నాతడు జనమేజయుని యజ్ఞము వద్దకు వచ్చి రాజును స్తుతింపగా జనమేజయుడు సంతోషించిన కోరిన యేమని అడిగెను.

ఆస్తీకుడు మహారాజా! ఈయజ్ఞము నాపివేయుము. ఇదియే నాకోరిక అని పలికెను. సత్యమునకు బద్ధుడైన జనమేజయుడు యాచకుని కోరిన ప్రకారము యజ్ఞమును విరమించెను. కాని జనమేజయమహారాజునకు శాంతి చేకూరలేదు. అతడు తన మనశ్శాంతికి వేదవ్యాసమహర్షి నుపాయమడిగెను. వ్యాసమహర్షి మహాసభలో జనమే జయునకు రసభరితమైన దేవీ భాగవతమును వినినచో నీకు మనశ్శాంతి కలుగ గలదనెను. అప్పుడు జనమేజయుడీ యాస్తీకుడెవడు ఈ యాగవిఘ్నము నేల చేసెను. సర్పములను రక్షించినచో వీనికి ఏమిలాభము? తెలుపమనగా వ్యాసుడిట్లు చెప్పెను.

## ఆస్తీక మహాముని జన్మ వృత్తాంతము

పూర్వము జరత్కారువను ముని గృహస్థుడుకాలేదు. అందుచే నతని పితృ దేవతలు పెద్దగుంటలో వ్రేలాడుచుండిరి. వారిని చూచి జరత్కారువు యిందుకు కారణమడుగగా నీవు పెండ్లి చేసికొనక పోవుటయే యని వారు సమాధానమిచ్చిరి. నీవు పెండ్లి చేసికొనుమని వారు జరత్కారునడిగిరి. జరత్కారుడు పూజ్యులారా! నా పేరుతో సమానమగు పేరు కలిగి అనుకూలురాలైన కన్య కోరకనే లభించినచో తప్పక పెండ్లియాడి గృహస్థ జీవితము సాగింతునని వారితో పలికి తీర్థయాత్రకు వెళ్ళెను. నాగమాతయైన కద్రువ తన మాట వినని పాములను అగ్నిలో పడునట్లు శపించెను. అవి యన్నియు జనమేజయుని సర్పయాగమున అగ్నికాహుతియైనవి. తల్లిచే శపింపబడిన వాసుకి మొదలగు పన్నగములు బ్రహ్మను శరణువేడుగా నాతడు జరత్కారు మునికి అతని పేరుగల నాగకన్యను వివాహము చేసినచో

నా దంపతులకు పుట్టువాడు మీకష్టమును తొలగింపగలడని చెప్పెను. అతడాస్తీకు డను పేర పిలువబడునని యు బ్రహ్మ పలికెను.

వాసుకి తన సోదరియైన జరత్కారును- జరత్కారు మునికి సవినయముగ సమర్పించెను. వారిరువురు పర్ణకుటీరమున నివసించుచుండిరి. జరత్కారు ముని తనకిష్టములేని పని చేసినప్పుడు నిన్ను విడిచిపోయెదనని భార్యతో చెప్పెను. అట్లే ఒకనాడు సూర్యాస్తమయ సమయమున నిద్రించుచున్న భర్తను సంధ్యా వందనము చేయుమని లేపగా నతడు కోపించి భార్యను విడిచి వెళ్ళెను. ఆమె సోదరునింట నివసించు నొకబాలుని కనెను. ఆతడే ఆస్తీకనామమున వన్నెకెక్కెను ఆతడు తన వారినిట్లు సంరక్షించెను. అవి దేవిని పూజింపమనెను.



# తృతీయ స్కంధము

## త్రిభువనేశ్వరీ దేవి ప్రాభవము

**బ్రహ్మ నారదునికిట్లు చెప్పెను:-** పూర్వము సర్వప్రపంచము జలమయమై యున్న పుడు నేను ఒక పద్మములో పుట్టితిని. అప్పుడు సూర్యుడుగాని, చంద్రుడు గాని, చెట్లుగాని, కొండలుగాని లేవు. పద్మము మధ్యలో కూర్చుండి నన్నెవరు పుట్టించిరి? ఈ మహాజలములో నాకు రక్షకుడెవడు? భూమి కనిపించుటలేదు. ఈ పద్మము ఎట్లు పుట్టినది? ఈనీటి అడుగున యేమున్నది? చూచెదనని ఆ నీటిలోనికి దిగి వేయి సంవత్సరములు వెదకినను భూమి కనిపించలేదు. అప్పుడు తపస్సు చేయుము, తపస్సు చేయుము, అని ఆకాశవాణి పలికిన మాట వినిపించినది. ఆ పద్మమందే వేయి సంవత్సరములు తపస్సు చేసితిని. అప్పుడు సృష్టి చెయుము అని మరల ఆకాశవాణి వినిపించినది. దేనిని సృష్టించవలయునో నాకు తెలియలేదు.

తరువాత మధుకైటభులను ఇద్దరు రాక్షసులు కనిపించిరి. అప్పుడు నేను భయపడి నీటిలో ఇంకా లోతుకు పోయాను. అక్కడ పరమాద్భుత స్వరూపము గల పురుషుడొకడు కనిపించెను. అతని శరీరము మేఘమువలె నల్లగా నున్నది. పచ్చని వస్త్రమును కట్టుకొని నాలుగు భుజములు తాల్చి వనమాలాలంకారముతో ఆదిశేషునిపై పరుండిన జగత్ప్రభువును చూచితిని. శంఖము, చక్రము, గద, పద్మము వానిచేతులలో ప్రకాశించు చున్నవి. అట్టి విష్ణుమూర్తిని చూచితిని. అప్పుడు ఏమిచేయవలయునో తోచలేదు. విష్ణుమూర్తికి నిద్ర కలిగించిన పరదేవతను స్తుతించితిని. అప్పుడు ఆ దేవి అతని శరీరము నుండి వెలుపలకు వచ్చి ఆకాశములో నిలిచినది. వెంటనే విష్ణుమూర్తికి మెలకువ వచ్చినది. తరువాత ఆ మహా విష్ణువే మధుకైటభులను రాక్షసులను సంహరించెను. తరువాత నేను, విష్ణుమూర్తి ఉన్నచోటునకే రుద్రుడు కూడవచ్చెను. మేము ముగ్గురము ఆ దేవిని చూచితిమి. స్తోత్రము చేసితిమి. అప్పుడామె సంతోషించి ఓ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులారా! జాగరూకతతో మీమీ పనులను నిర్వర్తించుడు. సృష్టిస్థితి లయములు మీరు చేయవలసిన పనులు కదా! ఇక మీమీ నివాసములకు పొండని పలికినది. ఆ మాటలువిని మేము తల్లీ ప్రపంచమంతయు జలమయమైయున్నది. ఇచ్చట నెట్లు సృష్టి చేయ గలము? అని పలుకగా పరదేవత చిరునవ్వు నవ్వినది. వెంటనే ఆకాశము నుండి చక్కటి విమానము వచ్చినది. ఆ దేవి దేవతాలారా! మీరీ

విమానము నెక్కుడు. మీకు ఆశ్చర్యకరమైన విషయమును చూపుదును అని పలికినది. అట్లేయని మేమును రత్నములతో అలంకరింపబడిన ఆ విమానము నెక్కితిమి. పరదేవత తన శక్తితో ఆ విమానమును ఆకాశమున నడిపినది.

# త్రిమూర్తులు త్రిమూర్తులనుగని ఆశ్చర్యపడుట

ఆ విమానము మనోవేగముతో కదిలి ఒక స్థలమునకు చేరినది. అక్కడ నీరు లేదు. పండ్లతో నిండిన చెట్లు, కోకిల ధ్వనులుగల వనములు, ఉద్యానములు, స్త్రీ పురుషులు, పశువులు, భూమి, కొండలు, నదులు, చెరువులు, సెలయేళ్ళు కనిపించినవి. తరువాత ఒక అందమైన నగరము దివ్యమైన ప్రాకారము యజ్ఞ శాలలు, పెద్దపెద్ద మేడలు కనిపించినవి. ఇది స్వర్గమై యుండుననికొంటిమి. ఇంతలో ఆ నగరపు రాజు విమానములో జగదంబయు కనిపించిరి. వెంటనే మేమెక్కిన విమానము ఒక్క క్షణములో మరొక అందమైన ప్రదేశము చేరినది. అక్కడ నందనవనములో పారిజాత వృక్షము నీడన కామధేనువు, నాలుగు దంత ములుగల ఏనుగులు కనిపించినవి. మరియు అక్కడ అప్సరసలు, గంధర్వులు, యక్షులు, విద్యాధరులు, కల్పవృక్షములమధ్య గానము చేయుచు క్రీడించు చుండిరి. మరియు శచీదేవితో కూడిన ఇంద్రుడు వరుణయమ కుబేర సూర్యా గ్నులు కనిపించిరి. అప్పుడు ఆ పట్టణపురాజు మనుష్యులతో నీ విమానములో కనిపించెను. మేము కూర్చున్న విమానము వెంటనే వేగముతో బయలుదేరినది.

మా విమానము బ్రహ్మలోకమును చేరినది. అక్కడ బ్రహ్మదేవుని చూచి శివ కేశవులాశ్చర్యపడిరి. అక్కడ సభలో షడంగములతో కూడిన వేదములు మూర్తీభవించి ఉండినవి. సముద్రములు, నదులు, పర్వతములు కనిపించినవి. అప్పుడు శివకేశవులు క్రొత్త బ్రహ్మ ఇతడెవరని నన్నడిగిరి. ఇతడెవరో నేనెవరినో నాకే మాత్రము తోచుటలేదని సమాధానమును చెప్పితిని. అంతలోనే మనో వేగముతో విమానము కైలాస పర్వతశిఖరము నకు తీసికొని వెళ్ళినది. అచ్చట యక్షులు గుంపులుగా నుండిరి. కోకిల ధ్వనులు వీణావేణువు మొదలగు వాద్య ధ్వనులు వినిపించుచున్నవి. అప్పుడే శివుడు వృషభమునెక్కి బయలుదేరెను. గజానన, షడాననులు ప్రక్క నుండిరి. నందీశ్వరుడు ప్రమథగణములు జయజయ ధ్వనులు చేస్తున్నారు. ఆ మరొక శంకరునిచూచి మేము ఆశ్చర్యపడితిమి. మా విమానము వెంటనే అట నుండి వైకుంఠమునకు చేరినది.

అచట అందమైన విష్ణుమూర్తి భవనము గొప్ప సంపదను చూచితిమి. విమానము మరి కొంతదూరము వెళ్ళగానే అచట దివ్యాభరణములు ధరించి

లక్ష్మీదేవి చామరముతో సేవించుచుండగా చతుర్భుజుడు పీతాంబరధారి మేఘశ్యామల దేహుడైన విష్ణువును చూచి అత్యాశ్చర్యము నందితిమి. ఒకరినొకరు చూచు కొంటిమి. మరల వెంటనే విమానము వాయు వేగముతో అమృత సముద్రము వద్దకు తీసికొనివెళ్ళినది. ఆ సముద్రము నడుమ అనేక పుష్పవృక్షములు కలవు. అచట శివాకారమైన అందమైన శయ్య ఉన్నది. ఆ మంచముపై ఒక దివ్యాంగన కూర్చొనియున్నది. ఆమె యెఱ్ఱని గంధమును, పూలమాలను ధరించి నది. కోటిమెరుపు తీగెలకాంతితో ప్రకాశించుచున్నది. పాశాంకుశాది దివ్యాయుధములను ధరించి మందస్మిత వదనయైన అమూర్తి శ్రీభువనేశ్వరి. ఆమె హ్రీంకారమనే పంజరమందుండు చిలుక. కరుణామూర్తి నవయౌవన. అనేక మణిమయభూషణ విరాజిత దేవకన్యలతో చుట్టబడియున్నది. అట్టి యామెను చూచి మేము ఆశ్చర్యపడితిమి. ఎవరీ స్త్రీ? వేయి కన్నులు, వేయి చేతులు, వేయి ముఖములు కలిగియున్నది. ఈమె అప్సరస కాదు, గంధర్వ కన్యకాదు, ఎవరా? అని మేము నిర్ణయించలేక ఆశ్చర్యపడితిమి. అప్పుడు శ్రీమహావిష్ణువు సుందరమైన చిరునవ్వుతో నున్న పరదేవతను చూచి తన విజ్ఞానమువలన ఆమెను తల్లిగా మనస్సులో నిశ్చయించు కొని యిట్లు పలికెను.

ఈ పూజ్యురాలైన పరదేవత అందరకును కారణమైనది. మహావిద్యా స్వరూపిణి మహామాయా స్వరూపిణి, నాశరహితమైన పరిపూర్ణ ప్రకృతి స్వరూపము. అల్పబుద్ధులకు తెలియరానిది. యోగమార్గముచే తెలిసికొనదగిన దేవత, పరమాత్మ యొక్క యిచ్ఛా స్వరూపము. నిత్యానిత్యస్వరూపములు గలది. భాగ్యహీనులచే సేవింపరానిది. సమస్త ప్రపంచమునకు నియామకురాలు. వేదములను గర్భమందు ధరించినది. అందరకు మొదటి వ్యక్తియైన శక్తి స్వరూపము. అన్ని బీజాక్షరముల స్వరూపమైనది. సమస్తైశ్వర్యములును నీమె ప్రక్కనే యున్నవి. ఇట్టి యీమె దర్శనముచే మనము ధన్యులము. కృతకృత్యుల మైతిమి. మనము పూర్వము చేసిన తపస్సునకీమె దర్శనమే ఫలము. పుణ్యాత్ములు గొప్పదాతలు, గొప్ప తపశ్శాలురు మాత్రమే యీమెను దర్శించగలరు. రజోగుణముతో కూడిన వారికి ఈమె దర్శనము పొందరానిది. మూలప్రకృతి స్వరూపమైన ఈమె పరమ పురుషునితో కూడి యీ ప్రపంచమునంతను సృష్టించి పరమాత్మకు చూపుచున్నది. చూచు వ్యక్తియు చూడబడు సర్వప్రపంచమును యీమెయే.

సర్వమునకు కారణమైన మంగళ స్వరూపమైన యాశక్తి యీమెయే. నేనుగాని తక్కిన దేవతలు గాని లక్ష్మి మొదలగు దేవతా స్త్రీలుగాని యీమెలోని లక్షాంశకు

కూడ సరిపోము. మహా సముద్రజలములో బాలునిగా ఉన్న నాకు కనబడిన దివ్యస్వరూప మీమెయే - మర్రియాకుపై పరుండి బాలుడనైన నన్ను ఉయ్యాలలో ఊపినది. ఈమెయే ఈ మనందరకు తల్లి. నేను చెప్పు చుంటిని వినుము"అని యిట్లు స్తుతించెను.

# శ్రీదేవిని విష్ణువు స్తుతించుట

శ్లో॥ ఏషా భగవతీదేవీ సర్వేషాంకారణంహినః ।
మహావిద్యా మహామాయా పూర్ణా ప్రకృతి రవ్యయా ॥
దుర్జ్ఞేయాఽల్పధి యాందేవీ యోగమాయా దురాశయా ।
ఇచ్ఛా పరాత్మనః కామం నిత్యానిత్య స్వరూపిణీ ॥
దురారాధ్యాఽల్ప భాగ్యైశ్చ దేవి విశ్వేశ్వరీ శివా ।
వేదగర్భా విశాలాక్షీ సర్వేషా మాదిరీశ్వరీ ॥
ఏషా సంహృత్య సకలం విశ్వమాక్రీడతి నరక్షయే ।
లింగాని సర్వజీవానాం స్వశరీరే నివేశ్య చ॥
సర్వబీజమయీ హ్యేషా రాజతేసాంప్రతం సురే ।
విభూతయః స్థితాః పార్శ్వే పశ్యతాంకోటిశః క్రమాత్ ॥
దివ్యాభరణ భూషాఢ్యా దివ్యగంధానులేపనాః ।
పరిచరాద్యా పరాస్సర్వాః పశ్యతాం బ్రహ్మశంకరౌ ॥
ధన్యావయం మహాభాగాః కృతకృత్యాః స్మసాంప్రతం ।
యదత్ర దర్శనం ప్రాప్తా భగవత్యాః స్వయం త్విదమ్ ॥
తపస్తప్తం పురాయత్నాత్త స్యేదం ఫలముత్తమమ్ ।
పశ్యంతి పుణ్యపుంజాయే వదాన్యాయే తపస్వినః ॥
రాగిణోనై వపశ్యంతి దేవీం భగవతీంశివాం
మూల ప్రకృతిరేవైషా సదా పురుషసంగతా ॥
బ్రహ్మాండం దర్శయ త్యేషాకృత్వావై పరమాత్మనే
ద్రష్టాఽసౌ దృశ్యమఖిలం బ్రహ్మాండం దేవతాస్సురే ॥
తస్యైషాకారణం సర్వా మాయా సర్వేశ్వరీ శివా
క్వాహం వాక్యసురాస్సర్వేరమాద్యాః సురయోషితః ॥
లక్షాం శేన తులామస్యాన భవామః కథంచన
సైషావరాంగనానాము యాదృష్టావై మహార్ణవే ॥

బాల భావే మహాదేవీ డోలయం తీవమాంముదా
శయానంవటపత్రేచ పర్యం కేసుస్థిరేదృఢే ॥
పాదాంగుష్ఠం కరేకృత్వా నివేశ్యముఖపంకజే
లేలిహంతం చక్రీడంతం అనేకైర్బాలచేష్టితై: ॥
రమమాణం కోమలాంగం వటపత్ర పుటే స్థితం
గాయం తీడోలయం తీచ బాల భావాన్మయిస్థితే ॥
సేయం సునిశ్చితం జ్ఞాతం మేదర్శనాదివ
కామంనో జననీ సైషాశ్రుణుతం ప్రవదామ్యహం ॥
అనుభూతే మయా పూర్వం ప్రత్యభిజ్ఞానముత్థితా ॥

**స్తోత్ర భావము**:- పూజ్యురాలయిన ఈ దేవి మహావిద్య, మహామాయ, సంపూర్ణ వినాశము లేనిది ప్రకృతిరూప. ఇట్టి యీమెయే మా అందరకును కారణము. ఈమె అల్పబుద్ధి కలవారికి యెరుగరానిది. ఈ యోగమాయ అభిప్రాయమే అర్థము కాదు. పరమాత్మయొక్క యిచ్ఛారూపమైన నిత్యానిత్య స్వరూపిణి. విశ్వేశ్వరి, శుభప్రదయగు నీమెను మందభాగ్యులు పూజింపజాలరు. ఈమె వేదగర్భ. విశాలాక్షి. అన్నిటికిని ఆదియైన ఈశ్వరి. ఈమెయే సమస్త విశ్వమును నశింపజేయుట యీమెకు ఒక క్రీడ. సర్వ ప్రాణుల చిహ్నములను తన శరీరము నందుంచుకొని యీమె సర్వబీజ స్వరూపిణి యగుచున్నది. అనగా మరల సృష్టించు సమయమున ఆయా ప్రాణులను సృష్టించుచున్నది. ఈమె సమీపమున కోట్ల కొలది విభూతులు గలవు. వీరు దివ్యాభరణములు, దివ్యగంధములను కలిగి యుందురు. ఇట్టి వీరందరును దేవీపరిచర్యయందు ఆసక్తులు. శివ,బ్రహ్మలారా! ఈ విషయమును చూచుచున్నారు కదా! యిట్టి యీమెను చూచుటచే మీరేగాక మేమును అదృష్టవంతులము, కృతకృత్యులమగుచున్నాము. ఇట్టి యీమెను చూచుటచే పూర్వజన్మలో మేము చేసిన తపములు ఫలించినవని తలచుచు న్నాము. ఇట్టి యీమెను చూచుటయు మహాతప:ఫలమే.

శ్రీమహావిష్ణువీ రీతిగా స్తుతించి, శివబ్రహ్మలతో "మనము నమస్కరిం చుచు నీమె ప్రక్కన నిలుచుందము. మహామాయా స్వరూపిణి యగు నీమె మనకు వరములిచ్చును. ఆమె పాదములవద్దకు చేరి నిర్భయముగా స్తోత్రము చేయుదము. ఒకవేళ ద్వార పాలకులుగాని పరిచారకులుగాని మనలను నివారించినచో అక్కడే నిలిచి స్తోత్రమును పఠించుదము అని పలికెను. విష్ణువు యిట్లు పలుకగా శివుడు బ్రహ్మకూడ సంతోషించి ఆమెవద్దకు వెళ్ళుటకు త్వరగా సిద్ధపడిరి. ద్వారము దగ్గరకు వెళ్ళి సందేహించుచున్న వీరిని చూచి ఆమె చిరునవ్వు నవ్వుతూ ముగ్గురినీ

ఆడువారినిగా చేసినది. దేవి మనలను అందగత్తెలైన యువతులనుగా చేసినది. అని వారు సంకోచము లేకుండా ఆమె దగ్గరకు చేరిరి. ఆమె తన పాదముల వద్ద స్త్రీ రూపముతో నున్న మాపై ప్రేమతో నిండిన చూపును ప్రసరింపచేసినది. మేము ముగ్గురము నమస్కరించి మా స్త్రీరూపములను పరస్పరము చూచుకొంటూ అనేక మణులతో అలంకరింపబడిన కోటి సూర్యులకాంతితో వెలుగొందుతున్న ఆమె పాదపీఠమును చూచుచు నిలిచి యుంటిమి.

ఆ దేవి చెలికత్తెలు వేలసంఖ్యలో నుండిరి. కొందరు ఎఱ్ఱని వస్త్రముల ధరించినవారు. కొందరు నీలవస్త్రములను, మరికొందరు పచ్చని వస్త్రములను ధరించిరి. అందరు సుందరమైన ఆకారము కలవారు, విచిత్ర భూషణములు వస్త్రములు కలవారు. వీరందరు ఆమె సేవకై నిలిచియున్న పరిచారికలు. కొందరు గానము చేయువారు, మరికొందరు నాట్యము చేయువారు, వేరొక కొందరు వీణావేణు మద్దెల మొదలగు వాద్యములతో సేవలందించుచుండిరి. నారదా! అక్కడ నేను చూచిన మరియొక అద్భుత దృశ్యమును చెప్పుదును వినుమని బ్రహ్మ యిట్లనెను. ఆ పరదేవత యొక్క కాలిగోరునందు ప్రపంచమంతయు కనిపించినది. నేను విష్ణువు, రుద్రుడు, వాయువు, అగ్ని, యముడు, సూర్యుడు, వరుణచంద్ర కుబేర, దేవేంద్రులు, పర్వతములు, నదులు, సముద్రములు, గంధర్వులు, అప్సరసలు, నారద తుంబురాదులు, అశ్వినీదేవతలు, పితృదేవతలు, శేషాది సర్పములు, రాక్షసులు, వైకుంఠము, బ్రహ్మలోకము, కైలాసపర్వతము సమస్తమును ఆమె కాలిగోటిలో చూచితిమి. మరియు నేను పుట్టిన పద్మము అందులో నా స్వరూపము శేషశాయియైన విష్ణువు మధుకైటభులు కనిపించిరి. ఇట్టి ఆ దృశ్యమును చూచి ఆశ్చర్యపడి మేము ముగ్గురము (బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరులము) ఆ దేవిని సమస్తమునకు తల్లిగా భావించితిమి. అలా చూచుచుండగనే వంద సంవత్సరములు గడిచినవి. మమ్ములను చెలికత్తెలు గనే ఆమె పరిచారికలు తలచిరి. మేము చాలా సంతోషముతో నుంటిమి. ఒకనాడు యువతిరూపములో నున్న భువనేశ్వరీదేవిని విష్ణువిట్లు స్తుతించెను.

## స్త్రీ రూపములోను విష్ణువు చేసిన దేవీస్తుతి

నమోదేవ్యై ప్రకృత్యైచ విధాత్ర్యైసతతం నమః ।
కల్యాణ్యై కామదాయైచ వృద్ధ్యైసిద్ధ్యై నమోనమః ॥
సచ్చిదానందరూపిణ్యై సంసారారణయే నమః ।
పంచకృత్య విధాత్ర్యైతే భువనేశ్యై నమోనమః ॥

సర్వాధిష్ఠాన రూపాయై కూటస్థాయై నమోనమః ।
అర్ధమాత్రార్థ భూతాయై హృల్లేఖాయై నమోనమః ॥
జ్ఞాతంమయాఖిలమిదంత్వయి సన్నివిష్టం ।
త్వత్తో౽స్యసంభవలయావపి మా తరద్య ॥
శక్తిశ్చతే౽స్యకరణే వితతప్రభావా
జ్ఞాతాధునా సకలలోకమయీతి నూనమ్॥
విస్తార్య సర్వమఖిలం సదసద్వికారం
సందర్శ యస్య వికలాపురుషాయకాలే ।
తత్త్వైశ్చ షోడశభిరేవచ సప్తభిశ్చ
భాసీంద్రజాలమివ నః కిలరంజనాయ ॥
నత్వామృతే కిమపివస్తు గతం విభాతి
వ్యాప్యైవ సర్వమఖిలం త్వమవస్థితాసి ।
శక్తిం వినావ్యవహృతౌ పురుషోప్యశక్తః
బంభణ్యతే జనని బుద్ధిమతాజనేన ॥
ప్రీణాసి విశ్వమఖిలం సతతం ప్రభావైః
స్వైస్తేజసాచసకలం ప్రకటీకరోషి ।
అత్స్యేవదేవి తరసాకిల కల్పకాలే
కోవేద దేవి చరితం తవవైభవస్య ॥
త్రాతావయం జననితే మధుకైటభాభ్యాం
లోకాశ్చతే సువితతాః ఖలుదర్శితావై ।
నీతాస్సుఖస్య భవనే పరమాంచకోటిం
యద్దర్శనం తవ భవాని మహా ప్రభావత్ ॥
నాహంభవోన చవిరించి వివేదమాతః
కోన్యో హివేత్తి చరితం తవ దుర్విభావమ్ ॥
కానీహసంతి భువనా ని మహాప్రభావే
హ్యస్మిన్భవాని చరితే రచనాకలాపే ॥

**స్తోత్ర భావము :-** ప్రకృతి విధాత్రిరూపులతో నుండు సమస్త శుభస్వరూప దేవతా మూర్తివగు నీకు నమస్కారము. నీవు కోరికల తీర్చుదానవు. అభివృద్ధి నీ స్వరూపము. కార్యసిద్ధి నీరూపము, సచ్చిదానంద స్వరూపురాలవు. ఈ సర్వ ప్రపంచము నీయందే ఉన్నట్లు నేను తలచుచున్నాను. తల్లీ నీవలననే సృష్టిస్థితి

లయములు జరుగుచున్నవి. సమస్తలోకములు నీ స్వరూపమేయని యిప్పుడు నేను తెలుసుకొంటిని. సమస్తమును నీవు సృష్టించి పరమపురుషునకు చూపించుచుంటివి. ఇంద్రజాల విద్య నేర్చినదానివలె నీవు నీసృష్టి నైపుణ్యముచే మమ్ము రంజింప చేయుచుంటివి. నీవు సర్వమును వ్యాపించి యున్నావు. శక్తి స్వరూపమగు నీవులేనిచో పరమ పురుషుడును అసమర్థుడే యగుచున్నాడు. ప్రళయకాలములో సమస్తమును లయము చేయు నీచరిత్రను వైభవమును తెలుసుకొన్న వాడెవడును లేడు. మధుకైటభ రాక్షసుల నుండి మమ్ము రక్షించితివి. మాకు పరమ సుఖప్రదమైన నీ దర్శనము ననుగ్రహించితివి. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకే నీ మహిమ తెలియదంటే యితరుల విషయము చెప్పనేల? ఈ విధముగా విష్ణువు స్తుతింపగా తరువాత శివుడిట్లు స్తుతించెను :-

# శ్రీదేవిని శివ బ్రహ్మలు స్తుతించుట

యదిహరిస్తవ దేవి విభావజ స్తదను పద్మజ ఏవతవాహోద్భవ : ।
కి మహమత్ర తవాపి నసద్గుణ స్సకలలోక విధౌ చతురాశివే ॥
త్వమసి భూస్సలిలం పవనస్తథా ఖమపివహ్ని గుణశ్చ తథా పున: ।
జననితాని పున: కరణానిచ త్వమసి బుద్ధి మనోప్యథాహంకృతి: ॥
నచవిదంతి వదంతిచయే‌ఽన్యథా హరి హరా జకృతం నిఖిలం జగత్ ।
తవకృతాస్త్రయ ఏవసదైవతే విరచయంతి జగత్య చరాచరమ్ ॥
అవని వాయుఖ వహ్నిజలాదిభి స్సవిషయైస్స గుణైశ్చ జగద్భవేత్ ।
యదితథాకథ మద్య చతత్స్ఫుటం ప్రభవతీతి తవాంబ కళామృతే ॥
భవసి సర్వమిదం సచరాచరం త్వమజ విష్ణు శివాకృతి కల్పితమ్ ।
వివిధ వేషవిలాస కుతూహలై ర్విరమసేరమసేంబ యథారుచి ॥
సకలలోక సిసృక్షురహం హరి: కమల భూశ్చభవాయ యదాంబికే ।
తవ పదాంబుజ పాంసు పరిగ్రహం సమధి గమ్యతదానను చక్రిమ॥
యది దయార్ద్రమనా నసదాంబికే కథమహం విహితశ్చతమోగుణ:॥
కమలజశ్చ రజోగుణ సంభవ: సువిహిత: కి ము సత్వగుణో హరి: ॥

**స్తోత్ర భావము** :- ఓ జగదంబ! బ్రహ్మ, విష్ణువు నీ ప్రభావముచేతనే జన్మించిరి. భూమి, ఆకాశము, నీరు, అగ్ని, ఇంద్రియములు, బుద్ధి, అహంకారము అన్నియు నీవే. తెలియనివారు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులే యీ ప్రపంచ సృష్టి స్థితిలయములను చేయుచున్నారని చెప్పుదురు. నీ దయవలననే వారీ పనులు చేయగలుగుచున్నారు. సత్త్వరజస్తమో గుణములచే త్రిమూర్తులను నీవు సృష్టించుచుంటివి. విమానములో మేము సంచరించునప్పుడు మార్గములో అనంతములైన పుణ్యా

లోకములను చూచితిమి. అవి నిత్య నూతనములుగానున్నవి. వానిని ఎవరు నిర్మించిరో తెలియదు. నీవే యీ లోకములను పుట్టించి పెంచి నశింప చేయ దలచుచున్నావు. నీవు నీ భర్తతో కలిసియుండి నిత్యానందము ననుభవించు చున్నావు. మాకు నీ దివ్యమైనమార్గము బోధపడుటలేదు. మాకు నీ పాదపద్మము లందలి భక్తిని ప్రసాదింపుము అని స్తుతించిరి.

# శ్రీదేవి బ్రహ్మకు తన తత్త్వమును ప్రతిపాదించుట

బ్రహ్మాదులిట్లు స్తుతించిన తరువాత దేవి యీరీతిగా మాట్లాడినది. ఓ దేవత లారా! బ్రహ్మ మొక్కటియే ఉన్న వస్తువు. రెండవ వస్తువులేదు. ఆ బ్రహ్మ స్వరూ పము నేనే. శక్తికి శక్తి కలవానికి భేదమున్నట్లు కనిపించును. కాని అది సరికాదు. మా యిరువురి భేదము అతిసూక్ష్మమై తెలియరానిది. అది తెలిసినవాడే యీ సంసార సముద్రమును దాటగలడు. ప్రపంచమంతయు ప్రళయములో మాయ యందు లయమునొందును. సృష్టికాలమున భిన్నభిన్నముగ కనిపించును. ప్రపంచములో నేనులేని వస్తు వేదియు లేదు. ఇదియే నిజమని తెలుసుకొనుడు. అన్ని రూపములు నాశక్తి స్వరూపములే నాశక్తి చైతన్యమే అంతటను వ్యాపించి యున్నది. దేవత లందరిలోను నేను అనేక నామరూపములతో అలరారుచుందును. నీటి యందలి చల్లదనము, అగ్నియందలి వేడిమి, సూర్యునిలోని ప్రకాశము, చంద్రునిలోని చల్లనివెన్నెలయు నేనే. నాశక్తి సహాయములేనిచో బ్రహ్మయు అణు మాత్రము కూడ కదలజాలడు. అన్నిటికి కారణమైనది శక్తియే యని గ్రహింప వలెను.

భూమిలో గొప్పశక్తి ఉన్నది. కనుకనే అన్నిటినీ మోయగలుగుచున్నది. ఆ శక్తియే లేనిచో భూమి పరమాణువును కూడ మోయజాలదు. అట్లే శేషుడు, ఆదికూర్మము, దిగ్గజములు, నా సహాయమువలననే గొప్ప భారమును మోయ గలుగుచున్నవి. నేను నీటినంతను త్రాగివేయగలను. సూర్యుని గాలినిస్తంభింప చేయగలను. మహత్తత్త్వము నుండి అహంకారము పుట్టును. దానివలన సమస్త ప్రాణి సృష్టియు చేయవచ్చును. ఇకమీరు మీమీలోకాలను నిర్మించుకొని సుఖముగా నివసించుడు. ఓ బ్రహ్మదేవా! నీవీ సరస్వతీ శక్తిని స్వీకరించుము. ఈమె మంచిరూపము కలది. రజోగుణముతో కూడినది. అందమైన చిరునవ్వు గలది. తెల్లనివస్త్రమును ధరించినది. శ్రేష్ఠమైన ఆసనముపై కూర్చున్నది. ఈమె నీకు సహధర్మ చారిణియై నీకు చేదోడువాదోడుగా నుండును. ఈమె నెన్నడును అవమానింపకుము. అందరికినీ యీమె పూజింపదగినదని భావింపుము. నీవు

యీమెతో కలిసి సత్యలోకమునకు పొమ్ము. అక్కడనుండి ప్రజలను సృష్టించుము. జీవులందరిని వారి వెనుకటి కర్మలనుబట్టి మునుపటివలెనే మరల సృష్టింపుము. ఇట్లు పదునాలుగు లోకములను సృష్టించుము. శ్రీమహావిష్ణువు సత్వగుణ ప్రధానుడు. అందువలన అతడు నీకంటె శ్రేష్ఠుడు. నీవెల్లప్పుడును వానిని గౌరవించి పూజించ వలెను. లోకములో అధర్మము ప్రబలినపుడు శ్రీహరి ధర్మసంరక్షణము నకై అవతరించును. అతడు అనేక అవతారముల నెత్తి రాక్షసులను నశింపజేసి సజ్జనులకు సంతోషమును కలిగించును. మహాబలశాలియగు శివుడు కూడ నీకు తోడుగా నుండును. అప్పుడు నీవు సమస్త ప్రపంచములను సృష్టించి స్వేచ్ఛగా విహరించుము. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు అందరు శాస్త్ర ప్రకారముగ గొప్ప గొప్ప దక్షిణలతో మిమ్ములను గూర్చి యజ్ఞములను చేయుదురు. దేవతలు యాగములలో అమృతమువలె మధురమైన నా నామమును జపించుచు సంతో షింతురు. పరమశివుడు తమోగుణ ప్రధానుడు. అతడు అన్ని యాగములలోను పూజ్యుడు. రుద్రాభిషేకములను పొందును. దేవతలకు రాక్షసులవలన భయము కలిగినపుడు నాదివ్యశక్తులు జన్మించి దేవతల భయమును తొలగించి వారిని కాపాడును.

నాదివ్యశక్తులు లోకోత్తరమైన పనులను చేయగలవు. ప్రణవరూపమైన నా రహస్య నవాక్షర మంత్రమును బీజాక్షరములతో పాటు ధ్యానముతో నెల్లప్పుడు జపించుచు నీ పనులనన్నిటిని చక్కబెట్టుకొనుము. ఈ మంత్ర రాజము కోరికల నన్నిటిని నెరవేర్చగలదు. ఈ మంత్రమును యే మరుపాటు లేకుండా హృద యములో నిలుపుకొనుము.

అని జగన్మాత బ్రహ్మకు చెప్పి చిరునవ్వు చిందిస్తూ శ్రీహరితో ఈ విధముగా చెప్పినది:- ఓ విష్ణూ! నీవు అందగత్తెయగు నీ లక్ష్మీదేవిని స్వీకరించుము. ఈమె నీ వక్ష స్థలమున నివసించును. ఈమె సిరిసంపద లకు గనివంటిది. నీవిలాసమున కనుకూలముగా ఈ కల్యాణిని నీకు సమర్పించుచున్నాను. ఈమె సమస్తలోకము లకు వెలుగు. ఈమెను నీ వెన్నడు నిందింపవద్దు. గౌరవాదరములతో చూడుము. నేను మీకు ఈరీతిగా కార్యభారమునకు సహాయము సమకూర్చితిని. దీనికి తిరుగు లేదు. దేవతల జీవనమునకు యజ్ఞములను నేర్పరచితిని. మీలోమీరు పోట్లాడు కొనకూడదు. ఓర్పుతో సమ భావముతో మెలగవలెను. మీరు ముగ్గురు సమానులే. త్రిమూర్తులును నావలన పుట్టినవారే. విష్ణువే శివుడు శివుడే విష్ణువు వీరిరువురకు భేదమును భావించువాడు నరకమునకు పోవును. అట్లే బ్రహ్మయు. ఈ విష యమున సంశయింప పనిలేదు. వాగ్బీజము మాయా బీజము, కామబీజము గల

మంత్రము సమస్తములైన కోరికలను తీర్చగలదు. దీనిని నీకు ప్రసాదించితిని. ఈ మంత్రమును నియమముతో జపించుము. నీకు మృత్యుభయముండదు. నేను మాయాశక్తితో విహరించుచున్నంతకాలము జగత్తులుండును. చివరకీ చరాచర ప్రపంచము నాలో లీనమగును. అంతవరకు నీ మంత్రమును నిత్యము జపించుము. విష్ణూ ఇక నీవు వైకుంఠమును నిర్మించుకొని దానిలో సుఖముగా నివసించుము. నన్నెప్పుడును ధ్యానించుచుండుము. అని యిట్లు పరదేవత విష్ణువుతో పలికినది. పిమ్మట శంకరుని చూచి అమృతము కురియుచున్నట్లు మధురముగా నిట్లుపలికెను.

ఓ మహాదేవ! నీవు సర్వశక్తి మయ స్వరూపయగు మహాకాళి గౌరిని స్వీకరించుము. నీవు కైలాసము నిర్మించుకొని అచ్చట స్వేచ్ఛగా నుండుము. నీకుతమో గుణము ప్రధానముగా నుండును. పరమాత్మను నిత్యము స్మరించుచు జాగరూకతతో తపస్సు చేయుము. నీవు సత్త్వగుణ సంపన్నుడవై శర్వరూపమును పొందెదవు. ఇట్లు మీరు ముగ్గురు త్రిగుణములతో సృష్టిస్థితి సంహారములను చేయుడు. అన్ని జగత్తులకును త్రిగుణములే మూలస్తంభములు. ఈప్రపంచ ములో ప్రతి వస్తువు త్రిగుణములతో కూడియే యుండును. నిస్సారమైన ఈ ప్రపంచమున నిర్గుణ తత్త్వమును చూడగలవాడు లేడు. పరమాత్మయే నిర్గుణ స్వరూపము. ఓ శంకరా! నేను సృష్టికాలమున గుణసహితురాలను లయ కాల మందు నిర్గుణ స్వరూపము కలదానను. పరమపురుషుని సమాగమమున సగుణనై యుందును. నేను సర్వమునకు కారణమైనదానను. అహంకారము త్రిగుణము లతో కూడినది. దానినుండి పంచతన్మాత్రలు వాటినుండి పంచ మహాభూతములు పుట్టినవి. ఇట్లు మీకు సంక్షేపముగా సృష్టిక్రమమును చెప్పితిని. ఇక మీరు విమానములమీద మీస్థానములకు వెళ్ళి మీమీ పనులను నిర్వహించుడు. మీకు ఆపద వచ్చినప్పుడు నన్ను మనస్సులో స్మరింపుడు. నేను మీ బాధలను తొలగించి శుభములను కలిగింతును. దేవతలారా! నన్ను సనాతన పరమాత్మ స్వరూపముగా నిత్యము స్మరింపుడు. మాలో నెవరిని తలచుకొన్ననూ మీకు కార్యసిద్ధి యేర్ప డును. మీరు మా మీదనే ప్రేమ విశ్వాసములనుంచుడు. లోకములో నితర వస్తువులను నమ్ముకొని మోసపోవద్దు. అవి నీటిబుడగలవంటివి.

ఈ విధముగా ఆ మహాశక్తి మాతో మాట్లాడి మమ్ము సంస్కరించి శ్రీమహా లక్ష్మిని విష్ణువునకు, మహాకాళిని శివునకు సరస్వతిని నాకు (బ్రహ్మకు) అర్పించి జగదంబ మమ్ము విడిచి వెళ్ళినది. ఆ ప్రదేశమును విడువగానే మేము పురుష

రూపములతో ప్రకాశించితిమి. అప్పుడిది అంతయు ఆదేవి యొక్క మానవాతీతము అలౌకికము అత్యద్భుతమైన ప్రభావమని మేము గ్రహించితిమి. మేమపుడు ఆదివ్యవిమానము నెక్కితిమి. అప్పుడు దేవీద్వీపము, అమృత సముద్రము అన్నియు మాయమైనవి. ఇది బ్రహ్మ నారదునకు చెప్పిన అద్భుత మైనగాథ.

## శక్తి తత్త్వప్రతిపాదనము

బ్రహ్మ నారదునితో మరియు నిట్లనెను. శక్తి స్వరూపమును జ్ఞానశక్తి, క్రియాశక్తి, అర్థశక్తియని మూడువిధములు అనియు, జ్ఞానశక్తి సత్త్వగుణమునకు, క్రియాశక్తి రజోగుణమునకు అర్థశక్తి తమోగుణమునకు సంబంధించి నట్లుగను గ్రహించుము. పరమాత్మకు స్థూలరూపము, సూక్ష్మరూపము అని రెండు రూపములున్నవి. మొదటిది నిరాకారము జ్ఞానరూపము వివర్తముల కన్నింటికిని కారణమైనది. రెండవది సాకారము సగుణము. ధ్యాన సమయ మందు దేవియొక్క దయాస్వరూపము నుపాసించవలెను. అది దేవిస్థూలరూపము. పరమాత్మలోని స్వరూపము సూక్ష్మము. ఆ సూక్ష్మరూపమునే సూత్రాత్మకమని పండితులు చెప్పుచున్నారు. పంచీకరణముచేత ఆకాశము మొదలగు పంచభూతములు నేర్పడినవి. ఆకాశమునకు శబ్దమొకటియే గుణము. వాయువునకు శబ్దము స్పర్శ రెండు గుణములు. అగ్నికి శబ్ద స్పర్శరూపములు మూడుగుణములు. నీటికి శబ్దస్పర్శరూప రసములు నాలుగు గుణములు. భూమికి శబ్దస్పర్శ రూప రస గంధములు ఐదు గుణములు. ఈ గుణముల కలయికచేత బ్రహ్మాండము పుట్టినది అని బ్రహ్మ నారదునకు చెప్పెను.

## బ్రహ్మ నారదునకు త్రిగుణస్వరూపము వివరించుట

నారదుడు త్రిగుణముల స్వరూపమును గూర్చి వివరించి చెప్పుమనగా బ్రహ్మ ఆతనికిట్లు చెప్పెను. సత్త్వగుణమొక్కటియే యెచ్చటను నిలిచియుండదు. తక్కిన గుణములతో కలిసియే గోచరించుచుండెను. ఇంద్రియములు సమస్తావయవములు స్వచ్ఛముగా వికాసము చెందునప్పుడు మనస్సు నందే కోరికలులేనప్పుడు సత్త్వగుణము ప్రకాశించుచున్నదని తెలియవలయును. చంచలత్వము ఆవులింత స్తంభము సోమరితనము రజోగుణలక్షణములు, వివాదములందు చిక్కుకొనుట శరీరము బద్ధకించుట మొదలగు లక్షణములు గలది తమోగుణము. తమోగుణము వృద్ధి చెందినప్పుడు మనస్సు ఇంద్రియములును క్రియాశూన్యములగును. అని అంతట నారదుడు పరస్పర విరుద్ధములగు నీ మూడుగుణము లెట్లుకలిసి యుండునో వివరింపుమనగా బ్రహ్మ యిట్లు పలికెను.

ఆ గుణములు దీపకాంతి లక్షణముకలవి. వత్తితైలము జ్వాలపరస్పర విరుద్ధములైయైనను మూడును కలిసి వస్తువులను కనబడునట్లు చేయుచున్నవి కదా! అట్లే యివియును కలిసి వుండును. ఇవి సంసారమునకు కారణములన్నీ బ్రహ్మనుండి వింటినని నారదుడు వ్యాసునకు తెలుపగా వ్యాసుడు జనమేజయునకు చెప్పెను. గుణములన్నిటిని కల్పించి జగన్నాటక మాడించు ప్రకృతి మహాశక్తి యెల్లరకు నారాధ్యదేవత. ఆ మహామాయా శక్తియే బ్రహ్మ విష్ణు రుద్రాదిదేవతలను గుణకర్మ విభాగము ననుసరించి సృష్టించును. అందరును ఆశక్తి సహాయముచేతనే పనులను నిర్వర్తింపగలుగుచున్నారు. కనుక జనమేజయా! దేవీ యజ్ఞమొనర్చి ఆ తల్లి నారాధింపుము. ఆ మాతృదేవి హరిహరబ్రహ్మలచే ఆరాధింపబడినది. అడవిలో క్రూరములైన మృగముల చూచి భయముతో "ఐ,ఐ" అని సున్న ప్రక్కన చేర్చకుండ ఉచ్చరించినను దేవి వాని భయమును పోగొట్టి కోరికలను తీర్చును. ఇందుకు సత్యవ్రతుని చరిత్ర దృష్టాంత మని చెప్పి యా చరిత్ర నిట్లు వివరించెను.

## సత్యవ్రతుని చరిత్రము- వాగ్బీజ మహిమ- వాగ్బీజ ప్రభావమున సత్యవ్రతుడు సిద్ధినొందుట

ఓ జనమేజయా! ఒకప్పుడు నేనొక మునిసమూహములో గొప్ప పౌరాణికదివ్య కథను వింటిని. నేను తీర్థాటనము చేయుచు పవిత్రమగు నైమిశారణ్యము చేరితిని. అచట మహావ్రతులు, జీవన్ముక్తులు, మునిశ్రేష్ఠులునగు బ్రహ్మకుమారులు నివసించుచుండిరి. నేను వారెల్లరకు నమస్కరించితిని. అప్పుడచట సత్కథా కాలక్షేపము జరుగుచుండెను. వారిలో జమదగ్నిముని తక్కిన మునుల నిట్లు ప్రశ్నించెను. ఓ మహాతాపసులారా! బ్రహ్మ విష్ణు శివాదిదేవతలలో ఎవరు గొప్ప కోరికలన్నియు ఒకేమారు త్వరలో తీర్చి పూజలందుకొను దేవదేవోత్తము లెవరు? దేవతలందరిలో అతిశీఘ్రముగా సులభముగా ప్రసన్నుడగు దేవుడెవడు? అని ప్రశ్నించెను. ప్రశ్నను విని లోమశమహర్షి ఓ జమదగ్ని మునీ! నీ ప్రశ్నకు సమాధానము చెప్పెదను వినుమని లలితాదేవిని ఆరాధించి అన్ని కోరికలను తీర్చుకొనవచ్చునని యు ఆమె అంతకును మూలమైనదనియు, దేవలకెల్లరకు తల్లి యనియు, దయార్ద్రహృదయు రాలనియు, ఆమె అందరిచే సేవింపబడుచుండునని చెప్పి యీ విషయమున నొకకథ చెప్పెదని వినుమని యిట్లు పలికెను.

పూర్వమొక బ్రాహ్మణుడు ఒక దివ్యాక్షరము చ్చరించిన మాత్రముననే గొప్ప సిద్ధిని కైవసము చేసికొనెనని ఆ కథ చెప్పనారంభించెను. కోసలదేశమున దేవదత్తు

డను బ్రాహ్మణుడు సంతానము లేనివాడై యాగమొనర్చెను. ఆ యాగములో గోభిలుడనువాడు అప్రశుతిగ స్వరభంగముగా మంత్రము నుచ్చరించుటచే దేవదత్తుడాతని మూర్ఖుడవని నిందింపగా గోభిలుడు కోపముతో నీకు జన్మించు పుత్రుడు మూర్ఖుడు మాట నుచ్చరింపలేని వాడు అగుగాక యని శపించెను. దేవదత్తుడు భయపడి శాపమును తొలగింపుము, అనుగ్రహింపుమని యాతని పాదములపై తలనుంచి ప్రార్థించెను. అంతట గోభిలుడు దయార్ద్రహృదయుడై దేవదత్తునితో నీ కుమారుడు మూర్ఖుడయ్యును విద్వాంసుడై పేరు పొందునని అనుగ్రహించెను. దేవదత్తుడు యజ్ఞము పూర్తి చేసిన కొన్నిదినములకు ఆతని భార్య గర్భవతియై శుభలగ్నమున చక్కని కుమారుని కనెను. ఆ కుమారునకు "ఉతథ్యుడ"ని పేరు పెట్టిరి. అతని యెనిమిదవ ఏట ఉపనయనము చేసిరి. గురువు వేదము చెప్పగా ఉతథ్యుడు పలుకలేకుండెను. తల్లిదండ్రులనేకవిధముల ప్రయత్నించినను ప్రయోజనము లేకపోయెను. నలువురు నతనిని పరిహసించుచుండిరి. బంధువులు తల్లిదండ్రులు కూడ నిందించుటను సహింపలేక పవిత్ర గంగాతీరమునకు టీరమేర్పరచుకొని అందు నివసించుచుండెను. ఎప్పుడైనను అసత్యము పలుకనని ప్రతిజ్ఞ చేసినందున లోకులతనిని సత్యతపుడని పిలువజొచ్చిరి. చదువు రానందులకు అనేకవిధముల పరితపించుచు పదిహేను సంవత్సరములు గడిపెను. నిత్యము సత్యమే పలుకుచుండుట వలన అతనికి సత్యతపుడను పేరు సార్థకమయ్యెను. అతని కీర్తి నలుదెసల వ్యాపించెను. ఒకనాడు బోయవాడొకడు బాణముతో పందిని కొట్టగా అది గడగడలాడుచు సత్యతపుని వద్దకు వచ్చెను. దానిని చూచి దయార్ద్రహృదయుడై సత్యతపుడు "ఐ" అని పందినదలించెను. అది మూలుగుచు ఆశ్రమపు పొదరిటిలో దూరెను. బోయవాడు పందిని వెదకుచు మునివద్దకు వచ్చి నమస్కరించి యిట్లనెను.

"ఓ మునీ! నా పంది యెటు పరుగెత్తెనో చెప్పుము. నీవు సత్యవ్రతుడవని పేరు పొందితివి. అని అడగగా ఆతడు పందిని బోయవాడు హింసించునని సత్యము చెప్పజాలకపోయెను. బోయవాని ఆకలిని చూచి సత్యము చెప్పవలెననియు తలచెను. ఈ రెండు విషయములు నెట్లు జతపడునని విచారించుచుండెను. అంతలో తలనని తలంపుగా "ఐ" అని పలికెను. అందుకు సరస్వతీ శక్తి సంతసించి అతడు తన వాగ్బీజమునే పలికెనని యతనికి గొప్ప పాండిత్యము ననుగ్రహించెను. ఆ వాగ్దేవతా ప్రభావముచే నతడు మహాకవి యయ్యెను. తన ముందు నిలిచియున్న బోయవానిని జూచి ఓ కిరాతా! పలుకునది చూడదు

చూచునది పలుకదు. కనుక నన్ను నీవేల ప్రశ్నించెదవు? అని సత్యవ్రతుడు పలుకగా కిరాతుడు పందిపై ఆశ విడిచి యింటికి వెళ్ళెను. పిమ్మట సత్యవ్రతుడు పండితుడుగా కవిగా గొప్ప కీర్తి గడించెను. వెనుకనతనిని నిందించి హేళన చేసినవారే అతని ప్రభావము తెలిసికొని మరల యింటికి తీసికొని వెళ్ళి ఆదరాతిశయముతో చూచి యాతని సత్కరించిరి.

# దేవీ యజ్ఞవిధానము

జనమేజయుడు దేవీ యజ్ఞము యొక్క విధానమునడుగగా వేదవ్యాసు డిట్లు చెప్పెను. సాత్వికమైన యజ్ఞము మిక్కిలి దుర్లభము ఈ యజ్ఞము వైఖానస వ్రతనిష్ఠకల మునివర్యులకే చెప్పబడినది. తపస్సు చేయువారు న్యాయముగా సంపాదించినట్టియు అరణ్యమున దొరికిన సాత్వికమైన ఆహారమును భుజింతురు. ఆయాహారము మిక్కిలి మేలుచేయునది. ఇతరుల మేలుకోరి శ్రద్ధా భక్తులతో మంత్రసహితముగా చేయబడు యజ్ఞములు సాత్త్వికములు, ఇక రాజస యజ్ఞములు అధికద్రవ్యముతో కూడి యూపస్తంభము గలిగి అభిమానముతో కూడియుండును. ఇవి క్షత్రియులకు వైశ్యులకు చెప్పబడిన యజ్ఞములు. తామస యాగములనగా కామక్రోధలోభమదములగు దుర్గుణములను పెంచునట్టివి. క్రూరములైనవి యగు యాగములు. అవి రాక్షసులకు అని మహాత్ములు చెప్పినట్టివి. మహాత్ములైన మునులకు మానస యజ్ఞము చెప్పబడినది.

ఈ యాగములలో మానస యజ్ఞమొక్కటియే దోషరహితము పరిపూర్ణము పరిశుద్ధమునై ప్రకాశించునది. మొదట మనస్సును సంకల్ప రహితముగ నిష్కల్మషముగ నుంచుకొనవలెను. రాగద్వేషములు నశించినచో మనస్సు పరిశుద్ధమగును. నిర్మలమైన మనస్సు కలవాడే యజ్ఞము చేయుటకు సరియైన అధికారి. అట్టి అధికారి తన హృదయమున యజ్ఞ వృక్షస్తంభములతో సుదీర్ఘమైన చల్లని దేవీ మండపమును కల్పించుకొన వలయును. ఆ మండపములో తన పవిత్రమైన మనస్సుతో చక్కని యజ్ఞవేదికను కల్పించుకొని ఆ వేదికపై అగ్నులను శాస్త్ర ప్రకారము తన మనస్సుతో ప్రతిష్ఠించుకొనవలయును. ఆ మానసయాగమునకు బ్రహ్మ, అధ్వర్యుడు, హోతఉద్గాత ప్రతిహర్త ఇతర సభ్యులు మొదలగు బ్రాహ్మణులను శాస్త్రప్రకారము ఋత్విక్కులుగా వరించాలి. ఆ ఋత్విక్కులను మనస్సుతోనే యధావిధిగ పూజించాలి. ఆ యజ్ఞవేదిక యందు ప్రాణము, అపానము, వ్యానము ఉదానము సమానము అనే ఐదు ప్రాణములు, ఐదు అగ్నులు వాటిలో ప్రాణము గార్హపత్యాగ్ని, అపానము ఆహవనీయాగ్ని వ్యానము దక్షిణాగ్ని సమానము

ఆవసధాగ్ని ఉదానము సభ్యాగ్నిగను చెప్పబడినవి. ఈ పంచాగ్నులు మిక్కిలి శ్రేష్ఠమైనవి. కోరికలను తీర్చునవి కూడా. తరువాత మనస్సునందు మిక్కిలి పవిత్రములైన నిర్గుణ ద్రవ్యములను భావించి సమకూర్చుకోవలయును. ఈ మానస యజ్ఞములో మనస్సును హోమముచేయు యజమానిగ నెన్నుకోవల యును. యజ్ఞాధి దేవతగా నిర్గుణ సనాతన బ్రహ్మముండవలెను.

పిమ్మట నిర్గుణ జగదంబ నుద్దేశించి కల్పించిన వస్తువులను బ్రహ్మాగ్నిలో హోమమును చేయవలయును. పిమ్మట మనస్సును ప్రాణమును సంకల్ప రహితములుగ చేయవలెను. ప్రాణములను కుండలినీ మార్గమున పరబ్రహ్మ మందు లగ్నము చేయవలయును. అప్పుడు సంకల్పవికల్పములు బ్రహ్మ సమాధిలో నశించి పోవును. సాధకుడు తన యనుభవముతో సర్వాత్మభూతమైన మహేశ్వరిని స్వయముగా సమాధిలో నిర్వికల్పుడై ధ్యానించవలెను. అప్పుడా యోగి సర్వప్రాణు లను తన యాత్మలోను తనను సర్వభూతాత్మలోను ఉన్నట్లు తెలిసి కొనగలుగును. అప్పుడు పరమ దివ్యమంగళ విగ్రహయగు శ్రీదేవీ దర్శన భాగ్యము ననుభవించును. ఆ పరమయోగి సచ్చిదానంద స్వరూపిణియగు పరదేవత యందు లీనమై బ్రహ్మానందము ననుభవించును. ఈవిధముగ జగదంబను మానస యాగ మున ధ్యానించువాడు సోమయాగము చేసిన ఫలమును పొందును. కృతకృత్యుడు జీవన్ముక్తుడు కూడనగును. వాని కోరికలన్నియు తీరును. అతడు మోక్షమును పొందును. ఇది నిజము. కనుక శ్రీభువనేశ్వరీ దేవిని గురూపదేశముచే ప్రయత్నించి తెలిసికొని ధ్యానింపవలెను. ఇట్లు నిశ్చలముగ మానసయజ్ఞము చేసినచో పరమపద సౌఖ్యమనాయాసముగ పొంద[illegible]చ్చు. ఇతర యాగములు కోరికలతో కూడినవి క్షీణఫలములు. అని వ్యాసమహర్షి జనమేజయునకుప దేశించెను.

## శ్రీమహావిష్ణువు చేసిన దేవీయజ్ఞమును వ్యాసుడు జనమేజయునకు వివరించుట

ఒకప్పుడు వైకుంఠమందున్న విష్ణువు అమృతసముద్రములోని మణు లతో అలకరింపబడిన ద్వీపమును తలచుకొన్నాడు. పూర్వమక్కడనే తాను మహా మాయను చూచి ఆమెనుండి మంత్రమును కూడా ఉపదేశమును పొందెను. తనను స్త్రీగా మార్చిన ఆ మహాశక్తిని తలచుకొని యజ్ఞము చేయదలపెట్టెను. విష్ణువు తన భవనమును విడిచి ఈశ్వరుని బ్రహ్మను వరుణుని ఇంద్రుని కుబేరుని వసిష్ఠకశ్యపదక్ష వామదేవ బృహస్పతుల నాహ్వానించి దేవీయజ్ఞమును నెరవేర్చుటకు

అతివిస్తారమైన వస్తు సమూహమును కల్పించెను. ఆవస్తుసమూహము మహా వైభవముతో మనోహరమై సాత్త్వికముగా నుండెను. శిల్పులచేత విశాలమైన మండప మును తయారు చేయించెను. నియమవంతులైన ఇరవై యేడుగురు ఋత్విక్కులను ఏర్పరచెను. విశాలమైన యజ్ఞవేదికను నిర్మించి దానిపై అగ్నిని ఉంచి శ్రీదేవీ బీజాక్షరములతో కూడిన దేవీ మంత్రములతో హోమము చేసిరి. అప్పుడాకాశవాణి మధురమైన కంఠస్వరముతో ఈ విధముగా పలికినది - ఓ విష్ణువా ! నీవు దేవతలందరిలో శ్రేష్ఠుడవు దేవత లందరకు పూజనీయుడవు సమర్ధుడవు. ఇంద్రాదిదేవతలు నిన్ను పూజింతురు.

మానవులు నీయెడల మధురభక్తి పరిపూరితులై ఉందురు. మానవు లందరికీ వరముల నిచ్చువాడవుగా ప్రఖ్యాతి పొందినవాడవు. యజ్ఞములలో ముఖ్య దేవతవు యజ్ఞము చేయువారందరు నిన్ను పూజింతురు. రాక్షసులచే బాధింపబడి దేవతల నిన్ను శరణువేడెదరు. నీ వందరకును వరములనిచ్చువాడవు. అభయ ప్రదుడవు. అన్ని పురాణములలోను వేదములందును నీవు మిక్కిలి పూజింప దగినవాడవుగా చెప్పబడుదువు. లోకములో ధర్మము తగ్గిపోవునప్పుడు నీవు భూమిపై నవతరించి ధర్మరక్షణమును చేయుదురు. భూమియంతటను నీ యవతారములు మిక్కిలి ప్రసిద్ధిచెందినవి. మహాత్ములకును నీ యవతారములు గౌరవింప దగినవి. అన్ని అవతారములలోను నీ శక్తియే అయిన లక్ష్మి నీకు సహచారిణిగా ఉండును. నాయంశచే ఆమె అన్ని పనులను సాధించగలదు. నేనిచ్చిన వరములతో దేవతల సమస్త కార్యములను నీవు సాధించగలవు. నాశక్తి స్వరూపము పలుతెరగులనున్నను. నీ వెన్నడును నాశక్తి స్వరూపములను కించపరచవద్దు. ఆ శక్తులు కర్మభూమియైన భరతఖండములో అన్ని కోరికలను నెరవేర్చగలవు. పూజింపదగినవి. మానవులా శక్తులను నిన్నుకూడ తను కోరికలు నెరవేరుటకై పూజింతురు.

ఓ మధుసూదనా! నీ మహిమ భూలోకమందు స్వర్గము నందును వృద్ధి నొందును. ఈ విధముగా విష్ణుమూర్తికి వరములిచ్చి ఆకాశవాణి విరమించించి నది. విష్ణుమూర్తి కూడ ఆ మాటలు విని సంతోషించి యధావిధిగా యజ్ఞమును పూర్తి చేసెను. దేవతలను మునులను సాగనంపి గరుడధ్వజుడు తన సేవకులతో వైకుంఠమునకేగెను. దేవతలు మునులు ఆశ్చర్యముతో ఒకరికొకరు యజ్ఞ విషయ ములను చెప్పుకొనుచు తమతమ ఆశ్రమములకు వెళ్ళిరి. ఆకాశవాణిని విని అందరును పరదేవత పై భక్తి భావము కలవారయిరి. బ్రాహ్మణులు మునులు భక్తితో పూజలు చేసిరి.

# ధ్రువ సంధి చరిత్ర - కామరాజ బీజమహిమ

జనమేజయుడు దేవీ మహోత్మ్యమును మరింత విపులముగా వినగోరుచున్నానని యడుగగా వ్యాసమహర్షి ఇట్లు చెప్పనారంభించెను. పూర్వము కోసల దేశమున సూర్యవంశమందు జన్మించిన "ధ్రువ సంధి" యను మహారాజు కలడు. అతడు పుష్పరాజు కుమారుడు. సత్యసంధుడు ధర్మపాలకుడునై ఆతడు అయోధ్యను రాజధానిగా భూమండలము నేలుచుండెను. రాజ్యమంతయు సుభిక్షముగా నుండెను. ధ్రువసంధికి మనోరమలీలావతి యను యిద్దరు భార్యలు కలరు. ఇద్దరును మంచి గుణములు కలవారు అందగత్తెలును. రాజు వివిధ భోగముల ననుభవించుచు భార్యలిరువురితో విహరించుచుండెను.

అంతనొక శుభదినమున మనోరమ సర్వ లక్షణ సంపన్నుడగు నొక కుమారుని కనెను. అతని పేరు "సుదర్శనుడు" లీలావతి కూడ ఆ మాసమునందే కుమారుని కనెను. రాజుకుమారు లిరువురకు జాతకర్మాది క్రియలనొనర్చెను. బ్రాహ్మణులకు భూరిదానములొసగెను. రాజకుమారుల నిరువురను సమభావముతో చూచు చుండెను. ఆ కుమారులిరువును జనరంజకులై తండ్రికి ప్రీతిపాత్రులై యుండిరి. రెండవ భార్య కుమారుని పేరు "శత్రుజిత్తు" రాజునకు శత్రుజిత్తుపై ప్రేమ అధిక మయ్యెను. సుదర్శనమని కంటె నాతడు ప్రియుడైయెను కొంతకాలము గడిచిన పిమ్మట ధ్రువసంధి వేటకు వెళ్ళెను. అచట అనేక మృగములను వేటాడెను. చివరకొక సింహము పొదరింటి నుండి బయటకు వచ్చుచుండగా దానిపై రాజు బాణము ప్రయోగించెను. ఆ సింహము కోపము గర్జించి రాజుపై దుమికెను. రాజభటులా సింహముపై బాణవర్షము కురిపించిరి. సింహము రాజుపై తీవ్రముగా దాడి చేసెను. రాజు ఖడ్గముచే దానిని కొట్టగా సింహము గోళ్ళతో దారుణముగా చీల్చి యాతనిని చంపెను. సైని కులు బాణములు ప్రయోగించి యా సింహమును చంపివైచిరి. సైనికులు రాజు మరణవార్తను మంత్రులకు తెలియజేసిరి. వసిష్ఠుడాతనికి అంత్యక్రియలు యథావిధిగా జరిపించెను.

పిమ్మట వసిష్ఠుడు ప్రజలును "సుదర్శను"ని రాజుగా చేయు టకు సమాలోచన చేసిరి. లీలావతి తండ్రి అల్లుని మరణవార్త విని తన మనుమనికి రాజ్యము నిప్పింపవలెనని అచటకు వచ్చెను. మనోరమ తండ్రియు వచ్చెను. వీరిరువును కాబోవు రాజును గూర్చి మంత్రులతో మంతనము లాడనారంభించిరి. లీలావతి తండ్రి యుధాజిత్తు మనోరమ తండ్రి వీరసేనుడు. నామనుమడు రాజు కావలె ననగా నా మనుమను మడే రాజు కావలెనని యిరువురును కలహించి

యుద్ధమునకు సిద్ధపడిరి. తీవ్రమైన పోరాట మిరువురకు జరిగెను. ఆ ఘోరయుద్ధములో యుధాజిత్తు తన తీవ్రబాణములతో వీరసేనుని సంహరించెను. అతని బలము దిక్కులకు పరుగెత్తెను. అంతట మనోరమకు తనకు తన కుమారునకు రక్షణకోరి సమస్తకార్యములందు నేర్పరియైన "విదల్లుడ"ను మంత్రిని పిలిచి నా కొడుకు బాలుడు నా తండ్రి మరణించెను. ఈ సమయమున చేయదగిన నాలోచించి చెప్పుమని కోరెను. అతని సలహాపై మనోరమ తన తండ్రికి అంత్యక్రియల నెపమున లీలావతితో చెప్పి తన కుమారుని వెంటబెట్టుకొని త్రికూట పర్వతమును చేరెను. అచట భరద్వాజమహర్షి యాశ్రమమున నిర్భయముగా నివసించుచుండెను. యుధాజిత్తు తన మనుమని రాజుగా చేసి రాజ్యభారము మంత్రులకు వప్పచెప్పి తన పట్టణమునకు వెళ్ళెను.

## మనోరమ సుదర్శనునితో మునిని శరణువేడుట

భరద్వాజ మునినీ భార్యవు? వెవరి ఇక్కడికేల వచ్చితివని ప్రశ్నింపగా మనోరమ తాను ధ్రువసంధి భార్యనని చెప్పి. ఈ బాలుడు నా కుమారుడు. శత్రుభయముచే మిమ్ము శరణువేడుటకు వచ్చితినని పలుకకగా మహర్షి కల్యాణీ నీవు నిర్భయముగా నీ కుమారుని పోషించుకొనుచునుండుమని మనోరమతో చెప్పెను. సైంధవ పరాభవము - విశ్వామిత్రుని ఓటమి వ్రాయవచ్చును.

## యుధాజిత్తును సుదర్శనుని చంపదలచుట

యుధాజిత్తు తన యింటికి వెళ్ళుచు దారిలో భరద్వాజాశ్రమమున సుదర్శనుడు తల దాచుకొని పెరుగుచున్నాడని తెలిసి అక్కడకు వెళ్ళి మంత్రిని సుదర్శనుని చంపుటకుపాయడిగెను. అంతట మంత్రి మహర్షి రక్షణలో నున్న సుదర్శనుని చంపినచో ముని కోపించి నిన్ను భస్మము చేయగలడని పలుకగా యుధాజిత్తు మునికి నమస్కరించి సుదర్శనుని చంపకుండనే వెడలిపోయెను.

## సుదర్శనుడు కామరాజ బీజమును జపించుట

మనోరమ యుధాజిత్తు వెళ్ళిన పిమ్మట స్వస్థచిత్తురాలై తన కుమారుని పోషించుకొనుచు నా యాశ్రమమందుండెను. సుదర్శనుడు ముని బాలురతో నిర్భయముగ ఆటలాడుచుండెను. ఒకనాడు మంత్రి విదల్లుడచటకు వచ్చెను. ముని బాలురు సుదర్శనునిక్లీబుడని పిలిచి హేళన చేసిరి. అది విని సుదర్శనుడు "క్లీం" కారమును మాటిమాటికి ఉచ్చరింపనారంభించెను. ఆ కామరాజ బీజము

నాతడు మనస్సులో జపము చేయసాగెను. పదకొండవ ఏట భరద్వాజుడతనికి ఉపనయనము చేసి వేదము నేర్పెను. "క్లీం" మంత్రప్రభావముచే సకలవిద్యా రహస్యములను గ్రహించి నదీతీరమున విహరించుచుండగా శ్రీదేవి దయతో ధనుస్సును బాణము లను కవచమును అంబులపొదులను వాని కనుగ్రహించినది. ఆ సమయమున కాశీరాజు కుమార్తె శశికళ సుదర్శనుని గూర్చి విని యాతనినే భర్తగా చేసికొన నిశ్చయించెను. ఒకనాటి రాత్రి జగదంబ శశికళకు కలలో కనబడి నా భక్తుడైన సుదర్శను వివరింపుము. అతడు నీకు అన్ని కోరికలను తీర్చగలవాడు. అని పలికి అంతర్ధానము చెందెను. ఒకనాడు శశికళ విహారమునకు వెళ్ళగా దారిలో నొక బ్రాహ్మణుడు కనిపించెను. ఆతనికి నమస్కరించి శశికళ ఎక్కడ నుండి మీరు వచ్చుచున్నారని ప్రశ్నింపగా భరద్వాజాశ్రమము నుండి వచ్చుచు న్నానని యతడు బదులుపలుకగా అచట విశేషము ఏమని మరల శశికళ యాత్రని ప్రశ్నిం చెను. ఆ బ్రాహ్మణుడు రాజకుమారుడు సుదర్శనుడు సమస్త సద్గుణములు గల సుందరమూర్తి అక్కడనున్నాడు. నీకాతడు భర్త కాదగిననవాడని చెప్పెను.

# శశికళ విరహ వర్ణనము

అంతట శశికళ యింటికి వచ్చి సుదర్శనుని పై మోహముతో బాధపడ దొడగెను. తన చెలికత్తెకు మాత్రము బాధపడుటకు కారణము సుదర్శనునిపై అనురాగము మాత్రమే యని వివరించెను. మరియు తాను భరద్వాజాశ్రమము కు వెళ్ళి యాతనిని చూడవలెనన్న తల్లిదండ్రుల చాటుపిల్లను గదాయని విచారిం చుచు తన తండ్రి స్వయంవరము నేర్పరచినచో నేనా సుదర్శనునే వరించెదను. అతడు రాజ్యము లేనివాడని వింటిని. ఐనను నాకతడే యిష్టుడు. అని నిర్ణయించు కొనెను. చెలికత్తెలు శశికళకు శైత్యోపచారములు చేయుచుండిరి. ఇంతలో ఆమె తండ్రి సుబాహువు తన కూతురు తనకు నచ్చినవానిని వరింపగోరుచున్నదని తెలిసికొని వెంటనే స్వయంవరము చాటించెను. స్వయంవరమునకు నచ్చు రాజ కుమారులకు బస లేర్పరచబడెను. స్వయంవర సభామండపము వివిధాసనము లతో అలంకరింపబడెను. అప్పుడు శశికళ చెలికత్తెతో నీవు నాతల్లి వద్దకు వెళ్ళి రహస్యముగ నా మాటగా ధ్రువసంధి మహారాజు పుత్రుడగు సుదర్శనుని నేను వరించి తినని చెప్పుము. నేనితరు వివరింపను. పూర్వము దేవి యితడే నీకు భర్తకాగలడని చెప్పినది. అనగా చెలికత్తె వెళ్ళి శశికళ తల్లికి విషయమంతయు తెలియజేసెను. తల్లిదండ్రులు సుదర్శనుడు రాజ్యము సైన్యము ధనము కూడ లేనివాడుకాన మరియొకని వివరించుమని చెప్పగా శశికళ యంగీకరింపలేదు.

అంతట అప్పుడగు నొక బ్రాహ్మణుని పిలిచి శశికళ సుదర్శనుని వద్దకు నాతని పంపుచు నిట్లుచెప్ప మనెను. "ఓ దేవసమానుడా! దేవి కలో కనిపించి నిన్ను వివాహము చేసికొనుమని చెప్పినది. నేను నిన్నే కోరుచున్నాను. నీకిష్టపడనిచో నాకు మరణమే శరణము జగదంబ మాటను సత్యము చేయు బాధ్యతనీది"అని ఆ బ్రాహ్మణుడు శశికళ మాటలను సుదర్శనునకు చెప్పి తిరిగివచ్చెను. సుదర్శనుడు స్వయంవరమునకు వెళ్ళుటకు నిశ్చయించుకొనెను.

# సుదర్శనుడు స్వయంవరమునకు వెళ్ళుట

భరద్వాజ మహర్షి పరమాదరముతో శశికళను వివాహమాడుమని సుదర్శనుని ప్రోత్సహించెను. స్వయంవరమునకు ప్రయాణమైన కుమారుని చూచి మనోరమ వణకుచు కన్నీరుగార్చుచు నాయనా! ఒక్కడవే నీవు రాజసమూహముతో నిండిన స్వయంవరమునకు ఏ సహాయము లేకుండ ఎట్లు వెళ్ళదవు? దేని నాశ్రయించి నీవిట్లు సాహసించుచుంటివి? యని ప్రశ్నించెను. యుధాజిత్తు నిన్ను చంపుట కక్కడకు రాగలడు. కనుక నీవు వెళ్ళవద్దు. నేను నిన్నే నమ్ముకొని యున్నాను నన్ను నిరాధరను చేయవలదని పలుకగా సుదర్శనుడు ఓ యమ్మా! నీవేల విచారించెదవు? నేను ఆ జగజ్జనని ఆజ్ఞచే స్వయంవరమునకు వెళ్ళుచున్నాను. ఆ దేవియనుగ్రహముచే నాకెట్టి భయమును లేదని బయలుదేరిన కుమారుని మనోరమ ఆశీర్వదించి పంపెను. స్వయంవరమునకు యుధాజిత్తు తన మనుమని వెంటబెట్టుకొని వచ్చెను. అనేక రాజకుమారులు స్వయంవర సభలో కూర్చొని యుండిరి. శిష్టులైన రాజులందరు సుదర్శనునితో యుధాజిత్తు నిన్ను చంపుటకు వచ్చియున్నాడు. నీకు సైన్యముగాని సహాయము చేయువారు గాని లేరు. కనుక తిరిగివెళ్ళుమని పలికిరి. సుదర్శనుడు శ్రీదేవి ప్రేరేపించి నన్ను పంపినది. నాపై నెవడైన సగబూనినచో నా దేవియే వానిని దండింపగలదు. దైవమునే నమ్మియున్నానని సమాధాన మిచ్చెను.

# స్వయం వరమును గూర్చిన వాదోపవాదములు

సుదర్శనుని మాటలు విని రాజులు ఒకరి ముఖమొకరు చూచుకొనిరి. మరియు సుదర్శనునితో నిట్లనిరి. ఓ సాధూ! నీవు పలికినది నిజమే. అందు సందేహమేయు లేదు. కాని ఉజ్జయినీ రాజు నిన్ను చంపుట కెదురు చూచున్నాడు. మేము నీమీద దయకొలది చెప్పుచున్నాము. నీకేది తగినదితోచిన దానిని మనస్సులో బాగుగా విచారించి చేయుము. అని పలికిరి! అపుడు సుదర్శనుడు

ఓ రాజులారా! మీరు నాపై ప్రేమతో పలికిన మాటలు సత్యములే. జగత్తంతయు దైవము పై నాధారపడి యున్నది. నాకు మరణము దైవము నిర్ణయించినచో ఎట్లైనను తప్పదు. దేవుడు కూడ కాలము రానిదే యే ప్రాణిని చంపలేడు. నేనెవ్వనికిని భయపడుట లేదు. భగవతి మధురనామ స్మరణము చేయుచున్నాను. యుధాజిత్తు పై నాకు వైరభావము లేదు. అతనికి నాపై వైరభావమున్నచో దాని ఫలమునడే యనుభవించగలడు అని పలికెను. సుదర్శనుని మాటలకు రాజులు సంతసించి వెడలిపోయిరి. సుదర్శనుడు తన వసతికి వెళ్ళెను. అంత నొక శుభసమ యమున రాజులనందరను స్వయంవర సభాభవనమునకు రావలసినదిగా సుబాహువు - ఆహ్వానించెను. రాజులందరు శుభాలంకారముల ధరించి శుభాసన ములపై కూర్చుండిరి. అప్పుడు శశికళ తండ్రితో నేను సుదర్శనునే వరించితిని. నీవు నామేలుకోరినచో శుభముహూర్తమున నన్ను సుదర్శనునకిచ్చి వివాహము చేయుము. ఈ స్వయంవరము వ్యర్థమని పలికెను. అంతట సుబాహువు చింతాకు లుడై రాజులందరి వద్దకు వెళ్ళి నా భార్యయు నేనును ఎంత నచ్చచెప్పినను నా కుమార్తె స్వయంవరసభకు రాననుచున్నది. అని చేతులు జోడించి వినయ పూర్వక ముగా చెప్పెను. మీరందరు నా పుజాదికము స్వీకరించి మీ మీ నివాసములకు వెళ్ళుడని పలికెను.

అప్పుడడు యుధాజిత్తు కోపించి నీవు నీ కుమార్తెను సుదర్శనునకీయదలచి యిట్లు మాట్లాడుచున్నావు. కనుక సుదర్శనుని ముందు చంపి తదుపరి నిన్ను సంహరించి నా మనుమనికి నీ కుమార్తెతో పెండ్లి చేయుదుననెను. మరియు విచారించి భార్యతో నాలోచించి తగిన పని చేయుమని గర్జించెను. సుబాహువు భార్యతో నా విషయము చెప్పి యిరువురును శశికళను మార్చచూచిరి కాని సాధ్యపడలేదు. శశికళ తల్లిదండ్రులకు మీరు నన్ను సుదర్శనునకు ధారపోసి మమ్ము పట్టణము వెలుపలకు సాగనంపుడు నా భర్త నన్ను రథముపై నెక్కించుకొని స్వేచ్ఛగా ప్రయాణింపగలడు. మీరు చింతింపవద్దు కానున్నది కాకమానదు. ఒకవేళ నీపై యెవరైన యుద్ధమునకు వచ్చినచో ఆ దేవియే మనలనందరను రక్షింపగలదని చెప్పెను. సుబాహువు తన కుమార్తెను సుదర్శనునకిచ్చి వివాహము చేయుటకే నిశ్చయించి రాజులనందరను బ్రతిమాలి నేడు స్వయంవరము జరుగుటలేదు. రేపు జరుగగలదు. నేడు నా కూతురిక్కడకు వచ్చుట కిష్టపడనందున ఇట్లు చెప్పవలసి వచ్చినది. రేపు ఆమెను ఒప్పించి సభకు రప్పింతునని చెప్పగా నందరు తమతమ విడిది యిండ్లకు వెళ్ళిరి. అంతట సుబాహువు పురోహితులను పిలిచెను.

# శశికళ సుదర్శనుల వివాహము

వేదవేత్తలైన పురోహితులతో రహస్యమందిరమున సుబాహువు తన కుమార్తెకు సుదర్శనునితో వివాహము జరుపుటకు సిద్ధపడెను. వరునకు మంగళస్నానము చేయించిరి. వివాహాలంకరణము నొనర్చిరి. రాజు సుబాహువు వరుని పెండ్లి మండ పమునకు తీసికొని వచ్చి అతనికి పూజావిధుల నెనర్చెను. సుబాహువు వరునకు వస్త్రభూషణాదుల నొసంగి యధావిధిగా కన్యాదాన మొనర్చెను. మనో రమ మనస్సు చింతలేనిదయ్యెను. సుదర్శనునకు సుబాహువు పెండ్లి కట్నముగా రెండువందల రథములను అంబులపొదులను నూటయిరువది యైదు మత్తగజ ములను దాసీశతమును రెండువేల గుఱ్ఱములను ధాన్యముతో నిండిన రెండు వందల బండ్లను సమర్పించెను. పిమ్మట రాజపుత్రి రాజమాత యగు మనోరమకు నమస్కరించి నీకు దాసుడను. నీ మనస్సులోని విషయము తెలుపుమనెను. అప్పుడు మనోరమ యిట్లనెను. నీకు మేలగుగాక నీ కులము వృద్ధిచెందుగాక. నీ కన్యారత్నము నిచ్చి సమ్మానిం చితివి. రాజ్యభ్రష్టుడైన నా పుత్రునకు నీ కుమార్తె నిచ్చితివి. ఇంతమంది రాజులతో వైరమునకు సిద్ధమైన నా కుమారునకు పిల్లనిచ్చిన నీ ధైర్యముకొని యాడదగినది. యని పలుకగా సుబాహువు సంతోషముతో ఇదిగో నా రాజ్యము తీసికొనుము. నీకు నేను సేనాపతిగా నుందును. లేనిచో నా రాజ్యములో సగభాగము తీసికొని కుమారునితో రాజ్యసుఖముల ననుభవింపుమని మనోరమకు చెప్పెను. మనోరమ మమ్ము సాకేతవనమునకు పంపుము భవానీ దేవి నీకు శుభము కలుగజేయుగాక. పరాంబికాదేవిని స్మరించు నాకు చింత సుంతైన లేదని పలికెను. తెల్లవారినది రాత్రి వివాహము జరిగెనని తెలిసి రాజులెల్లరు నగరము వెలుపల కోపముతో మనము సుదర్శనుని చంపుదము శశికళను గ్రహించుదమని కేకలు వేసిరి. సుదర్శనుని వివాహమును సమ్మతించని వారెల్లరాతని మార్గము నడ్డగించి నిలిచిరి.

# శ్రీదేవి సుదర్శనుని కాపాడుట

వ్యాసుడు జనమేజయునితో నిట్లు పలికెను. పూర్వము సుబాహువను రాజు తనకుమార్తెను సుదర్శనుడను రాజు కుమారునకిచ్చి వివాహము చేసెను. తక్కిన రాజులందుకు కోపించిరి. వివాహానంతరము సుదర్శనుడు భార్యతో తన నివాసమునకు బయలుదేరెను. వివిధ ధనరాసులనిచ్చి సుబాహు తన కుమార్తె నత్తవారింటికి పంపుతూ సుదర్శనునితో పెద్ద సైన్యమును గూడ పంపెను. సుదర్శనుడు సైన్యము రథములతో వెంటరాగా భార్యతో కూడ రథమెక్కి

వెళ్ళుచుండగా శత్రురాజులాతని చుట్టుముట్టిరి. అప్పుడు సుదర్శనుడు భక్తి శ్రద్ధలతో జగదేకమాతయగు పరదేవతను శరణ జొచ్చెను. ఒక అక్షరముగల కామరాజమంత్రమును ఎడతెరపి లేకుండా జపించుచు నూతన వధువుతో వెళ్ళు చుండగా శత్రురాజులు పెద్దకోలాహల ముగా సైన్యముతో వచ్చి పెండ్లికుమార్తెను అపహరింపదలచిరి. కాశీరాజు శత్రువులను చంప పూనుకొనగా అతనిని సుదర్శనుడు నివారించెను. సుబాహువు కూడ మరికొందరు రాజులతో భేరీశంఖా దులను ప్రయోగించిరి.

యుధాజిత్తు శత్రుజిత్తులను వారు తీవ్రముగ బాణయుద్ధము చేయు చుండగా సుబాహువు తన యల్లునికి సాయము చేయుటకు సిద్ధపడెను. దారుణమగు సంగ్రామము సాగుచుండగా ఎక్కడనుండియో అనేకా యుధ ములు ధరించి సర్వాభరణభూషితమైన సింహ వాహనాసీనయగు దేవి. ప్రత్యక్షమైనది. దివ్యవస్త్రములు పూలదండలను ధరించి ఆ తల్లి ప్రకాశించు చున్నది. ఆ లోక మాతనుచూచి రాజు లెల్లరు ఆశ్చర్యపడిరి. సుదర్శనుడు మాత్రము దేవిని చూచి సుబాహువుతో ఇట్లు పలికెను. దివ్యమగు దర్శనము గల దేవి యనుగ్రహించుటకు దయతో ఆవిర్భవించినది. ఇప్పుడు నాకు భయములేదు అని యనెను. సుదర్శన సుబాహు లిరువురు ఆ దేవికి నమస్కరించిరి. అంతట దేవి వాహనమగు సింహము గర్జించి నది. శత్రువుల ఏనుగులు కంపించినవి. భయంకరముగ గాలులు వీచినవి. సుదర్శనుడప్పుడు తన సేనాపతితో నీవా శత్రురాజులున్న తావునకు వెళ్లుము దుర్మార్గులగు ఆ రాజులు కోపించినను ఏమి చేయగలరు? మనలను రక్షించుట కొరకే దేవి యిక్కడకు వచ్చినది. మనమిక నిర్భయ ముగా వెళ్ళవచ్చును. నేను రక్షించుమని స్మరించగానే పరదేవత ప్రత్యక్ష మైనది. అనగా సేనాపతి బయలు దేరెను. అప్పుడు యుధాజిత్ శత్రు జిత్తులను వారు సుదర్శనునితో యుద్ధానికి సిద్ధమయ్యారు. సుదర్శనుడు బాణాలతో వారిని ఎదుర్కొని యుద్ధము చేయ సాగెను. ఇట్లు యుద్ధము జరుగుచుండగా దుర్గాదేవి మిక్కిలి కోపించి యుధాజిత్తు పైబాణములను ప్రయోగించినది. జగదంబిక అనేక రూపాలతో అనేకములగు అస్త్రములు ప్రయోగించి భయంకరముగా యుద్ధము చేసినది. యుధాజిత్తు శత్రుజిత్తు లిరువురును మరణించిరి. జయజయ దుర్గాదేవి! అనుమాటలు మిన్ను ముట్టాయి. తక్కినరాజులు వీరి మరణము చూచి యాశ్చర్యపడిరి. అప్పుడు విజయము చేకూరిన సంతోష ముతో సుబాహువు దుర్గాదేవిని యిట్లు స్తుతించెను.

శ్లో॥ నమో దేవ్యైజగద్ధాత్ర్యై శివాయై సతతం నమః ।
దుర్గాయై భగవత్యైతే కామదాయై నమోనమః ॥

నమశ్శివాయై శాంత్యైతే విద్యాయైమోక్షదే నమః ।
విశ్వవ్యాప్త్యై జగన్మాతః జగద్ధాత్ర్యై నమశ్శివే ॥
నా హంధియా తవగతింపరిచింతయన్త్యై
జానామిదేవి! సగుణఃకిల నిర్గుణాయాః ।
కింస్తౌమి విశ్వజనని ప్రకట ప్రభావాం
భక్తార్తి నాశనపరాం పరమాంచ శక్తిమ్ ॥
వాగ్దేవతాత్వమసి సర్వగతైవ బుద్ధి
ర్విద్యామతిశ్చ గతిరప్యసి సర్వజంతోః ।
త్వాంస్తౌమికిం త్వమసి సర్వమనో నియంత్రీ
కిం స్తూ యతే హిసతతంఖలు చాత్మరూపామ్ ॥
బ్రహ్మా హరశ్చ హరిరప్యనిశంస్తువన్తి
నాంతం గతాస్సురవరాః కిలతేగుణానామ్ ।
క్వాహం విభేద మతిరంబ! గుణైర్వ్యతోవై
వక్తుంక్షమస్తవ చరిత్ర మహో ప్రసిద్ధః ॥
సత్సంగతిః కథ మహోనకరోతికామం
ప్రాసంగి కాపి విహితాఖలు చిత్తశుద్ధిః ।
జామాతురస్య విహితేన సమాగమేన
ప్రాప్తం మయాద్భుత మిదం తన దర్శనంవై ॥
బ్రహ్మాపివాంఛతి సదైవహరో హరిశ్చ
సేంద్రాస్సురాశ్చ మునయో విదితార్ధ తత్త్వాః ।
యద్దర్శనం జనని! తేఽద్యమయా దురాపం
ప్రాప్తం వినాదమశమాది సమాధిభిశ్చ ॥
క్వాహం సుమందమతి రాశుత వానలోకం
క్వేదంభవాని భవభేషజమద్వితీయం
జ్ఞాతాసి దేవి సతతం కిలభావయుక్తా
భక్తానుకంపన పరాఽమకవర్గ పూజ్యా
కిం వర్ణయామి తవదేవి చకిత్ర మేతత్
యద్రక్షితోఽసి విషమేత్ర సుదర్శనోఽయం
శత్రూహతేసుబలినే తరసాత్వయాయత్
భక్తాను కంపిచ్ఛ్రుతం పరమం పవిత్రం

నాశ్చర్యమే తదితిదేవి విచారితేర్థే త్వం
పాసి సర్వమఖిలం స్థిరజంగమంవై
త్రాతస్త్వయాచ విని హత్యరిపుర్దయాత:
సంరక్షితో యమధునాధ్రువ సంధిసూను:
భక్తస్యసేవన పరస్య యశో౽తి దీప్తం
కర్తుం భవాని రచితం చరితం త్వయైతత్
నోచేత్ కథం సుపరిగృహ్య సుతాం మదీయాం
యుద్ధే భకేతుశల వాననవద్యశీల:
శక్తాసి జన్మమరణాది భయాని హంతుం
కించిత్రమత్ర కిలభక్త జనస్యకామం
త్వంగీయసే జనని! భక్తజనై రపారా
త్వం పాపపుణ్యరహితా సుగుణా౽గుణాచ ।
త్వద్దర్శనాదహ మహో సుకృతీకృతార్థ:
జాతో స్మిదేవి! భువనేశ్వరి! భవ్యజన్మా ॥
బీజం న తేన భజనం కిలవేద్మి మాత:
జాతస్త వాద్య మహిమా ప్రకట ప్రభావ: ।

**స్తోత్రభావము :-** శ్రీవిద్య, మోక్షమిచ్చునది, అంతను వ్యాపించియున్న జగదేక మాతకు అంజలి ఘటించుచున్నాను. పరమశక్తి విశ్వమాతా! సగుణ నిర్గుణములలో నీ మార్గమేదో నాయల్ప బుద్ధికి గోచరించుటలేదు. నీవు భక్తుల కష్టములను తొలగించుదానవు. నీవే వాగ్దేవతవు. హరిహరబ్రహ్మలు నిన్ను విడువక యెల్లప్పుడు స్తుతించుచున్నారు. నాయీ చపలచిత్తము నీ సచ్చరిత్రను నీ సత్సాంగత్యమును అలవర్చుకొనలేకున్నది/నీ కథలు విని నందున తప్పక చిత్తశుద్ధి యేర్పడునుగదా! నా యల్లుని సాంగత్యము వలన నాకు నీయద్భుత దివ్యసందర్శన భాగ్యమబ్బినది. ఏ సాధనలు లేకుండగనే నీ సుదుర్లభ దివ్యదర్శనము నాకు లభించెను. నిన్ను భక్తులు గానము చేయుచున్నారు. నీకు పాపముగాని, పుణ్యముగానిలేదు. నీవు సమస్త సుగుణములు కలదానవు. ఏ గుణములులేని దానివి కూడ. నేను పూర్వ జన్మమున పుణ్యము చేసినందున నీ దర్శనము కలిగింది. కృతార్థుడ నైతిని. ఓ భువనేశ్వరీ! నా జన్మశుభమైనది. నీ బీజాక్షరమునుగాని సేవనుగాని నేనెరుగను. మహా ప్రభావము గల నీమహిమ నీనాడు తెలిసికొంటిని. ఇట్లు స్తుతింపబడిన దేవి ప్రసన్నమైన ముఖముతో ఓ రాజా! నీవు మంచి నియమములు గలవాడవు వరము కోరుకొనుము అని పలికెను.

# దేవి కాశీలో నివసించుట:- శ్రీదుర్గా ప్రతిష్ఠ

సుబాహువు భక్తితో శ్రీదేవి కిట్లనెను జననీ! నీ దర్శనముచే నేను ధన్యుడు నైతిని. నేనింకేమి కోరుదును? ఐనను నేనొక వరము కోరుచున్నాను. నీ పాదపద్మములందు నాకు సర్వదా ప్రేమ భక్తి నెలకొనుగాక. ఓమాతా! కాశీనగరములో నీశక్తిరూపము దుర్గాదేవి నామముతో నెల్లకాలము నిలిచియుండుగాక. సుదర్శనుని శత్రుసమూహము నుండి రక్షించితివి. మమ్ము్మను కాపాడితివి. నీవీనగరము నెల్లప్పుడు కాపాడుచుండుము. నా వైరులను సంహరించి లోకమునకు శుభముచేకూర్పుము. ఇట్లు స్తుతించి వరము పొంది నమస్కరించుచున్న సుబాహుని చూచి యాదేవి ప్రసన్నయై అతని కిట్లనెను. రాజా! ఈ భూమి యున్నంతకాలము నేను కాశీ క్షేత్రమందు జగత్తును రక్షించుటకై నివసించెదను. అని పిమ్మట సుదర్శనుడు ఆనందభరితుడై వచ్చి పరమభక్తితో నమస్కరించి జగదంబిక నిట్లు స్తుతించెను.

అమోకృపాతే కథయామ్యహం కింత్రా తస్య యాయత్కిలభక్తిహీన :
భక్తాను కంపీసకలో జనోస్తి విముక్త భక్తే రవనం వ్రతంతే
త్వందేవి సర్వం సృజసి ప్రపంచం శ్రుతంమయా పాలయాసి స్వసృష్టం
త్వమత్సి సంహార పరేచకాలే నతేత్ర చిత్రం మమరక్షణంలై
కరోమి కిం తేవదదేవి కార్యంత్వా ప్రజామత్యను మోదయాశు
కార్యేవిమూఢోస్మి తవాజ్ఞ యాహం గచ్ఛామి తిష్ఠే విహరామిమాత: ॥

ఓ దేవీ! నీ దయనెంతని వర్ణింతును? నేను నీచేత కాపాడబడితిని. నీవు భక్తిలేని వారిపై కూడ దయచూపెదవు. బ్రహ్మాండములను పుట్టించి పెంచి సంహరించుదానవు. భవానీ! నేను ఏమి చేయవలెనో తెలియని స్థితిలోనున్నాను. నేనెక్కడకు వెళ్ళవలెను? నీయాజ్ఞ ప్రకారము వెళ్ళెదను ఆ స్తుతిని విని దేవి దయాంతరంగయై ఆతనికిట్లనెను.

ఓ మహాభాగా! నీవయోధ్యకు వెళ్ళి రాజ్యము చేయుము. నన్నెల్లప్పుడు తలచుకొని పూజింపుచుండుము. నేను నీ రాజ్యమున సుఖశాంతులను విస్తరింప చేయుదును అని పలికి అదృశ్యమయ్యెను. రాజులెల్లరు సుదర్శనునకు ప్రణమిల్లిరి. పిమ్మట దేవి మాహాత్మ్యమును తెలుపుమని సుదర్శనుని ప్రార్థించిరి. అప్పుడు సుదర్శనుడు రాజులారా! దేవి మహిమనునేనేమని చెప్పను ఎంతని చెప్పగలను? బ్రహ్మరుద్రాది దేవతలు కూడ ఆమె తత్త్వమును సంపూర్ణముగా నెరుగజాలరు. ఆ దివ్యచరిత్రను వర్ణింప నేనెంతవాడను? నాకు చిన్నతనముననే భగవతి యొక్క కామరాజ బీజము లభించినది. నేను దానిని రాత్రింబవళ్ళు జపించితిని. మహర్షులు

పరదేవతా శివతత్త్వమును తెలియజేసిరి. ఆనాటి నుండి ఆమెను భక్తితో స్మరించితిని అని పలికెను. అంతటట నారాజు లెల్లరు నాశక్తి స్వరూపమును తలచుకొనుచు తమ నివాసములకు వెళ్ళిరి. సుబాహువు సుదర్శనుని వీడ్కొని కాశీకి వెళ్ళెను. సుదర్శనుడు సాకేతనగరమున పట్టాభిషిక్తుడై మంత్రులు ప్రజలు తనను ప్రశంసింపగా రాజ్యపరిపాలనము చేయుచు. మంత్రులను దేవీ ప్రతిమను నిర్మింపజేయ నాజ్ఞాపించి శుభముహూర్తమున వేదవేత్తల ద్వారా శ్రీదేవిని ప్రతిష్ఠింప చేసి అనేక పూజలు జరిపెను.

# శ్రీదేవీ నవరాత్రి పూజా విధానము

శరన్నవరాత్రములలో ఆచరింపదగిన విధానమును జనమేజయునకు వ్యాస మహర్షి యిట్లు చెప్పెను. ఓ రాజా! దేవీ నవరాత్రములను వసంతఋతువు నందు, శరదృతువులోను ఆచరించాలి. ఈ రెండు ఋతువులును ప్రాణులకు రోగములు కలిగించునవి. చైత్ర- ఆశ్వయుజమాసములయందు- నవరాత్రి వ్రతమును - చండీపూజను చేసి శుభములనందవలెను. కనుక రోగములు కలుగకుండుటకు నవరాత్రము లాచరించి చండీపూజలు జరపాలి. కావలసిన వస్తువులన్నిటిని సమకూర్చుకొని శుద్ధపాడ్యమి నుండి ఏకభుక్తము హవిష్యాన్నముల గ్రహించుచు నియమముతో పూజలు చేయవలెను. సమతల ప్రదేశమందు 16 చేతుల ప్రమాణముగల స్తంభములు జెండాలు కలుగునట్లు చక్కని మండపమును నిర్మించవలెను. ఆ మండపమును ఎఱ్ఱమట్టి గోమయంతో అలకాలి. ముగ్గులు పెట్టాలి. మధ్యలో ఎత్తైన అరుగును అమర్చాలి. ఆ వేదికమీద 4 మూరల పొడవు అంతే వెడల్పును మూరయెత్తు గల పీఠము తయారుచేసి దానిని అలంకరించవలయును. మండపము చుట్టును మామిడి తోరణాలు విచిత్రములైన పూలమాలలు కట్టవల యును. అంతకు ముందు రాత్రియే దేవీ తత్త్వము తెలిసిన సంపన్నులు ఇంద్రియ నిగ్రహము గల వేదవేదాంగములు తెలిసిన బ్రాహ్మణులను పిలువవలెను. పాడ్యమినాడు ప్రాతఃస్నానము చేసి నిత్యకృత్యములు తీర్చుకొని బ్రాహ్మణులకు వరుణలిచ్చి వారికి వస్త్రములిచ్చి గౌరవించాలి. సంపద గలవాడు ద్రవ్య లోపమేమాత్రము చేయకూడదు. బ్రాహ్మణులు సంతృప్తి చెందినచో పూజ సంపూర్ణ ఫలము నీయగలదు. బ్రాహ్మణులు తొమ్మిదిమంది గాని, ఐదుగురుగాని, ముగ్గురుగాని, చివరకు ఒక్కడైనా శ్రీదేవీభాగవతం పారాయణ చేయాలి. వేదఘోషతో స్వస్తివాచనము జరపాలి. వేదికమీద సింహాసనముంచాలి. దానిపై తెల్లని వస్త్రం పరచాలి. దానిమీద దివ్యవస్త్రములు ధరించి దివ్యాయుధ ధారిణియగు చతుర్భు

జమైన జగదంబను ప్రతిష్ఠ చేయాలి. శంఖచక్రాద్యాయుధములు ధరించిన దేవిని సింహాసన మందుంచాలి. ఆమెను యధాశక్తిగా అలంకరించాలి. ఆమెకు 18 భుజముల మర్చాలి. అలాంటి విగ్రహము సాధ్యము కాకపోతే నవార్ణ మహామంత్ర సహితమగు యంత్రము నుంచాలి. దాని ప్రక్కన కలశస్థాపనము చేయాలి. మామిడి, రావి, మఱ్ఱి, మేడిచిగుళ్ళు బంగారము గల కలశంలో వేదమంత్రాలతో తీర్థజలాన్ని నింపాలి. పూజకు శుభప్రదములగు ద్రవ్యములు సమకూర్చుకోవాలి. తదుపరి మంగళవాద్యములు మ్రోగించాలి. తరువాత మంత్రపూర్వకముగ పూజలు చేయాలి. మాలతీ బిల్వాది పూలదండలతో ధూపదీపాలతో పూజించి దేవికి అర్ఘ్యమివ్వాలి. నారకేళకదలీ పనసాదిఫలములు నివేదన చేయాలి. తరువాత ఘనముగా బ్రాహ్మణ సమారాధన జరపాలి. హోమం చేయటానికి త్రికోణా కారముగా కుండమును నిర్మించాలి. నిత్యము నేలపైపడుకోవాలి. కుమారికలను వస్త్రాలంకారాలతో అమృతాన్నంతోను పూజించాలి. శక్తికి తగినట్లు యాగము చేయాలి. ధనలోపము చేయరాదు. రెండేళ్ళు మొదలు 10 ఏళ్ళలోపు కన్యకలనే పూజించాలి. హస్తా నక్షత్రము కలనందా తిథి- పాడ్యమినాడు పూజా ప్రారంభము శ్రేయస్కరము. ఇట్లు పూజించుటచే దుఃఖము దారిద్ర్యము నశించుట శత్రు క్షయము ఆయుర్బల ధనములు వృద్ధిచెందుతాయి. మంచి వంశములో పుట్టి అందగత్తెయైన కన్యనే పూజించాలి. అన్ని ఫలితాలకి బ్రాహ్మణకన్యను, భయము తొలగుటకు రాచకన్యను లాభానికి వైశ్యకన్యను లేదా శూద్రకన్యను గాని పూజిం చాలి. నవరాత్రములలో అష్టమి మిక్కిలి ముఖ్యమైనది. ఆనాడు విశేషముగా ఆరాధించాలి. బ్రాహ్మణభోజనాలతోను ఫలపుష్పోపహారాలతోను జగజ్జననిని సంతోష పెట్టవలెను. తొమ్మిదిరోజులు ఉపవాసము చేయలేనివాడు మూడు దినము లైనా ఉపవాసము చేసిన పూర్తి ఫలితం కలుగుతుంది.

# దేవీ నవరాత్రవ్రత మాహాత్మ్యము

వ్యాసమహర్షి యింకను చెప్పుచున్నాడు :- సప్తమి, అష్టమి, నవమి, ఈ మూడు దినములు భక్తితో దేవిని పూజించినచో సమస్త ఫలములు సమ కూరును. నవరాత్రవ్రతము దేవీ పూజలు, హోమాలు, కుమారీ పూజలు బ్రాహ్మణ సంతర్పణ ములతో సంపూర్ణమగును. ఇతర వ్రతములు, దానములు దేవీ నవరాత్ర వ్రత ముతో సరిపోలవు. అన్ని విధములైన కోరికలను దేవీనవరాత్ర వ్రతముచే తీర్చుకొన వచ్చు. హరిహర హిరణ్య గర్భాది దేవతలు దేవినారాధించి సర్వసిద్ధులను పొందగలిగారు. పూర్వము కోసలదేశమున దరిద్రుడైన వర్తకుడు కలడు. అతనికి

సంతాన మధికము ఒకనాడు సద్బ్రాహ్మణుడొకడు కనబడగా తనబాధను వివరించి దారిద్ర్య నిర్మూలనకుపాయము చెప్పుమని ప్రార్థించాడు. ఆ బ్రాహ్మణుడు జాలి పడి ఓ వైశ్యోత్తమా! దేవీనవరాత్రవ్రత మాచరించిన సర్వ సుఖములు కలుగును. బాధలన్నియు తొలగిపోవునని చెప్పెను. వైశ్యుడా బ్రాహ్మణునే గురువుగా చేసికొని భక్తిశ్రద్ధతో తొమ్మిది సంవత్సరములు నవరాత్ర వ్రతము చేయగా తొమ్మిదవ సంవత్సరము అష్టమినాడు అర్ధరాత్రి దేవి ప్రత్యక్షమై అనేకవరములిచ్చి ఆ వైశ్యుని కృతార్థుని గావించినది.

# శ్రీసీతారామ చరిత్ర

జనమేజయుడు వ్యాసుని వలన దేవీ నవరాత్ర మహాత్మ్యమును విని అందులో రాజ్యభ్రష్టుడై రావణుడు సీతాపహరణమును చేయగా శ్రీరాముడు దేవీవ్రత మాచరించి సుఖపడెనని విని రామచరిత్రను జెప్పుమనగా వ్యాసుడు సీతారామ చరిత్ర నిట్లు చెప్పెను. సూర్యవంశమందలి దశరథ మహారాజునకు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను నలుపురు పుత్రులు జన్మించిరి. నలువురును విద్యాబుద్ధులు గరచి తండ్రికి ప్రీతిపాత్రులై యుండిరి. ఒకనాడు విశ్వామిత్రుడు దశరథుని వద్దకు వచ్చి తన యాగమును రక్షించుటకై రాముని పంపుమని కోరెను. పదహారేళ్ళ వయస్సు గల రాముని లక్ష్మణునితో కూడ విశ్వామిత్రుని వెంట పంపెను. దారిలో రాముడు తాటక యను రాక్షసిని సంహరించి పిమ్మట సుబాహుమారీచులను రాక్షసులనుండి విశ్వామిత్రుని యాగమును కాపాడెను. పిమ్మట విశ్వామిత్రునితో రామలక్ష్మణులు మిథిలానగరమునకు వెళ్ళిరి. మార్గమధ్యమున అహల్యకు శాపవిముక్తిని శ్రీరాముడను గ్రహించెను. అచట శివధనుస్సును భగ్నమొనర్చి సీతను రాముడు పెండ్లియాడెను. జనకుని కూతురైన ఊర్మిళను లక్ష్మణుడు, కుశధ్వజుని కుమార్తెలైన మాండవీశ్రుత కీర్తులను భరతశత్రుఘ్నులు వివాహము చేసికొనిరి. తరువాత దశరథుడు రామునకు పట్టాభిషేక ప్రయత్నము చేయగా కైకేయి మంథరచే ప్రేరేపింప. డి పూర్వము దశరథుడు తనికిచ్చి యున్న రెండు వరములలో నొకదానికి తన కుమారుడగు భరతునకు పట్టాభిషేకమును రెండవ దానికి రామునకు పదునాల్గు సంవత్సరము అరణ్యవాసమును కోరెను. రాముడు సీతాలక్ష్మణులతో అరణ్యమునకు వెళ్ళెను. భరతుడు రాజ్యము నంగీకరింపలేదు. రాముడు పంచవటిలో నివసించుచుండగా రావణుని చెల్లెలైన శూర్పణఖ కామాతిరేకముచే రాముని సమీపించి లక్ష్మణునిచే వికృతరూపము కలదిగా చేయబడెను. అందుకు ప్రతీకారమొనర్చుటకై రామునితో యుద్ధము చేసి ఖరదూషణ

త్రిశిరసులు యుద్ధమున మరణించిరి. రావణుడందుకు కోపించి మారీచుని బంగారు లేడిరూపముతో తిరుగుచు రాముని ఆశ్రమము వద్ద సీతకు కనబడు మని పంపెను. ఆ లేడిని చూచి సీత యాలేడిని తెచ్చి పెట్టుమని తన భర్తను కోరగా రాముడు ఆ లేడి వెంట దూరము వెళ్ళెను. రాముడా లేడిని బాణముతో కొట్టగా అది హా సీతా హా లక్ష్మణా! యని కేకవైచి మరణించెను. అంతట సీత రామునకాపద వచ్చెనని తలచి లక్ష్మణుని రామునివద్దకు పంపెను.

# సీతాపహరణము

రామలక్ష్మణు లిరువురును లేనియప్పుడు రావణుడు యతివేషమున భిక్షకై వచ్చినట్లభినయించి సీతను బలాత్కారముగా నపహరించెను. రాముడు జింకను చంపి తెచ్చుచుండగా దారిలో లక్ష్మణుడెదురయ్యెను. లక్ష్మణుడు సీతాదేవి మాటలు సహింపలేక వచ్చితినని రామునికి చెప్పెను. ఇరువురును పర్ణశాలకు వెళ్ళగా అచట సీత కనబడలేదు. రామలక్ష్మణు లామెను వెదకుచు మరణించు టకు సిద్ధముగా నున్న జటాయువును చూచి వాని ద్వారా రావణుడు సీత నప హరించినట్లు తెలిసికొని సీతను విడిపించుటకు రావణునితో యుద్ధము చేసిన జటాయువు మరణించగా వానికి సద్గతి నిచ్చికబంధుని శాపవిముక్తుని చేసి వాని మాటననుసరించి సుగ్రీవుతో మైత్రి చేసికొనెను. రామసుగ్రీవులు పరస్పర సాహాయ్యము నొనర్చు కొనుటకై ప్రతిజ్ఞ చేసికొనిరి. రాముడంతట వాలిని చంపి సుగ్రీవుని వానరరాజు నొనర్చెను.

పిమ్మట వర్షాకాలము నాలుగు మాసములు లక్ష్మణునిచే ఓదార్పబడుచు శ్రీరాముడు ఎట్లో గడపెను. రాముడు భరింపరాని సీతావియోగముతో దుఃఖించు చుండ లక్ష్మణుడు మహానుభావా నేనా రాక్షసాధముని చంపి సీతను తెచ్చెదను నీవు దుఃఖపడవలదు. కష్టములందు ధైర్యముతో నున్నగాని సుఖపడు మార్గము తోచదు నీవు రఘువంశమున పుట్టినవాడవు. అని యూరడించెను! దుఃఖము తగ్గియున్న సమయమున ఆకాశమునుండి నారద మహర్షి రామలక్ష్మణుల వద్దకు భగవన్నామము గానము చేయుచు దిగివచ్చెను.

# శ్రీ రాముడు శ్రీ దేవీవ్రతము నాచరించుట

శ్రీరాముడు తన భార్యయైన సీతను రావణుడపహరింపగా దుఃఖా క్రాన్తుడై యుండ లక్ష్మణుడతని ఓదార్చి మాట్లాడునప్పుడు నారదమహర్షి వీణా గానముతో రామలక్ష్మణుల సమీపమున ఆకాశమునుండి దిగెను. ఆతడు స్తిమితముగా

కూర్చొని తమ్మునితో కూడియున్న రాముని చూచి దుఃఖించుచున్నట్లు గ్రహించి. శ్రీరామా నీభార్య సీత రావణునిచే అపహరింపబడినదని నాకు తెలియును. నీవు జన్మించింది రావణుని చంపుట కొరకే. ఆ రావణుని నాశమునకు నేను ఉపాయ మును చెప్పు చున్నాను వినుమని అశ్వయుజమాసములో తొమ్మిది దినములు ఉపవాసము చేసి దేవిని పూజించుము/జపహోమవిధానముతో పరదేవతను పూజించి నచో నీవు సర్వసమర్థుడవై సీతాదేవిని పొందగలవు. పూర్వ మీవ్రతమును విష్ణువు, శివుడు, బ్రహ్మ, దేవేంద్రుడు చేసి తమతమ కోరికలను తీర్చుకొని సుఖపడిరి. నీవు కూడా శుభప్రదమైన యీ వ్రతమును చేసి సుఖపడుమని బోధించెను. విశ్వామిత్రుడు భృగుమహర్షి వసిష్ఠ కశ్యపులు, అపహరింపబడిన తమ భార్య కొఱకు బృహస్పతి ఈ విధంగా ఎందరో దేవీవ్రతం చేసి సుఖపడ్డారు.

నీవు కూడా యీ వ్రతమును చేసినచో తప్పక శత్రువును జయించి సుఖపడ గలవని చెప్పెను. మరియు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, ఇంద్రుడు, సూర్య చంద్రులు, భూమి, పర్వతాలు లేనప్పుడు పరిపూర్ణ ప్రకృతి స్వరూపమైన ఆ దేవి పరమపురుషునితో కూడి విహరిస్తుంది. సగుణ మూర్తియై మూడులోకాలను నిర్మిస్తుంది. ఆమెను తెలిసికొనినవాడు సంసారబంధము నుండి విముక్తుడౌతాడు అని నారదుడు చెప్పెను.

నారదుడు చెప్పినట్లు శ్రీరాముడు వ్రతమును చేయగా అష్టమినాడు అర్ధరాత్రి దేవి సింహవాహనముపై నుండి దర్శనమిచ్చింది. మరియు నాశక్తితో కూడిన వానరులు నీకు సహాయ చేసెదరు. నీవు భార్యా సమేతుడవై రాజ్యము నేలగలవు. తప్పక శత్రుసంహారము చేయగలవని పలికెను. శ్రీరాముడు దేవి చెప్పిన విధముగా వానరసైన్య సహాయముతో రావణ సంహార మొనర్చి భార్యాసమేతుడై చిరకాలము రాజ్యమేలెను.



# చతుర్థ స్కంధము

## జనమేజయుని సంశయములు

జనమేజయుడు వ్యాసమహర్షిని యిట్లు ప్రశ్నించెను. "వసుదేవుడు పూజనీయుడు గదా! అట్టి వానిని కంసుడు కారాగారమందేల నిర్బంధించెను. దేవకీవసుదేవుల ఆరుగురు కుమారులేల చంపబడిరి? శ్రీహరి చెరసాలయందెట్లవతరించెను? తల్లి గర్భమందుడగనే భగవంతుడు తల్లిదండ్రులను చెరనుండి యేల విడిపింపలేదు? కంసుడు చంపిన ఆ ఆరుగురు పిల్లలు ఎవరు? కంసుడు కొట్టగా ఆకాశమున అష్టభుజయై కనపడిన బాలికయెవరు? కృష్ణుడొనరించిన పనులను అతని దేహ త్యాగము వాసుదేవుని చరిత్రము నంతయును నాకు చెప్పవేడుచున్నాను నరనారాయణులు కృష్ణార్జునులుగా ఎట్లు పుట్టిరి? శంబరాసురుడు ప్రద్యుమ్నుని ఏల అపహరించెను? శ్రీకృష్ణుడు భయముతో మధురారాజ్యమును విడిచి ద్వారకకేల వెళ్ళెను? మహాత్ములైన భీష్మద్రోణులను కృష్ణుడేల చంపించెను. ధర్మాత్ములైన పాండవులేల దుఃఖమనుభవించిరి? ద్రౌపది యెందులకు కష్టపడవలసి వచ్చెను. పాండవులు భీష్మద్రోణులను మోసముతో నేల చంపిరి? నా తండ్రి మునిమెడలో చచ్చిన పామును వేసినాడని వింటిని ఇది ఆశ్చర్యకరముగా నున్నది. ఈ సందేహములకన్నిటికిని సమాధానములు చెప్పి శాంతిని ప్రసాదింపుము"అని జనమేజయుని ప్రశ్నలకు వ్యాసుడీరీతిగా సమాధానములు చెప్పెను.

## కర్మ ప్రభావము- అదితి కశ్యపులు దేవకీవసుదేవులుగ జన్మించుటకు కారణము

రాజా! కర్మగతి మిక్కిలి తెలియ శక్యముగానిది. ఈ లోకములు త్రిగుణముల మేళనముచే పుట్టుచుండును. జగత్తంతయు కర్మవలననే పుట్టుచున్నది. ప్రపంచమంతయు శుభము, అశుభము, మిశ్రము అను మూడువిధములగు కర్మలచే వ్యాప్తమైయున్నది. కర్మవలననే రుద్రుడు కపాలమును ధరించుచున్నాడు. ఈ కర్మకు మొదలు లేదు. ఈ ప్రపంచము శాశ్వతముగా తోచుచుండును. మాయ అన్నిటికి కారణమైయున్నది. విష్ణువు కూడ తన యిష్టప్రకారము అవతరించుట లేదు. బ్రహ్మాదిదేవతలు కూడ తమతమ కర్మలనుబట్టి కష్టసుఖముల ననుభవించుచుండును. రాజా! యదువంశమున అవతరించిన శ్రీకృష్ణుని దివ్య

శుభగాథలను వివరించెదను వినుము. కశ్యపునంశమున జన్మించిన వసుదేవుడు గోవుల రక్షించుచుండెను. అతనికిద్దరు భార్యలు వారే దేవకీ, రోహిణులు. పూర్వము కశ్యపమహర్షి యాగము కొరకు వరుణుని ఆవు నపహరించెను. ఎంత వేడినను కశ్యపుడా ఆవు నీయలేదు. వరుణుడు బ్రహ్మ వద్ద విషయము చెప్పగా బ్రహ్మ వానిని పిలిపించి వరుణుని ఆవు నిమ్మనెను. అప్పుడు కూడ అతడు ఆవును విడువక పోవుటచే బ్రహ్మ వానిని భూలోకమున జన్మింపుమని శపించెను. నీ భార్యలు కూడ మానవ స్త్రీలగుదురు. నీవు గోపాలక వృత్తితో జీవింపుమనెను. ఇట్లేదితి -ఏడుగురు కుమారులు నీకు పుట్టగనే మరణింతురని అదితిని శపించినది. ఇట్లు దితికశ్యపులు దేవకీ వసుదేవులుగా జన్మించిరి. ఈ కథ విని జనమేజయుడు జీవుడు సంసార బంధము నుండి యెట్లు విముక్తుడగునో తెలుపుమని యడుగగా వ్యాసుడిట్లు చెప్పనారంభించెను.

# మాయాశక్తి ప్రభావము

రాజా! భూమండలమునంతను దానము చేసిన బలిచక్రవర్తి నిజముగా గెలు పొందినవాడు. హరి బలినివంచించుటకు వామనుడయ్యెను. పిమ్మట శ్రీహరి బలికి ద్వారపాలకుడయ్యెను. కనుక సత్యము ధర్మమే దైవము. ఎల్లకాలము సత్యమును పాటించుట కష్టసాధ్యము. మహామాయ త్రిగుణాత్మకమైనది. ఎంతటి వానికిని యిది దాటశక్యము కానిది. ఈ ప్రపంచము మాయచేతనే సృష్టింపబడు చున్నది. ఇది త్రిగుణముల సమ్మేళనము వంచవకును సత్యపరిపాలనమెట్లు సాధ్యపడును? ఈ విశ్వము మిశ్రితగుణములతో జన్మించినది. ఇది సనాతనము. వైఖానసాది మునులు మాయాతీతులు వారే సత్యధర్మమునకు దృష్టాంతముగ చెప్పదగినవారు. త్రిగుణములు విడివిడిగా నుండవు. ఎల్లప్పుడు కలిసియేయుం డును. నిర్మలము సుస్థిరమునైన పరమధర్మమందు యెవని బుద్ధియు నిలువదు. మహారాజా! బలవత్తరములైన యింద్రియములు మానవుని మాయామోహితుని చేయుచున్నవి. మనస్సు ఇంద్రియములలో తగుల్కొని విడివడ జాలకున్నది. ఈ మనస్సు వలన అనేకవిధములైన భావములు కలుగుచున్నవి. మాయకువశుడు కానివాడు లేడు. మానవుడు విషయభోగములను కాంక్షించి అసత్యమాడును. ఆభోగములు దక్కనప్పుడు వంచనకు పాల్పడును. దానిచే పాపములు సంభవించును. కామ క్రోధలోభములు బలవత్తర శత్రువులు. ఈ శత్రువులకు బానిసలై వివేకమును కోల్పోవుచున్నారు.

# నరనారాయణుల తపఃప్రభావము

పూర్వము బ్రహ్మ హృదయమునుండి ధర్ముడను కుమారుడు జన్మించెను. అతడు సత్యసంధుడు వేదనిరతుడును. అతడు దక్షుని కుమార్తెలను పదిమందిని వరించెను. వారికి పుత్రులు కలిగిరి. వారి పేర్లు హరి, కృష్ణుడు, నరుడు, నారాయణుడు అని హరి కృష్ణులు యోగనిరతులైరి. నరనారాయణులు హిమాలయము వద్ద బదరికాశ్రమమున తపస్సు చేసిరి. ఇంద్రుడు-వారి తపస్సునకు భయపడి ప్రత్యక్షమై వరమును కోరుకొనుడని పలికెను. నరనారాయణులు ధ్యాననిష్ఠలో నుండి మాట్లాడలేదు. అంతట దేవేంద్రుడు మాయచే సింహవ్యాఘ్రాది క్రూర జంతువులను సృష్టించి భయపెట్టజూచెను. కాని వారు చలింపక అట్లే ధ్యాననిష్ఠలో నుండిరి. అప్పుడు యింద్రుడు మన్మథ వసంతులను పిలిచి మీరు అప్సరసలను వెంట బెట్టుకొని బదరికాశ్రమమున తపస్సు చేయుచున్న నరనారాయణుల వద్దకు వెళ్ళి వారి తపస్సునకు భంగము కలిగించుడు. దేవవేశ్యలను నీతో కూడ పంపుచున్నాను. నాపని నెరవేర్పుడు. నీవు కోరినది యిచ్చెదని చెప్పగా వారు బదరికాశ్రమమునకు వెళ్ళిరి. మొదట వసంతుడు ఆప్రదేశమునంతను అతిమనోహరముగ నొనర్చెను. స్త్రీ పురుషులు మదనాతురులై క్రీడాసక్తులైరి. రంభ తిలోత్తను మొదలగువారు ఆశ్రమమును చేరి మధురముగా గానమొనర్చుచుండిరి. దేవకాంతల గానము విని మన తపోభంగమునకు ఇంద్రుడు పన్నినపన్నుగడయే యని నారాయణుడు పలుకుచుండగా మన్మథుడు మొదలగువారు కనబడిరి. నారాయణుడు వారిని చూచి యాశ్చర్యపడెను. మన్మథ వసంతులు పదహారువేల ఐదు వందల మంది అప్సరసలు మునివరులకు నమస్కరించి యెదుట నిలిచిరి. నారాయణుడు - మీరు యాతిథ్యమును స్వీకరింపుడు. ఇక్కడనే సుఖముగా నుండుడనెను.

తరువాత నారాయణుడు తన ఊరువునుండి ఒక సర్వాంగ సుందరిని సృష్టించెను. ఊరువు నుండి పుట్టుటచే ఊర్వశి యని పేరు పొందినది. అప్సరసలు ఆ స్త్రీని చూచి వెలవెలపోయిరి. అతిథులైన వారి సేవలకు అత్యద్భుత సౌందర్యవతులను సృష్టించెను. ముని సృష్టించిన ఊర్వశిని చూచి దేవవేశ్యలు ఆశ్చర్యపడి నారాయణునితో ఇట్లనిరి. ఆర్యా! మీ తపో మాహాత్మ్యమును ఆత్మస్థైర్యమును చూచితిమి. మమ్ము చూచి మీ మనస్సులు చలించుటలేదు. మేము ఇంద్రుని పని సాధించుటకు వచ్చితిమి. మీ దర్శనభాగ్యము కలిగినది. మమ్ము శపింపకుండ విడిచినందుకు ధన్యవాదములు. అని పలుకగా నరనారాయణులు ఈ ఊర్వశిని ఇంద్రునకు కానుకగా ఇచ్చుచున్నాము. ఈమెను స్వర్గమునకు కొనిపొందు

నేటినుండి మీరెవ్వరి తపస్సునకును విఘ్నము నొనొర్పవలదు. అని పలుకగా దేవవేశ్యలు మాకు నీవు పతివికమ్ము అని ప్రార్థించిరి. అప్పుడు నారాయణుడు కోపము తెచ్చుకొని వారినుండి బయట పడుటకు ఆలోచించుచుండగా నరుడు కోపముచే వచ్చెడి అనర్థమును చెప్పి శాంతింపజేసెను.

## అహంకార ప్రభావము

మరియు గర్వము నణచి వేయవలయును శాంతభావము నాశ్రయించుము అహంకార దోషముచే మన తపస్సునకాటంకము కలిగినది. పూర్వము దురహం కారము చేతనే ప్రహ్లాదునితో వేయి సంవత్సరములు పోరాడవలసి వచ్చినది. కనుక శాంతిని పొందుము అని నరుడు పలికిన మాటలు నారాయణుని శాంతుని చేసినవి. మనస్సులో అహంకారము పుట్టినచో తపస్సు నశించుట కామక్రోధాదులు విజృంభించుట జరుగును. గర్వముచేత ప్రహ్లాదుడు శ్రీహరితో యుద్ధము చేసెను. ఓ రాజా! ప్రహ్లాదుని పుణ్యమంతయు వ్యర్థమయ్యెను. నరనారాయణులు తమ తపఃఫలమును చెడగొట్టుకొనినారు. అహంకారముచే బంధింపబడినవాడు ఎప్పటికిని ముక్తుడుగాడు. మహాత్ములు కూడ కామక్రోధములచే బంధింపబడు చుండిరి. ఈజగత్తులో అహంకారము లేనివాడు ముందురాబోవు నరకము నెవ్వ డును గమనించడు. అని బోధింపగా జనమేజయుడు నరనారాయణులకు ప్రహ్లా దునితో యుద్ధమేల యేర్పడెనని ప్రశ్నించెను. అంతట వ్యాసుడిట్లు చెప్ప దొడగెను.

## ప్రహ్లాదుని తీర్థయాత్ర

హిరణ్యకశిపుడు మరణించగా ప్రహ్లాదుడు పట్టాభిషిక్తుడయ్యెను. అతడు దేవబ్రాహ్మణ పూజానిరతుడు. అతని పాలనమున రాజు పెక్కుయాగముల నొనర్చిరి. ఒకప్పుడు చ్యవనమహర్షి నర్మదానదిలో స్నానము చేయుటకు వెళ్ళెను. అతడు నదిలో దిగుచుండగనే ఒక భయంకర విషసర్పమాతనిని గట్టిగా చుట్టు కొనెను. అది పాతాళమునకు తీసికొనిపోవుచుండ నాతడు హరినామమును మన సార స్మరించెను. దానిచే సర్పము విషము లేనిదయ్యెను. పాము ఇతడెవడో మహాత్ముడని శపించునను భయముతో నాతని విడిచి పెట్టెను. అంత చ్యవనుడు పాతాళమునకు వెళ్ళి తిరుగుచుండగా ప్రహ్లాదుడు ఇంద్రుడు నన్ను రమ్మని నారాజ్యమునకు మిమ్ము పంపెనా? మీ రాకకు కారణమేమని యడిగెను. చ్యవనమహర్షి నేను దేవేంద్రుని దూతనుగాను. నర్మదానదిలో నన్ను పాము పట్టు కొనినది. హరినామస్మరణము చేయగా అది విడిచిపెట్టినదని చెప్పెను. అంతట ప్రహ్లాదుడు పుణ్యతీర్థముల గూర్చి తెలియజేయుమని చ్యవనమహర్షి నడిగెను.

చ్యవనమహర్షి దానవోత్తమా! మనస్సు వశమందుండవలె గాని నదీ స్నానము ముఖ్యము కాదు. మనస్సు శుద్ధముగా లేక ఎన్ని పుణ్యకార్యములాచరించినను అవి తగినఫలము నీయవు. చిత్తశుద్ధి, ద్రవ్యశుద్ధి, ఆచారశుద్ధి, తీర్థశుద్ధి, ఇట్టి పరిశుద్ధత లేనిచో ఏదియు ఫలము నీయదు. ఈ భూమండలమందెన్నియో తీర్థములు గలవు వానివనిట్టిని చెప్పుట శక్యముకాదని పలుకగా ప్రహ్లాదుడు నైమిషమునకు బయలుదేరెను. అతని వెంట పలువురు రాజులును బయలుదేరిరి. అందరును నైమిషారణ్యము చేరి అచట తీర్థమున స్నానము చేసిరి. తరువాత ప్రహ్లాదుడు రాక్షసులెల్లరతో కూడి తీర్థములన్ని తిరిగెను. సరస్వతీ నదీపావన తీర్థమందు స్నానము చేయుగనే మనస్సు ప్రసన్నమయ్యెను. ఇట్లు ప్రహ్లాదుడు తీర్థాటనముచే పరిశుద్ధాత్ముడై అనేక శుభకర్మలనాచరించెను.

## నరనారాయణులకు ప్రహ్లాదునితో యుద్ధము

ప్రహ్లాదునకక్కడ నొక మఱ్ఱిచెట్టు కనబడెను. అక్కడ నతనికి పలువిధములైన బాణములు కనిపించెను. ఈ బాణము లెవరివని ఆలోచించుచుండగనే జడలు లేడి చర్మము ధరించిన నరనారాయణులు కనబడిరి. వారు ధ్యాన నిమగ్నులై యుండిరి. ధనుస్సును అంబులపొదులను వారి వద్ద చూచి ప్రహ్లాదుడు కోపముతో ఓ మునులారా! ఈ సత్యయుగమున తపోధర్మమునకు విరుద్ధముగా ధనుర్బాణ తూణీరములు కలిగియుండుట తగదు. మీరు తపస్సు చేయవలెగాని ఈ ఆయుధముల ధరింపరాదు అని పలుకగా నరనారాయణులు దానవేంద్రా! మేము రెండిటి యందును సమర్థులమని లోకవిదితమే. మాకు యుద్ధమందు కూడ అపారమైన సమర్థత కలదు. నీవేమి చేయగలవు? బ్రహ్మతేజోబలమే బలము మూఢబుద్ధివి నీకేమి తెలియును? నీ దారిన నీవు పొమ్మనిరి.

ఓ తపశ్శాలులారా! మీరు మందమతులు గర్విష్ఠులు ఈ తీర్థమున అధర్మాచరణము తగదు. యుద్ధమందుశక్తి కలదేని చూపుడు అని ప్రహ్లాదుడనెను. అంతట నరుడు నీకు యుద్ధము చేయు బుద్ధియున్నచో నాతో యుద్ధము చేయుము. నీ శరీరమిప్పుడే ముక్కలు చేయుదును. అని పలుకగా దైత్యపతియగు ప్రహ్లాదుడు నేనెట్లైనను వీరిని గెలిచి తీరెదనని ప్రతిజ్ఞ చేసి వెంటనే ధనుస్సు నెక్కుపెట్టెను. నరుడు కూడ విల్లును అందుకొని తీవ్రములైన బాణములను ప్రహ్లాదునిపై ప్రయోగించెను. దైత్యపతి వానినన్నిటిని ఖండించెను. అంతట మిక్కిలి కోపించి నరుడు రాక్షసరాజుపై బాణవర్షము కురిపించెను. ప్రహ్లాదుడు వానినన్నిటిని ఛేదించి నరుని రొమ్ముపై శరములను నాటునట్లు చేసెను. నరుడుగ్రుడై ఐదుబాణములతో

ప్రహ్లాదుని బాహువుపై కొట్టెను. దేవతలీ యుద్ధము నాశ్చర్యముతో చూచుచుండిరి. అంతట నారాయణుడు విల్లందుకొని రాక్షసరాజు పై బాణవర్షము కురిపించెను.

ప్రహ్లాద నారాయణుల ఘోరమైన పోరును దేవతలాకాశమునందు నిలిచి చూచుచు పుష్పవర్షము కురిపించిరి. ఇట్లు వారిరువురు దీర్ఘకాలము యుద్ధము చేయగా భగవంతుడు పీతాంబరధారియై శంఖచక్రాది దివ్యాయుధములను పట్టుకొని ప్రత్యక్షమైయెను. అంత ప్రహ్లాదుడు భగవంతునకు నమస్కరించి దేవదేవా! మాధవా! ఈ మునులు జయింపబడుట లేదు. వీరిని నేను జయింప లేకపోవుట ఆశ్చర్యకరముగా నున్నదని పలుకగా వీరు నా దివ్యాంశముచే సంభవించినవారు. కనుక ఆశ్చర్యపడవలసినదేమి యున్నది. కనుక నీవు పాతాళమునకు పొమ్ము అని చెప్పగా తక్కి రాక్షసులతో ప్రహ్లాదుడు వెడలిపోయెను.

## దేవదానవుల యుద్ధము-రాక్షసుల విజయము

జనమేజయుడు తన పూర్వులగు పాండవులు మున్నగువారి విషయ ములను శ్రీకృష్ణుని జన్మాదికము మున్నగు వానిని గూర్చి యడిగెను. ధర్మము-దైవము శక్తి మున్నగు విషయములలో తనకు గల సందేహములను వెలిబుచ్చెను. వ్యాస మహర్షియు వాని సందేహములను తీర్చెను. దేవదానవుల యుత్పత్తిని వారి పరస్పర వైరమును వివరించెను. నరనారాయణుల జన్మను వారి తపోమహిమను వివరించెను. శుక్రుని తపమును వరలాభమును వివరించెను. దేవదానవుల యుద్ధమును వివరించుచు ప్రహ్లాదునికి యింద్రునికి జరిగిన యుద్ధమును వారు చేసిన దేవీ స్తుతులను వివరించెను.

## ఇంద్రాదులు దేవీ మహిమను కొనియాడుట

పూర్వమొకప్పుడు శుక్రాచార్యుడు రాక్షసులకు ప్రస్తుతము దేవతలతో యుద్ధము వలదనిచెప్పెను. మహాత్ముడగు శుక్రాచార్యుల మాటలు విని ప్రహ్లాదుడు దైవము బలవత్తరమైనది. ఇప్పుడు దేవతలతో యుద్ధము చేసినను మనము జయించుట సున్నయని తక్కిన రాక్షసులకు చెప్పెను.

అప్పుడు మదగర్వితులగు రాక్షసులు మేము యుద్ధముచేసెదము. మాకు దైవముతో పనిలేదు. రాజా! ప్రయత్నము చేయని సోమరులు దైవమును ప్రధానముగా తలచెదరు. దానినెవరు చూచిరి? ఎక్కడ చూచిరి? దానినెవరేర్ప రచిరి? అదెట్టిది? మేము తగినబలము చేకూర్చుకొని యుద్ధము చేయుదుము. నీవు అంతయు నెరిగినవాడవు. కానమాకు నాయకుడవుగా నుండుము. అనుచు

నుత్సాహపడు రాక్షసుల మాటలకు సమ్మతించి ప్రహ్లాదుడు దేవతలను యుద్ధమున కాహ్వానించెను. యుద్ధమునకు సిద్ధమైన రాక్షసులను జూచి దేవతలు కూడ తగిన సన్నాహ ములతో యుద్ధము చేయసిద్ధపడిరి. అప్పుడు ఇంద్రునకు ప్రహ్లాదునకు చిరకాలము యుద్ధము జరిగెను. ఆ యుద్ధము మునులకు కూడ చాల ఘోరముగా కన్పట్టెను. అట్టి భీకరపోరాటమున శుక్రాచార్యులు గురువుగా గల ప్రహ్లాదుడు మొదలగు రాక్షసులకు జయము చేకూరెను.

ఆ కష్టసమయమున గురువు మాటప్రకారము సర్వ దుఃఖవినాశని ముక్తి దాయిని శివస్వరూపిణియైన శ్రీరాజరాజేశ్వరిని మనస్సులో తలచుకొని యింద్రుడు యిట్లు స్తోత్రము చేసెను ఓ దేవీ! ఓ మహాదేవీ! ఓ మహా మాయా! భక్తులయిలవేల్పు! ఓయమ్మా నీవు శంఖచక్రగదా పద్మములను శూలఖడ్గములను ధరించి మాక భయమును వరములను ఇమ్ము. ఓ తల్లీ నీకు జయమగుగాక భువనేశానీ! మాతా! నాదబిందుకళా స్వరూపిణీ! దశతత్వాత్మికా! శక్తి ప్రధానమైన దర్శనశాస్త్రములకు ముఖ్యనాయికా! నీకు వందనములు తల్లీ! యని ప్రార్థించి యిట్లు స్తుతించెను.

శ్లో॥ జయదేవి మహామాయే! శూలధారిణిచాంబికే ।
శంఖచక్ర గదాపద్మ ఖడ్గహస్తేఽ భయప్రదే ।
నమస్తే భువనేశాని! శక్తిదర్శన నాయికే ।
దశతత్వాత్మికే మాతర్మహా బిందుస్వరూపిణి ॥
మహాకుండలినీ రూపే సచ్చిదానందరూపిణి ।
ప్రాణాగ్ని హోత్ర విద్యేతే నమో దీపశిఖాత్మికే
పంచకోశాన్తరగతే పుచ్ఛ బ్రహ్మస్వరూపిణి ।
ఆనందకలికే మాత: సర్వోపనిషదర్చితే
మాత: ప్రసాద సుముఖీభవ హీనసత్వాం
స్త్రాయస్వనో జనని దైత్యవరాన్ జితాన్మై
త్వం దేవినశ్శరణదా భువనేప్రమాణా
శక్తాసి దుఃఖ శమనేఽఖిల వీర్యయుక్తే
ధ్యాయంతియేఽపి సుఖినో నితరాంభవన్తి
దుఃఖాన్వితా విగతశోకభయాస్త ధాన్యే
మోక్షార్థినో విగత మానవిముక్త సంగా
స్సంసారవారిధి జలం ప్రతరంతిసంత:
త్వం దేవి విశ్వజనని ప్రథిత ప్రభావా

సంరక్షణార్థము దితార్తి హరప్రభావా।
సంహర్తుమే తదఖిలంకిలకాలరూపా
కోవేత్తితేఽంబ చరితం నను మందబుద్ధిః।
బ్రహ్మా హరశ్చహరి దశ్వరథో హరిశ్చ
ఇంద్రోయమోఽధవరుణాగ్ని సమీరణౌచ।
జ్ఞాతుంక్షమాన మునయోఽపి మహానుభావా
యస్యాః ప్రభావమతులం నిగమాగమాశ్చ
ధన్యాస్త యేవ తవభక్తి పరామహాంతః
సంసార దుఃఖరహితా స్సుఖసింధు మగ్నాః ।
యేభక్తి భావరహితా నకదాపి దుఃఖాంభోధిం
జనిక్షయ తరంగముమేతరంతి
యేవీజ్యమానా! స్సిత చామరైశ్చ క్రీడంతి ధన్యాశ్శిబికాధిరూఢాః।
తైః పూజితాత్వం కిలపూర్వదేహే నానోపహారైరితి చింతయామి
యే పూజ్యమానావరవారణస్థా విలాసినీ బృందవిలాసయుక్తాః
సామంతకైశ్చోపనతైర్వ్రజంతి మన్యేహితైస్త్వంకిల పూజితాసి ॥
ఏవం స్తుతామఘవతా దేవీ విశ్వేశ్వరీతదా
ప్రాదుర్బభూవతరసా సింహారూఢా చతుర్భుజా ।
శంఖచక్ర గదా పద్మాన్‌బి భ్రతీ చారులోచనా
రక్తాంబరధరా దేవీ దివ్యమాల్య విభూషణా ॥
తానువాచసురాన్దేవీ ప్రసన్నవదనాగిరా
భయంత్యజతభో దేవాః శంవిధాస్యేకిలాధునా ॥
ఇత్యుక్త్వా సాతదాదేవీ సింహారూఢాఽతిసుందరీ ।
జగామతరసా తత్రయత్రదైత్యామదాన్వితాః ॥

**స్తోత్రభావము:-** ఓదేవి! మహాదేవి! మహామాయా! భక్తుల యిలవేల్పా! ఓయమ్మా! నీవు శంఖచక్ర గదాపద్మశూలఖడ్గములను ధరించిమాకు అభయము వరములను యిచ్చునట్టి తల్లివి. నీకు జయమగుగాక భువనేశి! మాతా! నాదబిందుకళా స్వరూపిణి! దశతత్వాత్మికా! శక్తిప్రధానమైన దర్శన శాస్త్రములకు ముఖ్యనాయికా! నీకు మా వందనములు తల్లీ! మహా కుండలినీశక్తి స్వరూపిణీ! సచ్చిదానంద స్వరూపిణీ! నిత్య చైతన్యజ్యోతీ! ఓ ప్రాణాగ్నిహోత్రవిద్యా శిఖాత్మికా! నీకు వందనములు నీవు పంచకోశాన్తర నిలయువు. ఆనందకోశ మందలి పుచ్ఛబ్రహ్మ

స్వరూపిణివి. ఆనందశివ మూర్తివి. సర్వోపనిషదర్చితవు. నీకు వందనములు తల్లీ! ఓ జగజ్జననీ! మేము రాక్షసులతో ఓడితిమి. బలహీనులమైతిమి. మా యెడల ప్రసన్నురాలవు అగుము. అమ్మా! మమ్ము కాపాడుమమ్మా! ఈ త్రిభువనము లందు నీవొక్కతెవే శరణమిచ్చుదానవు. మా దుఃఖములను తొలగించుటకు నీవే సర్వసమర్థురాలవు. నీకు వందనములు తల్లీ!

ఓ విశ్వజననీ! నిన్ను నిరంతరము ధ్యానించువారు. శాశ్వత సుఖశాంతులను పొందుదురు. నిన్ను ధ్యానింపనివారు భయశోకములతో దుఃఖములపాలగుదురు. సంగరహితు లైన ముముక్షువులీ సంసారసాగరమును దాటగలరు. ఓయమ్మా! నీవు విశ్వజననివి. దేవీ! నీ ప్రభావము ప్రపంచ ప్రసిద్ధము. నీవు దుఃఖహారిణివి. నీవే సర్వ రక్షణదక్షురాలవు. నీవే యఖండ కాలస్వరూపురాలవు. ఈ సకలమును నీవే సంహరించుదానవు. తల్లీ నీ దివ్యచరితము మందమతికేమి తెలియును? నీ అ తులదివ్యశక్తి ప్రభావమును హరి హర బ్రహ్మలు ముని గణమును యెరుగ లేరు. నిగమాగమములు కూడ తెలిసికొన లేవు. ఓయుమాదేవీ! నీపాదపద్మ సేవాపరాయణులైన మహాత్ములే ధన్యులు. వారు సంసార దుఃఖరహితులు. కాని భోగసాగరమగ్నులు భక్తి రహితులు జన్మమృత్యుసాగరమును దాటజాలరు. ఓ మాతా! నిత్యము చామరములచే వీచబడు వారును సుఖ క్రీడలాడువారును. అందలము లెక్కువారును పూర్వ జన్మమున నిన్ను పూజించియుందురని తలతును. ఎవరు నిత్యము పూజింపబడుదురో, ఎవరు ఏనుగుల నెక్కితి రుగుదురో, ఎవరు విలాస వంతులై వర్తింతురో, తమకు లోబడిన సామంతులతో కూడి సంచరింతురో వారు పూర్వము నిన్ను పూజించి యుండిరని భావించెదను.

అని యీ విధముగా ఇంద్రుడు స్తుతింపగా శ్రీత్రిభువనేశ్వరీదేవి సింహాధి రూఢయై చతుర్భుజయై వేగమే ప్రత్యక్షమయ్యెను. ఆజనని శంఖ చక్ర గదాకమల ముల ధరించి రక్తాంబరధారిణియై దివ్యమాల్య భూషితయై దేదీప్యమానయై ఒప్పెను. శ్రీదేవి ప్రసన్నవదనముతో అమృతవచనములతో దేవతల గూర్చి యీ విధముగా పలికెను. ఓ దేవతలారా! భయము విడువుడు. మీకు సిరిసంపదలును సుఖశాంతులును కలిగించెదను. అని పలికి సింహాసనాసీనయై జగదేకమాత వెంటనే మదగర్వితులగు రాక్షసులున్నచోటికి వెళ్ళెను.

## శుక్రుడు మంత్రప్రాప్తికై తపమొనర్చుట

పూర్వము దేవదానవులు యుద్ధము చేయుచుండగా విష్ణువు సహాయముచే దేవతలు రాక్షసుల నోడించిరి. అప్పుడు రాక్షసులకు శుక్రాచార్యులు నేను మంత్ర

శక్తితో మిమ్ము రక్షింపగలను. కొంతకాలము వేచియుండుడని చెప్పెను. మరియు నేను శంకరుని నుండి మంత్రవిద్య గ్రహించిన వచ్చువరకు మీరు తపస్సు చేయుడు. సమయము అనుకూలముగా నున్నప్పుడు దేవతలను మీరు జయింప గలరు అని పలికి పరమశివుని వద్దకు వెళ్ళెను. అప్పుడు రాక్షసులు సంధి చేసికొను టకు ప్రహ్లాదుని దేవతలవద్దకు పంపిరి. అతడు దేవతల వద్ద వెళ్ళి దేవతలారా! మేము అస్త్రసన్యాసము చేసితిమి. అని చెప్పగా దేవతలు క్రీడాసక్తులై యుండిరి. రాక్షసులు శుక్రుని రాక కెదురుచూచుచుండిరి. శుక్రాచార్యులు శివునివద్దకు వెళ్ళి బృహస్పతి వద్దలేని మంత్రములను నాకనుగ్రహిపుమని కోరెను. శివుడు దేవతలకు ఉపకారము చేవలెనని తలచి శుక్రునితో వేయి సంవత్సరములు తపస్సు చేసినచో నీ కోరిక సిద్ధించుననెను. శుక్రుడట్లే యని తపమాచరించపదొడగెను. దేవతలు యుద్ధవిముఖులై యున్న రాక్షసులపై ఒక్కుమ్మడిగ దాడిజరిపిరి. అప్పుడు దానవులు శుక్రాచార్యుల తల్లిని శరణువేడిరి. ఆమె తన తపోబల ముచే దేవతలను నిద్రపోవునట్లు చేసెను. విష్ణువు ఆసమయమున ఇంద్రుని తనలో ప్రవేశింపుమనెను. ఇంద్రుడట్లే చేసెను. శక్రుని తల్లిని విష్ణువు తన చక్రా యుధముతో తలను ఖండించెను. అందుచే ఇంద్రోపేంద్రులు బాధలేనివారైరి.

# జయంతీ శుక్రుల సమాగమము

భృగుమహర్షి తన భార్యను విష్ణుమూర్తి చంపినందులకు చాల బాధపడి నీవనేకములైన అవతారములెత్తెదవని శపించెను. మరియు తన భార్యను తన తపశ్శక్తిచే బ్రతికించుకొనెను. నిద్ర నుండి మేల్కొంచిన యింద్రుడు తపస్సు చేయుచున్న శుక్రాచార్యుడింకేమి యపకారము చేయునోయని తన కూతురగు జయంతిని శుక్రునకు పరిచర్య చేసి అతనిని వశమొనర్చుకొనుమని పంపెను. ఆమెయు నట్లేయని శుక్రునకు సేవచేసి యాతని మెప్పించెను. శుక్రుడు నీకిష్టమైన దాని నిత్తును కోరుకొనుమనగా ఆమె నన్ను భార్యగా చేసికొనుమనెను. శుక్రా చార్యులు జయంతితో కామభోగములను అనుభవించుచుండగా బృహస్పతి శుక్రుని రూపములో రాక్షసుల వద్దకు వెళ్ళి మీ మేలుకోరి శివుని మెప్పించి యొక విద్యను పొందితిని. దానిని మీకు బోధింతుననెను. రాక్షసులా మాటలను సంతసించి నిర్భయముగా నుండిరి.

# దేవగురువు దానవులవంచించుట

దైత్యులు బృహస్పతిని తమ గురువైన శుక్రునిగా తలచి యతని పట్ల విశ్వా సముతో అతని మాటజవదాటకుండిరి. ఛాల శుక్రుని వియోగముచే దైత్యులు

బాధపడిరి. కనుక వారు బృహస్పతి మాయచే మోహితులైరి. వారు విద్యకొరకు శుక్రరూపములో నున్న గురుని శరణు జొచ్చిరి. శుక్రుడు పదిసంవత్సరములు జయంతితో క్రీడించుచు సంతోషముగా గడపెను. పిమ్మట శుక్రునకు తన శిష్యులు గుర్తు కొచ్చిరి. అయ్యో రాక్షసులు నాపై కొండంత విశ్వాసముతో ఆశ పెట్టుకొని నాకైయెదురు చూచుచుందురు. నేనిపుడే వెళ్ళి వారిని చూచెదను. వారు భయాతురులు. నాభక్తులు వారికి దేవతల వలన భయము ప్రాప్తించకుండు గాక యని మనస్సులో తలచి సుందరీ! నా పుత్రులు దేవతలకు లొంగిపోయిరి. నేనిపుడు వెళ్ళి వారిని చూచి వెంటనే నీవద్దకు వచ్చెదను. జయంతి అట్లే కానిమ్మని పలికెను. అప్పుడు శుక్రుడు రాక్షసులను నిందించి జైనధర్మమును బోధించుచుం డెను. శుక్రుడు తన శిష్యులు బృహస్పతిచే వంచింపబడిరని విచారించెను. దేవత లకు గురువైయుండి కూడ అసత్యమును ప్రచారము చేయుచున్నాడని నా శిష్యులు మూఢులు. వీరిని గురువునట్లునివలె మిక్కిలి మోసము చేసినాడు.

## దైవబలమే బలవత్తరమును ఉపాఖ్యానము

శుక్రాచార్యుడిట్లు ఆలోచించుకొని నవ్వుచు దైత్యులతో నిట్లనెను. ఓ దానవులారా! నా రూపముతో వచ్చిన దేవతల గురువుచే మీరు మోసపోతిరి. వాస్తవ శుక్రుడను నేను. ఇతడు దేవకార్యము సాధించుటకు వచ్చిన బృహస్పతి. ఇతని మాటలు నమ్మవద్దు. అని పలుకగా దైతేయులు ఇరువురు నొకేరూపములో నుండుటచే అసలు శుక్రుడెవడో గ్రహింపలేకపోయిరి. శుక్రునకు కోపము వచ్చి మీరు చైతన్యరహితులై తిరస్కరింపబడుదురు గాక యని శపించి యచటనుండి వెడలి పోయెను. బృహస్పతి అక్కడనే స్థిరచిత్తుడై యుండెను. శుక్రుడు శపించినట్లు విని అచటి నుండి వెడలి నిజరూపముతో ఇంద్రుని వద్దకు చేరి యసురులు శాపగ్రస్తులై నిరాశ్రయులైయున్నారు. ఇప్పుడు వారిని జయించుట సులభమని చెప్పగా ఇంద్రాది దేవతలు రాక్షసులపై యుద్ధమునకు వెడలిరి. రాక్షసులు ఎంత కాలమునకు గురువు రానందున దేవగురువు తమను మోసగించెనని తెలిసికొని నిందించి కోపముతో వెళ్ళిపోయిన శుక్రుని వద్దకు ప్రహ్లాదుని వెంటబెట్టుకొని వెళ్ళిరి. ప్రహ్లాదుడు శుక్రాచార్యులను స్తుతించి ప్రసన్నుని చేసికొనెను. శుక్రాచార్యుడు దివ్యదృష్టితో సంతయు గ్రహించి రాక్షసులకిట్లు చెప్పెను.

పూర్వము బ్రహ్మదేవుడు సత్యము హితకరమైన ఒక మాట చెప్పెను. అదియే మన ఈ భూమిపై మేలుకాని, కీడుగాని జరుగవలసినది తప్పక జరిగి తీరును. దైవమునకు విరుద్ధముగ నెవ్వడును ఏమియు చేయజాలడు"అని. కనుక మీరిపుడు

బలహీనులై యుంటిరి పాతాళమునకు పోయి తలదాచుకొనుడు. కాలము కలిసివచ్చినప్పుడు మీరు మూడులోకములకు రాజులై వెలుగొందెదరనియు చెప్పెను. ఒకనాడింద్రులు గాడిద రూపము ధరించెను. విష్ణు చేప, తాబేలు రూపము దాల్చెను. ఇట్టి సందర్భములబట్టి దైవమే బలవత్తరమైనదని తెలియుచున్నది. జగత్తంతయు దైవాధనమే.

## శ్రీ విష్ణువు అవతారములు

జనమేజయుడు మునిశ్రేష్ఠా! శ్రీహరి దివ్యావతారములను విశదముగా తెలుపుమని యడుగగా మహాపాప వినాశకములు అమృతమయమైన శాంతి సమృద్ధి కరములునగు భగవదవతారముల నిట్లు వ్యాసుడు చెప్ప మొదలిడెను. చాక్షుష మన్వంతరమున ధర్మపుత్రులుగా నరనారాయణులు ప్రసిద్ధినొందిరి. అది ధర్మావతము. వైవస్వత మన్వంతరమున హరిఅత్రి పుత్రుడుగా నవతరించెను. అది దత్తాత్రే యావతారము. నాల్గవయుగమున దేవతల నుద్ధరించుట రెండు మనోహరరూపముల ధరించెను. అవియే వరాహనృసింహ రూపములు. త్రేతాయుగమున కశ్యపమహర్షికి వామనుడుగ నవతరించెను. పిమ్మట పందొమ్మిదవ త్రేతా యుగమున పరశురాముడగా నవతరించెను. అదే యుగమున రామావతారము కూడ సంభవించెను. ఈ విధముగా హరిప్రతి యుగమునందును. అనేకావతారముల నెత్తుచుండును. త్రిగుణముల సమష్టియగు మాయచే సర్వప్రపంచము ఆవరింపబడి యున్నది.

## జనమేజయునకు కలిగిన సందేహములు

జనమేజయుడు వ్యాసునితో దేవకన్యలు వివాహము చేసికొనుమనగా నారాయణుడేమి చేసినో వివరింపుమని యడిగెను. వ్యాసుడిట్లు చెప్పెను! నారాయణుడు దేవకన్యలకు శాపమీయతలచగా నరుడు వారించి యాతని శాంతుని చేసెను. పిమ్మట నారాయణుడు నేనీ జన్మమందు తపస్సు చేయనిశ్చయించితిని. గనుక మిమ్ము వివాహమాడుట కుదురదు. మీరు స్వర్గమునకు వెళ్ళుడనెను. రాబోవు ద్వాపరయుగమున మీరెల్లరు నాకు భార్యలగుదురు అని వారి నోదార్చి పంపెను. దేవకాంతలు స్వర్గమునకు వెళ్ళి జరిగినదంతయు తెలుపగా దేవేంద్రుడు నరనారాయణుల ధైర్యమునువే నోళ్ళనుగ్గడించెను. ఆ నరనారాయణులే కృష్ణార్జునులుగా జన్మించిరి. అని చెప్పగా విని రాజు శ్రీకృష్ణుని చరిత్ర విస్తరముగ చెప్పుమని వ్యాసుని ప్రార్థించెను.

# భూదేవి తన భారమును బాపదేవతల వేడుట

అప్పుడు వ్యాసమహర్షి యిట్లు చెప్పెను. పూర్వమొకప్పుడు శాంతమూర్తి యగు భూదేవి పాపాత్ముల బరువు మోయలేక కృశించి భయపడి యేడ్చుచు గోరూపముతో దేవలోకమునకు వెళ్ళెను. ఇంద్రుడామెను చూచి నీకు భయమెందు లకు? నీకు దుఃఖమెందులకు కలిగెను? అని ప్రశ్నించెను. అప్పుడు భూమాత! యిట్లు చెప్పెను. మగధరాజు జరాసంధుడు పాపాత్ముడు. చైద్యుడు శిశుపాలుడును దుర్మార్గుడు. నరకుడు రుక్మి, కంసుడు, కేశిధేనుకవత్సకులు మొదలగువారు ధర్మహీనులు పాపాత్ములును. వీరిచే నేను మిక్కిలి పీడింపబడుచుంటిని. వారి భారము మోయ జాలకున్నాను. నేనిప్పుడు ఏమి చేయుదును? అని విన్నవించగా నీవు బ్రహ్మను శరణువేడుము. ఆతడు నీ దుఃఖమును తొలగింపగలడని చెప్పి నేను కూడ నచటకు వచ్చెదననెను. వెంటనే భూదేవి బ్రహ్మలోకమునకు వెళ్ళెను. ఆమె వెనుక దేవతలు ఇంద్రుడు కూడ వెళ్ళిరి. బ్రహ్మ భూదేవిని చూచి ధ్యానముచే ఆమె రాకకు కారణము నెరిగి నీ దుఃఖమునకు కారణమేమని ప్రశ్నింపగా భూదేవి పాపాత్ములైన రాజుల సంహరించి నాభారమును తొలగింపుమనెను. అంతట బ్రహ్మ ఓ భూదేవీ! ఈ విషయమున ఇంద్రుని వలె నేనును అసమర్థుడనే. దేవ దేవుడగు విష్ణువొక్కడే. నీ భారమును తొలగింప సమర్థుడు. మనమందరము శ్రీ మహావిష్ణువు వద్దకు పోదము రండని బ్రహ్మ భూదేవి యింద్రాది దేవతలతో వైకుంఠమున కేగెను. వైకుంఠమున శ్రీమహావిష్ణువు దర్శనమయ్యెను. బ్రహ్మాది దేవతలు నారాయణుని స్తుతించి భూదేవి భారమును తొలగింపుమని ప్రార్థింపగా గోవిందుడు, శివుడు నేను బ్రహ్మాదిదేవతలు అందరము పరదేవత యొక్క కటా క్షముచే పని చేయువారలమే నేను స్వతంత్రుడను కాను. కనుక భువనేశ్వరీదేవిని ప్రార్థించి ఆమె యనుగ్రహముతో మన కష్టములను తొలగించుకొనవలయునని అందరును శ్రీత్రిపురసుందరీ దేవిని మనసార సంస్మరించిరి. అంత నామెప్రత్యక్షమై వారికి దర్శనమొసంగెను. అప్పుడెల్లరు నామెకు నమస్కరించి స్తుతించగా ప్రసన్ను రాలై మీ కార్యమేదియో తెలిపినచో దానిని సాధించి తీరుదునని పలికెను. దేవతలు పరదేవత కిట్లు విన్నవించిరి.

తల్లీ! భూదేవి దుష్టరాజుల భారముచే పీడింపడి దుఃఖించుచున్నది. ఈమె భారమును తొలగించుట ఒక్కటే మా కోరిక. ఈ పనికే సాధ్యము కాని మాకు శక్యము కాదు అని విన్నవించిరి. అప్పుడు మేఘ గంభీరధ్వనితో దేవి యిట్లనెను. దేవతలారా! నేను పూర్వదేవతల అవతార విషయము నాలోచించితిని. ఆ

దుష్టదానవులచే కలిగిన భూభారమును తొలగింతును మగధపతి మొదలగు వారిని నాశక్తిచే బలహీనుల నొనర్చెదను. మీరు మీయంశలతో భూమిపై నవతరింపుడు. మీకు నా యద్భుతశక్తి తోడుకాగలదు. కశ్యపుడు తన భార్యతో యదువంశమున వసుదేవుడుగా జన్మింపగలడు. అట్లే విష్ణువు వసుదేవునకు పుత్రుడుగా నవతరించును. నేను గోకులమున యశోదకు జన్మించ గలను. దేవతలారా! నేనీవిధముగ దేవకార్యమొనర్పగలను. హరికారాగారామున జన్మించును. నేనతనిని గోకులమునకు చేర్చెదను. శేషుని దేవకీ గర్భమునుండి రోహిణీ గర్భమునకు చేర్పగలను. వారు నా దివ్యశక్తి వలన దుష్టులను చెండాడెదరు. కురుక్షేత్రమున దుష్టక్షత్రియులను నశింపజేసెదను. విప్రశాపముతో యాదవవంశమంతరించును. హరిశాప వశమున శరీరము విడువగలడు. మీరు మీస్త్రీలతో కృష్ణునకు సహాయ ముగా మధురలో గోకులమందును జన్మింపుడు. అని యీ విధముగా పలికి యోగ మాయాశక్తి యంతర్ధానమొందెను. దేవతలు భూదేవియు వెడలిపోయిరి.

## దేవకీవసుదేవుల జన్మవృత్తాంతము- కంసుడు దేవకీవసుదేవుల చంపుట- దేవదానవుల యంశావతార వర్ణనము

సూర్యవంశమతరించిన పిదప మధురానగరము యాదవులవశమయ్యెను. శూరసేనుడు మధురకు రాజై సుఖసంపదల ననుభవించెను. అతనికి కశ్యపాంశ మున వసుదేవుడు పుత్రుడై జన్మించెను. ఆ కాలమున ఉగ్రసేనుడు శూరసేన దేశమునకు రాజాయెను. అతనికి కంసుడు పుత్రుడు. అదితి దేవకుడను వానికి కుమార్తెయై దేవకి యని పిలువబడుచుండెను. ఆ దేవకమహారాజు తన కుమార్తెను వసుదేవునికిచ్చి వివాహము చేసెను. అప్పుడాకాశవాణి దేవకి అష్టమగర్భము నీ పాలిటి మృత్యుదేవతయని కంసుని హెచ్చరించినది. కంసుడు దేవకిని చంపి తనకు మృత్యువు లేకుండ . సికొనజూచెను. వసుదేవుని అనుచరులైన వీరులు దేవకిని విడిపించిరి. కంసుని కోపాగ్ని చల్లారుటకు వసుదేవుడు -దేవకికి పుట్టిన ప్రతిశిశువును నీకిచ్చెదనని పలికెను. అంతట కంసుని కోపము శాంతించినది. వసుదేవుడు దేవకితో నిర్భయముగా తన యింటికి చేరెను. కొలది కాలమునకు దేవకి గర్భవతి యైె పుత్రుని కనెను. వసుదేవుడు దేవకిని ఒప్పించి యాబాలుని కంసుని కీయగా కంసుడా శిశువును బండపై వేసి కొట్టిచంపెను. దేవకికి పుట్టిన ఆరుగురు బాలురును కంసునిచేనిట్లే చంపబడిరి. దేవకికి ఏడవ గర్భమున శేషుని

అంశావతారము ముండెను. అప్పుడు యోగమాయ దేవకి గర్భమందలి శిశువు నాకర్షించి రోహిణి గర్భమందుంచెను. జనులును కంసుడును గర్భస్రావమయ్యెనని తలచిరి. అష్టమ గర్భమున భగవంతుడు జన్మించెను. నారాయణాంశమున వాసు దేవుడు నరుని అంశము వలన అర్జునుడు. ధర్మరాజు ధర్మాంశమున వాయువు యొక్క అంశచే భీముడు అశ్వినిదేవతల యంశచే నకులసహదేవులు సూర్యుని యంశచే కర్ణుడు, ధర్మాంశమున విదురుడు బృహస్పతి యంశమున ద్రోణుడు శివాంశమున అశ్వత్థామ, ఇట్లే రాక్షసులయంశచే పలువురు రాజులు జన్మించిరి.

# శ్రీ రామకృష్ణుల యవతారవర్ణనము

దేవకి కుమారుల నారుగురను కంసుడు చంపెను. ఏడవ గర్భము పోయినది. ఎనిమిదవ గర్భమున జన్మించువాడే తనను చంపునను భయముతో కంసుడు జాగరూకుడై చూచుచుండెను. శ్రీమహావిష్ణువు దేవకి ఎనిమిదవ గర్భము నాశ్రయించెను. అదే సమయమున రోహిణి గోకులమున బలరాముని ప్రసవించెను. దేవకి గర్భములో శ్రీహరి దేవకార్యార్థమై వర్థిల్లుచుండెను. పదియవ నెలలో శ్రావణకృష్ణ అష్టమి రోహిణి నక్షత్రమున హరి యవతరించెను. అప్పుడు కంసుడు గడగడ లాడెను. దానవులతో మీరు జాగరూకులై యెనిమిదవ శిశువు జననమును నాకు తెలుపుడని చెప్పి తన భవనమునకు వెళ్ళెను. కాని మనస్సులో భయముచే శాంతి లేకుండెను. దేవకి అర్థరాత్రి పరమాద్భుత దివ్యకాంతుల విరజిమ్ము సుందర బాలుని ప్రసవించెను. ఆ బాలుని చూచి ఆమె అత్యాశ్చర్యము నొందెను. వసుదేవుడు ముద్దులొలుకు బాలకుని ఎత్తుకొనెను. అప్పుడాకాశవాణి వసుదేవా! త్వరగా నీవు నీ బాలుని గోకులమును చేర్చుము. కాపలావాళ్ళు నిద్రలో మునిగియున్నారు. ద్వారములు తెరచియున్నవి. ఈ బాలుని నందునింట విడిచి యచటి యోగ మాయను తెమ్మని పలికినది. వసుదేవుడు వెంటనే బాలకు నెత్తికొని బయటకు వెళ్ళి యమునా నది దాటి చీకటిలో గోకులము చేరెను. అచట నందుని యింట యశోదకు జన్మించిన యోగమాయను (బాలికను) నిద్రలో మునిగిన ఆమె వద్ద నుండి గ్రహించి వసుదేవుడు శీఘ్రముగా తన చెరసాలలో ప్రవేశించెను. అప్పుడా పిల్లకెవ్వున ఏడ్చెను. ద్వారపాలకులు లేచి వెంటనే కంసునకు దేవకి ప్రసవించినదని చెప్పిరి. కంసుడు త్వరగా చెరసాల వద్దకు వచ్చి వసుదేవుని నీ బిడ్డనిమ్ము. అష్టమ గర్భమైన యీ బిడ్డను చంపి శాంతి నొందెదని పలికెను. వసుదేవుడు వణకుచు పసిబిడ్డను కంసుని చేతులందుంచెను. బాలిక పుట్టినదేమి? ఇదియంతయు కాలవైపరీత్యమని యా పసిబాలను రాతిబండపై విసిరికొట్టెను. ఆ బాలిక వెంటనే

ఆకాశమున కెగసి ఓరి పాపీ! నిన్ను చంపువాడెప్పుడోపుట్టి యున్నాడు అని పలికి అదృశ్యమయ్యెను. కంసుడింటికి వెళ్ళి పూతనను గోకులమునకేగి పుట్టిన ప్రతి శిశువును చంపమనెను. కేశి, బక, ధేనుక, ప్రలంబాది, దానవులను, బాలకృష్ణుని చంపుటకు నియమించి మాటిమాటికి తన చావును తలచుకొనుచు మిక్కిలి దీనుడయ్యెను.

# శ్రీకృష్ణుని అత్యద్భుత చరిత్రము

గోకులమున నందునింట పుత్ర జన్మోత్సవము కన్నుపండువగా జరుగుచుండెను. ఆ వార్త విని కంసుడు క్రోధోద్రిక్తుడై మారువేషమున రాక్షసులనచటకు పంపెను. శ్రీకృష్ణుడు పూతన రాక్షసిని చంపివైచెను. బకవత్సకధేనుకాది రాక్షసులను చంపివైచెను. గోవర్ధనగిరిని లీలగా నెత్తెను. ఇవి యన్నియు విని ధనుర్యాగము నెపమున రామకృష్ణులను పిలిపించెను. వారు మొదట ధనుర్భంగ మొనర్చి రజకునివల యా పీడగజమును చాణూరముష్టికులకు చంపిరి. సర్వేశ్వరుడు కృష్ణుడు కంసుని జుట్టు పట్టి యీడ్చిచంపెను. తల్లిదండ్రులను చెరసాలనుండి విడిపించెను. ఉగ్రసేనుని మధురకు రాజుగా చేసెను. వసుదేవుడు రామకృష్ణులకు ఉపనయన మొనర్చెను. వారు సాందీపుని వద్ద సమస్త విద్యలనభ్యసించి మధురకు వచ్చిరి. పిమ్మట జరాసంధుని ఓడించిరి. కాలయవనాదుల వలన కలిగిన బాధలచే యాదవులు శ్రీకృష్ణుని యభిప్రాయానుసారముగ ద్వారకయందు నివసింపసాగిరి. పిమ్మట యవనుడు యుద్ధమునకు రాగా శ్రీకృష్ణుడు ముందు నడుచుచు ఒక కొండ గుహలో ప్రవేశించెను. అచటి ముచుకుందుడు నిద్రించుచుండెను. కృష్ణుడే యనుకొని కాలయవనుడు వానిని కాలితో తన్నెను ముచుకుందుడు కోపించి వానిని భస్మమొనర్చెను. ముచుకుందుడు కృష్ణునకు నమస్కరించి వనమునకు వెళ్ళగా కృష్ణుడు బలరామునితో ద్వారకకు చేరెను. ఉగ్రసేనుని రాజుగా చేసి శ్రీకృష్ణుడు స్వేచ్ఛగా విహరించుచుండెను. రుక్మిణిని శ్రీకృష్ణుడు రాక్షస వివాహము చేసికొనెను.

పిమ్మట జాంబవతి మిత్రవింద సత్యభామలను పెండ్లాడెను. కాళింది, లక్ష్మణ, నాగ్నజితి యను వారలను వేర్వేరు సమయములందు వివాహమాడెను. రుక్మిణి కుమారుడు ప్రద్యుమ్నుడు. శంబరుడను మాయావి పురిటింటనే బాల ప్రద్యుమ్ను నపహరించెను. అంతట పద్మనాభుడు శ్రీభువనేశ్వరీ దేవిని ప్రార్థించి స్తుతింపగా నామె ప్రసన్నయై నీ కుమారుడు పదహారేండ్ల వయస్సున శంబరుని చంపి తిరిగి రాగలడని పలికి యంతర్ధానము చెందెను.

# శ్రీకృష్ణుడు పుత్రప్రాప్తికి తపమొనర్చుట

జాంబవతి రుక్మిణి యొక్క గుణవంతులైన పుత్రులను చూచి తన కట్టిపుత్రు నను(గ్రహింపుమని శ్రీకృష్ణుని కోరగా కృష్ణుడు పుత్ర సంతికై తపస్సు చేసెను. కృష్ణుడు తపస్సు చేయు పర్వతమునందే ఉపమన్యువను శివభక్తుడు కలడు. కృష్ణుడతని వద్దకు వెళ్ళి అతని గురువుగా భావించి నియమనిష్ఠలతో పాశుపత మంత్రము జరిపించెను. శివుడు దర్శనమిచ్చెను. మరియు వాసుదేవా! నీ కోరికను తీర్చెదను ఏమి కావలెనో కోరుమనెను. అంతట కృష్ణుడు భక్తితో నమస్కరించి నిలిచి మేఘగంభీర ధ్వనితో స్తోత్రము చేసెను. శ్రీకృష్ణుడు పుత్రసంతానమును కోరుచున్నానని చెప్పగా నీ భార్యలందరకు ఒక్కొక్కతెకు పదిమంది చొప్పున పుత్రులు కలుగుదురని పలికెను. అంతట శ్రీకృష్ణుడు పార్వతీదేవికి నమస్కరించెను. ఆమె ప్రపంచమున కీర్తి నొందెదవు గృహస్థ శ్రేష్ఠుడవగుదువు అని పలికెను. పిదప పార్వతీ పరమేశ్వరులు అంతర్ధానము నొందిరి. శ్రీకృష్ణుడు ఉపమన్యునకు నమస్కరించి ద్వారకానగరమునకు వెళ్ళెను. కనుక బ్రహ్మాదిదేవతలు కూడ మాయకు వశులగుదురు. వారివారి పూర్వజన్మ కర్మలను బట్టి చిద్రూపిణి మాయా శక్తియై ప్రేరేపించుచుండును. దేవి జీవులను ముక్తులు నొనర్చును.

# ప్రహ్లాదుడు దేవిని ప్రార్థించుట

ప్రహ్లాదుడు మొదలగు వారు ఆ దేవిని చూచి ఒకరి మొగమొకరు చూచుకొని యిప్పుడేమి చేయుదమని చింతించిరి. ఈ దేవత చండిక. దేవతలను రక్షించుటకీమె యిటువచ్చినది. పూర్వము చండముండా సురుల నీమెయే సంహరించినది. పూర్వ మీతల్లియే వంకర చూపుతో మధుకైటభులను తెగటార్చినది. ఇప్పుడీమె తప్పక మనయంతు తేల్చ గలదు. అని యిట్లు చింతాపరులగు రాక్షసులను చూచి ప్రహ్లాదుడిట్ల నెను. ఓ రాక్షసలారా! ఇప్పుడు యుద్ధము తగదు మనము కాలికి బుద్ధి చెప్పుట మంచిది అని పలికెను. ఆ మాటలు పాటించి పరుగెత్తుటకు సిద్ధపడినవారిలో నముచియనువాడు ఇట్లనెను. మనము పరుగెత్తి నను జగన్మాత రోషముతో ఆయుధములచే మనలను చంపకవదలదు. కనుక మనకు దుఃఖము కలుగని పనిచేయుట మంచిది. ఆ తల్లినిపుడు స్తుతించి ఆమె ఆజ్ఞ తీసికొని మనము పాతాళమునకు పోవుదము అనగా ప్రహ్లాదుడు ఇట్లనెను. నేను సృష్ట్యంత స్థితి కారిణిని సర్వజనని భక్తుల కభయప్రదాయిని మహామాయాశక్తి యగు మహాదేవిని స్తుతించుచున్నాను. అని నుతించి పరమార్థవిదుడు విష్ణు భక్తుడునైన ప్రహ్లాదుడు జగదంబకు నమస్కరించెను. పూలమాలయందు సర్పభ్రాంతి

కలుగునట్లే యే తల్లియందు చరాచర జగము భాసించుచున్నదో ఆ సర్వాధిష్ఠాన రూపిణి యగు హ్రీం బీజ స్వరూపిణిని నమస్కరించుచున్నాను. తల్లీ ఈ స్థావరజంగమాత్మకమైన విశ్వ మంతయు నీవలననే కలిగినది. బ్రహ్మాదులును నీచేతనే సృజింపబడిరి.

ఓ మహా మాయాదేవీ! నీకు నా నమోవాకములు. నీవు బ్రహ్మాండ మాతవు. దేవదానవులను నీవే సృష్టించితివి. కాన నీకు వీరిపట్ల భేదమెక్కడిది? తల్లికి పుట్టిన పుత్రులలో సన్మార్గులు దుర్మార్గులు నుందురు. ఐనను తల్లి వారిని సమభావముతో చూచును. అట్లే యిప్పుడు దేవతలందు మాయందును నీకు భేదభావము తగదు. మాతా! నీవు పురాణముల విశ్వజననివిగా పేరు పొందితివి. నీకు దేవతలవలె మేమును పుత్రులమే. వారును మేమును స్వార్థపరులమే నిజముగా దేవదానవుల మధ్య భేదములేదు.

ఓయమ్మా! దేవేశ్వరీ! మేము ధనభార్యాదిభోగములందు నిత్యము ఆసక్తి కలిగి యుండుట సత్యమే. వారును మావంటివారే. ఇక మాయిరువురి నడుమ నీకు భేదభావమేల కలిగెను? విశ్వజననీ! నీకిట్టివిరుద్ధ భావము తగదు. దేవతలనువలె మమ్ముకూడ చూడుము. వారు కశ్యపపుత్రులే మేమును కశ్యపపుత్రులమే దేవతలు మాకంటె గుణవంతులెట్లగుదురు? కామక్రోధ లోభ మోహములందరియందును కలవు. తల్లీ నీకు బుద్ధియందు మా యుద్ధము చూచువేడుక పుట్టియుండును. అందుచే నీవు లీలామాత్రముగ మాలో భేదములు పుట్టించి పరస్పర విరోధములు కల్పించి తివని తలచుచున్నాను. చాముండా! నీకు నిజముగా మా కలహము చూచు కోరికయే లేనిచో అన్నదమ్ములమైన మాలో మాకీపొరపొచ్చెములేల కలుగును? మేము కూడ కొంచెము ధర్మమెరుగు దుము. ఇంద్రుని గూర్చి మాకంతయును తెలియును. ఇక మాలో మాకు కలహము కేవలము నీభోగము కొరకే సుమా! నీకంటే శాసకుడెవడున్నాడు?

పూర్వమొకప్పుడు దేవతలు రాక్షసులు కలిసి పాలసముద్రమును మథించిరి. అప్పుడు దానినుండి అమృతము దివ్యరత్నములును వెలువడినవి. ఆయమృత మును పంచునెపముతో శ్రీహరి మాలోమాకు భేదములు కల్పించెను. ఓ విశ్వ మాతా! జగద్గురువగు శ్రీహరి ప్రపంచ పోషణకు నీచేతనే నియమింప బడినవాడు. అతడే స్వయముగా దేవకాంతయైన శ్రీమహాలక్ష్మిని స్వీకరించెను. ఆ సమయమున దేవరాజు ఐరావతమును ఉచ్చైశ్రవమును కామధేనువును పారిజాతమును స్వీకరించెను. హరియనుమతితో తక్కిన దేవతలే విలువగల తక్కిన వస్తువులను

గ్రహించినారు. ఆ విధముగా అన్యాయమునకు ఒడిగట్టిన దేవతలే ఈనాడు సత్ప్రవర్తనులైరి. నిజమునకు దేవతలే అన్యాయపరులు. ధర్మలక్షణమెట్టిదో నీవే యెరుగుదువు. లోకమాన్యుడైన విష్ణువే వారినంత మహోన్నతస్థాన మందుంచెను. అప్పుడు దేవతలవలన రాక్షసులు పరాభవమునకు గురియైరి. కనుక ఏది ధర్మము? ఏది కార్యము. అధర్మ స్వరూపమెట్టిది? అ సాధుత్వమెట్టిది? ఇవి యన్నియు నీవేల యెరుగుదువు. నీవు ధర్మ సూక్ష్మదృష్టితో అంతయును సమదృష్టితో చూడుము. తార్కికులు యుక్తివాద మెరిగినవారు. వేదవాదులు విధిమార్గమును సూటిగా అనుసరించువారు.

ఈ ప్రపంచము నంతయు సృష్టించిన ఈశ్వరుడున్నాడను విషయమున మందబుద్ధులగు నిరీశ్వర మీ మాంసకులు వివాదము చేయుచుందురు. నిజముగ ఈ విశాల ప్రపంచమునంతటిని ఒక్కడే సృష్టించిన యెడల సృష్టిలోనింత భేదము ఎందుకుండవలెను. వేదశాస్త్రములందన్నింటి యందును ఐక్యభావమెందుకు లేదు? అని నిరీశ్వరవాదులు వాదింతురు. మొత్తము ఈ ప్రపంచమంతయును స్వార్థముతో నిండియున్నది. అందుచే ఈ వేదవేత్తల వాక్కులలో ఐక్యము లేదు. కోరికలేనివాడు ప్రపంచములో ఒక్కడునులేడు. నామనుమడు బలి ధార్మికులలో గొప్పవాడు. సత్యవ్రత పరాయణుడు శాంతుడు సర్వజ్ఞుడు సర్వపూజితుడు నిరప రాధి. రాక్షసరాజు. ఐనను శ్రీహరి కపట వామనరూపమున అతని తలపై కాలుపెట్టి అతని రాజ్యమునపహరించెను. ఐనను దేవతలే ధర్మపరులని పండితులు పొగడు చున్నారు. లోకములో నెదుటివాని కిష్టమగు మాటలు మాట్లాడిన వాడే ధర్మము చెప్పువాడుగా లెక్కింపబడుచున్నాడు. ఇవన్నియు నీకు తెలియనివి కావు. కనుక నీకెట్లుతోచినట్లు చేయుము. రాక్షసులందరు నీకిప్పుడు శరణార్థులు. వారిని కాపాడుదువో విడిచిపెట్టెదవో అంతయు నీయిష్టము. అని ప్రార్థించెను!

అని పలుకగా దేవి యిట్లు మాట్లాడెను:- ఓ రాక్షసులారా! మీరిపుడు పాతాళమునకు పోయి స్వేచ్ఛగా నుండుడు. మీరు కోపమును విడిచి పెట్టుడు. నిర్భయ ముగానుండుడు. కాలము నెదురుచూడుడు. నిరాశా నిస్పృహలకు లోనుకాకుడు అట్టివారికి సుఖము చేకూరదు. మీకు శుభకాలము రాగలదు. ఇప్పుడు మీరీ భూమిని విడిచి పాతాళమునకు పొండు. నాయాజ్ఞచే మీరందరును పాపము లేని వారగుదురు. అనగా వారు దేవికి మ్రొక్కి పాతాళమునకు పోయిరి. దేవియు అంతర్ధానము చెందెను. దేవతలు కూడ తమ నివాసములకు పోయిరి. ఈ విధముగా దేవదానవులు విరోధమును విడిచిపెట్టిరి.

# పంచమ స్కంధము

## యోగ మాయా ప్రభావము

ఋషులు సూతమహర్షీ! శ్రీకృష్ణుడు సామాన్యుని వలె తపమేల చేసెను? అని ప్రశ్నింపగా వ్యాసుడు తనకు చెప్పిన విషయమును వినిపింతునని సూతుడిట్లు చెప్పెను. వాసుదేవుడు సర్వకార్యదక్షుడు, దానవాంతకుడు నిజమే ఐనను మానవుడుగా నున్నందున మానవభావము కలిగియుండెను. మరియు ఓంకారములో అకారము బ్రహ్మ ఉకారము విష్ణువు, మకారము శివుడు అని చెప్పుదురు. ఈ ముగ్గురిలో ఒకరికంటె రెండవవాడు, వానికంటె మూడవవాడు గొప్పవాడని చెప్పుదురు. అందుచే కృష్ణుడు తనకంటె గొప్పవాడగు శివుని సేవించుట సమంజసమే. యోగమాయా ప్రభావముచే యుయాగమున విష్ణువవతరించుచుండును. విశ్వజననియైన పరదేవత కనురెప్ప తెరచినంత మాత్రమున ఈ బ్రహ్మాండములనెల్ల సృష్టించి పెంచిలయింపచేయును. ఆ దేవి కృష్ణుని నందగోపునింట నుండునట్లు చేసినది. కృష్ణు చేసిన ఘనకార్యములన్నియు అ దేవి చేయించినవే. కృష్ణుడు నిఖిలధర్మ సంస్థాపకుడు. మూలప్రకృతి యనబడు పరదేవత నుండియే హరిహర హిరణ్యాగర్భులుద్భవించిరి. అహంకారము నరుని పతితుని చేయును. బ్రహ్మ తన అహంకారమును విడిచిపెట్టిన, ముక్తుడగును. అతడు అహంకారముతో నున్నప్పుడు ప్రపంచమును సృష్టించును/ అట్లే జీవుడు అహంకారము విడిచినచో ముక్తుడగును. అహంకారమునకువశుడైనచో బద్ధుడగును. ప్రాణికి అహంకారమే బంధకారణము. హరి అహంకారముతో కూడి జగత్తులను పాలించుచుచుండును. భగవంతుడైన విష్ణువు స్వతంత్రుడుకాడు. స్వతంత్రుడైనచో గర్భనరకము ననుభవించుట సామాన్యునివలె అనేక కష్టముల నెందుటయేల సంభవించును? కనుక హరిహర బ్రహ్మలు మాయచే బంధింపబడి క్రీడించుచుందురు. అని వివరించెను!

## మహిషాసురుని జన్మ వృత్తాంతము

జనమేజయుడు పరదేవత యొక్క అమృతచరిత్రను యింకను వినకుతూలము గానున్నది. దయతో వివరింపుమనగా వ్యాసుడిట్లు చెప్పెను. పూర్వము మహిషాసురుడను రాజు కలడు. అతని కాలమున దేవదానవులకు ఘోరమైన యుద్ధము సంభవించెను. ఆ రాక్షసుడు తన కోరిక సిద్ధించుటకై మేరుపర్వతముపై తీవ్రమగు తపస్సు చేసెను. బ్రహ్మ సంతోషించి ప్రత్యక్షమై ఏమి కావలెనని వాని ప్రశ్నించెను. మహిషుడు నాకు చావులేకుండునట్లు వరమిమ్మనెను. బ్రహ్మ అది

యసంభవము. వేరొక వరమును కోరుకొనుమనెను. మహిషుడు దేవదానవ నరుల వలన చావులేకుండ చేయుము- స్త్రీ నన్ను చంపలేదు. కనుక స్త్రీ వలన చావు సంభవింపనిమ్మనెను. అంతట బ్రహ్మ ఓ మహిషాసురా! నీకు స్త్రీవలననే చావు కలుగును. ఇతరులెవ్వరు నిన్ను చంపలేరని వరిమిచ్చి తన లోకమునకు వెళ్ళెను. దైత్యుడు సంతోషముతో నింటికి వచ్చెను. అని చెప్పగా జనమేజయుడాతడెవ్వని కొడుకు వానికి మహిష రూపమేట్లు వచ్చెనని ప్రశ్నింపగా వ్యాసుడు ఇట్లు చెప్పెను.

పూర్వము రంభుడు, కరంభుడు అను ఇరువు దానవులు కలరు. వారికి పుత్రసంతతి లేదు. వారిరువు పుత్ర సంతతికై చాల సంవత్సరములు తపస్సు చేసిరి. ఇంద్రుడు మొసలిరూపము ధరించి కరంభుని చంపెను. రంభుడు తన యన్నచావు విని తన తలను ఖండించి అగ్నిలో వేయబోవుచుండ అగ్నినీవేల ఊరక ప్రాణములు పోగొట్టుకొందువు? వరమడుగుము అని పలికెను. అంతట రంభుడు ముల్లోకముల గెలుచు కుమారుని ప్రసాదింపుమని కోరెను. అగ్నిదేవుడట్లే నీకు పుత్రుడు జన్మించునని పలికి అంతర్ధానమొందెను. రంభుడు అక్కడక్కడ విహరించుచు మదించిన గేదెపై మనస్సు గలవాడై దానియందు కుమారుని పొందెను. పిమ్మట రంభుడొక దున్నపోతుతో పోరాడగా అది కొమ్ములతో గుండెలపై పొడిచి యాతని చంపివైచెను. రంభుని వియోగము భరింపలేక గేదె చచ్చుటకు ప్రయత్నించుచుండగా మహిషి గర్భము నుండి మహాబలుడగు మహిషుడు జన్మించెను. రంభుడు పుత్రవాత్సల్యముచే మరియొక రూపుదాల్చి వచ్చెను. ఈతడే రక్తబీజుడను రాక్షసుడు, మహిషుడు రాజుగా పట్టాభిషిక్తు డయ్యెను. మహిష రక్తబీజులు దేవదానవులకు చంపరానివారయ్యిరి.

## మహిషాసురుడు వరగర్వితుడగుట

మహిషాసురుడు వరగర్వితుడై భూమినంతటిని ఏకచ్ఛత్రాధిపతిగా పాలించెను. అతనికి వీరుడైన చిక్షురుడు సేనాపతి. గొప్ప సైన్యముగల తామ్రుడు కోశాధిపతి. అసిలోముడు ఉదర్కుడు బిడాలుడు బాష్కలుడు, త్రినేత్రుడు మొదలగువారు సేనలతో భూమినంతటిని ఆనాక్రమించిరి. బ్రాహ్మణులెల్లరు మహిషునకే హవిర్భాగముల నర్పించిరి. ఆ రాక్షసరాజు దేవేంద్రుని వద్దకు దూతను పంపుచు ఓ సహస్రాక్షా! నీవు స్వర్గము విడిచి వెళ్ళుము లేద మహిషునికి దాసుడ వగుము. నీవు మహిషాసురుని శరణువేడనిచో యుద్ధమునకు సిద్ధపడుము అని చెప్పుమనెను. ఇంద్రుడు మహిషుని సందేశము విని కోపించి ఓరి మందబుద్ధీ! నీవు మదించియున్నావు దూతవుగాన నిన్ను చంపక విడుచుచున్నాను. మీ రాజుతో

నిట్లు చెప్పుము. ఓ మహిషీపుత్రా! నీకు యుద్ధమిష్టమైన త్వరగా రమ్ము. నీ బలమునే నెరుగుదును. నీ కొమ్ములు కోసివేసెదను. నీకు యుద్ధ మేమియు తెలియదు కొమ్ములతో పొడుచుట మాత్రమే తెలియును. అని పలుకగా దూత వెంటనే మహిషునకు దేవా! ఇంద్రుడు నిన్ను లెక్కపెట్టుట లేదు. మిక్కిలి నిందించి నాడు అని చెప్పెను. అప్పుడు మహిషాసురుడు నన్ను రుద్రుడు కూడ ఎదిరింప లేడు. ఇక ఇంద్ర విష్ణువు లేమి చేయగలరు? నేను దేవతనెల్ల జయించి స్వర్గమును వశము చేసికొందును. దానవీరులనందరను సేనాపతులుగ నియమింపుడు. స్వర్గమును జయించుటకు సంసిద్ధులు కండని రాక్షసుల నాదేశించెను.

# ఇంద్రునకు గురుని హితబోధ

మహిషుని దూత వెళ్ళిన పిమ్మట ఇంద్రుడు యమవరుణవాయు కుబేరులను పిలిచి సురలారా! రంభుని పుత్రుడు మహిషుడు మహాబలశాలి వరగర్వముచే మదించియున్నాడు. అతడు నావద్దకు దూతను పంపినాడు. ఆ దూత నేను స్వర్గము విడిచి యెక్కడ కేనివెళ్ళవలెననియు. అట్లుకానచో మహిషునకు భృత్యు డను కావలెనని చెప్పెను. ఇప్పుడు మన కర్తవ్యమేమో తెలుపుడు. బాలునితో సంధి తగినది కాదు. మనము ముందు శత్రుసేనల సంఖ్యాబలములను చారుల ద్వారా తెలిసికొని పిమ్మట యుద్ధభేరి మ్రోగింపవలయును. తొందరపడి యే పనియు చేయురాదు. అని నేర్పరియైన చారుని పంపెను. అతడు శత్రుసేనల బలాబలములు తెలిపెను. మహిషుని బలమును ప్రయత్నము విని యింద్రు డాశ్చర్యపడెను. అంతట బృహస్పతి దగ్గరకు వెళ్ళి మహిషుడు మహావీర్యుడు మత్తుడును. అతడు దానవులందరితో కలిసి యుద్ధమునకు రానున్నాడు. ఇప్పుడు మాకు నీవే దిక్కు. ప్రతిక్రియ నాలోచింపుము అని పలుకగా బృహస్పతి బాగుగా నాలోచించి ఇంద్రునితో నిట్లనెను. ఇప్పుడు బాగుగా ఆలోచించి యథావిధిగ ప్రయత్నమొనర్పుము. పిమ్మట కాదగినది కాగలదు. మనమెంత ప్రయత్నించినను దైవమనుకూలించిన గాని యేపనియు ఫలము నీయజాలదు. మమకారము లేని వాడు సుఖపడును. మమకారము నశించిననే జ్ఞానము అలవడును. ఏది జరుగ వలెనో అది జరిగితీరును. అని ధైర్యమును కలిగించెను!

# ఇంద్రుడు మహిషుని సేనలతో పోరుట

ఇంద్రుడు గురువు మాటలు విని నేను మహిషుని నాశమునకు యుద్ధ ప్రయ త్నమొనర్తును. పూర్వము వృత్రనముచి బలాసురుల వధించినట్లే మహిషుని సం హరింతును. నీ బలము వజ్రాయుధ బలము నాకు గలవు. హరిహరులు నాకు

సహకారులు. నీవు రక్షోఘ్నమంత్రములు జపించిన నన్ను కాపాడుమని ప్రార్థించెను. బృహస్పతి యుద్ధములో జయాపజయములు నిర్ణయింపజాలము. ఇప్పుడు యుద్ధమునకు సిద్ధమగుమని కానివద్దని కాని నేను చెప్పను జరుగవలసినది జరుగునని యూరకుండెను. అంతట బ్రహ్మవద్దకు పోయి ఇంద్రుడు పితామహా! మహిషాసురుడు స్వర్గము నాక్రమించు ప్రయత్నమొనర్చుచున్నాడు నేను భయపడి నీవద్దకు వచ్చితిని. మీ సహాయము కోరుచుంటిననెను. అప్పుడు బ్రహ్మ మనము కైలాసమునకు వెళ్ళి శివుని కూడ కలుపుకొని శ్రీహరిని సన్నిధికి చేరుదము. దేశ కాలపరిస్థితులలోచించి యుద్ధము చేయవలయును అని పలికెను. వారు కైలాసము చేరి శివునితో కలిసి అందరు విష్ణువు సన్నిధికి వెళ్ళిరి. దేవదేవుడగు నారాయణుని స్తుతించి మహిషునివలన భయమును విన్నవించిరి. శ్రీహరి మనమందరము యుద్ధమొనర్చి వానిని సంహరింతమనగా అందరును తమతమ వాహనములపై యుద్ధమునకు బయలుదేరిరి. మహిషుని బలము కూడ పోరసమకట్టెను. దేవదానవులకు ఘోరమైన యుద్ధము జరిగెను. మహిషుని సేనానిచిక్షురుడు ఇంద్రునితో పోరి మూర్ఛనొందెను. పిమ్మట బిడాలునితో ఇంద్రుడు పోరాడెను. బిడాలుడు తన వాహనమైన ఏనుగు ఇంద్రునిచే కొట్టబడి పారిపోగా ఒకానొక రథమెక్కి దేవతల ముందు నిలిచెను. ఇంద్రుడు వానిపై తీవ్రబాణముల ప్రయోగించెను. బిడాలుడు కూడ ఇంద్రునిపై బాణములు కురిపించెను. ఘోరమైన యుద్ధము జరిగెను. ఇంద్రుని బాణప్రయోగమునకు బిడాలుడు రథములో కూలబడెను. పిమ్మట తామ్రుడను వానిని చంపెను. అంతట వరుణులు తామ్రుని మూర్ఛనొందించిరి. దైత్యసైన్యము హాహాకారము లొనర్చెను. అంతట మహిషుడు వచ్చెను.

## హరిహరులు మహిషునితో పోరుట

అతడు గద పట్టుకొని దేవతలపై కురికి దేవతలారా! మిమ్ములను నా గదతో చంపివైతును. అని పలికి ఇంద్రుని భుజముపై గదతో కొట్టెను. ఇంద్రుడు వజ్రాయుధము గ్రహింపగా మహిషుడు ఖడ్గము చేతబట్టెను. అప్పుడు వారిరువురకు ఘోరమగు పోరుజరిగెను. మహిషుడు శాంబరమాయతో కోట్లకొలది యోధులను సృష్టింపగా వారు దేవతలపైబడి కొట్టసాగిరి. మహిషుని మాయకందరు దేవతలు విస్తుపోయిరి. అప్పుడు దేవతలు త్రిమూర్తులను స్మరింపగా వారు దివ్యాయుధములతో దేవతలను కాపాడుటకు వచ్చిరి. అప్పుడు శ్రీహరి చక్రము ప్రయోగింపగా మహిషునిమాయ మాయమయ్యెను: అంతట మహిషుడు పెద్ద పరిఘచేతబట్టి త్రిమూర్తులపై కురిసెను. అతని వెంట చిక్షురుడు, ఉగ్రాస్యుడు, ఉగ్రవీర్యుడు,

అసిలోముడు, త్రిణేత్రుడు, బాష్కలాంధకులు నితరులును యుద్ధమునకు తల పడిరి. వాసుదేవాంధకులకు తుములమైన యుద్ధము జరిగెను. ఇంద్రబాష్కలులు రుద్రమహిషులు, యమత్రిణేత్రులు, కుబేరమహిషులు, వరుణాసిలోములు పరస్పరము దారుణరణమొనర్చిరి. విష్ణువు చక్రాయుధమును రాక్షసుడు తన చక్రముతో వారించి దేవతలనాశ్చర్యపరచెను. శంకరుని రొమ్ముపై శక్తిని ప్రయోగించి గర్జించెను. విష్ణువు మహోజ్జ్వలమైన పాంచజన్యమును వేగముగ పూరించెను. ఆ ధ్వని దానవుల గుండెలు బ్రద్ధలయ్యెను. ఋషులు దేవతలును సంతోషించిరి.

## దేవతలు త్రిమూర్తుల శరణుజొచ్చుట

దానవులు వ్యాకులమనస్కులగుట చూచి మహిషుడు సింహరూపము ధరించెను. ఆ సింహము దేవసేనలోనికి దుమికి తన వాడి గోళ్ళతో గరుత్మంతుని చీల్చి విష్ణువు బాహువులను గాయపరచెను. హరి దానిని చక్రముతో కొట్టెను. అంతలో సింహము మహిషమయ్యెను. దాని కొమ్ములదెబ్బలకు సహించలేక శ్రీహరి వైకుంఠమున కేగెను. శంకరుడు కూడ కైలాసమునకు వెళ్ళెను. బ్రహ్మయు భయపడి తన లోకమునకు పోయెను. ఇంద్రయమ కుబేరులు అగ్నియును వరుణుడు అచటనే యుండిరి. రాక్షసబలము బాణవర్షమును కురియుచు ముందునకు నడచెను. మహిషుని యుద్ధము చూచి యెల్లరు వెరగందిరి. ఇంద్రుడు భయపడి పారిపోయెను. వరుణ కుబేరులును నిలువలేక పోయిరి. మహిషుడు తన విజయమును చాటి ఐరావతమును ఉచ్చైశ్రవమును కామధేనువును గ్రహించి స్వర్గరాజ్యమును చేపట్టెను. దేవతలు స్వర్గము విడిచి గిరిగుహాలలో తలదాచుకొనిరి. వారు బ్రహ్మ వద్దకు వెళ్ళి మొరపెట్టుకొనిరి. పరమేష్ఠి యిట్లనెను. సురలారా! నేనేమి చేయగలను వాడు వరగర్వితుడు స్త్రీచేతనే చంపబడువాడు. కనుక మనము శివుని కూడ వెంటబెట్టుకొని జనార్ధనుని దర్శించి ప్రార్థింతము. అతడే దేని ఉపాయము చెప్పగలడని అందరు శివుని ముందుంచుకొని శ్రీమహావిష్ణువు వద్దకు వెళ్ళిరి. వైకుంఠము సంపదలకు శోభలకును నిలయము- అతి సుందరము.

## శ్రీదేవి యావిర్భవించుట

ఒకప్పుడు దేవతలందరు శ్రీమహావిష్ణువు నివసించు వైకుంఠమునకు వెళ్ళిరి. పిమ్మట విష్ణుమూర్తి నివసించే మందిరాన్ని చూచారు. జయవిజయు లను వారు ద్వారపాలకులుగా బంగారు బెత్తములు చేత ధరించి భవన సమీపమున కనబడిరి. బ్రహ్మాది దేవతలు తమ దర్శనార్థమై వచ్చి ద్వార మందున్నారని శ్రీహరికి మనవి

చేయవలసినదిగా ద్వారపాలకులను ప్రార్థించారు. అంతటవెంటనే విజయుడు శ్రీమహావిష్ణువు సమీపమునకు వెళ్ళి దేవదేవా! రమాకాంతా! దేవతలందరు మిమ్ము దర్శింపగోరి ద్వారమందున్నారు. బ్రహ్మ రుద్రాదులు వేదసూక్తములతో మిమ్ముస్తోత్రము చేస్తున్నారని మనవి చేశారు. విష్ణు మూర్తి విజయుని మాటలువిని మిక్కిలి కుతూహలముతో నింటిలో నుండి బయటకు వచ్చి శ్రమచే కృశించి యున్న దేవతలను వాత్సల్యము కూడిన చూపులతో సంతోషపెట్టెను. దేవత లందరు శ్రీహరికి నమస్కరించిరి. ఇంద్రాదులు రాక్షస సంహారియైన ఆ విష్ణువును స్తోత్రము చేశారు.

అంతట ఆయన దుఃఖంతో దీనులుగా మీరు కనిపించుటకు కారణ మేమని ప్రశ్నించెను. దేవతలిట్లు పలికిరి:- మహా రాజా! పాపాత్ముడు వర గర్వితుడగు మహిషాసురుడు మాయజ్ఞ భాగములను అపహరిచుచున్నాడు. వానికి భయపడి దేవతలు పర్వత దుర్గములలో తిరుగుచున్నారు. కనుక నిన్ను శరణు జొచ్చుచు న్నాము. రాక్షసుల మాయలు తెలిసినవాడా! మమ్ముద్ధ రించుటకు నీవే సమర్థుడవు. కనుక ఆ రాక్షసుని సంహరించునట్టి ఉపాయముతో మమ్ము కాపాడుము. మానవులాతని చంపలేరని బ్రహ్మ వరమిచ్చియున్నాడు. పార్వతికాని, లక్ష్మికాని, యే స్త్రీయైనను అతని చంపజాలదు. వరదాన గర్వితుడైన మహిషాసురుని నీవే ఉపాయమాలోచించి సంహరింపవలెను. అని పలుకగా విష్ణుమూర్తి నవ్వుచు పూర్వము నేను వానితో యుద్ధమును చేసితిని. కానివాడు చావలేదు. ఇప్పుడు దేవత లందరి తేజోరూప సంపదలతో ఒక స్త్రీ జన్మిస్తే ఆమె యుద్ధములో వానిని చంపగలదు. మనందరి తేజస్సులతో తేజోరాశియై ఒక స్త్రీ ఆవిర్భవించునట్లు ప్రార్థించుడు. మనమందరము ఆమెకు సమస్తములైన మన ఆయుధములను సమర్పించుదము. సర్వాయుధముల ధరించి సర్వతేజస్సులతో కూడిన ఆమె మదగర్వితుడైన ఆ దురాత్ముని చంపగలదని పలికెను.

ఇలా మాట్లాడుచుండగనే బ్రహ్మయొక్క ముఖము నుండి మిక్కిలి సహింప శక్యముగాని తేజస్సు పుట్టినది. అ తేజస్సును చూచి శివకేశవు లాశ్చర్యము నందిరి. రుద్రుని శరీరమునుండి రుద్ర తేజస్సు పుట్టినది. ఆ తేజస్సు అతిఘోరముగా నుండెను. మరియు విష్ణువు శరీరము నుండి వైష్ణవ తేజస్సు పుట్టినది. ఆ తేజస్సు సత్త్వగుణముతో కాంతిమంతమై యుండెను. సుందరమైనను సహింపరానిదిగా నుండెను. పిమ్మట అగ్ని యమవరుణ కుబేరుల శరీరముల నుండి ఒకేమారు గొప్పగొప్ప తేజస్సులు పుట్టినవి. అట్లే ఇతర దేవతలనుండి కూడ తేజస్సులు

పుట్టినవి. ఆ తేజస్సులన్నియు ఒకరాశియై పరదేవత పుట్టినది. పదునెనిమిది భుజములు ధరించిన ఆదేవి రెండవ హిమాలయమా అన్నట్లుండెను. ఆ రూపమును చూచి విష్ణువు మొదలగు వారందరు ఆశ్చర్యపడిరి. హరిహరబ్రహ్మలు కూడా ఆ దేవిని వర్ణింప సమర్ధులు కాకపోయిరి. అసాధ్యములైన దేవతల పనులు నెరవేర్చుటకు అనేక రూపముల నామె ధరించుచుండును. ఆమె సౌందర్యము అత్యద్భుతమైనది. లోకాతీత సౌందర్యవతియైన ఆ దేవిని చూచి మహిషాసురునిచే బాధపడిన దేవతలందరు పరమానందభరితులైరి.

అప్పుడు విష్ణువు దేవతలారా! మీరిప్పుడు శ్రీదేవికి మీమీ దివ్యభూషణ ములను దివ్యాయుధములను సమర్పించుడు అని పలికెను. విష్ణువు మాటలు విని సమస్త దేవతలు సంతోషముతో తమతమ దివ్యభూషణములను వస్త్రములను పర దేవతకు సమర్పించిరి. క్షీరసముద్రము శ్రీదేవికి రెండు దివ్యవస్త్రములను ఒక మణిహారమును సమర్పించెను. విశ్వకర్మ దివ్యమగు చూడామణిని కుండలము లను, కంకణములను దివ్యములైన భుజకీర్తులను సమర్పించాడు. త్వష్టగజ్జె లందియలనిచ్చెను. వరుణుడు కమలములమాలను సమర్పించెను. హిమవం తుడు బంగారు సింహవాహనమును అనేక రత్నరాసులను కూడ నొసగెను. శ్రీమహా విష్ణువు దివ్యసుదర్శనచక్రమిచ్చెను. శివుడు త్రిశూలమునొసగెను. వరుణుడు శంఖమును అగ్నిదేవుడు తీవ్రవేగముగల శతఘ్ని అనేశక్తిని ఇచ్చారు. వాయుదేవుడు అంబులపొదిని బాణాలతో నిండిన దానిని అద్భుతమైన ధనుస్సును. ఇంద్రుడు వజ్రాయుధము నిచ్చెను. మరియు ఐరావతము తన కంఠమందుండు ఘంటను కూడ సమర్పించెను. ఇట్లు సమస్తదేవతలు తమతమ ఆయుధములను, భూషణ ములను శ్రీదేవికి సమర్పించిరి. ఆయుధములతో భూషణములతోను కూడిన పరదేవతను చూచి ఆశ్చర్యపడుచు దేవతలందరు ఇట్లు స్తోత్రము చేశారు.

శ్లో॥ భగవత్యై నమోదేవ్యై రుద్రాణ్యై సతతం నమః ।
కాళరాత్ర్యై తథాంబాయై ఇంద్రాణ్యైతే నమోనమః ॥
సిద్ధై బుద్ధై తథా వృద్ధై వైష్ణవ్యై తే నమోనమః ।
పృథివ్యాం యాస్థితా పృథ్వ్యా నజ్ఞాతా పృథిపీంచయా ।
అంతస్థితా యమయతి వందే తమీశ్వరీం పరామ్
మాయాయాం యాస్థితా జ్ఞాతా మాయయానచతామజాం
అంతస్థితా ప్రేరయతి ప్రేరయిత్రీం నమశ్శివామ్ ।
కల్యాణం కురుభో మాతః త్రాహినః శ్శత్రుతాపితాన్ ॥

జహిపాపం హయారింత్వం తేజసాస్వేన మోహితం ।
ఖలం మాయావినం ఘోరం స్త్రీ వధ్యం వరదర్పితమ్ ॥
దుఃఖదం సర్వదేవానాం నానారూపధరం శఠమ్ ॥
త్వమేకా సర్వదేవానాం శరణం భక్తవత్సలే ।
పీడితాన్దానవానద్య త్రాహి దేవి నమోఽస్తుతే ।

**స్తోత్రభావము:-** తల్లీ! నీవు శాంతి పుష్టి, కాళరాత్రి, సిద్ధి, బుద్ధి, స్వరూపు రాలవు రుద్రాణి శివస్వరూపిణివగు నీకు నమస్కారము. ఏ శక్తి భూమిలో నుండి భూమికి తెలియబడదో భూమిని నియమించుచునుండునో అట్టి మాయ కెరుగబడక మాయను కార్యములకు ప్రేరేపించునట్టి శివశక్తి కంజలి ఘటిస్తున్నాము. ఓ జగదంబా! నీ దివ్య తేజస్సుతో మహిషాసురుని మోహింపజేసి ఆ పాపాత్ముని సంహరింపుము. మహిషుడు ఘోరమైనవాడు, దుర్మార్గుడు, మాయావి. స్త్రీ చేతనే చంపదగినవాడు, వరబలదర్పితుడు, అనేకరూపములు ధరించువాడు, దేవతలను దుఃఖపెట్టువాడు,శఠుడు, ఓభక్తవత్సలా! నీవొక్కతివే దేవతలకందరకు రక్షకురాలవు. మేము రాక్షసునిచే బాధింపబడుచున్నాము. అమ్మా! మమ్ము రక్షించుము నీకు వందనములమ్మా! ఇట్లు స్తోత్రము చేయగా.

## శ్రీ దేవి స్వరూపమునుగని మహిషుడు మోహితుడగుట

దేవి చిరునవ్వుతో ఈ విధముగా పలికినది. దేవతలారా! ఇక భయపడ నక్కలేదు. ఆ మహిషాసురునిపుడే యుద్ధములో సంహరింతును. అని పెద్దగా నవ్వెను. మరియు ఘోరముగ గంభీరమగు ధ్వనిచేసినది. అభీకరాద్భుత ధ్వనికి భూమి కంపించింది. కొండలు కదిలినవి. సముద్రములు ఘూర్ణిల్లినవి. ఆ ధ్వనికి దిక్కులు పిక్కటిల్లాయి. రాక్షసులకు గుండెలు దడదడలాడినవి. అంతట దేవతలు ఓహో దేవీ! నీకు జయమగు గాక మమ్ము కాపాడుమమ్మా! అని పలికిరి. మహిషుడా ధ్వనివిని మదగర్వముతో కనులెఱ్ఱ చేసెను. ఆ ధ్వని యతని కను మానము కలిగించెను. ఆధ్వనికి కారణము తెలిసికొనిరండని రాక్షసులను పంపెను. ఇట్లు భయంకర ధ్వని చేసిన వ్యక్తి యెవరైనను ఆ దుర్మార్గుని నావద్దకు తీసికొని రండు వానిని తప్పక సంహరింతును. అని దూతలను పంపెను. దూతలు వెళ్ళి సర్వాంగ సుందరియగు దేవిని చూచిరి. ఆమె సర్వాభరణములు ధరించి సర్వశుభ లక్షణములతో ప్రకాశించుచుండెను. మరియు అనేక దివ్యాయుధములు ధరించి యున్నది. ఆమె చేతిలో మధుపాత్ర కలదు. మాటిమాటికి మధురసమును త్రాగు

చుండెను. దూతలామెను చూచి భయపడి పారిపోయిరి. వారు మహిషాసురునకు ధ్వని కారణమిట్లు తెలియజేసిరి.

"ఓరాక్షసరాజా! ఒక ప్రౌఢయైన యువతి మాకు కనబడినది. ఆమె శరీరావయవములు సర్వాభరణములతో నలంకరింపబడినవి. ఆమె సర్వశుభలక్షణములు కలిగినది. రాక్షస స్త్రీగాని మానవ వనిత గానికాదు. ఆమె శరీరము నుండి దివ్యకాంతులు వెడలుచున్నవి. ఆ దేవి సింహాసనముపై కూర్చున్నది. పదునెనిమిది భుజములు గలిగి దివ్యాయుధములు ధరించియున్నది. ఘోరమైన ధ్వనిచేయు చున్నది. మదముచే గర్వించి యున్నది. మద్యపానముచే మదించి యున్నది. ఆమెకు భర్తలేడని తెలుసుకొన్నాము. దేవతలు అమితా నందముతో ఆమె చెంత చేరి స్తుతిస్తున్నారు. ఓదేవీ! నీకు విజయము. మా శత్రువులను సంహారింపుము. మమ్మ్ము కాపాడుమని వారు స్తోత్రము చేస్తున్నారు. ఆమె యెవతెయో ఆమె ఎందుకిక్కడకు వచ్చెనో, ఏమి చేయవలెనని తలచుచున్నదో మాకు తెలియలేదు. ఆమె తేజస్సు మమ్మ్ము ముగ్ధులను చేసింది. మిరు మిట్లు గొలుపు ఆమె కాంతిని మేము చూడలేకపోతిమి. ఆమె నవరసముల కాశ్రయమై యున్నది. ఆ నారీమణిని చూచి మేము పలుకరించకనే తిరిగి వచ్చాము. ఇప్పుడు మేమేమి చేయవలయునో ఆజ్ఞాపింపుడు"అని పలికిరి.

అప్పుడు మహిషాసురుడు బలవంతులగు మంత్రులు వెళ్ళి సామాద్యు పాయములతో ఆశుభాంగిని ఇక్కడకు తీసుకురావలెను. ఆమె వీరి మాటలకు వశురాలై రానియెడల ఆమెను చంపకనే నావద్దకు తీసికొని రండు. సుందరమైన కను బొమ్మలగల ఆమెను సంతోషముతో పట్ట మహిషిగా చేసుకొందును. ఆ సుందరి సంతోషముతో రాదలచిన యెడల రసభంగముకాని విధముగా నాకోరికను నెర వేర్చండి. ఆమె సౌందర్యమును విని నేను మోహము చెందితిని. మహిషుని ఈ మాటలు విని గజాశ్వరథములతో వెళ్ళి మంత్రి ఆమెకు దూరముగ నిలబడి ఓ మంజు భాషిణీ! నీవెవతెవు నీవేల యిక్కడకు వచ్చితివి. అని మా ప్రభువు నన్ను పంపినాడు. అతడు పరాక్రమశాలి మానవులు గాని దేవతలుగాని వానిని చంపలేరు. బ్రహ్మ నుండి వరములు పొందినవాడు. కామరూపధారి మదమత్తుడు. మారాజు నిన్ను చూడలవలెనని ఉత్సాహపడుచున్నాడు. ఓశోభనాంగీ! అతడు మానవ రూపముతో నీవద్దకు రాగలడు. మేము నీ యిష్టప్రకారము నడుచు కొందుము. నీవా బుద్ధిమంతుని వద్దకు రమ్ము నీ సౌందర్యమును విని నీకతడు వశుడైయున్నాడు. నీవు చెప్పినట్లు చేయుదుము. అని పలికెను. మహిషుని మంత్రి మాటలువిని మహామాయ నవ్వి గంభీరముగా ఇట్లు పలికినది.

# మహిషునకు దేవి విహితములు

"ఓ మంత్రివర్యా నేను దేవతలకు తల్లిని. రాక్షసులను సంహరించు శ్రీమహాలక్ష్మిని. మీ రాజు దేవతలను బాధపెట్టినాడు వారి యాగభాగముల నపహరించినాడు. దేవతలందరు ప్రార్థింపగా నేను మహిషాసురుని చంపుటకు వచ్చితిని నాకు సైన్యమక్కరలేదు. పెద్ద ప్రయత్నమును చేయనవసరము లేదు. నీవు మధురముగా మాట్లాడినందుకు సంతోషము. నీవు మహిషాసురుని వద్దకు వెళ్ళి బ్రతుకుపై ఆశ ఉన్నచో వెంటనే మీ రాజును పాతాళమునకు పొమ్మని చెప్పుము. అట్లు కానిచో పాపాత్ముడగు నాతని నిప్పుడే యుద్ధమున సంహరింతును. వానికిట్లు చెప్పుము. నీవు మరణించినచో దేవతలు శీఘ్రముగా స్వర్గము నలంకరించెదరు.

మూఢుడా! నావాడి బాణములు నాటక ముందే భూమండలమును విడిచి పాతాళమునకు పొమ్ము. యుద్ధము చేయవలె ననియున్నచో వీరులను వెంటబెట్టుకొని రమ్ము. అందరను యముని వద్దకు త్వరగా పంపుదును. ప్రతియుగమందు నీవంటి మూఢులు లెక్కకు మిక్కిలిగా నాచేతిలో సంహరింపబడుచుందురు. అట్లే నిన్నుకూడ ఈనాడు తప్పక చంపెదను. ఓరి కామపీడితుడా! నాతో యుద్ధము చేయుము. నేను అనేక శస్త్రములు ధరించి నందుకు ఫలము సిద్ధించును. ఓరి! దుష్టాత్మా! బ్రహ్మ యిచ్చిన వరము కలదని గర్వించకుము. నీవు స్త్రీ చేతిలో చచ్చెదవు. కనుక స్త్రీ రూపముతో నిన్ను చంపుటకు వచ్చితిని. నీకు బ్రతుకుపై తీపియున్నచో స్వర్గమును భూమిని విడిచి పాతాళమునకు పొమ్ము"అని పలికెను.

అంతట మంత్రి దేవి! నీవు మదముచే గర్వించియున్నావు. ఆడుది మాట్లాడదగని మాటలను మాట్లాడినావు. అతడెక్కడ? నీవెక్కడ? మీ యిరువురకు యుద్ధము తగినది కాదు. నీవు ఒక్కదానవు. బాలికవు. మహిషాసురుడు దృఢశరీరుడు. మరియు అతనికి గుఱ్ఱములు యేనుగులతో గొప్ప సైన్యము అనేకాయుధములతో కూడినది కలదు. ఏనుగు మాలతీ పుష్పమును నులిమినట్లు మహిషాసురుడు యుద్ధమందు నిన్ను సంహరింపగలడు. శృంగారరసమునకు విరుద్ధమగునని నేను పరుషముగా మాట్లాడుటకు భయపడుచున్నాను. దేవతలకు శత్రువైన మారాజు నీ యందు మిక్కిలి భక్తిభావముతో ఉన్నాడు. కనుక సామదానోపాయములతోనే మాట్లాడుచున్నాను. అట్లు కానిచో అసత్యములు పలుకుచున్నట్టియు లేనిపోని అభిమానమును చూపుతూ రూప యౌవనములచే గర్వించిన నిన్ను యిప్పుడు బాణముతో చంపగలను. మాస్వామి నీపై మోహము కలిగి ఉన్నాడు. రాజ్యము ధనము సర్వము నీకు సమర్పించి నీకు దాసుడగును. కనుక

విశాలములగు కన్నులు కలదానా! రోషమును విడిచి పెట్టుము. భక్తితో నీపాదముల పై పడుచున్నాను. శీఘ్రముగా మా రాజునకు పట్ట మహిషివికమ్ము. ముల్లోకముల వైభవము నీదే. మా స్వామిని స్వీకరించి సమస్త సంసారసుఖము ననుభవింపుము అని పలికెను.

అది విని దేవి యిట్లు మాట్లాడినది "ఓ మంత్రీ నీవు మహిషునకు ప్రధానుడవు. మహిషబుద్ధియే నీది. బ్రహ్మ తగిన రాజమంత్రులనొకచోట చేర్చినాడు. ఓరి మూఢుడా! నేను పురుష స్వభావముగల స్త్రీని. నీవను కొన్నట్లు నాది స్త్రీ స్వభావము కాదు. నీ ప్రభువు స్త్రీ చేతిలో చచ్చునట్లు వరము పొందినాడు. దానినిబట్టి అతడెంతటి మూర్ఖుడో తెలియుచున్నది. ఒక స్త్రీచేతిలో చచ్చుట వీరులకు దుఃఖము కలిగించును. నపుంసకులకు సంతోషకరము. అందుకే నేను స్త్రీ రూపమును ధరించి దేవతలకార్యమును సాధించుటకు వచ్చితిని. వరములు పొంది గర్వించువారు మందబుద్ధులై చచ్చెదమని భావించరు. కనుక నీవు వెళ్ళి నా మాటలను మీ రాజునకు చెప్పుము. రాజు చెప్పినట్లు నీవు నడువవలెనుగదా! దేవేంద్రుడు స్వర్గమును పాలింపవలెను. దేవతలు తమ హవిర్భాగముల ననుభవించాలి. ఇట్లు కానిచో నాతో యుద్ధము చేయుము" అని యనెను.

శ్రీదేవి హితవచనములువిని, యా మంత్రి నేనిప్పుడు రాజువద్దకు వెళ్ళవలెనా? లేక ఈమెతో యుద్ధము చేయవలెనా? రాజు కామాతురుడై యున్నాడు. అతని భావమునకు విరుద్ధమైన విషయమును రాజుకెట్లు మనవి చేయదగును? అని తలపోసి యేమైనను జరిగిన విషయమును రాజునకు తెలుపుటయే సమంజసమని ఆలోచించి తెలివికల యా మంత్రి తన రాజువద్దకు వెళ్ళి చేతులు జోడించి యిట్లు పలికెను.

రాజా! ఆ దేవి సింహముపై కూర్చొని పదునెనిమిది భుజములతో దివ్యా యుధములు ధరించి యున్నది. నీవు మహిషాసురునకు పట్ట మహిషి కమ్మని చెప్పితిని. మారాజు నీకు వశుడై సర్వభోగములను సమకూర్చునని చెప్పితిని. నా మాటలు విని ఆమె గర్వముతో నవ్వుచు నిట్లు పలికినది. పశువులలో అధము డైన మహిషాసురుని దేవతల కోరికమేరకు బలియిత్తును. లోకములో బుద్ధి లేని ఏ స్త్రీ దున్నపోతు భర్తకావలెనని కోరును? కనుక నేను యుద్ధము చేసి దేవతలకు శత్రువైన మహిషుని సంహరింతును. జీవించ తలుచుకుంటే దుష్టుడా! పాతాళానికి పొమ్ము" అని మాట్లాడినది. శృంగారరసము భగ్నమగునని నేను యుద్ధము చేయలేదు. ఇకపై ఆలోచించి తమ చిత్తము వచ్చినట్లు చేయుడని విన్నవించెను.

# మహిషుడు దేవి వద్దకు రాయబారులను పంపుట

దూతమాటలు విని మదముతో పరవశుడైన మహిషుడు అనుభవము గల మంత్రి వృద్ధులను పిలిచి వారి సలహానడిగెను. పండితులు పెద్దలునగు మంత్రులు రాజా! సత్యము మేలు చేయును. ఇష్టమైనది హానికలిగించును. కనుక మేమేమి చెప్పగలము? అనిరి. మీమీ భావాలను విని బాగుగా విచారించి శ్రేయస్కర మగు పనినవలంబింపవలెగదా! అని పలుకగా గొప్ప బలముగల విరూపాక్షుడనువాడు రాజును రంజింప చేస్తూ యిలా మాట్లాడినాడు:-

రాజా! ఈ స్త్రీ మదముచేత గర్వించి మాట్లాడుచున్నది. కేవలము బెదిరింపు మాటలేయివి. ఆడు దాని మాటలు లెక్క చేయదగినవికావు. మనమామె మాటలకు జంకవలసిన పనిలేదు. నీవు మూడు లోకములను జయించి మహావీరుడవు. ఇప్పుడొక స్త్రీకి భయపడినచో నీకు పరువు దక్కునా? నేనిప్పుడొంటరిగా వెళ్ళి యామెతో యుద్ధము చేసి ఆమెను చంపివచ్చెదను. నీవు నిశ్చింతగానుండు మనెను. మరియు సైన్యముతో వెళ్ళి అనేక శస్త్రములతో ఆమె నోడింతును, సర్పపాశములతో బంధించి ఆమెను నీ వద్దకు తెచ్చెదను. అప్పుడు నీకామె వశు రాలగును చూడుము నా బలము అని పలికెను. తరువాత దుర్ధర్షుడను వాడిట్లు పలికెను:-

రాజా! బుద్ధిమంతుడగు విరూపాక్షుడు నిజము మాట్లాడినాడు. నా మాటలు కూడా వినుడు. ఈమె కామపీడితగా కనిపించుచున్నది. అందచందాలచే గర్వించిన స్త్రీ యిట్లే యుండును. ఈమె భయపెట్టి నిన్ను వశము చేసుకొన వలెనని చూచుచు న్నది. ఆమె మాటలు వక్రోక్తులు. స్త్రీలకు తమ ఓరచూపులే బాణాలు వ్యంగ్య వచనములు పూలదోసిళ్ళు. నేత్రములనే బాణములతో నిన్ను వశపరచుకొందునని ఆమె భావము ఈ విధముగా ఆమె మాటలకు శృంగారపర మైన వ్యాఖ్యానముచేసి నిన్ను ఆమె వరిస్తున్నది. ఇక పై కర్తవ్యము నాలోచింపుమని చెప్పి సామ దానోపా యములే తగినవనెను. మధురములైన మాటలతో ఆమెను నీవద్దకు తీసికొని వచ్చి నీకు వశమగునట్లు చేసెదను అని పలికెను.

ఆ మాటలు విని తామ్రుడనువాడు. రాజా! ఈమె కామపీడిత కాదు. నీపై అనురాగము కలదియుకాదు. ఆమె ఏ ఆధారములేకుండా ఒక్కతెయే వచ్చుట ఆశ్చర్యకరముగానున్నది. పదునెనిమిది భుజములు గల స్త్రీని ఎప్పుడును చూచిగాని వినిగాని యుండలేదు. ఆయుధములను పదునెమిదిటిని ధరించుటయును ఆశ్చర్యకరము రాజా! ఇది కాలవైపరీత్యముగా తలచుచున్నాను. నాకు స్వప్నములో

నల్లని వస్త్రము ధరించి యొక స్త్రీ ఇంటిగుమ్మము వద్ద దుఃఖిచుచు కనపడినది. రాత్రి పక్షులు ప్రతియింటిలోను కూయుచున్నవి. అనేక వినాశసూచనలు కనిపించు చున్నవి. నిన్ను ఆ స్త్రీ యుద్ధానికాహ్వానించుట వలన ఆమె దేవతలచే సృష్టింపబడి నదిగా తోచుచున్నది. భయపడపవలదు. యుద్ధము చేసి తీరవలసినదే. జరుగ వలసినది జరుగును. దైవికముగ జరుగుదానిని ఎవ్వడును మార్చలేడు గదా అని చెప్పెను.

మహిషుడు ఓయీ! తామ్రా! యుద్ధము కొఱకు వెళ్ళి ఆమెను జయించి తీసికొనిరమ్ము. ఆమె యుద్ధములో నీకు లొంగనిచో చంపి వేయుము. ఆమె కామముతో వచ్చినదా? లేక వైరముతో వచ్చినదా? తెలుసు కొనుము. ఆమెకు భయపడవద్దు. నిర్దయగాను ప్రవర్తించ వద్దు. ఆమె మనయెడ ఎట్లుండునో అట్లే నీవును ఉండవలయును అని పలికెను. ఈ మాటలు విని తామ్రుడు రాజైన మహిషునికి నమస్కరించి సైన్యముతో యుద్ధమునకై వెళ్ళెను. దారిలో అతనికి దారుణములైన అపశకునములు కనిపించినవి. వానిని చూచి అతడు ఆశ్చర్యము నకు భయమునకు లోనయ్యెను. అతడు వెళ్ళి సింహముపై కూర్చొన్నట్టియు దేవతలందరిచే స్తుతింపబడుచున్నట్టియు సమస్తాయుధములను ధరించిన దేవిని చూచి వినయముతో మధురమగు వాక్కుతో సామోపాయము ననుసరించి యిట్లు పలికెను:-

"ఓ దేవీ! మా మహిష రాక్షసరాజునీ రూప యౌవనగుణములకు పరవశుడై నిన్ను పెండ్లియాడుటకు నుత్సాహముతోనున్నాడు. అతని పై అనురాగమును చూపుము. దుఃఖప్రదమైన యుద్ధమెందులకు? దేవతలచేత రాక్షసులచేతను పూజింపబడు మా నాధుని నాధుని చేసికొనుము. నీ కోరికలెల్లతీరును. నీవతని పట్ట మహిషివికాగలవు. నామాటను నమ్ము. నీకు అమితమైన సుఖము లభించును. నీకు పుట్టిన కుమారుడే రాజుకాగలడు" అని పలికెను.

# మహిషుని మంత్రాలోచన

తామ్రుని మాటలు విని జగదంబ నవ్వుచూ మేఘగంభీర మగు వాక్కుతో వానితో నిట్లనెను. "ఓ తామ్రుడా! నీవు వెళ్ళి చావుకు సిద్ధమై నట్టియు కామార్తుడై నట్టియు మూఢుడైన మహిషునకు ఇట్లు చెప్పుము" నేనెవరినీ ప్రేమించుట లేదు. నాకు భర్త ఉన్నాడు అతడు దేనినైనను చేయగలడు. అన్నిటికిని సాక్షియైనవాడు. దేనికీ కర్తకాని వాడును సర్వజ్ఞుడు. అట్టి భర్తను విడిచి మందుడైన ఈ మహిషుని

సేవించుట కెట్లు నేనుత్సాహపడుదును? నాతో యుద్ధము చేయునచో మీ రాజును యమపురికి పంపి యమునికి వాహనము చేసెదను. పాపాత్ముడా బ్రతుకుపై ఆశయున్నచో త్వరగా పాతాళమునకు పొమ్ము. సమస్త రాక్షసులును పాతాళమునకు వెళ్ళనిచో అందరిని యుద్ధంలో చంపి వేయుదును. నీ విటనుండి వెళ్ళుము లేదా యుద్ధము చేసిన యెడల బంధువులతో సహ నిన్ను చంపుదును. దేవతల యజ్ఞభాగములను వారికిచ్చి దేవలోకమును విడువవలెను. అని పలికి ఆ దేవి ఆశ్చర్యకరముగా గర్జించెను.

ప్రళయకాలములోని ధ్వనికివలె పర్వతములు చలించినవి. రాక్షస స్త్రీలకు గర్భస్రావమయ్యెను. తామ్రుడా ధ్వనివిని భయపడి పారిపోయెను. పట్టణములోని రాక్షసులందరు దిగులుపడిరి. ఆ ధ్వనికి చెవిటివారై పరుగులెత్తిరి. పరదేవత యొక్క వాహనమైన సింహముకూడ భయంకరముగా గర్జించినది. ఆ ధ్వనికి రాక్షసులు భయభ్రాంతులైరి. మహిషుడు తామ్రుని ముఖమును చూచి చేయదగినది తోచక మంత్రులతో ఆలోచించెను. రాక్షసశ్రేష్ఠులారా! ఇప్పుడు కోటలో దాగి యుందమా? ఊరిబయటకు వెళ్ళి యుద్ధమును చేయుదుమా? లేక పారిపోవుట మంచిదా? మీరందరు బుద్ధిమంతులు సర్వశాస్త్ర విశారదులు మనము కార్యసిద్ధికై రహస్యముగా ఆలోచింపవలెను. మంత్రులు దేశకాలాను సారముగా ఆలోచించి నిర్ణయించండి. ఈ వచ్చిన స్త్రీ దేవతలచే నిర్మింపబడినది. బలవంతురాలు ఒంటరిగా వచ్చినది. పైగా యుద్ధమును కోరుచున్నది. ఇంతకంటె ఆశ్చర్య మేముండును? యుద్ధములో జయపరాజయములు దైవాధీనములు. దైవముపై ఆధారపడువాడు అసమర్థుడు. శూరుడు తనశక్తిపై ఆధారపడి ప్రయత్నిస్తాడు. ఇప్పుడు చక్కగా ఆలోచించి మనము పనిచేయాలి. అని రాజు మాట్లాడెను.

బిడాలుడనువాడు చేతులు జోడించియిట్లు పలికెను:- రాజా! ఈమెను గూర్చి యింకను బాగా తెలిసికొనవలెను. ఈమె ఎందుకిక్కడకు వచ్చెను? ఎక్కడ నుండి వచ్చెను? ఈమె ఎవరి భార్య. దేవతలు నీకు స్త్రీవలన మరణమున్నది కనుక వారీమెను సృష్టించి పంపినారా? ఆదేవతలు కూడ ఎక్కడనో యుద్ధమును చూచుటకు దాగియుందురు. అవసర మైనప్పుడు వారుకూడ ఈమెకు సహాయముగా వచ్చి యుద్ధము చేయవచ్చును. విష్ణువును ముందు పెట్టుకొని దేవతలు తక్కిన రాక్షసులను చంపితే ఆమె నిన్ను చంపుతుంది. దేవతలు చేయదలచిన పనియిది. యుద్ధము చేయవద్దని నేను నీకు చెప్పజాలను. నీకు తోచినట్లు చేయుము. నీతోపాటు మేము యుద్ధమునకు కూడ సిద్ధమే. ఒంటరిగా వచ్చిన స్త్రీ ఇంతటి

బలదర్పములుగల సైన్యమును యుద్ధమునకై పురికొల్పుట బాగుగా విచారింప వలసిన విషయము. అని పలికెను ! పిమ్మట దుర్ముఖుడను వాడిట్లు పలికెను:-

"రాజా! యుద్ధములో మనము గెలువమని నాకు తెలియును. ఐనను లోకములో అపకీర్తి వాటిల్లునట్లు పారిపోవుటయు తగదు. ఒక్క ఆడుదానికి భయపడి పారి పోజూచు వాడెవడు? జయమో అపజయమో యేదైనను యుద్ధము చేసి తీరవలసి నదే ఏదికానున్నదో అది కాకమానదు అని యుత్సాహపరచెను" దుర్ముఖుని మాటలువిని బాష్కలు డిట్లుమాట్లాడెను.:-"

రాజా! మీరు చింతింపకుడు. నేను ఇక్కడనే ఆ చండిని చంపెదను. నేను దేవతలలో యెవరికినీ భయపడను. ఒంటరిగా వచ్చినట్టి మదగర్వితయగు ఆమెను నా నిశితములైన బాణములతో చంపివైచెదను. మీరు యుద్ధానికి వెళ్ళ వద్దు. ఈనాడు నా భుజబలమును చూడుడు అని పలికెను." అని పలుకగా దుర్ధరుడు ఓమహిషాసురా! దేవతలు తయారుచేసి పంపిన యీ దేవిని నేను జయింతును. రాజా! నిన్ను భయపెట్టుటకు దేవతలీ మాయను పన్నినారు. బెదించుటకే కాని అంతకంటే వేరేమియులేదు. కనుక మనస్సులోని మోహమును విడువుము. ఇదియంతయు రాజనీతి. ఇతరుల మాటలు మీరు నమ్మవద్దు. నేను యుద్ధరంగమునకు పోయి దుష్టమైన నడువడిగల యామెను తీసికొని వచ్చెదను. నేడు నాబలమును ధైర్యమును ప్రభుభక్తిని స్వశక్తిని చూడుడు" అని పలికెను.

# దేవి బాష్కల దుర్ముఖుల సంహారించుట

ఇట్లు పలికి బాష్కల దుర్ముఖులు సర్వశస్త్రాస్త్రములతో యుద్ధ రంగమునకు చేరి మేఘగంభీరమగు వాక్కులతో నిట్లు పలికిరి:- "దేవీ! మహిషాసురుడు దేవతలను జయించినవాడు. సర్వరాక్షసులకురాజైన అతనిని వరించుము. అతడు సర్వశుభలక్షణములతో కూడిన మానవ రూపము ధరించి దివ్యాభరణభూషితుడై నీ చెంతకువచ్చును. నీవు ముల్లోకముల వైభవమును పొందగలవు. మహిషాసురుని ప్రేమించుము. అద్భుతమైన సంసారసుఖము ననుభవింపుము. స్త్రీలు కోరు కోరికలనన్నిటిని తీర్చుకొనగలవు" అని పలికెను.

ఆ మాటలు విని దేవి యిట్లు పలికినది:- నేను కామమోహితు రాలనుకానని నీకు తెలియుటలేదా? మందబుద్ధియైన మహిషునెట్లు సేవింతును? దేవతా రూపము గలస్త్రీ పశువులలో అధమమైన దున్నపోతు రూపముగల వానిని యెట్లు కోరును? ఓ బాష్కల దుర్ముఖులారా! మీరు త్వరగా వెళ్ళి మీ రాజునకు నామాటగా చెప్పుడు:- నీవు పాతాళమునకు పోవలెను. లేదా నాతో యుద్ధము చేయవల

యును. యుద్ధము జరిగినచో దేవేంద్రుడు తప్పక నిర్భయుడు కాగలడు. నిన్ను చంపనిదే నేనిక్కడ నుండి వెళ్ళను. ఓరి దుర్బుద్ధీ! ఈ విషయము తెలిసికొని చేయవలసిన పనిని నిర్ణయించు కొనుము. నన్ను జయించనిదే భూమిపై నెక్కడను నీకు స్థానముండదు"అని దేవి తన యభిప్రాయమును చెప్పెను.

దేవి మాటలువిని దైత్యమంత్రులు కోపముచే ఎఱ్ఱబారిననేత్రములతో ధనుర్బాణము లను ధరించి యుద్ధమునకు సిద్ధపడిరి. పరదేవత గొప్ప ధ్వనిచేసి నిర్భయముగా నిలిచినది. రాక్షసులిద్దరును తీవ్రమైన బాణవర్షము నామెపై కురిపించిరి. దేవియు రాక్షసులిరువురిపై బాణ సమూహములను ప్రయోగిం చెను. బాష్కలుడు వెంటనే యుద్ధమునకురాగా దుర్ముఖుడు ఆమెకెదురుగా చూచుచు నిలబడెను. దేవికి బాష్కలునికి ఘోరమైన యుద్ధము జరిగెను. అంతట జగన్మాత అతనిని చూచి కోపముతో తీవ్రములైన ఐదుబాణములు ప్రయోగించెను. రాక్షసు డామె బాణములను ఖండించెను. మరియు సింహమందున్న దేవిపై ఏడుబాణ ములు ప్రయోగించెను. దేవియు అతని బాణములను ఖండించి తీక్ష్ణములైన ఏడు బాణములు ప్రయోగించెను. మరియు మాటిమాటికి నవ్వుచు అర్ధచంద్రా కారబాణముతో రాక్షసుని ధనుస్సును ఖండించెను. బాష్కలుడు చేత గదబూని దేవిని చంపుటకు బయలుదేరెను. అతనిని చండిక తన గదాప్రహారములచే నేలపై పడ గొట్టెను. బాష్కలుడు భూమిపైపడి మరల లేచి చండిక పై గదను విసిరెను. దేవి దానిని లెక్కచేయక శూలమును వాని వక్షస్థలమున నాటగా అతడు క్రిందపడి మరణించెను.

బాష్కలుని మరణమును చూచివాని సైనికులె ల్లరు పారిపోయిరి. ఆకాశ మందు దేవతలు జయజయ ధ్వానములు చేసిరి. బాష్కలుడు చనిపోయిన పిమ్మట గొప్పబలవంతుడైన దుర్ముఖుడు కోపముచే నెఱ్ఱ బారిన కన్నులు కలవాడై దేవితో యుద్ధమునకై వచ్చెను. మరియు బాలా! నిలునిలు అని మాట్లాడుచు రథముపై కూర్చొని ధనుర్బాణములు ధరించి దేవికి యెదురయ్యెను. దేవి యాతనిని చూచి శంఖమును పూరించెను. మరియు ధనుష్టంకారము కూడ చేసెను. అతడును సర్పములవంటి బాణముల నామెపై ప్రయోగించెను. దేవి యాబాణములను తన బాణము లతో ఖండించి గర్జించెను. వారిరువురకును ఘోరమైన పోరుజరిగెను. పరస్పరమనేకాయుధములను ప్రయోగించిరి. యుద్ధభూమిలో నేలపై బడిన సైనిక శిరస్సులతో ఘోరమైన దృశ్యమేర్పడినది. గ్రద్దలు డేగలు నక్కలు సైనిక శరీరము లను గుంపులుగా వచ్చి తినుచుండెను. దుష్టుడైన దుర్ముఖుడు దేవిపై కోపించి చేయినెత్తి నేడే నిన్ను చంపెదను. లేదా మహిషుని సేవింపుము అని పలికెను.

అంతట దేవి "మరణము సమీపించుటచే నీవిట్లు మాట్లాడుచున్నావు. బాష్కలుడు చచ్చినట్లు నీవును చావగలవు. నిన్ను చంపి తరువాత మహిషుని చంపెదను" అని పలికెను. మరణమునకు వెనుదీయక దుర్ముఖు డామెపై దారుణముగా బాణవర్షమును కురిపించెను. దేవి యా బాణసమూహమును ఖండించి కోపముతో కూడినదై వృత్రాసురునిపై నింద్రుని వలె బాణములను వర్షించెను. వారిరువురకు ఘోరమైన యుద్ధము జరిగినది. అంతదేవి రాక్షసుని చేతియందలి ధనుస్సును ఖండించెను. మరియు ఐదు బాణములతో వాని రథమును నాశమొనర్చెను. అంతట పాదచారియై దుర్ముఖుడు గదను చేతబట్టి చండిక కెదురుగా నడిచి సింహము తలపై మోదెను. ఆ సింహము దెబ్బతిన్నను చలించలేదు. గదను ధరించిన రాక్షసుని శిరస్సును పదునైన ఖడ్గముతో దేవి ఖండించెను. తలతెగి దుర్ముఖుడు నేలపై వ్రాలెను. అంత దేవతలు మిక్కిలి సంతోష ముతో జయ జయధ్వను లొనర్చిరి. మరియు పరదేవతను స్తుతించిరి. పుష్పవర్షము కురిపించిరి. రణభూమిలో మరణించిన రాక్షసుని చూచి ఋషులు సిద్ధులు గంధర్వులు విద్యాధరులు కిన్నరులును పరమానంద భరితులైరి.

దుర్ముఖుని చావువిని కోపించినవాడై మహిషుడు రాక్షసులారా! దుర్ముఖ బాష్కలు లిద్దరు యుద్ధమున మరణించిన యీ సందర్భములో మనమేమి చేయ వలసినదియు మీరందరాలోచించి చెప్పుడు. కాలము బలవత్తరమైనది. అని పలుకగా "చిక్షురు"డనువాడు రాజా! నేనీమెను సంహరించెదను స్త్రీని చంపుటకు పెద్దగా చింతింపపనిలేదు అని తన సైన్యముతో రథమునెక్కి యుద్ధ భూమికి నడచెను/ అంగరక్షకుడగు తామ్రుడు, వెంటరాగా గొప్ప సైన్య ఘోషముతో దిక్కులు పిక్కటిల్లదేవి నెదుర్కొనెను.

అతనిని చూచి దేవి శంఖ ధ్వనిని ఘంటా నాదమును ధనుష్టంకార మును చేసినది. రాక్షసులందరు ఆ ధ్వనికి భయపడి పారిపోయిరి. పారిపోవుచున్న సైనికులను చూచి చిక్షురుడు మీకేమి భయము వచ్చినది? మదించిన యీ బాలను నేడే నేను బాణములతో చంపివైచెదను. యుద్ధ భూమిని విడిచిపోకుడు అని సైనికుల హెచ్చరించి ధనుస్సు ధరించినవాడై దేవితో "ఓ విశాలాక్షి ఎందుకు గర్జించుచున్నావు? నేను భయపడను స్త్రీవధ దోషమనియు అపకీర్తికరమనియు నామనస్సు నిన్ను పేక్షించుచున్నది. ఓ సుందరీ! సుఖమును విడిచి యుద్ధమును నీవు కోరుటవట్టి యజ్ఞానము యుద్ధరంగమున చచ్చినవారికి స్వర్గము లభించు నను మాట కేవలము అర్ధవాదము (స్తుతివాక్యము) కనుక నీ మనస్సున కిష్టమైన

చోటికి వెళ్ళుము. లేదా మహిషాసురుని సేవింపుము". అని పలుకుచున్న యాతనితో దేవి ఇట్లు మాట్లాడినది:-

ఓరి మూఢుడా! నీవు బుద్ధిమంతునివలె ప్రజ్ఞా వాదములు పలుకుచున్నావు. నీతిశాస్త్రమును నీవెరుగవు. నీవు పెద్దలను సేవింపలేదు. నీ బుద్ధి ధర్మమార్గము ననుసరించుటలేదు. రాజధర్మ మెరుగవు నా దగ్గర నెందుకు మాట్లాడుదువు? యుద్ధభూమిలో మహిషుని చంపి కీర్తి స్తంభమును నిలిపి నేను సుఖముగా వెళ్ళెదను. దేవతలకు దు:ఖము కలిగించు నట్టియు గర్వించినట్టి ఆరాక్షసుని యుద్ధమున సంహరింతును. యుద్ధమునకు సిద్ధపడుము. నీవు మహిషుడు తక్కిన రాక్షసులును జీవించదలుచుకొన్నచో పాతాళమునకు పొండు. లేక చావదలచినచో యుద్ధము నకు రండు. అందరను చంపివైచెదను. ఇదియే నా నిశ్చయము అని పలికెను.

ఈ మాటలు విని బలదర్పితుడైన రాక్షసుడు దేవి పై బాణవర్షమును కురిపించెను. దేవి అతని బాణములను తన బాణములతో ఖండించెను. ఇరువురకును ఆశ్చర్యకరమైన యుద్ధము జరిగెను. పరదేవత గదతో కొట్టగా రాక్షసుడు మూర్ఛ పోయెను. అతడట్లు మూర్ఛపోగా అతని అంగరక్షకుడుగా వచ్చిన తామ్రుడామెతో యుద్ధమునకు తలపడెను. అతనిని చూచి దేవి రాక్షసశ్రేష్ఠా! రమ్ము రమ్ము యమ లోకమునకు పంపుదును. ఐనా బలహీనులైన మీరు యుద్ధమున కెందుకు వచ్చు చున్నారు? మూఢుడైన మహిషుడు తన బ్రతుకును మాత్రమే చూచుకొనుచు న్నాడు. బలహీనులగు మిమ్ము చంపిన ప్రయోజనమే మున్నది? మీరలింటికి వెళ్ళి మహిషు నిక్కడకు పంపుడు అతడు కూడ నన్ను చూడగలడు" అని గర్జించెను.

# శ్రీ దేవి తామ్రచిక్షురలను సంహరించుట

తామ్రుడా మాటలను విని దేవిపై బాణవర్షమును కురిపించెను. పరదేవతయు దేవతలకు శత్రువైన వానిని చంపగోరినదై వెంటనే బాణములను ప్రయోగించెను. ఇంతలో చిక్షురుడు మూర్ఛనుండి తెప్పరిల్లి మరల ధనుస్సు తీసుకొని ఆమె యెదుట నిలచెను. చిక్షుర తామ్రులిరువును దేవితో యుద్ధము చేయనారంభించిరి. అంతట కోపించి దేవి తన బాణములచే రాక్షసులందరి కవచములను ఛేదించెను. రాక్షసులందరు రక్తముతో తడిసిన శరీరములు కలవారైరి. ప్రేక్షకులైన దేవతలు ఆశ్చర్యపడునట్లు యుద్ధము జరిగినది. తామ్రుడు ఇనుపరోకలితో సింహము నెత్తిపై మోదెను. మరియు నవ్వుచు గొప్పధ్వని చేసెను. దేవి గర్జించు చున్న వానిని చూచిపదునైన తనకత్తితో అతని శిరస్సును ఖండించెను. అతడు

తిరుగుచు భూమిపై పడిపోయెను. పడిపోయిన తామ్రుని చూచి చిక్షురుడు కత్తి పట్టుకొని దేవివైపు పరువెత్తెను. దేవి అతనిని చూచి ఐదుబాణములు ప్రయోగించెను. ఒక బాణముతో ఖడ్గము, రెండవ బాణముతో వాని చేయి తక్కిన మూడు బాణములతో అతని తల నరకబడెను. యుద్ధ దుర్ముఖులను యారాక్షసు లిరువురును చంపబడిరి. అంతట వారి సైన్యము శీఘ్రముగా దిక్కులకు పారిపోయెను. దేవతలు మిగుల సంతసించి పుష్ప వృష్టికురిపించి జయజయ ధ్వానము లొనర్చిరి. మహిషుడు వారి మరణమున కాశ్చర్యపడి మహాబల శాలులైన అసిలో మబిడాల ప్రముఖులను గొప్ప సైన్యములో యుద్ధభూమికి పంపెను. అచట వారు పదునెనిమిది భుజములతో వివిధ దివ్యాయుధములు ధరించి యున్న దేవిని చూచిరి. ముందుగా అసిలోముడు వినయముతో నవ్వుచు శాంతి యుతముగా దేవితో నిట్లు మాట్లాడెను?

సౌందర్యవతివగు ఓ దేవి! యధార్థము చెప్పుము. నీవెందులకిక్కడకు వచ్చితివి? నిరపరాధులైన రాక్షసులనెందుకు చంపుచున్నావు? కారణము చెప్పవలసినదిగా కోరుచున్నాను. నేను నీతో ఇప్పుడు సంధి చేసికొన గోరుచున్నాను. నీకు కావలసిన బంగారమును రత్నములను శ్రేష్ఠములైన పాత్రలను కావలసినవాటిని తీసికొని వెళ్ళిపొమ్ము. దుఃఖమును సంతాపమును కలిగించు యుద్ధమెందులకు? దుఃఖకరమైన సంగ్రామమును విడిచి సంసారసుఖముల ననుభవింపుము. సుఖము రెండు విధములు. ఆత్మ జ్ఞానమువలన కలుగు సుఖమొకటి రెండవది భోగముల ననుభవించుట వలన లభించునది. మొదటిది నిత్యము రెండవది అనిత్యము. యౌవన దశలో నున్న నీవు గొప్ప భోగముల ననుభవించి సుఖపడుము. నీవు ధర్మబుద్ధివిగా నుండుట యుక్తము. అపరాధము లేకుండా రాక్షసుల నెందుకు చంపుచున్నావు? అని యడిగెను.

# శ్రీ దేవి అసిలోమ బిడాలులను చంపుట

**రాక్షసుని ప్రశ్నలకు దేవి సమాధానము :-**

"నేనిక్కడకు వచ్చుటకు కారణమేమని యడిగితివిగదా? ధర్మము కొఱకే నేనుసంచరింతును. ప్రాణుల న్యాయాన్యాయ ప్రవర్తనలకు సాక్షిరూపిణిని. సజ్జనుల రక్షించుట నాకు వ్రతము అట్లే దుర్మార్గులు నాకు చంపదగినవారు. అవతారములలో వేదముల సంరక్షణము నాకర్తవ్యము. ప్రతియుగమందును అవతారములను ధరించుచుందును. మహిషుడు చెడు నడువడిక కలవాడై దేవతలను చంపు

టకు ప్రయత్నించెను. ఓ రాక్షసా అతనిని చంపుటకే నేనిప్పుడు వచ్చినాను. దేవతలకు శత్రువైనట్టియు మహాబలిశాలియగు నాతనిని చంపెదను. నీవిక్కడనుండి వెళ్ళి దుర్మార్గుడగు మహిషునకీ విషయము తెలుపుము. అతనినే స్వయముగా యుద్ధమునకు రమ్మని చెప్పుము. నాతో సంధి చేయదలచుకొనినచో వైరమును విడిచి రాక్షసులందరును పాతాళమునకు పొండు. అపహరించిన దేవతల సొమ్మును తిరిగి యిచ్చివేసి ప్రహ్లాదుడు నివసించు పాతాళమునకు పొండు" అని పలికెను. అసిలోముడు మహావీరుడైన బిడాలునితో వింటివా? ఇప్పుడీమెతో యుద్ధము చేయ వలయునా? లేక సంధి చేసికొనవలయునా? అని పలికెను. బిడాలుడిట్లు పలికెను.

అభిమానవంతుడైన మనరాజు యుద్ధ ములో చావు తప్పదని తెలిసి కూడ సంధి కిష్టపడుటలేదు. యుద్ధములో చనిపోవుచున్న రాక్షసులను చూచుచునే మరల యుద్ధమునకు రాక్షసులను ప్రేరేపించుచున్నాడు. దైవమునెవడ తిక్రమింప గలడు? సేవకులు అభిమానము లేనివారు ఆజ్ఞాపించు యజమానులచేతిలో కీలుబొమ్మలు కఠినమైన ఈమాట నెట్లు రాజు వద్ద చెప్పగలము? పాతాళమునకు వెళ్ళుచూ దేవతల ధనరత్నాదుల నిచ్చివెళ్ళినా సరే లేక యుద్ధములో చచ్చుటకు సిద్ధమైనను సరే అను ఇట్టి కఠోరవచనమును రాజువద్ద నెట్లు పలుకగలము? అసత్యము చెప్పకూడదు. కనుక బుద్ధిమంతుడిట్టి యెడ మౌనమవలంబించుట శ్రేయస్కరము. రాజువద్దకు వెళ్ళి మౌనముగా నుండుటయు కుదురదు. కనుక యుద్ధమే చేయదగినదని పలికెను.

వారిద్దరును ధనుర్బాణముల ధరించి రథము నెక్కిరి. బిడాలుడు దేవిపై నేడుబాణములు ప్రయోగించెను. అసిలోముడు మాత్రము ఊరకచూచుచుండెను. నిరంకుశయగు దేవి తనమీదికి వచ్చు బాణములను ఖండించి బిడాలునిపై మూడు బాణములను ప్రయోగించెను. ఆ దెబ్బకు అతడు మూర్ఛనొంది మరణించెను. తరువాత అసిలోముడు యుద్ధమునకు సిద్ధమయ్యెను. ఎడమచేతిని పైకెత్తి యా రాక్షసుడు దేవీ! దుష్ట రాక్షసులు చచ్చుట నాకు తెలియును. మా మహిషుడు మందబుద్ధి. మంచిచెడ్డ లెరుగడు. నేను సేవకుడను కనుక నాకు యుద్ధము చేయుట తప్పుటలేదు. రాజువద్ద ఇష్టము కాని మాట చెప్పలేము. మేలోకీడో వీరమరణము నందుట నాధర్మము. నీ బాణములకు దానవులెల్లరు మరణించుచున్నారు. దైవమే గొప్పది పౌరుషము పనికి మాలినదని తలచు చున్నారు. అని మాట్లాడి అసిలోముడు దేవిపై బాణములు ప్రయోగించెను. మాయా

స్వరూపిణియగు దేవి ఆ బాణములు తనను చేరక ముందే ఆ బాణములను ఖండించెను. మరికొన్ని బాణములు ప్రయోగించి దేవి అసిలోముని బాధించెను. ఆ బాణములు రాక్షసుని శరీరమునకు చిల్లులు చేయగా రక్తధారలు స్రవించెను. అంత నతడు గద తీసికొని పరుగెత్తి వెళ్ళి సింహమునెత్తిపై కొట్టెను. సింహము కూడా గోళ్ళతో వాని వక్షస్థలమును చీల్చెను. అదిలెక్కచేయక రాక్షసుడు సింహము తలపైనెక్కి గదతో దేవిని కొట్టెను. ఆదెబ్బను తప్పుకొని దేవి వాడియైన తన ఖడ్గముతో రాక్షసుని శిరస్సును ఛేదించెను. శిరసు తెగిపోగా రాక్షసుడు నేలపైబడెను. రాక్షసులు హాహాకారమును చేసిరి. దేవతలు జగదంబను జయజయ ధ్వనులతో స్తుతించిరి. ఇరువురు రాక్షసవీరులును మరణించగనే సింహము సైనికులను కొందరిని చంపినది. మరికొందరిని తిన్నది. పారిపోయిన కొందరు సైనికులు దుఃఖముతో మహిషునకు బిడాలాసి-లోములు చనిపోయిరని చెప్పిరి. ఆ మాటలు విని మహిషుడు చింతతో వ్యాకులమైన మనస్సు కలవాడయ్యెను.

# మహిషుడు శ్రీ దేవిని కని మోహావశుడగుట

తరువాత మహిషుడు కోపముతో తనకు మంచి రథమును తెమ్మని దారుకుడను వానిని పంపెను. సారథి త్వరగా వెళ్ళి రథమును తెచ్చెను. ఆరథము వేయి గాడిదలుకలది. ధ్వజముతో అలంకరింపబడి మంచి చక్రములు కలిగి యుండెను. మరియు రాజా! సమస్తాయుధములతో కూడిన రథము ద్వారమందున్నదని మనవి చేసెను. అంతట మహాబలశాలి మహిషుడు మానవ శరీరమును ధరించి యుద్ధమునకు బయలుదేరెను. సర్వాభరణములతో అలంకరింపబడిన తన మానవ శరీరమునుచూచి ప్రేమించునని తలచెను. దివ్యములైన వస్త్రములు ధరించి రెండవ మన్మధుడా అన్నట్లు సైన్యముతో దేవివద్దకు వెళ్ళెను. అనేకవీరు లతో- యుద్ధము చేయవచ్చిన మహిషుని చూచి దేవి శంఖమును పూరించెను.

జనులకాశ్చర్యము కలిగించు శంఖధ్వనిని విని మహిషుడు దేవివద్దకు వెళ్ళి నవ్వుచు ఆమెతో ఇట్లు పలికెను:- దేవి! ఈ ప్రపంచములో స్త్రీగాని పురుషుడుగాని సుఖింకావలెనని కోరుదురు. సుఖము సంయోగములోనే సంభవించునుగాని వియోగమునందు కాదు. లోకములో సంయోగమువలన కలిగే సుఖము అత్యుత్తమము. ఈడుజోడు గల యువతీయువకుల మేలుకలయిక మహాత్తరసుఖము నిచ్చును. నేను అన్ని విధములైన సద్గుణములు గల యువకుడను. వీరుడనుకూడ. నామూలమున నీకు నిస్సంశయముగా అత్యుత్తమ సుఖము కలుగును.

ప్రియు రాలా! నేను అనేక రూపముల ధరింపగల మొనగాడను. ఇంద్రాది దేవతలు నాతో పోరాడలేక పారిపోయిరి. వారి అమూల్యరత్నములను నావద్దనే పదిలముగా నుంచితిని. వాటిని అన్నిటిని నీయిష్టము వచ్చినట్లు అనుభవింపుము. లేక దానమైనను చేసికొనవచ్చును. నాకు నీవు పట్టమహిషివికమ్ము. నేను నీ పాదదా సుడను. నీ మాట ననుసరించి దేవతలతో విరోధమును వదలు కొందుము. నీవు సుఖపడునట్లు నేను సర్వదా ప్రయత్నింతును. విశాలాక్షీ! ఆజ్ఞాపించుము. నీవు చెప్పినట్లు నడచెదను. నీ సౌందర్యమును చూచి నామనస్సు మోహించినది. మన్మధ బాణములచే బాధింపబడుచున్న నన్ను కాపాడుము. శరణాగత రక్షణము పరమధర్మముగదా! నేను నీ సేవకుడను. ప్రాణమున్నంతవరకు ఆడినమాట తప్పను. నీ పాదములకు నమస్కరించుచున్నాను. ఓ విశాలాక్షి! నాపై దయ చూపుము. పుట్టినది మొదలు యెన్నడును దైన్యమెరుగను. బ్రహ్మాదిదేవతలకు నాచరిత్ర తెలియును. నీకు దాసుడను. ఒక్కమారు నావైపు చూడుము అని పలికెను.

యిట్లు మాట్లాడుచున్న మహిషునితో దేవి యిట్లు పలికెను:- నేను పరమ పురుషుని తప్ప వేరొకనిని కోరను. నేనాతని యిచ్ఛాశక్తిని. సమస్త జగత్తులను నేనే సృష్టింతును. నేనా పరమపురుషుని సంయోగమున చైతన్యవంతురాల నగు దును. నాకుతుచ్ఛమైన గ్రామ్యసుఖ వాంఛ లేదు. నీవు వట్టి మూఢుడవు. పరస్త్రీ సాంగత్యమును కోరుచున్నావు. స్త్రీ యనగా పురుషుని బంధించు గొలుసు. నీవు మనో నిగ్రహముచే సుఖమును పొందుటకు ప్రయత్నింపుము. నీవు దేవతలతో విరోధము మాని యిష్టము వచ్చినట్లు సంచరించుము. నీకు జీవించవలయునను కోరిక యున్నచో పాతాళమునకు పొమ్ము లేదా యుద్ధమును చేయుము. దేవతలు నిన్ను నశింపజేయుటకు నన్ను పంపించిరి. నీవు చూపిన మాటలలోని స్నేహము నకు సంతోషించితిని. నిన్ను విడిచి పెట్టుచున్నాను వెళ్ళుము. చావదలచి నచో యుద్ధము చేయుము. తప్పక నిన్ను చంపెదను యిందులో సందేహము లేదు.

ఈ విధమైన ఆమె మాటలు విని కామమోహితుడైన రాక్షసుడు మధురముగా నిట్లు పలికెను - హరిహరాదులను లోకపాలకులను జయించిన నేను నీతో యుద్ధము చేయుట తగినదిగాదు. నీకిష్టమైనచో నన్ను వివాహము చేసుకొమ్ము నన్ను సేవించుము. అట్లు కానిచో నీవెక్కడనుండి వచ్చితివో అక్కడకు వెళ్ళుము. నేను నీతో స్నేహము కలిగిఉన్నాను గనుక నీతో యుద్ధము చేయను. మేలు చేయునట్టియు శుభమైన మాట చెప్పితిని.

నీచోటికి నీవు పొమ్ము. నిన్ను చంపినచో నాకేమి లాభము? స్త్రీహత్య, బాలహత్య, బ్రహ్మహత్య, ఇవి చాలచెడ్డవి. కనుక నిన్ను తీసుకొని ఇంటికి వెళ్ళుదును. బలాత్కారము వలన సుఖభోగములుండవు. కనుక వినయముతో చెప్పుచున్నాను. పురుషునకు యువతివలననే సుఖము కలుగును. నీవు అందమైనదానవు. సమస్తాభరణములను అలంకరించుకొంటివి. నీవు నన్ను సేవించుట కిష్టపడుటలేదు. సుఖభోగములను విడువుమని నీకెవరు బోధించిరో కదా! నీశత్రువు బోధించియున్నచో నీవు మోసగింపబడితివన్నమాట. మనమిరువురము వివాహము చేసికొని సుఖము ననుభవించుదము. నన్ను వదిలి వెళ్ళి పిమ్మట పశ్చాత్తాపపడుదువు.

## మహిషుడు శ్రీదేవికి మండోదరి కథ చెప్పుట

పూర్వము మందోదరియను స్త్రీ తనకను కూలుడైన గొప్పరాజును కాదని ఒక మూర్ఖుని వరించి వివాహమాడెను. పిమ్మట మోహ పారవశ్యముచే కామార్తయై పశ్చాత్తాపము నందినది. అని పలుకగాదేవి ఆమందోదరి కథను వాని ద్వారానే విని ఓరి మందబుద్ధీ! పాతాళమునకు పొమ్ము లేదా యుద్ధము చేయుము. నిన్ను తక్కిన రాక్షసులను చంపి నేను సుఖముగా వెళ్ళెదను. సజ్జనులకు దుఃఖము తొలగించి వారిని కాపాడుటకై శరీరమును ధరించుచుందును. రూపము జన్మలేని నాకు జన్మ- దేవతలను రక్షించుటకొరకేనని తెలిసికొనుము. నేను నిజము చెప్పుచున్నాను. నిన్ను చంపుటకై దేవతలు నన్ను ప్రార్థించినారు. నిన్ను చంపి నేను నిశ్చలముగా నుందును. కనుక యుద్ధము చేయుము లేదా పాతాళమునకు పొమ్ము. ఈ దేవి మాటలువిని యా రాక్షసుడు ధనుస్సును తీసికొని యుద్ధము చేయుటకు సిద్ధమయ్యెను. వెంటనే దేవిపై బాణములు ప్రయోగింపగా దేవి వాటిని ఖండించినది. వారిరువురకు భయంకరమైన యుద్ధము జరిగెను.

అంతలో దుర్ధరుడనువాడు వచ్చి దేవిపై అతిదారుణములైన బాణము లను ప్రయోగించెను. అంతట దేవి కోపించివాడియైన బాణములతో దుర్ధరుని నేలకూల్చినది. అదిచూచి త్రినేత్రుడను వాడు వచ్చి యేడు బాణములను దేవిపై ప్రయోగించెను. తన దగ్గరకు రాకముందే దేవి ఆ బాణములను ఖండించెను. త్రిశూలముతో దేవి త్రినేత్రుని బాధించెను. సంహరించెనుకూడ. తరువాత అంధకుడనువాడు ఇనుపగదతో సింహమును తలపై మోదెను. సింహము కోపించి గోళ్ళతో అతనిని చంపివేసినది. మరియు రోషముతో వాని మాంసమును తినివైచెను. తన రాక్షసులట్లు దేవిచేతులలో చచ్చుటచూచి మహిషుడత్యాశ్చర్య భరితు

డయ్యెను. మరియు మహిషుడు ప్రయోగించిన బాణమును ఖండించి దేవి గదతో వాని గుండె బ్రద్దలగొట్టెను. మహిషుడు సింహ రూపము ధరించి దేవి సింహమును తనగోళ్ళతో చీల్చెను. వెంటనే రాక్షసుడు గజరూపముదాల్చి తొండముతో పర్వతశిఖరములు పెకలించి దేవిపై విసిరెను.

## శ్రీదేవి మహిషుని సంహరించుట

దేవి తనవాడి బాణములతో కొండశిఖరములను నుగ్గునుగ్గు చేసెను. మరియు పెద్దగా నవ్వినది. మరియు బంగారుపాత్రతో మద్యము త్రాగి క్రోధముతో మహిషుని చంపగోరినదై శూలము చేతబట్టి రాక్షసునిపైకి వురికెను. దేవతా గణములామెను స్తుతించి పుష్పవర్షమును కురిపించెను. ఆ రాక్షసుడు అనేక మాయారూపములు దాల్చి దేవితో యుద్ధము చేసెను. చండికరోషా రుణ నేత్రములతో కూడి త్రిశూలముతో బలముకొలది వాని రొమ్ముపై పొడిచెను. అంతటవాడు మూర్ఛనొందెను. వెంటనే లేచి కాళ్ళతో దేవిని తన్నెను. మరియు వికటముగానవ్వెను. ఆ ధ్వనికి దేవతాలాశ్చర్యము నుందిరి. అంతట దేవి వేయి అంచులు గల సునాభమను చక్రమునుచేత పట్టుకొని మహిషునితో నిట్లనెను:-

ఓరీ మదాంధా ఇపుడే యీ చక్రము నీకుత్తు కనుత్త రింపగలదు. నీవు యమపురికే గుదువు. అని చక్రమును వానిపై విసెరెను. మహిషాసురుని శిరస్సు తెగి నేలపై బడెను. ఆకాశమున దేవతలు జయజయ ధ్వనులొనర్చిరి. తక్కిన రాక్షసులు పారిపోవుచుండిరి. వారి మరణవార్త విని భూమిపై గలమునులు సాధుజనములు చాలా సంతసించిరి. అప్పుడు దేవి యుద్ధరంగము వదలి ఒక పవిత్ర ప్రదేశమున కూర్చుండెను. దేవతలెల్లరు సుఖప్రదాయినియగు శ్రీదేవిని స్తుతించుట కామె సమీపమునకు వెళ్ళిరి. ఇంద్రాది దేవతలు మహిషుని మరణమునకు పరమానంద భరితులై జగదంబనిట్లు స్తుతించిరి.

## దేవతలు శ్రీదేవిని స్తుతించుట

శ్లో॥ బ్రహ్మా సృజత్యవతి విష్ణురిదం మహే
శశ్శక్త్యాతవ హరతే నను చాంతకాలే ।
ఈ శానతేఽపిచభవంతి తయావిహీనా
స్తస్మా త్త్వ మేవ జగతస్థితి నాశకర్త్రీ ।
కీర్తిర్మతిః స్మృతి గతీ కరుణాదయాత్వమ్

శ్రద్ధాధృతిశ్చ వసుధాకమలా జపాచ ।
పుష్టిః కలాఽథ విజయాగిరిజా జయాత్వం
తుష్టిః ప్రమాత్వమసి బుద్ధి రుమారమాచ
విద్యాక్షమా జగతి కాంతి రపీహమేధా
సర్వం త్వమేవవిదితా భువనత్రయే ఽస్మిన్ ॥
ఆభిర్వినా తవతు శక్తిభిరాశుకర్తుం
కోవాక్షమః సకలలోక నివాసభూమే ।
త్వంధారణా ననున చేదసి కూర్మ నాగౌ,
ధర్తుంక్షమౌ కథమిలా మపితౌ భవేతామ్.
పృథ్వీన చేత్త్వ మసి వాగగనే కథం స్థా
స్యత్యే తదంబ నిఖిలం బహుభారయుక్తమ్
యే వాస్తువంతి మనుజా అమరాన్ విమూఢా
మాయాగుణైస్తవ చతుర్ముఖ విష్ణురుద్రాన్ ।
శుభ్రాంశువహ్ని యమవాయు గణేశముఖ్యాన్
కింత్వామృతే జననితే ప్రభవంతికార్యే
యేజుహ్వతి ప్రవితతే కల్పధియోంబ యజ్ఞ
వహ్నౌ సురాన్ సమధికృత్య హవిస్సమృద్ధమ్ ।
స్వాహాన చేత్త్వ మసితే కథ మాపురద్ధా
త్వామేవ కింనహి యజంతితతోహిమూఢాః॥
భోగప్రదాసి భవతీహ చరాచరాణాం
స్వాంశైర్దదాసిఖలు జీవన మేవ నిత్యమ్ ।
స్వీయాన్సురాన్ జనని పోషయసేచ యద్వత్
తద్వత్పరాన పిచపాలయసీతిహేతోః ।
మాతస్త్వయం విరచితాన్ విపినే వినోదా
ద్వం ధ్యాన్ పలాశ రహితాంశ్చ కటూంశ్చవృక్షాన్ ॥
నోచ్ఛేదయంతి పురుషా నిపుణాః కథంచిత్
తస్మాత్త్వ మప్యతితథాం పరిపాసి దైత్యాన్ ॥
యత్త్వంతు హంసిరణమూర్ధ్ని శరైరరాతీన్
దేవాంగ నాసురతికేళి మతీన్ విదిత్వా
దేహాంతరేపి కరుణారస మాదదానా

దత్తే చరిత్ర మిదమీప్సితపూరణాయ ।
చిత్రంత్వ మీ యదసుభీ రహితానసంతి
త్వచ్చింతితేన దనుజాః ప్రథిత ప్రభావాః ।
యేషాంకృతే జనని దేహ నిబంధనంతే
క్రీడారసస్తవనచాన్య తరోఽత్రహేతుః॥
ప్రాప్తేకలావహ మాదుష్టతరేచకాలే
నత్వాంభజంతి మనుజాననువంచితాస్తే
ధూర్తైఃపురాణ చతురైర్హరి శంకరాణాం
సేవా పరాశ్చ విహితాస్తవ నిర్మితానామ్ ॥
జ్ఞాత్వాసురాంస్తవ వశానసురార్దితాంశ్చ
యే వైభజంతి భువిభావయు తా విభగ్నాన్
ధృత్వాకరే సువిమలంఖలు దీపకం తే
కూపే పతంతి మనుజా విజలేఽతిఘోరే
విద్యాత్వమేవ సుఖదాఽసుఖదావ్య విద్యా
మాతస్వ మేవ జనవార్తిహరా నరాణామ్ ।
మోక్షార్ధి భిస్తుకలితా కిలమందధీభి
ర్నారాధితా జనని భోగపరైస్తథాజ్ఞైః॥

**స్తోత్ర భావము:-** ఓ భగవతీ! దేవీ! నీ దివ్యశక్తి ప్రభావముచేతనే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టిస్థితి సంహార కార్యముల ననుసరింపగలుగు చున్నారు. కనుక వాస్తవముగ సృష్టిస్థితి సంహారకారిణివి నీవే. శ్రీమాతా! నీవు సత్యముగ కీర్తి, ధృతిమతి విశ్వగతి స్వరూపురాలవు. కరుణశ్రద్ధ దయ నీ స్వరూపములే. గిరిజ, కమల, జయ మొదలగు పేర్లు కలదానవు. తుష్టి, పుష్టి, ప్రమ, బుద్ధి, ఉమ, మొదలగు రూపములు నీవే. విద్యా, క్షమ, మేధ, కాంతులు నీవే. నీ సహాయము లేనిదే శేషుడు భూమిని మోయగలడా? అమ్మా! నిజమునకు నీవే భూమాతవు. కానిచో మహా భారముగల భూమి నిరాధారముగ నాకాశమందెట్లు నిలువగలదు? ఈ జనులు నీమాయచే మోహితులై హరిహరాది దేవతల నారాధించి స్తుతించు చున్నారు.

దేవతలు నీ సహాయములేనిదే యే పనియు చేయజాలరు. ఇక తక్కిన ప్రాణుల విషయము చెప్పనేల? నీవు చరాచరప్రాణులకు వారివారి కర్మాను

సారముగ సుఖదుఃఖము లొసగుచుందువు. నీదయా మృతము వర్ణనాతీతము. నీవు రాక్షసులను సంహారించివారికి స్వర్గమందు గొప్పగొప్ప సుఖముల సమకూర్చు చున్నావు. నీ పవిత్ర చరిత్ర భక్తులకు సకల సంపదల నొసంగును. అన్ని కోరికలను తీర్చును. నీవు శరీరము ధరించుట ధర్మరక్షణము నకు అధర్మనాశమునకు మాత్రమే. మానవులీ లోకమున నిన్ను విడిచి యితర దేవతల నారాధించుట చేతిలో దీప మున్నను చీకటి నూతిలో కూలుటవంటిది. నీవు సుఖశాంతులనొసగు విద్యాస్వరూపవు ఘోరసంసార దుఃఖముల కలిగించు అవిద్యవు నీవు. విన్నారా ధించు మోక్షకాములకు శాశ్వత సుఖము నిచ్చు తల్లివినీవే. అజ్ఞానులు మంద బుద్ధులు నిన్ను సేవింపజాలరు.

# దేవతలు శ్రీదేవిని స్తుతించుట

**దేవతలు దేవినిట్లు స్తుతించిరి :-**

శ్లో॥ బ్రహ్మా హరశ్చహరి రప్యనిశంశరణ్యాం
పాదాంబుజంతవ భజంతి సురాస్తథాన్యే ।
తద్వైనయేఽల్ప మతయో మనసాభజంతి
భ్రాంతాః పతంతి సతతం భవసాగరేతే ॥
చండిత్వదం ఘ్రిజలజోత్థరజః ప్రసాదై
ర్బ్రహ్మాకరోతి సకలం భువనం భవాదౌ।
శౌరిశ్చ పాతిఖలు సంహరతేహరస్తు
త్వాంసేవతే నమనుజస్త్విహ దుర్భగోఽసౌ ॥
వాగ్దేవతాత్వమసి దేవి సురాసురాణాం
వక్తుంనతేఽమరవరాః ప్రభవంతి శక్తాః ।
త్వంచేన్ముఖేవససినైవయ దైవతేషాం
యస్మాద్భవంతి మనుజానహిత ద్విహీనాః ॥
శప్తో హరిస్తు భృగుణాకుపితేనకామం
మీనోబ భూవకమఠఃఖలు సూకరస్తు ।
పశ్చాన్నృసింహ ఇతి యశ్ఛలకృద్ధరాయాం
తాన్ సేవతాం జనని మృత్యుభయంనకింస్యాత్ ॥
శంభోః పపాతభువిలింగ మిదం ప్రసిద్ధం
శాపేన తేచ భృగోర్విపినే గతస్య।

తంయేవరాభువిభజంతి కపాలినంతు
తేషాం కథం సుఖమిహాపి పరత్రమాత: ॥
యోభూద్గజాననగణాధిపతి ర్మహేశాత్
తం యేభజంతి మనుజా వితథ ప్రపన్నా: ।
జానంతితేన సకలార్థ ఫలప్రదాత్రీం
త్వాం దేవి విశ్వజననీం సుఖసేవనీయామ్ ॥
చిత్రం త్వయాఽరిజనతాపి దయార్ద్రభావాత్
దత్త్వారణేశితశరైర్గమితా ద్యులోకమ్॥
బ్రహ్మా హరశ్చ హరి రప్యుత గర్వభావా
జ్జానంతితేఽపివిబుధానతవ ప్రభావమ్ ।
కేఽన్యే భవంతి మనుజా విదితుం సమర్థా
స్సమ్మోహితాస్తవ గుణైరమిత ప్రభావై: ॥
క్లిశ్యంతితేఽపి మునయస్తవ దుర్విభావ్యం
పాదాంబుజం నహిభజంతివిమూఢచిత్తా: ।
సూర్యాగ్నిసేవన పరా: పరమార్థ తత్త్వం
జ్ఞాతంనతై: శ్రుతిశతైరపి వేదసారమ్ ॥
మన్యేగుణాస్తవ భువిప్రథిత ప్రభావా:
కుర్వంతి యేహి విముఖా స్సమభక్తి భావాత్ ।
లోకాన్ స్వబుద్ధిర చితై ర్వివిధాగమైశ్చ
విష్ణ్వీశ భాస్కర గణేశ పరానిధాయ
కుర్వంతియే తవపదా ద్విముఖాన్నరాగ్ర్యాన్
స్వోక్తాగ మైర్హరి హరార్చన భక్తియోగై:
తేషాంనకుప్యసి దయాంకురుషేఽంబికేత్వం
తాన్ మోహమంత్రనిపుణాన్ ప్రథయస్యలంచ
తుర్యేయుగే భవతి చాతిబలం గుణస్య
తుర్యస్యతే నమథితాన్యపి దాగమాని॥

**స్తోత్రభావము:-** ఓ పరదేవతా! నీ పాదపద్మములను హరిహర బ్రహ్మాది దేవతలు నిత్యము కొలుచుచుందురు. అల్పబుద్ధులు మాత్రము నిన్ను సేవింపక సంసార సముద్రములో కూలుచుందురు. నీవు వాగ్దేవతవు. భృగుమహర్షి కోపించి విష్ణువును

శపించెను. అందుచే హరి మీనకూర్మ వరాహ నారసింహవామనాది రూపములు దాల్చవలసి వచ్చెను. అట్టి పరాధీనుని సేవించినచో మృత్యుభయ మెట్లుతప్పును? దయాకల్పవల్లీ! తల్లీ! పూర్వము శివుడు వనమందు సంచరించునప్పుడు భృగు మహర్షి వానిని శపించెను. అందువలన శివుని లింగము నేలపైబడెను. ఇది అందరకు తెలిసిన విషయమే. అట్టి శివుని కొలిచినవారికి శాశ్వత సుఖమెట్లు లభించును? అమ్మా! శివుని కుమారుడు గణపతి అతినిని కూడ అజ్ఞానులు పూజించుదురు. అన్ని ప్రయోజనములను సమకూర్చు నీశక్తి నెరుగక మానవులా యాదేవతలనారాధించుచున్నారు. హరిహరబ్రహ్మలు కూడ గర్వమోహముచే నీ దివ్య ప్రభావము నెరుగజాలకున్నారు. ఇక మానవు లెట్లెరుగగలరు? నీ పాద పద్మములను సేవింపనివారు అనేక కష్టములు ననుభవించుచున్నారు. తల్లీ! ఆగమశాస్త్రములను రచించిన బ్రాహ్మణులు భక్తితో శివకేశవులను పూజింతురు. కవులు, పండితులు నీ నిత్యసత్యోపాసనకు స్వస్తి చెప్పి నీవు కల్పించిన దేవతలను పూజించుచున్నారు. నిన్ను ధ్యానించువారు గర్భనరకము లోపడరు. హృదయములో నీ స్పందన లేనిదే ప్రాణులకు శక్తి యెక్కడిది? నీ శక్తిలేని మానవుడు తిరుగుటకు పనిచేయుటకు యెట్లు సమర్థుడగును? ఇట్లు స్తుతింపగా పరదేవత అంతర్ధానము చెందెను. దేవి కనబడకపోవుటవలన దేవతలు అందరు మిక్కిలి యాశ్చర్యపడిరి.

జనమేజయుడు వ్యాసునితో యిట్లనుచున్నాడు:- ఓ మహర్షీ శ్రీదేవి దివ్య చరిత కథామృతము శాంతిప్రదము హితకరము మహాద్భుతమునై యున్నది. నీ ముఖకమలము నుండి యాకథామృతము నెంతగ్రోలినను తనివి తీరుటలేదు. శ్రీదేవి పరమ పావనచరిత్ర అల్పపుణ్యము కలవారికి లభ్యముకాదు. జగదంబ చరిత్రను దేవతలకు మునులకును శ్రీరామరక్ష. సంసారసాగరమును దాటించు నావ. అట్టి దానిని తెలిసిన వారేల విడిచి పెట్టెదరు? పూర్వజన్మమున జగదంబ నెవరు కుంద చంపక బిల్వసుమదళములతో పూజించిరో వారీ జన్మమున రాజ భోగములనుభవింతురు. జగదంబనర్చింపని మానవుడు ధనధాన్యసంతాన హీనుడై రోగియై బాధపడుచుండును. కుంటి గ్రుడ్డి నిత్యదరిద్రుడు మొదలగువారు పూర్వ జన్మమున దేవిని సేవించినవారుకారని గ్రహింపవలయును. ఈ జన్మలో సకల సంపదలు గలిగి సర్వసుఖముల ననుభవించుచున్నవారు.

పూర్వ జన్మమున జగదంబను శ్రద్ధాభక్తులతో సేవించినవారని తెలియవలెను. వ్యాసమహర్షీ! త్రిభువనేశ్వరి అంతర్ధానమై యెక్కడకు వెళ్ళెనో తెలియజేయవలసినదిగా ప్రార్థించుచున్నాను"అని జనమేజయు డడుగగా వ్యాసుడు పూర్వము నీకు

చెప్పిన మణిద్వీపమే ఆమెకిష్టమైన క్రీడాస్థానము. పూర్వమక్కడనే హరిహర బ్రహ్మలు స్త్రీస్వరూపమును పొందిరి. ఆ దేవి దయవలన మరల పురుషులై తమ పనులను నిర్వహించుచున్నారు. ఆ మణిద్వీపము అమృతసముద్రము మధ్య భాగమందున్నది. అచ్చట దేవి పలురూపముల విహరించుచుండును. దేవతల పూజాస్తుతుల నందుకొని మహిషారమర్దిని ఆ మణిద్వీపమునకే వెళ్ళెనని చెప్పెను.

# శుంభ నిశుంభుల వరగర్వము

పూర్వము శుంభ నిశంభులను రాక్షసులు బ్రహ్మను తపస్సుచే సంతోష పెట్టి అనేక వరములు పొందిరి. మహాబలవంతులైన ఆరాక్షసులు దేవతల నోడించి స్వర్గమ్మును చేజిక్కించుకొనిరి. శుంభుడు చిరకాలము స్వర్గరాజ్యమును పాలించు చుండగా రాజ్యమును కోల్పోయిన దేవతలు గొప్ప దుఃఖముపొంది బృహస్పతినిట్లు ప్రశ్నించిరి. గురుదేవా! నీవు సర్వము తెలిసినవాడవు. మహా మునివి. మా దుఃఖముపోవుటకుపాయమును తెలియజేయవేడుచున్నాము. వేద మంత్రములన్ని కోరికలను తీర్పగలవు కద! యజ్ఞములు కోరికలను తీర్ప గలవు కదా! శత్రునాశము కొరకు యేవిధానము వేదములందుగలదో దానిని తెలియ జేయుమని ప్రార్థించిరి.

అప్పుడు బృహస్పతి ఓదేవతలారా! వేదములలో యజ్ఞములందు పూజింప దగినవారుగా కిఇంద్రాగ్నివరుణాది దేవతలు చెప్పబడుచున్నారు. వారి యను గ్రహముచే శతృజయాదికార్యములు సాధింపవచ్చును. కాని ఆ ఇంద్రాగ్ని వరుణాది దేవతలే ఆపదలలో చిక్కుకొని యుండగా నేమి చేయగలము. దైవ సంకల్పానుసారము జరుగెడు పనులకు ప్రతిక్రియ లెవ్వరును జరుపలేరు. కాని ఆలోచించి ఉపాయమును తెలిపెదను, మహిషాసుర సంహారానన్తరము దేవిని స్తుతింపగా ఆమె ఆపదలు వచ్చినప్పుడు నన్ను స్మరించినచో మీ యాపదలు తొలగగలవని చెప్పినదిగదా!

కనుక మీరిప్పుడు హిమాలయ పర్వతమునకు వెళ్ళి శ్రీచండికాదేవిని భక్తిశ్రద్ధలతో సేవించండి. మీరు మాయా బీజవిధానమెరిగి దానిని పునశ్చరణ చేయండి. ఆమె మీయెడల దయగలది యగునని నేను యోగబలముచే తెలిసికొన్నాను. దానిచే మీకష్టములు గట్టెక్కునని చెప్పెను. బృహస్పతి మాటల ప్రకారము దేవతలు హిమాలయమున కేగి అచట మాయా బీజమును తమ హృదయమందు నిల్పుకొని యా తల్లిని ధ్యానించి మహామాయను పరమభక్తి నమస్కరించి యిట్లు స్తోత్రము చేసిరి.

# దేవతలు శ్రీదేవిని స్తుతించుట

నమో దేవి విశ్వేశ్వరి! ప్రాణనాథే! మదానందరూపే సురానందదేతే
నమో దానవాంతప్రదే మానవానా మనేకార్థదే భక్తిగమ్య స్వరూపే
నతే నామసంఖ్యా నతే రూపమీదృక్త థా కోపివేదాది దేవస్వరూపే
త్వమేవాసి సర్వేషుశక్తి స్వరూపా ప్రజాసృష్టి సంహారకాలే సదైవ
స్మృతిస్త్వంధృతిస్త్వంత్వమేవాసిబుద్ధిర్జరా పుష్టితుష్టీ ధృతిః కాంతిశాంతీ
సువిద్యా సులక్ష్మీర్గతిః కీర్తి మేధే త్వమేవాసి విశ్వస్య బీజంపురాణమ్
యదాయైః స్వరూపైః కరోషిహకార్యం సురాణాంచ తేభ్యో నమామోద్య శాంత్యై
క్షమాయోగనిద్రాదయాత్వం వివక్షాస్థితా సర్వభూతేషుశస్తైః స్వరూపైః ।
కృతం కార్యమాదౌత్వయా యత్సురాణాం హతోఽసౌ మహారిర్మదాంధో హయారిః
దయాతే సదాసర్వదేవేషు దేవి! ప్రసిద్ధా పురాణే వేదేషుగీతాః
కిమత్రాస్తి చిత్రం యదంబాసు తేస్వంముదాపాలయేత్పోషయేత్సమ్యగేవ
యత్త్వం జనిత్రీసురాణాం సహాయా కురుష్వైకచిత్తే నకార్యం సమగ్రమ్
నవా తేగుణానామియత్తాం స్వరూపం వయం దేవి జానీమహే విశ్వవంద్యే ॥
కృపాపాత్రమి త్యేవ మత్వాతథా స్మాన్భయేభ్య స్సదాపాహిపాతుంసమర్థే!
వినా బాణపాతైర్వినా ముష్టిఘా తైర్వినాశూలశంఖైర్వి నాశక్తిదండైః
రిపూన్హన్తు మే వాసిశక్తావినో దాత్తథాపీహ లోకోపకారాయలీలా ।
ఇదం శాశ్వతం నైవజానంతి మూఢానకార్యం వినాకారణం సంభవేద్వా
వయం తర్కయామోఽనుమానం ప్రమాణం త్వమేవాసికర్త్రాస్య విశ్వస్యచేతి
అజఃసృష్టికర్తా ముకుందోఽవితా యంహరో నాశకృద్వైపురాణే ప్రసిద్ధః
నకింత్వత్ర్స సూతాస్త్రయస్తే యుగాదౌత్వమేవాసిసర్వస్యతే నైవమాతా ।
త్రిభిస్త్వం పురారాధితా దేవి దత్తాత్వయాశక్తి రుగ్రా చతేభ్యః సమగ్రా ।
త్వయాసంయు తాస్తే ప్రకుర్వంతి కామం జగత్పాలనోత్పత్తి సంహారమేవ
తేకిం నమందమతయోయత యోవిమూఢాస్త్వాంయేవ విశ్వజననీం సమపాశ్రయంతి
విద్యాం వరాం సకలకామ ఫలప్రదాంతాం ముక్తిప్రదాం విబుధ బృంద సువంది తాంప్రీమ్
యే వైష్ణవాః పాశుపతాశ్చ సౌరాదంభాస్తవీవ ప్రతిభాంతిమానం
ధ్యాయంతి నత్వాం కమలాంచలజ్జాం కాంతింస్థితిం కీర్తి మథాపి పుష్టిమ్ ॥
హరిహరాదిభిరప్యథ సేవితాత్వమిహ దేవవరై రసురైస్తథా ।
భవిభజంతిన యేఽల్పధియోనరాజననితే విధినాఖిలు వంచితాః ।

జలధిజాపద పంకజరంజనం జతురోసేన కరోతిహరిః స్వయమ్ ।
త్రినయనోపిధరాధరజాంఘ్రి పంకజపరాగ నిషేవణతత్పరః ॥

**స్తోత్రభావము:-** విశ్వేశ్వరీ! సచ్చిదానంద స్వరూపిణీ! నీకు నమస్కారము. ఆది దేవీ! నీయనంత నామరూపము లెవ్వడు నెరుగజాలడు. సృష్టి సంహారాది కార్యము లన్నిటిలో నీవు సర్వక్రియాశక్తి స్వరూపిణివి. ఓ సర్వేశ్వరీ! స్మృతి, ధృతి, బుద్ధి, జర, తుష్టి మొదలగునవన్నియు నీ స్వరూపములే. నీవు యేయే దివ్యరూపములతో దేవతలకార్యముల నిర్వహింతువో ఆయద్భుతరూపములకు నమస్కరించు చున్నాము. నీవు శాంతిక్షమ యోగనిద్ర మొదలగు స్వరూపములతో జీవుల యందు నివసించెదవు. నీవు దయామతల్లివని వేదములు ఘోషించుచున్నవి. నీవు దేవత లందరకు సహాయము చేయుదానవు. తల్లి తనయుని గారాబముతో లాలించి పాలించిపెంచుటలో ఆశ్చర్యమేమున్నది?

ఇప్పుడు ఆపదలోనున్న మా పనులనన్నిటిని చక్కబరచుము నీయనంత గుణరూపములద్భుతములు. మేము వానినెరుగజాలము. మాభయమును తొలగింపుము. మమ్ము రక్షించుటకు నీవే సమర్థురాలవు. శత్రుసంహారమునకై నీకు ఆయుధము లక్కరలేదు. నీవులో కోపకారమునకే యుద్ధము చేయుదువు. ఈ సర్వప్రపంచమునకు నీవే మూలకారణము. ప్రమాణముకూడా నీవే. సృష్టికి ముందు త్రిమూర్తులను కన్నతల్లివి నీవేకదా? కనుక నీ జగత్తు లన్నిటికిని జననివినీవే. నీవు పూర్వము త్రిమూర్తులచే పూజింపబడివారికి దివ్యశక్తుల నిచ్చినదానవు. నీవులజ్జా కీర్తి పుష్టికాంత్యాది రూపమైనదానవు. అని యీవిధముగ దేవతలెల్లరును పరదేవతను స్తుతించిరి.

అంతట ఆ దేవి శరీరమునుండి ఒక దివ్యతేజోరూపము వెలువడెను. ఆ మహోజ్జ్వలరూపము పార్వతి శరీరము నుండి వెలువడినది. అందుచేతనే ఆమెకు కాళిక యని పేరు వచ్చినది. తరువాత పార్వతి నలుపురంగును ధరించి కౌశికి యనుపేరు పొందెను. కాళికాదేవి నల్లని వర్ణముతో ఘోరరూపముతో భయంకరముగానుండెను. రాక్షసులకు భయమును కలిగించుచు భక్తులకోరికలను నెరవేర్చుచు కాళరాత్రి యనుపేరుతో ప్రసిద్ధి చెందినది. ఆ కాళికాంబా రూపము లావణ్య పరిపూర్ణమై సుమనో హారమై సమస్త భూషణములతో వెలుగొందెను. అప్పుడామె దేవతలతో నిట్లనెను:-

దేవతలారా! మీరు భయపడ వలదు. విచారింప పనిలేదు. నేను మీ శత్రువుల నిప్పుడే సంహరింతును. మీ కార్యమును తప్పక నెరవేర్తును. మీ క్షేమముకొఱకు

యుద్ధము చేసి శుంభ నిశుంభులను సంహరించెదను. అని దేవతలనూరడించి యాజగదేకమాత మధురకంఠ స్వరముతో అమర గాన మొనర్చెను. ఆ గానమాధుర్యమునకు పశుపక్ష్యాదులు సైతము పారవశ్యము నొందినవి. దేవతలు పరమానందము నొందిరి. అప్పుడు శుంభునిసేవకులు చండముండులను రాక్షసులు స్వేచ్ఛగా తిరుగుచుండిరి. వారు గానముచేయు అంబికా రూపమును ఆ దేవి సమీపమందున్న కాళికను సందర్శించిరి. వారు ఆమె రూపలావణ్యముల కాశ్చర్యపడి శుంభునివద్దకు వెళ్ళి రాక్షసరాజువద్ద తల యొగ్గి దోసిలించి యిట్లు పలికిరి:-

రాజా! ఒక కామిని దివ్యసౌందర్యవతిగా కనిపించు చున్నది. ఆమె పవిత్ర హిమాలయము నుండి దిగి వచ్చినది. సర్వశుభ లక్షణము లతో వెలగొందుచు సింహముపై కూర్చొనియున్నది. ఆమె మధురగానమునకు పరవశములై మృగములుకూడ ఆమె సమీపమున నిలిచియున్నవి. ఆమె యెవరి కూతురో ఎందుకు వచ్చినదో తెలియదు. నీవామెను భార్యగా చేసికొనుము. ఆమె నీకన్నివిధముల తగిన యువతి. అట్టి స్త్రీలోకమందెచ్చటనులేదు. నీవు దేవతల నందరను జయించి వారి అమూల్యవస్తువులను తెచ్చుకొంటివి. ఈ కాంతా రత్నము నీ గృహమందున్ననాడే తక్కిన వస్తువులకు విలువ యుండును. ఈమెను నీ దానిగ చేసికొనుట యెంతేని యావశ్యకము. అను యీ మాటలు విని శుంభుడు సమీపమందున్న సుగ్రీవుడనువానితో ఇట్లు పలికెను.

# దేవి వద్దకు సుగ్రీవుని రాయబారము

సుగ్రీవా! నీవు నాకు దూతగావెళ్ళి ఆమె నన్ను ప్రేమించునట్లు వ్యవహారము నడుపుము. స్త్రీల విషయమున సామదానోపాయములు రెండును ప్రయోగింప దగినవి. భేదోపాయమువలన రసాభాసము దండోపాయము వలన రసభంగమును కలుగును కనుక నవిప్రయోగింపదగినవికావని పండితులనుచున్నారు. అని పలికెను! శుంభుని యీ మాటలను విని సుగ్రీవుడు అంబిక యున్నచోటికి వెళ్ళెను. సింహవాహనముపై కూర్చొనియున్న జగదంబికకు దోసిలొగ్గి యిట్లు పలికెను.

సుందరీ! శుంభుడను రాక్షసరాజు అందగాడు. నీయందచందాలు విని ఆ మహాత్ముడిపుడు నన్ను నీవద్దకు పంపినాడు. అతడు నమస్కరించి నీతో చెప్పుమనిన మాటల నాలకింపుము నేను దేవతలనందరను జయించితిని. ముల్లో కములకును ప్రస్తుతము రాజును నేనే. నేనిక్కడనే యుండి దేవతలకు సమర్పించు

హవిర్భాగములను స్వీకరించుచున్నాను. స్వర్గమందలి రత్నములన్నియు నావద్దనే యున్నవి. దేవతలు రాక్షసులు అందరు నాయాజ్ఞకు బద్ధులే. నీయంద చందాలను విని నీకుదాసుడనైతిని. నీకు వశుడనై నీవాజ్ఞాపించినట్లు నడిచెదను.

ఓ సుందరీ! మన్మథ బాణములకోర్వలేని నన్ను రక్షింపుము. నన్ను సేవించి నీవు ముల్లోకములకు యజమానురాలవగుము. సమస్తభోగములను అనుభవింపుము. నేను దేవతలవలన కాని, రాక్షసులవలనకాని, మనుష్యులవలన కాని చచ్చువాడనుకాను. నీకిష్ట మైనచోట విహరించుము. ఇవి మా రాజు మాటలు ఓ తరుణీ! యీ మాటలను విచారించి నీవు ప్రేమతో మధురమైన మాటలను పలుకుము. ఆ మాటను వెంటనే మారాజునకు తెలియజేయుదును.

అని పలుకగా దూతమాటలకు చిరునవ్వుతో దేవి దేవతల పని సాధించుటకై మధురముగా ఇట్లు పలికెను. శుంభుని రాక్షసులకు రాజుగాను, దేవతలను బలవంతుడగు నిశుంభుని జయించిన వానిగాను విని యున్నాను అట్టి మహా రాక్షసుని చూడదలచియే వచ్చినాను. రత్నము తనశోభను పెంచుకొనుటకై బంగారమును చేరునుగదా అట్లే నాకు తగినవానిగా శుంభుని భావించి యిక్కడకు వచ్చితిని. లోకములో దేవగంధర్వ రాక్షసాదులనందరినీ చూచి, వారందరినీ జయించిన వాడగుటచే శుంభుడు తగినవాడని యిక్కడకు వచ్చితిని. అయితే నా వివాహమునకు ఒక నియమమున్నది. చిన్నతనములో చెలికత్తెలతో ఆడుకొనుచు నా శరీర బలమును బట్టి గర్వముతో నన్ను యుద్ధ ములో జయించిన వానినే నేను వివాహమాడెదనని ప్రతిజ్ఞచేసితిని. కనుక శుంభుని బలాబలముల చూచి వరించెదను. కనుక శుంభుడు కాని అతని సోదరుడు కాని నన్ను జయించి వివాహము చేసికొనవచ్చునని ఆ సుంద రునకు తెలియజేయుము. దేవి పలికిన మాటలు విని దూత ఆశ్చర్యపడి స్త్రీ స్వభావమైన సాహసమువలన పలుకుచున్నావు కాని ఇంద్రాది దేవతల నవలీలగా జయించినవానితో యుద్ధము చేయగోరుచున్నావా? మూడు లోకములలోను శుంభుని జయించు వీరుడులేడు.

ఓ సుందరీ! ఆలోచించ కుండ మాట్లాడకూడదు. తనబలమును ప్రతి యోధుని బలమును తెలిసికొని సమయోచితముగా మాట్లాడవలెను. మూడు లోకములకు అధిపతి యైన శుంభుడు నీ రూపమును విని మోహముతో నున్నాడు. నిన్ను ప్రార్థిస్తున్నాడు. కనుక నీవు మూర్ఖ స్వభావమును విడిచి నామాటమన్నించి శుంభునిగాని నిశుంభునిగాని సేవించుము. ఒకవేళ నీవు అతని వద్దకు రానియెడల అతడు కోపించి సేవకులను పంపి బలాత్కారముగా నిన్ను తనవద్దకు రప్పించు

కొనును. ఆసేవకులు నిన్ను జుట్టు పట్టుకొని లాగుకొని పోయి రాజు ముందుంచె దరు. నీవభిమానవతివి సాహసము చేయవలదు నీవు సగౌరవముగా వానివద్దకు వెళ్ళుము. వాడి బాణాలతో యుద్ధమెక్కడ? రతిక్రీడాసుఖమెక్కడ? ఈ రెండింటిలోని మంచిచెడ్డల నెరిగి నా మాటను కొంచెము వినుము.

శుంభ నిశుంభులలో నెవనిని సేవించినను నీకు సుఖము కల్గును. అని పలుకగా శ్రీదేవి యిట్లనెను. అమాత్యా! నీవు మంచివక్తవు. మిక్కిలి నేర్పరివి. చిన్నతనమున చేసిన ప్రతిజ్ఞను విడువజాలను. శుంభ నిశుంభులకిట్లు చెప్పుము. యుద్ధములో నన్ను గెల్వనిచో నెవ్వడైననుభర్తకాజాలడని చెప్పుము. నేను యుద్ధము చేయుటకే యిక్కడకు వచ్చితిని. నన్ను గెలిచి వివాహము చేసికొనుమని తెలుపుము" రాజా! నీవు సమర్థుడవు గనుక వీరధర్మము ననుసరించి నాతో యుద్ధము చేయుము. ఒకవేళ నాశూలము చూచి భయపడి యుద్ధము చేయనిచో పాతాళమునకు శీఘ్రముగా పొమ్ము. నీవు బ్రతుకుపై ఆశగలవాడ వైనచో స్వర్గ మును భూలోకమును విడిచి వెళ్ళి పాతాళ లోకమున నివసించుము" అని ఓయీ నీవీ మాటలను శీఘ్రముగా వెళ్ళి మీ రాజునకు చెప్పుమనెను.

అంతట దూత శుంభునివద్దకు వెళ్ళి నమస్కరించి రాజా! ఆమె గర్వముతో యుద్ధము చేయగోరుచున్నది. చిన్నతనములో చెలికత్తెలవద్ద యుద్ధములో నన్ను జయించినవానినే నేను వివాహము చేసికొందునని ఆమె ప్రతిజ్ఞ చేసినందున యుద్ధములో నన్ను ఓడించినవానినే పెండ్లి చేసికొందును. కనుక మీ రాజునాతో యుద్ధము చేసి నన్ను జయింపవలెను. అని చెప్పగా శుంభుడు ప్రక్కనున్న మహాబలశాలియైన సోదరునితో ఒక స్త్రీతో యుద్ధము చేయవలసి యున్నదనగా నిశుంభుడు ఓ మహావీరా! నీవు గాని నేనుగాని ఆమెతో యుద్ధమునకు వెళ్ళవద్దు. త్వరగా ధూమ్రలోచనుడను వానిని పంపుము. అతడు యుద్ధములో ఆమెను జయించి యిక్కడకు తీసుకొనివచ్చును. అని చెప్పగా తన ప్రక్కనున్న ధూమ్ర లోచనుని సైన్యముతో వెళ్ళి యుద్ధమందామెను జయించి యిక్కడకు తీసికొని రమ్మనియు ఆమెకు సహాయముగా ఎవరు వచ్చినా వారిని సంహరించి ఆమె ప్రక్కనున్న 'కాళి'ని కూడ చంపి శీఘ్రముగా యిక్కడకు రమ్ము. ఆమెను మాత్రము చంపవద్దు. ఆమెలోకోత్తర సౌందర్యవతిగదా! ఎట్లైనను ఆమెను రక్షించి యిక్కడకు తీసికొని రమ్ము అని పంపెను. అంతట ధూమ్రలోచనుడు రాజునకు నమస్కరించి యుద్ధమునకేగెను.

# ధూమ్రలోచనుని రాయ బారము

ధూమ్రలోచనుడు సైన్యసహితముగా యుద్ధమునకు వెళ్ళెను. అచట అందమైన ఉద్యానవనములోనున్న శ్రీదేవిని చూచి వినయముతో ఇట్లు పలికెను:- దేవి! శుంభుడు నీ విరహముచే మిక్కిలి పరితపించుచున్నాడు నీవద్దకు వచ్చిన దూత చెప్పిన విపరీతవచనములకు మిక్కిలి చింతతో కూడినవాడై యున్నాడు. ఒక స్త్రీ మనతో యుద్ధమునకు సిద్ధమై మనలను పురికొలుపు చున్నది. నీవు సేనతో వెళ్ళెదవా? లేక నేనే ముందువెళ్ళనా? అని ప్రశ్నింపగా ఈ పరిస్థితిలో నీవుగాని నేనుగాని యుద్ధానికి వెళ్ళుట తగదు. ధూమ్రలోచ నుని పంపినచో అతడామెను ఓడించి తీసుకొని రాగలడు తరువాత ఆమెను పెండ్లి యాడవచ్చునని నిశుంభుడనగా నన్ను పంపినాడు శుంభుడు. కనుక ఓ లతాంగీ! దేవతలను జయించిన శుంభునికి నీవు పట్టమహిషివై అనేక భోగముల ననుభవింపుము. అతడు నిన్ను మదనకదనమున జయింపగలడు. నిన్ను చూచినంతనే అతడు నీకు వశుడగును. అంతేకాక అందరకును నీవు గౌరవింప దగిన దానవగుదువు. నీ పాద తాడనము చేతను నీ ముఖమదిరాపానముచేతను మా రాజును పరమానందభరితుని చేయుము అని పలికెను.

# కాళికాదేవి ధూమ్రలోచనుని సంహరించుట

ధూమ్రలోచనుని మాటలు విని కాళికాదేవి పకపక నవ్వి గంభీరముగా నిట్లు పలికెను:- ఓరి మూర్ఖుడా! నీవు వదరుబోతువు ఆ దుర్మదాంధుడు పంపగా వచ్చితివి కనుక వట్టి మాటలు కట్టిపెట్టి నాతో యుద్ధము చేయుము. ఈ శ్రీదేవి వాడియైన బాణములతో నిన్ను శుంభ నిశుంభులను తక్కిన వీరులను హతమార్చి కాని యింటికి వెళ్ళదు. ఈ విశ్వమోహిని యెక్కడ? ఆ మందమతి శుంభు డెక్కడ? వీరికి వివాహమా! ఆడు ఏనుగు గాడిదను కామించునటరా? కామ ధేనువు కుందేలును వలచునా? ఇకనీవు శుంభనిశుంభుల వద్దకు వెళ్ళవచ్చును. నాతో యుద్ధము చేయుటయో లేక పాతాళమునకేగి నివసించుటయో చేయుడని వారితో నా మాటగా చెప్పుము. అనగా కాళిదేవి మాటలు విని ధూమ్రాక్షుడు కన్నులను ఎఱ్ఱచేసి దేవితో యిట్లనెను. ఓకుత్సిత శరీరా! నేనిప్పుడే నిన్ను నీ మదగర్విత సింహమును చంపి దేవిని మారాజువద్దకు కొనిపోదును. ఓకలహప్రియా! రసభంగమగునని యింతవరకు నిన్ను చంపకుంటిని లేనిచో ఎన్నడో నిన్ను చంపి యుండెడివాడను అని ఆవేశముగ బలికెను.

అనగా కాళిక యిట్లనెను:- ఓ మూఢమతీ! ఆత్మస్తుతినేల చేసుకొందువు? నీ శక్తికొలది బాణములను ప్రయోగింపుము. మరియు యమాలయమునకు కూడనడువుము. అని పలుకగా ధూమ్రాక్షుడు ధనుస్సు నెక్కుపెట్టి కాళిపై బాణవర్షమును కురిపించెను. అప్పుడింద్రాదులు విమానముల నుండి చూచుచు శ్రీదేవిని స్తుతించి జయజయధ్వను లొనర్చిరి. అంతట వారిరువురకును బాణ ఖడ్గశక్తి ముసలాయుధములతో భయంకరమైన యుద్ధము జరిగెను. శ్రీకాళి రాక్షసుని రథమును మోయు గాడిదలను రథమునునుగ్గు చేసి వికటాట్టహాసము చేసెను. అతడు మరియొక రథమెక్కి కోపముతో మండి పడుచు కాళీదేవిపై బాణవర్షము కురిసెను. కాళివాని బాణములను నడుమనే ఖండించి తీవ్రవేగ ముతో బాణములను ప్రయోగించెను. ఆ కాళిబాణ ప్రయోగమున రాక్షసుని యంగరక్షకులు మరణించిరి. రథము కూడ నుగ్గయ్యెను. గాడిదలు నేలగూలినవి. వెంటనే నాగబాణముతో వాని ధనుస్సును రెండు ముక్కలు చేసెను. మరియు దేవతలా నందించునట్లు విజయశంఖమును పూరించెను. అంతట ధూమ్రలోచ నుడు రథము లేనివాడై కోపించి ఇనుప పరిఘయను ఆయుధమును చేత పట్టి నేడే నిన్ను చంపెదనని కాళిని బెదిరించుచు ఆ పరిఘను దేవిపై విసిరెను. ఆమెయు హుంకారముతో వానిని భస్మమొనర్చెను. భస్మమైన రాక్షసుని చూచి సైనికులు భయపడి పారిపోయిరి. ధూమ్రలోచనుని మరణమునకు సంతోషించుచు దేవతలు పుష్పవృష్టి కురిపించిరి.

అంబిక భయంకరమైన శంఖనాదము చేసెను. ఆ శంఖధ్వని విని యుద్ధభూమి నుండి పారిపోయి వచ్చిన సైనికులను చూచి శుంభని శుంభులు ధూమ్రాక్షుడేమై నాడు? ఈ భయంకర శంఖనాదమెవరిది? అని అడుగగా ధూమ్రుడే మరణించి నాడని సైనికులు చెప్పిరి. ఈ శంఖనాదమంబికదనియు తెలిపెను/ మరియు సైనికులు మహారాజా! మనకు జయము అసంభవమని నిశ్చయముగా తెలియు చున్నది. మంత్రులతో ఆలోచింపుము. దేవతలామెకు పార్శ్వరక్షకు లుగా నున్నారు. శివకేశవులు సమయమెరిగి ఆమెకు సహాయమును చేయుదురు. ఎవరి సహాయ మక్కరలేకయే అందరను చంపగలశక్తి ఆమెకు కలదు. కనుక ఆలోచించి చేయ దగిన పనిని నిర్ణయించుము అనిపలికిరి. ఆ మాటలు విని శుంభుడు తన తమ్ముని పిలిచి ఏకాంతమున ధూమ్రలోచనుడు మరణించాడు. సేనలు భయముతో పారిపోయి వచ్చినవి. ఆమె మదగర్వముతో శంఖము పూరించినది. ఆమెతో పోరియెవడును నెగ్గలేడు. దైవగతి యిట్లున్నది. ఆయంబిక భోగింపరానిదిగా

తెలియు చున్నది. మనము పారిపోవుట తగినదా? అని యడుగగా నిశుంభుడు అన్నా మనమిప్పుడు పారిపోవుటగాని దాగికొనుట గాని తగదు. ఆమెతో మనము యుద్ధము చేయుటే మంచిది. నేను వీరసైనికులతో వెళ్ళి ఆ స్త్రీని చంపి తిరిగి వచ్చెదను. ఒకవేళ నేను మరణించినచో నీవు బాగా ఆలోచించి పని చేయుము అని పలుకగా శుంభుడు తన తమ్మునితో మరల యిట్లనెను:- చండముండు లిరువురును సైన్యముతో వెళ్ళి యుద్ధము చేసి జయించిరాగలరు. కుందేలును పట్టుటకు ఏనుగును పంపుట యుక్తము కాదని చండముండులను చూచియిట్లు పలికెను.

# కాళికదేవి చండముండుల హతమార్చుట

మరియు వికటాట్టహాసము చేయుచున్నది. శ్రీభద్రకాళి మహాభీకరముగా ఒంటెలను గుఱ్ఱములను సారధులను కూడ పండ్లతో కరకర నమలి వేయు చుండెను. చండముండ మహాసురులు తమ సైన్యము నశింపగా యెడతెగని బాణవర్షముతో దేవిని కప్పివైచిరి. మరియు చండుడు చక్ర మును దేవిపై విసిరెను. దేవి యాచక్రమును బాణముతో ముక్కలు చేసెను. అప్పుడు చండిక వాడియైన బాణములను చండునిపై ప్రయోగింపగా ఆతడు నేలపైపడి మూర్ఛిల్లెను. అంత ముండుడు దుఃఖించి కోపముతో కాళికపై బాణములు ప్రయోగించెను. ముండుడు ప్రయోగించిన బాణములను దేవి ముక్కలు చేసినది.

తరువాత అర్ధ చంద్రాకారపు బాణముతో వాడు నేలకొరగెను. అంతట రాక్షస సైన్యముతో హాహా కారములు మిన్ను ముట్టినవి. దేవతలు పరమానంద భరితులైరి. ఇట్లుండగా చండుడు మూర్ఛనుండి తెప్పరిల్లి గదను కాళి కుడి భుజముపై విసిరెను. ఆగదా పాతమును వ్యర్థముచేసి మంత్రించిన బాణపాశము తో ఆ రాక్షసుని కట్టివైచెను. తరువాత ముండుడు గూడ తెప్పరిల్లి తనయన్న బంధింపబడి నందుకు కోపించి శక్తియను ఆయుధమును ప్రయోగింప బయలుదేరెను. అప్పుడు కాళిక వానిని కూడా బంధించెను. భద్రకాళి చండముండులను కుందేలు పిల్లలనువలె పట్టుకొని పకపకనవ్వుచు జగదంబ వద్దకు వెళ్ళెను. మరియు రణయాగమునకు రాక్షస పశువు లను తెచ్చితిననెను. అప్పుడు జగన్మాత మధురవాక్కులతో వీరిని వదలక వధింపుడు. దేవతల కార్యమును త్వరగా పూర్తి చేయుమని కాళికతో పలికెను. మరియు వీరిని చంపుట హింసకాదు అని పలికి వెంటనే ఖడ్గముతో వారి తలలను ఖండించెను.

చండముండులను వధించి దేవి భద్రకాళికి చాముండయను బిరుదు నిచ్చెను. చండముండులు చావగనే సైనికులు శుంభుని వద్దకు పరుగెత్తి పోయిరి. వారందరును రాజా! మహాకాళి నేడు మమ్ము నమిలి వేయుచున్నది. కాళికాదేవి నిస్సంశయముగా మనలనందరను మట్టుపెట్టగలదు. కనుక మహారాజా! నీవు పాతాళమునకు పోయి నీ వంశమును నిలువబెట్టు కొనుము. పూర్వము నీవు పురుషుని వలన చావు లేకుండునట్లు బ్రహ్మ నుండి వరమును పొందితివి. కనుక మృత్యు వీమె రూపములో నిన్ను కబళించుటకు వచ్చినది. కనుక యుద్ధము నికనైన మానుము. ఆమెను శరణువేడి మిగిలిన వారినైన కాపాడుకొనుమని హితము చెప్పిరి. శుంభా సురుడు వారి మాటల లెక్క చేయక ఓ మూఢులారా! మీరు బ్రతుకుపై ఆశతో పారిపోయి వచ్చితిరి. మీరు పాతాళమునకు పోయెదు కానున్నదికాక మానదు. నేను నా స్వధర్మము నెరవేర్చు కొని జయమో నాశమో పొందగలను. తప్పక యుద్ధము చేసెదను. మరణమో గెలుపో యేది యైనను గ్రహించెదను. ప్రయత్నము లేక యే పనియు నెరవేరదు అని పలికి మహావీరా! రక్తబీజా! నీవు బలముకొలది యుద్ధము చేయుము. అని పలికెను!

## రక్త బీజుడు దేవితో పోరుట

అనగా రక్త బీజుడిట్లనెను:- మహారాజా! ఈ కొద్ది దానికింత చింతిప నేల? నేనామెను చంపగలను లేదా నీకు వశురాలనుగా చేయగలను. నేడు నాయుద్ధ కౌశలము చూతురుగాక. ఆమె నాముందెంత? అని పలికి తన సేనతో రక్తబీజుడు యుద్ధము చేయబోయెను. పరదేవత వచ్చుచున్న రాక్షసునిచూచి దేవతలకా నందము రాక్షసులకు భయము కలుగునట్లు శంఖము పూరించెను. అంతట రక్తబీజుడు దేవిని సమీపించి బాలా! ధూమ్రలోచనుని వలెనన్నును నీ శంఖ ధ్వనిచే భయపెట్టుచున్నావా? నేను రక్తబీజుడను నిర్భయముగ నీతో యుద్ధము చేయవచ్చితిని. నేడు నా బలమును చూడుము. నీవు ఇంతకు ముందు చూచిన వీరులవంటి వాడనుకాను. నీయిష్టము వచ్చినట్లు యుద్ధము చేయుము. కాని, ఓ సుందరీ! దేవతలందరను జయించిన శుంభునిగాని నిశుంభునిగాని వరించి సర్వసౌఖ్యముల ననుభవింపుము. అని పలుకగా జగదంబయు కాళియు తమలో తాము నవ్వుకొనిరి.

శ్రీదేవి రక్తబీజునితో మూఢాత్మా! నన్ను వివాహము చేసికొనవలె నన్నచో నన్ను మొదట జయించి తీరవలయునని శుంభ నిశుంభలకిది వరకే దూత ద్వారా

తెలిపియున్నాను. కనుక నన్ను యుద్ధములో జయించి పిమ్మట వివాహము చేసికొనుమని చెప్పుము. నీకు శక్తియున్నచో నాతో పోరుము. కానిచో నీవతనితో గూడ పాతాళమునకు పొమ్మ అని పలికెను.

అంత నా రాక్షసుడలిగి ఆమెపై బాణములు ప్రయోగించెను. అవి పాముల వలె వచ్చుచుండ దేవి వాటిని దూరము నుండియే ఖండించివైచెను. మరియు దేవి తీవ్రమగు మరియొక బాణముచే రక్తబీజుని బాధించెను. అతడు రథముపై మూర్ఛిల్లెను. సేనలో కలకలము బయలుదేరెను. సైనికులు కేకలు వేయుచు బిగ్గరగా నేడ్వసాగిరి. ఆ యేడ్పు ధ్వని శుంభుని చెవులబడెను. రాక్షససేనలను కాంభోజకాలకేయాది శూరులనందరను యుద్ధమున బయలుదేరుడని శుంభు డాజ్ఞాపించెను. వారందఱు గర్వముతో శ్రీదేవి వద్దకు వెళ్ళిరి. జగదంబ శంఖమును పూరించి నారి సారించెను. కాళిక కూడ తన పెద్దనోరుతెరచి భీకరముగా అరచెను. ఆఘోర ధ్వనులను విని సింహము కూడ భీకరముగా గర్జించెను. ఆ ధ్వనులకు చాలమంది రాక్షసులు మూర్ఛిల్లిరి. వారిలో మహాబలవంతులైన రాక్షసులు ఒక్కుమ్మడిగ దేవి పై బాణవర్షము కురిపించిరి. అప్పుడు భీకరమైన సమరము ప్రవర్తిల్లెను. దేవతలందరు తమతమ శక్తులతో యుద్ధభూమికి వచ్చిరి. వారిలో బ్రహ్మ శక్తి కమండలువుతో హంసనెక్కి బ్రహ్మాణియను పేర యుద్ధమునకు వచ్చెను. వైష్ణవశక్తి పీతాంబర శంఖాచక్రగదా పద్మముల ధరించి కాంతులచిమ్ముచు గరుడ వాహనమెక్కి వచ్చెను. శాంకరీదేవి వృషభవాహన మెక్కి త్రిశూలమును ధరించి యుండెను.

ఆమె నొసట చంద్రరేఖ వెలుగుచుండెను. శ్రీ షష్ఠీదేవి నెమలివాహన మెక్కి శక్తియనే ఆయుధము ధరించి కౌమారి రూపమున వచ్చెను. ఇంద్రాణీదేవి ఐరావతమునెక్కి వజ్రాయుధమును పట్టుకొని యుద్ధము చేయవచ్చెను. వారాహీదేవి ప్రేతాసనయై వరాహరూపముతో వచ్చెను. నారసింహీదేవి నరసింహరూపముతో వచ్చినది. యామ్యాదేవి మహిష వాహనయై భయంకరముగ నవ్వుచు యమ రూపముతో యుద్ధరంగము చేరెను. అట్లే వారుణీఖేచర శక్తులు కూడా యుద్ధము చేయసిద్ధమై వచ్చినవి. వచ్చిన యాశక్తులను చూచి దేవి సంతోషము నొందినది. ఆశక్తులన్నిటితో కూడి శంకరుడు యుద్ధరంగమునకు వచ్చిచండికతో ఇట్లనెను-

దేవతల పనిపూర్తియగుటకు త్వరగా రాక్షసులను చంపుడు. శుంభని శుంభులను ఇతర రాక్షసులను సంహరించిలోకమునకు నిర్భయము కలిగించి ఓ శక్తు

లారా! మీమీ నివాసములకు తిరిగిరండు. దేవతలు యజ్ఞభాగములను స్వీకరింతురుగాక బ్రాహ్మణులు యజ్ఞములను చేయుచుందురుగాక సమస్త స్థావర జంగమ ప్రాణులను సంతోషించుగాక ఉత్పాతములు ఈతి బాధలు శాంతించుగాక. మేఘములు తగిన సమయమున వర్షించుగాక పంట పొలములు పచ్చని పైరుతో కనువిందు చేయుగాక. అని పలికెను. అంతట చండికాదేవి శరీరము నుండి ఒక మహాద్భుత శక్తి వెలువడెను. ఆమె భయంకరముగ ధ్వని చేయుచు ఘోరరూపముతో నుండెను. ఆమె మందహాసము చేయుచు నిట్లు శివునితో పలికెను:-

ఓ దేవదేవా! నీవు రాక్షసరాజువద్దకు దూతగా వెళ్ళుము. మదాంధులగు శుంభ నిశుంభులతో నామాట గానిట్లు చెప్పుము. మీరు స్వర్గము విడిచి పాతాళమునకు వెళ్ళుడు. ఇంద్రు డింద్రాసనము నధిష్ఠించి దేవతలతో స్వర్గములో మరల సుఖముగా నుండవలెను. యజ్ఞభాగములు మరల వారే యనుభవింతురు గాక. మీరందరు జీవింపదలచి నచో రాక్షసులుండు పాతాళమునకు పొండు. లేక మీ బలముతో కలిసి పోరి చావదలచినచో రండు. నా పరివారమైన నక్కలు మీ మాంసముతో తృప్తిచెందు గాక. అని పలుకగా శూలపాణి త్వరగా కొలువున్న శుంభుని చేరి రాజా! నేను జగదంబ దూతను నీ మేలుకోరి యిక్కడకు వచ్చితిని. నీవు స్వర్గమును విడిచి త్వరగా వెళ్ళవలెను. ప్రహ్లాదుడు నివసించు పాతాళమునకు మీరందరు వెళ్ళండి. లేక చావదలచినచో యుద్ధమునకు సిద్ధపడండి మీ యందరినీ యుద్ధములో చంపివేయగలము అని పలికెను.

## శ్రీదేవికి దేవతలు తోడ్పడుట

ఈ విధముగా శివుని దూతగా పంపుటచేత దేవికి "శివదూతి" యను పేరువచ్చినది. శివుని మాటలువిన్న రాక్షసులు కవచములు ధరించి యుద్ధమునకు సిద్ధపడిరి. యుద్ధరంగమును చేరినారు. ఆ కర్ణాంతము లాగిన బాణములను చండిక పై ప్రయోగించిరి. అప్పుడు భద్రకాళీశక్తి కొందరిని శూలముతో పొడిచి, మరి కొందరిని గదాశక్తులతో మోది, కొందిరిని నోటితో కరకరనములుచుండెను. బ్రహ్మాణీదేవి యుద్ధములో రాక్షసవీరులపై తన కమండలు జలము మంత్రించి చల్లుచు వారి ప్రాణములను హరించెను. మహేశ్వరీదేవి వృషభము నెక్కి రాక్షసులను తన శూలముతో పొడిచి చంపుచుండెను. శ్రీవైష్ణవీదేవి తనగదా చక్రములతో కొట్టి రాక్షసుల కంఠములు ఛేదించుచుండెను. ఐరావతము తన తొండముతో

రాక్షసవీరులను బాధించుచుండెను. ఇంద్రాణీదేవి వజ్రాయుధముతో రాక్షసులను నేలకూల్చుచుండెను. వారాహీదేవి తనముట్టెతోను కోరలతోను పెక్కుమంది రాక్షసులను పడగొట్టి చంపెను. శ్రీనారసింహీదేవి తనవాడి గోళ్ళతో రాక్షసులను చీల్చి తినుచుండెను. శివదూతి అట్టహాసముతో నేలకూల నేసిన రాక్షసుల నెల్ల చాముండాకాళికలు తినుచుండిరి. కౌమారీదేవి చెవుల వరకు నారినిలాగి విసిరిన బాణములు రాక్షసులను చీకాకు పరచుచుండెను. శ్రీవారుణీ దేవి రాక్షసులను బంధించి వారిని మరణింప చేయుచుండెను. ఇట్లు మాతృకాగణము వీరవిహారము చేయగా రాక్షస సైనికులు పరాజయము నొందిపారి పోయిరి. రాక్షససైన్యములో ఏడ్పులు చెలరేగెను. దేవతలు మాతృకాగణములపై పూలవాన గురిపించిరి దానవులు పలాయనము చిత్తగించిరి. అంతట రక్తబీజుడు దేవతల ఉత్సాహమును చూచి సహింపలేక యుద్ధమునకు దిగెను. అతడా యుధమును ధరించి రథమెక్కి నారి మ్రోగించుచు శ్రీదేవివద్దకు వచ్చెను.

# రక్తబీజుని మరణము

వ్యాసుడు జనమేజయునకు రక్తబీజుని వృత్తాంతమిట్లు చెప్పెను:- రాజా! పూర్వము పరమశివుడు రక్తబీజునకద్భుతమైన వరమునొసగెను. అదియేమనగా రక్తబీజుని శరీరము నుండి యెన్ని రక్తబిందువులు నేలబడునో అంతమంది అతని వంటి పరాక్రమము గల వీరులు వెంటనే జన్మించెదరు. అతడా వర గర్వముతో కాళికాదేవిని సంహరించుటకు యుద్ధభూమికి వచ్చెను. వాడు గరుడవాహన మందు వెలుగొందు శ్రీవైష్ణవీదేవిని చూచి ఆమెపై 'శక్తి' అను ఆయుధమును ప్రయోగించెను. ఆమె తన గదతోవాని శక్తిని అడ్డుకొని రక్తబీజుని పై చక్రమును విసిరెను. అతని శరీరము నుండి రక్తము ప్రవహించి కాలువలయ్యెను. వేలకొలది వానివంటి వారు వెంటనే ప్రత్యక్షమైరి. బ్రహ్మాణి బ్రహ్మ దండముతో వారిని బాధించుచుండెను. శ్రీనారసింహి తన గోళ్ళతో వానిని చీల్చుచుండి వారాహి తనముట్టెతో వానిని పొడుచుచుండెను. రక్తబీజుని శస్త్రములను బాణములతో ఖండించి దేవి అనేక బాణములలతో నాతని బాధించెను. అతని శరీరము నుండి రక్తము స్రవింపగా మరల అతని వంటి శూరులు వేలకొలది పుట్టుకొని వచ్చిరి.

అప్పుడు అంబిక కాళితో నీవు నోటిని విశాలము చేసి రక్తబీజుని శరీరము నుండి పడిన రక్తమును వెంటవెంటనే త్రాగి వేయుము. రాక్షసులను యిచ్చవచ్చి నట్లు తినివేయుము. గదాఖడ్గ ముసలములతో నేను రాక్షసులను చంపెదను.

భూమిపై రక్తబిందువు పడకుండా రక్తమునంతను త్రాగుము. అప్పుడు మరల రాక్షసులు పుట్టరు. అని చెప్పగా కాళి అట్లే చేసెను.

దేవికృత్రిమ రక్తబీజాసురులను చంపి చివరకు స్వాభావిక రక్తబీజుని కూడ దేవి ఖడ్గముతో నరికి సంహరించెను. రక్తబీజుడు చనిపోగా ఇతర రాక్షసులు భయముతో హాహాకారములు చేయుచు రాజునకు రక్తబీజుని మరణమును వివరముగా చెప్పిరి. దేవి ఒక్కతెయే అందరను సంహరించుచున్నది. ఎవరి సహాయమును కోరుటలేదు. ఆమె వాహనమైన సింహము కూడా రాక్షసులను నమిలి వేయుచున్నది. చాముండ రాక్షసుల మాంసమును తినుచున్నది. మహా రాజా! మనమందరము పాతాళమునకు వెళ్ళుట మంచిది. లేదా ఆమెకు సేవకుల మైనా కావలయును. అంబికతో యుద్ధము మాత్రము చేయవద్దు. ఆమె సామాన్య స్త్రీకాదు. దేవతల పనిని సాధించుటకు మహామాయ యిట్లు వచ్చినది. రాక్షసుల నందరను మట్టుపెట్టుచున్నది. ఈ మాటలు విని శుంభుడు కోపముతో పెదవులదర దేవతల నందరను జయించిన నేనొక స్త్రీకి భయపడి పాతాళమున కెట్లుపోదును? రక్తబీజుడు మొదలగు తోటి రాక్షసులు మరణించగా నాప్రాణము లను కాపాడుకొనుటకు నేనెట్లు పోగలను?

ఓ నిశుంభా! రథమునెక్కి నేను యుద్ధభూమికి వెళ్ళి యామెను చంపి వచ్చెదను. లేదా యికరానేరాను. నీవు సేనతో నా ప్రక్కన నిలువుము. ఆమెను నీ బాణములతో యముని వద్దకు పంపుము అని చెప్పగా నిశుంభుడు నేను దుర్మార్గురాలగు కాళికను చంపివైచెదను. మరియు త్వరగా అంబికనిక్కడకు తీసుకువత్తును రాజా! చింతింపకుము. ఆ బాలిక యెక్కడ? సమస్తలోకమును వశమొనర్చుకొన్న నా పరాక్రమమెక్కడ? నీవు నేనుండగా యుద్ధమునకు వెళ్ళవ వసరములేదు. తప్పక నేనామెను తీసికొని వచ్చెదను. నీవు విచారము మాని భోగములను యథేచ్ఛగా న[illegible]భవింపుము. అని సోదరునితో చెప్పి నిశుంభుడు రథమెక్కి సైన్యముతో కూడి [illegible]వాడై ఆయుధములతో త్వరగా యుద్ధభూమికి వెళ్ళెను.

# నిశుంభుడు మరణించుట

నిశుంభుడు విజయమో మరణమో నిశ్చయించుకొనదలచి దేవివద్దకు వచ్చెను. శుంభుడు కూడ సైన్యసమేతుడై తమ్మునికి సహాయముగా వెళ్ళి వారిద్దరి యుద్ధమును చూచుచుండెను. దేవగణములు కూడ మేఘముల చాటున నిలిచి

వారి యుద్ధమును చూడవచ్చిరి. నిశుంభుడు జగన్మాతను బెదిరించుచు ఆమెపై బాణవర్షము కురిపించెను. అతని చూచి చండికాదేవి పలుమార్లు పకపకనవ్వెను. దేవి కాళికతో నిట్లు పలికెను:-

ఓ కాళీ! వీరు చావుకోరుకొని నాయెదుటకు వచ్చి నిలిచిరి. రక్తబీజాది రాక్షసుల సంహారము చూచియు నామాయచేత జయాశను విడువకున్నారు చూడుము. వీరినిప్పుడే అంతమొందించెదను అని పలుకుచు తన ముందున్న నిశుంభుని బాణప్రయోగముచే నొప్పించెను. అతడు తన వాడి బాణములతో ఆమె బాణములను ఖండించివైచెను. ఇట్లు వారిరిరువురకును ఘోరముగ పోరు సాగెను అంతట దేవి సింహము జూలు విదలించి రాక్షససేనలో దుమికెను. మరియు తనముందున్న శత్రు సైనికులను మదపుటే నుగులను చీల్చినట్లు చీల్చి చెందాడి తినుచుండెను. అదిచూచిన శుంభుడు ధనుస్సుతో విజృంభించెను. అంత ఇతర రాక్షసులు కళ్ళెఱ్ఱ చేసి పండ్లు పటపట కొరుకుచు దేవిని చంపబయలు దేరిరి. అప్పుడు శుంభుడు కూడ కాళిని చంపి దేవిని పట్టుకొన వలెనని కోపముతో అక్కడకు వచ్చెను. అతడు దేవిని చూచి పెండ్లి మీద జయము మీదను ఆశ వదలుకొని చావునకు నిశ్చయించుకొని ధనుస్సును పట్టుకొని నిలుచుండెను. వానిని చూచి శ్రీదేవి రాక్షసులందరు వినునట్లు చిరునవ్వుతో యిట్లు పలికెను.

"ఓ మూఢులారా! మీకు జీవితాశయున్నచో పాతాళమునకు పొండు లేనిచో నాబాణములచే చచ్చి స్వర్గసుఖమను భవింపుడు. లేదా మీకు నచ్చినచోటికి వెళ్లుడు" అని ఆ మాటలు విని నిశుంభుడు ఖడ్గమును పట్టుకొని మొదట సింహము మీద, తరువాత, దేవిమీదను విసిరెను. శ్రీదేవి తనగదతో కత్తి దెబ్బను తప్పుకొని గొడ్డలితో రాక్షసుని బాహుమూలమున కొట్టెను. ఆ దెబ్బను సహించి దేవిపై మరల కత్తిని విసిరెను. తరువాత ఆమె తప్పుకొని ఘంటానాదము చేసి, నిశుంభుని చంపదలచి మాటిమాటికి మద్యపానము చేసెను.

నిశుంభుడప్పుడు రోషముతో గదపట్టుకొని చండికపై ఉరికెను. మరియు సింహము తలపై గదతో మోది వికవిక నవ్వి దేవిని గూడ గదతో కొట్టెను. అంతట చండికాదేవి వాడియైన కత్తితో నేర్పుగా నిశుంభుని తల నరికెను. అతడు మరణించి నేలకూలెను. సైనికులు దుఃఖించుచు శుంభుని రాజమందిరము చేరిరి. అంత శుంభుడు నిశుంభుడేమాయెనని ప్రశ్నించెను. వారు రాజా! నీ సోదరుడు యుద్ధమున మరణించి నేలపై కూలినాడు. అతని అనుచరులను దేవి సంహ

రించినది. మిగిలిన మేము నీకీ విషయమును తెలుప వచ్చితిమని మన కనుకూల మైన సమయమిది కాదు. ఈ దేవి కేవలము స్త్రీగాదు. రాక్షసుల నశింప జేయవచ్చిన మహాశక్తి. ఈమె అనేకరూపములను ధరింపగలదు. సర్వాయధములను ధరించి యున్నది. కనుక త్వరగా పాతాళమునకుపోయి ప్రాణములను దక్కించుకొనుము. అని పలుకగా శుంభుడు నేను జీవించినా మరణించినా చింతలేదు. దైవము బలవత్తరమైనది. నావారందరు చనిపోగా నేను కీర్తిని విడిచి జీవితాశతో యుద్ధ మును విరమింతునా? పుట్టిన వానికి చావు చచ్చిన వానికి పుట్టుక తప్పదు. స్థిరముగాని శరీరముతో స్థిరమైన కీర్తిని పొందవలయును. కనుక రథమును సిద్ధము చేయుడు. త్వరగా యుద్ధమునకు పోవుదును. ఈనాడే జయమో మరణమో దైవము తలచినట్లు జరుగగలదు. అని సైనికులతో అంబిక యున్న హిమాల యము వద్దకు వెళ్ళెను. అచట కొండపై సింహవాహనముపై త్రైలోక్యమోహినియగు స్త్రీని చూచెను.

ఆమెను దేవతలు గంధర్వులు కిన్నరులు మొదలగువారు స్తోత్రము చేయు చున్నారు. కల్పవృక్ష పుష్పములతో పూజించుచుండిరి. ఆమెశంఖ మును ఘంటను మనోహరముగా మ్రోగించుచుండెను. ఆమెను చూచి శుంభుడు కామమోహితు డయ్యెను. ఈమె సుకుమారి ప్రౌఢయౌవనవతి యయ్యును కామభావము లేకుండుట ఆశ్చర్యకరముగానున్నది. మహాబలశాలులైన రాక్షసుల నందరను శ్రమలేకుండా సంహరించుచున్నది. ఈమె సామదానములకు లొంగదు. భేదము నకు పనికిరాదు యుద్ధమే శరణ్యము. పారిపోవుట తగదు. చావో గెలుపో విధివిధాన మెట్లున్న అట్లుకా గలదు. అని ఆలోచించి యుద్ధమునకు సిద్ధమయ్యెను. తన యెదుటనున్న దేవితో ఇట్లు పలికెను?

ఓ శ్రీదేవి! స్త్రీ ధర్మము యుద్ధము చేయుట కాదు. స్త్రీకి సిగ్గుపెట్టని యాభర ణము. నేను నీవంటి సుందరాంగిపై చేయిచేసికొన జాలకున్నాను. నీవు పరుష వచనములు పలికినచో నేను నీతో యుద్ధము చేయుదును. నీవు రతిదేవివలె ఉన్నావుగాని నెట్లు చంపగలను"? అని పలికెను

## శుంభాసురుని మరణము

అని అప్పుడు దేవి శుంభుని కామార్తునిగా తెలిసికొని చిరునవ్వుతో ఓరీ మందమతీ! కామ పీడితుడవై యేల దుఃఖింతువు? నాతో యుద్ధము చేయుట కుత్సాహపడనిచో కాళికతోగాని చండికతోగాని యుద్ధమును చేయుము. వారు

నీకు తగినవారే. వారితో నేనీవు యుద్ధము చేయుము. నేను నీతో యుద్ధము చేయను. అని పలికి కాళికతో ఇట్లనెను:- కాళికా! నీవే యితనిని సంహరింపుము. అనినంతనే ఆమె వెంటనే గదచేత ధరించి యుద్ధమునకు సిద్ధమయ్యెను. అప్పుడు కాళీ శుంభులకు భీకరపోరాటము జరిగెను. దేవతలందరు చూచుచుండ శుంభుడు గదను కాళిపై విసిరెను. కాళియు గదతో రాక్షసుని చావమోదెను. మరియు గదతో అతని రథమును విరుగగొట్టెను. మరియు సారిథిని చంపెను. అంత నాతడు కాళిపై గద విసిరి నవ్వెను. కాళిక అతని గదను తప్పించుకొని ఖడ్గముతో ఆతని బాహువును నరికెను. అతడు నెత్తురు కారుచున్నను గదతో కాళికను మోదెను. కాళీదేవి అతని రెండవ చేతిని కూడ కత్తితో నరికివైచెను. వాడామెను తన్నబోయెను. ఆమె వెంటనే వాని కాళ్ళను రెంటిని ఖండించెను. పిదప వాని తలగూడ నరికి వైచెను. చచ్చి నేలపైబడిన ఆ రాక్షసుని చూచి ఇంద్రాదులు గంతులు వేసిరి.

అప్పుడు వాయువు చల్లగా వీచెను. దిక్కులు నిర్మలములాయెను. అగ్ని ప్రదక్షిణ జ్వాలలతో తేజరిల్లెను. తక్కిన రాక్షసులు జగనాత్మకుకై మోడ్పు లందించిరి. ఈ శుంభాదుల వధను దేవతా సంరక్షణమును చదివినవారు పరమ భక్తులగుదురు. దీనిని విన్నవారు పరమభాగవతులు కాగలరు. శ్రీదేవీ చరిత్రవలన సంతానహీనులకు సంతానము ధనహీనులకు ధనము కలుగును. రోగులా రోగ్యమును పొందెదరు. మహాకాళీశక్తి శుభపవిత్ర చరిత్ర విన్నను చదివినను శత్రుభయము మృత్యు భయము తొలగిపోవును. మోక్షమును కూడ పొందగలరు.

# సురథోపాఖ్యానము

జనమేజయుడు పూర్వము దేవినారాధించి యెవడు గొప్పవులము పొందెను? ఆ తల్లి యెవని యెడల సుప్రసన్నయయ్యెను? నాకు తెలుపుమనగా వ్యాసుడిట్లు చెప్పెను. పూర్వము స్వారోచిష మన్వంతరము నందొక రాజు కలడు. అతని పేరు సురథుడు. అతడు ప్రజాపాలనతత్పరుడు మహోదారుడు. ఏక పత్నీరతుడు గురభక్తికి పరాయణుడు. పర్వతవాసులగు మ్లేచ్ఛులు ఆ రాజుతో పగబూని చతు రంగబలముతో సురథుని రాజ్యము నపహరింపతలపడిరి. సురథుడు తన సేన లతో వైరుల నెదిరించెను. దారుణమగు రణము జరిగెను. మ్లేచ్ఛులబలము కొంచమేయైనను దైవమనుకూలింపనందున రాజు ఓడియెను.

అతడు దుర్గముచే రక్షింపబడిన తన పట్టణము చేరెను. తన మంత్రులు తనను విడిచి శత్రుపక్షములో చేరుటచే తానేమి చేయవలెనని విచారించెను.

పట్టణము దుర్గరక్షితమగుటచే శత్రువులు అందు ప్రవేశింపలేరు. పాపాత్ములైన నా మంత్రులు నన్ను శత్రువులకు పట్టించిననేమి చేయవలెను? లోభులెంతటి పనినైన చేయుదురు. అని విచారించి గుఱ్ఱము నెక్కి ఒంటరిగా అరణ్యములో ప్రవేశించెను. అక్కడకు మూడు యోజనములు దూరమున నొక మహర్షి యాశ్రమము కలదు. ఆ యాశ్రమమునకేగి అచటి వాతావరణమునకు పరమానంద భరితుడయ్యెను. తన గుఱ్ఱము నొక చెట్టునకు కట్టి సవినయముగ ముని వద్దకేగి యాతని దర్శించెను. ముని యాతని నాదరించి నీరాకకు కారణమేమి? నీవెవ్వడవు? అని ప్రశ్నింపగా నేనొకరాజును - నా పేరు సురథుడు. నేను శత్రువులకు ఓడిపోయి వచ్చితిని. నిన్ను శరణు జొచ్చితిననెను. అంతట ముని నీవిచట నిర్భయముగా నుండుము. ఇచట దొరికిన యాహారముతో కాలము గడుపుము. నీ శత్రువులిక్కడకురాజాలరు. అనగా రాజు నిశ్చింతగా నచట నివసించుచుండెను.

ఒకనాడు చెట్టు క్రింద కూర్చొని తన రాజ్యము గూర్చి విచారించుచుండగా ఒక కోమటి యచటికి వచ్చెను. అతనిని రాజు నీవేల యిక్కడకు వచ్చితివని ప్రశ్నింపగా నాతడు ధనాశాపరులైన నా భార్యాపుత్రులు ఇంటి నుండి నన్ను వెడలగొట్టిరని చెప్పెను. రాజు వైశ్యుడు ఇరువురును ముని వద్దకు వెళ్ళి తమ విచారమును వెల్లడించి దుఃఖశాంతికి ఉపాయము తెలుపుమని ప్రార్థించిరి.

## మహా మాయకు దేవతలు సైతము మోహితులగుట

వ్యాసుడు జనమేజయునకు చెప్పుచున్నాడు. రాజా పూర్వము విష్ణువు బ్రహ్మ విద్యాప్రాప్తికై పదివేల సంవత్సరములు తపస్సు చేసెను. అట్లే అజ్ఞానము తొలగుటకై బ్రహ్మకూడ తపస్సు చేసెను. ఒకనాడు విష్ణువు బ్రహ్మయు ఒకచోట కలుసుకొనిరి. వారి రువురును పరస్పరము ప్రశ్నించుకొనుటలో నేను సృష్టికర్తనని బ్రహ్మ నేను సృష్టికర్తనని విష్ణువు వాదించుకొనుచుండగా వారిరువురి నడుమ తెల్లని పొడవు లావుగల అద్భుతమైన లింగముద్భవించెను. మరియు ఆకాశవాణి యిట్లు విని పించెను.

'ఓ మహానుభావులారా! మీరు వివాదమునకు దిగవద్దు. ఈ లింగము యొక్క చివరనుగాని మొదలునుగాని యెవరు చూచి వత్తురో వారు గొప్పవారని' ఆకాశవాణి పలికెను. ఆ మాటవిని బ్రహ్మ చివరను విష్ణువు మొదలును చూచి వచ్చుటకు బయలుదేరిరి. విష్ణు చాలశ్రమపడినను మొదలు చూడలేక వెనుకటి చోటికి వచ్చెను. బ్రహ్మ చివర చూడలేక శివుని శిరస్సు నుండి పడిన మొగలి

పువ్వును చేత పట్టుకొని సంతోషముతో తిరిగి వచ్చి విష్ణువునకా మొగలిపువ్వును చూపించి శివుని తలను జూచిన గుర్తుగా శివుని తలనున్న మొగలిపువ్వును తెచ్చితిని. నేను చివర చూచినట్లిది యేగుర్తని బ్రహ్మ పలికెను. సాక్ష్యమున్ననే గాని నేనంగీకరింపనని విష్ణువనగా ఈ మొగలిపువ్వే నీకు సాక్ష్యము చెప్పునని బ్రహ్మ పలికెను. ఆ పువ్వు బ్రహ్మ శివుని తలను చూచిన మాటనిజమే అని పలికెను.

శివుడు నీమాట నిజమనినచో నేను నమ్మెదనని విష్ణువు పలుకగా శివుడు కోపించి నాశిరస్సు నుండి జారిపడుచుండగా మధ్యలో బ్రహ్మకు దొరికినదికాని యితడు లింగము తలను చూడలేదు. నీవు అసత్యము చెప్పితివి కనుక పూజకు నీవు పనికిరావు నిన్ను విడిచిపెట్టుచున్నానని శివుడు పలికెను. అప్పటి నుండి మొగలి పువ్వు శివపూజకు పనికిరాదయ్యెను. ఇట్లు మహామాయజ్ఞానులను కూడ మోహ భ్రాంతులకు వశులనొనర్చుచున్నది. ఇక సామాన్యుల మాట చెప్పిడిదేమి? అని పలికెను."

# శ్రీమద్దేవీ నవరాత్రవ్రత విధానము

జనమేజయుడు శ్రీదేవి యొక్క పూజా విధానము ఆరాధన మంత్రజప హోమముల విధానము తెలుపుమని కోరగా వ్యాసుడిట్లు చెప్పెను. మొదట శుచిగ స్నానము చేయవలె. తెల్లని వస్త్రములు ధరింపవలెను. అలికినచోట ఉత్తమాసనముపై కూర్చొని ఆచమనములు చేయవలెను. పూజా ద్రవ్యములు సమకూర్చుకొనవలెను. ప్రాణాయామ మొనర్చి మాతృకాన్యాసము చేయవలె.

పిమ్మట సంకల్పము చేసి ప్రాణప్రతిష్ఠ జరుపవలెను. తరువాత యధావిధిగ న్యాసములు చేయవలెను. ఒక రాగిరేకుపై మంచి గంధముతో ఆరుకోణముల యంత్రము వ్రాయవలెను. ఇట్లు వేదోక్తముగ శ్రీదేవిని పూజింపవలెను. నవాక్షర మంత్రమును నిరంతరము జపించవలయును. దశాంశహోమము దానిలో దశాంశము తర్పణము, దానిలో దశాంశము బ్రాహ్మణ భోజనము నిష్ఠతో జరుపవలెను. నిత్యము శ్రీదేవీ చరిత్రత్రయము పఠించి దేవీ విసర్జనము చేయవలెను.

ఈ విధముగా దేవీ నవరాత్రములందు దేవీవ్రతమును ఆచరింపవలెను. శుభమును కోరువాడు చైత్రాశ్వయుజ మాసములలోని నవరాత్రములందు విధిగా ఉపవాసము చేయవలెను. పంచదార, నేయి, తేనె కలిపిన పాయసమును దేవీ మంత్రము నుచ్చరించుచు హోమము చేయవలెను. అష్టమీ, నవమీ, చతుర్దశుల్ల యందు బ్రాహ్మణ సంతర్పణము చేయవలెను. ఈ విధానముతో శ్రీదేవీ

వ్రతమాచరించి నచో పేదవాడు ధనికుడగును. రోగిస్వస్థుడగును. అ పుత్రుడు సంతానవంతుడగును. ఇక నవరాత్రి విధానము వినుము. మొదట మండలా కారముగ శుద్ధి చేసినచోట పూజా స్థానమేర్పరచుకొనవలెను- కలశస్థాపనము చేయవలెను - దానిపై దేవీ యంత్రముంచవలెను- కలశము క్రింద బియ్యము పోయవలెను- శ్రీదేవిని పూలమాలలతో అలంకరింపవలెను. ధూపదీపములు సమర్పింపవలెను. త్రికాలములందును పూజ చేయవలెను. స్తోత్ర పాఠ గీతవాద్యా దులతో దేవిని సేవింపవలెను. ఒక కన్యను యధావిధిగ పూజింపవలెను. చందన వస్త్రభూషణ భోజనములతో ఆమెను తృప్తిపరచవలెను. అష్టమినాడుకాని, నవమినాడు కాని యధావిధిగ హోమ మొనర్చి బ్రాహ్మణ సంతర్పణమొనర్పవలెను.

## శ్రీదేవి రాజ వైశ్యులకు వరము లిచ్చుట

సురధుడును రాజు వైశ్యుడును మునివలన దేవి యొక్క ప్రభావమును విని భక్తితో కూడిన మనస్సు కలవారై శాంతిని పొందిరి. వారు మునికి నమస్కరించి మహాత్మా! మా పూర్వ పుణ్యమువలన ఈ యాశ్రమమునకు చేరగలిగితిమి. నీ దర్శనభాగ్యముచే మా దుఃఖము పటాపంచలైనది. మేము ధన్యులము- కృతార్థులము - పవిత్రులమునైతిమి. మాకు మంత్రోపదేశముమొనర్పుము. మేమిపుడు తీవ్రమగు తపస్సు చేయుదుము. భగవతినికొల్చి ఆమె దర్శనభాగ్యము నొందెదము. అని పలుకగా సుమేధోముని ప్రీతుడై వారికి మంత్రోపదేశము చేసెను. వారొక నదీతీరమున జపధ్యాన తత్పరులై శాంతచిత్తులై శ్రీదేవి చరిత్ర చదువుచు తీవ్రమైన తపస్సు చేయుగా రెండేండ్లు గడచిన పిమ్మట స్వప్నములో దేవిని దర్శించిరి. శ్రీదేవి రాజును నీ కోరిక ఏమియని ప్రశ్నించెను. అట్లే కోమటిని కూడ వరము కోరుకొనుమనెను. రాజు నాశత్రువులు నశించునట్లు నా రాజ్యము నాకు లభించునట్లు వరమిమ్మనెను. దేవి యట్లే యగును. నీవింటికి వెళ్ళుమనెను. పిమ్మట కోమటి నాకు సంసారబంధము తొలగి బ్రహ్మజ్ఞానము పొందునట్లు వరమిమ్మనెను. దేవి నీకు తప్పక బ్రహ్మజ్ఞానము కలుగుననెను. ఇట్లు వారిరువరకు వరములిచ్చి దేవి యంతర్ధానమొందెను. అంతట రాజు మునికి నమస్కరించి ఆయన యనుమతితో గుఱ్ఱమెక్కి బయలుదేరెను. అప్పుడే యాతని మంత్రులు ప్రజలు వచ్చి నీ రాజ్యము తిరుగుబాటు చేయువార్వెరును లేరు. నీ రాజ్యమును నీవు పాలింపుము అని పలికిరి. రాజు తన పట్టణమునకు వెళ్ళి చక్కగా రాజ్యపాలన మొనర్చు నానందించెను. కోమటి జ్ఞానమును పొంది ముక్తసంగుడాయెను. అని సూతుడు శౌనకాది మునులకు చెప్పినని వ్యాసుడు జనమేజయునకు తెలిపెను.

# షష్ఠ స్కంధము

## త్రిశిరసుని తపశ్చరణము

సూతుడు ఇంద్ర వృత్రాసురులకు వైరకారణమును తెలుపుదునని యిట్లు చెప్పనారంభించెను. త్వష్ట ప్రజాపతి మహాతపస్వి సురశ్రేష్ఠుడు దేవకార్య నిర్వాహకుడు అతడు నేర్పరియైన అమరశిల్పి. ఆతడింద్రునిపై గల పగవలన త్రిశిరసుడు విశ్వరూపుడును పేర్లు కుమారులను కనెను. త్రిశిరసుడు తన మూడు ముఖములలో నొకముఖముతో వేద పఠనము, వేరొక ముఖముతో సురాపానము, మరొక ముఖముతో దిక్కులతో పరికించుటను చేయుచుండెను. అతడు భోగములు వదలి తీవ్రమైన తపస్సు చేయసాగెను. ఇంద్రుడతని ఘోరతపమును చూచి తన పదవిని కోరునేమో యని దుఃఖింతుడయ్యెను. మరియు నీ త్రిశిరసుడు పెరిగి పెరిగి నన్ను చంపవచ్చునని యాతని తపస్సునకు భంగము కలిగింప ప్రయత్నించెను. అతనిని కామమోహితుని చేయుటకు ఊర్వశి, రంభ, ఘృతాచి, తిలోత్తమలను పిలిచి నా శత్రువు ఇంద్ర పదవిని కోరి తపస్సు చేయుచున్నాడు. మీరతని వద్దకు వెళ్ళి తపోభంగమొనర్పవలెనని యాదేశించెను.

అంతట నాదేవ వేశ్యలు త్రిశిరుని వద్దకు వెళ్ళి తమ నృత్యగీత విలాపాదులతో నాతని నాకర్షింపయత్నిం చిరి. కాని యాతడు కన్నెత్తి చూడలేదు. కొన్ని దినములు ప్రయత్నించి తమ ప్రయత్నము నెరవేరక తిరిగి స్వర్గమునక్కు పోయిరి. వారు చేతులు జోడించి మహారాజా! మాశక్తి కొలది ప్రయత్నించితిమి కాని యాతవిని చలింప చేయలేక పోతిమి. అతడు శపించకుండుట మా యదృష్టమని విన్నవించిరి. ఇంద్రుడు వారిని పంపి త్రిశిరసుని చంపుటకు ఉపాయము ఆలోచించెను. ఇంద్రుడు ఐరా వతము నెక్కి త్రిశిరోముని వద్దకు వచ్చెను. ముని ధ్యాననిమగ్నుడై యుండెను.

ఇంద్రుడు తన వజ్రాయుధమును వానిపై ప్రయోగించెను. ముని క్రిందపడి మరణించెను. ఇంద్రుడు మునిని చంపి స్వర్గమునకు వెళ్ళెను. చనిపోయినను తేజశ్శాలిగా కనబడుచున్న మునిని చూచి యింద్రుడు వడ్రంగిని పిలిచి ఆ ముని తల తెగగొట్టుమని పలికెను. అతడందులకంగీకరిపలేదు. అంతట నీకు యజ్ఞ భాగము నిచ్చెదనని యాశ చూపినందున వడ్రంగి ఆ ముని మూడు తలలను నరికివైచెను. వడ్రంగి యజ్ఞ భాగము నందుకొనెను.

# వృత్రాసుర జననము

విశ్వకర్మ ధార్మికుడై తన పుత్రుని చంపినందుకు ఇంద్రుని పై కోపించి ఇంద్రుని చంపదగిన మరియొక పుత్రుని పొందగలనని త్వష్టమహా క్రోధముతో అధర్వవేద మంత్రములచే పుత్రప్రాప్తికై హోమము చేసెను. ఎనిమిదిరాత్రులు హోమము చేయగా అగ్నిజ్వాల నుండి అగ్నివంటి పురుషుడొకడు పుట్టెను. కాంతుల వెదజల్లు నా కుమారుని చూచి ఓ యింద్రశత్రూ నా తపోబలముచే వర్ధిల్లుము. అని త్వష్ట కోపముతో పలుకగనే ఆ మునిబాలుడు ఎంతో ఎత్తు పెరిగెను. పర్వతా కారమంతగా పెరిగిన ఆ కుమారుడు తండ్రిని చూచి నేనేమి చేయవలెను. నాకు పేరు పెట్టుము. నీవెందుకు దుఃఖించుచుంటివో తెలిపి చేయవలసిన పనిని తెలుపు మనెను. అంతట త్వష్ట నీకు వృత్రుడని పేరు పెట్టుచున్నాను. నీసోదరుడు త్రిశిర సుడు గొప్ప తపస్వి. యింద్రుడతనిని సంహరించెను. నీవు యింద్రుని సంహా రింపవలెను. అని పలికి యుద్ధమునకు కావలసిన సర్వసాధనములను సిద్ధము చేసెను. మరియు యింద్రునితో యుద్ధమునకు కుమారుని ప్రోత్సహించెను.

# వృత్రుడు దేవతల నోడించుట

వృత్రుడు వేదపండితులైన బ్రాహ్మణు స్వస్తివాచనముతో రధము నెక్కి ఇంద్రుని చంపుటకు బయలుదేరెను. దేవతలచే జయింపబడిన రాక్షసులెల్లరు వృత్రుని మహాబలవంతునిగా తెలిసికొని యతనిని సేవింపవచ్చిరి. ఇంద్రుని చారులు స్వామీ! నీకు శత్రువైన వృత్రుడు త్వష్ట పేరేపింపగా నీతో యుద్ధమునకు వచ్చుచున్నాడని తెలియజేసిరి. నీవు త్రిశిరసుని చంపుటచే కోపించి త్వష్ట నీ చావునకీతని సృష్టించెనని కూడ తెలిపిరి. దేవతలు భయపడినవారై దేవేంద్రున కిట్లనిరి.

ఓ దేవరాజా! స్వర్గములో చెడు శకునములు చాల కనబడుచున్నవి. అని మొరబెట్టగా బృహస్పతిని రావించి ఓ మహాత్మా ఘోరములైన దుర్నిమిత్తములు కనబడుచున్నవి. నీవు ధీశాలివి. శాస్త్రవేత్తవు. నీవు నా శత్రునాశమునకు ఉపాయ మాలోచించి చెప్పి నా మనస్సునకు శాంతిని కలుగజేయుమని ప్రార్థించెను. బృహ స్పతి సహస్రాక్షా! నేనేమి చేయను? నీవు నిరపరాధియైన మునిశిరస్సును నరికి దుష్కార్యమొనర్చితివి. వృత్రుడు నీవజ్రముకంటె గొప్పవగు ఆయుధములతో అసురులను వెంటబెట్టుకొని నీపై యుద్ధమునకు వచ్చుచున్నాడు. అని యిట్లు గురుడు చెప్పుచుండగనే గంధర్వ యక్షకిన్నర తాపసులు దేవతలు తమతమ

నివాసములు విడిచి పారిపోయిరి. అది చూచి యింద్రుడు విచారగ్రస్తుడయ్యెను. అతడు తన సైన్యమును యుద్ధమునకు సిద్ధము కమ్మని చెప్పి తానైరావతముపై కూర్చొని బృహస్పతిని ముందుంచుకొని బయలుదేరెను. సైనికులు శస్త్రాస్త్రధారులై యుద్ధసన్నద్ధులైరి.

అప్పుడు వృత్రుడు దానవులతో కూడి మానస సరస్సునకు ఉత్తరమున విడిసెను. అచట నొక పర్వతము కలదు. ఇంద్రుడక్కడకు వచ్చి యుద్ధమునకు పూనుకొనెను. అంతటవృత్రవాసవులకు ఘోరమగు పోరు సంఘటిల్లెను. యమ వరుణాగ్ని వాయుదేవులు యుద్ధము విడిచి పారిపోయిరి. సింహమును చూచిన మృగముల వలె వృత్రునినున్న చూచి ఇంద్రాది దేవతలు పారిపోయిరి. జరిగిన దానిని తన తండ్రికి వృత్రుడు చెప్పగా ఆ మాటలు విని త్వష్టనేనిప్పుడు పుత్ర వంతుడను నా జీవితము ధన్యమైనది. నా మనోవ్యాధి నశించినది. మనస్సు శాంతి నొందినది. ఇప్పుడు నీకు మేలుకలుగు మార్గము చెప్పెదను. నీవు స్థిరా సనమున నుండి తపస్సు చేయుము. ఇంద్రుడు మోసము చేయుటలో నేర్పరి. వానిని నమ్మవద్దు. బ్రహ్మను గూర్చి తపమొనర్పుము. పాపియగు ఇంద్రుని సంహ రింపుము. అని పలుకగా వృత్రుడు గంధమాదన పర్వతమున కలిగి గంగలో స్నానమొనర్చి దర్భాసనముపై స్థిరాసనమున కూర్చొని ప్రజాపతిని మనస్సునందు ధ్యానించుచుండెను. ఇంద్రుడాతని తపస్సును భగ్నము చేయుటకు ప్రయత్నించెను కాని కృతార్థుడుకాలేదు.

## వృత్రుడు స్వర్గమలంకరించుట

నూరేండ్లు గడచిన పిదప పితామహుడు ప్రత్యక్షమై నీ కోరిక ఏమి? యని ప్రశ్నించెను. అప్పుడు వృత్రుడు ఓ కమలాసనా! నాకు తడిసిన, ఎండిన వస్తువులచే గాని లోహకాష్ఠశస్త్రములచే గాని చావులేకుండునట్లు వరమిమ్మనెను. హిరణ్యా గర్భుడట్లే యని వెళ్ళి పోయెను. వృత్రుడు తన తండ్రితో బ్రహ్మ వరదానమును చెప్పగా సంతసించి నీవు ఇంద్రుని చంపి నా మనస్సునకు శాంతిచే కూర్పుమనెను. వృత్రుడట్లే యని రథమెక్కి తండ్రి యింటి నుండి వెడలెను. రణభేరి శంఖనాద ములు పిక్కటిల్లెను. వృత్రుడు సేవకులకు నేడు ఇంద్రుని చంపి స్వర్గమును స్వాధీనము చేసికొందునని చెప్పెను. వృత్రుని రాక నెరిగి ఇంద్రుడు కూడ సేనలను యుద్ధమునకు సిద్ధము చేసెను. లోకపాలురనందరను యుద్ధమునకు గావించెను. ఇంద్ర వృత్రులును దేవదానవులును ఘోరమగు రణమొనర్చిరి. అట్లు యుద్ధము

జరుగుచుండగా వృత్రుడు ఇంద్రుని పట్టుకొని అతని కనచాదులు తొలగించి సంతోషముతో నాతని నోటిలో వేసికొనెను. దేవతలు హాహాకారమొనర్చుచు విల పించిరి.

అప్పుడు దేవతలు బృహస్పతి వద్దకు వెళ్ళి మారాజును వృత్రుడు మ్రింగి వైచెను. మేమిప్పుడేమి చేయవలెనని ప్రార్థించిరి. అంత బృహస్పతి ఇంద్రుడు వృత్రుని నోటిలో నున్నాడు చావలేదు. చావకముందే బయటకు వచ్చు నుపాయ మాలోచింపవలెను. అని చెప్పి వృత్రునకు ఆవులింత కలుగునట్లు చేసిరి. అప్పు డతడు నోరు తెరువగా ఇంద్రుడాతని నోటినుండి యెట్లో బయటపడెను. దేవతలు సంతోషించిరి. మరల యుద్ధము కొనసాగెను. దేవేంద్రుడు ఓడిపోయెను. దేవతలు యుద్ధము వదలి పరుగెత్తిరి. వృత్రుడు వెంటనే స్వర్గమును స్వాధీనము చేసికొనెను. ఐరావతమును తనదిగా చేసికొనెను. నందన వనమందు విహరింపజొచ్చెను. ఉచ్ఛైశ్రవమును సకలవిమానములను స్వాధీనము చేసికొనెను. దేవతలు స్వర్గ భ్రష్టులై హవిర్భాగములు కోల్పోయి గిరిదుర్గములందు తిరుగుచు బాధపడు చుండిరి.

# శ్రీ దేవి దేవతలకు ప్రత్యక్షమగుట

పూర్వము వృత్రాసురుడు మదగర్వితుడై దేవలోకమును మదగర్వితుడై స్వాధీనము చేసికొని దేవతలనందరను బాధింపగా శివునితో సహదేవతలు విష్ణుమూర్తిని ఉపాయమడుగబోయిరి. ఆయన దేవిని శరుణువేడినచో ఆమె మీకు సహాయము చేయగలదు. ఇంద్రుడుకూడ ఆమె నారాధించి యుద్ధములో శత్రు వును సంహరింపగలడు. పరాంబిక ప్రసన్నురాలైనచో సమస్తమును సాధ్యమగును. ఆమె యనుగ్రహములేనిదే ఎవ్వనికినీ యే కోరికయు తీరదు. ఆమె అంతర్యామి. స్వరూపములు అన్నిటికిని మూలకారణమైనది. లోకజననియైన యామెను శత్రు నాశము కొరకు సేవించుడు. పూర్వము నేనుకూడ ఆమె యనుగ్రహము చేతనే మధుకైటభులను రాక్షసులను చంపగలిగితిని. కనుక మీరుకూడ ప్రకృతి స్వరూప యైన దేవిని సేవించి కార్యసిద్ధిని పొందండి యని చెప్పగా దేవతలు మేరుపర్వత శిఖరమునకు వెళ్ళి యేకాంతమందు ఆమెను ధ్యానించి ఆమె మంత్రమును జపించి సృష్టిస్థితి సంహారకారణియగు పరదేవతను ఈవిధముగా స్తోత్రము చేసిరి.

శ్లో॥ దేవి ప్రసీద పరిపాహి సురాన్వృతప్తాన్ వృత్రాసురేణ సమరే పరిపీడి తాంశ్చ ।
దీనార్తి నాశనపరే! పరమార్థతత్వే । ప్రాప్తాంస్త్వ దంఘ్రిక మలం శరణం సదైవ ॥

త్వం సర్వ విశ్వజననీ పరిపాలయాస్మాన్ పుత్రానివాతి పతితాన్ రిపుసంకటేఽస్మిన్॥
మాతర్నతేఽస్త్య విదితం భువనత్రయేఽపి కస్మాదుపేక్షసి సురానసురప్రతప్తాన్
త్రైలోక్య మేత దఖిలం విహితంత్వయైవ బ్రహ్మా హరిః పశుపతిస్తవవానవోత్థాః ॥
కుర్వంతి కార్య మఖిలం స్వవశానతే తే భ్రూ భంగచాలన వశాద్వి హరంతికామమ్ ।
మాతాసుతాన్ పరిభవాత్పరిపాతిహీనాన్ రీతిస్త్వయైవ రచితా ప్రకటాపరాధాన్ ॥
కస్మాన్నపాలయసి వినాపరాధాన్ అస్మాంస్త్వ దంఘ్రి శరణాన్ కరుణారసాబ్ధే
నూనం మదంఘ్రి భజ నాప్తపదాః కిలైతే భక్తిం విహాయ విభవే సుఖభోగలుబ్ధాః
నేమే కటాక్ష విషయా ఇతి చేన్నచైషా రీతిస్సుతే నోఽత్రజనని కర్తరిచాపిదృష్టా
దోషోనవోఽత్రజనని ప్రతిభాతి చిత్తే వ్యాసాదితో మహిషరూపధవః కిలాజౌ
అస్మత్కృతే సకలలోక భయావహోఽసౌ వృత్రం కథంన భయదం విధునోషిమాతః॥
శుంభస్తథాతి బలవాన నుజోనిశుంభః తౌ భ్రాతరౌ తదనుగా నిహతా హతౌచ
వృత్రంతథాజ హిఖలం ప్రబలం దయార్ద్రే మత్తం విమోహాయ తథానభవేద్యథాసౌ
త్వం పాలయాద్య విబుధానసురేణమాతః సంతాపితానతితరాంభయవిహ్వలాంశ్చ
నాన్యోస్తికోపి భువనేషుసురారి హంతా యఃక్లేశ జాలమఖిలం విదహేత్వ్స శక్త్యా
వృత్రే దయా తవయది ప్రథితా తథాపి జహ్యేన మాశుజన దుఃఖకరం ఖలంచ
పాపాత్స ముద్ధరభవాని శరైః పునానా నో చేత్ప్రయాస్యతి తమోనను దుష్టబుద్ధిః
తేప్రాపితాః సురవనం విబుధారయోయే హత్వారణేఽపి విశిఖైః కిలపావితాస్తే
త్రాతానకిం నిరయపాతభయాద్దయార్ద్రే । యచ్ఛత్ర వోపినహికిం వినిహంసి వృత్రమ్
జానీమహేరిపురసౌతవ సేవకోనప్రాయేణ పీడయతి నః కిల పాపబుద్ధిః।
యస్త్వావక స్త్విహభ వేదమరావసౌ కింత్వత్వాద పంకజరతాన్ననుపీడయేద్వా
కుర్మః కథం జనని పూజన మద్యతేంబ! పుష్పాదికంతవ వినిర్మితమేవయస్మాత్
మంత్రావయంచ సకలం పరశక్తిరూపం తస్మాద్భవాని! చరణౌ ప్రణతాఃస్మనూనమ్ ।
ధన్యాస్త ఏవమను జాహి భజంతి భక్త్యాపాదాంబుజంతవ భవాద్ధి జలేషుపోతం
యం యోగినోపి మనసా సతతంస్మరంతి మోక్షార్థినో విగతరాగ వికారమోహాః ॥
యే యాజ్ఞికాః సకల వేదవిదోపినూనం త్వాం సంస్మరంతి సతతం కిలహోమకాలే।
స్వాహాంతు తృప్తిజననీమమరేశ్వరాణాం భూయః స్వధాంపితృగణ స్యచతృప్తిహేతుం
మేధాసికాంతిరసిశాంతిరపి ప్రసిద్ధా బుద్ధిస్త్వమేవ విశదార్థకరీనరాణామ్
సర్వం త్వమేవవిభవం భువనత్రయేఽస్మిన్ కృత్వాదదాసిభజతాం కృపయాసదైవ
ఏవంస్తుతా సురైర్దేవీ ప్రత్యక్షా సాభవత్తదా చారురూప ధరాతన్వీ సర్వాభరణభూషితా
సర్వవేదాంత సంసేవ్యా సచ్చిదానందరూపిణీ ప్రణేముస్తాం సమాలోక్య సురాదేవీం పురస్థితామ్

తానాహప్రణతాన్ దేవీకింవః కార్యం బ్రువంతుమామ్
దేవాః- మోహాయైనంరిపు వృత్రం దేవానామతి దుఃఖదమ్ ।
యథా విశ్వసతేదేవాన్ తథాకురు విమోహితం ఆయుధేచ బలం దేహి హతః స్యాద్యేనవారిపుః ॥
తథేత్యుక్త్వా భగవతీ తత్రైవాంతర ధీయత । స్వాని స్వాని నికేతాని జగ్ముర్దేవాముదాన్వితాః ॥

స్తోత్రభావము:- ఓ దేవదేవీ! యుద్ధములో మేము వృత్రాసురునిచే పీడింప బడి సంతాపము పొందుచున్నాము. మమ్ము దయజూచి కాపాడుము. నీ పాదపద్మములపై మాతలలు మోపి శరణువేడుచున్నాము. సర్వజననీ! ఈ ముల్లోకములందును నీకు తెలియనిదిలేదు. రాక్షసులచే బాధింపబడుచున్న మమ్మెందుకు నీవుపేక్షించుచున్నావు. మేము నీకన్న బిడ్డలము. భయంకరులగు శత్రువులకు చిక్కి బాధపడుచున్నాము. నీవు దేవతలకు తల్లివి. హరిహర బ్రహ్మలు నీవల్లనే జన్మించి నీకటాక్షముచేత అన్ని పనులను నెరవేర్చగలుగుచున్నారు. పుత్రులేమైన అపరాధములు చేసినను వారిని తల్లి దయతో కాపాడునుగదా! మేము నిన్ను సేవింపక సంపదలందు ఆసక్తి కలవారమగుటను దోషముగానెన్నకుము. నీవే మాయచే మమ్ము మోహింప జేయుచున్నావు. తల్లీ! నీవు పూర్వము మహిషాసురుని చంపి మాకు మేలుచేసితివి. అట్లే మదించిదుష్టుడైన యీ వృత్రాసురుని మాయచే మోహింపజేసి సంహరింపుము.

ఓదయామయి! నీవు పూర్వము శుంభ నిశుంభులను రాక్షసులను వారి యనుచరులను చంపి మమ్ము కాపాడితివి గదా! అట్లే యిప్పుడు వృత్రాసురుని సంహరించి మాకు మేలుచేయుమని ప్రార్థించుచున్నాము. మేము రాక్షసుల వలన బాధలు పడలేకున్నాము. నీకు వృత్రాసురుని పై దయ ఉన్నయెడల లోకములను పీడించు నతడు నరకములో పడకుండ సంహరించి యుద్ధరించుము. జగన్మాతా! ఇక మాకు నీశుభచరణములే శరణము. వృత్రాసురుడు నిన్ను సేవింపక మమ్ము బాధించుచున్నాడు. ఓ సచ్చిదానంద స్వరూపిణీ! మేము నీకు నమస్కరిస్తున్నాము. అని స్తుతింపగా నమస్కరించుచున్న దేవతలను గూర్చి మీ కోరికలను తీర్చెదనని చెప్పి దేవి అంతర్ధానము చెందెను. దేవతలు ఆనంద ముతో తమతమ యిండ్లకేగిరి. వృత్రాసురునితో స్నేహమును నటించి అవకాశమునుబట్టి వానిని సంహరింపవలయునని నిశ్చయించు కొనిరి.

దేవతలు-వృత్రునివద్దకు పోయి మైత్రీ భావమును ప్రకటించిరి. వృత్రుడును దేవతల మాటలను నమ్మలేదు. శత్రువులగు మిమ్ములను యెట్లు నమ్మవచ్చునని తన సందేహమును ప్రకటించెను. దేవతలు ప్రమాణము చేసిరి. దేవీమాయకు

లోబడిన వృత్రుడును యింద్రాదులతోడి మైత్రిని అంగీకరించెను. అటుతరువాత నింద్రుడు వానితో స్నేహమును నటించి తరువాత వానిని సంహరించెను. ఈ విధముగ నింద్రాదులు వృత్రునికూల్చి తమ స్థానములకు పోయిరి. కాని ఇంద్రుడు ధర్మమును తప్పుటవలన వృత్రహత్యచే కలిగిన బ్రహ్మాహత్యా దోషము వలన మానసికముగ బలహీనుడయ్యెను. అశాంతుడై బ్రహ్మాహత్యా దోషమునకు లోకాపవాదమునకు భయపడి యెచటనో దాగుకొనెను.

ఇంద్రుడు లేకపోవుటచే- లోకపరిపాలన గాడి తప్పెను. అప్పుడు దేవతలు విచారించి నహుషుడను రాజర్షిని యింద్రునిగావించిరి. రజో గుణమెక్కువగ నున్న నహుషుడు భోగలాలసుడయ్యెను. శచీదేవి యింద్రుని భార్య. ప్రస్తుతము నేనే యింద్రుడను. ఆమె నాకేల భార్యకాదు. ఆమెను నా పొందునకు తీసికొనిరండని అప్సరసలను దేవతలను ఆజ్ఞాపించెను. బృహస్పతి మున్నగువారు చెప్పినను వినలేదు. శచీదేవి శక్తి స్వరూపిణియగు దేవిని ప్రార్థించి ఆమె యనుగ్రహమున తన భర్తను చేరి దురవస్థను తెలిపెను. ఇంద్రుడు మాత్రమేమి చేయును. అతడే శక్తిహీనుడై ధర్మ లోపమునంది దాగి యుండెను. వారు దేవిని ప్రార్థించిరి. దేవి దయవలన వారికొక ఉపాయము తోచినది.

శచీదేవి - నహుషునివద్దకు పోయెను. నీవు మునివాహనుడవై నా వద్దకు రమ్ము. అప్పుడు నేను మహావైభవమున వచ్చిన నీ పొందును అంగీకరింతు ననెను. కామ పీడితుడగు నహుషండందులకంగీకరించెను. అగస్త్యుడు మున్నగు మునులు పల్లకిని మోయుచుండగా నహుషుడు ఆ పల్లకినెక్కి మునివాహనుడై శచీదేవి వద్దకు ప్రయాణమయ్యెను. కామాతురుడై యున్న నహుషుడు త్వరగా సరిగా నడువుమని మహాముని యగు అగస్త్యుని కాలితో తన్నెను. కోపించిన అగస్త్యుడు నహుషుని సర్పమగుమని శపించెను. ఈ విధముగా శచీదేవికి నహుషుని వలన బాధ దేవి యనుగ్రహము వలన పోయినది. వ్యాసుడీవిధముగ జనమే జయునకు కర్మగతిని, హరిశ్చంద్ర కథను, వశిష్ఠుడు మున్నగువారి వృత్తాంత ములను విక్షేపశక్తి మాయ మున్నగువానిని వివరించెను.

## శ్రీదేవి వృత్రుని సంహరించుట - నహుడింద్రుడగుట

ఋషులు దేవతలును శ్రీదేవి దయచే వరములను పొంది వృత్రుని ఆశ్ర మము చేరిరి. అతడు ముల్లోకములను భస్మము చేయువానివలె కన్పట్టెను.

ఋషులు సామవచనములతో మహానుభావా! వృత్రా! ఇంద్రుడు నీవును పరస్పర విరోధముచే శాంతి లేనివారై యున్నారు. మీ యిరువురి వైరమువలన దేవసైన్యము రాక్షససైన్యము నశించుచున్నది. కనుక మీరిరువురు స్నేహము మెలగినట్లైన యిరువురుకు మనశ్శాంతి యేర్పడును. ఉభయ సైన్యములు క్షేమముతో నుండ గలవని పలికిరి.

వృత్రుడు ఆర్యులారా! మీ మాటలు బాగుగనే యున్నవి. కాని యింద్రుడు వంచకుడు పాపి అతనితో నాకు స్నేహమెట్లు కుదురునని ప్రశ్నించెను. అంతట ఋషులు అతనిచే ప్రమాణము చేయించుదుము. కనుక నీకు నమ్మకము కలుగ వచ్చునని యింద్రునిచే ప్రమాణము చేయించిరి. ఇంద్ర వృత్రులిరు నగ్నిసాక్షిక ముగ మిత్రత్వము నొంది మసలజొచ్చిరి. ఇంద్రుడు మాత్రము లోలోన వృత్రు నెట్లైన చంపవలెనని యాలోచించుచు పైకి మిత్రుని వలె వ్యవహరించుచుండెను. ఒకనాడు సంధ్యాసమయమున ఇంద్రుడు విష్ణువును ప్రార్థింపగా నాతడు వజ్రాయుధములో ప్రవేశించెను.

బ్రహ్మవరమును స్మరించి ఈ సమయమున నాబలముచే నింద్రుడు చంప బడునని. సముద్రములో నురుగు తడిసినదిగాదు, ఎండినదిగాదు శస్త్రముగాదు అని భవానీ దేవిని స్మరించగా ఆమె నురుగులో చేరినది. వజ్రాయుధము హరి బలముచే నురుగుతో కప్పబడెను. అట్టి వజ్రాయుధము చేతబూని వృత్రుని పైవేటు వేసెను. దానితో వృత్రుడు కొండవలె నేలకూలెను. ఇంద్రుడు సంతోషించెను. పిదప ఇంద్రుడు సేనలతో కూడి సంతుష్టుడాయెను.

పరదేవత నురుగు నందుండి వృత్రుని మోహితుని చేయుట చేతనే ఇంద్రుడు వృత్రాసురుని చంప గలిగెను. ఇంద్రుడు బ్రహ్మహత్యా పాపముచే భయపడుచు తన భవనమునందు దుఃఖపడుచు తేజోహీనుడయ్యెను. తీరని దుఃఖముచే ఇల్లు విడిచి యింద్రుడు మానస సరోవరమందలి తామరతూడులో దాగియుండెను. ఇంద్రుడు ఇల్లు విడిచి వెళ్ళుట తెలిసి చింతాక్రాంతులై దేవతలున్న సమయమున అనేకములైన ఉపద్రవములు కలుగుచున్నవని మునులు దేవతలును ఆలోచించి నహుషుని ఇంద్రునిగా చేసిరి. నహుషు ధర్మిష్ఠుడైయును రజోగుణముచే మదన పీడితుడై శచీదేవిని నహుషుని ఆజ్ఞ తెలియజేసిరి. అంతట నామె బృహస్పతితో బ్రాహ్మణోత్తమా! నిన్ను శరణు వేడుచున్నాను. నన్ను నహుషుని బారినుండి కాపాడుము అని వేడుకొనెను. అప్పుడు బృహస్పతి యిట్లనెను. దేవి! నహుషుడు పాపి కామమోహితుడు అతనికి భయపడకుము అని పలికెను.

# ఇంద్రాణి శ్రీదేవిని సందర్శించుట

శచీదేవి బృహస్పతిని శరణువేడెను. నహుడు మదనబాధచే బృహస్పతిపై కోపించెను. దేవతలు చెప్పిన మాటలు వినక శచీదేవిని తీసికొనిరండని నహుడు ఆజ్ఞాపించెను. దేవతలు ఇంద్రాణికి రక్షణ మిచ్చిన బృహస్పతిని సమీపించి ఆమెను నహుషున కీయవలెనని పలికిరి. బృహస్పతి యిట్లనెను.

శచీదేవి నహుషుని వద్ద కేగి నాభర్త మరణించినచో నిన్ను సేవింపగలనని పలికి ఇంద్రుని రప్పింపుడు అని. శచీదేవి నహుషుని చేరి రాజా! ఇంద్రుడు బ్రతికియుండెనా? చచ్చెనా? అని చెప్పగా శచీదేవి నహుషుని చేరి యట్లే చెప్పెను. నహుషుడు నీమాటను తప్పక నెరవేర్తును సప్తర్షులు నన్ను మోయుదురు అని పలికి మునులనుచిలిచి తన వాహనమును మోయుడనెను. జరుగనున్నది తెలిసిన మహర్షులట్లేయని యంగీకరించిరి. అంతట పల్లకిలో కూర్చొని నహుషుడు అగస్త్యుని కాలుపెట్టెను. మరియు త్వరగా నడువుమని కొరడాతో కొట్టెను. అంతట బృహస్పతి మానససరస్సునకు వెళ్ళెను. అతడింద్రునకు జరిగినదంతయు వినిపించెను. ఇంద్రుడు విని యానందిం చెను. పిదప దేవతలు బృహస్పతియు యింద్రుని తీసికొని వచ్చి సింహాసనము నందభిషేకమొనర్చిరి. ఆ విధముగా యింద్రుడు మరల రాజ్యమును పొంది శచీ సహితుడయ్యెను.

# కర్మగతి

జనమేజయుడు మహానుభావా! ఇంద్రుడు కష్టములు పడుటకు కారణమేమి? తెలియజేయుమని యడుగగా వ్యాసుడిట్లు చెప్పసాగెను. తత్త్వవిదులు కర్మలు మూడు విధములుగ నుండును. అవి సంచిత వర్తమాన ప్రారబ్ధములు. ఇవి మరల సాత్వికరాజసిక తామసభేదముచే మూడువిధములు అనేక పూర్వజన్మలందు చేసినది సంచితము. ఇప్పుడిక్కడ చేయుచున్నవి. వర్తమానములు. జీవుడు సంచితములోని కొంతభాగమనుభవించుటకు ప్రేరేపింపబడును. అది ప్రారబ్ధము. ప్రారబ్ధమనుభవించిన గాని తీరదు. జీవులు తాము మునుపు చేసిన మంచిచెడ్డలను తప్పక అనుభవింపవలెను. దేవగంధర్వమానవాది శరీరముల దాల్చుటకీ కర్మమే మూలకారణము. కర్మము నశించినచో ప్రాణికి జన్మముండదు. జీవులు సుఖ దుఃఖముల ననుభవించిచుటకీ కర్మలే కారణములు. ఈ శరీరము ఇంద్రాగ్ని యమవిష్ణు కుబేరులవలన కలిగినది. ప్రాణుల సుఖదుఃఖములకు శరీరము నిలయము. సుఖదుఃఖములు ఒకదాని వెంటనొకటి వచ్చుచుండును. జీవికి

స్వాతంత్ర్య మెప్పుడు నుండదు. దేవతలు అవతార పురుషులును అనేక కష్టములు ననుభవిం చినట్లు వినుచుంటిమి కదా! కర్మగతి అడ్డులేనిది.

# శ్రీదేవీ నామమాహాత్మ్యము

జనమేజయుడు వ్యాసమహర్షి నిట్లడిగెను మహర్షీ నీవు సమస్త ధర్మములు తెలిసినవాడవు. అన్ని శాస్త్రములలో పండితుడవు. అధర్మ మధికముగా నుండు కలియుగములో మానవులు తరించు మార్గమును చెప్పుమనగా వ్యాసుడీ రీతిగా పలికెను:- రాజా! ఒకే ఒక ఉపాయము కలదు. రెండవ ఉపాయములేనే లేదు. అది యేమనగా శ్రీదేవినామమును స్మరించుట. అదియే సర్వపాపములను నశింప జేయును. కనుక కలియుగమును తలచుకొని భయపడనేల? బుద్ధి పూర్వకముగాక మనస్సు స్వాధీనములో లేక పోయినను విలాసముగా పలికినను శ్రీదేవీ నామము యెట్టి ఫలము నిచ్చునో అట్టి ఫలమును తెలిసికొనుటకు శివుడు మొదలగు వారును సమర్థులుకారు. సమస్తపాపములకు ప్రాయశ్చిత్త మొక్క దేవీ నామ స్మరణమే. దేవీ నామమును స్మరించినచో అన్ని పాపములకును ప్రాయశ్చి త్తము చేసికొనినట్లే యగును. ఇదియే అన్ని శాస్త్రములలోని రహస్యము. ఈ విషయ మును గమనించి దేవీపాదపద్మములను సేవించుము. జనులు మాయ యొక్క మహిమను గాని వైభవ మునుగాని యెరుగరు. లోకములో అన్నివిధములైన పాపములను శ్రీదేవీ నామ జపస్మరణములచే పోగొట్టుకొని మనశ్శాంతి నొంద వచ్చును అని వివరించెను.

# ఆడీ బక యుద్ధ కథారంభము - హరిశ్చంద్ర కథ

విశ్వామిత్రుడు పూర్వము హరిశ్చంద్రుని కారణమున శపింపబడి కొంగ యయ్యెను. వసిష్ఠుడు విశ్వామిత్ర శాపముచే ఆడీరూపము ధరించెను. ఆ రెండు పక్షులును మానస సరోవరతీ 'మున జీవించుచుండెను. గోళ్ళతో, ముక్కులతో అవి తీవ్రముగ పోట్లాడుకొనుచుండెను. వారిరువురు మునివర్యులు గదా! వారికి పరస్పరము వైరమేల కలిగెను? ఒకరినొకరేల శపించుకొనిరి? అని జనమేజయుడ డుగగా వ్యాసుడిట్లు చెప్పెను. పూర్వము త్రిశంకుని కుమారుడు హరిశ్చంద్రుడు ప్రసిద్ధుడు. అతడు సూరవంశపురాజు. అతనికి సంతానము లేదు. పుత్రప్రాప్తి కలిగినచో వరుణప్రీతికి తన పుత్రుని బలిపశువుగా నిత్తునని ప్రతిజ్ఞ చేసెను. వరుణుడు సంతసించి సంతానము ననుగ్రహించెను. హరిశ్చంద్రుని భార్య గర్భ

వతియయ్యెను. సర్వలక్షణ సంపన్నుడగు కుమారుని కనెను. రాజు పరమానంద భరితుడయ్యెను. పుత్ర జన్మమహోత్సవము జరుగుచుండగా వరుణుడు రాజు వద్దకు నీ కుమారుని బలిపశువుగ చేసి యజ్ఞమొనర్పుమనెను. రాజు నిశ్చేష్టుడై నిబ్బరించుకొని స్వామీ! నీ కుమాలును యిచ్చినది నిజమే నాభార్య ఒక నెలకు పరిశుద్ధురాలగును.

అప్పుడు వరమేధమొనర్తుననెను. వరుణుడు వెళ్ళిపోయెను. నెల గడచిన పిమ్మట వరుణుడు వచ్చి మరల తన కోర్కెను వెలిబుచ్చెను. స్వామి! నా కుమారునకే సంస్కారమును జరుగలేదు. సంస్కారహీనుడర్హుడు కాడని చెప్పగా వరుణుడు రాజా! నన్ను మోసగించి మాటిమాటికి రమ్మనుచున్నావు. సరే కొంత కాలమునకు మరల వచ్చెదనని వెళ్ళిపోయెను. సమావర్తన సంస్కారము వరకు నీ బాలుని పోషించి తదుపరి నీకర్పింతుననెను. అట్లే నిమ్మని వరుణుడు వెడలి పోయెను. కుమారుడు రోహితుడను పేరుతో పెరిగి ఎల్లవిద్యల విశారదుడయ్యెను. అతడు యాగవిషయము విని భయపడెను. తండ్రిని విడిచి కొండగుహలో నివసించుచుండెను. అంత వరుణుడు నీవు వట్టిమోసగాడవు. నీ వుజలోదరవ్యాధిచే పీడింపబడుదువు గాక యని శపించి వెడలిపోయెను. రాజు వ్యాధి పీడితుడై చింతించుచుండెను. రోహితుడొక బాటసారి చెప్పగా తన తండ్రి వ్యాధిగ్రస్తుడై నట్లు వినెను.

అంతట తన తండ్రిని చూడవలెనని రోహితుడు తలచుచుండగా ఇంద్రుడు బ్రాహ్మణ వేషమున వచ్చి నీవిప్పుడు తండ్రి వద్దకు వెళ్ళినచో ఆతడు నిన్ను బలి పశువును చేయును. కనుక వెళ్ళవద్దని వారించెను. రాకుమారుడక్కడనే ఉండ నిశ్చయించుకొని తండ్రి వద్దకు వెళ్ళలేదు.

## హరిశ్చంద్రుడు వ్యాధి విముక్తుడగుట

హరిశ్చంద్రుడు వ్యాధిచే బాధపడుచు గురువగు వసిష్ఠుని ప్రార్థింపగా నాతడు ధనమిచ్చి యెవని కుమారునైన తెచ్చి యాగము చేయుమనెను. రాజు మంత్రి నాపనికై యాజ్ఞాపించెను. మంత్రి అజీగర్తుడను దరిద్రునకు ధనమిచ్చి వాని కుమారుని యాగమునకు తెచ్చెను. రాజు యాగమారంభించెను. అప్పుడు విశ్వామిత్రుడు వచ్చి బాలుని బలి చేయవద్దని కోరెను. రాజు విశ్వామిత్రుని మాట వినలేదు. అప్పుడు విశ్వామిత్రుడు ఆబాలునకు వరుణమంత్రము ఉపదేశించెను. బ్రాహ్మణ బాలుడా మంత్రమును జపించగనే వరుణుడు ప్రసన్నుడై ఆ బాలుని

బంధవిముక్తుని చేసెను. వరుణుడురాజును కూడ రోగవిముక్తుని చేసి వెడలి పోయెను. హరిశ్చంద్రుడు విశ్వామిత్రుని మాట విననందున రాజుపై ముని కోపించెను. ముని ముసలి బ్రాహ్మణవేషముతో వచ్చి మోసముతో రాజ్యమంతయు నపహరించెను. వసిష్ఠుడు తన యజమానుడు కష్టముల పాలాయెనని కోపించి విశ్వామిత్రుని కొంగవు కమ్మని శపించెను. విశ్వామిత్రుడాతని ఆడియను పక్షివగుమని ప్రతి శాపమిచ్చెను.

# వసిష్ఠుని పూర్వ జన్మవృత్తాంతము

జనమేజయుడు వసిష్ఠునకు "మైత్రావరుణి" అను పేరెట్లు కలిగెనని ప్రశ్నింపగా వ్యాసుడిట్లు చెప్పెను. వసిష్ఠుడు "నిమి" శాపముచే శరీరము విడిచి మరొయెక జన్మమొందెను. మిత్రావరుణులకు జన్మించుట వల్ల మైత్రావరణీయని రెండవ జన్మమందు పేరు పొందెను. రాజు మహర్షి నేల శపించెనని మరల ప్రశ్నింపగా వ్యాసుడిట్లు చెప్పదొడగెను.

పూర్వము నిమి యను రాజు రాజసూయయాగము చేయదలచి భృగువు, అంగిరుడు, వాసుదేవ, గౌతములు మొదలగు మహర్షులను ఆహ్వానించి యాగ సామగ్రినంతయు సమకూర్చుకొని వసిష్ఠుని పూజించి యిట్లనెను. నీవు నాకు కులగురువు సర్వజ్ఞుడవుగాన నా యాగకార్యము నెరవేర్పుమని పలికి దేవిప్రీతి కొరకు దేవీ మహాయజ్ఞము యథావిధిగా నాచరించెదనని విన్నవిం చెను. అప్పుడు వసిష్ఠుడు ఇంద్రుడునన్నొక యాగమున కాహ్వానించి యున్నాడు. గనుక ఆ యజ్ఞము పూర్తియగు వరకు ఓ[illegible] పట్టుమనెను. రాజు ధనాశతో నీవు యింద్రుని యాగమునకు వెళ్ళుచున్నావు. అని పలికెను!

వసిష్ఠుడింద్రుని యాగమునకు వెళ్ళెను. అప్పుడు రాజు తన యజ్ఞమును ఆపింపు మని గౌతముని నియమించెను. ఇంద్రుని యాగము పూర్తియైన పిమ్మట నిమి యాగము చూడవచ్చిరాజు దర్శనమును కోరి నిల్చియుండగా సేవకులు నిద్రలో నున్న రాజును మేల్కొలుప లేదు. వసిష్ఠుడు గౌతముని ద్వారా యజ్ఞము చేయ పూనినందుకు కోపించి నీ శరీరము పడిపోయి విదేహుడవగుమని శపించెను. సేవకులా శాపము వినిరి. రాజు సేవకులవలన శాపము నుగ్రహించి. నీ శరీరము కూడ పడిపోవుగాక యని వసిష్ఠుని శపించెను.

వసిష్ఠుడు బ్రహ్మను ప్రార్థింపగా మిత్రావరుణుల తేజస్సునందు ప్రవేశింపుమని యాతడు చెప్పెను. వసిష్ఠుడట్లే చేయగా నొకప్పుడు ఊర్వశి మిత్రావరుణుల

కంటబడెను. వారిరువురు మోహితు లైరి. దైవయోగమున మిత్రా వరుణుల వీర్యమొకకుండలో పడెను. అందుండి యిరువురు సుకుమార ముని కుమారులు జన్మించిరి. వారిలో నొకడగస్త్యుడు. రెండవవాడు వసిష్ఠుడు. అగస్త్యుడు బాల్యమునందే తపస్సునకు వెళ్ళెను. వసిష్ఠుడిక్ష్వాకు మహారాజునకు పురోహితుడుగా వరింపబడెను.

# నిమి చరిత్రము

జనమేజయుడు వసిష్ఠుని చరిత్ర చెప్పితివి గదా నిమి చరిత్ర కూడ చెప్పుమనగా వ్యాసుడు చెప్పనారంభించెను. రాజా! వసిష్ఠుడు వేరొక శరీరము ధరించెను. కాని నిమి మాత్రము మరొక శరీరముతాల్పలేదు. యజ్ఞము పూర్తికాకముందే రాజు శపింపబడెను. ఇప్పుడేమి చేయవలెను? అని ఆలోచించి నిమిలోని సూక్ష్మాంశమును గ్రహించి దానిని వివిధమంత్రములతో కాపాడుచుండిరి. కొంతకాలమునకు యజ్ఞము పూర్తి చెందెను. అప్పుడు ఋత్విక్కులు స్తుతింపగా దేవతలు పరమానందభరితులైరి. వారు దుఃఖితుడైన రాజును వరము కోరుకొనమనిరి. అప్పుడాతడు ఎల్ల ప్రాణుల కన్నులపై వాయురూపము దాల్చి చలించుచుండునట్లు వరమిమ్మనెను.

అప్పుడు దేవతలు రాజా! నీవు యజ్ఞేశ్వరియగు దేవిని ప్రార్థింపుము. ఆ దేవి నీ యీ జన్మమునకు సంతసించును. ఆ తల్లి నీ కోరిక తీర్చగలదు అని దేవతలు పలుకగా నిమి పరమభక్తితో పరాంబికను వివిధ దివ్యస్తోత్రములచే సవినయముగ స్తుతించెను. అంతట దేవి ప్రత్యక్షమయ్యెను శ్రీమాత ప్రసన్నురాలు కాగా రాజిట్లు వరము వేడుకొనెను. ఓ తల్లీ! మోక్షప్రదమగు జ్ఞానము కలుగు జన్మననుగ్రహింపుము. నన్నెల్ల ప్రాణుల నేత్రములపై నివసింపనిమ్ము అని పరదేవత నీకు విమలజ్ఞానము కలుగుగాక నీ వెల్ల ప్రాణులనేత్రములపై నుండగలవు. అని వరమొసగి దేవి యంత ర్ధానము నందెను. పిదప మునులు నిమి దేహమును మథింపగా నిమివంటి సర్వలక్షణ సంపన్నుడగు కుమారుడు జన్మించెను. అతడు "మిథి" యనియు జనకుడ నియు లోకమున పేరొందెను.

# హైహయుల చరిత్ర

మునీంద్రా! హైహయులను క్షత్రియులు భార్గవులను చంపిరని వింటిని వారికి వైరమే కారణమున కలిగెనో తెలియజేయుము. అని జనమేజయుడడుగగా వ్యాసుడిట్లు చెప్పెను.

రాజా! ఈ చరిత్ర ఆశ్చర్యకరము. పూర్వము హైహయవంశ మందు కార్త వీర్యార్జునుడను రాజు కలడు. అతనికి వేయి చేతులు కలవు- గొప్ప బలశాలి. ధర్మవీరుడును. అతడు దత్తాత్రేయుని శిష్యుడు. యాగము లాచరించిన వాడు. భార్గవులకనేక దానధర్మము లొసగినవాడు. అతని దానములచే భార్గవులు ధన వంతులైరి. కొన్నాళ్ళకు కార్తవీర్యుడు స్వర్గమును చేరెను. అంతట హైహయులు దైవయోగమున మిక్కిలి బీదవారైరి.

ఒకప్పుడు హైహయులకు డబ్బుకావలసి భార్గవులను ధనమడిగిరి. వారు లేదని పలికి యేమియు నీయలేదు. కొందరు భార్గవులు హైహయులకు భయపడి తమ ధనరాసులను భూమిలో పాతిపెట్టిరి. మరికొందరు బ్రాహ్మణులకు దానమిచ్చిరి. రాజులు తమకు ధనమత్యావశ్యకము కాగా భార్గవుల ఆశ్రమములలో చొరబడిరి. భార్గవులు తమ యాశ్రమములు విడిచిపోయిరి. హైహయులు భార్గవుల యాశ్రమములను త్రవ్వి ధనమును వెలికి తీసిరి. బ్రాహ్మణులు చేయునది లేక రాజులను శరణువేడిరి. ఐనను రాజులు బ్రాహ్మణులను కొట్టి చంపిరి. పిమ్మట భార్గవులున్నచోటుకు వెళ్ళి వారిని చంపి భార్యల గర్భములు చీల్చివైచిరి. విప్రస్త్రీలు బోరున ఏడ్చిరి. లోభమువలన ప్రాణ ములను కూడ కోల్పోవుట సంభవించును. కౌరవుల నాశమునకు లోభమే కారణము. లోభబుద్ధులైన భార్గవులు హైహయుల చేత మరణించిరి.

## ఔర్వుని జన్మవృత్తాంతము

హైహయులచే పీడింపబడిన భృగుస్త్రీలు భయపడి హిమవత్పర్వత గుహలకు వెళ్ళిరి. వారందరును గంగాతీరమున మట్టితో గౌరీదేవిని చేసి పూజించిరి. ఒకనాడు వారికి కలలో శ్రీలోకమాత దర్శనమొసగి మీలో ఒకతెకు తొడలనుండి ఒక దివ్య పురుషుడు జన్మించగలడు. అతడు మీ పనులన్నియు చక్కబెట్టగలడు అని పలికి అంతర్ధానమొందెను. పిమ్మట ఒక బ్రాహ్మణి తొడలో గర్భమును ధరించెను. హైహయులామెను చూచి కత్తులు చేతబట్టుకొని బాలకుడొకడు బయటపడెను. అతని తీక్ష్ణతేజస్సుచే హైహయులు గ్రుడ్డివారైరి. హైహయులు బ్రాహ్మణ స్త్రీల పాతివ్రత్యము చేతనే మనము గ్రుడ్డివారలమైతిమని తలచిరి. భయపడుచున్న బ్రాహ్మణ స్త్రీని శరణువేడిరి. మాకు చూపు ప్రసాదింపుమని వేడుకొనిరి. ఆ రాజు లతో బ్రాహ్మణ స్త్రీ యిట్లనెను.

క్షత్రియులారా! మీ చూపులను నేను పోగొట్టలేదు. ఈ బ్రాహ్మణ బాలుడు మీపై కోపించెను. ఇతడేమిమ్ము గ్రుడ్డివారిని చేసెను. ఈ కుమారుడు శ్రీదేవి

వరప్రసాదముచే నాకు జన్మించినాడు. ఇతడు ఔర్వుడని ప్రసిద్ధినొందును. ఈతని వేడుకొనుడని పలికెను. పిమ్మట రాజులు బాలుని స్తోత్రము చేయగా ఔర్వుడు రాజులారా! మీరు మీమీ ఇండ్లకు వెళ్ళుడు అని పలుకగనే హైహయులకు చూపు వచ్చెను. వారు ఔర్వుని యనుమతితో ఇండ్లకేగిరి. బ్రాహ్మణకాంతయును దివ్యశక్తి గల కుమారుని వెంటబెట్టుకొని తన యాశ్రమమునకు వెళ్ళెను. ఈ విధముగ లోభులైన రాజులు చేసిన పాపకృత్యములు తెల్పి తినని వ్యాసుడు ముగించెను.

# హైహయ చరిత్ర

పూర్వము సూర్యపుత్రుడగు రేవంతుడనువాడు ఉచ్చైఃశ్రవమను గుఱ్ఱము నెక్కి వైకుంఠమునకు వెళ్ళెను. అతనిని లక్ష్మీదేవి చూచెను ఉచ్చైశ్రవము సముద్రము నుండి తనతో పుట్టిన దగుటచే లక్ష్మీదేవి మిక్కిలి ఆసక్తితో ఆ గుఱ్ఱమును చూచుచుండెను. విష్ణుమూర్తి అంత ఆసక్తితో చూచుచున్నావేమని లక్ష్మిని అడిగెను. ఆమె సమాధానము చెప్పక దానినే చూచుచుండెను. అంత విష్ణువు కోపించి నీవు గుఱ్ఱముగా జన్మింపుమని శపించెను. ఆమె భూలోకమున ఆడగుఱ్ఱమై జన్మించెను. భర్త శాపమునకు మిక్కిలి విచారించుచు ఈశ్వరుని ప్రార్థించెను. ఆతడు ప్రత్యక్షమై లక్ష్మీదేవి అవస్థను గుర్తించి విష్ణుమూర్తికి కబురంపి హయరూపములో నున్న లక్ష్మిని స్వీకరింపుమనెను. శ్రీమహావిష్ణువు తాను మగ గుఱ్ఱము రూపము ధరించి ఆడు గుఱ్ఱము రూపములోనున్న లక్ష్మివద్దకు వెళ్ళెను. వారిరురువురి సమాగమముచే నొక పుత్రుడు కలిగెను. లక్ష్మీనారాయణులిరువు రును గుఱ్ఱము రూపము వదలి వైకుంఠమునకు వెళ్ళుచు పిల్లవానిని అచటనే విడిచి వెళ్ళిరి.

# హరియశ్విని యందు పుత్రుని బడయుట

లక్ష్మీదేవి ఆ పిల్లవాని తీసికొని వెళ్ళదలచినను భర్త మాటలచే పిల్లవానిని తీసికొని వెళ్ళలేదు. లక్ష్మీనారాయణులు పిల్లవాని విడిచి వెళ్ళగా చంపకుడను విద్యాధరుడు ఆప్రదేశమునకు వచ్చెను. అతడు మదనాలస యను తన ప్రియురాలితో యథేచ్ఛగా విమానములో క్రీడలందు మునిగి తేలుచుండెను. అతడంతలో భూమి మీద సుఖముగా నాడుకొనుచు దేవతా పుత్రునివలె మనస్సు నాకర్షించు చున్న శిశువును చూచెను. చంపకుడు వెంటనే విమానము దిగి శిశువు నెత్తుకొని పేదవాడు పెన్నిధిని గావించినట్లు పరమానందమొందెను. ఆ

పిల్లవాని తన ప్రియు రాలి చేతికిచ్చెను. ఆమె ప్రేమతో బాలుని మోము ముద్దాడి ఒడిలో కూర్చొనబెట్టు కొనెను.

అప్పుడు మదనాలస ప్రియతమా! ఈ బాలుడెవనివాడు. ఈ వనమున నితని నెవరు వదలిరి. అనగా చంపకుడు ప్రియా! మనము సర్వజ్ఞుడగు నింద్రుని అడిగి తెలిసికొందము. ఇంద్రుని యనుమతితో వీనిని పుత్రునిగ స్వీకరింతము అని పలికెను. యింద్రుని యీ విషయమున ప్రశ్నింపగా ఇంద్రుడిట్లు చెప్పెను. ఈతడు లక్ష్మీనారాయణుల పుత్రుడు. యయాతి కుమారుడగు తుర్వసుని కీయదలచి యీ బాలుని లక్ష్మీనారాయణులు విడిచి వెళ్ళిరి. ఆ రాజీపుత్రుని గ్రహింపగలడు కాన నీవు చూచిన చోటునే యీ బాలుని విడిచి పొమ్మనెను. చంపకుడట్లే చేసెను. అంతట లక్ష్మీనారాయణులు విమానమెక్కి రాజున్నచోటికి వెళ్ళిరి. హరి రాజును చూచి విమానము దిగెను. రాజు హరికి దండప్రణామ మాచరించెను. రాజు పుత్రసంతానమును కోరగా తమ సాకళిందీ సంగమస్థలమున నీకొరకు బాలుని ఉంచితిని. అతని నిగ్రహింపుమనెను. రాజు పరమానంద భరితుడాయెను.

# ఏకవీరుని జన్మవృత్తాంతము

పిమ్మట యయాతి పుత్రుడు పుత్రుడున్నచోటికి వడిగా రథము నెక్కివెళ్ళెను. అక్కడ నాడుకొనుచున్న చిన్నారి బాలుని కన్నులార చూచెను. రాజు హరుని ప్రభావమున లక్ష్మీనారాయణులకు కలిగిన మదనసుందరుడగు పుత్రుని చూచి ఎత్తుకొని తన యింటికేగెను. రాణికి బాలుని చూపి ఏకవీరుడని వానికి నామకరణ మొనర్చెను. రాజు ఋణవిముక్తుడయ్యెను. అతని వంశము వర్ధిల్లెను.

# ఏకవీరుని వనవిహారము - ఏకావళి చరిత్ర

రాజు బాలునకు జాతకర్మాది సంస్కారములనొనర్చి ఋణత్రయ విము క్తునిగా తననుభావించెను. పదకొండవయేట ఉపనయనము చేసి ధనుర్వేదము నేర్పించెను. రాజాతనికి పట్టాభిషేకము చేయదలచెను. రాజు బ్రాహ్మణులను పిలిచి యథావిధిగా పట్టాభిషేకము జరిపెను. రాజ్యము కుమారునకు అప్పచెప్పి భార్యతో నాతడు వనమునకు వెళ్ళెను. ఆతడు మైనాకపర్వతముపై ఆశ్రమ మేర్పరచుకొని ఆహార నియమముతో పార్వతీ దేవిని ధ్యానించుచుండెను. రాజు రాణియు స్వర్గమలకరించిరి. హైహయుడు ఒకనాడు గుఱ్ఱము నెక్కి మంత్రి కుమారులతో గంగాతీరమున కేగెను. అచట సుందరదృశ్యముల చూచుచు పద్మ

ములకు కుడివైపున నొక యందగత్తెను తేరిపార జూచెను. ఆమె యువతి చెలి కత్తెలను విడిచి దుఃఖపడీతరయై యుండెను. రాజామెను సమీపించి నీవెవరి కుమార్తెవు? నీ దుఃఖమునకు కారణమేమి? నేనెట్టి తీవ్రతర దుఃఖములనైన తొలగింపగలను. నీ కోరికను తెలిసినచో దానిని నెరవేర్చి నిన్నానందింపజేయ గలను. అనగా నామె యిట్లు పలికెను.

ఓ మహాబాహూ! రైభ్యుడను రాజు కలడు. అతని భార్య రుక్మరేఖ. ఆమె సర్వశుభ లక్షణములు గలది. ఆ పుత్రుడు లేని దైన్యలపించుచు భర్తతో సంతానము లేని నా బ్రతుకు వ్యర్థము గదా! యని పలు కగా రాజు బ్రాహ్మణులను పిలిచి యజ్ఞ మొనరించెను. అప్పుడగ్ని నుండి ఒక కన్య ఆవిర్భవించెను. హోమము చేయువారా కన్యను స్వీకరింపుమని రాజుకు చెప్పిరి. రాజా బాలికను స్వీకరించి భార్యకిచ్చెను. ఆ బాలిక ఏకావళి యను పేర దినదినాభివృద్ధి గావించుచుండెను. నేనారాజు మంత్రి కుమార్తెను. నా పేరు యశోవతి.

ఒకనాడు ఏకావళి వనవిహారమునకు గంగాతీరము చేరగా నేను ఆ వెంట నుంటిని. మేమక్కడ ఆటలలో మునిగియుండగా కాలకేతుడను రాక్షసుడక్కడకు వచ్చెను. వాడు రక్షక పరివారమును పారద్రోలి యామెను పట్టుకొనెను. కామోద్రే కముతో నామె నాతడు తీసికొని వెళ్ళెను. కాలకేతువు దుఃఖించుచున్న రాకుమార్తెను తన పట్టణమునకు కొనిపోయెను. నేనామె వెంట ఏడ్చుచు వెళ్ళితిని. కాలకేతువు నన్ను కూడ తన రథముపై నెక్కించుకొని యామె నోదార్చుమనెను. వాని పట్టణము పాతాళరంధ్రములో నున్నది. ఆ రాక్షసుడామె పై మక్కువతో తనను వివాహమాడు మని వేడుకొనెను.

అప్పుడామె మా తండ్రి హైహయునకు నన్నిచ్చియున్నాడు. నేను స్వతంత్రు రాలను కానని చెప్పెను. ఐనను వాడామెను విడువలేదు. ఆమెను గూర్చియే నేను దుఃఖించుచున్నాననగా ఏకవీరుడిట్లనెను. నీవాదుష్టుని పట్టణము నుండి యెట్లు బయటకు రాగలిగితివి? ఆమె తండ్రి యామెను హైహయున కిచ్చెనను మాట నాకు నమ్మదగినదిగా లేదు. హైహయరాజును నేనే మరియొకడు లేడు. నీసఖి నాకొరకేల యుద్దేశింపబడినదో తెలియజేయుము. నేనా రాక్షసుని చంపినీ చెలికత్తెను తేగలను. ఆమె ఉండుచోటు తెలియజేయుము. అని యడిగెను!

యశోవతి రాజా! నేను శ్రీత్రిభువనేశ్వరీదేవిని ధ్యానించితిని. నేనామెను స్మరించుచు. ఆమె మంత్రరాజమును విడువక జపింప నారంభించితిని. అంత జగదంబ నాభక్తికి మెచ్చి గంగాతీరమున హైహయుడను రాజు కలడు వాని

పేరేకవీరుడు. ఆతడు మిమ్ము ఉద్ధరింపగలడు. రాక్షసుని చంపి యా మానవతిని విడిపింపగలడని చెప్పెను. మరియు ఏకవీరుని ఏకావళి భర్తగా పొందునట్లు ప్రయత్నింపుము అని పలికి అంతర్ధానము చెందెను. నేను రాకుమారికి స్వప్న వృత్తాంతము చెప్పగా నీవు త్వరగా నచటికేగుమని నన్ను పంపినది. వీరవర్యా! నీవెవరివో యెవరి కుమారు డవో తెలియజెప్పుమనెను.

## హైహయ కాలకేతుల యుద్ధము

అంతలో దైవయోగమున అక్కడకు మహాయోగి యగు దత్తాత్రేయుడు వచ్చెను. ఏకవీరుడాతని నుండి శ్రీయోగీశ్వరీ మంత్రము గ్రహించెను. ఆ మంత్ర ప్రభావముచే అన్నిటిని తెలుసుకొను శక్తియు, అంతటను తిరుగు శక్తియు కలిగెను. ఆ రాక్షసుని పట్టణమునకు హైహయుడు యశోవతియు చేరిరి. రాక్షసులు వీరి రాకను కాలకేతువునకు తెలియజేసిరి. ఆ వీరుడు యుద్ధమునకు వచ్చి యున్నాడు. పోరాటమునకు నీవు త్వరపడుమని విన్నవించిరి. కాలకేతువు ఏకవీరునితో పోరుటకు రాక్షసుల నాజ్ఞాపించి తాను ఏకావళి వద్దకు కూర్చొని ప్రియవచనములు పలుకుచుండెను. ఇంతలో భటులు కొందరు వచ్చి యశోవతి తెచ్చిన సైన్యము మనమీద విరుచుకు పడుచున్నది. నీవు వెంటనే గొప్ప సైన్యముతో వారిని నెదుర్కొనుము. అనిచెప్పిరి! అంతట నాతడు రథము నెక్కి నగరము వెలుపలకు వెళ్ళెను. అదే సమయమున ఏకవీరుడు రథముపై వచ్చెను. అంతట వారిరువురు వాసవవృత్రుల వలె ఘోరముగా పోరిరి. రమాపుత్రుడగు ఏకవీరుడు గదతో కొట్టగా రాక్షసుడు నేలకూలెను. అంతట యశోవతి ఏకావళి వద్దకు వెళ్ళి కాలకేతు మరణము తెలిపి ఏకవీరుడు నీపై అనురాగముతో నిన్ను చూడగోరుచున్నాడని పలికెను.

అప్పుడు ఏకావళి ఆకామార్తుడు తనను స్వంతము చేసికొనునని తలచి మాసిక శరీరముతో మాసిన చీరతో నాతని గుడారమునకేగెను. ఆమెను చూచి కామపరవశుడగు రాకుమారునితో రాజకుమారా! నీవు ఈమె తండ్రి వద్దకు ఈమెను తీసికొనివెళ్ళినచో నాతడీ మెను నీకిచ్చి వివాహము చేయగలడని చెప్పెను. ఏకావీరుడట్లే యని ఏకవళిని తండ్రి వద్దకు కొనిపోయెను. చాలకాలమునకు తన పుత్రిక వచ్చుచున్న విషయము నెరిగి ఎదురేగి యింటికి కొనివచ్చి విషయమంతయు తెలిసికొని ఒక శుభము హూర్తమున వివాహము జరిపించెను. అనేక వస్తువులతో నేకావళిని ఏకవీరునితో పంపెను. ఏకావళికి కృతవీర్యుడను పుత్రుడు కలిగెను. కృతవీర్యుని కొడుకు కార్తవీర్యుడు. ఇట్లు హైహయవంశము భూమండలముపై విస్తరిల్లెను.

## విక్షేపశక్తి వర్ణనము

జనమేజయుడు భగవంతుడైనని విష్ణువు గుఱ్ఱపు రూపమేల దాల్చెనని ప్రశ్నింపగా వ్యాసుడు నారదమహర్షి నడిగిన వృత్తాంతమును సమాధానము చెప్పుచున్నాడు. తానుద్వీపమునందు జన్మించుట, చిత్రాంగదుడు చనిపోవుటచే తల్లి సత్యవతి దుఃఖించుట. తల్లి మాటను కాదనలేక తమ్ముని భార్యలందు సంతానము కనుట. దానిచే మమకారమేర్పడుట.

## వ్యాసుని మోహవృత్తాంతము

సరస్వతీ తీరమున శాంతిలేక తిరుగుట, తీరని మోహపాశమును గూర్చి చింతించుట- పాండవులు జన్మించుట. భీష్ముడు వారలను పెంచుట, వారేక చక్రపురమందు నివసించుట ద్రౌపదిని వివాహమాడుట నా యీ మోహమునకు కారణమేమని నారదుని ప్రశ్నింపగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులే మాయలోపడుచుండనిక నీనాలెక్కఏమి? యని పలికెను.

## నారదుడు స్వవృత్తాంతము తెలుపుట

మోహమునకు కారణమడుగుచున్న వ్యాసుడునకు నారదుడిట్లు చెప్పెను. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కూడ మాయకు లోనైనవారే. వ్యాసమునీశా! నేను పూర్వము భార్యను గూర్చి మోహములోబడి దుఃఖముల ననుభవించితిని. అది యెట్లన పూర్వతడు నేను భూలోకమున తిరుగుచుండగ వర్షకాలము వచ్చుటచే సంజయుడను రాజు నింట నాల్గు నెలలుంటిమి. ఆ రాజు కూతురు దమయంతి మాకు పరిచర్య చేయుచుండెను. ఆ బాలిక సంగీతము తెలిసినది. నేను గానము చేయుచుండుట చూచి యామె నాపై మోహము కలదాయెను. పర్వతుడీ విషయము గ్రహించి నేను కూడ నామెపై ప్రేమతో నున్నట్లు తెలిసికొని నన్ను కోతి ముఖము కలవానిగా శపించి వెళ్ళిపోయెను. దమయంతి నన్నుదప్ప మరొకనిని వివాహమాడనని చెప్పుటచే నామెతో నాకు వివాహము జరిగెను.

## నారదుని వివాహము

వానరముఖము గల నేను పెండ్లి చేసికొని బాధపడుచు నచ్చట యెట్లో ఉంటిని దమయంతి మాత్రము నా కోతిముఖము చూచి లేశమాత్రము విచారింపక వికాసముతో కూడిన ముఖముకలదై యుండెను. పిదప పర్వతముని నన్ను చూచుటకు వచ్చెను. నేనతనిని సత్కరించి పూజించితిని. అప్పుడు మేమిరు

పురము శాపముల త్రిప్పివైచుకొంటిమి. పర్వతుడు స్వర్గమునకేగెను. నేనొకప్పుడు విష్ణుమూర్తితో వినోదములు జరుపుచు క్షణములలో ఆడుదానినైతిని. నన్నొక రాజు చూచి మోహించి వివాహమాడెను. నాకొక పుత్రుడు కలిగెను.

# మాయా ప్రభావము- నారద వృత్తాంతము

రెండేళ్ళ తరువాత యొక పుత్రుడు కలిగెను. పిమ్మట వరుసగా ఎనిమిది మంది పిల్లలు కలిగిరి. మనుమలను చూచితిని. నేను స్త్రీనైతినని యెన్నడును విచారింపలేదు. పిమ్మట నొకరాజు యుద్ధమునకు రాగా వాని చేతిలో కొడుకులు మనుమలు మరణించిరి. నేను మిక్కిలి దుఃఖపడితిని. అంతట విష్ణువు వృద్ధ బ్రాహ్మణరూపములో వచ్చి పుణ్యతీర్థమున స్నానము చేయించెను. ఆ పుణ్యతీర్థ మున మునుగగనే నేను పురుషుడనైతిని. నా తండ్రి లోకములో నెల్లవారును. నేను శివ విష్ణువులును మాయా మోహితులమే యని చెప్పెను.



# సప్తమ స్కంధము

## దక్ష సృష్టిక్రమము

సూతమహర్షి యిట్లనెను. ఓ మహర్షులారా! జనమేజయుడు శ్రీదేవీ కథా సుధారసము గ్రోలి యానందభరితుడై సూర్యచంద్ర వంశములందలి రాజుల చరిత్ర వినగోరుచున్నానని ప్రార్థింపగా వ్యాసమహర్షి ప్రసన్నుడై దేవీ కథారసము వెల్లి గొలుపనిట్లు చెప్పెను.

పూర్వము శ్రీమన్నారాయణుని నాభిపద్మము నుండి బ్రహ్మ జన్మించెను. అతడు తీవ్రముగ తపస్సు చేసి శ్రీమహాదేవి నారాధించెను. అప్పుడామె సంతసించి వరమీయగా బ్రహ్మ జగత్తుల సృజింపనారంభించెను. కాని ప్రపంచ సృష్టి చేయజాలకపోయెను. మొదట ఏడుగురు మానస పుత్రులను సృష్టించెను. పిమ్మట బ్రహ్మయొక్క అహంకారమునుండి రుద్రుడుతొడ నుండి నార దుడు బొటనవ్రేలి నుండి దక్షుడు సనకాది మానస పుత్రులుద్భవించిరి. ఎడమ బొటనవ్రేలి నుండి దక్షుని భార్య జన్మించెను. ఆమె పేరు "వీరిణి", "అసిక్ని" అను పేరు కూడ నామెకు కలదు. నారదుడు వీరిణి గర్భమందు జన్మించి పేరు గాంచెను. బ్రహ్మ మానసపుత్రులను కనెను. వారెల్లరు ప్రజాసృష్టి చేయదలచిరి. వారిని చూచి నారదుడు భూమి పరిమాణము తెలిసికొని ప్రజాసృష్టి చేయవలెనని పలుకగా కొందరు తూర్పునకు, మరికొందరు దక్షిణమునకు, కొందరు పశ్చిమ దిక్కునకు, వేరొక కొందరు ఉత్తరదిక్కునకు వెళ్ళిరి. అప్పుడు దక్షుడు మరి కొందరిని ప్రజాసృష్టికై పుట్టించెను. నారదుడు వారిని కూడ భూపరిమాణము తెలిసికొని సృష్టింపుడనగా వారును అట్లే వెళ్ళిరి.

అంతట దక్షుడు కోపించి నీవు నాకు పుత్రుడవై జన్మింపుమని శపించెను. అందుచే వీరిణి గర్భమున నారదుడు పుట్టవలసి వచ్చెను. దక్షునకు పుత్రని యొగదుఃఖము కొంత తగ్గెను. దక్షుడు వీరిణియందు అరువది మంది కన్యలను కూడ పుట్టించెను. వారిలో పదముగ్గురు కన్యలను కశ్యపమహర్షికి భృగువున కిరువుర నిచ్చెను. పదిమందిని ధర్మునకు ఇరవైయేడుగురను చంద్రునకు నలుగురిని అరిష్టనేమికి - ఇరువురను కృశాశ్వునకు మరి యిర్వురను అంగిరసునకు నొసంగెను. వారికి కొడుకులు, మనుమలు జనించిరి. వారే దేవదానవులైరి. వారు తమలో తాము వైరము పెంచుకొనిరి.

# సూర్యవంశరాజులు - సుకన్యా వృత్తాంతము

జనమేజయుడు మహానుభావా! సూర్యవంశమున పుట్టిన ధర్మాత్ములగు రాజుల చరిత్ర వినుపింపుమనగా వ్యాసమహర్షి యిట్లు చెప్పెను. పూర్వము విష్ణువు నాభికమలము నుండి బ్రహ్మ జన్మించెను. అతడు ప్రపంచమును సృష్టించుటకు ఘోరమగు తపస్సు నొనర్చెను. అతడు మాతృదేవిని ధ్యానించి గొప్పశక్తిని సంపాదించెను. శుభలక్షణములతో కూడిన మరీచ్యాది మానస పుత్రులను సృష్టించెను. మరీచి కుమారుడు కశ్యపుడు. దక్షుని పదముగ్గురు కుమార్తెలాతని భార్యలు. కశ్యప ప్రజాపతి దేవదానవ యక్ష పన్నగ పశుపక్షులను సృజించెను.

దేవతలందరిలో సూర్యుడు ప్రముఖుడు. అతని పుత్రుడు వైవస్వతమనువు. అతని కుమారుడిక్ష్వాకుడు. వీనికి తొమ్మిదిమంది సోదరులు. నాభాగుడు ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, ప్రాంశుడు, నృగుడు, దిష్టుడు, కరూషుడు, పృషధ్రుడు, అనువారలు. ఇక్ష్వాకునకు నూరుగురు కుమారులు. వారిలో పెద్దవాడు వికుక్షి వైవస్వతమనువునకు మరల తొమ్మిదిమంది జన్మించిరి. నాభాగునకు అంబరీషుడు జన్మించెను. ధృష్టుని కుమారులు ధార్మికులు. వీరు బ్రహ్మభూతులు. శర్యాతికి ఆనర్తుడను కుమారుడు చక్కని సుకన్యయను కన్యయు జన్మించిరి. శర్యాతి తన అంద చందాల కుమార్తెను గ్రుడ్డివాడగు చ్యవనమహర్షి కిచ్చెను. ఆమె ప్రభావముచే చ్యవనునకు కళ్ళు వచ్చినవి. సూర్యుని కుమారులైన అశ్వినీదేవతలు మునికి కంటి చూపు నను(గ్రహించిరి. అనగా జనమేజయుడు రాజు తన అందాల బాలునికి గ్రుడ్డివాని కేల యిచ్చెనో తెలుపుమనగా వ్యాసుడిట్లు చెప్పెను.

వైవస్వతుని పుత్రుడు శర్యాతి. వానికి నాలుగు వేలమంది రాజకన్యలు భార్యలై యుండిరి. శర్యాతి కుమార్తె సుకన్య. రాజధాని సమీపమున నొక సుందరమైన సరోవరము కలదు. అచట ననేక వృక్షములు కలవు. కోకిలు, నెమళ్ళు మనస్సు నాకర్షించుచుండును. అది నిర్జన ప్రదేశమగుట భార్గవుడైన చ్యవనుడు అక్కడ తపస్సు చేయుచుండెను. తనపై పుట్టలు పెరిగినను చలింపక సమాధి యందుండెను. ఒకనాడు శర్యాతి విహారమునకై అచ్చటికి వచ్చెను.

## సుకన్యా వృత్తాంతము

వ్యాసమహర్షి జనమేజయునకు యిట్లు చెప్పుచున్నాడు. పూర్వము భృగు వంశమున పుట్టిన చ్యవనుడనుమహర్షి శాంతుడు అతడు జన రహితమైన ఒకానొక వనమందు ఘోరనియమములతో తపస్సు చేయుచుండెను. ఆ మునీ శ్వరుడు

నీరుకూడ త్రాగక హ్రీంకార స్వరూపిణీయగు పరదేవతను తన హృదయ కమల మందు ధ్యానించుచుండెను. అట్లు నిష్ఠతో నుండగా అతని చుట్టును పైన పెద్దపుట్ట పెరిగెను. ఆ పుట్టనిండ చలి చీమలు వ్యాపించి యుండెను. తనపై పుట్టపెరిగినను కదలకమెదలక అందే కూర్చొనియుండెను.

ఒకనాడు "శర్యాతి" యను సూర్యవంశపు మహారాజు తన యంతఃపుర స్త్రీలతో వనవిహారము చేయుచు అచట నున్న సరస్సువద్దకు వచ్చెను. అందలి నిర్మలమైన నీటిని చూచి తన సుందర స్త్రీలతో ఆ సరస్సునందు క్రీడింపనారంభించెను. అతని కూతురు అందగత్తెయైన సుకన్య అను కన్యకామణి అచట పూలు కోయుచు కేరింతలాడుచుండెను. ఆ పడుచుపిల్ల తనశరీరముపై ఆభరణములు తళతళలాడగా గజ్జెలందియలు ఘల్లుఘల్లుమనగా గంతులు వేయుచు చ్యవన ముని తపస్సు చేయుచున్న పుట్ట వద్దకు వచ్చెను. ఆ చిలిపి పిల్లతోటి పిల్లలతో పుట్టవద్ద కూర్చుండి పుట్ట రంధ్రముల నుండి మిణుగురులను పోలిన మినుకు మినుకుమను వాడి వెలుగులను చూచెను. ఆయువతి యిదేమి వింతయోయని వాడి ముల్లును తీసుకొని దానితో ఆ వెలుగులను తీయుటకు పూనుకొనెను. పుట్ట దగ్గరకు చేరిన ఆ యందాల బొమ్మను చ్యవనముని పుట్టలో నుండియే చూచెను. మహర్షి ఆయువతీ రత్నముతో ఓ కల్యాణీ నీవేమి చేయబోవుచున్నావు? నేనీ పుట్టలో నుండి తపస్సు చేయుచున్నాను. ముల్లుతో పుట్టను పొడువవద్దు. దూరముగా పొమ్ము అని పలుకుచున్నను సుకన్య ఆమాటలు పెడచెవినిబెట్టి ముల్లుతో పుట్టలోని వెలుగులను గ్రుచ్చెను. మరియు అటనుండి చెలికత్తెలతో వెడలిపోయెను. చ్యవనమహర్షి తన కళ్ళలోముల్లు గ్రుచ్చుకొనినందున బాధతో కోపించెను. అతని కోపప్రభావముచే సైనికులకు మంత్రులకు రాజునకును మలమూత్రములు బంధించినవి. రాజు ఈ కష్టమునకు కారణము ఏ మాయని విచారముతో తన సైనికులను గూడి తన ఇంటికి వెళ్ళెను.

రాజు ఇంటికి వెళ్ళి తన సైనికులలో ఎవడేని చేయరాని పనిచేసెనేమో యని తెలిసికొనెను. విచారణ చేయగా అచటనున్న సరోవరమునకు పడమర దిక్కున అడవిలో చ్యవనమహర్షి తపస్సు చేయుచుండెనని వినెను. అతనికెవరో ఏదో అపరాధము చేసియుండవచ్చును. అందువలన అందరికినీకష్టము వాటిల్లిన దనియు ఆ తపశ్శాలి భృగువంశమున జన్మించినవాడు మహాతపశ్శాలి. అట్టి మహర్షి కెవరో మనవారిలో అపరాధము చేసియుందురు. తెలియని వారెవరో ఆ మహర్షి నవమానించి యుందురు. ఈ యనర్థమునకదియే కారణము కావచ్చునని

రాజు మనస్సులో తలచెను. రాజు ప్రశ్నింపగా సైనికులు మనస్సులో బాధ చెందుచు మేము మనోవాక్కాయములతో నేమహర్షికెట్టి యపకారము చేయలేదనిరి. శర్యాతిమహారాజు చింతాక్రాంతుడై తన సైనికులను మంత్రి వర్గమును కోపముతో మంచిమాటలతోడను కారణమడిగెను. ఆ సమయమున సుకన్య దుఃఖించుచున్న తన తండ్రిని చింతించుచున్న మంత్రులను చూచి ముల్లుతో తాను పుట్టను పొడిచిన విషయమును, అయ్యో! "చచ్చితిని" అను మెల్లని స్వర ముతో పుట్టలోపల నుండి వినబడిన మాటలను ముల్లునులాగి చూడగా దానికి రక్తమంటుకొన్న విషయమును తెలియజేసి అందుకు తాను ఆశ్చర్య పడినట్లును చెప్పగా యిది యంతయు విని ఆమునికి జరిగిన అపరాధమునకు ఫలితమే యిది యని ముని చుట్టును పెరిగిన పుట్టవద్దకు వెళ్ళెను. మునిచుట్టును పెరిగిన పుట్టను పగుల గొట్టించి దుఃఖపడుచు వృద్ధుడైన తపశ్శాలియగు చ్యవనుని చూచెను.

## శర్యాతి- చ్యవనుని ప్రార్థించుట - సుకన్యా చ్యవనుల వివాహము

అప్పుడు శర్యాతి చ్యవన మహర్షికి దండ ప్రణామములాచరించి స్తుతించి సవినయముగా నిట్లు మనవి చేసెను. మహాను భావా! నా కుమార్తె బాల్యముచే చిలిపిగా ఆటలాడుచు చేయరానివని చేసినది. ఈ సుక్యను నీచల్లని చూపులతో కనికరించి కాపాడుము. మునివర్యులు నిత్యము శాంతచిత్తులై యుందురని విందుము. కనుక నా బాలికను క్షమింపుడు. అని రాజు దిగులుతో వినయముతో ప్రార్థించుట చూచి చ్యవనమహర్షి అతనికిట్లనియె.

ఓరాజా! నాకెన్నడును కొంచ మైన కోపములేదు. నీ కన్య సుకన్య నన్నంతగా బాధించినది. ఐనను నేను శపించలేదు. రాజా! నేనే తప్పు చేసి యెరుగను. నీ కన్యమూలమున నాకన్నులకింతగ బాధ కలిగినది. ఈ పాప ఫలితముగా నీవు మిక్కిలి దుఃఖము ననుభవించుచున్నావని నాకు తోచుచున్నది. అపరాజితాదేవి శివకుటుంబినియగు శ్రీదేవీ భక్తునకపకారము చేసినవాడు శివునిచేత రక్షింపబడు చున్నవాడైనను సుఖమును పొంద జాలడు. రాజా! నేను ముసలివాడను ఇప్పుడు గ్రుడ్డి వాడనైతిని. ఇక నాబ్రతుకు కటికిచీకటి మయము. ఇప్పుడిక నాకు కావలసిన పరిచర్యలుచేసి నన్ను సుఖింపజేయువారెవరు అని పలికెను.

అప్పుడు రాజిట్లనెను:- ఓ మునిప్రవరా! తపశ్శాలుర కోపము క్షణమాత్ర ముండును. కనుక క్షమింపుము. నాకు చాలమంది సేవకులున్నారు. వారు

నిన్నెల్లపుడు సేవించునట్లు నియమింతును. అనగా చ్యవన మహర్షి యిట్లు పలికెను. ఓ రాజా! ఇది ఏకాంత ప్రదేశము నేనా గ్రుడ్డివాడను. ఇక నా తపస్సెట్లుసాగును? నీ సేవకులు నాకు యిష్టమైన విధముగా ప్రవర్తింతురని యెట్లు నమ్మదగును? రాజా! నన్ను ప్రసన్నునిగా చేసికొన దలచినచో నాయిష్టమును వినుము. నామాట నిలబెట్టుము. కమలనయన యగు నీకుమార్తె సుకన్యను నాకిచ్చి పెండ్లి చేసినచో ఆమె నాకు యెల్లప్పుడు విడువక పరిచర్య చేయగలదు. ఇట్లైనచో నేను తృప్తి చెందు దును. ఆమె సేవలతో నా తపస్సు నిర్విఘ్నముగా సాగగలదు.

రాజేంద్రా! నేను చెప్పినట్లు చేయుము. నేను సంతోషించెదను. ఇందువలన నీకు మిక్కిలి మేలుకలుగగలదు. రాజా! మనస్సులో చక్కగా ఆలోచించు కొని నీ కుమార్తెను నాకు దానము చేయుము. నేను తపస్సు చేసుకొనెడి వాడను నియతవ్రతుడను. ఆమెను నాకిచ్చుటవలన యెట్టి దోషము నీకు సంభవింపదు. అనగా విని శర్యాతి యీముసలివానికి నాపడుచుపిల్ల నిచ్చుట యెట్లు సంభవము? ఆమె యంగీకరించునా! యని చింతా క్రాంతుడై మౌనముతో నుండెను.

ఈతడు కురూపికూడాను. ఇట్టివానికి దేవకన్యవంటి నాపిల్ల నర్పించిన నేనేమి సుఖపడగలను? నా కూతురేమి సుఖపడును? ఎంత పాపాత్ముడై నను మతిహీనుడైనను రాబోవు మంచి చెడులు తెలిసియు తన కుమార్తె సుఖమును బలిచేయ తలంచునా! నా గారాల పిల్ల ఈ ముసలి చీకును పొంది ఏమి సుఖము ననుభవింపగలదు? ఎట్లు కాలముగడుపగలదో? యౌవనమందున్న అందగత్తె తనకన్నింటను ఈడుజోడుగా నున్న భర్తను పొందికూడ తృప్తిపడదు. ఇకనాసుకన్య ఈముసలి గ్రుడ్డివానితో ఏమి సుఖమును పొందగలదు? మంచి అందము యౌవనముగల అహల్య యింద్రునివలన మోసగింపబడెను కదా! కనుక నాకన్య కెన్నికష్టములు కలిగినను సుకన్యను మాత్రమీతనికీయజాలను. అని తలచి రాజు దుఃఖిత మనస్కుడై తన యింటికి మంత్రులరావించి ఆలోచన జరిపి వారితో నిట్లనెను:-

ఓ మంత్రులారా! ఇప్పుడు నాకర్తవ్యమేమి? నాకుమార్తెను ముసలి బ్రాహ్మణున కీయవలయునా? లేక యీ దుఃఖములను భరింప వలయునా? మీరందరాలో చించి నాకు మంచిమార్గము తెలియజేయుడు. మంత్రులిట్లనిరి:- మహారాజా! ఇట్టి దుస్తరమైన దురంతమైన ధర్మ సందేహములకు మేము మాత్రమేమి సమాధానము చెప్పగలము. ఆ ముసలి గ్రుడ్డివానికీ యందాలచిందునీ సుకన్యను చేజేతులనెట్టు లప్పగింప గలము అని పలికిరి.

సుకన్య తన తండ్రియు మంత్రు లును చింతాక్రాంతులగుట గ్రహించి, నవ్వుచు తన తండ్రితో నిట్లుపలికెను. తండ్రీ! నీ వేలచింతించుచుంటివి? నామను గడ గూర్చి నీవింత దుఃఖముతో విచారింపనేల? ఆ మునిపుంగవుని మనస్సునకు నన్ను నేను బాధ కలిగించితిని. కనుక ఆ మునీంద్రుని సమీపమునకు వెళ్ళి అతనిని ప్రసన్నుని చేయగలను. అతని మనస్సునకు నచ్చునట్లు మాట్లాడెదను. ఆమునివర్యునకు నేను అర్పించు కొందును. అని పలికిన కుమార్తె మాటలు వినిరాజు సంతోషించి మంత్రు లందరు వినునట్లు సుకన్యతో నిట్లు పలికెను.

ఓ సుపుత్రీ నీవబలవు. ఆముని గ్రుడ్డివాడు, వృద్ధుడు, ముక్కోపి, నీవు సహనముతోవాని కెట్లు సేవలందీయగలవు? నీవందగత్తెవు నిన్నొక గ్రుడ్డివాని కెట్లప్పగింపగలను? ఆ ముసలి మునితన సుఖము తాను చూచుకొనును. అతనికి నిన్నెట్లు సమర్పిం చగలను? ఏ తండ్రియైన తన పిల్ల కన్ని విధముల ఈడుజోడు కులము బలము గలవానికిచ్చి వివాహము చేయును. ప్రతివ్యక్తియు తన కుమార్తెను ధనధాన్యములు సంపదలు గలవానికే యిచ్చి వివాహము చేయును. కాని నిరుపేదకీయ సంకల్పించడుకదా!

విశాలాక్షీ! నీనిండు గడుసు జవ్వనమెక్కడ? వనమందు నివసించు ముసలి చీకుఎక్కడ? వయసుమీరి సత్తువకోల్పోయిన మునికి నిన్నెటులీయగలను? నా సైనికులు మేము చచ్చిన చత్తుముగాక బాలామణీ! నిన్నొక గ్రుడ్డివానికర్పించుట నాకెంత మాత్రమిష్టముకాదు. కాగలదియేదియో కాక మానదు. ధైర్యముతో నుందును. బాలా! నీవు గుండె నిబ్బరముతో నుండుము. నా రాజ్యము నా శరీరము ఉన్నను పోయిననూ నాకు దిగులు లేదు. నిన్ను మాత్రము ఒక గ్రుడ్డివాని చేతిలోపెట్టను. కన్నులు లేనివానికేవిధముగా నైనను నిన్నీయను.

అను తండ్రి మాటలు విని తనయంతరాత్మ ప్రబోధించిన మాటల నిట్లు పలికెను. తండ్రీ! నన్ను గూర్చి ఇంత ఆలోచింపనేల? నన్నా ఆ మునివర్యునకిపుడు సమర్పించుము. నావలన లోకమునకు మేలుచేకూరుగాక. పరమపావనుడు మహాశక్తిమంతుడునగు మునివర్యుని పరమ సంతోషముతో సేవించగలను. ఆ ఏకాంత ప్రదేశమునందు పరమభక్తితో పతివ్రతా ధర్మముతో చక్కగా ముసలి మునితో మసలుకొందును. తండ్రీ! నాలో విషయభోగవాంఛలేదు. నా మనస్సు నకు విషయ సంకల్ప సంబంధము లేదు. నా మనస్సు ప్రకృతి ప్రశాంతమైనది. అను సుకన్య మంచి మాటలనాలకించి మంత్రులు మిక్కిలి ఆశ్చర్యపడిరి. అపుడు

రాజు చ్యవనమహర్షి సమీపమునకు పరమసంతోషముతో వెళ్ళెను. ఆ తపోధనునకు తలవంచి ప్రణమిల్లిరాజిట్లనెను.

ఓ స్వామీ! నా పుత్రికను నీసేవలకు తప్పక స్వీకరింపుము. అని రాజు వివాహ మంగళ విధానముతో తన కన్య సుకన్యను చ్యవనమహర్షికి ధారాపూర్వకముగా దానమొసర్చెను. చ్యవనముని సుకన్యను స్వీకరించి ప్రసన్నుడాయెను. రాజు కట్నములీయగా మహర్షి వాటిని తాకలేదు. మునీశ్వరుడు సుకన్యను మాత్రమే తన పరిచర్యలకు స్వీకరించెను. అట్లు చ్యవనుడు ప్రసన్నుడుకాగా సైనికులు మొదలగువారు. నిరోధము తొలగి సుఖపడిరి. రాజు తన కన్యను ముని కర్పించి సంతోషముతో తన యింటికి వెళ్ళెను.

సుకన్య తండ్రి మరలి వెళ్ళునప్పుడు తండ్రీ! ఈవిలువైన సొమ్ములు వస్త్రములు తీసికొని వెళ్ళుము. నాకు జింకచర్మము నారచీరలు ఇమ్ము. ముని భార్యకు తగిన వేషము ధరించి నేనీ తపస్వికి సేవలు చేసెదను. తండ్రీ! నీకీర్తి యీ భూమి పైనే కాక స్వర్గ పాతాళములందు కూడ శాశ్వతమై వెలయుగాక. నేను పరలోక సుఖముకొరకే మునివర్యుని రాత్రింబవళ్ళును సేవించెదను. ఈ ముసలి గ్రుడ్డివానికి అందాల జవరాలివగు నన్ను సమర్పించి నందులకు చింతింపకుము. నా సౌశీల్యము చెడునేమోయను ఊహనీకెంత మాత్రము వలదు. అరుంధతి వసిష్ఠునకు ధర్మపత్నియైనట్లు నేనితనికి ధర్మపత్నిగా ప్రవర్తింపగలను.

ఇందుకు నీవు విచారింపవలదు. అత్రికి పత్నియైన అనసూయ పరమసాధ్విగా ప్రసిద్ధినొందినట్లు నేమను యీ మహర్షికి పత్నినై పరమసాధ్విగా లోకములో కీర్తిగడింప గలను. అని ధైర్యము చెప్పెను! ధర్మము తెలిసిన శర్యాతి మహారాజు సుకన్య మాటలను ప్రశంసించి ఆమెకు నారచీరలను జింక చర్మమును తీసికొనుమని యిచ్చెను. ఈ విధముగా మునిభార్య వేషముతో చిరునవ్వు చిందించు ముఖముతో శోభించు కుమార్తెను చూచి రాజు గొల్లుమని యేడ్చెను. రాణులందరు వచ్చి నారచీరలు ధరించిన సుకన్యను చూచి యెలుగెత్తి యేడ్చిరి. వారు దుఃఖముతో పెదవులు తడబడగా పెద్దపెట్టున విచారించిరి. ఈ విధముగా శర్యాతి మహారాజు తన కుమార్తెను చ్యవనమునికి అప్పగింత పెట్టి ముని యనుమతితో మంత్రులు వెంటరాగా తన యింటికి వెళ్ళెను.

## సుకన్య చేసిన పతిసేవ-అశ్వినీ దేవతల మాటలు

శర్యాతి మహారాజు ఇంటికి వెళ్ళిన పిమ్మట సుకన్య ధర్మతత్పరురాలై మునిపతికి తీయని ఫలములను కందమూలములను తెచ్చిపెట్టి సేవ చేయుచు

అగ్నులను సేవించుచుండెను. ఆమె ప్రేమతో తనపతిని పన్నీటితో స్నానము చేయించి జింకచర్మము ధరింపజేసి దర్భాసనముపై కూర్చుండబెట్టును. ఆ పతివ్రత మునివర్యుని సమీపములో నువ్వులు యవధాన్యము దర్భలు కమండలువు నుంచి మునివర్యా! నిత్యానుష్ఠాన మొనరింపుము అని మనవి చేయును. నిత్యానుష్ఠానము పూర్తియైన పిమ్మట సుకన్య తన ప్రియభర్తను చేతులతో లేవదీసి దర్భలపైగాని వేరొక ఆసనముపైగాని కూర్చొనబెట్టును. పిమ్మట ఆ రాజకన్య పండిన పండ్లను మంచి నీవారాన్నమును తీసికొని వచ్చి భర్తకు తినిపించును. తన భర్త పూర్తిగా భోజనము చేసిన పిమ్మట సుకన్య తన ప్రియభర్తను చేతులతో లేవదీసి దర్భలపైగాని వేరొక ఆసనముపైగాని కూర్చుండబెట్టును. చక్కని తాంబూల మందించును.

పిమ్మట భర్త యాజ్ఞతో ఆమె తనపనులు తాను చూచుకొనును. తనపతి తినగా మిగిలినది తాను భుజించి పిమ్మట అతని సమీపమునకు వెళ్ళి ప్రేమ భక్తి ఉట్టిపడునట్లు ప్రభూ! ఏమియాజ్ఞ అని అడుగును. మీయాజ్ఞయైనచో మీ పాదములనొత్తగలనని పలుకుచు సుకన్య నిత్యము పతిసేవాపరాయణయై ప్రఖ్యాతి గడించెను. ముని సాయం కాలము హోమము చేసిన మీదట సుకన్య మునిపతికి తీయని ఫలములను తెచ్చి యిచ్చు చుండును. పిదప మునియను మతితో మిగిలిన ఫలములను తాను భుజించును. ఆ కోమలాంగి తన భర్తను మెత్తని శయ్యపై సుఖ కరముగ పరుండబెట్టును.

తన ప్రియకాంతుడు పరుండి యుండగా కులస్త్రీల యొక్క ధర్మములను గూర్చి యతనినడిగి తెలుసుకొనును. భర్తకు పాదసేవ చేసి యతడు నిద్రించిన పిమ్మట భర్త పాదముల యొద్ద తాను నిద్రించును. ఎండలు మెండుగాకాయు గ్రీష్మకాలమున తన భర్తకు చల్లని విసినికఱ్ఱగాలులతో సేవచేసి సుఖపెట్టుచుండను. హేమంత ఋతువు నందు చిన్నచిన్న పుల్లలు తెచ్చి మంట చేసి యిప్పుడు మీకు వెచ్చగా నున్నదా? యని అడుగుచుండును. తెల్లవారకముందే భర్తనులేపి అతని శౌచక్రియకు నీటిని మట్టిని తెచ్చి యిచ్చుచుండును. అతని శౌచక్రియ పూర్తియైన పిమ్మట అమెతన భర్త చేయి పట్టుకొని తీసుకువచ్చి ఒక శుభాసనము పై కూర్చుండబెట్టి అతని పాదములను చేతులను మట్టితో నీళ్ళ తోడను యథా విధిగా కడుగును.

ఆ రాజకన్య మునిరాజునకు ఆచమనము చేయించి పండ్లు తోముకొనుటకు పుల్లను తెచ్చియిచ్చును. తరువాత ఆమె మునిస్నానము కొరకు వేడినీళ్ళు సిద్ధము

చేసి బ్రాహ్మణోత్తమా! పండ్లు తోముట పూర్తియైనచో వేడినీళ్ళు స్నానము చేయుటకు సిద్ధముగా నున్నవి. సమంత్రకముగా స్నానము చేయవచ్చును. తూర్పు దిశను సంధ్యారాగము వ్యాపించుచున్నది. హోమ సమయము సమీపించి నది. యధావిధిగ హోమము నిర్వర్తించి దేవతార్చన చేయవచ్చు.

అని యీవిధముగా సుకన్య మునిపతిని పతినిగా చేసికొని ప్రశంసింపదగిన నడువడికలదై నిత్యము నియమనిష్ఠలతో భర్తకు ప్రేమతో సేవలు చేయు చుండెను. ఆ పతివ్రత ఈ విధముగ అగ్నులను అతిధులను అభ్యాగతు లను పూజించుచు చ్యవనమహర్షిని సంతోషముగా సేవించు చుండెను.

ఇట్లుండనొకనాడు సూర్యుని పుత్రులగు అశ్వినీ దేవతలు ఇద్దరు చ్యవనముని యాశ్రమము వద్ద స్వేచ్ఛగా విహరించుచుండిరి. స్నానము చేసి తనయాశ్రమునకు వెళ్ళుచున్న సర్వాంగ సుందరియగు సుకన్యను వారిరువురును చూచినారు. దేవకన్యవంటి సౌందర్య రాశియగు సుకన్యను చూచి మోహామధికముకాగా ఆమె వద్దకు వెళ్ళి యిట్లనిరి.

ఓ గజగామినీ! సుందరీ! క్షణమాగుము. మేము దేవతలము. మేమడిగిన ప్రశ్నలకు నిజమైన సమాధానములు పలుకుము. అందమైన కన్నులు కలదానా! నీవెవరి బిడ్డవు? ఎవరి పుత్రికవు? నీభర్తఎవరు? ఒంటరిగా నీవీ చెరువులో స్నానము చేయుట కెందుకు వచ్చితివి? లక్ష్మీదేవికి సాటివచ్చు శోభతో వెలు గొందుచున్నావు. నిన్ను గూర్చి తెలిసికొనదలచినాము. నిజము చెప్పుము. పాదరక్షలు లేకపోవుటచే మెత్తని నీపాదములు కందిపోవుచున్నవి. ఈ కటికనేలపై నీయడుగులు పడుట చూడగా మాగుండెలు బ్రద్దలగుచున్నవి. సుందరీ! నీవు విమానము నెక్కదగిన దానవు. ఈ చిట్టడివిలో నెందులకు పంచరించుచున్నావు? వేలాది దాసీజనముచే కొలువబడదగిన దానవు. నీవు రాజకన్యవో దేవకన్యవో నిజము చెప్పుము.

ఓ పుణ్యాత్మురాలా! నిన్ను కన్నతల్లి ధన్యురాలు నీ తండ్రియు ధన్యుడు. ఇక నిన్ను వివాహమాడిన భర్తయదృష్టమేమని చెప్పుము? నీ పవిత్ర పాదములు తాకుటచే ఈ భూమి శోభించుచున్నది. నీభర్త యెవరో నిజముగా చెప్పుము. వారిని చూడగోరుచున్నాము. అనువారి మాటలు విని సుందరాంగి సుకన్య సిగ్గుతో నేను శర్యాతి మహారాజు కుమార్తెను చ్యవనమహర్షి భార్యను నా తండ్రి నన్నీ మునీశ్వరునికిచ్చి వివాహము చేసినాడు. ఈ మునికి నేను సహధర్మచారిణిని. నా భర్త తపశ్శాలి. వృద్ధుడు గ్రుడ్డి. నేను ప్రేమతో భక్తితోడను నిరంతరము నాభర్తను సేవించుచుందును. మీరెవరు? ఏ పనిమీద వచ్చితిరి? నా భర్త ఆశ్రమ

మందున్నాడు. మీరు అక్కడకు వచ్చి ఆశ్రమమును పావనము చేయుడు. అని వినియముతో పలికెను. అని సుకన్య పలుకగా అశ్వినీ దేవతలిట్లనిరి.

ఓ కల్యాణీ! నీ తండ్రి నిన్నీ మునికి ఎందులకు దానము చేసెను? ఓ సుందరీ! నీవీ వనప్రదేశమున మెరపుతీగవలె వెలుగొందుచున్నావు. దేవతలందుకూడ నీ యంతటి అందగత్తె కనబడలేదు. నీవు దివ్యమాల్యాంబరములు దివ్యాభరణములు ధరింపతగిన దానవు. ఈ నార చీరలు నీకు తగవు. ఓ విశాలాక్షీ! నీవు ముసలివానిని గ్రుడ్డివానిని భర్తగా స్వీకరించి ఈ నట్టడవిలో నెందుకు బాధపడుచున్నావు. అయ్యో! విధివిలాసమెంత విపరీతమైనది! మిసమిస లాడు నిండు యౌవనము పొంగులు వారుచుండ ఆ ముసలివానిని వరించి యేమి సుఖపడుదువు? నవయౌవన మందున్న నిన్ను విధాత గ్రుడ్డివానికి భార్యగా చేసినాడు. నీకితడు తగినవాడు కాడు. ఇంకొకనిని పతిగా వరింపుము. లేనిచో నీ జీవితమంతయు వ్యర్థమేకదా! గ్రుడ్డివాడు భర్త యగుట అరణ్యమున నివసించుట జింకతోలు కట్టుకొనుట యివన్నియు నీకు తగినవికావని తలచుచున్నాము.

ఓ శుభాంగీ! ఈ పండు ముసలి మునిని సేవించిన నీకేమి సుఖము? దోరవయస్సు వ్యర్థము చేయకుము. మాలో ఒకనిని వరింపుము శుభాంగీ! నిన్ను పోషించి రక్షించుట చేతకాని వానిని నీలోని కోర్కెలు తీర్చజాలని వానిని భాగ్యహీనుని మునిని వదలి మా యిరువురిలో నచ్చినవానిని వరింపుము. శుభాంగీ! ఇట్టి ముసలి చీకుతో ఎట్లుకాలము గడుపగలవు? నీవు సుందరనందవనమందు చైత్రరథము నందును స్వేచ్ఛగా విహరింపుము. నీవు రాజకన్యవు. శుభ లక్షణములు కలదానవు. ఈ వనమందు తగినజంటలేక ప్రొద్దెట్లు గడుచును? ముసలి మునిని వదలి మాలో ఒక్కనిని వరించి స్వర్గ సుఖములననుభవింపుము. ఈ గ్రుడ్డివానితో ముసలివానితో ఈ అడవియందు నీకేమి సుఖము కలుగును? నీ పడుచు తనమెక్కడ? ఈ గ్రుడ్డి వృద్ధుడెక్కడ? దుఃఖములు నీకిష్టమాఏమి?

అశ్వినిదేవతల మాటలు విని మితభాషిణియైన సుకన్యవణుకుచు ధైర్యము పూని వారితో ఇట్లు చెప్పెను:- రవిపుత్రులు, సర్వజ్ఞులు దేవప్రియులునగు మీరు ధర్మశీల కులసతినగునన్నిట్లు మాట్లాడదగునా? సురశ్రేష్ఠులారా! నా తండ్రి నన్ను యోగనిష్ఠుడగు మునివర్యునకు దానము చేసెను. అట్టి నేను సామాన్యకులటా మార్గము నెట్లనుసరింపగలను? సూర్యుడు-కర్మసాక్షి-సర్వలోక చక్షువు కశ్యపసుతుడు. అతనికి కుమారులైన మీరిట్లు పలుకుట సమంజసము కాదు. ఒక కులకన్య తన ప్రాణనాథుని విడిచిపెట్టి పరపురుషునెట్లు చేరగలదు? ఈ

సంసారము సారహీనము మీరు సూక్ష్మధర్మము నిర్ణయింపగలరు. పుణ్యాత్ములారా! నేను శర్యాతి మహారాజు పుత్రికను. సుకన్యను పతిభక్తి పరాయణను మీరిక స్వేచ్ఛగా వెళ్ళవచ్చు. లేనిచో మిమ్ము శపించెదను. అనే సుకన్య మాటలు విని అశ్విదేవతలు ఆశ్చర్యములో మునిగిరి.

# చ్యవనుడు యువకుడగుట-
# సుకన్య శ్రీదేవిని స్తుతించుట

వారు మునివలన భయము నూహించి సుకన్యతో ఇట్లనిరి. ఓ రాజపుత్రీ! నీ పాతివ్రత్య ధర్మమునకు ప్రసన్నులమైతిమి. నీ శుభము గోరివరము నీయదలచితిమి కోరుకొనుము. సుశీలా! మేము దేవవైద్యు లము. నీ పతిని నవయువకునిగా అందగాడుగా చేయగలము. మేము ముప్వురము సమానముగా వయోరూప దేహములు కలవారనుగుదుము. మాలో ఒక్కని పతిగా వరింపుము. అనువారి మాటలువిని సుకన్య విస్మయమంది తన భర్తవద్దకు వెళ్ళి అతనితో వారు పలికిన విచిత్ర వాక్కుల నిట్లు చెప్పెను:-

ఓ భృగునందనా! మీ యాశ్రమసమీపమున సూర్య పుత్రులు తేజః స్వరూపులై వచ్చియున్నారు. నేను వారిని చూచితిని. వారిరువు రును నాసౌందర్యముచూచి కామపరవశులైరి. నీ పతిని నవయువకునిగా చేయుదు మని మాటయిచ్చినారు. నీ ముసలిపతికి చూపు వచ్చునట్లు చేసెదము. దివ్య దృఢ శరీరుని చేసెదమని చెప్పి నీవు మేము చెప్పిన నియమమును పాటింప వలెననిరి. అది యేమనగా "మేము నీ పతికి మాతో సమానమైన రూపము వయస్సు శరీరము నొసంగుదుము. అప్పుడు మా ముగ్గురిలో ఒక్కని పతిగా వరింపుము" అని సాధుపుంగవా! వారి మాటలు విని యీ అద్భుతవిషయము నీకు చెప్పుటకు తమవద్దకు వచ్చితిని. ఈ క్లిష్టపరిస్థితిలో నేనేమి చేయవలయునో తెలియజెప్పుము. సర్వజ్ఞా దేవతల మాయ తెలియ శక్యముకానిది. వారికపటము నెరుగని దానను. కనుక నీవు చెప్పినట్లు చేసి నీకోర్కె తీర్చెదను. ఆజ్ఞాపింపుము. అని యడిగెను!

అనగా చ్యవనముని యిట్లనియె:- సాధుశీలా! కాంతా! నీవిప్పుడు శీఘ్రమే వెళ్ళి నామాటగా దేవవైద్యులగు సూర్యపుత్రుల నిచ్చటకు తీసికొని రమ్ము. వెంటనే వారి మాట పాటింపుము. దీనికి విచారింప వలదు. అని ధైర్యము చెప్పెను. పతి యనుమతి నొంది. సుకన్య వారివద్దకు వెళ్ళి ఓ యశ్వినీ కుమారులారా! మీరు దేవతలలో గొప్పవారు. నేను మీ నియమము పాటింప గలను అని చెప్పెను. ఆ

మాటలు విని అశ్వినులు ముని సమీపము నకు వెళ్లి యిట్లు పలికిరి. ఓ రాజకన్యా! ఇప్పుడు నీ భర్త నీటిలో మునుగవలెను. అప్పుడతనికి చక్కని రూపము యౌవనము ప్రాప్తించును. అని అశ్వినులు పలుకగనే చ్యవనముని నీటిలో మునిగెను. ఆ సరస్సు నుండి ముగ్గురు దివ్యపురుషులు బయలువెడలిరి. ఆ ముగ్గురును దివ్య దేహము కలవారు. నవయువకులు దివ్యకుండలమండితులు సమాన రూపావయవ ములు కలవారును. అప్పుడు వారుముగ్గురు నొకే కంఠముతో పద్మముఖీ! మాలో నీకిష్టుడైన వానినొక్కని పతిగా వరింపుము. నీకు మేలగుగాక. మాలో నీకెవని యెందెక్కువ ప్రేమ కలదో అతనినే వరింపుము అని పలికిరి. అప్పుడు సుకన్య సమాన వయోరూపములు గలవారిని చూచి వారిలో తన భర్తను గుర్తింప లేక వ్యాకులచిత్తయై యిట్లు చింతించెను. ఇప్పుడేమి చేయుదును? ఎవరిని వరింప వలెనో తోచుటలేదు. నేను నాపతిని తప్ప వేరొకనిని వరింపను. అని విచారించిన సుకన్య విశ్వేశ్వరి పరదేవతయగు భగవతిని ధ్యానించి యీ విధముగా స్తుతించెను.

శ్లో॥ శరణంత్వాం ప్రసన్నాస్మి మాతః పరమదుఃఖితా ।
రక్షమేఽద్య సతీధర్మం నమామిచరణేతవ ॥
నమః పద్మోద్భవే! దేవి! నమశ్శంకరవల్లభే ।
విష్ణుప్రియే నమోలక్ష్మి వేదమాతస్సరస్వతి ॥
ఇదంజగత్త్వయా సృష్టం సర్వం స్థావరజంగమమ్ ।
పాసిత్వమిద మవ్యగ్రాతథాత్సి త్వం తుశాన్తయే ॥
బ్రహ్మ విష్ణు మహేశానాం జననీత్వం సుసమ్మతా ।
బుద్ధిదాసి త్వ మజ్ఞానాం జ్ఞానినాం మోక్షదాసదా ॥
ఆజ్ఞాత్వం ప్రకృతిః పూర్ణాపురుష ప్రియదర్శనా ।
భుక్తిముక్తి ప్రదాసి త్వం ప్రాణినాం విశదాత్మనామ్ ॥
అజ్ఞానాం దుఃఖదాకామం సత్వానాం సుఖసాధనా ।
పతిందర్శయ సర్వజ్ఞే విదిత్వామే సతీవ్రతమ్॥
ఏవం స్తుతాతదా దేవీ తథా త్రిపురసుందరీ ।
హృదయేస్యాస్తదాజ్ఞానంద దావాశు సుఖోదయమ్ ॥
నిశ్చిత్య మనసాతుల్య వయోరూప ధరాన్ సతీ ।
ప్రసమీక్ష్యతు తాన్సర్వాన్వవ్రే చాలా స్వకంపతిమ్ ॥

**స్తోత్రభావము:-** ఓ జగన్మాతా! నేను దుఃఖార్తనై నిన్ను శరణు వేడుచున్నాను. నీ పాదపద్మములకు మ్రొక్కుచున్నాను. నాపాతివ్రత్యమును నిలబెట్టుము. ఓం హ్రీం

కార్తకమలాలయా! దేవీ! నీకు నమస్కారము. ఓ హరిప్రియా! లక్ష్మీదేవీ! వేద మాతా! సరస్వతీ! ఈ చరాచరప్రపంచమంతయు నీచే సృష్టింపబడినది. నీవు లోకములను రక్షింతువు. శాంతికైలోకములను సంహరించెదవు. తల్లీ నీవు బ్రహ్మా విష్ణు మహేశ్వరులకు తల్లివిగదా! అజ్ఞానులకు బుద్ధిని సుజ్ఞానులకు ముక్తిని నీవు ప్రసాదించెదవు. నీవు పరప్రకృతివి. పురుషులకు ప్రియదర్శినివి. నీవు జ్ఞానులందరకును ముక్తిని ప్రసాదింతువు. అజ్ఞానులకు దుఃఖమును కలిగింతువు. ప్రాణులకు సుఖమును కలిగించుటయే నీపని. ఓ యమ్మా! యోగులకు సిద్ధిదాయి నివి. జయదాయినివి కీర్తిదాయినివి. నేనిప్పుడు విశ్వాసముతో నిన్ను శరణు వేడు చున్నాను. ఓ మాతా! నేనిపుడు దుఃఖ సముద్రమున మునిగి యున్నాను. దేవతల మోసమునకు గురియైతివి. వీరిలో నెవరిని వరింప వలెనో తోచుటలేదు. నాపతి దేవుని నాకు చూపింపుమమ్మా దేవీ! నీవు సర్వజ్ఞురాలవు నా పాతివ్రత్యము నీకు తెలుయును. నా పతినెరిగింప జేయుము.

అని సుకన్య త్రిపురసుందరీదేవిని ప్రస్తుతించెను. సుకన్య హృదయము చ్యవన మునిని గుర్తించునట్లు దేవిజ్ఞాన నేత్రమునొసంగెను. సమానమైన రూప యౌవనములుగల ఆముువ్వురిలో తన పతి యెవరో గుర్తింపగలిగెను. ఆ విధముగా సుకన్య తన పతిని గుర్తించగలిగి నందులకు దేవతలు సంతోషించిరి. ఆ దేవత లును దేవి యనుగ్రహముచే ప్రసన్నులైరి. సుకన్య పరమ పాతివ్రత్యము నకు ప్రసన్నులై దేవతలు వరముల నిచ్చిరి. దేవతలు మునిని వీడ్కొని వెళ్ళుటకు సిద్ధముగా నుండిరి. అప్పుడు చక్కని చూపును సుందరదేహమును యువశక్తిని భార్యను పొంది చ్యవనమహర్షి దేవవైద్యులకిట్లనెను:-

ఓ యశ్వినులారా! మీ యిరువురి వలన నేను మహోపకారమును పొందితిని. సౌందర్యవతి యగు భార్యను పొందికూడ నేను సుఖపడలేకపోతిని. నాకు కంటి చూపును సౌందర్యమును దేహదార్ఢ్యమును మీరు ఇచ్చినారు. మీకు నేను ప్రత్యుప కారమును చేయుదలచితిని. ప్రత్యుపకారము చేయకపోవుట మహాదోషము. ఆ కృతఘ్నుని జన్మము వ్యర్థము. కనుక కోరికను తీర్చదలచియున్నాను. మీ మనో వాంఛ తెలియజేయుడు. అనగా వారు తమలో తామాలోచించుకొనిరి. మహర్షితో నిట్లనిరి. మాతండ్రి దయవలన మా కోరికలన్నియు తీరినవి. కాని దేవవైద్యులమగు మాకు సోమపానము చేయవలెనను కోరికయున్నది. పూర్వము బ్రహ్మ చేసిన యాగములో ఇంద్రుడు వైద్యులమగుటచే దేవతలతోపాటు సోమపానము తగదని నివారించెను. కనుక ధర్మజ్ఞా! నీకు శక్తియున్నచో మాకు సోమపానము చేయు

నవకాశము కలిగింపగోరు చున్నాము. ఈ పని నెరవేర్పుము/మాకు సోమపానము చేయవలెనను ఆసక్తి అత్యధికముగానున్నది. నీవు మాయాశతీర్పగలదిట్టవు. అనగానే చ్యవన మహర్షి దేవేంద్రుని యెదుట మీరు సోమపానము చేయునట్లు నిర్వహింపగలను. నిజము మాట్లాడుచున్నాను,నామాట నమ్మండు శర్యాతి మహారాజు గొప్ప తేజస్వంతుడు. అతని యజ్ఞములో మీ కోరికతీరగలదు. అని పలుకగా సంతోషముతో అశ్వినులు స్వర్గమునకు వెళ్ళిరి. తరువాత చ్యవన ముని తన భార్యను తీసికొని తన యాశ్రమమును చేరెను.

# శర్యాతిని చ్యవనుని చూడవచ్చుట

జనమేజయుడు కోరగా వేదవ్యాసుడు చ్యవనమహర్షి పరమాద్భుత చరిత్ర నిట్లు చెప్పెను:- శర్యాతి మహారాజు యజ్ఞము చేయగా దాని యందు చ్యవన ముని సుకన్యా సుందరితో ప్రసన్నుడై విహరించెను. ఎట్లనగా ఒకనాడు రాత్రి శర్యాతి భార్య చింతాక్రాంత మనస్సుతో వణకుచు తనభర్తతో నిట్లనెను:- రాజా! మన కుమార్తె సుకన్య అడవిలోనున్న గ్రుడ్డి మునికి భార్యయై చచ్చెనా బ్రతికియున్నదో తెలియుటలేదు. ఆ మున్యా శ్రమమున కొకమారు సగౌరవ ముగా వెళ్ళి చూచివచ్చెదము. అటువంటి భర్తతో మన సుకన్య యేమి చేయుచున్న దోకదా! ఆమె లోలోనక్రుంగి కృశించుచుండవచ్చును. ఓ రాజర్షీ తపస్సుచే క్షీణించిన కుమార్తెను నా వద్దకు తీసుకొనిరమ్ము. నా కుమార్తె గ్రుడ్డి ముసలి పతిని చేపట్టి నారచీరలు కట్టి మిక్కిలి కృశించియుండును. ఆమెను తప్పక చూడవలయును అని పలుకగా శర్యాతి యిట్లనెను.

ఓ విశాలాక్షీ! మన సుకన్యను మునిపుంగవుని చూచుటకిప్పుడే వెళ్ళుదునని దుఃఖించుచున్న భార్యనోదార్చి రథమెక్కి వేగమే మున్యాశ్రమమునకు వెళ్ళెను. అచట ఆశ్రమమందు నవయౌవన సంపన్నుడు దేవకుమార సమానుడైన ముని వర్యుని చూచెను. దేవసమానుడైన మునిని చూచి నా పుత్రిక యెంతలోకనింద్య మైన పనిచేసినది? అని రాజు తలచెను. ఈమె మన్మథబాధకు తట్టుకొనలేక వృద్ధుడు గ్రుడ్డియైన భర్తను చంపి వేరొకని పతిగా చేసికొన్నది. నిండు పరువమున మన్మథార్తిని సహించుట శక్యముకానిది. ఈమె మూలమున మా మను వంశము నకు తీరనిమచ్చ యేర్పడినది. ఎవని కూతురు చెడ్డదో అతని జీవితము వ్యర్థము. సర్వపాపముల దుఃఖము లనుభవించుటకే ప్రాణులకు కుమార్తె జన్మించును. నేను నాస్వార్థము కొరకు ఎంతటి తగనిపని చేసితిని! అయ్యో ఒక ముసలి చీకునకు నా ప్రియమైన కుమార్తె నంటగట్టితినే? తండ్రి తన కుమార్తెను తగినవానికే దానము

చేయువలయును. నేను చేసిన పనికి తగిన ఫలమనుభవించితిని. ఇప్పుడు చెడునడువడిగల నాపిల్లను చంపినచో తీరని స్త్రీ హత్యాదోషము నాకు ప్రాప్తించును. మనువంశమెంతయో ప్రసిద్ది నొందినది. అది నేటికి నావలన కళంకముతో కూడిన దయ్యెను. లోకాపవాదము బలవత్తరమైనది. స్నేహ బంధములు తెంపరానివి అని విచారించెను. ఇట్లు రాజు చింతా సముద్రమున మునిగియేమి చేయుటకును తోచక యుండెను.

అంతలో చింతించుచున్న తండ్రిని సుకన్య చూచినది. ఆమె అతని వద్దకు వెళ్ళి ప్రేమతో నిండిన మనస్సుతో ఇట్లు ప్రశ్నించెను. ఓరాజా! సుందరుడు నవయువకుడగు మునివర్యుని చూచి విచారించుచున్నా వేమి? రాజశ్రేష్ఠా విచారింపకుము. రమ్ము నా పతికిప్పుడు నమస్కరిం పుము. అని పలుకుచున్న కూతురి మాటలకు కోపించి శర్యాతి యిట్లనెను.

పుత్రీ! గ్రుడ్డి ముసలి ముని యెక్కడ? ఈ మదోన్మత్తుడగు యువకు డెక్కడ? పాపాత్మురాలా! మునిని చంపి కామబాధచే నీ నవయువకుని భర్తగా చేపట్టితివి. ఈ ఆశ్రమమందలి మునికనబడక చింతాక్రాంతుడ నైతిని. నీవెంత చెడుపని చేసితివి? కులటకు తగిన పనిచేసితివి. ఓసి దుష్టురాలా! నీవలన నేనిప్పుడు దుఃఖసముద్రములో మునిగితిని. అని పలుకగా నవ్వి అతనిని సాదరముగా తనభర్తవద్దకు తీసుకు వచ్చెను.

మరియు ఓ తండ్రీ! ఇతడే చ్యవనముని. ఇతడే నీయల్లుడు. అశ్వినుల దయవలన ఇట్లు మనోహరమూర్తియై నీయల్లుడు ప్రకాశించుచున్నాడు. నా మాటనమ్ముము. అశ్వినులు తమంత తామే యీ యాశ్రమమునకు వచ్చిరి. వారిదయవలన చ్యవనముని యిట్లు తయారయినాడు. తండ్రీ! నేను నీకూతురను. పాపాత్మురాలనుకాను. నీవతని మోహనరూపమునకు ముగ్ధుడవై నన్ను పాపము చేసిన దానిగా తలచుచున్నావు. తండ్రీ! నీవీ భార్గవుడగు చ్యవనమునికి నమస్క రింపుము. నీవడిగినచో ఇతడు విపులముగా జరిగిన సమస్త విషయమును నీకు తెలియజేయుగలడు అనెను. అప్పుడు శర్యాతి వెంటనే ముని వద్దకు వెళ్ళి గౌరవ పూర్వకముగా అతనికి నమస్కరించియిట్లనెను.

ఓ భార్గవా! జరిగిన వృత్తాంతమంతయు వివరింపుము నీకు మరల కన్నులెట్లు వచ్చినవి? నీముసలితనము ఏమయ్యెను? ఓ బ్రాహ్మణోత్తమా! నీ సుందరరూప మును చూచినంతనే నాకు సంశయము కలుగుచున్నది. విషయము తెలిపినచో విని యానందింతును. అనగా చ్యవనమహర్షి యిట్లు పలకెను. ఓ రాజా అశ్వినీ

దేవతలిక్కడకు వచ్చిరి. వారు దేవవైద్యులు. నాకు దయతో వారు మహోప కారము చేసినారు. నీవు చేయు యజ్ఞములో వారికి సోమపానము లభించు నట్లు చేసి ప్రత్యుపకారమొనర్చినవాడనగుదునని వరమిచ్చితిని. మహారాజా! ఇట్లు వారివలన నాకు చక్కని వయస్సు చూపును సంభవించినవి. ఇక మీరు నిశ్చింతగా ఉండుడు. సుఖాసనమున కూర్చుండుడు అని పలుకగా రాజు వాని భార్యయు సుఖముగా కూర్చుండిరి.

పిమ్మట భార్గవుడు రాజా! నీచే యజ్ఞము చేయింతును యాగద్రవ్యములు సమకూర్చు కొనుము. అశ్వినులకు సోమపానము లభింపచేతు నని వరమిచ్చితిని గదా! అది నీయాగముననే జరుగవలెను. రాజేంద్రా! ఇంద్రుడు తేజోబలముచే కన్నుమిన్నుకానకున్నాడు నేనతనిని అడ్డుకొనగలను. నీ సోమ యాగమున వారిచే సోమరసము త్రాగింతును అని ప్రోత్సహించెను. అప్పుడు శర్యాతి సంతోషించి చ్యవనుని మాటకు ఒప్పుకొనెను. రాజు చ్యవన మహర్షిని సమ్మానించి సంతో షముతో మునిని కుశలప్రశ్నములు చేసి భార్యతో కూడ తన నగరమునకు వెళ్ళెను.

## శర్యాతి యజ్ఞము - అశ్వినీ దేవతలకు హవిర్భాగము నిచ్చుట

సకలసంపత్సమృద్ధి గల శర్యాతి మహారాజు ఒక శుభదినమున యజ్ఞమునకు తగిన స్థలమును సిద్ధము చేసెను. చ్యవనుడు వసిష్ఠుడు మొదలగు మునుల నాహ్వానించి రాజుచే యజ్ఞము నాచరింపచేసెను. యజ్ఞము ప్రారంభము కాగా దేవతలు సోమపానమునకు ఇంద్రునితో సహ విచ్చేసిరి. అశ్వినీదేవతలు కూడ వచ్చుట చూచి దేవేంద్రుడు వీరు కూడ ఎందుకు వచ్చిరి. దేవవైద్యులు సోమపానమునకు తగరు. వీరినెవరు రమ్మనిరి? అనినెను. దేవతలు మాటడలేదు. అప్పుడు చ్యవనముని అశ్వినీ దేవతలకిచ్చుటకై సోమరసము చేతితో పట్టుకొనగా దేవేంద్రుడడ్డుపడి వారికీ యవలదని నివారించెను.

అప్పుడు సూర్యపుత్రులగు వీరు సోమపానమునకు యెట్లు తగరో చెప్పుమని చ్యవను డింద్రుని ప్రశ్నించెను. వీరు సంకర జన్మకలవారు కారు. సూర్యునకు తన ధర్మపత్నియందు జన్మించినవారు. ఏ దోషముచే వారు సోమపానమున కర్హులుకారో తెలుపుము. దేవేంద్రా! ఈ విషయము గూర్చి దేవతలతో ఆలోచిం పుము. నేను వీరిచే సోమము త్రాగింతునని మాట యిచ్చియున్నాను. అందుచే శర్యాతి మహారాజును యజ్ఞము చేయుమని ప్రేరే పించితిని. నేనన్నమాట సత్యమని

నిరూపించగలను. ఇంద్రా! వీరునాకు నవయౌవనమిచ్చిరి. అందుకు ప్రత్యుప కారముగా సోమపానము చేయింతుని ప్రతిజ్ఞ చేసితిని. అనగా ఇంద్రుడు వీరు దేవవైద్యులు దేవతలచే నిందింపబడినవారు. వీరిరువురును సోమరస పానమున కర్హులుకారు. వారికి సోమమీయవద్దు అనగా చ్యవన మునియిట్లనెను. ఇంద్రా! పనికి మాలినకోపమును వదలి పెట్టుము. సూర్యపుత్రు లెందుకు అర్హులుకారు? అని మాట్లాడగా పెద్ద వివాదము చెలరేగెను. ఎవరును మాట్లాడలేదు. భార్గవుడు మాత్రము తపో బలముతో వారికి సోమమునీయబూనెను.

వెంటనే దేవేంద్రుడు ఓ బ్రాహ్మణాధమా! నీవు వీరిచే సోమపానము చేయించినచో విశ్వరూపుని చంపినట్లు నిన్ను చంపగలను. అనగా చ్యవనుడు దేవేంద్రా! ఆ మహాత్ములు నాకు రూపసంపదను, దృష్టిని గూడ ప్రసాదించినారు వీరినవమానింపకుము. నన్ను రెండవ దేవునిగా మార్చినారు. వీరిని దేవతలుగా గుర్తించి సోమ పానమునకు అనుమతింపుము అనా పలికెను. అదివిని దేవేంద్రుడు మందమతీ! వీరిద్దరును వైద్యులు. సోమపానమునకనర్హులు. ఒకవేళ నామాట లెక్కచేయక నీవు వారికి సోమమిచ్చినచో నీ తలతెగనరికెదను అని పలికెను.

అనగా చ్యవనుడు కోపముతో అశ్వినులకు సోమము యథావిధిగా నీయబూనెను. ఇంద్రుడు కోపముతో తన వజ్రాయుధమును మునిపై విసిరెను. చ్యవనమహర్షి తన తపోమహిమచే ఇంద్రుని వజ్రాయుధమును స్తంభింపజేసెను. పిమ్మట మునివర్యుడు దేవేంద్రుని చంపదలచి 'కృత్య'కొరకు మారణ మంత్రము లతో హోమమును చేసెను. చ్యవనుని తపోబలముచే "కృత్య" జన్మించెను. దాని వలన మహాబలము గొప్ప శరీరము గల క్రూర రాక్షసుడు బయలుదేరెను. అతని పేరు మదాసురుడు.

అతడు ప్రాణులకు భయంకరుడు. అతని శరీరము పర్వతమంతగానున్నది. వాని శరీరము నల్లగా కాటుకకొండవలె నుండెను. అతనివాడియగు కోరలు మిక్కిలి భయంకరములు. చూపులు క్రూరములు భయంకరములు. నాలుక మరీభీ కరము. అతని శరీరమతి కఠినము కన్నులు దావాగ్నుల వలెనుండెను. అతనిని చూడగనే దేవతలందరు భయముతో వణికిపోయిరి. ఇంద్రుడే భయపడి యుద్ధము మాట మరచిపోయెను. ఆరాక్షసుడు తన పెద్ద నోటితో వజ్రాయుధమును పట్టుకొని ఘోరమైన చూపులతో ముల్లోకములను వ్యాపించునట్లుండెను. మరియు అతడు కోపముతో ఇంద్రుని మ్రింగబోయెను. అయ్యో చచ్చితిమని దేవతలందరొక్క పెట్టున దుఃఖించిరి. దేవేంద్రుని భుజములు స్తంభించిపోయి నవి. ఏ అస్త్రమును

ప్రయోగించుటకైనను అసమర్థుడయ్యెను. దేవేంద్రుడు కాలాంతకుడగు రాక్షసుని చూచి యేమి చేయుటకును తోచక సమయకోవిదుడగు బృహస్పతిని తలచుకొనెను. బృహస్పతి స్మరించినంతనే ఇంద్రునివద్దకు వచ్చెను. గురుడు ఆలోచించి యీ రాక్షసుడు మహామంత్రములకుగాని వజ్రాయుధమునకుగాని సాధ్యుడు కాడని యింద్రునకు తెలియజేసెను. మహాబల వంతుడగు నీరాక్షసుడు చ్యవనమహర్షి తపోబలమున యజ్ఞకుండమునుండి పుట్టినాడు. దేవరాజా! ఇపుడీ రాక్షసుని దేవతలుగాని నీవుగాని నేనుగాని నివారింపలేము. చ్యవనుడు తన "కృత్య"ను తానే నివారింపగలడు. అని గురుడు పలుక దేవేంద్రుడు చ్యవనముని వద్దకు వెళ్ళి భయవినయములతో తలవంచి నమస్కరించి యిట్లు పలికెను. మునివర్యా! సర్వజ్ఞా! నాతప్పు క్షమించుము. నన్ను చంపవచ్చుచున్న రాక్షసుని నివారింపుము. ప్రసన్నుడవగుము. నీ మాటలు చెల్లింతుము.

భార్గవా! బ్రాహ్మణోత్తమా! ఈనాటి నుండి యశ్వినులు సోమ పానమున కర్హులు. నా మాట నిజము. నాయెడ దయజూపుము. తపోధనా! ధర్మజ్ఞా! నీ ప్రయత్నము వ్యర్థముకాదు. అశ్వినులు నీవలన నిరంతము సోమపానము చేయువారగుదురు. ఈశర్యాతి మహారాజు కీర్తియు శాశ్వతమగును. ముని సత్తమా! నేను చేసిన పనియంతయు నీ తపోవీర్యము వెలువరికి వెల్లడించుట కొఱకే బ్రాహ్మణవర్యా! మదాసురుని ఉపసంహరింపుము. మమ్ము కనికరింపుము. దేవతలకెల్లరకు మేలు చేకూర్చుము అని ప్రార్థించెను.

దేవపతి మాటలు విని చ్యవనమహర్షి తన కోపమును విడిచిపెట్టెను. మదాసురుని, స్త్రీలు త్రాగుడు జూదము వేట యనునీ నాల్గు స్థలములనుండునట్లు నియమించెను. మరియు సర్వధర్మాత్ముడగు భార్గవుడు పవిత్రమైన సోమమును దేవేంద్రునిచేత అశ్వినుల చేతను త్రాగించెను. అప్పటినుండి ఆ సరస్సు యూప స్తంభములతో విలసిల్లెను. చ్యవన మున్యాశ్రమము భూమిపై ప్రఖ్యాతి నొందెను. శర్యాతి చ్యవనుని మహిమకు సంతోషించి యజ్ఞము పూర్తిజేసి మంత్రులతో కలిసి తన నగరమునకు వెళ్ళెను. శర్యాతి ప్రతాపముతో ధర్మముతో రాజ్యమేలెను. అని వ్యాసమహర్షి జనమేజయునకు వివరించెను.

జనమేజయునకు వ్యాస మహర్షి భువనకోశము దానివ్యవస్థ, వరాహమూర్తి భూమిని జలమునుండి ఉద్ధరించిన విధమును, అతలాది లోకములను-కర్మగతి-విపాకమును - శ్రీదేవీ పూజా విధానమును - అందువలన కలుగు వివిధ ఫలములను వివరించెను.

# రైవతమను వృత్తాంతము

రేవతుడను రాజు రేవతితో బ్రహ్మలోకమునకు వెళ్ళుట యాశ్చర్యకరముగ నున్నది. ఇది యెట్లు సంభవనో తెలుపుగోరుచున్నానని జనమేజయుడు వ్యాసునడుగగా నాతడిట్లు చెప్పెను. రాజా! సుమేరుపర్వత శిఖరములందు సర్వలోకములు కలవు. పూర్వమర్జునుడు దేవేంద్రుని నగరమున ఐదు సంవత్సరములు నివసించెను. అర్జునుడు మానవ శరీరముతోడనే యింద్రుని సన్నిధిలో నుండెను. ఇట్లే మహాభిషుడను రాజు బ్రహ్మలోకమున కేగెను. విజ్ఞులైనవారు మానవులు కూడ ఎల్ల లోకములకేగ వచ్చును. బ్రహ్మలోకమునకు వెళ్ళి రేవతుడేమి చేసెనవగా వ్యాసుడిట్లు చెప్పదొడగెను. రేవతుడు తన కుమార్తెకు తగిన వరుని తెలిసి కొనుటకు బ్రహ్మలోకమునకు వెళ్ళెను.

అచట గానసభ జరుగుచుండెను. అది పూర్తికాగా బ్రహ్మకు నమస్కరించి ఓ దేవపతీ! ఈమె నా కుమార్తె. ఈమెకు తగిన వరుని తెలుపుము. ఎందరో రాజపుత్రులు కలరుగాని నాకు ఒక్కడును నచ్చలేదు. నిన్న డుగుటకు వచ్చితి ననెను. నీవిక్కడకు వచ్చి చాలకాలమగుటచే అప్పటి వారందరు కాలగర్భములో కలిసి పోయిరి. నీవంశజులు చనిపోయిరి. నీ పట్టణము దానవుల చేతికి చిక్కినది. అచట చంద్రవంశపు రాజు పరిపాలించుచున్నాడు. అతడు యయాతి వంశజుడు. మధురానగరాధిపతి ఉగ్రసేనుడను పేరుగాంచెను.

శ్రీకృష్ణుడు మధురను విడిచి ద్వారకలోనున్నాడు. యాదవులనందరను ద్వారకలో నివసింపజేసెను. శ్రీకృష్ణుడు తన బంధువులతో నక్కడ నివసించుచున్నాడు. కృష్ణుని అన్న బలరాముడు ఆతడు శేషాంశచే జన్మించెను. హలాయుధుడు, ముసలాయుధుడు వీరుడు. ఆతడు నీ కుమార్తె కన్నివిధముల తగినవరుడు. అతనికి నీ కన్యనిచ్చి వివాహము జరిపించుము. తరువాత నీవు బదరికాశ్రమమున తపస్సు చేయుము. అని పలుకగా రాజు తన కుమార్తెను బలరామునికిచ్చి వివాహము జరిపి తపస్సు చేసికొనుటకు వెళ్ళెను. వైవస్వతమనువు తుమ్ముననుండి ఇక్ష్వాకుమహారాజు పుట్టెను. అతడు సూర్యవంశ దీపకుడు. అతడు నిరంతరము శ్రీదేవిని ధ్యానించి తపమొనర్చెను. అతనికి నూర్గురు కొడుకులు. వారిలో వికుక్షి జ్యేష్ఠుడు. ఇక్ష్వాకుడ అయోధ్యరాజధానిగా పాలించెను. అతనికి శకుని మొదలుగా గల ఏబదిమంది కొడుకులు పుట్టిరి. వారిలో కొందరిని ఉత్తరాపథమునకు మరి కొందరిని దక్షిణాపథకమునకు రాజులుగా చేసెను. ఏబదిమంది కొడుకులలో ఇద్దరిని తన సేవకు ఉంచుకొని తక్కినవారిని రాజులుగా చేసెను.

# సూర్య వంశరాజ వృత్తాంతము

ఒకానొకప్పుడు అష్టకాశ్రాద్ధము జరుపుటకు వికుక్షిని మాంసము తెమ్మని ఇక్ష్వాకుడాజ్ఞాపించెను. అతడరణ్యమున పలు మృగములను వేటాడి అలసి ఆకలిగొనెను. కుందేటి మాంసమును తిని మిగిలిన దానిని తెచ్చి తండ్రికిచ్చెను. తినగా మిగిలినది పనికి రాదని గ్రహించి వసిష్ఠుడు రాజునకు చెప్పెను. రాజు వానిని దేశమునుండి వెడలగొట్టెను. అతడడవులలో ఫలమూలములు తినుచు కాలము గడిపెను. కొంత కాలమునకు తన తండ్రి మరణించుటను విని వచ్చి రాజ్యమును స్వీకరించెను. అతడు సరయూ తీరమున పెక్కు యజ్ఞములు నిర్వర్తించెను. అతని కుమారుడు కకుత్స్థుడు. అతడింద్ర వాహుడు, పురంజయుడను పేర్లతో ప్రఖ్యాతిగాంచెను. జనమేజయుడాతనికిన్ని పేర్లెట్లు వచ్చినవో వివరింపుమని యడుగగా వ్యాసుడిట్లనెను!

శశాదుడు మరణించగా కకుత్స్థుడురాజై చక్కగా రాజ్య పరిపాలనము చేయుచుండెను. ఆ సమయమున దేవతలు దానవులకు నోడి పోయిరి. వారు విష్ణుని శరణువేడగా అతడు దేవతలారా! మీరు కకుత్స్థుని ప్రక్కవైపున రక్షకునిగా ఉండుమనుడు. అతడు దానవులను చంపగలడు. పరాంబికా శక్తి యతని యందు కలదు అని చెప్పెను. అంత దేవతలాతని వద్దకు వెళ్ళిరి. కకుత్స్థుడు వారిని సత్కరించి వచ్చినపని నడుగగా వారు నీవింద్రునకు మిత్రుడవై సహాయుడవుగా నుండవలెనని కోరిరి. అప్పుడు రాజు, వాహనముగా ఇంద్రుడున్నచో నేను పార్శ్వ రక్షకుడనగుదునని పలికెను.

అప్పుడు దేవతలు అభిమానము విడిచి యింద్రుని వాహనముగుమనిరి. ఇంద్రుడు సిగ్గుపడుచు వృషభమై రాజునకు వాహనమయ్యెను. వృషభరూపమున నున్న ఇంద్రుని మూపుపై కూర్చొనినందున కకుత్స్థుడయ్యెను. (కకుద్- అనగా ఎద్దు మూపురము) ఇంద్రుని వాహనముగా చేసికొనుటచే ఇంద్రవాహుడయ్యెను. దైత్యులపురమును జయించుటచే పురంజయుడాయెను. అతని వంశము వారెల్లరు కాకుత్స్థులుగా పిలువబడుచున్నారు. కకుత్స్థుని కుమారుడు పృథుచక్రవర్తి. అతని కుమారుడు విశ్వరంధి. విశ్వరంధి కొడుకు, అతని కొడుకు చంద్రుడు, అతని పుత్రుడు యువనాశ్వుడు. అతని పుత్రుడు శావంతి. అతని కొడుకు బృహదశ్వుడు. వాని పుత్రుడు కువలయాశ్వుడు.

అతడు దుంధువను రాక్షసుని చంపుటచే దుంధు మారుడని పిలువబడెను. వాని పుత్రుడు దృఢాశ్వుడు. వాని కొడుకు హర్యశ్వుడు. అని కుమారుడు నికుం

ఘుడు. వాని పుత్రుడు బర్హణాశ్వుడు. అతని తనయుడు ప్రసేనజిత్తు. వాని కొడుకు యౌవనాశ్వుడు. అతని సుతుడు మాంధాత. అతడు తన తండ్రి పొట్టచీల్చుకొని పుట్టెను. జనమేజయుడది యెట్లు సంభవించెనని యడుగ వ్యాసుడిట్లనియె.

యౌవనాశ్వనకు సంతతిలేదు. అతనికి నూర్గురు భార్యలు కలరు. అతడు సంత లేదని దుఃఖించుచు నరణ్యమున మునులు చూచుచుండ నిట్టూర్పు విడుచుచుండెను. వారు నీ దుఃఖమునకు కారణమేమని యడుగా నాకు సంతానము లేనందున దుఃఖము కలుగుచున్నదని చెప్పి మరియు నాకు సంతతి కలుగునట్లు యజ్ఞము చేయింపుడని కోరెను. వారు యజ్ఞమును జరిపించిరి. ఆ బ్రాహ్మణులు కలశమందు జలమును వేదమంత్రములతో అభిమంత్రించిరి. ఒకరాత్రి రాజు దప్పికగొని ఆమంత్రజలమును త్రాగెను. భార్యకు సంతానము కొరకుగా ఉంచబడిన జలము నీతడు త్రాగెను. నెలలునిండినపిదపమంత్రులుపొట్ట కుడిభాగమును చీల్చి కుమారుని బయటకు తీసిరి. దైవకృపచే రాజు చావలేదు. ఈ కుమారునకు పాలెవ్వరిత్తురని మంత్రులాలోచించుచుండ ఇంద్రుడు 'మాంధాత' నన్ను చీకుమని పలికెను. ఆ బాలుని బొటనవ్రేలున అమృతరూపియై యింద్రుడు నిలిచెను. నాటినుండి మాంధాతయని యాతడు పిలువబడెను.

మాంధాత చక్రవర్తి యయ్యెను. దస్యులితనికి భయపడి కొండ గుహలలో నివసించిరి. అందుచే ఇంద్రుడీతనికి త్రసద్దస్యుడని పేరు పెట్టెను. శశిబిందుని కూతులైన బిందుమతిని మాంధాత భార్యగా స్వీకరించెను. బిందుమతియందు మాంధాతకు పురుకుత్సుడు ముచుకుందుడునను పుత్రులిరువురు జన్మించిరి. పురుకుత్సునకు అరణ్యకుడు జన్మించెను. అతడు పరమధార్మికుడు. అరణ్యకునకు బృహదశ్వుడు జన్మించెను. బృహదశ్వుని కొడుకు హర్యశ్వుడు అతడు పరమార్థజ్ఞానము కలవాడు. అతని పుత్రుడు త్రిధన్వుడు వాని కుమారుడు అరుణుడు. అతని పుత్రుడు సత్యవ్రతుడు. అతడు స్వేచ్ఛాచారి. అతడు వివాహ సమయమున ఒక బ్రాహ్మణ స్త్రీని అపహరించెను. తండ్రి యాతని చండాలురతో కలిసి తిరుగుమని బహిష్కరించెను. తన తండ్రిని నివారించలేదని సత్యవ్రతునకు వసిష్ఠునిపై కోపము కలిగెను. అరుణుడు సంతానార్థియై తపస్సు చేయుట కరణ్యానకేగెను. ఆ రాజ్యమున పన్నెండు సంవత్సరములు వానలు కురియలేదు. ఆ దినములలో విశ్వామిత్రుడు కౌశికీతీరమున గొప్ప తపస్సు చేయుచుండెను.

విశ్వామిత్రుని భార్య పిల్లలను పోషింపలేక నడిమి కుమారుని అమ్మి తక్కిన వారిన పోషించుటకు బయలుదేరినది. సత్యవ్రతుడామెను నీవేల యేడ్చుచుంటివి.

యెక్కడకు పోవుచున్నావని ప్రశ్నింపగా ఆమె తన విషయమునంతను చెప్పెను. అంతట నాతడు ఓ పతివ్రతా! నీవీ పుత్రుని అమ్మవద్దు. నేను నీకు భరణమిచ్చె దనను. నీ భర్త తరువాత రాగలడు. నీయాశ్రమము ముందున్న చెట్టునకు ప్రతి దినము అన్నము మూటకట్టి వెళ్ళెదను. నీకది ఆహారమగును. ఇది నా సత్యవ్రతము అని రాజుపలుకగా మునిపత్ని తన కుమారునితో ఆశ్రమము చేరెను. ఆ కుమా రుడు మహాముని యయ్యెను. రాజు ప్రతిదినము వేటాడి జంతుమాసము మూట కట్టి బెట్టుకొ తగిలించుచుండెను. ఒకనాడు రాజున కడవిలో మృగములు కనబడ లేదు. వసిష్ఠుని గోవతనికి కంటపడగా దానిని చంపి మాంసమును తాను కొంతతిని మిగిలినది చెట్టునకు కట్టెను. వసిష్ఠుడు తన గోవును చంపినందుకు కోపించి ఓరి దుర్మార్గుడా? స్త్రీ హరణము. తండ్రి కోపము గోవధ ఈమూడు మచ్చలు నీకు కలుగుగాక ఈ మూడు శంకువులవలన నీవు త్రిశంకువను పేరు పొందెదవు పిశాచ రూపముతో తిరుగుచుందువు అని శపించెను. సత్యవ్రతుడిట్లు వసిష్ఠునిచే శపింపబడి తన యాశ్రమమున తీవ్రముగా తపమాచరించుచుండెను. అతడొక నాడు ఒక మునిపుత్రుని దయవలన శ్రీదేవీ మంత్రమును గ్రహించి జపింపసాగెను.

## త్రిశంకు వృత్తాంతము

జనమేజయుడు త్రిశంకునకు శాపవిముక్తి యెట్లు కలిగెనో తెలుపుమనగా వ్యాసుడిట్లనియె. సత్యవ్రతుడు దేవీభక్తి పరాయణుడై శ్రీనవాక్షర మంత్రరాజ మును జపించి హోమము చేయదలచి ఓ విప్రులారా! నేను చేయు యజ్ఞమున మీరు ఋత్విజులుగా నుండుడని బ్రాహ్మణులను కోరెను. నీవు శపింపబడి పిశాచ రూపముతో తిరుగుచుంటివి. గనుక యజ్ఞము చేయుటకు తగవని పలికిరి. ఆతడు తన జీవితము వ్యర్థమని తలచి చితి పేర్చి అందు ప్రవేశింపదలచి చండికా దేవిని మనస్సులో తలచెను. చితికినిప్పంటించి మహా మాయాదేవిని సంస్మరించెను. అప్పుడు శ్రీభగవతిదేవి ఆకాశమున ప్రత్యక్షమై రాజా! శ్రీదేవి యిట్లు పలికెను.

ఓ మహాత్మా! నీవీ మంటలో దుముకవద్దు. నీతండ్రి నీకు రాజ్యమిచ్చి తపమున కరణ్యము చేరదలచెను. ఎల్లుండి నీవింటికి వెళ్ళుము. నీ తండ్రి నీకు పట్టాభిషేకము చేయును. పిమ్మట నాతడు బ్రహ్మలోకమును చేరగలడు. అని దేవి పలికి అంతర్ధానము చెందెను. అప్పుడు రాజపుత్రుడు అయోధ్యకు వెళ్ళెను. అరుణుడు నారదుని వలన తన కొడుకు చావదలచుట విని దుఃఖించెను. ధర్మా త్ముడగు రాజు తన కుమారుని తీసికొని రండని మంత్రుల కాజ్ఞాపించగా వారతనిని

సగౌరవముగ అయోధ్యకు తీసికొని వచ్చిరి. రాజు కుమారుని చూచి బాధపడి యాతనిని కౌగిలించుకొనెను. పిమ్మట కుమారునకు రాజు అనేక విషయములను బోధించి పరదేవతా పూజను భక్తితో నెరవేర్పవలెను. ఆ మహా దేవియే సర్వము అనుభావము తో నుండవలెనని ఆమె పాదతీర్థము త్రాగినవానికి జన్మముండదని పలికెను.

త్రిశంకుడు తండ్రి బోధించిన రాజనీతిని ఆధ్యాత్మిక విషయమును శ్రద్ధగా వినెను. పిమ్మట రాజు వేదవిదులైన బ్రాహ్మణుల పిలిచి ఒక శుభముహూర్తమున త్రిశంకుని పట్టాభిషిక్తుని చేసెను. రాజు తన భార్యతో గంగాతీరమున వానప్రస్థుడై తీవ్రమైన తపమొనర్చెను. అరుణుడు స్వర్గస్థుడై ఇంద్రునొద్ద నుండెను. త్రిశంకునకు శాపవిముక్తి యేట్లేర్పడెనో వివరింపుమని ప్రార్థింపగా వ్యాసుడు సత్యవ్రతుడు శ్రీదేవి నుపాసించి క్షణములో దివ్యదేహధారి యయ్యెననియు వసిష్ఠు ప్రసన్నుడా యెననియు తండ్రి కాతనిపై ప్రేమ కలిగెనని కూడ చెప్పెను. త్రిశంకుడు దేవిని గూర్చి ధర్మబుద్ధితో ననేక దేవీ యజ్ఞములొనర్చెను. త్రిశంకునకు హరిశ్చంద్రుడు జన్మించెను. సర్వశుభ లక్షణములు గల కుమారుని రాజు చేసి మానవ శరీరముతో స్వర్గమందు సుఖమనుభవింపదలచెను. అతడు వసిష్ఠుని చేరి నమస్కరించి బ్రహ్మ పుత్రా మహానుభావా! ఈ మానవ శరీరముతో స్వర్గములో సుఖముల ననుభవింప కోరికతో నున్నాను. అందుకు తగిన యజ్ఞమును నాచే చేయింప నీవే తగిన వాడవని ప్రార్థించెను. అంత వసిష్ఠుడు రాజా నీకోరిక అసంభవము. యజ్ఞము చేసి మరణించిన యనంతరము స్వర్గమును చేరుమనెను. త్రిశంకువు నేను వేరొక పురోహితునితో యజ్ఞము జరిపింతునని పలుకగా వసిష్ఠుడు కోపించి చండాలుడవగుమని శపించెను. వెంటనే త్రిశంకుడు చండాలుడయ్యెను.

అంతట మిక్కిలి బాధపడి సాధువుల సేవించుచు జగదంబను స్మరించుచు పాపకర్మను పోగొట్టుకొందునని గంగాతీరమున పశ్చాత్తాపముతో కాలము గడుపుచుండెను. యువరాజు హరిశ్చంద్రుడు తన తండ్రి శాపగ్రస్తుడైన విషయము విని అతనిని తీసికొని రండని మంత్రులను పంపెను. త్రిశంకుడు నగరమునకు వెళ్ళక మంత్రులతోను నిట్లు కుమారునకు చెప్పుడనెను. పుత్రా నేను రాను రాజ్యము వివేకముతో పాలింపుము. అంత మంత్రులు హరిశ్చంద్రుని రాజుగా పట్టాభిషిక్తుని చేసిరి. త్రిశంకుని తరువాత చరిత్రమును చెప్పుమనగా వ్యాసు డిట్లనెను. త్రిశంకుడు తన కుమారుడు పట్టాభిషిక్తుడగుటను విని సంతోషించి శ్రీదేవిని స్మరించుచు కాలము గడుపుచుండెను. విశ్వామిత్రుడు తపస్సు పూర్తి

చేసికొని యింటికి వచ్చి కరువుకాలములలో దారిద్ర్యముచేతను పడిన కష్టములను తెలిపి నీవెట్లు గడిపితి వని ప్రశ్నించెను. అంత నాతని భార్య ఇట్లు చెప్పెను.

ఆ కరువుకాలములో పిల్లలు ఆకలితో ఏడ్చుట చూడలేక ఒక కుమారుని అమ్మి అధనముతో తక్కిన పిల్లను పోషింపదలచుచుండగా సత్యవ్రతుడనురాజు నన్ను చూచి నీవు బాలుని అమ్మవద్దు. ముని తిరిగివచ్చు వరకు ప్రతిదినము నేను మాంసము నిచ్చెదనని అట్లు చేయగా నీ పిల్లలు దుఃఖసముద్రము దాటిరి. అట్టి రాజు ఒకనాడు మాంసము దొరక వసిష్ఠుని యావును చంపెను. ముని అతని చండాలునిగా శపించెను. నా వలన రాజకుమారుడు చండాలుడయ్యెను. కనుక నీ ప్రబలతపముచే ఆ రాజును రక్షింపుమని భర్తను కోరెను. కౌశికముని ఆలోచించి త్రిశంకుని వద్ద కేగెను. త్రిశంకువు విశ్వామిత్రుని చూచి నమస్కరించెను. అంతట విశ్వామిత్రుడు రాజా నీవు నా కొరకు మునిచే శపింపబడితివి. నీకు కావలసిన ఉపకారము చేయవచ్చితిననగా త్రిశంకుని శరీరముతో స్వర్గమును అనుభవింపవలెనని తన కోరిక నెరిగించెను. విశ్వామిత్రుడు యజ్ఞ ద్రవ్యములు సమకూర్చుకొని మునుల కాహ్వానములు పంపెను. ఎల్లరు మునులును యజ్ఞము గూర్చి వినిరి.

కాని వసిష్ఠుడు నివారించుటచే వారు యాగమునకు వెళ్ళలేదు. విశ్వామిత్రుడు బాధపడి త్రిశంకుడున్నచోటికి వెళ్ళి రాజా! వసిష్ఠుడు నివారించుటచే బ్రాహ్మణు లెల్లరు యజ్ఞమునకు వచ్చుటలేదు. ఐననేమి? నా తపశ్శక్తిచే నిన్నిప్పుడే స్వర్గమునకు పంపెదను అని దోసిటితో నీళ్ళు తీసికొని గాయత్రితో నభిమంత్రించి తన పుణ్యమతనికి ధారపోసెను. అంతట నీకు మేలగుగాక యనెను. విశ్వామిత్రుడిట్లు పలుకగనే త్రిశంకుడు పక్షివలె పైకెగిరెను. చండాలరూపముతో స్వర్గమునకు వచ్చుచున్న త్రిశంకుని చూచి యింద్రుడు ఓరి చండాలుడా! కంపుగొట్టు రూపముతో దేవలోకమునకు రావలదు నేలమీదికి పొమ్మనెను. అంతట త్రిశంకుడు క్రిందపడ నారంభించెను.

విశ్వామిత్రా! క్రిందపడుచున్నాను కాపాడుమని పెద్దగా దుఃఖింప ఆగుమాగుమని విశ్వామిత్రుడు పలుకగా ఆకాశము నడుమనాగెను. విశ్వామిత్రు డచటనే రెండవ స్వర్గము నిర్మింప నీటిని తాకి యజ్ఞమునకు సంకల్పించెను. అంతట ఇంద్రుడు విశ్వామిత్రుని వద్దకు వచ్చి మునివర్యా! ఇక నీ ప్రతిసృష్టి చాలించి నీకేమి కావలయునో కోరుకొనుమనెను. విశ్వామిత్రుడు దుఃఖించుచున్న త్రిశంకుని నీలోకమునకు కొని పొమ్మనగా ఇంద్రుడు మాటడలేక త్రిశంకుని దివ్యదేహుని చేసి విమానము కూర్చుండబెట్టుకొని విశ్వామిత్రు ననుమతి పొంది స్వర్గమున

కరిగెను. ఇంద్రుడు త్రిశంకుని స్వర్గమునకు కొనిపోగా విశ్వామిత్రుడు తన యాశ్రమములో సుఖముగా నుండెను. విశ్వామిత్రుని మహోపకారము చేతన తండ్రి స్వర్గమును చేరుట విని హరిశ్చంద్రుడానందించెను. అయోధ్యాధిపతియగు హరిశ్చంద్రునకు సంతానము కలుగనందున వసిష్ఠుని వద్ద నాతడు తన బాధను తెలిపెను. వసిష్ఠుడు సంతానము ననుగ్రహించువాడు వరుణుడొక్కడే యని చెప్పగా గంగాతీరమున హరిశ్చంద్రుడు తీవ్రముగా తపస్సు చేసెను. వరుణుడు ప్రసన్నుడై వరము కోరుకొనుమనగా నాకు కుమారుడు జన్మింపవలెనని వరము కోరెను. నీకు జన్మించు పుత్రుని బలిపశువుగా నాకు యాగమందర్పించుచో నీకు పుత్రుడు కలుగగలడని వరుణుడు వరమిచ్చెను.

అట్లే నా కుమారుని బలి పశువుగా నిత్తునని ప్రతిజ్ఞ చేసి హరిశ్చంద్రుడింటికి వెళ్ళెను. కొంతకాలమునకు "శైబ్య" యను నాతని పట్టమహిషి గర్భము ధరించెను. పదవనెలలో నామె యొక శుభముహూర్తమున పుత్రుని కనెను. రాజు హరిశ్చంద్రుడమితానందముతో ననేక దానముల నొనర్చెను. సంగీత నృత్యగోష్ఠులు జరిపించెను. రాజభవనమున పుత్ర మహోత్సవము జరుగుచుండగా వరుణుడు బ్రాహ్మణ వేషమున వచ్చి రాజా! నేను వరుణుడను. త్వరగా నీ కొడుకుతో యజ్ఞము చేయుము. నీవంధ్యత్వము తొలగినది కదా! అని పలుకగా హరిశ్చంద్రుడు చాల బాధపడి ఆలోచించి మహానుభావా! ప్రతిజ్ఞ ప్రకారము యజ్ఞము చేయగలను పురిటి శుద్ధి పదియవనాడు జరుగును గదా! తదనంతరము యాగమొనర్తుననగా వరుణు రాజా! నేను వెళ్ళుచున్నానని పలికి వెడలిపోయెను. హరిశ్చంద్రుడు సంతోషించెను./

# హరిశ్చంద్రోపాఖ్యానము

హరిశ్చంద్రుడు తన కుమారునకు రోహితుడని పేరు పెట్టెను. ఒక నెలగడచిన పిమ్మట వరుణుడు మరల బ్రాహ్మణ రూపములో వచ్చి యిప్పుడే యజ్ఞము చేయుమనెను. రాజు దుఃఖింతుడై దోసలియొగ్గి యిట్లనెను.

ఓ జలాధిపతీ! పిల్ల వానికి పండ్లు రానిదే యజ్ఞపశువుగా నుండనుండుట తగదు. కనుక పండ్లు వచ్చిన పిదప యాగమొనర్తుననెను. వరుణుడు సరేయని వెళ్ళిపోయెను. పిల్ల వానికి పళ్ళు వచ్చిన తరువాత వరుణుడు రాగా తలవెండ్రుకలు తీసిన పిదప యాగము చేసెదననెను. పుట్టు వెండ్రుకలు తీసిన పిదప మరల వరుణుడు రాగా ఉపనయనమైనగాని యాగమున కర్హుడుకాడు. గనుక ఉపనయనము పిల్ల వానికి జరుగు వరకు వేచియుండుమని రాజు పలికెను. దయదలచి

వరుణుడు వెళ్ళిపోయెను. రాజు సంతోషించెను. తరువాత పదకొండవయేట ఉపనయన సంస్కార మొనర్చుచుండగా వరుణుడు ప్రత్యక్షమై నిలువుగా నతనిని పొగడి సమావర్తన సంస్కారమైన పిమ్మట యాగము తప్పక చేయగలననెను. రాజకుమారుడు తన తండ్రి దుఃఖ కారణము నెరిగి నగరము విడిచి వెళ్ళిపోయెను.

వరుణుడు వెళ్ళిన తరువాత రాజు రోగపీడితుడయ్యెను. వనమందున్న రాకుమారునకు తండ్రి రోగగ్రస్తుడైన విషయము తెలిసెను. తండ్రిని చూడవలెనని తలచిన రోహితుని ఇంద్రుడు నిన్ను నీ తండ్రి యజ్ఞ పశువును చేయును గనుక యింటి వెళ్ళ వద్ద నివారించెను. ఒక సంవత్సరము పిమ్మట చావునకు తెగించి తండ్రిని చూడ గోరగా మరల ఇంద్రుడు బ్రాహ్మణవేషముతో వచ్చి నివారించెను.

అంత రాజుతన రోగము తగ్గుటకు వసిష్ఠునితో నాలోచింపగా ఎవనికైన డబ్బునిచ్చి వాని కుమారుని తెచ్చి యాగమొనర్చిన నీ రోగము తగ్గునని అతడు ఉపాయము చెప్పెను. దరిద్రుడైన అజీగర్తుని ముగ్గురు కుమారులలో మధ్యవాని డబ్బుతో కొని తెచ్చి యజ్ఞపశువుగ నాతని సిద్ధపరచెను. బాలుడు మరణమునకు భయపడి వణకుచుండమును లెల్లరు బాధపడిరి. విశ్వామిత్రుడు పిల్లవానిని చంప జాలనని చెప్పెను. రెట్టింపు ధనమిచ్చినచో ధనార్థినైన నేనే చంపెదనని అజీగర్తుడు కొడు కును చంపబూనెను. సభలోని వారెల్లరు హాహాకారములు మిన్నుముట్ట ఓ పాపాత్ముడా! కన్నకొడుకు నెట్లు చంపదలచితివి? అని కోలాహలము చేయుచుండ విశ్వామిత్రుడక్కడకు వచ్చెను. హరిశ్చంద్రునకు అనేక విధములుగా చెప్పి విశ్వామిత్రుడు భయపడి యేడ్చుచున్న బాలుని రక్షించుట ప్రయత్నించెను. కాని హరిశ్చంద్రుడు నా వ్యాధి నన్ను పీడించుచున్నది. కనుక నితనిని వదలననెను.

విశ్వామిత్రుడు శునఃశేపునిపై దయ గలిగినవాడై ఆ బాలుని వద్దకేగి ఓరీ! నాయనా! నేను వరుణమంత్రము నిచ్చెదను. దానిని జపించినచో నీకు మరణ ముండదని మంత్రోపదేశము చేసెను. బాలుడా మంత్రము జపించినంతనే వరుణుడు ప్రత్యక్షమయ్యెను. హరిశ్చంద్రుడాతని క్షమింపుమని వేడుకొని నీ దర్శనముచే నా వ్యాధి పూర్తిగా పోయినదని పలుకగా వరుణుడు దయాళువై శునశ్శేపుని చంపకుండ విడువుమనెను. నీవు రోగవిముక్తుడవైతివని పలికెను. సభయందంతట జయజయ ధ్వానములు మిన్నుముట్టెను.

విశ్వామిత్రుడా బాలుని చేయి పట్టుకొని నాయనా! యింటికి పొదము రమ్మని ప్రేమతో పలికెను. వరుణుడు ప్రసన్నుడై వెళ్ళెను. ఋత్విక్కులు సభ్యులు తమ తమ నివాసముల కలిగిరి. హరిశ్చంద్రుడు రోగవిముక్తుడై సుఖముగా నుండెను.

హరిశ్చంద్రుడు రాజసూయ యాగము చేసి యందు వసిష్ఠుని హోతగానుంచెను. యాగసమాప్తి యందు హరిశ్చంద్రుడు వసిష్ఠుని ఘనముగా సత్కరించెను. ఇంద్ర సభలో విశ్వామిత్రుడు వసిష్ఠుని నీకీ సత్కారమెవరొ నర్చిరని ప్రశ్నించెను. వసిష్ఠుడు నాశిష్యుడు యజమానుడైన హరిశ్చంద్రుడు యాగము చేసి నాకీ సత్కారమొన సెగనని చెప్పి. అంతటి సత్యవాది ధర్మవర్తనుడు నభూతో నభవిష్యతి. లోకములో మరొకడు లేడని పలికెను. విశ్వామిత్రుడు నీ శిష్యుడు అసత్యవాదియని నిరూపింతునని ప్రతిజ్ఞ చేసి ఓడిపోయినవాడు తన పుణ్యమునంతను కోల్పోవునట్లు పందెము పెట్టెను. ఇట్లా మునులిరువురు వాదించుకొనుచు స్వర్గము విడిచి తమతమ యాశ్రమములకు పోయిరి.

ఒకప్పుడు విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని వద్దకు వచ్చి రాజా! వసిష్ఠుడు నిన్ను గూర్చి గొప్ప దాత కీర్తిశాలి అటువంటి రాజు లేడని చెప్పెను. కనుక నిన్ను ప్రార్థించుచున్నాను. రాజా! నేనొక వివాహము జరుపవలెను. నా కొడుకు పెండ్లికి ధనము కావలెను. అని పలుకగా బ్రాహ్మణోత్తమా! నీవు కోరినది యిచ్చెదననెను. అంతట విశ్వామిత్రుడు మాయచే ఒక కుమారుని పదియేళ్ళ వయస్సు గల కన్యను చూపి వీరి వివాహము జరుపవలసియున్నది. అనగా రాజు బ్రాహ్మణోత్తమా నీకు కావలసిన దడుగుము. తప్పక యిచ్చెదను. కీర్తి లేనిదే బ్రతుకు వ్యర్థముగదా! యని పలికెను.

అంతట విశ్వామిత్రుడు రాజా! నీ సర్వస్వమును రాజ్యమును దానమిమ్ము అని కోరెను. రాజు వెనుకాడక దానమిచ్చెను. విశ్వామిత్రుడు పుచ్చు కొంటిననుచు రాజా! దక్షిణ లేనిదానము వ్యర్థము. కనుక తగినంత దక్షిణ నీయవలె ననెను. ఎంత ధనమిమ్మందువో చెప్పుమని రాజడుగగా రెండున్నర బారువుల బంగారము దక్షిణగా నీయవలెననెను. రాజాశ్చర్యపడి యిచ్చితిననెను. రాజు విచారించుచు నంతఃపురమునకు వెళ్ళెను. రాణిచింతించుచున్న తన భర్తను చూచి కారణమడిగెను. రాజు తన చింతకు కారణము జెప్పెను. రాజునకు భోజనము రుచించలేదు. నిద్ర పట్టలేదు- మరునాటి ఉదయమే విశ్వామిత్రుడు వచ్చి రాజునకు తన రాక తెలిపెను. రాజు వచ్చి నమస్కరించెను. అపుడు ముని రాజునకిట్లనెను.

రాజా! నీ రాజ్యమును విడిచిపెట్టుము. రాజేంద్రా! బంగారము నిమ్ము. సత్య వచనుడవగుము అని పలుకగా రాజిట్లనెను. నా సర్వస్వము నీకిచ్చితిని. నేనిప్పుడు బంగారము దక్షిణగా నిచ్చుటకు అసమర్థుడను. నాకు ధనము లభించినచో నీకు దక్షిణ చెల్లింపగలను. నీకు దక్షిణ చెల్లించనిదే భోజనము చేయను. ఇది నా

ప్రతిజ్ఞ ఇక నీవు విచారింపవలదు. నాకు ధనము చేతకి వచ్చు వరకు ఓపిక పట్టుము. దిగులు పడకుము అని పలికెను. నీ సర్వమును దానము చేసితివి, ఇక నీకు ధనమెట్లు వచ్చును? అని విశ్వామిత్రుడు రాజును ప్రశ్నించెను. మరియు నేనీయలేనని ఒక మాట చెప్పుము. నా యాశను వదలుకొని స్వేచ్ఛగా వెళ్ళుదును అని పలికెను.

హరిశ్చంద్రుడామాటలు విని బ్రాహ్మణోత్తమా! తప్పక యిచ్చెదను. కాశీలో మమ్ము కొనువానిని చూడుము. వానికి మేము అమ్ముడు పోయినీ ఋణము తీర్చెదను అని పలికెను. రాజు భార్యా పుత్రులతో కాశీనగరమునకు వెళ్ళి అక్కడ నివసింపదలచెను. ఇంతలో మునిరాగా రాజు నమస్కరించి నీవిచ్చిన నెలగడువు నకు సగము రోజులు మిగిలియున్నవి యనిన సరే మరల వత్తునని ముని వెళ్ళి పోయెను. రాజు నీని ఋణమెట్లు తీర్చగలనని విచారించుచుండగా ఆతని భార్య నాధానన్నెవనికైన దాసిగా విక్రయించి ముని ఋణము తీర్చుమని సలహా యిచ్చెను. ఆ మాట విని రాజు మూర్ఛనొందెను. వాని జూచి ఆమెయు మూర్ఛనొందెను. కుమారుడు రోహితుడు అమ్మా! అన్నము, నాయనా! అన్నమని యేడ్వసాగెను. ఇంతలో విశ్వామిత్రుడు మూర్ఛిన రాజు ముఖముపై నీరుచల్లి నీవీయవలసిన దక్షిణను యిమ్మనెను. నేడు ప్రొద్దు క్రుంకులోపల దక్షిణ నీయనిచో నిన్ను శపింతునని వెళ్ళిపోయెను. అంతట విచారించుచు దుఃఖించు భర్తను చూచి రాణి మహాత్మా నన్నమ్మి ఋణము తీర్చుమని మరల కోరెను. ముని శాపము నకు గురికావలదని పలికెను.

హరిశ్చంద్రుడు శోకముతో భార్య నమ్ముటకు నిశ్చయించి భార్యను వెంట బెట్టుకొని నగరవీధిలో నిలిచి పేరులారా! ఎవరికైన దాసి కావలసినచో నా ప్రియు రాలిని అమ్మగలను అనుచుండగా విశ్వామిత్రుడు బ్రాహ్మణరూపమున వచ్చి ఆ దాసిని నాకిమ్ము. నీకు కావలసిన ధనమిచ్చెదననెను. ధర్మశాస్త్ర ప్రకారము నీకు ధనమిచ్చుచున్నానని విప్రుడు వస్త్రముపై ధనము నుంచి రాణి తలవెంట్రుకలు పట్టి లాగెను. తల్లిని లాగుచుచుండుట చూచి కుమారుడు వెంటబడెను. అప్పుడు రాణి ఈ బాలుని కూడ కొని నాకు సంతోషము కలిగింపుమనగా, ఈ ధనము తీసికొని పిల్లవానిని కూడ నిమ్మనెను.

ఆ బ్రాహ్మణుడు తల్లిని బాలుని తీసికొని తన ఇంటికి వెళ్ళెను. రాణి వెళ్ళి పోవునప్పుడు భర్త పాదములపై పడి నమస్కరించి మరుజన్మమున నాకీతడేపతి యగుగాక యని ప్రార్థించెను. రాజు భార్యాపుత్రుల నమ్ముకొని నందుకు విచారించుచుండ విశ్వామిత్రుడు ప్రత్యక్షమై రాజా! దక్షిణ నిత్తునని మాట యిచ్చి

తివి. నీవు మాట నిలబెట్టుకొనువాడవైనచో దక్షిణనిమ్ము అని నిర్బంధించెను. అప్పుడు రాజు భార్యా పుత్రుల నమ్మగా వచ్చిన పదకొండు కోట్ల బంగారము నాతనికిచ్చెను. విశ్వామిత్రుడు మరికొంత ధనమిచ్చినగాని దక్షిణ పూర్తికాదు. ఇంకను కొంత సంపాదింపుము లేనిచో నా తపోబలము చూడ గలవనెను పగటిలో నాల్గవ భాగము పూర్తియగు వరకు వేచియుందును అప్పటికి నీవు దక్షిణ నీయనిచో నీతో మాట్లాడు పని నాకు లేదు. అని ధనము తీసికొని వెళ్ళెను.

హరిశ్చంద్రుడు నన్ను కొనువాడైన ఉన్నచో వెల నిర్ణయింపవచ్చునని చూచు చుండగా చండాలుడొకడు నాకు దాసుడు కావలెను. నిన్ను దాసునిగా తీసి కొందును. నీకెంత ధనమీయవలెనో తెలియజేయుము అనగా రాజు నీవెవ్వడతని ప్రశ్నించెను. నేను చండాలుడనని యాతడు బదులు పలికెను. రాజు ఆలోచించు చుండగా విశ్వామిత్రుడక్కకు వచ్చి యీ చండాలుడు నీకిచ్చు ధనమును యజ్ఞ దక్షిణగా చెల్లింపుము నిన్ను కొని చండాలుడిచ్చిన ధనమును నాకీయనిచో నాశాపా గ్నిచే నిన్ను కాల్చివై చెదననెను.

రాజు మునివర్యా! నాకు చండాలసేవ తొలగించుము. నీకే సేవ చేసి ఋణము తీర్చుకొందుననగా విశ్వామిత్రుడు చండాలుని పిలిచి ఈతడు నాదాసుడు ఈతని నీకమ్ముచున్నాను. నీవీతని గ్రహించి యెంత ధనమిత్తువో తెల్పుమనెను. చండాలుడు పరమానందముతో విశ్వామిత్రుని ముందునకు వచ్చి ప్రయాగమండలమున పదియోజనముల నేల మిక్కిలి విలువైనది దానిని నీకిచ్చె దను. ఇతనిని నాకిమ్మనెను. చండాలుడు వేయి బంగారు నాణెములు, ముృత్యము మునికిచ్చెను. రాజు ధైర్యము వహించి యేమియు మాటలాలేదు. అంతలో ఆకశవాణి ఓ మహనీయా! నీ నీయవలసిన దక్షిణ ధనమిచ్చి ఋణ విముక్తుడవైతివి యని వినిపించెను. రాజు తలపై పుష్ప వర్షము కురిసెను. అప్పు డింద్రాదు లెల్లరు మేలుమేలని రాజును మెచ్చుకొనిరి. అంతట హరిశ్చంద్రుడు సంతోషముతో విశ్వామిత్రునకిట్లనెను.

మహాత్మా నన్ను ఋణవిముక్తుని చేసితిని. అని పలికి నేటి నుండి నేనేమి చేయవలెనని ప్రశ్నింపగా చండాలుని మాట ప్రకారము నడుచుకొనుము. నీకు శుభమగుగాక యని పలికి ధనము తీసికొని విశ్వామిత్రుడు వెడలిపోయెను. రాజు చండాలు నింటికి వెళ్ళి యేమి చేసెనని యడుగగా సూతుడిట్లు చెప్పెను. విశ్వామిత్రుడు వెళ్ళిన పిమ్మట చండాలుడు శవములపై కప్పిన వస్త్రములు లాగు టకు రాజు నాజ్ఞాపించెను. శ్మశానమున మనకు న్యాయముగ వచ్చునది తీసి

కొనుము. ఈ పాతకత్తును తీసికొని వెంటనే వెళ్ళుమనెను. హరిశ్చంద్రుడు శ్మశానమునకు వెళ్ళెను. అచటి దృశ్యములను చూచి రాజు వలవల యేడ్చెను. రాజు పండ్రెండు నెలలు గడిపెను.

ఒకనాడు రోహిత కుమారుడు సమిధల మోపును తెచ్చుచు విశ్రాంతికై దానిని ఒక పుట్టపై నుంచెను. అంతలోనొక కాలసర్పము విశ్వామిత్రుని ప్రేరణచే వెలుపలకు వచ్చి రోహితుని కాటువేసెను. వెంటనే యాతడు మరణించెను. అతని తోటిబాలురు వాని తల్లికి రోహితుని మరణము చెప్పగా నామె నేలపై కూలిపోయెను. బ్రాహ్మణుడామెను కుమారుని వద్దకు వెళ్ళనీయలేదు. అర్థరాత్రి యజమాని పాదములొత్తి ప్రార్థింపగా నతడు నీవు కుమారుని వద్దకు వెళ్ళి అతని యంత్యక్రియలు జరిపి వెంటనే తిరిగిరమ్ము. నా యింటి పనులకు ఆటంకము కలుగకూడదనెను. ఆమె యారాత్రి ఒంటరిగా ఏడ్చుచువెళ్ళెను. చనిపోయిన కుమారుని చూచి శోకపీడితయయ్యెను. నగరపాలకులామె యేడ్పు విని యామె వద్దకేగి నీవెవరవు? ఈ బాలుడెవని పుత్రుడు మొదలగు ననేక ప్రశ్నలడిగిరి. అమె సమాధానము చెప్పలేదు. వారీమె బాలఘాతిని రాక్షసి కావచ్చునని యామెను చండాలు అప్పగించి వెళ్లిపోయిరి. పిమ్మట చండాలుడు నీవీ దుష్టురాలిని చంపుమనగా హరిశ్చంద్రుడీ పనిమాత్రము నాచేత కాదనెను. అంతట చండాలుడీ దుష్టురాలు పెక్కురు చిన్నపిల్లలను పొటను పెట్టుకొనినది. దీనిని చంపిన నీకు పుణ్యమే కలుగును.

కనుక దీనిని తప్పక చంపుమనెను. హరిశ్చంద్రుని తిట్టి ఈ కత్తి తీసికొని దాని తల తెగనరుకుము అని రాజుచేతికి కత్తి నిచ్చెను. రాణి తనను చంపి సిద్ధపడుచున్న రాజును చూచి చనిపోయిన నా కుమారుని దహనక్రియలు జరుపు వంతవరకు తాళుము. పిమ్మట నన్ను కత్తితో చంపుమనెను. రాజు సరేయని పంపగా రాణి ఘోరముగ నేడ్చుచు కుమారుని శవమును తెచ్చి శ్మశానమందుంచి నేలపై కూర్చొనెను. రాజు రాణి ఒకరినొకర్తు పట్టలేదు. మరణించిన బాలుని తన కుమారునిగా చూచి నిశ్చయించి కన్నీరు కార్చుచు మిక్కిలి విచారించెను. రాణి భర్తను తలచుకొని యేడ్వగా నామె తన భార్య యని తెలిసి కొనెను. రాణి కూడ దురవస్థయందున్న భర్తను గుర్తించెను. అంతట హరిశ్చంద్రుడు చితిపై తన కుమారుని శవము నుంచి భార్యయు తానును నమస్కరించుచు నిలబడి దేవిని హృదయమున స్మరింపగా ధర్మదేవతను ముందిడుకొని ఇంద్రాది దేవతలచ్చోటి కరుదెంచిరి. ధర్మదేవత నోటితో వారు రాజునకిట్లనిరి.

ఓ మహాప్రభూ! వినుము నేను ధర్మదేవతను ముల్లోకములకు మేలుకోరు వాడను. అందరము నీకు మేలు చేయగోరి వచ్చినాము. నేను ధర్మదేవతను నీ గుణములకు ప్రసన్నుడనైతిని అని రాజును మెచ్చెను. ఇంద్రుడిట్లనెను! హరిశ్చంద్ర మహాశయా! నీవు భార్యాపుత్రులతో సనాతన లోకముల గెలిచితివి. ఇంద్రుడమృత వృష్టినిచితిపై కురిపించెను. చచ్చిన బాలుడు బ్రతికెను. హరిశ్చంద్రుడు కొడుకును కౌగలించుకొనెను. అతడు భార్యాపుత్రులతో సంపదలతో కూడి దివ్యమాల్యాం బరములు ధరించెను. ఆనందభరితుడై నిశ్చింతుడుగా నుండెను. ఇంద్రుడు స్వర్గమునకు రమ్మనగా నా ప్రజలను విడిచి రాననగా సాకేత నగరమందు స్వర్గము నకు వెళ్ళగోరువారెల్లరు హరిశ్చంద్రునితోపాటు స్వర్గమునకు రావచ్చునని యింద్రుడు పలికెను. హరిశ్చంద్రుడు తన కుమారుని రాజుగా చేసి పురప్రజలతో స్వర్గమును అలంకరించెను.

# శతాక్షీమాహాత్మ్యము

జనమేజయుడు పరదేవత, శతాక్షియను పేరునెట్లు పొందెనో తెలుపుము అని అడుగగా వ్యాసుడిట్లు చెప్పెను:- రాజా! నీవు శ్రీదేవీ భక్తుడవు. నీకు చెప్పరాని విషయమేదియు లేదు. పూర్వము హిరణ్యాక్షుని వంశములో రురుకుమారుడను వాడుకలడు. అతడు దుష్టరాక్షసుడు. వేదములు దేవతలకు జీవనౌషధములు అవి నష్టమైనచో వారును నశింతురు అని యాతడాలోచించి హిమాలయ పర్వత మునకు వెళ్ళి వాయుభక్షకుడై బ్రహ్మను గూర్చి వేయి సంవత్సరములు తీవ్రమైన తపస్సు చేసెను. అతని తపస్సు వేడికిలోకములన్నియు సంతాపము నొందినవి. అప్పుడు బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై నీకు వరములిచ్చుటకై వచ్చితినని ఆరాక్షసునితో చెప్పగా ఆతడు బ్రహ్మను పూజించి యిట్లనెను. "ఓ సర్వేశ్వరా! నాకు వేదముల నిమ్ము. దేవతలవద్ద బ్రాహ్మణులవద్ద నున్న వేదమంత్రము లన్నియు నాయొద్దనే ఉండవలెను. మరియు దేవతలెల్లరు ఓడిపోవునట్టి బలము నాకిమ్ము."అని కోరగా అట్లేయగుగాకయని బ్రహ్మ సత్యలోకమునకు వెళ్ళెను.

ఆనాటి నుండి బ్రాహ్మణులు వేదములను మరిచిపోయిరి. స్నాన సంధ్యా వందన శ్రాద్ధకార్యాదులు లోపించినవి. అప్పుడా ఆరాక్షసుడు స్వర్గముపై దండెత్తి వెళ్ళెను. అతనితో యుద్ధము చేయలేక దేవతలు పారిపోయిరి. దేవతలు గుహలలో దాగినారు. లోకములో యజ్ఞయాగాదులు లేనందున వానలు కురియుటలేదు. నేలబీటలువారినది. చెరువులు బావులు ఇంకిపోయినవి. చిరకాలము అనావృష్టి యేర్పడుటవలన, జనులు ఆవులు, ఇతర పశుపక్ష్యాదులు మరణించెను. అప్పుడు

బ్రాహ్మణులు హిమవత్పర్వతమునకు వెళ్ళి శ్రీ పరాంబికనారాధించి ఆమెకు శరణాగతులై సమాధి ధ్యానపూజలచే దేవిని సంతోషపరచిరి. మరియు ఓ పరాంబికా! మేము పామరులము. మాపై దయ జూపుము ఓ సర్వాంతర్యామినీ! తల్లీ కోపించకు. ఇప్పుడు మాకు నీవు తప్పవేరే దిక్కులేదు. నీవు సర్వసమర్థురాలవు. ఏదియెట్లైనను చేయగలవు. మహేశానీ! ఈ ఘోరసంకటము నుండి మమ్ము రక్షింపుమమ్మా సకలప్రాణికోటి జీవనమైన నీరేలేనిచో మేమేమి చేయగలము? అఖిలాండకోటి బ్రహ్మాండనాయికా! నీకు నమస్కారము మా యెడల ప్రసన్నురాలవగుము. నీకు వందనములు తల్లీ! అని ప్రార్థించిరి.

అని యిట్లు ప్రార్థింపగా త్రిభువనేశ్వరి యగు పార్వతి అనంత నేత్రములతో వారికి ప్రత్యక్షమయ్యెను. ఆమె కన్నులు నల్లకలువలవలె ప్రకాశించుచుండెను. ఆమె చేతులయందు కమలము, బాణము, కూరగాయలు, తీయని పండ్లు, పూవులు, చిగురుటాకులు పట్టుకొనియున్నది. ఆమె అందాల రాశి. ఇట్లు ప్రత్యక్షమైన ఆ తల్లి తన వేలాది కన్నులనుండి వర్షధారలను సమృద్ధిగా లోకము నందు కురిపించినది. తొమ్మిది రాత్రులు కుంభవృష్టి కురియుటచే లోకము లన్నియు సంతసించినవి. మరియు నేలపై మరల ఓషధులన్నియు నుద్భవించినవి. నదీనదములన్నియు వెనుకటివలె ప్రవహింప నారంభించెను. గుహలలో దాగి యున్న దేవతలు బయటకు వచ్చిరి. అప్పుడు దేవతలు బ్రాహ్మణులును శ్రీదేవిని యిట్లభినందించిరి. ఓ వేదాంతవేద్యా! బ్రహ్మ స్వరూపిణీ! నీకు నమస్కారము నీవు మాయచే లోకములను సృష్టించు చున్నావు. నీవు భక్తులపాట కల్పవృక్షమవు. దేవీ! భక్త సంరక్షణమునకై అనేకావతారములను దాల్చుచుందువు. ఓ భువనేశ్వరీ! నీకు నమస్కారము మాయందరి సుఖశాంతులకై వేయికన్నుల ధరించినావు. నీవు దయతో మాకు వేదములను అనుగ్రహింపుము. ఆకలి దప్పులచే పీడింపబడి నిన్ను స్తుతించుటకు కూడ శక్తి చాలక యిట్లున్నాము అని స్తుతించిరి.

అనువారల మాటలువిని చేతులలోని కూరగాయలను తీయనిపండ్లను దుంపలను వారికి తినుటకై దేవిని యిచ్చినది. ఆనాటి నుండి దేవికి శాకంభరియను పేరు ప్రసిద్ధిగాంచినది. పిమ్మట దేవతల యొక్క మానవుల యొక్కయు అభివృద్ధిని విని ఆ రాక్షసుడు దేవి సమీపమందున్న దేవతలపై బాణవర్షమును కురిపించెను. బ్రాహ్మణుల గుంపులను కూడ అడ్డగించెను. అప్పుడు దేవతలు బ్రాహ్మణులును దేవీ! రక్షించుము, రక్షించుమని కేకలు పెట్టిరి. పరదేవత వారి మొరనాలకించి దేవతల చుట్టును తేజోమయమగు నొక చక్రమును నిర్మించెను. అది వారికి రక్షాకవచమై ఏ బాధయులేకుండ జేసినది. ఇక దేవికి రాక్షసులకు

మధ్య ఘోరమగు యుద్ధము సంభవించెను. వారి బాణవర్షములు సూర్యుని కప్పి వైచినది. బాణములు రాచుకొని నిప్పులు కురియుచుండెను.

అట్టి యుద్ధ సమయమున దేవి శరీరమునుండి యనేకములైన తీవ్ర శక్తులు పుట్టినవి. వారు కాళిక, తారిణి,బాల, త్రిపురసుందరి, భైరవి, రమ, బగళ మాతంగి, త్రిపుర, కామాక్షి, తులజా దేవి, జంభిని, మోహిని, ఛిన్నమస్త, గుహ్యాకాళి, దశసహస్ర బాహుక అను పేర్లు కలవారు. వీరుకాక మరి ముప్పది రెండుమంది, తర్వాత నరువది నలుగురు పిమ్మట లెక్కలేనంతమంది శక్తులు దేవి దివ్యావయవముల నుండి పుట్టిరి. వారందరు ఆయుధములను ధరించి యున్నారు. ఆశక్తు లందరి వలన రాక్షసుని యొక్క నూరక్షౌహిణుల సేనరూపు మాసెను. యుద్ధ రంగమున మృదంగ శంఖ వీణాధ్వనులు మిన్నుముట్టెను.

అప్పుడు సేనాపతియైన దుర్గమాసురుడు ముందుకు దుమికి విభిన్నశక్తులతో పోరాడ తలపడెను. అట్లు పదిదినములు భీకరమైన పోరు జరుగగా కొన్ని యక్షౌహిణుల రాక్షస సైన్యము హతమయ్యెను. పదునొకండవ దినమున ఎఱ్ఱని పూలమాలలు, ఎఱ్ఱనివస్త్రములు రక్తచందనము ధరించి మహాసంబర ముతో రథమెక్కివచ్చి యారాక్షసుడు శక్తులనందర నోడించెను. తరువాత తన రథమును పరదేవత రథము ముందునకు పోనిచ్చెను. అతనికి దేవికి మధ్య ద్వంద్వ యుద్ధము జరిగెను. పోరుఘోరముగ రెండు జాములు నడచెను.

పిమ్మట దేవి పదునైదు బాణములను రాక్షసునిపై విసిరి నాల్గింటితో గుఱ్ఱము లను ఒక బాణముతో సారథిని రెండింటితో, వాని కళ్ళను రెండింటితో వాని భుజములను ఒక బాణము తో ధ్వజమును ఐదింటితో ఆతని హృదయమును చీల్చివైచెను. ఆ రాక్షసుడు నోటనెత్తురుగ్రక్కుచు శ్రీదేవి సన్నిధిలో ప్రాణములను విడిచెను. అతని నుండి యొక దివ్యతేజస్సు వెడలి దేవిలో లీనమయ్యెను. ఆతడు మరణించగనే దేవతలెల్లరు అన్ని ప్రాణులును ఆనందము నందినవి.

ఆ సమయమున బ్రహ్మాది దేవతలు పరమభక్తితో మధురవాక్కులతో జగదంబనీ వీతిగ సన్నుతించిరి. ఓ పరమేశ్వరీ! బ్రహ్మాండములన్నియు నీవల్లనే పుట్టి పెరుగుచున్నవి. సకలోపనిషత్తులచే స్తుతింపబడు జ్ఞాన ప్రసూనాంబవు నీవే. ఓ దుర్గమాసురభంజనీ! జయజయ మంగళ స్వరూపిణీ! మాయేశ్వరీ! నీకివే మావందనములు నీవు దయా మయురాలవు పరమేశ్వరివి విశ్వైక మాతవు. శతాక్షీ మాతవు పామరులమైన మాకై దుంఖించినావు. సర్వేశ్వరుడు కూడ నిట్లుచేయడు అని బ్రహ్మ, విష్ణువు మొదలుగాగల దేవతలు దేవిని స్తుతించి అనేకవిధముల

పూజించిరి. దేవి అప్పుడు సంతోషించెను. పరదేవత ప్రసన్నురాలై వేదములను తెచ్చి బ్రాహ్మణుల కిచ్చి యిట్లు పలికెను:-

ఈ వేదములు నా శరీరము వంటివి. వీటిని భద్రముగా రక్షించుకొనుడు. వీటిని కోల్పోయి నందువలన ఎట్టి యనర్థము సంభవించునో ఇప్పుడే మీరు చూచితిరికదా! నన్ను నిరంతరము పూజిం పుడు సేవింపుడు. మీ మేలుకోరిన నేను చెప్పుచున్నాను. ఈ ఉత్తమదివ్యమాహాత్మ్యమును మీరు పఠించు చుండుడు. దానివలన నేను సంతోషించి మీ కోరికలను తీర్చుచుండెదను. దుర్గమాసురుని సంహరించి నందువలన ఏర్పడిన దుర్గానామమును, శతాక్షీ నామమును ఉచ్చ రించినవాడు మాయను దాటి పరమపదమును చేరగలడు. అని పలికి సచ్చిదానంద స్వరూపిణీ యెల్లవారికిని సంతోషము కలిగించుచు దేవతలందరు చూచు చుండ గనే అంతర్ధానము చెందెను. ఈ విధముగ పరమ కల్యాణకారకమగు శ్రీదేవీ మాహాత్మ్యమును గూర్చిన కథ రహస్యమైనను నీకు వివరించినాను. దీనిని ప్రయత్నముతో రహస్యముగా నుంచుము. ఎవడీ శ్రీదేవి పరమాధ్యాయమును విశ్వాత్మభావముతో భక్తిశ్రద్ధలతో వినునోవాడీ లోకమున కోరికలనన్నిటిని తీర్చు కొని పిమ్మట శ్రీదేవి యుండు లోకమునకేగి నిత్యము పరమబ్రహ్మా నంద మను భవింపగలడు. ఇందులకేమాత్రము సంశయములేదు.

# శ్రీ దేవీ గీతలు

జనమేజయుడు వేదవ్యాసునిట్లు ప్రశ్నించెను. 'మహర్షీ! గౌరీలక్ష్మీ సరస్వతు లను వరుసగ శివ, విష్ణు, బ్రహ్మలకు సహధర్మచారిణులుగ పరదేవత యిచ్చి నట్లు చెప్పితివిగదా! గౌరీ లక్ష్మలకు మరల కన్యాభావమెట్లు సంప్రాప్తమైనదో తెలియుటలేదు. ఈ సంశయమును తీర్చుమని'అడిగెను. వ్యాసుడు సమాధాన మిట్లు చెప్పనారంభించెను. ఓయీ! శ్రీదేవీ భక్తుడవగు నీకు చెప్పరాని రహస్యము లేదు వినుము:- శ్రీపరాంబిక పూర్వము దేవీత్రయమును త్రిమూర్తుల కిచ్చెను. ఆనాటి నుండి త్రిమూర్తులు తమతమ సృష్ట్యాదికార్యములు కొనసాగించిరి.

పూర్వము హాలాహలులను రాక్షసులు గొప్ప పరాక్రమవంతులై యుండిరి. వారు బ్రహ్మవర ప్రభావమున బలిసి కైలాస వైకుంఠములపై దాడిచేసిరి. హరి హరులు ఆ రాక్షసులతో యుద్ధమునకు సిద్ధపడిరి. వేల సంవత్సరములు ఘోరమగువారి యుద్ధము కొనసాగినది. దేవదానవ సేనలలో హాహాకారములు మిన్నుముట్టినవి. హరిహరులు రాక్షసులనెందరినో సంహరించిరి. వారిండ్లకు వెళ్ళి తమతమ భార్యల వద్ద రాక్షసులను మేమే మాబలముతో సంహరించితిమని గొప్పలు చెప్పు కొనగా

వారి స్వాభిమానమునకు లక్ష్మీ గౌరులిరువురును పరిహాసముగా నవ్విరి. హరిహరులకు వారి నవ్వువలన కోపము కలిగెను. కనుక అవమానకరముగా మాట్లాడిరి. ఆకారణముచే లక్ష్మీ గౌరులంతర్థానము చెందిరి. లక్ష్మీ గౌరులనవ మానించుటచే హరి హరులు తేజస్సును శక్తిని కోల్పోయిరి.

బ్రహ్మ వారిరువురను చూచి హరిహరులు కార్యదక్షతలేనివారుగ కనిపించు చున్నారేమి? యని ఆశ్చర్యము చెంది. దేవతలలో ప్రముఖులైన వీరుశక్తి హీనులగుటకు కారణమేమి? ఇందుకు ప్రతిక్రియ ఎట్లు చేయవలెను? అని కన్నులు మూసి కొని ధ్యానించెను. పరదేవత యొక్క కోపము చేతనే యిట్లు జరిగినదని గ్రహించి వారిరువురి పనులను తానే చక్కబెట్టుచుండెను. మరియు హరిహరుల మేలు కోరి ధర్మాత్ముడగు బ్రహ్మ తన కుమారులగు మన్వాదులను సనకాదులనుగూడ ఆహ్వానించెను. వారు వచ్చి బ్రహ్మకు నమస్కరించగా బ్రహ్మవారితో నిట్లనెను:-

నేననేక కార్యములలో మునిగియుండి తపస్సు చేయజాలకున్నాను. హరిహరులిర్వును దేవీ కోపమునకు గురియై శక్తి హీనులుగానున్నారు. ఆమె సంతోషించుటకే జగద్భారమునంతను నేనే మోయవలసి వచ్చినది. కనుక మీరు యేకాంతభక్తితో అత్యద్భుతముగ తపస్సు చేసి పరాంబికను సంతోషపెట్టుడు. తద్వారా హరిహరులు మరల శక్తియుక్తులగునట్లు చేయుడు. మీ కీర్తి వర్ధిల్లగలదు. ఆ గౌరీలక్ష్ములు ఎవనియింట జన్మింతురో ఆ వంశము మిక్కిలి పవిత్రము. కన్న తల్లిదండ్రులు ధన్యజీవులు. అని పలుకగా దక్షప్రజాపతి మొదలగు వారెల్లరును నిర్మలమైన మనస్సుతో జగదంబ నారాధింపవనములకు వెళ్ళిరి. వారందరును హిమాలయ వనములకు వెళ్ళి మాయాబీజజప పరాయణులై నిశ్చలముగ తపస్సు నారంభించిరి. చిరకాలము వారు ధ్యానించగా శ్రీదేవి యనుగ్రహించి వారికి దర్శనమిచ్చెను. ఆ సచ్చిదానంద స్వరూపిణి దయారస ముప్పొంగనాల్గు చేతులతో పాశాంకుశ వరాభయముద్రలు ధరించెను. లోకములనన్నిటిని పరిపాలించు జగజ్జనని చూచి నిర్మలమనస్సు గల మహర్షులు దేవినిట్లు స్తుతించిరి.

శ్లో॥ నమస్తే విశ్వరూపాయై వైశ్వానరసమూర్తయే
నమస్తే జలరూపాయై సూత్రాత్మవపుషే నమః।
యస్మిన్ సర్వేలింగదేహా ఓతప్రోతావ్యవస్థితాః ।
నమః ప్రాజ్ఞ స్వరూపాయై నమోవ్యాకృత మూర్తయే।
నమః ప్రత్యక్స్వరూపాయై నమస్తే బ్రహ్మమూర్తయే ॥
నమస్తే సర్వరూపాయై సర్వలక్ష్యాత్మ మూర్తయే॥

**స్తోత్ర భావము:-** ఓ వైశ్వానరరూపిణీ! ఓ విశ్వరూపిణీ! నీకు మా ప్రణామ ములు. ఏచిద్రూపిణి యందు లింగదేహములన్నియు నిండియున్నవో ఆ సూత్రాత్మ స్వరూపిణికి జలస్వరూపిణికి మా నమస్కారములు. సమస్త శరీరములందు అవ్యా కృతరూపిణి ప్రాజ్ఞ స్వరూపిణి ప్రత్యక్స్వరూపిణియునగు బ్రహ్మమూర్తికి మా ప్రణామములు. ఆ తల్లిని యెల్లప్పుడు స్తుతింతుము. అని దక్షాదులు దేవి పాదములకు ప్రణమిల్లిరి.

అప్పుడు శ్రీదేవి ప్రసన్నయై వారితో నిట్లనెను:- ఓ మహాత్ములారా నేను వరములనిచ్చు దానను. ఏదేని వరము కొరుకొనుడు. అనగా వారు హరిహరులకు మేలు చేకూరవలెనని కోరిరి. హరిహరులు మరల తమతమ శక్తులను కలిగియుండ వలెనని వారు కోరిరి. అప్పుడు దేవి "నా శక్తుల నవమానించుట వలననే హరి హరులు యిట్టి దురవస్థకు గురియైరి. ఇట్టి అపరాధమునిక ముందెన్నడును ఎవ్వరును చేయరాదు. ఇప్పుడు నాదయాలేశము వలన వారి శరీరములకారోగ్యము చేకూర గలదు. ఆ యిర్వురు శక్తులలోనొకతె నీయింట మరియొకతె క్షీరసాగర మునను జన్మించగలరు. హరిహరులు నాప్రేరణచేత మరల వారిని పొందగలరు. నా ముఖ్యమంత్రము మాయా బీజము. అది నాకత్యంతప్రియమైనది.

కనుక నావిరాట్ స్వరూపమునుగాని యీ త్రిభువనేశ్వరి స్వరూపమునుగాని ధ్యానింపవలయును. లేక సకలలోకముల నిండిన నాసచ్చిదానంద స్వరూపమునైన ధ్యానింపవలయును" అని పలికెను. దేవి అంతర్ధానము చెందెను. పిమ్మట దక్షాది మునులు బ్రహ్మను చేరి జరిగిన వృత్తాంతమంతయు బ్రహ్మకు తెలియజేసిరి. హరిహరులు శక్తిమంతులై మరల తమతమ కార్యములను నిర్వహింపగలిగిరి. ఆనాటి నుండి హరిహరులు పరాంబదయ వలన గర్వము విడిచి శాంతితో నుండిరి. తరువాత దేవి దక్షునింట నవతరించెను. దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవర్షము కురిసెను. సర్వమంగగానవతరించుటచే సర్వత్ర మంగళములు సంభవించినవి. జ్ఞానులామెను "సతి"యని పిలిచిరి. ఆ దక్షుని కూతురు మరల శివునకే యీయబడెను. ఆ దాక్షాయణి దక్షుని అపరాధముచే దైవయోగమున నగ్నిలో దుమికెను. ఆమె యగ్నికాహుతియయ్యెను. అంతట శివుడు విరహాతురుడై జపధ్యాన సమాధులతో కాలము గడుపుచుండెను. అని వ్యాసమహర్షి చెప్పగా జనమేజయుడు సిద్ధ పీఠములనేవి? అవి యెన్ని? వాటి పేర్లేవి? అచటి దేవతల పేర్లను కూడ వినగోరుచున్నానని యడుగగా వ్యాసుడిట్లు చెప్పెను:- ఓ రాజా! దేవీ పీఠములను గూర్చి వినినచో మానవుడు పాపము తొలగినవాడగును. పరమ

సిద్ధిని విభూతిని కోరువారు యేయే పీఠమందు యేయే నామములతో దేవి నుపాసించి ధ్యానింపవలయునో చెప్పెదను వినుము:-

కాశీ పీఠములో "విశాలాక్షి" యను పేరుతో దేవి పూజింపబడును. నైమి శారణ్యమందలి దేవి "లింగధారిణి" ప్రయాగలోని దేవి "లలిత" గంధమాదన పర్వతమందలిదేవి "కాముకి" దక్షిణమానసమున 'కుముద'ఉత్తరమానసమున అన్ని కోరికలనుతీర్చు "విశ్వకామ"గోమంతమందు "గోమతి" మందర పర్వతముపై "కామచారిణి" చైత్రరథమున 'మదోత్కట' హస్తినాపురమున "జయంతి" కన్యా కుబ్జమందు "గౌరి" మలయ పర్వతముపై "రంభ" ఏకామ్ర పీఠమున 'కీర్తిమతి' విశ్వమందు 'విశ్వేశ్వరి'పుష్కరమున "పురుహూతి" కేదారమందు సన్మార్గదాయిని, హిమాలయము వెనుక "మంద" గోకర్ణమున "భద్ర కర్ణిక" స్థానేశ్వరమున 'భవాని' బిల్వకమున "బిల్వపత్రిక" శ్రీశైలమున "మాధవి" భద్రేశ్వరమున "భద్ర" వరాహ పర్వతమున "జయ" కమలాలయమున "కమల" రుద్రకోటి యందు 'రుద్రాణి' కాలంజరమున "కాళి" శాలగ్రామమున "మహాదేవి" శివలింగమున 'జలప్రియ' మహాలింగమున "కపిల"మా కోటమున "ముకుటేశ్వరి"మాయాపురి యందు "కుమారి"సంతానమందు"లలితాంబిక" గయలో "మంగళ" పురుషోత్త మమున "విమల"సహస్రాక్షమున "ఉత్పలాక్షి" హిరణ్యాక్షమున "మహోత్పల"విపాశలో "అమోఘాక్షి"పుండ్రవరమున "పాటల" అనియు దేవిని పిలుచుచుందురు.

మరియు సుపార్శ్వమందు "నారాయణి" త్రికూటమున "రుద్రసుందరి" విపులమున "విపుల" మలయాచలమున "కల్యాణి" సహ్యా పర్వతముపై "ఏకవీర ' హరిశ్చంద్రమున "చంద్రిక" రామతీర్థమున "రమణ"యమున యందు "మృగా వతి" కోటతీర్థమున "కోటవి" మాధవీవనమున "సుగంధ" గోదావరియందు "త్రిసంధ్య" గంగాతీరమున "రతిప్రియ" శివకుండమున 'శుభానంద' దేవికాతట మందు "నందిని" ద్వారక యందు "రుక్మిణి" బృందావనమున "రాధా" మధురలో "దేవకి" పాతాళమున "పరమేశ్వరి" చిత్రకూటమున "సీత" వింధ్యపర్వతముపై "వింధ్యాధివాసిని" కరవీరమున "మహాలక్ష్మి" వినాయకమున "ఉమాదేవి" వైద్య నాథమున "ఆరోగ్య"మహాకాళమున "మహేశ్వరి" ఉష్ణతీర్థమున"అభయ" వింధ్య గిరిపై "నితంబ" మాండవ్యమున "మాండవి" మహేశ్వరీపురమున "స్వాహా" ఛగండమున 'ప్రచండ'అమరకంటకమున"చండిక" సోమేశ్వరమున 'వరారోహ' ప్రభాసమున "పుష్కరావతి" సరస్వతి లో "దేవమాత" సాగరతటమున 'పారావార' మహాలయమున మహాభాగ పయోష్ణిలో "పింగలేశ్వరి" కృతశౌచమున 'సింహిక' కార్తికమున "అతిశాంకరి". ఉత్పలా వర్తమున "లోల" శోణ సంగమున 'సుభద్ర'

సిద్ధవనమందు "లక్ష్మీమాత", భరతా శ్రయమున "అనంగ" జాలంధరమున "విశ్వముఖి" కిష్కింధ పర్వతమున "తార" దేవదారు వనమున "పుష్టి" కాశ్మీరమున "మేధ" హిమాద్రిపై "భీమాదేవి", విశ్వేశ్వరీ క్షేత్రమున "తుష్టి" కపాలమోచనమున "శుద్ధి" కాయావరోహణమున "శ్రీమాత" శంఖోద్ధారమున "ధర్మ" పిండారకమున "ధృతి" యనియు శ్రీదేవికి నామములు. శ్రీదేవి నామములు నూటయెనిమిది అట్లే శ్రీదేవి పీఠములు కూడ నూట యెనిమిదిగ ప్రసిద్ధి చెందినవి.

ఈ భూమండలమందింకను ముఖ్యములైన దేవీనిలయములున్నవి. ఎవడీ నూట ఎనిమిది దేవీ పీఠనామములు వినునో, చదువునోవాడు సమస్త పాపముల నుండి విముక్తుడై దేవీ సాలోక్యమును పొందగలడు. ఈ పుణ్యదేవీ పీఠములకు యాత్ర చేసినవాడు పితృతర్పణ శ్రాద్ధాదులాచరింపవలెను. శ్రీ భగవతికి పూజలు చేసి జగదంబను క్షమించుమని ప్రార్థించవలయును. ఇట్లొనర్చినవాడు ధన్యజీవి. బ్రాహ్మణులను భక్ష్యభోజ్యాదులతో సంతోషపెట్టవలయును. బ్రహ్మచారులకు బాలలకు ముత్తైదువులకు భోజనము పెట్టవలయును. మాయాబీజముతో ఆయా పీఠములయందలి దేవిని పూజింపవలయును.

మంత్రమును పురశ్చరణము చేయవలెను. ధనలోపము చేయరాదు. దేవి యందు భక్తిభావమును ప్రదర్శింపవలెను. ఇట్లు శ్రీదేవీయాత్రలు చేసినవాడు వేయి కల్పముల కాలము బ్రహ్మలోకములో నుండును. అతడు వాని పితృదేవతలు కూడ దేవీ పట్టణమందు నివసింతురు. చివరకు మోక్షమును పొందగలడు. దేవి యొక్క ఈ నూటయెనిమిది నామములను జపించి చాలమంది సిద్ధిపొందిరి. యీ నూటయెనిమిది నామములు పుస్తకములో వ్రాసి యుంచినచో గ్రహబాధలు తొలగును. అతని సౌభాగ్యము వృద్ధి చెందును. అతనికి పొందరానిది యుండదు. దేవతలతనికి నమస్కరింతురు. అతడు దేవీ స్వరూపుడే. శ్రాద్ధ సమయమున ఈనూటయెనిమిది నామము లను పఠించవలెను. పితృ దేవతలు పరమసద్గతి పొందగలరు. బుద్ధిమంతుడు ఈ సిద్ధ పీఠములను దర్శించి సకలశ్రేయస్సుల నందగలడు.

## శ్రీదేవి హిమగిరిపై అవతరించుట- శ్రీదేవి గీతలు

హిమవత్పర్వతముపై శ్రీదేవి యవతరించిన కథను చెప్పవలసినదిగా జనమేజయుడు ప్రార్థింపగా వ్యాసమహర్షి యిట్లు చెప్పనారంభించెను. రాజా! పూర్వము సతీదేవి తన శరీరము నగ్నికాహుతి చేసెనని వింటివిగదా! అప్పుడు శివుడు దేవీరూపమును ధ్యానించుచు కాలమును గడిపెను. ఆ సమయమున

తారకుడను రాక్షసుడు బ్రహ్మనుండి వరములు పొంది ముల్లోకములకు రాజుగా వ్యవహరిస్తు న్నాడు. శివుని ఔరసపుత్రుడు తప్ప మరియొకని చేతిలో అతనికి చావులేదు. శంకరునికి భార్యయే లేని సందర్భమున అతనికి కుమారుడు కలుగుటెట్లు? అని చింతించుచు దేవత లందరు వైకుంఠమునకు పోయి శ్రీమహా విష్ణువునకు కార్యమును విన్నవించగా ఆయన రహస్యముగా ఒక ఉపాయము చెప్పెను:-

"మణిద్వీపమందు నివసించు భువనేశ్వరి యున్నదికదా! ఆమెను మనము ఉపేక్షించినాము. దాని ఫలితమే ప్రస్తుత కష్టములకు కారణమని చెప్పి తల్లియే పిల్లవాని యపరాధములను సహించి వానిని సరిదిద్దవలయును. కనుక మీరందరు ఆపరదేవతను శరణువేడుడు. ఆమె మీపనిని నెరవేర్చగలదు" అని. దేవతలంద రను హిమవత్పర్వతమునకు వెళ్లుడ తానుకూడ భార్యతో హిమాలయమునకు వెళ్ళెను. అచ్చట కొందరు దేవతలు మంత్ర పురశ్చరణము మరికొందరు అంబ యాగమును ఇతరులు తృతీయాది వ్రతమును మరొక కొందరు శ్రీదేవీ నామజప పారాయణములను చేసిరి.

చాలాకాలము గడువగా ఒక సంవత్సరము చైత్రశుద్ధ నవమీ శుక్రవారము పరంజ్యోతి వారికి ప్రత్యక్షమయ్యెను. ఆ తేజస్సునకు మొదలు చివర చేతులు మొదలగు అవయవములు లేవు. దేవతలందరు కన్నులు మూసికొనిరి. అంతలో ఆ దివ్యతేజోరాశి స్త్రీ రూపము దాల్చెను. ఆమె అనేకాభరణములతో విరాజిల్లు చున్నది. యువతిగా గోచరించుచున్నది. నవరత్నములు వజ్రములు పొదిగిన కిరీటమును ధరించి యున్నది. నాలుగుచేతులు, మూడుకన్నులు కలిగి యెఱ్ఱని వస్త్రములు ధరించి చిరునవ్వుతో కూడిన ముఖముకలదై కరుణామూర్తియై దేవి దర్శనమిచ్చినది. ఆమెను చూచి సమస్తదేవతలు నమస్కరించిరి. ఆనంద బాష్పము లతో కూడి యేమియు మాట్లాడలేకపోయిరి. కొంతసేపటికి ధైర్యమును తెచ్చుకొని భక్తితో శిరస్సులు వంచి పరమ ప్రేమతో జగదంబనిట్లు స్తోత్రము చేసిరి.

శ్లో॥ నమోదేవ్యై మహాదేవ్యై శివాయైసతతం నమః।
నమః ప్రకృత్యై భద్రాయై నియతాః ప్రణతాః స్మతామ్
తామగ్ని వర్ణాంతప సాజ్వలంతీం వైరోచనీం కర్మఫలేషుజుష్టామ్
దుర్గాందేవీ గుంశరణమహం ప్రద్యేసుతరసితరసా నమః।
దేవీంవాచమ జనయన్తదేవాస్తాం విశ్వరూపాః పశవోవదంతి
సానోమంద్రేష మూర్జందుహానా ధేనుర్వాగుపసుష్టు తైతు

కాలరాత్రీం బ్రహ్మస్తుతాం వైష్ణవీం స్కందమాతరం
సరస్వతీ మదితిం దక్షదుహితరం నమామః పావనాంశివామ్
మహాలక్ష్మైచ విద్మహే సర్వశక్త్యైచ ధీమహి । తన్నోదేవీ ప్రచోదయాత్
నమో విరాట్స్వ రూపిణ్యై నమ శ్రీ బ్రహ్మ మూర్తయే ॥
నమో వ్యాకృత రూపిణ్యై నమస్సూత్రాత్మమూర్తయే
యద జ్ఞానాజ్జగద్భాతి రజ్జు సర్పస్రగాదివత్
యత్జ్ఞా నాల్లయ మాప్నోతి నుమస్తాం పరమేశ్వరీమ్ ॥
నమస్త త్పదలక్ష్యార్థాం చిదేకరసరూపిణీం
అఖండానంద రూపాంతాం వేద తాత్పర్యభూమికామ్ ॥
పంచకోశాతింక్తాంతా మవస్థాత్రయసాక్షిణీమ్ ।
పునస్త్వం పదలక్ష్యార్థాం ప్రత్యగాత్మ స్వరూపిణీమ్ ।
నమః ప్రణవరూపాయై నమో హ్రీంకార మూర్తయే ।
నానా మంత్రాత్మికాయైతే కరుణాయై నమోనమః ॥

**స్తోత్ర భావము:-** శ్రీదేవి! శివ! పరదేవత భద్రయగు తల్లికి నిరంతరము నమస్కరించుచున్నాము. జ్ఞానులలో హృదయాగ్ని రూపిణి చైతన్యరాశి సంసారతారిణి తపస్స ముజ్జ్వలయగు దుర్గకు నమస్సులర్పింతుము. దేవతలు దైవభాషను సృష్టించిరి. ప్రాణులు దానిని పెక్కు రూపముల పలుకుదురు. అట్టి వాక్స్వరూపిణి కామధేనువు మాకు అన్నము మొదలగు వానిని అనుగ్రహించుగాక. శ్రీకాళరాత్రి బ్రహ్మస్తుత, వైష్ణవి స్కందమాత సరస్వతి, అదితి, దక్షకన్య, పావనపావన తల్లి యునగు పరాంబికకు నమస్సు నర్పించుచున్నాము. మేము శ్రీమహాలక్ష్మిని సర్వశక్తి స్వరూపిణిగ ధ్యానించుచున్నాము. అట్టి శ్రీదేవి మాబుద్ధులను ప్రేరేపించుగాక. శ్రీ విరాట్స్వరూపిణి సూత్రాత్మమూర్తి అవ్యాకృతరూపిణి, బ్రహ్మమూర్తి యగు తల్లికి నమస్కారములు. త్రాటిని చూచి పామనిభ్రమ పడినట్లు నిన్ను తెలియక జగద్భ్రాంతికి గురియగుచున్నాము. జ్ఞానముచే భ్రమను తొలగించు త్రిభువనేశ్వరికి నమస్కారములు. తత్పదలక్ష్యార్థ చిదేకరస స్వరూపిణి అఖండానందరూప, వేదతాత్పర్య భూమిక, యగు దేవికి నమస్సు లర్పింతుము. పంచ కోశాతిరిక్త, అవస్థాత్రయసాక్షిణి, త్వం పదలక్ష్యార్థ - ప్రత్యగాత్మయగు దేవికి నమస్సులు. ప్రణవరూప హ్రీంకార మూర్తి నానా మంత్రాత్మక దయామయి యగు దేవికి నమస్సులు. అని మణి ద్వీపవాసిని యగు దేవిని దేవతలెల్లరు స్తుతించిరి. అప్పుడు దేవి మధురకంఠ ధ్వనితో ఇట్లు పలికెను.

'దేవతలారా! మీరే పనిమీద నిక్కడకు వచ్చితిరి. నేను నిత్యము వరముల నొసంగుదును. నేను మీయందుండగా మీకు చింతయేల? నేను నాభక్తులను దుఃఖసముద్రము నుండి తరింపచేయుగలను. ఓ దేవతలారా! ఇదియే నా సత్య ప్రతిజ్ఞయని తెలిసికొనుడు" అని పలికెను. అంతట వేల్పులు సంతోషించినవారై విర్భయముగా తమ దుఃఖము నిట్లు చెప్పికొనిరి.

"పూజ్యురాలవు నీకు ముల్లోకము లందును తెలియనిది లేదు. అన్నియు తెలిసినట్టి దానవు. అన్నిటికి సాక్షి రూపిణివి. ఇట్టి నీకు చెప్పవలసినదే మున్నది? తారకాసురునిచేత రాత్రిం బవళ్ళునూ బాధపడుచున్నాము. శివుని కుమారుడు తప్ప మరొకడతనిని చంపలేడు. బ్రహ్మ నుండి ఆవిధముగా వరము పొందియున్నాడు. శివునికిపుడు భార్యలేదు. నీకు తెలియునుకదా! సర్వజ్ఞురాలవగు నీముందు మేమేమి పలుకగలము? అంతయు సూక్ష్మముగా తెలిపితిమి. తదుపరి విషయమును తల్లీ! నీవే యాలోచింపుము. నీ దివ్యపాదపద్మములందు మాచిత్తము నిశ్చలముగా నుండుగాక" అని వేడిరి. వారి మాటలు విని పరమేశ్వరి యిట్లు పలికినది.

నాశక్తి హిమాలయముపై గౌరి యను పేరుతో అవతరింపగలదు. ఆమెను శివునికిచ్చి వివాహము చేయుడు. ఆమె మీపనిని పూర్తిచేయగలదు. మీకెల్లప్పుడును నాపాదములందు భక్తి నిశ్చలముగా నుండుగాక. హిమవంతుడు మిక్కిలి ఆదరముతో నన్ను పాపించుచున్నాడు. కనుక అతని ఇంట పుట్టుట నాకెంతయు నిష్టమైన విషయము అని పలికెను.

దేవి వాక్కులు విని హిమవంతుడు ఆనందపరవశుడై మహారాజ్ఞి కిట్లనెను:- దేవి! నీవెవని ననుగ్రహింతువో వానిని మహాపురుషునిగా చేసెదవు. కానిచో జడస్వరూపుడనగు నేనెక్కడ? సచ్చిదానంద రూపిణివి నీవెక్కడ? ఓ పూజ్యురాలా! వంద జన్మలకైనా నీకు తండ్రినగుట సంభవించునా? ఆహా! హిమవంతుడెంత ధన్యుడు. ఎంత యదృష్టవంతుడు. జగన్మాతను తన కుమార్తెగా పొందెనను కీర్తి జగ మంతట వ్యాపించును. అతనివంటివాడు లేడు. అనేక కోటిబ్రహ్మాండము లను గర్భమందు ధరించు జగన్మాత కూతురై జన్మించుటచే లోకములో నతనితో సమానుడు లేడు. అని అందరి గౌరవమును పొందగలను. ఓ పరమేశాని! భక్తితో గూడిన యోగమును వేదసమ్మతమగు జ్ఞానమును గూర్చి నాకు తెలియ జేయుము. అను హిమవంతుని మాటలు విని దయతో వేదాన్తరహస్యము తెలుపుటకు ఉపక్రమించెను.

దేవతలారా! వినండి. దీనిని వినినచో నా స్వరూపము సిద్ధించును. ఓ పర్వతరాజా! ఈ సృష్టికి పూర్వము నేనొక్కతెనే యుంటిని. నన్నే ఆత్మ స్వరూపమని చిత్తని, బ్రహ్మమని, జ్ఞానమని యునందురు. ఆత్మజన్మ మరణాది వికారములకు అతీతమైనది. ఆత్మ యొక్క సహజశక్తిని మాయ అందురు. ఇది సత్తుగాదు అసత్తుగాదు. ఈ మాయకంటె విలక్షణమైన యొక వస్తువు నిత్యమై వెలుగొందు చున్నది. సూర్యుని నుండి వేడివలె ఆత్మ స్వరూపము నుండి సహజముగ నీమాయ యేర్పడుచున్నది. గాఢనిద్రలో అన్ని పనులు విలయమైనట్లు మాయలో యెల్ల జీవులు వారి కర్మలు కాలములయమొందును. ఏ గుణములులేనిదానను ఐనను, మాయాశక్తి సంయోగముచే సమస్త లోకములకు కారణమైతిని. మాయ చైతన్య ముతో కలిసినప్పుడు జగత్తులకు నిమిత్త కారణమగును. ఈ మాయను పలువురు పలువిధములుగ పిలుచుచున్నారు. శైవాగమ పండితు లీమాయను "విమర్శ" అందురు. వేదాంతులు "అవిద్య"అనుచున్నారు. మాయకు నిగమాగమములందు పెక్కు పేర్లు కలవు. కనిపించునది యంతయు జడము. శుద్ధ చైతన్యము స్వయం ప్రకాశము అదృశ్యమునై యున్నది.

జ్ఞానస్వరూపము నిత్యము, సత్యము, జ్ఞానము నిత్యమనియు సాక్షియెరుగు ననియు తెలిసిన విషయమే. దానిని సచ్చిదానంద రూపమనియు చెప్పుదురు. జ్ఞాన మాత్మయేగాని యాత్మధర్మము కాదు. అది పరిమితము కాదు. మరియు చిత్స్వరూపము. ఆత్మ తనమాయవలన పూర్వపు సంస్కారములవలనను కాల కర్మపాకములవలనను సృష్టిని కోరును. నేను నీకు బోధించిన యీ తత్త్వము లోకోత్తరము లోకాతీతమును నాయీ పరతత్త్వము తత్త్వములన్నిటికిని మూల కారణము, సచ్చిదానంద స్వరూపము. మహత్తత్త్వమునుండి ఆకాశము పుట్టినది. దానినుండి వాయువు, దానినుండి తేజస్సు, దానినుండి జలము, దానినుండి గంధము గుణముగా గలభూమి జన్మించెను. ఆకాశమునకు శబ్దమొక్కటియే గుణము. వాయువునకు శబ్దము స్పర్శ రెండుగుణములు తేజస్సునకు శబ్దస్పర్శ రూపములు గుణములు. జలమునకు శబ్దస్పర్శరూప రసములు గుణములు. ఈ నాల్గుగుణములు కాక గంధమను ఐదవ గుణము కూడ కలది భూమి. వీటి అన్నిటి యొక్క కలయిక వలన "మహత్సూత్రము" కలిగెను. అది సర్వవ్యాపకము దానినే లింగదేహమనుచున్నారు. పంచీకృత పంచభూతముల కార్యవిరాడ్దేహము. ఇది పరమాత్మ యొక్క మూడవ స్థూలదేహము. పంచమహాభూతముల సత్వాంశము వలన శ్రోత్రాది జ్ఞానేంద్రియములలోని ప్రతిదాని సత్వాంశమువలన

నాలుగు భేదములు గల అంతఃకరణమే ర్పడును. దానిలో సంకల్ప వికల్పాత్మకము మనస్సు. నిశ్చయాత్మకము బుద్ధి యని యెరుగవలెను.

నేనే చేయుచున్నానను వృత్తియహంకారము. పంచభూతముల రజో గుణాంశముచే కర్మేంద్రియములు పుట్టినవి. ప్రతికర్మేంద్రియ రజోంశము నుండి ప్రాణాది పంచవాయువులు గలుగును. ప్రాణము హృదయమందు అపానము గుహ్యమందు వ్యానము నాభియందు ఉదానము కంఠమందు, సమానము శరీరమంతటను, ఉండును. పంచజ్ఞానేంద్రియములు పంచ కర్మేంద్రి యములు పంచప్రాణములు మనోబుద్ధులు మొత్తము పదిహేడగును. ఈ మొత్తము సూక్ష్మ శరీరమనియు లింగశరీరమనియు చెప్పబడుచున్నది. అందు రెండు విధములగు ప్రకృతియుండును. సత్త్వాత్మకమైన ప్రకృతి మాయ, గుణమయమగు ప్రకృతి అవిద్యయనియు చెప్పబడుచున్నది. మాయయందలి ప్రతిబింబమునకే యీశ్వరు డని పేరు. ఈశ్వరుడు సర్వవ్యాపక పరబ్రహ్మము నెరుగగలడు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు. సర్వకర్త, సర్వానుగ్రహకారకుడును అగుచున్నాడు.

ఓ పర్వతరాజా! అవిద్య యందు కూడ పరమాత్మ ప్రతిబింబించును. అట్టి ప్రతి బింబమును జీవుడని చైతన్యమనియు నందురు. ఈశ్వరజీవుల కిరువుర కును మూడేసి దేహములుండును. మూడు దేహములందుండు వారికి మూడేసి పేర్లు గలవు. జీవుడు కారణ దేహాభిమానియైనప్పుడు ప్రాజ్ఞుడనియు సూక్ష్మ దేహా భిమానియైనప్పుడు తైజసుడనియు స్థూలదేహాభి మానియైనప్పుడు విశ్వుడని యుపిలువబడును. ఇట్లే ఈశ్వరుడును వరుసగ ఈశుడు సూత్రాత్మ విరాట్టు అనబడును. జీవుడు వ్యష్టిదేహాభిమాని, ఈశ్వరుడు సమష్టిదేహాభిమాని. ఆ సర్వేశ్వ రుడు కేవలము జీవులనను గ్రహించు కోరిక గలవాడై యుండును. ఈశ్వరుడు జీవులకొరకు భోగ భాగ్యాల కాటపట్టైన విశ్వమును చిత్రవిచిత్రము గతన ప్రభావ ముతో రచించును. దేవి చెప్పుచున్నది:-

ఈ జగత్తంతయు నా మాయాశక్తితో నిండియున్నది. అదియంతయు కల్పితము. పరమార్థము నాకంటే వేరుగా లేదు. వ్యవహార దృష్టిలోనే మాయ యున్నది. గాని తత్త్వదృష్టితో చూచినచో మాయలేదు. ఓనగాధిరాజా! చిద్వస్తువు నగు నేనే పెక్కు మాయా కర్మలగూడి యీ ప్రపంచముల సృష్టించి అందు ప్రవేశింతును. అనేక మాయా భేదములవలన జీవులు పుట్టుచున్నారు. సూర్యుడు మంచి వస్తువులను చెడు వస్తువులను గూడ ప్రకాశింప జేయుచున్నాడు. ఐనను సూర్యునకెట్టి దోషమును కలుగదు.

అట్లే చిద్వస్తువునగు నాకు దోషమేదియు నంటదు. ఘహాకాశఘటా కాశము లకు భేదములేనట్లే జీవాత్మ పరమాత్మలకును భేదము లేదు. దేహము మనస్సు ఇంద్రియాదులు వాసనలు మొదలగు భేదములు మాయవలన కలుగుచుండును. వస్త్రమందు దారములవలె నాయందు జగత్తులన్నియు వ్యాపించియున్నవి. లోకములో కనబడు ప్రతివస్తువు నేనే. లోపల బయట వ్యాపించి యెల్లప్పుడు నుండును. నేనులేని వస్తువు ప్రపంచ మందెక్కడను లేదు. ఒకే త్రాడు పాము, దండ మొదలగు భేదములతో కనపచ్చినట్లు నేనును యీశ్వరాది బహురూపము లతో ప్రకాశించుచుందును. ఈదేవి మాటలువిని దేవతలు దేవీ నీసమష్టి దివ్య స్వరూపమును చూడగోరు చున్నాను. నీకు మాయెడల దయగల దేని చూపింపుము తల్లీ! యని ప్రార్థింపగా శ్రీదేవి తన దివ్యవిరాట్ స్వరూపమును చూపించెను. ఆ రూపము చూచి దేవతలు మూర్ఛిల్లిరి. వారిని వేదములు మేల్కొలిపెను. అప్పుడు వారు దేవి నీవిధముగ స్తుతింపసాగిరి. ఆనందాశ్రువులతో గళముతొట్రుబాటు చెంద తడబడుచు ఓ తల్లీ మా తప్పులు క్షమించుము. మమ్ము కాపాడుము మేము నీబిడ్డలము.

శ్లో॥ కోపం సంహారదేవేశి! సభయా రూపదర్శనాత్ ।
కాతేస్తుతిః ప్రకర్తవ్యాపామరై ర్నిర్జరైరిహ ॥
స్వస్యాప్యజ్ఞేయ ఏవాసౌ యావాన్యశ్చ స్వవిక్రమః ।
త్వదర్వాగ్జాయమానానాం కథం సవిషయో భవేత్ ॥
నమస్తే భువనేశాని! నమస్తే ప్రణవాత్మికే ।
సర్వవేదాంత సంసిద్ధే ! నమోహ్రీంకార మూర్తయే ॥
యస్మాదగ్నిస్సముత్పన్నో యస్మాత్ సూర్యశ్చ చంద్రమాః
యస్మాదోషధయస్సర్వాస్తస్మై సర్వాత్మనే నమః ॥
ప్రాణాపానే వ్రీహియవౌ తపః శ్రద్ధాఋతం తథా
బ్రహ్మచర్యం విధిశ్చైవ యస్మాత్తస్మై నమోనమః
సప్తప్రాణార్చిషోయస్మాత్సమిధ స్సప్త ఏవచ
హోమస్సప్తతథాలోకాస్త స్మై సర్వాత్మనే నమః
యస్మాత్సముద్రాగిరయః సింధవః ప్రచరంతి చ
యస్మాదోషధయస్సర్వారసాస్తస్మై నమోనమః ॥
యస్మాద్యజ్ఞస్సముద్భూతో దీక్షాయూపశ్చ దక్షిణాః
ఋచోయజూంషిసామాని తస్మై సర్వాత్మనే నమః ॥

నమః పురస్తాత్ పృష్ఠే చ నమస్తే పార్శ్వయోర్ద్వయోః
అధ ఊర్ధ్వం చతుర్దిక్షుమాతర్భూయో నమోనమః ॥
ఉపసంహరదేవేశి! రూపమేతదలౌకికమ్ ।
త దేవ దర్శయాస్మాకం రూపం సుందర సుందరమ్ ॥
ఇతి భీతాన్ సురాన్ దృష్ట్వా జగదంబా కృపార్ణవా ।
సంహృత్యరూపం ఘోరంతద్దర్శయా మాస సుందరమ్ ॥
పాశాంకుశ వరాభీతి ధరం సర్వాంగ కోమలమ్ ।
కరుణా పూర్ణనయనం మందస్మిత ముఖాంబుజమ్ ॥
దృష్ట్వా తత్సుందరం రూపం తదా భీతివివర్జితాః ।
శాంత చిత్తాః ప్రణేముస్తే హర్షగద్గదనిస్వనాః ॥

**స్తోత్ర భావము:-** ఓ దేవదేవీ! కోపము నుపసంహరింపుము. నీ భీకరరూపము చూచి వణకిపోవుచున్నాము. మేము పామరులము నిన్నెట్లు స్తుతించగలము? నీ విక్రమశక్తులెంతటివో మేము తెలిసికొనజాలము. త్రిభువనేశ్వరీ! నీకు మా ప్రణామములు. సూర్యచంద్రాగ్నులను సకలౌషధులను సృష్టించిన సర్వాత్మ స్వరూపమునకు ప్రణామములు. ఏ జగదంబ నుండి ప్రాణాపానములు, సత్యము శ్రద్ధ బ్రహ్మచర్యము మొదలగునవి జన్మించెనో అట్టి సర్వాత్మికకు ప్రణామములు. ఏ జగదంబ నుండి సాగరములు నదులు పర్వతములోషధులు సంభవించినవో అట్టి సర్వాత్మికకు నమస్కారములు. యజ్ఞము యూపము దీక్ష దక్షిణ ఋక్కు యజుస్సు సామము వీనిని సృష్టించిన పరాంబికకు ప్రణామములు. ఓ దేవీ! ఈ లోకాతీతమైన విశ్వరూపము నుపసంహరింపుము. అందాలకందమైన నీ మొదటి రూపమును ప్రదర్శింపుము తల్లీ! ఇట్లు భయభ్రాంతులైన దేవతలను చూచి జగదంబ శాంత సుందర రూపమును చూపెను.

దేవి దేవతలతో ఇట్లనెను :- మందభాగ్యులగు మీరెక్కడ? మహాద్భుత మైన నావిరాడ్రూపమెక్కడ? అయినను నా భక్తులపై గల వాత్సల్యముచేత ఇట్టి రూపమును చూపించితిని. ఈ నారూపము కేవలము వేదము చదువుటచేత లేదా యోగదాన తపోయాగములచేగాని చూడశక్యము కాదు. కేవలము నాదయ చేతనే చూడదగినది. ప్రస్తుత విషయమేమనగా పరమాత్మ అనేక శరీరములు ధరించి జీవుడై కర్తయగును. జీవుడు అనేక జన్మలెత్తుచు ధర్మాధర్మరూపము లగు పనులచే సుఖదుఃఖముల ననుభవించుచుండును. జీవులు సంసారచక్రము లో పరిభ్రమించుచు విశ్రాంతి లేనివారైయున్నారు.

అజ్ఞానముచే కోరికలు కొనసాగుచుండును. ఈ జన్మ పరంపరలు తుద ముట్టుటకు అజ్ఞానము తప్పక నశింపవలెను. జ్ఞానమువలనగాని అజ్ఞానము నశించదు. కోరికలు తొలగి పోయిననేగాని జీవన్ముక్తదశ లభించదు. కర్మలవలన అజ్ఞాము నశింపదు. సత్కర్మా చరణము జ్ఞానము కలుగుటకు సహాయపడును. వైదికకర్మలన్నియు చిత్తశుద్ధి కొఱకే. జ్ఞానము కలుగుటకు శమదమములు తితిక్ష వైరాగ్యము అత్యావశ్యకము లైయుండును. జ్ఞానముకొరకు భక్తితో శ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠుడునగు సద్గురువు నాశ్రయింపవలయును. నిర్మల చిత్తముతో నిరంతరము వేదాన్తశ్రవణము చేయవలయును. ఉపనిషత్తుల అర్థమననము చేయవలెను. జీవబ్రహ్మల ఏకత్వము తెలిసిన మానవుడు నిర్భయుడై నా సారూప్యమును పొందగలడు.

ఈ శరీరము మిథ్య (అసత్యము) అయినను మాయాభ్రాంతిచే ఉన్నట్లు తోచుచున్నది. ఇట్టి శరీరమే ఆత్మయొక్క స్థూల జ్ఞానకర్మేంద్రియములు, ప్రాణ పంచకము, మనోబుద్ధులు కలిసిన దేహము సూక్ష్మమైన ఉపాధియని పండితు లందురు. ఇది అంతకరణము యొక్క సుఖదుఃఖాదులను తెలుపు చుండును. ఆత్మయొక్క మూడవ ఉపాధి "కారణాత్మ"అది అనిర్వాచ్యము, అనాది, అజ్ఞాన మున జరుగును/పంచకోశము లీమూడు ఆత్మల యందును ఎల్లప్పుడు విల సిల్లుచుండును. రాజా! జీవుడు విమలజ్ఞాన సహితమగు ధ్యానమువలన నా సాక్షా త్కారమును పొంది నా సారూప్యమును పొందవలెను. అట్టి స్థితిలో నేను జీవుడు నొక్కటియే. మానవుడిట్టి ధ్యానయోగమువలన పరాత్పర స్వరూపమగు నన్ను దర్శించును. వెంటనే వాని వెనుకటి అజ్ఞానము కర్మయు నశించును.

హిమాలయుడు యోగమును గూర్చి వివరింపుమని శ్రీదేవిని ప్రార్థింపగా దేవి యిట్లనెను. జీవాత్మ పరమాత్మల ఐక్యమే యోగమని యోగులందురు. కామక్రోధలోభ మోహమదమాత్సర్యములు యోగమునకు విఘ్నము కలిగించునవి. యోగాంగముల సాయమున కామాదులను జయించి యోగమారంభింపవలెను. యమ, నియ, మానస, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు అష్టాంగములు. యమము, సత్యము, అహింస, బ్రహ్మ చర్యము- అస్తేయము, ఋజుత్వము, దయ, క్షయ, ధృతి, మితాహారము, శౌచము అని పదివిధములు. తపస్సు సంతోషము, దానము, అస్తికత్వము, దేవపూజ, వేదాంత శ్రవణము. లజ్జమతి, జప, హోమములు, పద్మ, స్వస్తిక, భద్ర, వజ్ర, వీరభేదముచే ఆసనము లైదు విధములు. జీవపరమాత్మల ఐక్యము అనుభవించుటయే సమాధి.

ఓ గిరిరాజా! బ్రహ్మ స్వరూపనగు నన్ను సహజ భక్తితో సతతము ధ్యానింప వలెను. బ్రహ్మము సర్వవ్యాపకము స్వయంప్రకాశము ఐనను హృదయగుహ యందు వెలుగొందును. ఇది యోగసాధ్యము. ఇది బుద్ధిల కందనిది. ఓంకారము అక్షరము బ్రహ్మము. బ్రహ్మమందు మనస్సును లగ్నమొనర్పవలెను. ఉపనిషత్తు ధనువు. అందు ధ్యానమను బాణము నెక్కు పెట్టి నిశ్చలచిత్తముతో అక్షరమును లక్ష్యము చేసి చేయవలెను. బ్రహ్మము లక్ష్యము. రథమునాభి (కుండ) యందు చక్రము, ఆకులు చేరియుండును. అట్లే హృదయమందు నాడులన్నియు చేరి యుండును. బ్రహ్మము హృదయమందే వెలుగొందును. ఆత్మ మనోమయము. ప్రాణ శరీరములకధినేత అన్నమున ప్రతిష్ఠితము. హృదయాంతరవర్తి. ఆనంద స్వరూపము. అమృతరసనిధి, ధీరులగు వారు అనుభవ పూర్వకముగ ఆత్మ విచారముతో దీనిని దర్శింతురు.

హిమాలయుడు భక్తి యోగమును వివరింపుమని కోరగా దేవి యిట్లనెను! గిరిరాజా! మోక్షప్రాప్తికి, జ్ఞానభక్తి, కర్మయోగములు మూడు మార్గములు. ఈ మూడింటిలో భక్తియోగము సులభము. ఈ భక్తి మూడు విధములుపరలకు బాధ కలిగించునది. తామ సభక్తి, పామరుని భక్తి రాజసభక్తి. కేవలము నా సంతోషము కోరి చేయు భక్తి సాత్వికభక్తి. తామసరాజ సభక్తులు పరభక్తిని కలిగింప జాలవు. పరభక్తిని (నిశ్చలభక్తి)ని గూర్చి చెప్పెదను వినుము. నా దివ్యగుణములు వినుట, నా దివ్యనామ సంకీర్తనము, నాయందు చిత్తము నిలిపి తైలధారవలె మననము చేయుట, మోక్షమును కూడ కోరక నాసేవను మాత్రమే కోరియుండుట ఉత్తమైన భక్తి. హిమాలయుడు దేవీప్రియములు ముఖ్యములు పవిత్రములనగు పుణ్యక్షేత్రము గూర్చి తెల్పుమనగా శ్రీదేవి యిట్లనెను.

ఓ హిమాలయా! నేను విశ్వస్వరూపిణిని సర్వకాల స్వరూపిణిని కనబడుచోటు లన్నియు నా దివ్యస్థానములే ఐనను నీపై వాత్సల్యముచే కొన్ని పుణ్యక్షేత్రములను తెల్పెదను. కోలాపురము నా మహాపుణ్య స్థానము. అక్కడ మహాలక్ష్మి నిత్యము విలసిల్లుచుండును. రెండవది సహ్య పర్వతము మీది మాతృపురము. అందు రేణుకాదేవి యుండును. మూడవది తులజాపురము. అచట హింగుళాదేవి విలసిల్లి యున్నది. సప్త శృంగమున జ్వాలాముఖి, శాకంభరీ పరధామము- భ్రామరీస్థానము- రక్తదంతికా నివాసము శ్రీదుర్గా ధామమును కలవు. వింధ్యపర్వతముపై నున్న దేవీస్థానము ఉత్తమోత్తమమైనది. శ్రీమంతమైన కాంచీపురము- అన్నపూర్ణా మహా

స్థానము శ్రీభీమాదేవి మహాస్థానము. విమలాదేవి స్థానము- శ్రీచంద్రలా మహాస్థానము. శ్రీకేశికే స్థానమును కలవు. నీల పర్వతశిఖమున నీలాంబరీ దేవి నిలయము గలదు. శ్రీనగరమందు జాంబునదేశ్వరీదేవి వెలయుచున్నది. శ్రీగుహ్యాకాళికి నేపాలము ప్రతిష్ఠాస్థానము చిదంబరము మీనాక్షిదేవికి నిలయము. శ్రీ వేదారణ్య మహాస్థానమున సుందరీ దేవి ఏకాంబర మహాక్షేత్రమున శ్రీపరాశక్తి దేవి ప్రతిష్ఠితులై యున్నారు. చీనదేశమున మదాలసావరం స్థానము. ఇది దేవికి మిక్కిలి ప్రియమైన స్థానములు.

హిమవంతుడు నీ దివ్యపూజా విధానము తెలుపుమనగా శ్రీదేవి యిట్లనెను. గిరిరాజా! నా పూజ రెండు విధములు బాహ్యము, అభ్యంతరము బాహ్యపూజ వైదికమని, తాంత్రికమని రెండు విధములు. వేదమంత్ర పూర్వకముగా దేవిని ఆవాహనాదులతో అర్చించుట వైదికము. తంత్రమందు చెప్పినట్లు చేయునది తాంత్రికము. నా స్వరూపమందు చిత్తము తాదాత్మ్యము చెందుటే అభ్యంతర పూజ యనబడును. బాహ్య పూజయెట్లనగా మొదటి దేవి దివ్యమంగళ విగ్రహమును హృదయమున భావించి యాహ్వానము చేయవలెను. పిమ్మట పీఠమందు ప్రాణప్రతిష్ఠ. పిమ్మట ఆసనము అర్ఘ్యము, పాద్యము, అచమనము, నైవేద్యతాంబూలములు దేవికి అర్పించవలయును. పిమ్మట శ్రీ చక్రమందున్న ఆవరణ దేవతలను చక్కగా పూజింపవలెను.

భక్తుడు తన దేహమును తన సర్వస్వమును నాకే సమర్పింపవలెను. నిత్యాగ్ని కార్యమొనరింపవలెను. బ్రాహ్మణులను ముత్తైదువులను వటువులను కన్యలను ఇతర పామర జననమును శ్రీదేవిగా భావించి వారికి సంతోషము కలుగునట్లు భోజనము పెట్టవలెను. నృత్యగీత వాద్యములతో దేవిని ప్రసన్నురాలిని చేయవలయును. వేదపారాయణములందును సకలపురాణములందును నేనే ప్రతిపాదింపడుచున్నాను. అందువలన వేదపారాయణము చేసి నన్నానందింపజేయవలయును. ఎవడీవిధముగ భువనేశ్వరీదేవిని పూజించునో అతనికెక్కడనైన సాధ్యము కానిదిలేదు. అతడు శరీరము వదలిన పిమ్మట నా మణిద్వీపమును తప్పక చేర గలడు. ఇట్టి నా పరమభక్తుని దేవీ స్వరూపునిగా తెలియవలెను. ఇతని కెల్ల దేవతలు నమస్కరింతురు. ఇది యంతయు తెలిసికొని నీ శక్తికి తగినట్లు నన్ను పూజింపుము. దానిచే నీవు ధన్యుడవగుదువు. ఈ దేవీగీతా శాస్త్రమును భక్తుడు కాని వానికి చెప్పరాదు. ఇట్లు పలికి దేవి అచ్చట అంతర్థానము చెందెను.

# అష్టమ స్కంధము

దేవీ లీలామృతమును వెలువరించు ఏడు స్కంధములు విన్నను తృప్తి పడని జనమేజయుని సంతృప్తికై శ్రీమన్నారాయణుడు నారదునికి చెప్పిన విషయములను వ్యాసమహర్షి యిట్లు చెప్పెను

## భువనకోశము- వరాహమూర్తి భూమి నుద్ధరించుట

జనమేజయుడు మన్వంతరములన్నిటి యందును శ్రీదేవి యే యే రూపముల దాల్చి పూజలందుకొనును. ఏయే స్థానములందు ఆరాధింపబడి దేవి ఫలము లొసగుచుండును మొదలగు విషయములు తెలుపుమనగా వ్యాసుడిట్లనెను. రాజా! శ్రీదేవ్యారాధనమును గూర్చి చెప్పుచున్నాను వినుము! పూర్వమీ విషయమునే నారదుడడుగగా నారాయణుడిట్లు చెప్పెను.

ఓయీ! దేవర్షీ! ఈ జగత్తును దేవియే త్రిగుణముల నాధారముగా చేసికొని పుట్టించును. పెంచును చివరకాయెమే నశింపజేయును. మొట్టమొదటి బ్రహ్మ పుత్రుడు స్వాయంభువమనువు. అతడు ప్రతాపవంతుడు శతరూపకు భర్త. బ్రహ్మ వత్సా! నీవు సర్వోత్తమయగు దేవి నారాధింపుము. ఆమె దయవలన సృష్టించు శక్తి నీకు కలుగునని చెప్పగా నాతడు జగదంబను గూర్చి తపమొనర్చెను. మరియు నిశ్చలబుద్ధితో దేవిని స్తుతించెను. అతట దేవి ప్రసన్నయై వరము కోరుకొనుమనగా నాతడు ఎట్టి విఘ్నములు లేకుండ ప్రజాసృష్టి కొనసాగవలెనని కోరెను. అట్లేయగు నని దేవి పలికి అంతర్ధాన మొందెను.

ప్రజాసృష్టికి అనుకూలముగా నుండు నొకస్థానము నాకు ఇమ్మని బ్రహ్మ నడిగెను. బ్రహ్మ భూమి నీటి మునిగియున్నది. నా సృష్టియెట్లు నెరవేరునని యాలోచించుచుండగా బ్రహ్మ ముక్కుచివరనుండి వరాహశిశువు ఉద్భవించెను. అది చూచుచుండగనే పెద్దయేనుగంతగా పెరిగెను. బ్రహ్మక్షణములో నింత పెద్ద య్యెనే యని యాలోచించుచుండ వరాహ భగవానుడు పర్వతమంత రూపము దాల్చి గర్జించెను. అంత బ్రాహ్మణులు ఋక్సామాధర్వమంత్రములతో వరాహ మును స్తుతించిరి. వరాహమూర్తి సంతసించి నీటిలో మునిగెను. నీటిలో నిటునటు పరుగెత్తుచు భూమిని వెదకి పట్టుకొని కోరలతో పైకి లేపెను. బ్రహ్మ వరాహ మూర్తిని స్తుతించిరి. భగవంతుడు తన కటాక్షములతో బ్రహ్మ ననుగ్రహించెను.

ఆ సమయమున హిరణ్యాక్షుడను మహాసురుడు త్రోవకడ్డురాగా భయం కరమగు గదతో వానిని భగవంతుడు సంహరించి భూమిని నీటినుండి కోరలతో పైకి లేపెను. వరహామూర్తి భూమిని యథాస్థానమందుంచి తన స్థానమునకేగెను.

# ఆదివరాహుడు

నారాయణుడు నారదుడికి చెబుతున్నాడు.

ఆది మనువు స్వాయంభువు. దేవి దయకై తపము చేసెను. అనుగ్రహించిన దేవిని నిర్విఘ్నముగా సృష్టిని చేయు వరమునిమ్మని కోరెను. దేవి అతనికావరము నిచ్చెను. మనువు బ్రహ్మకీ విషయమును చెప్పి ప్రజా సృష్టి చేయుటకై ప్రశాంతమైన ప్రదేశమును అనుగ్రహింపుమని కోరెను.

"బ్రహ్మ" నేను చిరకాలమునుండి సృష్టిని చేయుచున్నను భూమి జలములో మునిగిపోవుచున్నది. ఆదిదేవుని దయలేనిదే నా ప్రయత్నము నెరవేరదు అని బ్రహ్మ తన బాధను చెప్పెను. ఆ సమయమున సూక్ష్మరూపముతో నావిర్భవించిన వరాహమూర్తి పర్వతా కారుడయ్యెను. అతడు గర్జించుచూ నిరాఘాటముగా సముద్రమున ప్రవేశించెను. నీట మునిగిన భూమిని పైకెత్తి మోయుచు వెలుపలకు కొని వచ్చెను. అప్పుడు బ్రహ్మ మొదలగువారు అందరను సంతసించి శ్రీ మహా విష్ణువును స్తుతించిరి. అంతలో హిరణ్యాక్షుడు వచ్చి వరాహమూర్తిని అడ్డుకొనెను. వరాహమూర్తియు వానిని చంపి వైకుంఠమునకు వెళ్ళెను.

# మనువంశ వర్ణనము- ద్వీప వర్ష సముద్రాది వర్ణనము

అప్పుడు మనువు బ్రహ్మ ఆజ్ఞచే సృష్టిని ప్రారంభించెను. ప్రియవ్రతుడు ఉత్తానుపాదుడు అను పుత్రులను ఆకూతి, దేవహూతి, ప్రసూతి అను పుత్రికలను కనెను. తన పుత్రికలను రుచి, కర్దమ, దక్షులకు యిచ్చి వివాహము చేసెను. ఆకూతి యజ్ఞపురుషుని, దేవహూతి కపిలుని, ప్రసూతి అనేక పుత్రికలను కనిరి. ప్రసూతి సంతానము దేవతలను, మానవులను, పశుజాతిని కనెను. కపిలుడు సాంఖ్యయోగ జ్ఞానియై తల్లికి తత్త్వము నుపదేశించి పులహుని ఆశ్రమమును చేరి గొప్పవాడయ్యెను. యజ్ఞ పురుషుడు మన్వంతరమున దుష్టులగు రాక్షసులను సంహరించెను. ఇది మనుకుమార్తెల చరిత్ర. ఇక కుమారుల చరిత్రను వాళ్ళు- ద్వీపములను వర్షములను, సముద్రములను చేసిన వ్యవస్థనూ విను- స్వాయం భువుని పెద్ద కుమారుడు ప్రియవ్రతుడు. వాని పుత్రులు పదిమంది. 'అగ్ని' అను

బిరుదము నందినారు. కవి, సవనుడు, మహావీరుడు, సన్యాసమును స్వీకరించిరి. ప్రియవ్రతుని పుత్రిక ఊర్జస్వతి. ప్రియవ్రతుని మరియొక భార్యకు ఉత్తమ, తామస రైవతులు అను పుత్రులు కల్గిరి. వారు ముగ్గురును మన్వంతరములకు అధిపతులయిరి. విశాలమైన ప్రియవ్రతుని రాజ్యము ఒకవైపున చీకటితో నిండియుండెను. అప్పుడతడు రథమునెక్కి యేడుమార్లు భూమికి ప్రదక్షిణము చేసెను. అతని రథచక్ర ముల గమనముచే సప్తసముద్రములేర్పడినవి. ఆసముద్రముల మధ్యనున్న భూమి-జంబు, ప్లక్ష, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, పుష్కరములను యేడు ద్వీపము లయ్యెను. ఆ ద్వీపములు ఒకదానికన్నా మరొకటి రెండింతలు ఉండును. వాని చుట్టును ఉప్పు, చెరకు, కల్లు, నేయి, పాలు, పెరుగు మంచినీరు అను యేడు సముద్రములుగా యేర్పడెను. ప్రియవ్రతుడు తన కుమార్తెను శుక్రునకు యిచ్చెను. మిగిలిన యేడుగురు పుత్రులకు రాజ్యమునిచ్చెను.

# భువనకోశ వ్యవస్థ-1

జంబూద్వీపము తనంత పరిమాణముగల ఉప్పుసముద్రముతో చుట్టబడినది. ప్లక్షద్వీపము జంబూ ద్వీపముకంటె రెండింతలు ఎక్కువపరిమాణము కలది. అదియు క్షీరసముద్రముచే చుట్టబడియున్నది. అచట ప్రియవ్రతుని కుమారుడు సప్తజిహ్వుడు కలడు. ఆ ద్వీపమునకు ఇధ్మజిహ్వుడధిపతి. అతడా ద్వీపము నేడు వర్షములుగా విభజించి తన యేడుగురు కొడుకులకు పంచి యిచ్చెను. అతడాత్మ విచారయోగముతో భగవంతునిలో లయమొందెను. అరుణ, న్నమ్ల మొదలగు ముఖ్య జీవనదులందు గలవు. మణికూటము వజ్రకూటము మొదలగు పర్వతములందున్నవి. ఇందు నాల్గు వర్ణములవారుందురు. వారు వేయేండ్లు జీవింతురు. సరసము శతశృంగము మొదలగు పర్వతములు, అనుమతి మొదలగు నదులును అ ఏడు వర్షములందు కలవు. ఇచట నాలుగు వర్ణముల ప్రజలు నివాసము చేతురు.

నారదుడు తక్కిన ద్వీపముల గూర్చి కూడ చెప్పుమనగా నారాయణుడిట్లు చెప్పెను. కుశద్వీపము చుట్టు నేతిసముద్రము గలదు. దీనికి రెండింతల పరిమాణముతో క్రౌంచద్వీపముండును. దీనికి క్రౌంచద్వీపమని పేరు వచ్చెను. ఈ ద్వీపమునకు రాజు ప్రియవ్రతుని పుత్రుడు ఘృతపృష్ఠుడు ఇతడు తన ఏడుగురు పుత్రులకు ఏడు వర్షములు విభజించి అప్పచెప్పెను. ఆ మమము మధురుహాము మొదలగు పేర్లు గలవి. ఆ ఏడు వర్షములు. అందేదేసి సంఖ్యలో నదీ పర్వతము

లున్నవి. శుక్లము, వర్ధమానము మొదలగు పేర్లు గల పర్వతములు అభయ ఆర్యక మొదలగు నదులు గలవు. నాల్గు వర్ణముల వారచట వసింతురు.

సూర్యభగవానుడు భూమ్యాకాశముల నడువ తన కాంతుల వెదజల్లు చుండును. సూర్యుడు ఉత్తరాయణమును ఆశ్రయించి తన నడకలో మాంద్యము కలిగియుండును. ఏలయన పైకెక్కుచు ప్రయాణింపవలసిన సమయము. కనుక పగటి పరిమాణము దీర్ఘమగును. దక్షిణాయన మాతనికి క్రిందికి దిగు సమయము కనుక అతని నడక వేగము గలిగియుండును. అందుచే పగళ్ళ పరిమాణము పొట్టిదగును. విషువత్ అనగా ఒక అయనము నుండి వేరొక అయనమునకు మారెడి దినము. ఇది సమతలము ఈ ప్రదేశమున ప్రయాణము రాత్రింబవళ్ళు సమంగా హెచ్చుతగ్గు లేకుండ నుండును. ఇది సాధారణముగా మార్చి 22 నుండి సెప్టెంబర్ 23వ తేదీలకు ఇంచుమించుగానగును. ఇది సూర్యుడు మేషమందు తులయందును సంచరించుకాలమగును.

అప్పుడు అహోరాత్రములు సమ పరి మాణములో నుండును. వృషభ, మిథున, కర్కాటక, సింహ, కన్యారాశులతో సూర్యుడున్నప్పుడు క్రమముగా పగటి పరిమాణము పెరుగును. రాత్రుల పరిమాణము తగ్గిపోవును. వృశ్చిక, ధను, మకర, కుంభ, మీనరాశులందు సూర్యుడుండగా రాత్రుల పరిమాణము పెరుగుచు పగటి పరిమాణము తగ్గిపోవును. సూర్యుడెవరి కెక్కడ నుండి ఉదయించునో అది వారికి తూర్పుదిక్కగును. అందరకును మేరువు ఉత్తరముననే యున్నది. సూర్యుడు ఉదయించుచోట అమరావతి, అతడంతరిక్ష మధ్యమునకు చేరి మధ్యాహ్నము నేర్పరచు స్థానము సంయమని.

అస్తమించు స్థానము నిమ్లోచని- విభావరి యను కుబేరపురి. అర్ధరాత్రి స్థాన మని నిర్ణయము. ప్రాణుల జీవన ప్రవృత్తులకు మూలము. కాలము దాని వ్యవస్థకు మూలము సూర్యుని గమనము. సూర్యుని రథగమనమును గుర్తించుటకు సాధ నము దిక్కులు. మేరువు నాధారముగా తీసికొని ఈ వ్యవస్థ యేర్పడినది. మేరువు నందున్న వారికి సూర్యుడెప్పుడును అంతరిక్ష మధ్యమున నున్నట్లే కనబడును. అతడు మేరువునకు కుడి యెడమల నడచుటయే అచటి వారికి ఉదయాస్తమ యములు. ఆయా దేశములందు, మూలలయందు సూర్యుడు కనబడుట యే ఆయా కాలవ్యవస్థకు ఆధారము. ఎవరికెచ్చట నున్నట్లు ఉదయమున సూర్యుడు కనబడునో వారికి అచ్చట తూర్పుదిక్కు. ఎక్కడ సూర్యుడు కనబడక పోవునో అది పడమరదిక్కు వాస్తవమునకు ఉదయాస్తమయములు సూర్యునకు లేవు. అతడు కనబడుట, కనపడక పోవుటయే సూర్యోదయ సూర్యాస్తమయములు.

# కర్మగతి విశేష వ్యవస్థ

భగవంతుడు లోకములను వింతవింతలుగ నేల సృష్టించెనో తెలుపమనగా నారాయణు డిట్లనెను. కర్త యొక్క శ్రద్ధ ననుసరించి కర్మఫలములు వేర్వేరుగా మూడు విధములు. సాత్విక శ్రద్ధవలన సుఖము. రాజసశ్రద్ధవలన దుఃఖము. తామసశ్రద్ధ వలన దుఃఖము మూర్ఖత్వము కూడ కలుగును. యీ శ్రద్ధతర తమ భేదములచే ఫలములందు భేదములు కలుగును.

# వర్ణభేద వ్యవస్థ - కర్మ విపాకము

నారదుడు ఏయే కర్మలవలన నరకయాతనలు కలుగునో వానిని తెలియ జేయుమని యడుగగా నారాయణు డిట్లనెను. పరస్త్రీ పరధనముల అపహరించిన వాడు యమయాతనలకు గురియగును. అకారణముగ ప్రాణులను హింసించు వాడు నరకములో మృగముచే బాధింపబడును. రురుమృగములు బాధించు స్థానము గనుక రౌరవమని పేరేర్పడినది. పశుపక్ష్యాదులను బంధించువాని యమదూతలు కట్టివైచి కొట్టెదరు. తల్లిదండ్రులకు బ్రాహ్మణులకును ద్రోహము చేయువాడు కాలసూత్ర నరకమున మంటలలో తపింప చేయబడును. పాషండమతము నవలం బించిన వానిని అసిపత్రమను నరక భాగమున కొరడాలతో యమభటులు కొట్టెదరు. రాజు అధర్మముగ బ్రాహ్మణుని దండించినచో సూకర ముఖమను నరకమున యమకింకరులచే త్రోయబడును. ఎవడితరుల బాధ గుర్తింపడోవాడు అంధకూప నరకమున పడవేయబడును. ఇంకను అనేక విధములగు కర్మ ఫలములు గలవు.

# కర్మ విపాకము

ఎల్లప్పుడు అబద్ధములాడువారు "అవాచి" యను నరకమున పడుదురు. సోమపానము చేసిన పిదప సురాపానము చేసినచో నరకమున కూలును. గౌరవింప దగినవానిని గౌరవించకుండుట వలన క్షౌరకర్దమ నరకమున కేగును. అచట తలక్రిందుగ నుండి ఘోరయాతనల ననుభవించును. పుణ్యాత్ములను మోసగించు వారు యమభటులచే పీడింపబడుదురు. ధనమదాంధుడు సూచీముఖ నరకమున కూలును. ఈ ప్రకారము పాపాత్ములకెన్నెన్నో రీతుల నరక బాధలు కలవు. ఈ నరకములన్నియు పెక్కు యమయాతనలతో నిండి యుండును. ధర్మపరులైన పుణ్యాత్ములు సుఖలోకమున కేదురు. పరమధర్మము దేవీ పూజలతో దేవ్యారాధన లక్షణములతో కూడి యుండును. శ్రీలలితాంబా దేవి తనను పూజించిన పుణ్యా త్ములను సంసార సాగరము నుండి యుద్ధరించును.

# దేవ్యారాధన తత్ఫల స్వరూపము

నారదుడు దేవ్యారాధన పరమగు ధర్మము దాని ఫలము వినగోరుచున్నానని నారదుడడుగగా నారాయణుడిట్లు చెప్పుచున్నాడు. దేవర్షీ! నారదా! ఈ సంసారము మొదలులేనిది. దీనిని దాటి నిత్యము సుఖము ననుభవించుటకు దేవిని సేవింప వలెను. ఆమె ఘోరసంకటముల నుండి కాపాడగలదు. ఆమెను పూజించుటయెట్లో వినుము! పాడ్యమినాడు శ్రీదేవికి నేయినైవేద్యము చేసి బ్రాహ్మణునకు పాలు దానము చేసినవాడు సర్వదుఃఖముల నుండి విముక్తుడగును. చవితినాడు అపూప ములు శ్రీదేవికి నైవేద్యము చేసి బ్రాహ్మణులకు వాటిని దానమిచ్చిన విఘ్నములు తొలుగును. విదియనాడు పంచదారతో దేవిని పూజించి బ్రాహ్మణునకు దాన మిచ్చినచో చాల సంవత్సరములు జీవించును. తదియనాడు శ్రీదేవికి.పాలు నైవేద్యం చేసిన బ్రాహ్మణునకు పాలు దానమిచ్చిన సర్వదుఃఖములనుండి విముక్తు డగును. పంచమినాడు అరటిపండ్లు నైవేద్యము పెట్టి విప్రునకు దానము చేసిన స్మరణశక్తి పెంపొందును. షష్ఠినాడు తేనె నైవేద్యము చేసిన దానమొనర్చిన మన్మథుని వలె సుందరుడగును. సప్తమినాడు బెల్లము నైవేద్యమొనర్చి దానము చేసినవాడు దుఃఖరహితుడగును.

అష్టమినాడు కొబ్బరికాయ నివేదన చేసి దాన మిచ్చిన తాపత్రయముండదు. నవమినాడు పేలాలు నివేదించి దానమొనర్చిన పై లోకములందు సౌఖ్యముకలు కలుగును. దశమినాడు నల్ల నువ్వులు దేవికి అర్పించి దానము చేసిన యమలోక భయముండదు. ఏకాదశినాడు పెరుగు నివేదించి దానమొనర్చిన దేవి ప్రసన్నురా లగును. ద్వాదశినాడు అటుకులు నివేదన చేసి బ్రాహ్మణుని కిచ్చినచో దేవికి ప్రియభక్తుడగును. త్రయోదశియందు శనగలు నైవేద్యము చేసి దానమిచ్చిన సంతానము కలుగును. చతుర్దశి యందు పేలపిండి నివేదించి దానము చేసినచో శివునకు ప్రియుడగును. పూర్ణినునాడు పరమాన్నము నైవేద్యము పెట్టి దానమిచ్చిన పితృదేవతలు తరింతురు. ఇట్లు ఒనర్చి శ్రీదేవిని స్తుతింపవలయును.

# భువన కోశ వ్యవస్థ-2

జంబూద్వీపము పరిమాణము లక్షయోజనములు యిలావృత, రమ్యక, హిరణ్మయ, గురు, హరి, కింపురుష, భరత, కేతుమాల, భద్రాశ అను వర్షములు తొమ్మిది. యిలావృత వర్షము వీనికి మధ్యగా నుండును. మిక్కిలి యెత్తైన మేరు పర్వతము, జంబూద్వీపము మిక్కిలి మనోహరములు. అక్కడ మందర

పర్వతమున మామిడి చెట్టుకలదు. దాని ఫలములు మిక్కిలి పెద్దవి. ఆ ఫలముల రసమే అరుణోదయనది. భగవతి మందర పర్వతమునుండును. జంబూద్వీపము నందు వర్షములయందు దేవిని పూజింతురు. ఇలావృతమున ఆదిదేవుడు రుద్రరూపమున సంకర్షణుని, భద్రాశ్వమున భద్రశ్రవుడు హయ గ్రీవుని, హరి వర్షమున నృసింహుని, కేతు మాలమున కామదేవుని, రమ్యకమున మత్స్యా వతారమును, హిరణ్యకమున కూర్మావతారమును, భారతమున శ్రీమన్నా రాయణుని పూజింతురు.

ఈ భరతవర్షములో మైనాకము, త్రికూటము మున్నగు పర్వతములు యెన్నియో కలవు. ఈ పర్వతములలో పుట్టి - సర్వపాపనాశకములైన నదులు యెన్నో ఉన్నాయి. తామ్రవర్ణి, చంద్రవంశా, కృతమూలా, పటోదకా, వైహాయసీ, కావేరీ, వేణా, పయస్వినీ, తుంగభద్రా, కృష్ణవేణీ, శర్కరావర్తకి, గోదావరీ, భీమరథి, నిర్వింధా. పయోష్ణికా, సురసా, నర్మదా, సరస్వతీ, చర్మణ్వతీ, సింధూ, ఋషికుల్యా యిలా యెన్నో నదీనదాలున్నాయి ఇక్కడి భారత వర్షీయులు - వర్ణాశ్రమ ధర్మ మును అనుసరిస్తూ మోక్షం పొందుతారు. అందుకే ప్రపంచం మొత్తంలో యీ వర్షానికి యెనలేని గౌరవం. ఈ ప్రపంచంలోనే నన్నమాటేమిటి? ముల్లోకాల్లోనూ భారత దేశం గౌరవిచబడుతోంది. ఈ ఒక్క దేశంలోనే తమతమ యజ్ఞభాగాలూ అందు కోవడానికి దేవతలు స్వయంగా వస్తారు. ఇలా జంబూద్వీపంలో ప్రధానమైన తొమ్మిది వర్షాలే కాక - స్వర్గప్రస్థం, చంద్రశుక్రం, అవర్తకం, రమణకం, మందరం, హరిణం, పాంచజన్యం సింహళం అనే మరోఎనిమిది ద్వీపాలున్నాయి అవన్నీ సగరుని కుమారులు యాగాశ్వమును వెదకునప్పుడు యేర్పడినవి, జంబూద్వీపం లాగానే ప్లక్షాది ద్వీపాలు కూడా వైభవోపేతంగా పరిఢవిల్లుతున్నాయి.

# భువన కోశ వ్యవస్థ- జ్యోతిర్వవస్థ

మొత్తంమీద యీ భూగోళం యాభైకోట్ల యోజనాలు వ్యాపించి వుందని శాస్త్రజ్ఞులు అంచనా వేసారు. దేవోత్తముడైన సూర్యుడు యాభైలక్షల యోజనాలు భూమి చుట్టూ ప్రతినిత్యం తిరుగుతూనే వుంటాడు. క్షణానికి రెండువేల యోజనాలు ప్రయాణిస్తాడు. సూర్యాసన విస్తీర్ణము తొమ్మిదిలక్షల యోజనాలు, స్వర్గమర్త్యలోకాల నడుమ అంటే భూలోకానికీ, ద్యులోకానికీ మధ్యది అంతరిక్షం. అక్కడే వుంటాడు సూర్యుడు. భూమికి యాభైకోట్ల యోజనాల దూరములో సూర్యుడు ఒక ఏడాదిలో నడిచే మార్గాన్ని చంద్రుడు ఒక నెలలో పూర్తిచేసేస్తాడు.

సూర్యుని కిరణాలనించి లక్షయోజనాల దూరములో వుంటాడు చంద్రుడు. చంద్రుడిపైన మూడు లక్షల యోజనాల దూరములో నక్షత్రమండలం వుంది. ఆ తారామండలానికి రెండు లక్ష యోజనాల దూరములో శుక్రుడు వున్నాడు. అతనికి రెండు లక్షల యోజనాల దూరములో బుధుడు, అతనికి లక్షయోజనాల దూరాన కుజుడు ఆయనకి రెండు లక్షల యోజనాలవతల బృహస్పతివున్నారు. బృహస్పతి నుంచి రెండులక్షల యోజనాల యెడములో శనైశ్చరుడుంటాడు. ఆ శని నుంచి పధ్నాలుగు లక్షల యోజనాల దూరాన సప్తర్షి మండలం వుంది. లోక కళ్యాణార్థం విష్ణుపదమైన ధృవమండలానికి. ప్రదక్షిణం చేస్తుంటారు. సప్తర్షులు ఆ సప్తర్షి మండలానికి పదమూడు లక్షల యోజనాలపై ధృవలోకం వుంది. అక్కడ వుంటాడు ధృవుడు. గ్రహ నక్షత్రాలకు ఆధారభూతుడను ధృవుని, ఆశ్రయించుకుని గ్రహానక్షత్రాదులన్నీ వాయు ప్రేరణతో ఆ కల్పాంతం అలాగే తిరుగుతుంటాయి. ఈ జ్యోతిశ్చక్రాన్ని శింశుమారం అంటారు.

అదంతా ఊర్ధ్వం యిక దిగువకి చూస్తే సూర్యుడికి పదివేలయోజనాల క్రింద రాహుమండలం వుంది. ఈ రాహుమండల విస్తీర్ణం పదమూడువేల యోజనాలు సూర్యుడికి పది, చంద్రుడికి పన్నెండువేల యోజనాలు దూరంలో వున్నాడితడు. రాహుమండలం క్రింద సిద్ధ, చారణ, విద్యాధరుల పుణ్యలోకాలున్నాయి. వాటి విస్తీర్ణం పదివేల యోజనాలు. ఆ క్రింద, యక్ష, భూత, ప్రేత, పిశాచాలు ఉత్తమ విహార ప్రదేశాలున్నాయి. వాటి క్రిందగాలి మేఘములు ఉన్నంత వరకూ అంతరిక్ష మున్నది. అంతరిక్షానికి వంద యోజనాల దిగువన గరుడుపక్షులూ, డేగలూ, సారసాలూ, హంసలూ యెగిరే భూమండలం ఉంది. భూమిక్రింద ఒక దానినుండి ఒకటి పదేసి యోజనాల దూరంలో అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళ లోకాలున్నాయి. ఒక్కొక్క లోకం పదేసి యోజనా లుంటుంది. అట్టడుగుదైన పాతాళం క్రింద ముప్పైవేల యోజనాల దూరాన విష్ణుతామసీ కళవుంది. దానినే అనంతుడంటారు. దేవపూజ నందుకునే నిత్యకళ అనంతుడు. వానినే సంకర్షణుడని అంటారు. అతడి శక్తి అనంతం. సర్వభూత సంహారం అతడి సంకల్పం. అతడు నల్లటి వస్త్రాలు కట్టుకుంటాడు ఒక్క చెవికే కుండలం ధరిస్తాడు. దేవతలు అతని గణగుణాల్ని కీర్తిస్తూంటారు. ఆ విధంగా ఊర్ధ్వాధో లోకాల అనంతరం నరకములను గురించి వినిపించారు.

దుర్భర పాపతారకమైన దేవీపూజ గురించి ఏ తిథిని దేవిని యెలా పూజించాలో చెప్పాడు. ఏ వారమున దేనిని నైవేద్యము చేయాలో చెప్పాడు. యే నక్షత్రమునకు

యేది భోగమో చెప్పాడు. యే యే యోగ, కరణము లందు యేమేం చేయాలో మహావిష్ణువు నారదునికి చెప్పాడు. ఇంకా యిలా అన్నాడు - 'చైత్రశుక్ల తదియనాడు యిప్పచెట్టులో దేవిని పూజించాలి. అయిదు రకాల నైవేద్యం సమర్పించాలి. అలా చైత్రం నుంచి ఫాల్గుణందాకా పన్నెండు నెలలూ, ప్రతి నెలా శుక్ల తదియనాడు యిప్ప చెట్టులో దేని పూజిస్తే ఆమె ప్రసన్నురాల వుతుంది. ఆమెనిలా స్తుతించాలి.

# దేవ్యారాధన తత్వల స్వరూపంలోని దేవి స్తోత్రము

శ్లో॥ "నమః పుష్కర నేత్రాయై జగద్ధాత్ర్యైనమోస్తుతే
మహేశ్వర్యై మహాదేవ్యై మహామంగళమూర్తయే
పరమం పాపహంత్రీచ పరమార్థ ప్రదాయినీ
పరమేశ్వరీ ప్రజోత్పత్తిః పరబ్రహ్మ స్వరూపిణీ
మదదాత్రీ మదోన్మత్తా మానగమ్యా మహోన్నతా
మనస్వినీ మునిధ్యేయా మార్తాండ సహచారిణీ
జయలోకేశ్వరి ప్రాజ్ఞే ప్రళయాంబుద సన్నిభే
మహామోహ వినాశార్థం పూజితాసిమరాసురైః
యమలోకాభావకర్త్రీ యమపూజ్యా యమాగ్రజా
యమనిగ్రహరూపాచ యజనీయే నమోనమః
సమస్వభావా సర్వేశీ సర్వసంగ వివర్జితా
సంగనాశకరీ కామ్యరూపా కారుణ్యావిగ్రహా
కంకాళీక్రూరా కామాక్షీ మీనాక్షీ మర్మభేదినీ
మాధుర్య రూపశీలాచ మధురాపర్వపూజితా
మహామంత్రవతీ మంత్రగమ్యా మంత్రప్రియకరీ
అశ్వత్థ వటనింబామ్ర కపిత్థ బదరీగతే
పనసార్క కరీరాది క్షీరవృక్ష స్వరూపిణి
దుగ్ధవల్లీ నివాసార్హే దయనీయే దయాధికే
దాక్షిణ్య కరుణారూపే జయసర్వజ్ఞ వల్లభే

ఈ స్తోత్రం వల్ల సర్వార్ధసిద్ధి కలుగుతుంది. ఇక "ప్రకృతి పంచకం గురించి' విను అంటూ మళ్ళీ చెప్ప నారంభించాడు.

# నవమ స్కంధము

## ప్రకృతి పంచక నిరూపణ- ప్రకృతి తత్స్వరూపము

శ్రీమన్నారాయణుడు నారదునకుపదేశించిన ప్రకృతి పంచక నిరూప ణము. సంస్కృత శ్లోకరూపమైన దీనిని పారాయణము చేయుటచే వాస్తవ ప్రకృతి స్వరూప పరిజ్ఞానము కలిగి మోక్షమును సాధింపవలసియున్నది. కావున శ్లోకముల భావమైన అనువాదము నిచ్చుచున్నాము.

ఈ చరాచరసృష్టి జరుగు సమయమున మూలప్రకృతి, గణపతి తల్లియగు దుర్గ, రాధ, లక్ష్మి, సరస్వతి, సావిత్రియను ఐదుదేవతలుగా ఆవిర్భవించెను. "ప్ర" యనగా గొప్పది యని యర్థము "కృతి"యనగా సృష్టియని అర్థము. కనుక విశ్వమును నిర్మించుట యందు శ్రేష్ఠురాలగు దేవతను మహాప్రకృతి యందురు. "ప్ర" అనుదానికి సత్త్వగుణము ప్రకృష్టమైనది జ్ఞానప్రకాశకమని యర్థము. 'కృ' రజోగుణము మధ్యమము. 'తి' తమోగుణము అధర్మ ఆవరణరూపము అని అర్థము. ఆవరణ విక్షేపములు లేని చిన్మయబ్రహ్మము. త్రిగుణముల మాయతో గూడి సృష్టికార్యమును సాగించునపుడు దానిని "ప్రకృతి"యని "శక్తి" యని యందురు. సృష్టికి పూర్వమందున్న స్థితికి పూర్వమందున్న స్థితిని 'ప్ర' అందురు. "కృతి" సృష్టి జరిగినదానినందురు. కనుక ఈ సృష్టికి పూర్వమున్న దేదీప్యమాన మగు చైతన్య మహాదేవియే మూలప్రకృతి యనబడుచున్నది.

నిరంజనమగు సత్యజ్ఞానానంతమగు పరమాత్మ సృష్టి జరుగునపుడు తన యోగమాయతో రెండు రూపములు దాల్చును. అతని కుడిభాగము పురుషుడని యెడమ సగభాగము ప్రకృతి యనియు చెప్పుదురు. ఆ మూలప్రకృతిని బ్రహ్మ స్వరూపగా సనాతనిగా నిత్యనుగా తెలుసుకొని అనుభవములోనికి తెచ్చుకొన వలయును. అగ్నిలో కాల్చుశక్తి వలె ఆత్మలో ప్రకృతిశక్తి కలదని యెరుగ వలెను. అందువలననే యోగీంద్రులకు స్త్రీ పురుష భేదము కనబడదు. ఇదంతయు బ్రహ్మ మయమేకదా! ఈ ప్రపంచమున ప్రకృతి పురుషాత్మకము కాని వస్తువులేదు. సర్వతంత్ర స్వతంత్రశక్తి గల శ్రీకృష్ణునకు జగత్తులను సృష్టించు కోరిక గలిగినపుడు శక్తి స్వరూప యగు మూలప్రకృతి సర్వనియామకురాలుగా సామ్యావస్థారూపిణిగ మాయా శబరిత బ్రహ్మముగ నావిర్భవించెను.

పిమ్మట కృష్ణ పరమాత్మ యాజ్ఞ వలన సృష్టికార్యము కొనసాగుటకును భక్తుల ననుగ్రహించుటకును భక్తానుగ్రహ స్వరూప మహాశక్తి ఐదు శక్తిమూర్తులుగ

నావిర్భవించెను. ఈఆయైదుశక్తులలో దుర్గాదేవి శివస్వరూప- శివప్రియ- విష్ణుమాయ- పూర్ణబ్రహ్మ స్వరూపిణి- సర్వ మంగళ మాంగళ్య గణేశ మాత. కృష్ణుడు భక్తులను తరింప జేయుటకు దుర్గకు గణపతిగ పుట్టెను.

కృష్ణుని ప్రియతమ రూపశక్తి. దుర్గాదేవి సర్వమంగళ స్వరూపిణి శర్వరూప- సనాతని- సర్వాధిష్ఠాతృదేవి. అందుచేత బ్రహ్మాది దేవతలును మునులు. మనువులు, మనుజులు నీదేవిని ఘనముగ పూజించి స్తుతించిరి. అదృష్టవశమున భక్తుని దేవి కనికరించినచో నతని శోకార్తిదైన్యములు నశించును. మరియు దైవధర్మము, సత్య, నిష్ఠ, పుణ్యకీర్తి, శుభములు, సుఖసంతోషములు మోక్షము కూడా ప్రాప్తించును. శరణార్థుల యార్తిని తొలగించి వారిని బ్రోచుటయే పనిగా గలది, తేజోరూపిణి అగ్నివర్ణ తపస్సుచే వెలుగొందునది. కృష్ణుని హృదయాధిష్ఠాతృ దేవి దుర్గాదేవి సర్వశక్తి స్వరూపిణి పరమేశ్వరుని పరమశక్తి. అష్టసిద్ధులకీశ్వరి. ఈ మహాదేవి సకలజీవుల యొక్క బుద్ధి భ్రమ ఓర్పు నిద్ర ఆకలిదప్పులు ఏమరి పాటు దయ, తలంపు, జాతి, శాంతి, కాంతి, చైతన్యము తుష్టి, పుష్టి లక్ష్మి, ధైర్యము, మాయ మొదలగునవన్నియు దుర్గాదేవియే, ఈమె కృష్ణ పరమాత్ముని సకలసంపదల కధిష్ఠాతృదేవత. శ్రీకృష్ణుని స్వరూపశక్తి వేదములందు దుర్గవైరోచనిగ సముద్రమును నావవలె దుర్గమ బాధలనుండి దాటించునది.

ఆమె గుణమహిమలనంతములు. మూలప్రకృతి యొక్క యితర రూపములు -శ్రీ పద్మాదేవి శుద్ధ సత్త్వస్వరూపిణి. ఈమె పరమాత్ముని రెండవ యవతారము. ఈమె కృష్ణపరమాత్ముని సకల సంపదలకధిష్ఠాతృ దేవత. ఈమె జితేంద్రియ కనుక శాంతస్వరూపిణి. లక్ష్మీదేవి, కాంతదాంత శాంత సుశీల సర్వమంగళ లోభ మోహ కామరోషము దాహంకారములు లేనిదేవి, ఆ మహాదేవి భక్తానురక్త. పతిప్రియ, పతివ్రతలకు తలమానికము. భగవంతునకు ప్రాణతుల్య, ప్రేమపాత్ర, ప్రియంవద సకలప్రాణుల బ్రతుకు తెరువునకు లక్ష్మీదేవి తన ఏకాంశమున సస్యాత్మికగ ధాన్యలక్ష్మిగా నుండెను. తన సహజ స్వరూపముతో వైకుంఠమున పతిసేవలు చేసికొనుచు నుత్తమ సతీమణిగ చెన్నొందును. ఆ మహాలక్ష్మి స్వర్గమున స్వర్గ లక్ష్మిగ రాజులందు రాజ్యలక్ష్మిగ గృహమందు పుణ్యపురుషుల గృహిణుల రూపమున గృహలక్ష్మిగ విరాజిల్లుచుండును.

లక్ష్మి సకల ప్రాణులందు వెల్గులు జిమ్ము వస్తువులన్నింటి యందును మనోహరమైన శోభా రూపమున గోచరించును. పుణ్యాత్ములలోని కీర్తిరూపముగ రాజులందలి తేజముగ వెలుగొందును. లక్ష్మి వైశ్యులలో వాణిజ్యరూపమున,

పాపులయిండ్లలో కలహద్వేషరూపమున, పరోపకారులలో దయారూపమున శోభిల్లును. లక్ష్మి యెల్లరి చేత నమస్కరింపబడి పూజింపబడును. ఇక ఇతర శక్తి - వాక్కు, బుద్ధి, విద్య- జ్ఞానములకధిష్ఠాతృదేవత కలదు. ఆశక్తిని సరస్వతీదేవి యందురు. ఆమె సకల విద్యాస్వరూపిణి. ఆమె మనుజుల హృదయబుద్ధు లందుండును. కవిత, మేధ, ప్రతిభ, స్మృతి మొదలగు శక్తులు కలిగి యుండును. ఏదైనా సిద్ధాంతము చేయుటలో సందేహము కలిగినప్పుడు సరస్వతీదేవి వారి వ్యాఖ్యానార్థములో వెలుగుచు వారి సంశయములు భేదించి సిద్ధాంతీకరించి వేర్వేరర్థములను తెలుపును.

కవి పండితులలోని గ్రంథ రచనా శక్తి, విచారశక్తి స్వరసంగీత సంధానతాల, లయ, నాదశక్తి మొదలగు కళలకు భారతియే కారణము. పండితులలోని చర్చా- విషయ జ్ఞాన - వ్యాఖ్యా - వాదన వాక్యస్వరూపిణి, పరాదేవి భాషామయి, విశ్వమునకు భాషాజీవనము నిచ్చు బ్రహ్మదేవి, శాంత నిర్మలస్వరూపిణి, సుప్రసన్న, వీణా -పుస్తక ధారిణి, పలుకులతల్లి, శుద్ధసత్త్వ స్వరూపిణి, మంజుల వాగ్విలాస, సుశీల, శ్రీహరిప్రియ, మంచి చందనము - చంద్రుడు - కలువ పువ్వు మొల్లపువ్వు, తామరపువ్వు కాంతుల విరజిమ్ము కోమలాంగి, చదువులతల్లి, మణిరత్నమాల దాల్చి శ్రీకృష్ణపరమాత్మని నామజప మొనర్చుచుండును. ఈమె తపః స్వరూపిణి తాపసులకు తగినట్లు భాషాఫలముల ప్రసాదించు తల్లి. వేదజనని సిద్ధివిద్యా స్వరూపిణి సర్వసిద్ధి ప్రదాయిని. వస్తు- రస - చమత్కారౌచిత్య స్వరూపిణి. దేవి దయలేనిచో విప్రులు మూగవారితో మరణించిన వారితోడను సమానులు. వేదములందు జగదంబ సరస్వతి మూడవ దేవతగా వర్ణించబడెను. ఇట్లు వేదాను సారముగ కొంచెముగ వాణిని వర్ణించితిని.

ఇంక మరియొక దేవిచరిత్ర:- నాలుగు వర్ణముల తల్లియు వేదాంగ ములకును ఛందస్సులకును తల్లియు సంధ్యావందన మంత్రతంత్రము లకు మూలబీజము బ్రాహ్మణజాతి రూపిణి - జపరూప - తపస్విని బ్రాహ్మి- తేజోరూపిణి సర్వ సంస్కార రూపిణి పవిత్రరూపిణి సావిత్రి - గాయత్రి - బ్రహ్మ ప్రియ. సకల పుణ్యతీర్థము లాత్మశుద్ధికి యే సంస్పర్శనుకోరునో శుద్ధస్ఫటికమువలె తెల్లవెల్లులు చిమ్ము శుద్ధస్వరూపిణి పరమానందరూపిణి పరమసనాతని. పరబ్రహ్మ స్వరూపిణి నిర్వాణ పదదాయిని బ్రహ్మ తేజస్సు ముజ్జ్వల - బ్రహ్మతేజ మునకధిష్ఠానదేవత, ఏదేవి పాదపద్మము ధూళి సోకినంతనే జగములు పవిత్ర ములగునో ఆ దేవి "సావిత్రి'ఆమె నాల్గవ ప్రకృతిదేవి.

ఇక ఐదవశక్తి దేవతరాధను వర్ణింతును. ఆమె పంచప్రాణ స్వరూపిణి పంచ ప్రాణములకధిష్ఠాన దేవత అపూర్వరూప సుందరి, కృష్ణునకు ప్రాణాధిక ప్రియురాలు. సకల పదార్థముల నివసించునది, సౌభాగ్యశాలిని, గౌరవ సీమ, కృష్ణుని, యెడమభాగము తన స్వరూపముగా గలది. గుణతేజములందు సాటిలేనిది. మిక్కిలి శ్రేష్ఠురాలు- పరమ- ఆద్య- సనాతని - పరమానందరూపిణి - ధన్య - మాన్య - విశ్వపూజిత - సకల సారభూత శ్రీకృష్ణ పరమాత్ముని రాసక్రీడకధిష్ఠానదేవత - రాసమండలము పుట్టుటకు కారణురాలు - రాసమండల శోభాయమాన రాసేశ్వరి - రసికాగ్రగణ్యా గోలోక నివాసిని. రాసావాసనివాసిని. గోపికల జననమునకు కారణభూతురాలు. పరమానంద. సంతోష హర్షరూపిణి నిర్గుణ నిరాకార నిర్లిప్త ఆత్మస్వరూపిణి- నిష్కామ-నిరహంకార భక్తానుగ్రహరూప. వేదపండితులు వేదానుసారము ధ్యానింపగ తెలియబడునది. నరసుర మునీంద్రుల చూపులచే చూడబడినది. నానాలంకారములతో శోభిల్లునది. అగ్నిపూతమగు వస్త్రమును ధరించునది. కోటిచంద్రుల వెన్నెలల విరజిమ్మునది.

సకల శ్రీమయి - శ్రీకృష్ణుని యెడల భక్తిని సకల సంపదల నొసంగునది. రాధ శ్రీవరాహకల్పమున వృషభానుడును గోపాలకునకు కన్యగా జన్మించెను. రాధ పాదపద్మములను తాకి భూమి పవిత్రమయ్యెను. బ్రహ్మాదులకు కనిపించినది. భారతమున బృందావనములో నెల్లరచేత చూడబడినది. స్త్రీజాతికి తలమానికము. శ్రీకృష్ణుని వక్షస్థలమున నివసించునది. రాధ నీలఘనశ్యామ గగనములోని మెఱపుతీగ. బ్రహ్మ పూర్వము అరువది వేలయేండ్లుమొకైతపముచేసెను. రాధకాలి గోటిని చూచుటకు, ఆత్మశుద్ధికినై తపించెను. కాని బ్రహ్మ కామెకలలోనైన కనబడలేదు. ఇక ప్రత్యక్షముగ కనబడుట విషయము చెప్పెడిదేమి? బ్రహ్మ తనతపము ఫలించి బృందా వనమున రాధను దర్శింపగలిగెను. ఇటుల నైదవ దేవి రాధాదేవిగ పేరు గాంచెను. ఈ విశ్వమందలి స్త్రీమూర్తులు రాధ యొక్క అంశ-కళ-కళాంశాంశ విభాగముల నుండి సృజింపబడిరి. మూలప్రకృతి యొక్క పూర్ణాంశమునుండి దుర్గ మొదలగు నైదుగురు విద్యాదేవతలుద్భవించిరి.

ఇక మూలప్రకృతి నుండి పుట్టిన యంశరూపలగు దేవతలను వివరించెదను. ప్రకృతి ప్రధానాంశము నుండి భువనపావని - విష్ణుపద సంభూత - ద్రవరూప - సనాతనియగు గంగ జన్మించినది. పాపుల పాపములు అను కట్టెలను కాల్చుటలో నగ్నివంటిది. స్నానపాన స్పర్శముల వలన ప్రాణులకు సుఖము కలిగించునది. మోక్షసుఖము నిచ్చునది. గోలోకధామము చేరుటకు సుఖసోపానము. తీర్థములలో

పవిత్రతీర్థము. నదులలో ప్రధానజీవనది. శివుని జటాజూటమున వెలుగొందు ముత్యముల వరుస. కర్మ భూమియగు భారతదేశమందలి తాపసుల తపః ఫలము. చంద్రపద్మక్షీరముల వలె తెల్లని వెన్నెలు విరజిమ్ముచున్నది.

శుద్ధ సత్త్వ స్వరూపిణి, నిరహంకార, నిర్మల సాధ్వినారాయణ ప్రియయగు గంగ ప్రకృతి ప్రధానాంశము నుండి జన్మించెను. తులసీదేవి కూడా ప్రకృతి ప్రధానాంశము నుండి పుట్టినదియే. ఈమె విష్ణుకామిని విష్ణునకు అలంకార రూపమైనది. విష్ణుని పాదపద్మములు నివాసముగా గలది. తులసీదేవి తపము సంకల్పము పూజాదులు కలిగించునది. పుష్పములన్నిటి కంటె ప్రధానమైనది. పుణ్యదాయిని తులసి దర్శనము- స్పర్శనము కలిగినంతనే ముక్తి కరతలామలక మగును. ఈ కలికాలమందలి పాపములనెడు నెండు కట్టెలకు అగ్నియైనది. తులసి పాదధూళి సోకినంతనే భూమి పవిత్రమగుచున్నది. ఎల్ల తీర్థములును తులసిదర్శన - స్పర్శనములచే తాము పవిత్రము కాగోరుచుండును. తులసిలేనిచో పనులన్నియును ప్రపంచమున నిష్ప్రయోజనములే. మోక్షము కోరువారికి ముక్తిని, కాముకులకు కోరికలను తీర్చునట్టి దేవత తులసీ మాత భారతీయులపాలిటి కల్పతరువు.

భారత వృక్షములకు అధిష్ఠాత్రి దేవత భారతీయ స్త్రీలకు ప్రసన్నత కలిగించుట కవతరించిన పరదేవత. ఇట్టి తులసీ దేవియును ప్రకృతి ప్రధానాంశ సంభూత యగును. ఇక మనసాదేవి కశ్యపుని కుమార్తె. శంకరుని ప్రియ శిష్యురాలు, మహా జ్ఞానవిశారద, నాగపతియగు ననంతుని సోదరి, నాగగణపూజిత, నాగేశ్వరి, నాగమాత, నాగసుందరి, నాగవాహిని, నాగ గణములచే పరివేష్టితురాలు. నాగ భూషణ భూషిత, నాగేంద్ర వందిత, సిద్ధయోగిని, నాగశాయిని, విష్ణురూప, విష్ణుభక్త, విష్ణుపూజాపరాయణ, తపస్విని, తపస్స్వరూపిణి, తపఃఫలదాత్రి, ఆమె శ్రీహరిని గూర్చి మూడు లక్షల సంవత్సరములు తపించి తపించి భారతవర్షములో తాపసుల యందు తపస్వినులయందు పూజ్యురాలయెను. సర్వమంత్రాధిదేవత. బ్రహ్మ తేజముతో ప్రకాశించునది.

పరబ్రహ్మ స్వరూపిణి, బ్రహ్మభావనతత్పర, శ్రీకృష్ణాంశము నుండి యవత రించిన జరత్కారు ముని భార్య. తాపసోత్తముడగు ఆస్తీకుని తల్లి. ఈ మనసాదేవి యును ప్రకృతి ప్రధానాంశము నుండి కలిగెను. నారదా! గౌరి మొదలగు పదహారు మాతృకలలో శ్రేష్ఠ మాతృక షష్ఠీదేవి. ఈమె దేవసేన - షష్ఠియని ప్రసిద్ధిగాంచెను. ఆమె పుత్రపౌత్ర ప్రదాయిని జగములకు దాదివంటిది. ప్రకృతి షష్ఠాంశ రూపిణి

కనుక షష్ఠియని ప్రసిద్ధిగాంచినది. ఈమె వృద్ధరూపమునను యోగి నీరూపమునను శిశువుల వద్దనుండి వారిని కాపాడును. ఈమెను పన్నెండు నెలలందును పూజింపవచ్చును. శిశువు పుట్టిన యారవనాడు పురుటింట షష్ఠీదేవిని పూజింతురు. మునులు షష్ఠీదేవికి నమస్కరింతురు. దేవి దర్శనము కోరుదురు.

షష్ఠీదేవి తల్లివలె దయా రూపిణి. బాలురనెల్లప్పుడును కాపాడుచుండును. ప్రకృతి ప్రధానాంశ రూప మంగళచండికాదేవి. ఈమె నేలపై నీటిపై నంతరిక్షమున పిల్లలున్నచోట నుండి మంగళమును కలిగించును. ఈమె ప్రకృతి ముఖమునుండి జన్మించెను. సర్వమంగళ రూపమున, సంహారమున కోపముతో నుండుదేవి. అందుచే పండితు లీమెను మంగళచండిక యని పిలుచుదురు. ఈమె మంగళ వారమున జగము లందు పూజలనందుకొనుచుండును. ఈమె ప్రసన్నురాలైనచో స్త్రీలకు పుత్రపౌత్ర ధనైశ్వర్యయశో మంగళములను ప్రసాదించును. స్త్రీల కోర్కెల వన్నిటిని తీర్చగలదు. ఇక కమలలోచని యగు కాళీదేవి ప్రకృతి ప్రధానాంశ స్వరూపిణి - మహేశ్వరి, ఈమె కన్నులెఱ్ఱ చేసినచో లోకములు నశింపగలవు. ఈమె దుర్గా దేవిలలాటము నుండి జన్మించినది. యుద్ధమున శుంభ నిశుంభు లను సంహరించెను. దుర్గలోని సగమంశగలది. దుర్గవలె గుణవతి తేజోవతి. కాళిపుష్టికర మైన యుజ్జ్వలమైన శరీరమును చూచినచో నొకసారి కోటిసూర్యులను చూచి నట్లుండును.

ఈమె సర్వశక్తులకు మూలము. మహాబలవతి, అందరికంటె బలశాలిని. కాళీమాత సర్వసిద్ధిప్రదాయిని, పరమయోగ స్వరూపిణి. కృష్ణ భక్తురాలు తేజమున గుణమునను విక్రమమందు కృష్ణునితో సమానురాలు. నిరంతరము కృష్ణుని భావించుటచే కాళివర్ణము, కృష్ణవర్ణము ఈమె సనాతని ఒక నిశ్వాసముతో బ్రహ్మాండమునంతను సంహరింప శక్తిగలది. లోకములను సరిదిద్దుటకు వినోదము కొరకును కాళీదేవి దానవులతో యుద్ధము చేయుచుండును. ఈ తల్లిని పూజించినచో నీమె ధర్మార్థకామమోక్షముల నీయజాలినది. ఇక వసుంధరాదేవి. ఈమెయును ప్రకృతి ప్రధానాంశవలన సంభవించినదే. ఈ భూదేవిని బ్రహ్మాదులు మునులు మనువులు, నరులు పూజింతురు. అందరకాధారమైన భూమి సకల సస్యశ్యామల. సకల రత్నాకర. రత్నగర్భ రత్నముల కాటపట్టు. ప్రజలచేత ప్రజాపాల కులచేత పూజింపబడి నమస్కరింపబడునది. సకల ధనధాన్యరాశులకు నిలయము. సకలప్రాణులకు జీవనాధారము. జీవనాడి. సదాధారయగు భూమి లేనిచో చరాచర జగమంతయు నిరాధార మగును. ఈమెయు ప్రధానాంశవలన జన్మించినదియే.

ఇక ప్రకృతి కళాంశముల పుట్టిన వారిని తెల్పుదును. ఏయే దేవియెవ రెవరి భార్యయో వర్ణింతును. అగ్నిభార్య స్వాహాదేవి. ఈమెను సమస్త ప్రపంచము పూజించును. ఈమె లేనిచో దేవతలు హవిర్భాగములను గ్రహింపజాలరు. దక్షిణయు దీక్షయు వీరిరువురును యజ్ఞపత్నులు వీరి నంతటను పూజింతురు. వీరులేనిచో ఏపనియు సఫలము కాజాలదు. పితరుల భార్య స్వధాదేవి. మునులు, మనువులు, నరులు నీమెను పూజించెదరు. స్వధామంత్రము లేకుండ నొసంగిన దానాదులు నిష్ఫలములు.

ఇక వాయువు భార్య స్వస్తిదేవి. ఈమె విశ్వపూజితురాలు. ఈమె లేనిచో నిచ్చి పుచ్చుకొనుటలు సఫలములు కావు. గణపతి భార్య పుష్టి లోకమున అందరిచే గౌరవింపదగినది. పుష్టిలేనిచో జగమందలి స్త్రీలు పురుషులు నెల్లరును బలహీను లగుదురు. నీరసులగుదురు. అనంతుని భార్య తుష్టి ఈమె యందరిచే పూజింప బడునది. అందరిచే నమస్కరింపబడునది. ఈమె లేనిచో లోకములు సుఖ సంతోషములతో నుండజాలవు. ఈశానుని యిల్లాలు సంపత్తి. ఈమె సురలచే నరులచేతను నిత్యము సేవింపబడుచుండును. ఈమె దయ లేనిచో లోకము లన్నియు దరిద్రములగును. కపిలుని పత్నిధృతి. ఈమె నంతట నందరు పూజింతురు. ఈమె దయలేనిచో లోకములన్నియు ధైర్యము గోల్పోవును.

సత్యపత్ని సతి, ఈమె లోకమునకిష్టురాలు ముక్తులైనవారు నిత్యము నీమెను సేవించుచుందురు. ఈమె దయలేని యెడల లోకము బంధువులకు దూర మగును. మోహపత్నిదయ ఈమె నందరు నాదరించు చుందురు. ఈమె లేనిచో లోకములయన్నియు నంతట నిష్ఫలములగును. పుణ్యపత్ని ప్రతిష్ఠ. ఈమె పుణ్యదాయిని. సర్వపూజిత. ప్రతిష్ఠ లేనిచో జగమంతయు జీవన్మృతమగును. సుకర్మ భార్యకీర్తి. సిద్ధులు కృతార్థులు నగువారు కీర్తిని సేవించెదరు. ఈమె లేనిచో జగమంతయు కీర్తిలేక మృతప్రాయమగును. ఉద్యోగ పత్నిక్రియ ఈమెను అందరు నాదరింతురు. ఈమె లేనిచో జగమంతయు విధివిహీన మగును. అధర్మ భార్య మిథ్య ఈమెను పొగరుబోతులు పూజించెదరు. ఈమె లేనిచో జగమంత యు బ్రహ్మ సృష్టించినట్లే యుండును. సత్యయుగమున మిథ్యలేకుండెను. ద్వాపర యుగమున నిది సగము బలిసినది. ఇక కలికాలము రాగానే యిది పూర్తిగా బలిసియంతట నిండిబలము పుంజుకొని వాగుడు కాయయ య్యెను. దీనియన్న మోసము వీరిద్దరునింటింట విచ్చలవిడిగ తిరుగుదురు. సుశీల పత్నులు శాంతిలజ్జ వీరంతటను పూజింపబడుచుందురు.

నారదా! వీరులేనిచో లోకమంతయు పిచ్చెక్కినట్లుండును. జ్ఞానమునకు ముగ్గురు భార్యలు వారు బుద్ధి, మేధధృతి యనువారు వీరులేని యెడల ప్రపంచము మూఢమై పిచ్చెత్తి నదివలె యుండెను. లోకములో మూర్ఖత్వము తాండ వించును. ధర్మని భార్య మూర్తి. ఈమె కాంతిరూపమనోహర. ఈమె తోడులేనిచో పరమాత్మ కూడ నాధారములేనివాడగును. మూర్తివలననే లక్ష్మి శోభావతిగ మూర్తిమతిగ నత్యంతము ప్రకాశించును. శ్రీరూపము మూర్తి రూపమే. ఈమె మిక్కిలి గౌరవింపదగినది ధన్య - మాన్య- పూజిత. రుద్రుని భార్య కాలాగ్ని, ఈమెను సిద్ధయోగిని యనియు యోగనిద్ర యనియు నందురు. లోకములన్నియు రాత్రివేళ యోగనిద్ర యొడిలో నిద్రించును. దినము రాత్రి కాలునిభార్యలు సంధ్యయు భార్యయే. వీరు ముప్వురు లేనిచో బ్రహ్మకూడ నంకెలు లెక్కింప జాలడు. లోభుని పత్నులా కలిదప్పులు వీరుగౌరవింప దగినవారు ధన్యలు. వీరివలన జగము నిండి యున్నది. వీరి వశముననుండనిచో జగములు చింతవ్యాకులతలకు లోనగుదురు. తేజుని భార్యలు ప్రభాదాహికలు. వీరులేనిచో బ్రహ్మ ప్రపంచమును సృష్టించ జాలడు. జ్వరభార్యలు జరామృత్యు వులు. వీరు కాలునికన్యకలు ప్రియా ప్రియలు వీరులేనిచో బ్రహ్మ సృష్టి పెరుగునే గాని తరుగదు. నిద్ర కూతుళ్ళు తంద్రాప్రీతులు వీరుసుఖుని భార్యలు.

నారదా! ఈ జగమంతయు వీరితోనే నిండియున్నది. వైరాగ్యుని భార్యలు శ్రద్ధాభక్తులు పూజితలు. వీరిదయవలన జగమంతయు జీవన్ముక్తము వలె నుండును. దేవమాత యగునదితియు గోమాతయగు సురభియు ప్రకృతికళలే. దైత్యుల తల్లి దితి, కద్రువనాగమాత. గరుత్మంతుని తల్లి వినత. దనుజల తల్లి దనువు వీరందరును ప్రకృతికళలే. సృష్టికార్యమున పాల్గొనినవారలే.

ఇంకను కళాంశతో పుట్టిన వారుకలరు. వారిని గూర్చి వినుము. చంద్రుని పత్నిరోహిణి, సూర్యుని యిల్లాలు సంజ్ఞ మనువు ప్రియురాలు శతరూప. ఇంద్రుని ప్రియ శచి బృహస్పతి ప్రియురాలు తార. వసిష్ఠుని సతీమణి అరున్ధతి. గౌతముని భార్య అహల్య. అత్రి భార్య అనసూయ కర్దమునిపత్ని దేవహూతి. దక్షుని భార్య ప్రసూతి. పితరుల మానసపుత్రిక మేనక. అంబికా మాతయని ప్రసిద్ధి లోపా ముద్ర, కుంతి, కుబేరుని భార్య, వారుణి, బలిచక్రవర్తి భార్య వింధ్యావళి, కాంత దమయంతి, యశోదదేవకి గాంధారి ద్రౌపదిశైబ్య సత్యవతి. రాధ తల్లి. వృష భానుని భార్య మండోదరి. కౌసల్య సుభద్ర, కౌరవి, రేవతి, సత్యభామ, కాళింది, లక్ష్మణ వీరందరు ప్రకృత్యంశలే. జాంబవతి నాగ్నజితిమిత్ర విందలక్ష్మణ రుక్మిణి

లక్ష్మీ స్వరూపిణియగు సీత కాళి వ్యాసుని తల్లియగు యోజన గంధబాణపుత్రి ఉష ఆమెనెచ్చెలి చిత్రలేఖ ప్రభావతి భానుమతి, మాయావతి, పరశురాముని తల్లి రేణుక, బలరామునితల్లి రోహిణి ఏకనంద కృష్ణుని సోదరియగు దుర్గ మొదలగువారు ప్రకృతి కళారూపిణులే.

కొందరు ప్రకృతి కళాంశాంశల నుండి పుట్టినవారు కలరు. కనుక స్త్రీ నవమానించిన ప్రకృతి నవమానించినట్లుగును. భర్త, కుమారులు గల్గిన బ్రాహ్మణ స్త్రీని పూజింప వలయును. వారిని వస్త్రాలంకార చందన ములతో పూజించినచో ప్రకృతిని పూజించినట్లగును. అటులే వస్త్రాలంకార చందనములతో పదహారేళ్ళ స్త్రీని పూజించినచో ప్రకృతిని పూజించినట్లగును. ఉత్తమ మధ్యమాధమ స్త్రీలందరు ప్రకృతి నుండి పుట్టినవారే. సత్వాంశమువలన పుట్టినవారుత్తములు సుశీలలు, పతివ్రతలు, రజోంశమున పుట్టినవారు మధ్యములు భోగలాలసలు. తామసాంశ మున బుట్టిన వారి శ్రేణియేదో తెలియదు. వారధములు వారు తమ కార్యము సాగించుకొనుటలో జాణలు. వీరు మితి మీరిన మాటలలో వలపు కౌగిళ్ళలో తగుల్కొందురు. వీరు దుర్ముఖులు కులనాశన కారిణులు. వ్యభిచారిణులు కలహప్రియులు, వీరు నేలపై వేశ్యలుగ స్వర్గమున నప్సరసలుగ నుందురు. అధములు ప్రకృతి తామసాంశలు, వీరు జారిణులుగ పిలువబడుదురు. ఇట్లు ప్రకృతి వర్ణన మంతయు నిరూపించితిని.

# విరాట్స్వరూప ప్రతిపాదనము

శ్రీ నారాయణుడు నారదునకిట్లు విరాట్స్వరూపము చెప్పెను:- బ్రహ్మాండ జలమధ్యమున పడవేసిన యండాకారుడగు బాలుడందు బ్రహ్మ వయస్సంత కాలముండి యొకనాడు హఠాత్తుగ రెండయ్యెను. ఆ రెంటిలో నొకటి శిశు రూపము ఆశిశువు నూరుకోట్ల సూర్యుల కాంతులు కలిగి యుండెను. అతడు పాలులేక యాకలిమంటతో క్షణమేడ్చెను. అతడు తల్లిదండ్రులచేత విడువబడి జలమందు నిరాశ్రయుడై యుండెను. అతడు అసంఖ్య బ్రహ్మాండములకు నాథుడయ్యు ననాథుని వలె పై దిక్కు చూచుచుండెను. అతడు స్థూలవస్తువుల కంటె మిక్కిలి స్థూలముగ నుండుటచే మహావిరాట్టని పిలువబడెను. సూక్ష్మములలో పరమాణు. ఎంత సూక్ష్మమైనదో అంతకంటెను సూక్ష్మస్వరూపుడు. అతడు కృష్ణ పరమాత్మ తేజములో పదహారవయంశము కలిగి సకల విశ్వమునకాధారమై మహావిష్ణు వనమూల ప్రకృతి నంభవుడన ప్రసిద్ధిగాంచెను.

అతని రోమకూపములలో పెక్కు బ్రహ్మాండములు కలవు. వానిని కృష్ణుడు కూడా లెక్కింపజాలడు. ఇసుక రేణువుల నైన లెక్కించవచ్చుగాని యా విశ్వములు లెక్కింప శక్యముకాదు. ప్రతి బ్రహ్మాండమున బ్రహ్మ విష్ణు శివులు కలరు. వారి సంఖ్య తెలియరాదు. పాతాళము నుండి బ్రహ్మలోకము వరకున్న భాగ మును బ్రహ్మాండమందురు. బ్రహ్మాండమునకు బయటపైగ వైకుంఠము విరాజిల్లుచున్నది. దానికి పైగా ఏబడికోట్ల యోజనముల దూరమున గోలోకము ప్రకాశించుచుం డును. శ్రీకృష్ణునివలె గోలోకమును నిత్యము సత్యము చిన్మయము. ఈ భూమి యేడు దీవులతో ఏడు సముద్రము లతో కూడియున్నది. భూమిపై లెక్కలేనన్ని కొండలు వనములు కలవు. నలభై తొమ్మిది యుపద్వీపములు కలవు.

పైని బ్రహ్మలోకముతో కూడి యేడు స్వర్గలోకములు గలవు. క్రిందుగ నేడు పాతాళాదిలోకములు గలవు. ఈ భూమికి పైగ భూలోకమును దానికి పైగా భువర్లోకమును గలవు. దానికి పైగా స్వర్గలోకమును దానిపై జనలోకము దానిమీద తపోలోకము దానికావల సత్యలోకమును గలవు. దానిపై బ్రహ్మలోకము కరగిన బంగారు రంగుతో నొప్పును. ఇటుల సర్వమును బయటలోపల కృత్రిమమైనదే. నారదా! బ్రహ్మలోకము నశించునపుడు తక్కిన యీలోకములన్నియు నశించును. ఈ బ్రహ్మాండములోని లోకములన్నియు నీటిబుడగలవంటివి అనిత్యమైనవి. గోలోక వైకుంఠలోకములు రెండు మాత్రమే నిత్యములు శాశ్వతములు సహజ ములు. ఆ బాలుని ప్రతిరోమకూపమునందు బ్రహ్మాండము నిండియున్నది. ఈ బ్రహ్మాండముల సంఖ్య కృష్ణునికే తెలియదు. ఇంక ఇతరులకెట్లు తెలియదగును? నారదా! మూడు కోట్ల దేవతలు వ్యాపించియున్నారు. దేవతలలో దిక్పాలకులు నక్షత్రములు గ్రహములు మొదలగునవియు గలవు. భూమిపై నాలుగు వర్ణముల వారు కలరు. భూమి క్రింద నాగలోకము గలదు.

ఆవిరాడ్బాలుడు పెక్కుమార్లు పైకి చూచెను. ఆ బాలుని లోపల శూన్యము నిండియున్నది. మరేమియునులేదు. అతడాకలిచే మాటిమాటికి చింతించుచు నేడ్వసాగెను. కొంతసేపటి కతడు తెలివినొంది పరమ పురుషుడగు కృష్ణుని ధ్యానించెను. అంతలోనతనికి బ్రహ్మజ్యోతి కనిపించెను. ఆ జ్యోతీరూపము క్రొత్త నల్లని మేఘమువలె నున్నది. అది రెండు చేతులు గలిగి పట్టువస్త్రము దాల్చి మురళిచేతబూని భక్తులనను గ్రహించుటకు ఆతురతతో నున్నట్లున్నది. ఈశ్వరు డగు తన తండ్రిని చూచి బాలుడు నవ్వెను. కృష్ణుడప్పుడా బాలునకు తగినవర మిచ్చుచు నిట్లనెను.

ఓ బాలుడా! నావలె జ్ఞానవంతుడ వగుము. నీకాకలిదప్పు లుండవు. నీలోని బ్రహ్మాండములు ప్రళయమువరకు నుండగలవు. నిష్కాముడవు నిర్భయుడవు నగుము. అందరకు వరములిమ్ము. నిన్ను జరామృత్యురోగశోకము మొదలగు పీడలు బాధింపవు. అని కృష్ణుడతనికి "ఓం కృష్ణాయ స్వాహా" అను కృష్ణషడక్షర మహామంత్రము ఉపదేశించెను. అతడు వేదప్రవరము పరమునగు కృష్ణమంత్ర మును ముమ్మారు జపించెను. అది సకల విఘ్నహరము పరమము. పిమ్మట నతని యాహారము గూర్చి యేర్పాటుగావించి కృష్ణుడిట్లనెను.

ఓ బ్రహ్మ పుత్రా! నేను చెప్పునది చక్కగా వినుము. విశ్వమందలి వైష్ణవుడును నైవేద్యము సమర్పించునపుడు అందులోని పదహారవభాగము విష్ణువునకు తక్కిన పదిహేను భాగము లావిరాడ్బాలు నకును చెందును. ఇక నిర్గుణుడు పరమాత్ముడు పరిపూర్ణ తముడు కృష్ణునకు నైవేద్యముతో ప్రయోజనము లేదు. శ్రీకృష్ణ దేవునకెవ డైన నైవేద్యము సమర్పించుచో దానిని సైతము మొత్తమును లక్ష్మీనాథుడగు విరాడ్బాలుడారగించును. ఆవిధముగ మహామంత్రము ఉపదేశించిన తరువాత కృష్ణుడు బాలునితో మరల నిట్లనెను.

ఓ కుమారా! నీకిష్టమైన వరమేదేనియింకొకటి కోరుకొనుము ఇచ్చెదను. అను కృష్ణుని మాటలు విని విరాట్‌విభుడు సమయమునకు తగినట్లు కృష్ణుని కిట్లనెను. కాలమంతయు నీ పదకములములందలి నిశ్చలభక్తి కుదురుకొనిన చాలు. ఈ లోకమునందు నీపై భక్తిగలవాడు జీవన్ముక్తుడు. నీయందు ప్రేమ లేనివాడు మూర్ఖుడు. బ్రతికియుండియు చచ్చినవాడే. నీభక్తిలేని జపతప: పూజాయజ్ఞవ్రతోపవాస తీర్థసేవలన్నియు వ్యర్థములు. కృష్ణభక్తిలేని మూర్ఖుని జీవితము వ్యర్థము. వాడు బ్రతికియున్నను లెక్కింపదగినవాడుకాడు. ఈ శరీర మందాత్మయున్నంత వరకు శక్తి యుండును. ఆత్మ వెళ్ళగనే యింద్రియశక్తు లన్నియు నతనిని వెంబడించును.

ఓ మహానుభావా! నీవు సర్వాత్ముడవు. ప్రకృతికి పరుడవు సర్వతంత్ర స్వతంత్రుడవు. బ్రహ్మజ్యోతివి. సనాతనుడవు అని పలికి బాలుడు విరమించెను.

అప్పుడు కృష్ణుడు చెవికింపుగతీయగ నిట్లు మారు పలికెను. నీవును నావలె స్థిరముగ చిరకాలముండుము. కొన్ని బ్రహ్మాండములు నశించినను నీకు నాశము లేదు. ప్రతి బ్రహ్మాండములోను నీయంశ సూక్ష్మాంశ రూపములు కలుగు చుండును. నీనాభికమలము నుండి విశ్వస్రష్ట యగు బ్రహ్మయుద్భవించగలడు. బ్రహ్మనుదుటినుండి పదకొండుగురు రుద్రు లావిర్భవింతురు. వారు శివాంశమున

సృష్టిసంహారము లొనరింతురు. వారిలో కాలాగ్నిరుద్రుడు విశ్వసంహారము చేయును. పాలకుడుగ విష్ణువు రుద్రాంశమున ఉదయించును. నాపై నీకు చిరభక్తి నిలుచునట్లు వరమిచ్చుచున్నాను.

నీవు ధ్యానములో నిత్యము నా సుందర రూపమును చూడగలవు. నీతల్లి నావక్షస్థలమునవెలవైయుండును. ఆమెను గూడ నీవు చూడగలవు. ఓవత్సా!యికనా గోలోకమునకు వెళ్ళుచున్నాను. నీవుండుము అని కృష్ణుడు గోలోకమునకు వెళ్ళి బ్రహ్మను సృష్టి చేయుమనియు శంకరుని సంహారించుమనియు ఆదేశము లొసగెను. బ్రహ్మ! నీవు సృష్టి చేయుటకు వెళ్ళుము. విరాడ్బాలకుని రోమకూపము లలో నెన్నో బ్రహ్మాండములు గలవు. నీవొక బ్రహ్మాండమందున్న విష్ణువు నాభి కమలమున జన్మింపుము. ఓ మహాదేవా! వత్సా! నీవు బ్రహ్మనుదుటి యంశతో నుద్భవింపుము. మహాభాగ! నీవు స్వయముగ నిరతము తపస్సు చేయుచుండుము అని పలికి జగన్నాథుడు విరమించెను. బ్రహ్మ యాతనికి నమస్కరించెను.

మహావిరాడ్బాలుడు బ్రహ్మాండగోళజలముల మధ్యకలడు. అతని యంశమున కలిగి క్షుద్రవిరాట్టొకడునుండెను. క్షుద్ర విరాట్టును జలతల్పమున పరుండి పట్టు వస్త్రముకట్టి యువకుడునై శ్యామల వర్ణముతో చిరునవ్వు నవ్వుచు విశ్వవ్యాపియై జనార్దనుడై ప్రకాశించుచుండెను. ఆ క్షుద్ర విరాట్టు బొడ్డు తమ్మినుండి బ్రహ్మ జన్మించెను. అతడు బ్రహ్మ పుట్టిన తరువాత లక్షయుగముల వరకు పద్మ నాళమున తిరిగెను. అయినను తామరతూడు మొదలతనికి కనిపించలేదు. ఇట్లు నీ తండ్రి యగు బ్రహ్మపద్మములో తిరుగాడుచు చింతించెను. అతడు తిరిగి తన పుట్టినచోటికి వచ్చి కృష్ణ పాదాంబుజములను ధ్యానించెను.

అప్పుడు బ్రహ్మ తన దివ్యచక్షువులతో ధ్యానమందు క్షుద్రవిరాట్టును దర్శించెను. ఆవిరాట్పురుషుడు జలములసెజ్జపై పరుండెను. అతని రోమ రూపమున బ్రహ్మాండము విరాజిల్లు చుండెను. బ్రహ్మకు గోలోకదాసి గోపగోపీ సంయుతుడునగు శ్రీకృష్ణుడు దర్శన మొసంగెను. బ్రహ్మ కృష్ణుని సంస్తుతించి వరములు పొంది సృష్టికార్యమునకు పూనుకొనెను. అప్పుడు బ్రహ్మ మానస పుత్రులు సనకాదులు బ్రహ్మనుండి జన్మించిరి. పిమ్మట శివుని పదకొండు రుద్రాంశలు గల రుద్రులు జన్మించిరి. క్షుద్రవిరాట్టు నాభికమలమున బుట్టిన బ్రహ్మ స్వర్గమర్త్య పాతాళములు చరాచర ప్రపంచమును సృజించెను. ప్రతి బ్రహ్మాండమునందొక క్షుద్రవిరాట్టు బ్రహ్మ విష్ణు శివులుందురు. ఈ ప్రకారముగా కృష్ణసంకీర్తనము వినిపించితినని నారాయణుడు ముగించెను.

# ప్రకృతి పూజా విధానము

నారదుడు, మూలప్రకృతుల పూజావిధానమంతయు వివరముగా వర్ణించు భూలోకముననేయే దేవత నెవరెవరు యెట్లు పూజించి ప్రచారము చేసినదియు. ఆయా దేవతల స్తోత్రము ధ్యానము ప్రభావము శుభచరిత మును తెలుపుమని ప్రార్థింపగా నారాయణుడిట్లు చెప్పెను. గణపతి తల్లియగు దుర్గ, రాధ, లక్ష్మి, సరస్వతి, సావిత్రి యనువారు సృష్టి ప్రకృతి దేవతలు. ఒకేమూలప్రకృతి సృష్టి కొరకిట్లు ఐదువిధములయ్యెను. వీరి పూజాదులు సుప్రసిద్ధములు. వీరి ప్రతిభా ప్రభావములు పరమాద్భుత ములు, వీరి దివ్యచరిత్రములు సర్వమంగళకరములు. అమృత ప్రవాహములు. ఇపుడా ప్రకృత్యంశల యొక్క ప్రకృతికళల యొక్క శుభచరితములు వివరించి తెలిపెదను. శ్రీకాళి వసుంధర గంగ షష్ఠి మంగళ చండికతులసి, మానస, నిద్ర, స్వాహా, స్వధ దక్షిణయను వారు ప్రకృతి దేవతలు. ఈ దేవతల శుభచరితములు పుణ్యప్రదములు. చెవులకింపైనవి. అతిలోక సుందరములు. జీవుల కర్మముల తొలగించునవి. వీటినిగూర్చి సంక్షేపముగ తెలిపెదను. శ్రీదుర్గారాధల చరితములు విస్తరించి తక్కినవి సంక్షేపముగాను తెలిపెదను. మొట్టమొదట శ్రీకృష్ణుడు సరస్వతీదేవిని పూజించెను. ఆమె దయ వలన మూర్ఖుడుసైతము పండితకవి కాగలడు సరస్వతి రాధాదేవి ముఖము నుండి జన్మించినది. కామస్వరూపిణి కాముకి యగు సరస్వతి కృష్ణుని కామించెను. సర్వజ్ఞుడగు శ్రీకృష్ణుడు సర్వమాత యగు సరస్వతి భావమెరిగి యామెకు హితకరము సుఖకరమునగు మాట నిట్లుపలికెను.

ఓ సాధ్వీనీవు నారాయణుని సేవింపుము. అతడు నాయంశచే పుట్టినవాడు. చతుర్భుజుడు నవయువకుడు. అందగాడు సకల గుణవంతుడు నాకు సాటియైనవాడు. అతడు కామినుల కోర్కె లెరింగినవాడు వారికోర్కెలు తీర్చువాడు. కోటి మన్మథ సుందరుడు. ఈశ్వరుడు. నీవు నన్ను పతిగజేసికొని నాకు జంటగనుండ గోరు చున్నావు ఇది తగదు. ఏ..యన రాధ నీకంటె బలవంతురాలు. బలశాలియైన వాడు బలహీనున కాశ్రయమీయ గలడు. బలహీను నాశ్రయించిన నాతడు ఎట్లాశ్రయమీయగలడు? నేను సర్వేశుడను నిజమే. కాని రాధమనస్సు నొప్పింప జాలను ఏలననామె తేజమున రూపమున గుణమున నన్నివిధముల నాకు సరిజోడు. రాధ నాకు ప్రాణాధిష్ఠానదేవత. కనుకనెవడైన తన ప్రాణములను తాను పోగొట్టుకొనగలడా? తండ్రికి కొడుకు ప్రియమైనవాడేకాని తన ప్రాణముల కన్న కొడుకు ప్రియమైనవాడు కాడుగదా!

కనుక నీవు వైకుంఠమునకు వెళ్ళుము. అచట నీకు మేలుకలుగును. నీవచట నీశ్వరుని పతిగా వరించి సుఖములననుభవింపుము. అచట లక్ష్మి కలదు. ఆమె కామక్రోధములు లోభమోహములు మానహింసలు లేనిది. ఆమె తేజమున రూపమునగుణమున నీకు సమానురాలు. నీవు ఆమెయు సుఖముగా కాలము గడుపవచ్చును. హరియును మీ యిర్వురిని సమభావమున చూడగల దక్షుడు సుందరీ! ప్రతి విశ్వమందును మాఘశుద్ధ పంచమినాడు గొప్ప గౌరవముతో విద్యారంభమున నిన్ను పూజింతురు. ఎల్లమానవులు మనువులు మునులు దేవతలు మోక్షకాములు వసువులు యోగులు సిద్ధనాగ గంధర్వ రాక్షసులును నిన్ను పూజింతురు. ఇట్లెల్లరును ప్రతికల్పమున చివరివరకును భక్తియుక్తితో షోడశోపచారములతో నిన్ను పూజింతురు. ఇట్లు నీకు వరమిచ్చు చున్నాను. జితేంద్రియులు సంయములును కణ్వశాఖ విధిచేత నిన్ను కలశ మందుకాని పుస్తకమందు గాని యావాహనము చేసి ధ్యానింతురు. నీకవచము రేకుపై నిర్మించి దానిని గంధపుష్పాదులతో పూజించి మెడలోగాని భుజమున గాని దానిని ధరింప వలయును. పండితులు పూజాకాలమున నిన్ను పూజింతురు. అని సర్వపూజిత యగు సరస్వతిని శ్రీకృష్ణుడు పూజించెను.

అనాటి నుండియు బ్రహ్మ విష్ణు శివులును మునీంద్రులు సనకాదులు. అనంతుడు ధర్ముడును సకల దేవతలును మునులును రాజులు నరులు నెల్లదేవత లును సరస్వతీ దేవి నారాధింప మొదలు పెట్టిరి. సరస్వతీదేవి పూజా విధానాదులు కవచము ధ్యానము పూజకు తగిన పూవులు చందనము మొదలగు నవి నైవేద్యము కూడ తెలియజేయుమని నారదుడడుగగా నారాయణుడిట్లు చెప్పెను.

నారదా! కణ్వశాఖలోని పద్ధతిప్రకారము జగన్మాతయగు సరస్వతి పూజా విధానము తెలుపుదును వినుము. మాఘ శుద్ధ పంచమినాడుగాని విద్యారంభ దినమునగాని మధ్యాహ్న దినములోపుగ శుచియైనియమముతో దేవిని పూజించు టకు నియమించుకొన వలయును. అనాడు స్నానము నొనర్చి నిత్యకృత్యముల దీర్చికొని తవశాఖ ప్రకారముగాని తాంత్రికముగా గాని భక్తితో కలశస్థాపనము చేయవలయును. తొలుత గణపతిని పూజించి కలశమున దేవి నావాహనము చేసి శాస్త్రములో చెప్పినట్లు ధ్యానింపవలయును. పిమ్మట షోడశోపచారములతో దేవిని పూజించి వేదమున చెప్పినట్లు నైవేద్యము సమర్పింపవలయును. వేద మందును తంత్ర మందును చెప్పిన నైవేద్యముల గూర్చి తెలిపెదను వినుము.

వెన్న, పెరుగు, పాలు, పేలాలు నువ్వుండలు, చెరకుముక్కలు, బెల్లము, పిండి వంటలు, పటికి బెల్లము, తేనె, మిఠాయి, తెల్లని బియ్యముతో వండినయున్న

తెల్లధాన్యములు, అటుకులు తెల్లనిలడ్డు, ఉప్పునెయ్యి కలిసిన హవిష్యము (అన్నము) బియ్యము గోధుమపిండితో కలిపి నేతితో చేసిన వంటకము, పండిన అరటిపండ్లతో కలిపి చేసిన పిండివంటలు, నేతి పరమాన్నము అమృత భోజనము కొబ్బరికాయ కొబ్బరి బొండములు నీరు కందమూలములు అల్లము పండిన అరటిపండ్లు రేగుపండ్లు నాయాదేశముల దొరకునట్టి తెల్లని మంచి పండ్లను తెచ్చి సరస్వతీ మాతకు నివేదించవలయును. తెల్లని పూలమాలలు మంచి గంధము, తెల్లని వస్త్రము, సుందరమైన శంఖమును దేవి కర్పింపవలయును. మేలిమి బంగారు సొమ్ములు సరస్వతి కీయవలయును. వేదమందు ప్రశంసింప బడిన సరస్వతీ ధ్యానమెట్టిదో వినుము.

మహాత్మా! ఆధ్యానము వినినచో అది భ్రమలు తొలగించును. తెల్లని వర్ణము గలిగి చిరునవ్వులు చిందించుచు సుమనోహరమైన కోటి వెన్నెలలను మించిన పుష్టితోకూడిన దివ్యమైన ఆకృతి గలిగి పరిశుద్ధము పవిత్రము నగు వస్త్రములు ధరించి వీణియపుస్తకములు చేతుల ధరించి నవరత్న భూషణ భూషితమై బ్రహ్మ విష్ణు శివాదులచేత పూజింపబడి మునీంద్ర మను మానవుల చేత నమస్కరింప బడిన సరస్వతీ దేవిని పరమభక్తితో నమ స్కరించుచున్నాను. అని తెలసినవాడు తప్పక సరస్వతిని గూర్చి మూలమంత్రముతో నీ ధ్యానము పఠింపవలెను. తరువాత కవచము చదివి దండప్రణామము చేయవలయును.

ఇది సరస్వతిని నిష్టదేవిగా కొలుచువాని నిత్యప్రకియ. విద్యారంభమున గాని సంవత్సరము చివరగాని పంచమినాడుగాని సరస్వతిని పూజింపవలయును. వేదోక్తమైన యష్టాక్షరీమంత్రము సరస్వతీ మూలమంత్రము, ఎవరు దేని నుపదేశముగ పొందిన, వారికది యే మూలమంత్రమగును. సరస్వతీ శబ్దమునకు చతుర్థీవిభక్తి చేర్చి చివరకగ్ని భార్య పేరుంచ వలయును అనగా "స్వాహా" శబ్దము నుచ్చరింపవలయును. అదియే "హ్రీం సరస్వత్యైస్వాహా" అను మంత్రము. మొదట లక్ష్మీ మాయాబీజము (శ్రీంహ్రీం) లుంచవలయును.

ఈ మంత్రము కల్పవృక్షము వంటిది. పూర్వము దయాశ్రీకుడగు నారాయణుడు దీని నాదికవియగు వాల్మీకి కుపదేశించెను. నారాయణుడు దీనిని భారతదేశమందలి పుణ్యతీర్థమగు గంగా తీరమున నుపదేశించెను. భృగుమహర్షి దీనిని పుష్కరతీర్థమున సూర్య గ్రహణ సమయమందు శుక్రునకొసగెను. చంద్ర గ్రహణమునాడు దీనిని మరీచి బృహస్పతి కొసంగెను. బ్రహ్మ బదరికాశ్రమమున భృగుమహర్షికిచ్చెను. పాలసముద్రము సమీపమున దీనిని జరత్కారుడాస్తీకునకు

నొసగెను. విభాండకుడు మేరుపర్వతము పై ఋష్యశృంగమహర్షికి నొసంగెను. శివుడుకణాద గౌతములకును సూర్యుడు యాజ్ఞవల్క్యునకును కాత్యాయనునకు గూడ నొసంగెను. శేషుడు పాతాళమున బలిసభలో పాణిని భరద్వాజ శాకటాయనుల కుపదేశించెను. దీనిని నాలుగు లక్షలు జపము చేసినచో మానవులకు సిద్ధికలుగును. మంత్రసిద్ధుడైనవాడు బృహస్పతి సమానుడగును. ఓ విప్రవర్యా! ఇక సరస్వతీ కవచము వినుము.

ఇది విశ్వవిజయమును కలిగించును. దీనిని బ్రహ్మ గంధమాదన పర్వతముపై భృగు మహర్షికి నుపదేశించెను. భృగు విట్లునెను బ్రహ్మా! బ్రహ్మవేత్తలలో నీవు శ్రేష్ఠుడవు, బ్రహ్మజ్ఞాన విశారదుడవు సర్వజ్ఞుడవు. సర్వజనకుడవు, సర్వేశుడవు, సర్వ పూజితుడవు, ఓ ప్రభూ! విశ్వవిజయము నొసంగు సరస్వతీ కవచము నాకు ననుగ్రహింపుము. అది మంత్రములన్నిటికి నిలయమైనది. దోషములేనిది. బ్రహ్మ యిట్లునెను ఓయివత్సా! సర్వకామములు దీర్చు విశ్వజయకవచము వినుము. ఇది శ్రుతిసుఖము వేదసారము వేద పూజితము వేదోక్తము. నాకు బృందావనమున గోలోకమున రాసమండలమున రాసేశ్వరుడగు కృష్ణభగవానుడు పదేశించెను. ఇది మిక్కిలి రహస్యమైనది. కల్పవృక్షమువంటిది.

ఇది యత్యద్భుతమై యెన్నడును వినని మంత్రములతో నొప్పుచుండును. దీనిని ధరించుటవలన శుక్రుడు సకల దానవులందు పూజనీయుడయ్యెను. దీనిని దాల్చుటవలన బృహస్పతి బుద్ధిశాలి యయ్యెను. దీనిని పఠించుటచే వాల్మీకి మహర్షిగ వక్తగకవీంద్రుడుగనయ్యెను. పూర్వము స్వాయంభువమనువును దీనిని ధరించి సర్వపూజితుడయ్యెను. కణాదుడు గౌతముడు కణ్వుడు పాణిని శాకటాయనుడు కాత్యాయనుడు దక్షుడును దీనిని ధరించి యుత్తమోత్తమ గ్రంథముల రచించిరి. వ్యాసమహర్షి యును స్వయముగ దీనిని ధరించి వేదములను విభజించి లీలగా పురాణములను రచించెను.

వసిష్ఠుడు పరాశరుడు శాతాతపుడు సంవర్తుడు యాజ్ఞవల్క్యుడును దీనిని దాల్చి పఠించుట బట్టియే గ్రంథరచయితలు కాగలిగిరి. ఋష్యశృంగుడు భరద్వాజుడు ఆస్తీకుడు దేవలుడు జైగీషవ్యుడు యయాతి యనువారు దీనిని దాల్చి విశ్వపూజితులైరి. ఓ విప్రవర్యా! ఈ సరస్వతీ కవచమునకు ప్రజాపతి ఋషి బృహస్పతి ఛందస్సు శారదాంబిక దేవత సర్వతత్త్వ పరిజ్ఞానము సర్వార్థ సాధనము సకల సంగీత సాహిత్య కళా ప్రాప్తికొరకు దీని వినియోగము చెప్పబడును. "ఓం శ్రీం హ్రీం సరస్వత్యై స్వాహా" నిత్యము చెవులు రక్షించుగాక "ఓం

శ్రీం హ్రీం భగవత్యై స్వాహా" నిత్యము కన్నుల రక్షించుగాక "ఐం హ్రీం వాగ్వాదిన్యై స్వాహా" ముక్కులు కాపాడుగాక.

"హ్రీం విద్యాధిష్ఠాతృ దేవ్యైస్వాహా" పెదవులను రక్షించుగాక. "ఓం శ్రీం హ్రీం బ్రాహ్మ్యై స్వాహా" దంతముల కాపాడుగాక. "ఐం" ఏకాక్షరము నా కంఠము నెల్లవేళల రక్షించుగాక ఓం శ్రీం హ్రీం నామెడను బ్రోచుగాత శ్రీం నాభుజములను రక్షించుగాక 'ఓం హ్రీం విద్యాధిష్ఠాతృదేవ్యై స్వాహా' నా వక్షస్థలమునకు శ్రీరామరక్ష. "ఓం హ్రీం విద్యాది స్వరూపాయై స్వాహా"నా బొడ్డును రక్షించుగాక, ఓం హ్రీం క్లీం వాణ్యైస్వాహా నా చేతులను కాపాడుగాక, "ఓం సర్వవర్ణాత్మికాయై స్వాహా" నా పాదముల పాలించుగాక, "ఓం హ్రీం వాగధిష్ఠాతృ దేవ్యై స్వాహా" నన్నెల్లవేళల రక్షించుగాక, "ఓం సర్వకంఠవాసిన్యై స్వాహా" నన్ను తూర్పుదిక్కెపుడును కాపాడుగాక, "ఓం సర్వజిహ్వాగ్రవాసిన్యై స్వాహా" ఆగ్నేయ దిక్కు నన్ను రక్షించుగాక, " ఓం ఐం హ్రీం క్లీం సరస్వత్యైబుధ జనన్యై స్వాహా" అనుమంత్ర రాజము దక్షిణ దిశయందు నన్నెపుడు కాపాడుగాక, ఐం హ్రీం శ్రీం అను మూడక్షరముల మంత్రము నన్ను నైరుతిదిశయందు ప్రోచుగాత. ఓం ఐం జిహ్వాగ్రవాసిన్యై స్వాహా నన్ను పడమట కాపాడుగాక, "ఓం సర్వాబి కాయైస్వాహా" నన్ను వాయవ్యమున కాపాడుగాక, ఓం ఐం శ్రీం క్లీం గద్యవాసి న్యైస్వాహా నన్ను ఉత్తరమున రక్షించుగాక, ఐం సర్వశాస్త్రవాసిన్యై స్వాహా ఈశాన్యమున నన్ను రక్షించుగాక, ఓంహ్రీం సర్వపూజితాయై స్వాహా పై దిక్కున నన్ను పాలించుగాక, హ్రీం పుస్తకవాసిన్యై స్వాహా నన్ను క్రింది దిక్కు కాపాడుగాక, ఓం గ్రంథబీజ స్వరూపాయైస్వాహా నన్నెల్ల చోటలమ రక్షించుగాక, ఓవిప్రా నీకు బ్రహ్మమంత్రములు రూపుదాల్చిన బ్రహ్మ రూపమగు విశ్వవిజయమను కవచము తెలిపితిని. దీని నైదులక్షలు జపించినచో సిద్ధికలుగును. సిద్ధకవచుడైనవాడు బృహస్పతి సమానుడగును. అతడు వక్త, కవీంద్రుడు త్రిలోకవిజేత యగును. ఈ కవచ ప్రభావమున విశ్వమునే జయింప గలుగును.

# సరస్వతీ స్తుతి సరస్వతి నదిగా మారుట

సరస్వతి భారతదేశమున నదిగా అవతరించిన కథను వినగోరుచున్నానని నారదుడు కోరగా నారాయణుడిట్లు చెప్పెను. శ్రీహరికి లక్ష్మి సరస్వతి గంగ ముప్పురును భార్యలు. వీరు పరస్పరము ప్రేమతో కలిసిమెలిసి విష్ణు సమీప మున నివసించుచుండిరి.

ఒకనాడు గంగ విష్ణుముఖమును మాటిమాటికి చూచుచు నవ్వుచుండెను. విష్ణువు కూడ ఆమె ముఖమును చూచిన నవ్వెను. ఇది చూచుచు లక్ష్మి ఊర కుండెను. కాని సరస్వతి ఓర్వలేకపోయెను. లక్ష్మీదేవి చిరునవ్వుతో సరస్వతిని శాంతింపజేయ ప్రయత్నించినది. కాని కోపాధిక్యము వలన సరస్వతి ఏ మాత్రము శాంతింపలేదు. ఆమె కన్నులెఱ్ఱబడెను. పెదవులదరెను. శరీరమువణకెను. ఆమె భర్తతో నిట్లు పలికెను.

ధర్మాత్ముడైన భర్త తన భార్యలను సమభావ ముతో చూచుకొనవలెను. దుర్మార్గుడట్లు చూచుకొనలేదు. ప్రభూ! నీకు గంగాలక్ష్ముల యెడల పక్షపాతబుద్ధి యున్నది. నామీద నీకే మాత్రము ప్రేమలేదు. గంగకు లక్ష్మి యెడలను ప్రేమ మధికము. కనుకనే లక్ష్మి చూచుచుండియు సహించి యున్నది. మిగిలిన దానను నేనే దౌర్భాగ్యురాలను నేను బ్రతికి ఏమిలాభము? పతిప్రేమ లేనిదాని బ్రతుకు వ్యర్థముకదా! అని కోపముతో పలికిన సరస్వతిమాటలు విని విష్ణువు సభనుండి బయటకు వెళ్ళెను. నారాయణుడు వెళ్ళిన పిమ్మట రోషముతో నిర్భయముగా సరస్వతి నిట్లు పలికెను.

ఓ లజ్జలేనిదానా! నీకు గర్వమెక్కువగానున్నది. భర్త నీపట్ల ప్రేమతోనున్నట్లు చాటుకొనదలచుచున్నావు. నీగర్వమునిప్పుడే శ్రీహరి ముందే వ్యర్థము చేసెదను. నీకాంతుడేమి చేయగలడో నేను చూచెదను. అని గంగను తలవెండ్రుకలు పట్టి సరస్వతి లాగబోయెను. అంతలో లక్ష్మి వచ్చి నివారించెను. సరస్వతికి కోపమాగక లక్ష్మిని నదిగా చెట్టుగాను జన్మించుమని శపించెను. లక్ష్మి అంతటి ఘోరశాపమును వినికూడ తిరిగి శపింపలేదు. కోపించనులేదు. ఆమె మనస్సు నందే బాధపడుచు సరస్వతి చేయి పట్టుకొని నిలుచుండెను. కోపముతో కను లెఱ్ఱచేసిన సరస్వతిని వదిలి పెట్టుమని గంగయిట్లనెను!

పద్మా! అది గయ్యాళి మరియు వదరుబోతు వాక్కుకు అధిష్ఠానదేవి. ఎప్పు డును కలహించుచుండును. అని పలికి గంగ నిన్ను నదిగా మారుమనినట్లే తానును నదిగా మారగలదని వాణిని శపించెను. పాపాత్ములుండు మనుష్య లోకమున నదిగా మారగలదు. అను మాటలు వినివెంటనే సరస్వతి నీవును భూమి పై ప్రవహించి పాపుల పాపాలను అనుభవింపగలవు. అని అనుచుండగనే భగవాను డక్కడకు వచ్చెను. ఒకరినొకరు శపించుకొని నందుకు వారు మిక్కిలి విచారపడిరి. అప్పుడు వారి సమయమునకు తగినట్లు వారితో విష్ణువిట్లనెను. లక్ష్మీ! నీవు నీ యంశముతో ధర్మధ్వజు నింట జన్మింపుము. అచట దైవదోషమున వృక్షముగా

మారగలవు. శంఖచూడుడను రాక్షసుడు నాయంశముతో పుట్టును. నీవతనికి భార్యవై తిరిగి నాకు పత్నివికా గలవు. తులసి యను పేరుతో ప్రసిద్ధినొందెదవు.

ఓ చంద్రాననా! నీవు వెంటనే నీయంశచే నదీరూపమును ధరింపుము. సరస్వతీ శాపమున భారతదేశములో పద్మావతీనదిగా ప్రవహింపుము. గంగ! నీయంశచే నదీరూపమును దాల్చుము. నిన్ను భగీరథుడు భూలోకమునకు తీసికొని వెళ్ళగలడు. అందుచే "భాగీరథి" యని విఖ్యాతినొందెదవు. నా యంశవలన జన్మించిన సముద్రునకు భార్యవుకాగలవు. సరస్వతీ! నీవును గంగా శాపమున భారతదేశమునకు వెళ్ళుము. ఈ విధముగా మీరు సవతులపోరు ఫలమను భవింతురు. నీవు బ్రహ్మయింట అతని పత్నిగా నుండుము గంగ శివునివద్దకు వెళ్ళుగాక పద్మమాత్రము నాసన్నిధిలో నిలిచి యుండును. పద్మభక్తురాలు సత్త్వ స్వరూపిణి. ఇట్లు పలికి జగన్నాథుడు ఊరకుండెను. అప్పుడు ఆ ముగ్గురు దేవులు ఒకరినొకరు కౌగిలించుకొని దుఃఖించిరి. వారు భయపడుచు శ్రీహరితో ఇట్లనిరి:- నాథా! నీ వియోగమును సహింపలేము మాకుమరల నీతో సాంగత్యము ఎప్పుడు లభ్యమగునో తెలియజేయుము"అని ప్రార్థించిరి. భక్తా నుగ్రహకారకుడు పద్మ నాభుడు చిరునవ్వుతో లక్ష్మికి యిట్లనెను:-

కమలలోచనా! నీ మాటచెల్లింతును నామాటయును చెల్లించుకొందును. భారతీదేవి తన ఒకకళతో భారతదేశమున నదీరూపము ధరించును. మరొక సగభాగము కళతో బ్రహ్మ సమీపమున నుండగలదు. ఇంక పూర్ణకళతో నాసన్నిధి నుండుగాత. గంగ ఒకకళతో భూమిపై అవతరింప గలదు మరియొకకళతో శివుని తలపైనుండి పూజింపబడును. పద్మాక్షీ! నీవు నీ కళాంశమువలన పద్మావతీ నదిగా అవతరించి వృక్షముగా రూపు దాల్చగలవు. కలియుగమందు ఐదువేల యేండ్లు గడిచిన తరువాత నీ నదీరూపమునకు విముక్తికలుగును. నీవప్పుడు నన్నే చేరగలవు. పద్మా! కష్టము లనుభవింపక ఎవ్వడును మహాత్ముడుకాజాలడు. నామంత్రో పాసకులు పరమ సాధువులు నిన్ను దర్శించి స్పృశించి స్నానాదుల చేసి నంతనే నీకు శాపమోక్షము కలుగగలదు. సుందరీ భూమిపై నున్న తీర్థము లన్నియు నాభక్తులదర్శన స్పర్శనమువలన పవిత్రములుకాగలవు. ఈ భూమాతను పవిత్ర మొనర్చుటకు నా భక్తులు భారత భూమిపై నివసింతురు. నాభక్తులెచట నివసించి పాదప్రక్షాళనమొనరింతురో అచ్చట తప్పక పవిత్ర పుణ్యతీర్థము ఆవిర్భవించును. భగవద్భక్తుల పాదధూళి సోకినంతనే భక్తి భావముప్పొంగును. అని ఓదార్చెను.

# యుగధర్మాది ప్రతిపాదనము-పృథివ్యుపాఖ్యానము

పూర్వము జలమందున్న మహావిరాట్టు శరీరము నుండి సర్వవ్యాపకము ధ్రువమునైన భూమి యేర్పడెను. మహావిరాట్టు రోమకూపము నుండి సృష్టి సమయమున భూమి యావిర్భవించెను. అతని ప్రతి రోమకూపము నుండి భూమి యావిర్భవించి మరల యందేలీనమగును. ఇట్లు మాటి మాటికి జరుగుచుండును. సృష్టి సమయమున భూమి నీటిపై ఆవిర్భవించును. ప్రళయమునందు మరల నీటిలో మునుగును. ఈ భూమి ప్రతి బ్రహ్మాండమందును గిరివన దుర్గములతో సప్తసాగరములతో దీవులతో ప్రకాశించుచుండును. ప్రపంచములన్నియు భూమి పైన నిర్మింపబడినవి. అన్ని ప్రపంచములు నశ్వరములు, కల్పితములును. ప్రాకృత ప్రళయమున బ్రహ్మ పతనమైనప్పుడు కృష్ణుడు సృష్టికాలమున తన యంశతో మహావిరాట్టును సృష్టించును. వరాహరూపుడగు విష్ణువునకు భూమి భార్యయని వేదములు చెప్పుచున్నవి. భూమి కొడుకు కుజుడు. పంటతో కూడిన భూమిని బ్రాహ్మణునకు దానము చేసినవాడు భూమియందలి రేణువులంత కాలము శివ లోకమందుండి తుదకు విష్ణులోకమున కేగును. గ్రామమును, భూమిని, ధాన్యమును మూటిని బ్రాహ్మణునకు దానము చేసినవాడు దానము పుచ్చుకొన్న వాడును దేవలోకమున నివసింతురు. బ్రాహ్మణుల వృత్తిని అపహరించినవాడు సూర్యుడున్నంత కాలము కాలసూత్ర నరకములో పడును. భూమిపై దీపముంచు వాడు మరుజన్మలో కుష్ఠురోగియగును. ముత్యములు, మాణిక్యము, వజ్రము వీటిని నేలపై ఉంచినవాడు ఏడు జన్మలవరకు గ్రుడ్డివాడగును.

# ప్రళయా దిస్వరూప ప్రతిపాదనము

నారదుడునకు నారాయణుడు ఇట్లు చెప్పెను! కలియుగమున ఐదువేల సంవత్సరములు గడిచిన పిమ్మట గంగా సరస్వత్యాదులు నదీరూపము వదలి విష్ణు సాన్నిధ్యమును చేరగలరు. కాశి, బృందావనము తప్ప తక్కిన క్షేత్రములన్నియు శ్రీహరి యాజ్ఞచే విష్ణుపదమును చేరగలవు. సాలగ్రామము శక్తి శివుడు జగన్నాథుడును కలికాలమున పదివేల సంవత్సరములు గడిచిన పిమ్మట తమతమ స్థానములు చేరగలరు. వారి వెంట పరమసాధువులు, పురాణములు, వేదోక్తకర్మలు అన్నియును వెళ్ళిపోవును. దేవ పూజలు హరినామము వేదాంగములు శాస్త్రములు అన్నియు లోపించును. సజ్జనుల సత్యధర్మములు వేదాలు తపోవ్రతములు ఉప

వాసములు అన్నియును రూపుమాసిపోవును. ఎల్లరును కపటమిథ్యావర్తనులగుదురు. తులసిపూజలు జరుగవు. ఎల్లరు క్రూరులు శఠుల్నుడాంబికులు దొంగలు హింసకులు అహంకారులు నగుదురు. స్త్రీ పురుషులలో భేదాభిప్రాయములు భయము లేని వివాహములు జరుగును. పురుషులు స్త్రీ వశులగుదురు. ఇల్లాలింటి కధిపతికా గలదు. కోడలి ముందత్తమామలు పరిచారకులుగా నుందురు. స్త్రీ యాజ్ఞలేనిదే పురుషుడే పనియు చేయజాలడు. స్త్రీతో బుట్టినవారు పెత్తనము సాగింతురు. ప్రపంచమంతయు మ్లేచ్ఛమయమగును. అట్టి సమయమున విష్ణు యశసుడను వాని పుత్రుడుగ కల్క్యవతారమేర్పడును. అతడొక గుఱ్ఱమెక్కి కత్తితో మూడు రాత్రులలో భూమిపై మ్లేచ్ఛుడనువాడు లేకుండ చేయగలడు. భూమి అ రాజకమై రాక్షసులతో నిండిపోవును. ఆరుదినములు కుండపోతగా వర్షము కురియును. భూమి జలమయమగును. ద్వాదశాదిత్యులొకేసారి ప్రకాశింపగా నేల యెండిపోవును. ఘోర కలియుగమంతరించును. కృతయుగ మారంభమగును.

శ్రీదేవి కనురెప్పపాటులో బ్రహ్మ పతనము చెందును. అతని పతనమును ప్రాకృతికప్రళయమందురు. ప్రాకృత ప్రళయమున భూమి కనుపించదు. ప్రపంచ మంతయు నీటిలో మునుగును. అన్నియును పరమాత్మలో లీనమగును. ఈ భూమి అదృశ్యమై ఎక్కడ ఉండును? మరల సృష్టిసమయమున ఎట్టులావిర్భ వించును? మంగళప్రదమగు భూమి జన్మవృత్తాంతమును దయచేసి నాకు తెలియ జేయుమని నారదు డడుగగా నారాయణుడిట్లనెను:-

మొట్టమొదటి సృష్టియందు దేవి దయవలన అన్నియు పుట్టును. అట్లే ప్రళయమందన్నియు నశించును. అని వేదము చెప్పుచున్నది. మధుకైటభుల మేదస్సుచే ఏర్పడినందున భూమికి 'మేదిని'అను పేరు వచ్చినది. దీనికంటె వేరు మతము కూడ కలదు, పూర్వము మధుకైటభులకు శ్రీహరికి మధ్య యుద్ధము జరిగెను. అప్పుడు హరివరము కోరుకొనుమనగా రాక్షసులు భూమిపై నీరులేనిచోట మమ్ము చంపవలెనని వరము కోరిరి. దీనిచే అప్పటికే భూమి ఉన్నదని తెలియు చున్నది. ఆ రాక్షసులు చనిపోయిన పిమ్మట వారి శరీరములనుండి మేదస్సు వెడలెను. దానిచే భూమి ఏర్పడినదని భావము.

ఓ మునీశా! పూర్వము నీటి యందున్న మహావిరాట్టు శరీరమునుండి సర్వవ్యాపకము ధ్రువమునైన భూమి పుట్టినది. మహామునీ! మహావిరాట్టు రోమ కూపములనుండి సృష్టిసమయమున భూమి జన్మించెను. అతని ప్రతి రోమ కూపము నుండి భూవియావిర్భవించి మరల అందేలీనమగును. ఇట్లు మాటిమాటికి

జరుగుచుండును. సృష్టి సమయమున భూమి నీటిపై జన్మించును. ప్రళయమందు నీటిలో మునుగును. ఈ భూమి ప్రతి బ్రహ్మాండమందును గిరివనదుర్గములతో సముద్రములతో దీవులతో ఒప్పుచుండును. మేరుపర్వతముతో సూర్య చంద్ర గ్రహములతో బ్రహ్మ విష్ణు శివాది సురలోకములతో నొప్పుచుండును.

ఈ భూమిపై భాగమున ఏడులోకములు విలసిల్లుచున్నవి. అట్లే భూమి క్రింద భాగమున కూడ ఏడులోకములు కలవు. పైని బ్రహ్మలోకము ధ్రువలోకము విలసిల్లుచుండును. ప్రపంచమంతయు భూమి పై విరాజిల్లు చుండును. ఇట్లు ప్రపంచములన్నియు భూమిపైననే నిర్మింపబడినవి. ఈ ప్రపంచములన్నియు కల్పితములు నశ్వరములు. ప్రాకృతప్రళయమున బ్రహ్మపతనమైనప్పుడు కృష్ణుడు సృష్టికాలమున తనయంశచే మహావిరాట్టును సృష్టించును. సృష్టిప్రళయములు కాలము కాలపతి అందరును నిత్యులు. భూమియు నిత్యాధిష్ఠానదేవి. ఈమెను వరాహకల్పమున దేవతలు పూజించిరి. భూమి మనుముని విప్రగంధర్వులచే పూజింపబడినది. వరాహరూపుడగు విష్ణువునకు భూమి భార్య, అని వేదములు చెప్పుచున్నవి. భూమి కొడుకు మంగళుడు. అతని కొడుకు ఘటేశ్వరుడు. శ్రీ వరాహకల్పమున బ్రహ్మచేత స్తుతింపబడిన శ్రీవరాహమూర్తి హిరణ్యాక్షుని చంపి రసాతలమునుండి భూమిని పైకెత్తెను. కొలను నీటిపైకమలము నుంచి నట్లు వరాహమూర్తి నీటిపై భూమిని నిలిపెను. అప్పుడు దానిపై బ్రహ్మ మనోహరమైన ప్రపంచ మును సృష్టించెను.

అప్పుడు గొప్పకాంతితో వెలుగొందు వరాహ భగవానుడు భూమి యొక్క అధిష్ఠానదేవతను వలచెను. మరియు పూజించి ధ్యానించెను. ఓ భూదేవీ! నీవు అందరికి ఆధారమైనదానవు నిన్ను మునిమను సిద్ధ దేవదానవాదులు నిన్ను పూజింతురు. నూతన గృహారంభ గృహప్రవేశ వాపీతటాకారంభములందు వ్యవ సాయపు పనులందును గృహములందు నిన్ను పూజింతురు. నా వరముచే దేవతలు మున్నగువారు కూడ నిన్ను పూజింతురు. అని పలుకగా భూదేవి యిట్లనెను:-

"భగవానుడా! నేను నీ యాజ్ఞచే చరాచర ప్రపంచమునంతను మోయగలను. కాని ముత్యము విష్ణుప్రతిమ శివలింగము మొదలగు వానిని మాత్రము భరింపలేను" అనగా ఓ సుందరీ! ఈ వస్తువులను నీపై (వట్టినేలమీద) ఉంచు మూఢుడు, నరకమునకు పోవునని భగవానుడు పలికెను. అంతట మహోజ్జ్వల శరీరయగు భూదేవి మంగళుడను కుమారుని కనెను. అందరు భూదేవి నిట్లు స్తుతించిరి.

# భూదేవీ స్తుతి

శ్లో॥ జయజయే జలాధారే జలశీలే జలప్రదే ।
యజ్ఞ సూకరజాయేత్వం జయం దేహి జయావహే॥
మంగళే మంగళాధారే! మంగళ్యే మంగళప్రదే ।
మంగళార్థం మంగళే మంగళం దేహ్ని భవే॥
సర్వాధారేచ సర్వజ్ఞే సర్వశక్తి సమన్వితే ।
సర్వకామప్రదేదేవి! సర్వేష్టం దేహ్ని భవే ॥
పుణ్య స్వరూపే పుణ్యానాం బీజరూపే సనాతని ।
పుణ్యాశ్రయే పుణ్యవతామాలయే పుణ్యదే భవే ॥
సర్వ సస్యాలయే సర్వ సస్యాఢ్యే సర్వసస్యదే ।
సర్వ సస్యహారే కాలే సర్వసస్యాత్మికే భవే ॥
భూమే భూమిప సర్వస్వే భూమిపాలపరాయణే ।
భూమిపానాం సుఖకరే! భూమిందేవిచ భూమిదే ॥
ఇదం స్తోత్రం మహాపుణ్యం ప్రాతరుత్థాయయః పఠేత్ ।
కోటిజన్మసుభవేద్బలవాన్ భూమిపేశ్వరః॥
భూమిదానకృతం పుణ్యం లభ్యేతే పఠనాజ్జనైః ।
భూమిదానహరాత్పాపాన్ముచ్యతే నాత్ర సంశయః ॥
అశ్వమేధశతం పుణ్యం లభతే నాత్ర సంశయః॥
భూమి దేవ్యా మహాస్తోత్రం సర్వకల్యాణకారకమ్ ॥

**స్తోత్రభావము:-** ఓ జలాధారా! జలశీలా! జలప్రదా! నీకు జయము. ఓ యజ్ఞ వరాహసతీ! జయావహా! మంగళాధారా! మంగళా! మంగళప్రదా! మాంగల్యా! మాకు శుభములను కలుగజేయుము. తల్లీ! నీవు సర్వాధారవు. సర్వజ్ఞవు. సర్వ శక్తిసమన్వితవు. ఓ భవా! దేవీ! నీవు సర్వకామప్రదాయినిని. మా కోర్కెలు తీర్చుము. సనాతనీ! పుణ్యస్వరూపా! పుణ్యముల మూలబీజమా! పుణ్యాశ్రయా! పుణ్య దాయినీ! పుణ్యశీలురనిలయమా! సస్యశ్యామలా! సస్యాఢ్యా! సస్యాధాయినీ! సర్వసస్యాత్మికా! సస్యహంత్రీ కాలరూపా! భూమీ! రాజుల పాలనచే సంతోషించు దేవీ! రాజులకు సుఖము కూర్చుదానా! భూమిదా! మాకు భూమినిమ్ము! ఈ భూస్తోత్రము పుణ్యప్రదము. దీనిని ఉదయమునలేచి చదువవలయును. ఇట్లు చదివినవాడు కోటిజన్మలు రాజగును. మరియు భూదానపుణ్యమును లభించును. దీనివలన తప్పక నూరు అశ్వమేధయాగములు చేసిన ఫలము లభించును.

# గంగా చరిత్రము

గంగను సురేశ్వరి - విష్ణుస్వరూప- పరమవిష్ణు పదియనుచున్నారు. అట్టి గంగాదేవి కథను చెప్పవలసినదిగా నారదుడు నారాయణుని ప్రార్థింపగా నాతడు చెప్పనారంభించెను. పూర్వము సగరుడను రాజు సూర్యవంశమున జన్మించి ప్రసిద్ధికెక్కెను. అతనికి వైదర్భి, శైబ్యయను యిద్దరు చక్కని భార్యలుండిరి. ఆ యిరువురిలో శైబ్యకు అందగాడైన కుమారుడు జన్మించెను. అతని పేరు అసమంజసుడు. అతడు కులవర్ధనుడు, కీర్తిమంతుడు. రెండవ భార్యపుత్రుని కనదలచి శంకరుని పూజించెను. శివుని ప్రభావముచే నామె గర్భవతియయ్యెను. నూరు సంవత్సరములు గడచిన పిమ్మట ఆమె యొకమాంసపిండమునుకనెను. దానినిచూచి యామె శివుని స్మరించి మాటిమాటికి పెద్దగా దుఃఖించెను.

అప్పుడు శివుడు బ్రాహ్మణవేషమున ఆమె ముందుకు వచ్చి ఆ పిండమును అరువదివేల ముక్కలుగా విభజించెను. ఆభాగములనుండి బలపరాక్రమములుగల పుత్రులు పుట్టిరి. వారు గొప్ప తేజస్సుగలవారు. వారందరును కపిలముని శాపము వలన బూడిదగా మారిరి. అదివిని రాజు పెద్దగా దుఃఖించి అడవులు పట్టిపోయెను. అసమంజుడప్పుడు గంగను భూమిమీదికి తెచ్చుటకై లక్ష సంవత్సరములు తపస్సు చేసి కాలయోగమున మరణించెను. అతని కొడుకు భగీరథుడు, మహా భాగవతుడు, బుద్ధిమంతుడు, విష్ణుభక్తుడు. గుణశాలియు. ఇతడు కూడ గంగను భూమికి తెచ్చుటకై లక్ష సంవత్సరములు తపస్సు చేసెను.

అంతట శ్రీకృష్ణుడా తనికి దర్శనమిచ్చెను. శ్రీకృష్ణుడు రెండు భుజములతో మురళీమోహనుడై సుందర గోపాల బాలుడుగా భక్తానుగ్రహరూపుడై యుండెను. చిరునవ్వులు చిందించు ఆ శ్రీకృష్ణమూర్తిని చూచి భగీరథుడు మాటిమాటికి నమస్కరించెను. మరియు కృష్ణుని దివ్యస్తోత్రముతో నుతించి శరీరముగగుర్పాటు చెందగా తన వంశమును తరింపజేయునట్టి వరమును పొందెను. శ్రీభగవానుడు గంగాదేవిని భారతీ శాపముచే భారతదేశమునకు వెళ్ళి నా యాజ్ఞచే సగరుని కొడుకులను పవిత్రులను చేయుమని పలికెను. మరియు నీస్పర్శచేవారు పవిత్రులై దివ్య రూపములతో విమానములలో కూర్చొని నా మందిరమునకు చేరగలరు.

అచట వారు ఏరోగములు లేక సుఖముగాను నుందురు. వారు జననమరణ ములచే కర్మభోగముల ననుభవింపవలసిన పనిలేని వారగుదురు. భారతదేశ మందలి నరులు కోటిజన్మలలో చేసిన పాపములను కూడ గంగాస్నానముచే పోగొట్టుకొందురు. గంగాదేవిని చూచి తాకినంతనే పుణ్యము నూరురెట్లు

పెరుగును. బ్రహ్మహత్యాది పాపములు నశించును. తెలిసికాని తెలియక కాని జన్మలో చేసిన పాపములు సమస్తము గంగలో స్నానము చేయుటవలన నశించును. ఓ విప్రవర్యా! పుణ్యాదినము లందు గంగలో చేసిన పుణ్యాకర్మఫలమును వేదములు కూడ వర్ణించినవి. దాని మహిమను బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కూడ వర్ణింప జాలరు. ఇదియంతయు పట్టిగా చేసిన స్నానమునకు సంబంధించిన విషయము.

ఇక సంకల్పముతో చేసిన స్నానము యొక్క ఫలము సామాన్య స్నానము కంటె పదిరెట్లు ఎక్కువ. రవి సంక్రమణమునాడు గంగాస్నానము చేసినచో ముప్పది రెట్లెక్కువ పుణ్యము లభించును. అమావాస్యనాడు చేసిన స్నానమునకు కూడ నంతియే ఫలము. దక్షిణాయనమున దానికి రెండింతలు. ఉత్తరాయణమున దానికి పదింతల పుణ్యఫలము. చాతుర్మాస్య పూర్ణిమ అక్షతదియ నవమి యీ దినము లందు గంగాస్నానముచే అంతులేని పుణ్యమును, సామాన్యదినములలోని స్నానముకంటె పర్వదినములలో చేసిన స్నానాదులకు నూరురెట్లు పుణ్యము లభించును. మన్వంతరము ప్రారంభదినమున యుగాది యందు మాఘశుద్ధ సప్తమి, భీష్మాష్టమి, అశోకాష్టమి, శ్రీరామనవమినాడు చేసిన గంగాస్నానమువలన మహాపుణ్యము ప్రాప్తించును.

ఏకాదశితిథినాడు చేసిన స్నానము వెనుకటి పుణ్యఫలము కంటె రెండింతలు విజయదశమినాటి స్నానము యుగాది స్నానమునకు సమానము. మహావారుణి నాటి స్నానము పూర్వముకంటె నాల్గురెట్లు సూర్య గ్రహణ గంగాస్నానముకంటె చంద్రగ్రహణ స్నానము పదిరెట్లు యెక్కువ. అర్ధోదయము దానికంటె నూరు రెట్లెక్కువ. అని యిట్లు భగవానుడు చెప్పి విరమించగా గంగ వినయముతో తలవంచి భక్తితో ఇట్లు పలికెను.

ఓ నాథా! సరస్వతీ శాపమున నీయనుమతివలన భగీరథుని తపస్సువలన నేనిప్పుడు భారత దేశమునకు వెళ్ళుచున్నాను. కాని ప్రభూ! పాపాత్ములు-యే-యే పాపముల నాయందు వదలుదురో అవి నానుండి యెట్లు తొలగునో ఆయు పాయము తెలుపుము. భారతదేశమున నేనెంతకాలము నివసింపవల యును? దేవేశా! నేను మరల నీ విష్ణు పదమును యెప్పుడు చేరుకొనవలయును?

ఓ ప్రభూ! నాలో మిగిలిన కోరికలన్నియు నీవెరుగుదువు. కనుక ఉపాయ మును తెలియజేయుము. అనగా భగవంతుడిట్లనెను? ఓ సురేశ్వరీ! గంగా! నీలోని కోరికలన్నియు నేనెరుగుదును. జలరూపముగల నీకు సాగరుడు భర్త కాగలడు. సాగరుడు నాయంశయే. నీవు లక్ష్మీ స్వరూపము. సరస్వతి మొదలగు నదులను

సాగరములో కలియుము. ఐనను వాటియన్నిటికంటె నీవు మిక్కిలి సౌభాగ్యవతి వగుదువు. నీవు భారతీ శాపమున భారతదేశములో కలియుగ మందు ఐదువేల సంవత్సరములు వరకు ఉండగలవు. నీవు నిత్యము సాగరముతో కలిసి యుందువు. భారతీయులెల్లరు భగీరథుడొనరించిన నీ స్తోత్రముతో పరిపూర్ణ భక్తితో నిన్ను స్తుతించగలరు.

కాణ్వశాఖ ప్రకారము నిన్ను పూజించి స్తుతించి నమస్కరించినవాడు అశ్వమేధ యాగఫలము పొందగలడు. వేయేల! నూరామడల దూరమునుండియు గంగా! గంగా! యని బిగ్గరగా నిన్ను పిలుచువారి పాపములు నశించును. అతడు విష్ణు లోకమునకు వెళ్ళగలడు. పాపాత్ములస్నానమువలన నీకంటిన పాప మంతయు దేవీభక్తులు నిన్ను తాకినంతనే నశించును.

ఓ శుభాంగీ! నీవు సరస్వతి మొదలగు దివ్యనదులతో కూడి పాపా త్ముల పాపపంకమును కడిగి వేయుము. దేవి ప్రకృతి మాతగుణ మహిమలు కీర్తించు చోటు పరమపుణ్యతీర్థమగును. నీలోని యిసుకరేణువు తాకినంతనే పాతకి పవిత్రుడగును. అతడు శ్రీదేవి లోకమున నివసింప గలడు. నీయందలి భక్తితో నామస్మరణము చేయుచు ప్రాణములు వదలు పుణ్యాత్ములు విష్ణుసాలోక్యమును పొందగలరు. అక్కడ వారు నాప్రక్కన నిలిచి చిరకాలము సుఖములు పొందగలరు. అట్టివారు సూర్య చంద్రు లున్నంతకాలము వైకుంఠమందు నివసించి సుఖించ గలరు. ఒకవేళ తెలియక నీ నీటిని తాకి ప్రాణములు వదలినచో అతనికి నా సాలోక్యము వచ్చును. నీవు లేనిచోట నీనామము నుచ్చరించుచు ప్రాణముల వదలినచో వారికి నేను సాలోక్యముక్తి నిచ్చెదను. ఎక్కడనైనను నిన్ను తలచు కొనుచు ప్రాణములు విడిచినవాడు కూడ సాలోక్యముక్తిని పొందగలడు.

అట్టి వానికి అనేక ప్రాకృతప్రళయముల వరకు సారూప్యముక్తి నిచ్చెదను. వారు రత్న విమానము నెక్కి నా సేవకులతో విహరింపగలరు. వారు గోలోకము చేరి నాతో సమానులగుదురు. ఇట్టివారికి ప్రత్యేకముగా ఒక తీర్థమునందే మర ణించవలెనను నియమమములేదు. ఇక నా కృష్ణమంత్రము పాసించుచు. నానైవేద్యము భుజించుచుండువాడు ముల్లోకములను పవిత్రము చేయగలడు. అతడు నా దివ్యరత్న విమానములో గోలోకము చేరగలడు. నాభక్తులు జ్ఞానులగు వారు ఎక్కడ నున్నను నన్నే స్మరించుచుందురు. నాయందలి నిశ్చలభక్తివలనవారు పవిత్రులై జీవన్ముక్తులు కాగలరు. అని గంగతో పలికి శ్రీహరి భగీరథునితో నిట్లు పలికెను.

'ఇప్పుడు నీవు భక్తిభావము పెల్లుబుక గంగాదేవిని స్తుతించి పూజింపుము.' అని పలికెను. తరువాత భగీరథుడు భక్తిభావముతో గంగను పూజించెను. పిమ్మట కౌథుమశా ఖోక్త ప్రకారముగా మాటిమాటికిని భగీరథుడు గంగను స్తోత్రము చేసి ధ్యానించెను. ఈశ్వరుడగు శ్రీకృష్ణపర మాత్మకు నమస్కరించెను. తరువాత శ్రీకృష్ణపరమాత్మ అంతర్ధానము చెందెను. గంగ భగీరథుని వెంట నడచెను. ఏ స్తోత్రధ్యాన పూజావిధులచే భగీరథుడు గంగను సంతోషింపజేసెనో తెలియ జేయుమని నారదుడడుగగా నారాయణుడిట్లు పలికెను.

నిత్యక్రియలు స్నానము చేసి తెల్లనివస్త్రము ధరించి భక్తితో ఆరుగురు దేవతలను పూజించిన గాని గంగా పూజకర్హుడు కానేరడు. గణపతి, సూర్యుడు, అగ్ని, విష్ణువు, శివుడు, శక్తి ఈ యార్గురు దేవతలను పూజించినవారికి గంగా పూజచేయు యోగ్యత సంభవించును. విఘ్నములు తొలగుటకు గణపతిని, ఆరోగ్యముకొరకు సూర్యుని పూజింపవలయును. పరిశుద్ధత కొరకు అగ్నిని లక్ష్మి ప్రాప్తికి విష్ణు మ్మూర్తిని జ్ఞానము కొరకు శివుని ముక్తికొరకు శక్తిని. పూజింపవల యును. ఇట్లు చేయనిచో విపరీతఫలితము లభించును. భగీరథుడు కణ్వ శాఖోక్త ప్రకారముగా ఇట్లు ధ్యానించెను.

## గంగ వైకుంఠము చేరుట

దేవదేవా! కలియుగములో ఐదువేల సంవత్సరములు గడిచిన పిమ్మట గంగ ఎక్కడకు వెళ్ళునో తెలియజేయుమని నారదుడడుగగా నారాయణు డిట్లు చెప్పెను:- సరస్వతీ శాపముచేత ఈశ్వరు నాజ్ఞచేతను గంగ భారత దేశమునకు వచ్చి శాపము తీరగనే మరల వైకుంఠమునకు చేరెను. సరస్వతియు భారత దేశమును వదలి హరిపదము చేరెను. పద్మావతి గంగయు శాపము తీరగనే వైకుంఠమును చేరిరి. హరికి గంగ, సరస్వతీ, లక్ష్మి ముగ్గురు ప్రియురాండ్రు. వీరితో తులసియును చేరి మొత్తము భార్యలు నలుగురని వేదములు చెప్పినవి. పూర్వము గోలోకములో గంగ ద్రవరూపమున నుండెను. గంగ రాధాకృష్ణుల శరీరమునుండి పుట్టినది. ఆమె వారి యంశకలది. వారి స్వరూపముగలది. గంగ ద్రవమునకధిష్ఠాన దేవత. ఆమె యసాధారణమైన రూపసంపద గలది. నవయౌవనముతో ప్రకాశించునది.

సకలాభరణ భూషితురాలు. ఆమె ముఖము శరత్కాల మందు వికసించిన పద్మమువలె మిక్కిలి శోభతోకూడినది. అందములు గ్రుమ్మరించు చిరునవ్వు గలది. మేలిమి బంగారమువంటి శరీర కాంతితో వెలగొందునది. విశాలములైన కన్నులు దయారసముతో నిండియుండునవి. ముంగురులు మనోహరమైన

వంపులు తిరిగియుండును. ఆమె కేశపాశము మాలతీమాలలతావుల విరజిమ్ము చున్నవి. నుదుటిపై చందన బిందువు మీద సింధూరతిలకము కళకళలాడుచున్నది. చెక్కిళ్లమీద అందమైన మకరికా పత్రములు కస్తూరితో చిత్రింపబడెను. పెదవులు మంకెనపూవు శోభకలిగి మిక్కిలి ఆకర్షించుచున్నవి. పళ్ళు దానిమ్మగింజలు పేర్చినట్లున్నవి. అతి పవిత్ర మైన వస్త్రమును నడుమున ధరించినది.

ఈ విధముగా గంగ సిగ్గుతో అనురాగముతోడను శ్రీకృష్ణుని సమీపమున నిలుచుండెను. మరియు ప్రియుని ముఖమును విప్పారిన కన్నులతో చూడ సాగెను. గంగ ప్రభువు రూప సంపద తిలకించి తన్మయత్వముతో పులకిత శరీరయ య్యెను. అంతలో అచటికి రాధ వచ్చెను. రాధాదేవి కోటిచంద్రుల కాంతితో వెలుగొందుచుండెను. ముప్పది కోట్ల గోపికలు ఆమెను చేరియుండిరి. కోపముచే ఎఱ్ఱబారిన కన్నులుగల యామె ముఖము ఎఱ్ఱతామరపూవువలె ప్రకాశించు చుండెను. ఏనుగువలె మెల్లని ఠీవితో కూడిన నడకగలది. అమూల్యములైన అనేక రత్నాభరణముల నలంకరించుకొన్నది.

నడుమున శుద్దమైన పట్టువస్త్రమును ధరించినది. మెట్టతామరపూవుల కాంతిని మించి కోమలములైన ఆపద కమలములు మెల్లమెల్లగ అడుగులు సాగించుచున్నవి. ఆమె రత్న నిర్మితమైన విమానము నుండి దిగెను. ఋషులు తమతమ చేతులందలి చామరములతో ఆమెకు వీచుచుండిరి. వెలుగుచున్న దీపకళికవలె నుదుట సిందూర బిందువొప్పుచుండెను. కస్తూరితిలకము నుదుట, సీమంతముక్రింద మెరయుచున్నది. ఆమె మందా రసుమ మాలికలను ధరించి యున్నది. ఆమె శరీరము వణికినది. పెదవులదరెను. కోపమెక్కువయ్యెను. ఈ విధముగా రాధకృష్ణుని వద్దకు వెళ్ళి రత్న సింహాసనముపై కూర్చుండెను. చెలికత్తె లామె చుట్టు నిలిచి సేవించుచుండిరి. కృష్ణుడు ఆమెను చూచి గౌరవముతో లేచి నిలబడెను. కృష్ణుడామెతో నవ్వుచు తియ్యని మాటలతో త్వొరపడుచు పలుకరించెను.

అప్పుడు గోపిక లెల్లరు భక్తిభావము వ్యక్తమగునట్లు చేతులు జోడించితలలు వంచి ఆమెను నుతించిరి. పరమేశ్వరుడు కూడ రాధను స్తుతించెను. వినయ భయములతో కుశలము నడిగెను. గంగ పెదవులు భయముచే నెండిపోగా ఆమె శ్రీకృష్ణుని పదకమలములు ధ్యానించి శరణు జొచ్చెను. కృష్ణుడామె భయమును పోగొట్టి యభయమిచ్చెను. సర్వేశ్వరుని వరముచే నామె మనస్సుకుదుట బడెను. ఎత్తైన బంగారు సింహాసనముపై కూర్చున్న రాధను గంగ చూచినది. రాధ బ్రహ్మతేజముతో అందముగా చూడదగియుండెను. కృష్ణుడామెను లక్ష్మితో కూడ

పూజించెను. రాసేశ్వరియగు రాధను సురేశ్వరి యగు గంగ రెప్పలార్పక చూచి తృప్తిచెందలేదు. అప్పుడు రాధ ఓ ప్రాణేశా! ఈ కల్యాణి ఎవరు? నీముఖము చూచి చిరునవ్వు చిందించుచున్నది? నీవు నవ్వులురువ్వుచు సైగలతో ఆమెను చూచున్నావు.

ఓయిలంపటుడా! ఈ గోలోకము విడిచి వెళ్ళిపొమ్ము. నీ ప్రియురాలితోనే కులుకుచుండుము. అని రాధ కనులెఱ్ఱచేసి పలికెను. తరువాత సిద్ధయోగినియగు గంగ అంతర్ధానము చెంది నీరుగా మారెను. రాధకూడ సిద్ధ యోగిని యగుటచే గంగను పుక్కిటబట్టనుంకించెను. అది తెలిసి యోగబలము తో గంగ శ్రీకృష్ణుని చరణకమలములు శరణు జొచ్చెను. ఎక్కడ చూచినా రాధకు గంగ కనబడలేదు. గోలోకములో ఎక్కడను నీటి చుక్కలేదు. అందరు చేతులెత్తి గోవిందునికి మ్రొక్కిరి. స్తోత్రము చేసిరి. సర్వకారణ కారణుడగు కృష్ణుడు అమూల్య రత్న సింహాసనముపై కూర్చుండెను. గోపికలు వింజామరలతో కృష్ణ పరమాత్మను సేవించుచుండిరి. నృత్యగానములు చేయుచుండిరి. కృష్ణ భగవాను డీవినోదము ననుభవించుచుండెను. ప్రాణముల కంటె ప్రియమైన రాధ యతని వక్షఃస్థలముపై విలసిల్లుచుండెను. అప్పుడు భగవానుడిట్లనెను.

ఓ బ్రహ్మా! రమ్ము మహాదేవా! రమ్ము మీకు కుశలమగు గాక. మీరు గంగకొరకు వచ్చితిరి. అభయ ముతో నాపాదములను శరణు జొచ్చినది. రాధ నావద్దనున్న గంగను త్రాగివేయ దలచినది. గంగను మీకు అప్పగింపజాలనని పలికెను. బ్రహ్మ యిట్లనెను! పూర్వము రాసమండలమున శంకరుని సంగీతము నకు ముగ్ధులైన రాధాకృష్ణుల శరీరములనుండి గంగ జన్మించినది. కనుక గంగ మీకు కన్యవంటిది. గంగకు వైకుంఠపతి యగు చతుర్భుజుడు భర్తకాగలడు. విష్ణువు అంశచే పుట్టిన సాగరుడు భూలోకమున పతి కాగలడు. అని పలుకుచుండ కృష్ణుని కాలిబొటన వ్రేలి నుండి గంగ జన్మించెను. గంగజల రూపము వదలి నిజరూపము ధరించి రాధాకృష్ణుల మధ్యశాంతముగ మర్యాదగనుండెను. గంగకు రాధాదేవి తల్లి. గంగ రాధను సంస్తుతించి వైకుంఠమునకేగెను./

## గంగా ధ్యానము

శ్లో॥ ధ్యానం చకణ్వాశాఖోక్తం సర్వపాప ప్రణాశనమ్ ।
శ్వేత పంకజవర్ణాభాం గంగాం పాప ప్రణాశినీమ్ ॥
కృష్ణ విగ్రహ సంభూతాం కృష్ణతుల్యాం పరాంసతీమ్ ।
వహ్నిశుద్ధాంశుకాధానాం రత్నభూషణ భూషితామ్ ॥

శరత్పూర్ణేందు శతకమృష్ట శోభాకరాంవరామ్ ।
ఈ షద్దాస్య ప్రసన్నా స్యాంశశ్వత్సుస్థిరయౌవనామ్ ॥
నారాయణ ప్రియాంశాంతాం తత్సే భాగ్య సమన్వితామ్ ।
బిభ్రతీంకబరీభారం మాలతీ మాల్యసంయుతమ్ ॥
సింధూరబిందులలితం సార్ధం చందన బిందుభిః ।
కస్తూరీ పత్రకం గండే నానాచిత్ర సమన్వితమ్ ॥
పక్వబింబవినింద్యాచ్ఛ చార్వోష్ఠపుటముత్తమమ్ ।
ముక్తా పంక్తి ప్రభాముష్ట దంత పంక్తి మనోరమమ్ ॥
సుచారు వక్త్రనయనం సకటాక్షం మనోహరమ్ ।
కఠినం శ్రీఫలాకారం స్తనయుగ్మంచబిభ్రతీమ్ ॥
బృహచ్ఛ్రోణిం సుకఠినాం రంభాస్తంభవినిందితామ్ ।
స్థల పద్మప్రభా ముష్ట పదపద్మయుగం వరమ్ ॥
రత్నపాదుక సంయుక్తం కుంకుమాక్తం సయావకమ్ ।
దేవేంద్ర మౌళిమందారమకరందకణారుణమ్ ॥
సురసిద్ధ మునీంద్రైశ్చ దత్తార్ఘ్యం సంయుతం సదా ।
తపస్వి మౌళినికరం భ్రమరశ్రేణి సంయుతమ్ ॥
ముక్తిప్రదం ముముక్షూణాం కామినాం సర్వభోగదమ్ ।
వరాంవరేణ్యాం వరదాం భక్తానుగ్రహకారిణీమ్ ॥
శ్రీవిష్ణోః పద దాత్రీంచ భజేవిష్ణు పదీంసతీమ్ ।
ఇత్యనేనైవ ధ్యానేన ధ్యాత్వాత్రి పథగాం శుభామ్ ॥
దత్వాసంపూజ యేద్బ్రహ్మన్ ఉపచారాణిషోడశ ।
ఆసనంపాద్యమర్ఘ్యంచ స్నానీయంచానులేపనమ్ ॥
ధూపం దీపం చ నైవేద్యం తాంబూలం శీతలం జలమ్ ।
వసనం భూషణం మాల్యం గంధమాచమనీయకమ్ ॥
మనోహరం సుతల్పంచ దేయాన్యేతానిషోడశ ।
దత్వా భక్త్యా చ ప్రణమేత్సం స్తూయాంజలి మర్పయేత్॥
సంపూజ్యైవం ప్రకారేణ సోశ్వమేధ ఫలం లభేత్ ॥

**స్తోత్రభావము:-** కణ్వశాఖయందలి గంగా ధ్యానము సకలపాపహరము గంగ తెల్ల తామరపువ్వుల వంటి కాంతి గలది. పాపములు పోగొట్టునది. శ్రీకృష్ణుని శరీరము

నుండి పుట్టినది. కృష్ణుని వంటి శక్తికలది. పరమసాధ్వి. పవిత్రమైన వస్త్రములు ధరించినది. రత్నభూషణ భూషితురాలు. శరత్కాలచంద్రుని మించిన శోభకలది. చిరునవ్వుల చిందించు ముఖము కలది. నవయువతి నారాయణప్రియ శాంత ప్రియ సౌభాగ్యముతో నొప్పునది. అద్దములవంటి. చెక్కిళ్ళుకలది. మాలతీ మాలికలతోకూడిన కేశపాశముకలది. దొండపండు వంటి పెదవులు గలది. ముత్యాలవంటి దంతపంక్తి. మెట్ట తామరపూవులను మించిన పాదములు కలది. అట్టి గంగ ముముక్షువులకు ముక్తిని కాముకులకు భోగములను యిచ్చి భక్తులను అనుగ్రహించునది. శ్రీ విష్ణుపదమును పొందించునది. సతీమతల్లి, విష్ణుపది త్రిపధగ శుభాంగియగు గంగామతల్లి నిట్లు ధ్యానింపవలెను.

ఆసన - పాద్యార్ఘ్య - స్నాన - అను లేపన ధూప - దీప - నైవేద్య- తాంబూలములు- మంచినీరు వస్త్ర భూషణములు పూలదండలు గంధము, ఆచమనము- పూలపాన్పు అను ఉపచారములనర్పించి పూజించి గంగను పరమభక్తితో స్తుతింపవలెను. ఈ విధముగ గంగను పూజించిన వానికి అశ్వమేధఫలము లభించును. అని చెప్పగా గంగా స్తోత్రమును చెప్పుమని మరల నారదుడు ప్రశ్నింపగా నారాయణుడిట్లనియె:-

శ్లో॥ శ్రుణు నారద వక్ష్యామి పాపఘ్నం పుణ్యకారకమ్ ।
శివ సంగీత సమ్ముగ్ధ శ్రీకృష్ణాంగ సముద్భవామ్ ॥
రాధాంగ ద్రవసంయుక్తాంతాం గంగాం ప్రణమామ్యహమ్ ।
గోపైర్గోపీభిరా కీర్ణే శుభేరాధామహోత్సవే ॥
కార్తిక్యాం పూర్ణిమాయాంచ తాంగంగాం ప్రణమామ్యహమ్ ।
కోటియోజన విస్తీర్ణాదైర్ఘ్యే లక్షగుణాతతః ॥
సమావృతాయా గోలోకే తాంగంగాం ప్రణమామ్యహమ్ ।
షష్టిలక్ష యోజనాయా తతోదైర్ఘ్యే చతుర్గుణా ॥
సమావృతాయా వైకుంఠే తాంగంగాం ప్రణమామ్యహమ్ ।
త్రింశల్లక్ష యోజనాయా దైర్ఘ్యే పంచగుణాతతః ॥
ఆ వృతా బ్రహ్మలోకేయా తాం గంగాం ప్రణమామ్యహమ్ ।
త్రింశల్లక్ష యోజనాయా దైర్ఘ్యే చతుర్గుణాతతః ॥
ఆ వృతా శివలోకేయా తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
లక్ష యోజనవిస్తీర్ణాం దైర్ఘ్యే సప్తగుణాతతః ।
ఆ వృతా ధ్రువలోకేయా తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥

లక్ష యోజన విస్తీర్ణాం దైర్ఘ్యే పంచగుణాతత: ।
ఆ వృతా చంద్రలోకేయా తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
షష్టి సహస్ర యోజనాయా దైర్ఘ్యే దశగుణాతత: ।
ఆ వృతా సూర్యలోకేయా తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
లక్ష యోజన విస్తీర్ణా దైర్ఘ్యే పంచగుణాతత: ।
ఆ వృతా యాతపోలోకే తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
సహస్ర యోజనాయా మా దైర్ఘ్యే దశగుణాతత: ।
ఆ వృతా జనలోకేయా తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
శత యోజన విస్తీర్ణా దైర్ఘ్యే దశగుణాతత: ।
మందాకినీ యేంద్రలోకే తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
పాతాళే భోగవతీ చైవ విస్తీర్ణా దశయోజనా ।
తతోదశగుణా దైర్ఘ్యే తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
క్రోశైక మాత్ర విస్తీర్ణా తత: క్షీణాచకుత్రచిత్ ।
క్షితౌ చాలకనందాయా తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
సత్యేయాక్షీర పర్ణాచ త్రేతాయామింద్రసన్నిభా ।
ద్వాపరే చందనాభాయా తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
జలప్రభాకలౌ యాచ నాన్యత్ర పృధివీతలే ।
స్వర్గేచని నిత్యం క్షీరాభా తాంగంగాం ప్రణమామ్యహమ్ ॥
యత్తోయకణికా స్పర్శే పాపినాం జ్ఞాన సంభవ: ।
బ్రహ్మ హత్యాదికం పాపంకోటి జన్మార్జితం దహేత్ ॥
ఇత్యేవంకథితా బ్రహ్మన్ గంగా పద్యై కవింశతి : ।
స్తోత్రరూపంచ పరమం పాపఘ్నం పుణ్యజీవనమ్ ॥
నిత్యం యో హిపఠేద్భక్త్యా సంపూజ్య చ సురేశ్వరీమ్ ।
సోశ్వమేధ ఫలం నిత్యం లభతే నా త్ర సంశయ: ॥
అపుత్రోలభతే పుత్రం భార్యాహీనోలభేత్ స్త్రియమ్ ।
రోగాత్ప్ర ముచ్యతే రోగీబంధాన్ముక్తో భవేద్ధ్రువమ్ ॥
అస్పష్ట కీర్తిస్సు యశామూర్ఖో భవతి పండిత: ।
య: పఠేత్ప్రాతరుత్థాయ గంగా స్తోత్రమిదం శుభమ్ ॥
శుభం భవేచ్చదు: స్వప్నే గంగాస్నాన ఫలం లభేత్ ॥

**స్తోత్రభావము:-** నారదా! గంగా స్తోత్రము వినుమని శ్రీనారాయణుడిట్టుల నియెను. పాపహరము పుణ్యకారకమునగు గంగా స్తోత్రము వినదగినది. శివుని సంగీతము నకు కృష్ణుడు ముగ్ధుడయ్యెను. కృష్ణుని అవయవముల నుండి పుట్టిన రాధా శరీరము యొక్క చెమటయే గంగ. అట్టి గంగకు నమస్కరింతును. కార్తిక పూర్ణిమ నాడు గోప గోపిజనములతో కూడిన శ్రీ రాధాకృష్ణుల మధుర రాసమహోత్స వమునందు పాల్గొనిన గంగామతల్లికి నమస్కరింతును. కోటియోజనముల వెడల్పును, దానికి లక్షరెట్లు పొడవును గలిగి గోలోకమునందు ప్రవహించునట్టి గంగామతల్లికి నమస్కరింతును. అరువది లక్షల యోజనముల వెడల్పు దాని నాల్గురెట్లు పొడవు గలిగినట్టి వైకుంఠ ధామమున ప్రవహించు గంగామతల్లికి నమస్కరింతును. ముప్పది లక్షల యోజనములు వెడల్పు దానికైదు రెట్లు పొడవును కల్గి బ్రహ్మ లోకమున ప్రవహించు గంగామతల్లికి నమస్కారములు. ముప్పది లక్షల యోజనముల వెడల్పు దానికైదు రెట్లు పొడవును కలిగి శివలోకమున ప్రవహించు గంగామతల్లికి ప్రణామములు. లక్షయోజనముల వెడల్పు దానికేడు రెట్లు పొడవును కలిగి ధ్రువలోకమున ప్రవహించు గంగామ తల్లికి నమస్కా రములు. లక్ష యోజనముల వెడల్పు దానికైదు రెట్లు పొడవును కలిగి చంద్ర లోకమున ప్రవహించు గంగామతల్లికి నమస్కృతులు.

అరువది వేల యోజనములు వెడల్పును దానికి పదిరెట్లు పొడవును కలిగి సూర్యలోకమున ప్రవహించు గంగామతల్లికి నమస్కృతులు. లక్షయోజనముల వెడల్పును దానికైదు రెట్లు పొడవు గల్గి తపోలోకమున తేజరిల్లు గంగామతల్లికి నమస్కారములు. వేయి యోజనముల వెడల్పు దానికి పది రెట్లు పొడవు కలిగి జనలోకమున ప్రవహించు గంగామతల్లికి నమస్కారములు. పదిలక్షల యోజన ములు వెడల్పు దానికి పదిరెట్లు పొడవు కలిగి మహర్లోకమున విలసిల్లు గంగా మాతకు నమస్కారములు. వేయి యోజనములు వెడల్పు దానికి నూరు రెట్లు పొడవు కలిగి కైలాసమున ప్రవహించు గంగామాతకు నమస్కార ములు. నూరు యోజనములు వెడల్పు దానికి పదిరెట్లు పొడవును కల్గి ఇంద్రలోకమున ప్రవహించు గంగాదేవికి నమస్కారములు.

పదియోజనములు వెడల్పు దానికి పదిరెట్లు పొడవును కలిగి పాతాళమున భోగవతి యను పేర ప్రవహించు గంగామాతకు నమస్కారములు. క్రోసు వెడల్పు ఒక్కొకచో అంతకు తక్కువయును కలిగి అలకనందయను పేర భూమిపై ప్రవహించు గంగాదేవికి నమస్కారములు. సత్యయుగమున పాలవన్నెయు త్రేతాయుగమున చంద్రుని వర్ణమును ద్వాపరమున గంధము రంగు కలిగి శోభిల్లు

గంగానదికి నమస్కరింతును. తెలిసియైనను తెలియక యైనను చేసిన బ్రహ్మ హత్యాది పాపమంతయు తాకినమాత్రనే పోగొట్టును.

నారదా! ఈ విధముగా గంగాస్తోత్రమును 21 శ్లోకములలో వెల్లడిం చితిని. ఇది పాపహరము - పూజనీయము ఈ గంగాస్తోత్రమును నిత్యము చదివి. గంగను పూజించువాడు తప్పక అశ్వమేధము చేసిన ఫలితమునను భవింపగలడు. దీనివలన పుత్రులు లేనివాడు పుత్రవంతుడగును. భార్యలేని వానికి భార్య లభించును. రోగి రోగవిముక్తుడగును. బంధింపబడినవాడు బంధము నుండి విడువబడును. వేకువజామున లేచి గంగాస్తోత్రము చదువువాడు కీర్తిమంతు డుగును. మూఢుడు పండితుడగును. చెడుకలలు వచ్చినను శుభమే జరుగును. గంగా స్నానఫలము కలుగును.

భగీరథుడీ విధముగ ఈ స్తోత్రముతో గంగను స్తుతించెను. అప్పుడు గంగ భగీరథుని వెంట బయలుదేరి సాగర కుమారులు నశించినచోటికి వెళ్ళెను. గంగా జలము తాకగనే వారందరు వైకుంఠమును చేరిరి. భగీరథుడు తీసికొని వచ్చుట వలన "భాగీరథి" అను పేరు ప్రసిద్ధమైనది. ఈ పవిత్రమైన గంగాచరిత్ర పఠనము పుణ్యమును మోక్షమును కూడా నీయగలదు.

## శక్తి ప్రాదుర్భావము

దేవతలు రాక్షస సంహారమునకు శివుని పంపి తమ నివాసములకు వెళ్ళిరి. మహాదేవుడు తన దేవసైన్యమును సమీకరించుకొని గంధర్వరాజగు చిత్రరథుని శంఖచూడుని వద్దకు దూతగా పంపెను. దూత ద్వారపాలుని యనుమతి పొంది లోనికి వెళ్ళి శంఖచూడుని చూచెను. మరియు ఇట్లు పలికెను.

రాజేంద్రా! నేను శివుని దూతను నాపేరు పుష్పదంతుడు. శంకరుడు పలికిన మాటలు వినుము! నీవు దేవతల రాజ్యమును వారి యధికారములను వారికిచ్చి వేయుము. శివుడు పుణ్యాభద్రాతీరమందు న్నాడు. అతనికి నీరాజ్యమునిచ్చి వేయుము లేదా యుద్ధమునకైన సిద్ధము కమ్ము మీరు చెప్పు సమాధానమును శివునకు చెప్పెదను. అనగా దూత పలుకులువిని నవ్వి శంఖచూడుడు సూర్యో దయమున నేను వచ్చెదను. నీవు వెళ్ళుమనెను. దూత సత్వరముగ వెళ్ళి శివుని కంతయు జరిగినది నివేదించెను. దూతమాటలు శివుడు వినెను.

అంతలో కుమారస్వామి శ్రీవీరభద్రుడు భద్రకాళి మొదలగు పలువురు శివుని వద్దకు వచ్చిరి. దూతవెళ్ళిన తరువాత శంఖచూడుడు అంతఃపురములోనికి వెళ్లి తులసికి యుద్ధ వార్త తెలిపెను. ఆమె దుఃఖముతో క్రుంగిపోయెను. తెల్లవారు

జామున ఒక పీడకలకంటిని. అందుచే నేను బాధపడుచుంటిని. నా మనస్సు పరితపించుచున్నది. అనగా శంఖచూడుడు వేదాంతబోధ చేసి ఇట్లు పలికెను. నేను తపస్సు చేసి బ్రహ్మవరమీయగా నిన్ను పొందగలిగితిని. నీవు చేసిన తపస్సుకు ఫలముగా శ్రీ కృష్ణుని పొందగలవు. గోలోకములో బృందావనమందు గోవిందుని పొంది సుఖింపగలవు. నేను కూడ ఈశరీరము విడిచి గోలోకమునకే వెళ్ళెదను. అక్కడ నన్ను నీవు నిన్నునేను చూడగలము. నీవు దేవుని శరణు వేడుము. భగవంతుని మించిన బంధువెవ్వడులేడు. మన మిర్వురము పూర్వస్థలమునకే వెళ్ళగలము. నీకు శ్రీ కృష్ణుని చూచు సమయము సమీపించినది. విచారింపకుము అనుచుండగా సాయంకాలమయ్యెను. ఆ రాత్రి యెంతో సుఖముగా ఆమెతో గడిపెను.

పూర్వము భాండీరవనమందు శ్రీకృష్ణుడు తనకు బోధించిన జ్ఞానమును శంఖచూడుడు తులసికి ఉపదేశించెను. జ్ఞానముపొంది తులసియు ప్రసన్నవదనయయ్యెను. కృష్ణభక్తుడగు శంఖచూడుడు వేకువనేలేచి కృష్ణుని ధ్యానించి మంగళ స్నానము చేసి తెల్లని దుస్తులను ధరించి బ్రాహ్మణులకు రత్నములు మణులు బంగారము దానము చేసెను. తన యుద్ధ యాత్ర బాగుగా సాగుటకు బ్రాహ్మణులకు గురువులకును విలువైన రత్నమాణిక్యములు ముత్యములు వజ్రములు దానము చేసెను. శుభము కొరకతడు నిరుపేదలైన బ్రాహ్మణులకు రత్నములను ధనరాసులను దానమిచ్చెను. తన పుత్రుని రాక్షసులకధిపతిగా చేసి తన భార్యను రాజ్యమును సమస్త సంపదలను కాపాడుమని యతనికి అప్పగించెను. తాను స్వయముగ యుద్ధసన్నద్ధుడై ధనుర్బాణముల తాల్చి సైన్యము నాయత్తము చేయమని యాజ్ఞాపించెను. ఏనుగులు గుఱ్ఱములు రథములు కోట్లకొలదిగా యుద్ధ నిపుణుడగు ఒక సేనాపతికిచ్చి యుద్ధము సాగింపుమనెను. ఇట్లంతయు యుద్ధ సన్నాహము పూర్తిచేసి శ్రీహరిని స్మరించుచు శిబిరము నుండి బయలుదేరెను. అతడు రత్నాల విమానమెక్కి గురువరులు ముందు నడువగా శంకరుని చేరగా వెళ్ళెను.

శంఖచూడుడు గోమతినది వద్ద చంద్రశేఖరుడుగు శివుని దర్శించెను. శంకరుడు మఱ్ఱిచెట్టు క్రింద కోటి సూర్యులకాంతి విరజిమ్ముచుండెను. గౌరీదేవితో కూడి మనోహరుడై ప్రకాశించుచుండెను. రాక్షసరాజు శివుని సందర్శించి విమానము నుండి దిగెను. మరియు తన వారందరితో తల వంచి నమస్కరించెను. శివుడు కుమారస్వామి కాళియు వానికాశీస్సుల నిచ్చిరి. నందీశ్వరాదులు లేచి నిలుచుండిరి. వారు తమలో తాము గుసగుస లాడిరి. రాక్షసుడు కొంతమాటలాడి

శివునిప్రక్క నిలబడెను. అప్పుడు ప్రసన్నుడైన మహాదేవుడిట్లనెను. నీ తండ్రి శ్రీకృష్ణ మంత్రమును పరమభక్తితో జపింపగా కృష్ణపరమాత్మ భక్తుడవగు నీవాతనికి కుమారుడవుగా జన్మించితివి.

నీవు కూడ పూర్వము కృష్ణుని సేవకులైన గోపాలకు లలో ధర్మనిష్ఠగల గోపాలుడవు. నీవ్నురాధా శాపమున భారతదేశములో రాక్షస రాజుగా జన్మించితివి. గడ్డి మొదలు బ్రహ్మవరకు గలదంతయు తుచ్ఛముగా తలచు వైష్ణవుడవు. మోక్షము హస్తగతమైనను విడిచి హరిసేవనే స్వీకరించు వారు వైష్ణవులు. నీవు ఇంద్రత్వమును మనుత్వమును లెక్క చేయని వైష్ణవుడవు. నీకీ దేవతల యధి కారముపై ఇంత వ్యామోహ మెందులకు రాజా! వారి రాజ్యము వారికిచ్చి వేయుము. నా మాటవిని నీరాజ్యములో నీవుండుము. దేవతలు తమ పదవులలో తాముందురు. మీరందరు కశ్యపుని సంతతివారేకదా. పరస్పరవిరోధము చాలింపుము జ్ఞాతిద్రోహము బ్రహ్మహత్యాది దోషముల కంటెమిన్న. అన్ని దినము లొక్క రీతిగా ఎవ్వరికి నీవెళ్ళవు. అనగా శివుని మాటలు విని మిక్కిలి దానవుడు మెచ్చుకొనెను. మరియు శివునితో నిట్లనెను.

ఓ దేవా! నీవు పలికిన మాటలన్నియు సత్యములే. జ్ఞాతి ద్రోహము మహా పాపమని చెప్పితిరిగదా అట్టైన బలి సర్వస్వమును హరించి అతనిని పాతాళ మునకేల పంపిరి? దేవతలు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల నెందులకు చంపిరి. దేవతలు శుంభాది రాక్షసులను హతమార్చిరేల? సముద్ర మథనమున పుట్టిన అమృతమును దేవతలే ఆరగించిరి గదా! పరమాత్మ యిచ్చిన మనకు ప్రాప్తమని భావించవలెను. దేవదానవులకు వివాదములెప్పుడును ఏదో నెపమున సంభవించుచునే యుండును. కాలానుసారము వారికి మాకును జయాప జయ ములు సంభవించుచుండును. మా యిరువురి విరోధములో నడుమ నీరాకయంత మంచిదికాదు. అని పలుకగా శివుడు దేవతలను కాపాడుమని శ్రీహరియే నన్ను పంపినాడు. దేవతల రాజ్యను దేవతల కిప్పటికైన ఇచ్చి వేయుము ఇది నాకిష్టమైన పని. వట్టి మాటలతో లాభమేమి? చేతనైన యుద్ధము చేయుము. అని శంకరుడు విరమించెను. శంఖచూడుడు కూడ వెంటనే తన మంత్రులతో లేచెను. అంతట శివుడును దానవపతియు యుద్ధమునకు సిద్ధమైరి. శంభుడు కాళితో కుమారుని తోడను మఱ్ఱిచెట్టు క్రింద నుండెను. తక్కిన శివ పరివారము దానవసైన్యమును భీకరముగ పోరు సాగించిరి. శంఖచూడుడు రత్నాలగద్దెపై కోటిదానవులు సేవింప భూషణములతో మెరయుచుండెను.

# తులసీ శంఖచూడుల ప్రణయము

తులసి మనస్సులో సంతసించినదై నిద్రించెను. వృషధ్వజుని కూతురు తులసి మిసమిసలాడు పరువముతో విలసిల్లుచుండెను. ఆమె హృదయములో వలపు విరిసెను. ఆమెకు విరహము సహింపరానిదాయెను. మూర్ఛలో ఒక సుందరాంగుని చూచెను. అతడు మంచి వేషము ధరించి చిరునవ్వుతో తన రసికత్వమును చాటుచుండెను. చందనము అలదిన శరీరముపై అనేక భూషణములు ధరించి వచ్చి యామె ముఖమును ముద్దుపెట్టుకొనుచుండెను. అంతలో నామె మేల్కొని జరిగినదంతయు కలగ నెంచి చాలమార్లు దుఃఖించెను. ఇక శంఖచూడుడు మహాయోగియై "జైగీషవ్య" మునివలన మనోహరమైన కృష్ణమంత్రము పొంది పుష్కర తీర్థమున మంత్రసిద్ధిని పొందెను. అతడు మంగళకరమైన కవచమును ధరించెను. బ్రహ్మవలన కావలసిన వరములను పొందెను. బ్రహ్మ అనుమతితో అతడు బదరి కావనమున నివసించెను. తులసి శంఖచూడుని బాగుగా చూచినది. అతడు అందములో మన్మధుడు ప్రౌఢయౌవనముతో ప్రకాశించుచున్నవాడు రత్నములతో నిర్మింపబడిన విమానములో కూర్చొనియుండెను.

ఆయువకుడు తనవద్దకు రాగా తులసి తన ముఖమును వస్త్రముతో ఓరగకప్పుకొని కడకంట చూచినది. ఆమె చిరునవ్వుతో తలవంచుకొని తన కోరికను వెల్లడించినది. శంఖచూడుడు సొగసైన లావణ్యవతి నాసతిని చూచెను. అతడామె యొద్దకు చేరి తియ్యగా ఇట్లు ప్రశ్నించెను. నీవెవతెవు? ఎవరిపిల్లవు? నీవు ధన్యురాలవు కల్యాణీ! ఈ దాసుని యెడ దయతో మాట్లాడుము. అను మాటలు విని ఆ సుందరి మందహాసముతో తులసి యిట్లు పలికెను:-నేను ధర్మ ధ్వజుని కుమార్తెను. ఈ తపోవనమున తపస్సు చేసి కొనుచున్నాను. నీవెవరవు? నీవు నీచోటికి వెళ్ళ తగుదువు. మరియు ఏకాంతము నందున్న యువతిని పలుకరించుట తగదు. ఇంతే కాక స్త్రీ అనేక దోషములకు ఆలవాలము అని స్త్రీ స్వభావమును నిందించుచు పెద్ద ఉపన్యాసమిచ్చినది. అప్పుడు శంఖచూడు నవ్వి యిట్లు పలికెను:-

ఓ దేవీ! నీవు పలికినది అంతయు నిజము కాదు. అది అట్లుండనిమ్ము అందరిని మోహింపజేయు స్త్రీ రూపమును బ్రహ్మ రెండు విధములుగా సృష్టించెను. ఒకటి మెచ్చుకొనదగినది రెండవది మెచ్చుకొనరానిది. లక్ష్మి సరస్వతి దుర్గ సావిత్రి రాధిక మొదలగువారు సృష్టికి మూలకారణమైనవారు. ఉత్తమ స్త్రీలు. జగదంబ కళాంశతో పుట్టిన స్వర్గమందలి అప్సరసలు ప్రశంసింపతగనివారు. సత్త్వప్రధానమైన

సాధ్వీరూపమే లోకములో ఉత్తమమైనది. ప్రభావసంపన్నమై నదియు. అట్టి సత్త్వ రూపమును పండితులు మెచ్చుకొందురు. రజోగుణముతో పుట్టిన స్త్రీలు మధ్యమ తరగతి, తమోగుణముతో పుట్టినవారు అధమతరగతివారు అని పండితులు చెప్పుచున్నారు. మంచి సంస్కారము గల కుటుంబమున పుట్టిన పండితుడు ఏకాంత మందొంటరిగా ఉన్న స్త్రీతో మాట్లాడడు. ఓశోభనాంగీ! నేనిప్పుడు బ్రహ్మ యాజ్ఞచే వచ్చుచున్నాను. గాంధర్వ వివాహమున నిన్ను స్వీకరించెదను. నన్ను శంఖచూడు డందురు. దేవతలను గడగడలాడించిన రాక్షసుడను.

పూర్వము విష్ణుమూర్తి వద్ద సుదాముడని పిలువబడెడివాడను. ఎనిమిదిమంది గోపాలకులతో ముఖ్యుడను. రాధాదేవి శాపమువలన రాక్షసుడనైతిని. నాకు పూర్వ జన్మజ్ఞానము కలదు. నీవు తులసివి. నిన్ను కృష్ణుడనుభవించెను. నీవు కూడ రాధాదేవి కోపమువలన భారతదేశమున జన్మించితివి. అప్పుడు నేను నిన్నను భవింపదలచితిని. కాని రాధాదేవి భయముచే మనకు సంగమము జరుగలేదు. అని శంఖచూడుడు విరమించగానే తులసి నవ్వి సంతోషముతో అతని కిట్లనియెను! ప్రపంచమున నీవంటి సత్పురుషుడే మెచ్చుకొనదగినవాడు. నీవంటి వానిని ప్రతి స్త్రీకోరును. నీ విద్యా ప్రభావమును జ్ఞానమును పరీక్షించితిని. స్త్రీ తనకు కాబోవు వరుని పరీక్షించి వరించుట యుక్తము అనుచుండగా బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను.

ఓ శంఖ చూడుడా! ఇక్కడ నీవేమి చేయుచున్నావని ప్రశ్నించెను. మరియు గాంధర్వ విధానముగా ఈమెను పెండ్లి చేసికొనుమనెను. నీవు శంఖ చూడునకు తగిన ప్రియురాలవు. నీవితనితో స్వేచ్ఛగా విహరించుము. తరువాత గోలోకము చేరి శ్రీ కృష్ణుని పొందగలవు శంఖచూడుడు మరణించిన పిమ్మట వైకుంఠ చతుర్భుజుని కూడి పరమానందము పొందగలవు అని బ్రహ్మ తులసికి చెప్పెను.

తరువాత బ్రహ్మ ఆ నవదంపతుల నాశీర్వదించి తన లోకమునకు వెళ్ళెను. రాక్షసుడు తులసిని గాంధర్వ వివాహము చేసికొనెను. స్వర్గమందు దుందుభులు మ్రోగినవి. పూలవానకురిసెను. శంఖచూడుడు తన ప్రియు రాలికి వరుణుడిచ్చిన నవరత్నమాలను వస్త్రములను స్వాహాదేవి యిచ్చిన కాలియందెల జంటను ఛాయాదేవి యిచ్చిన భుజకీర్తులను, రోహిణి యిచ్చిన కుండలములను, రతిదేవి యిచ్చిన రత్నాల యుంగరమును, విశ్వకర్మ యిచ్చిన అందమైన శంఖమును, విచిత్రమైన శయ్యను భూషణములనిచ్చి మందహాసము చేసెను. మరియు అనేక సుందరములగు స్థలములందు విహరించుచు నమందానందమునొందిరి.

# శంఖచూడుని వలని దేవతల బాధలు-శివ విష్ణు ప్రార్ధనలు

ఇట్లు సుఖలాలసుడై శంఖచూడుడు పూర్తిగా ఒక మన్వంతరము దేవదానవులకు మహారాజుగా నుండెను. ఐశ్వర్యమును కోల్పోయిన దేవతలు బిచ్చగాండ్రవలె తిరుగుచు బ్రహ్మసభకు చేరి జరిగినదంతయు శివునకు చెప్పిరి. శివుడు బ్రహ్మాది దేవతలతో సహ జరామృత్యువులులేని దుర్లభమైన పరంధామమగు శ్రీవైకుంఠము చేరిరి. శ్రీహరి నివసించు దివ్యభవనము ద్వారమున ద్వారపాలకులను చూచిరి. వారు రత్నసింహాసనములపై కూర్చొని యుండిరి. పీతాంబరములు ధరించిరి. రత్నాభరణము అలంకరించుకొనిరి. శ్యామసుందర శరీరులు వనమాలా శోభితులై విలసిల్లుచుండిరి. శంఖచక్ర గదాపద్మముల ధరించిరి. చతుర్భుజులు దరహాస ముఖులు సుందర పద్మనేత్రులు వారికి బ్రహ్మాదులు తమరాకకు కారణము తెలియజేసిరి. ద్వారపాలకుల యనుమతితో లోపలకు వెళ్ళిరి. బ్రహ్మాదేవతలతో పదహారు ద్వారములు దాటి విష్ణుమూర్తిని సందర్శించెను.

అతని కొలువులోని దేవర్షులు పార్షదులు అందరు చతుర్భుజులే కౌస్తుభమణి విరాజితులే. అచట కనువిందొనర్చు మణిస్తంభము కలదు. రత్నపూర్ణ కుంభములతో విరాజిల్లుచున్నది. నలువైపుల దివ్యపరిమళాల వెదజల్లుచున్నది. శ్రీమహావిష్ణువు దివ్యరత్నసింహాసనముపై విలసిల్లు చుండెను. విష్ణువు బంగారు కిరీటము కుండలములు వనమాల ధరించి యుండెను. లక్ష్మీ సరస్వతులు పాదసేవ చేయుచుండిరి. గంగ పరమభక్తితో చామరములు వీచుచుండెను. అపుడెల్లరును పరమభక్తితో శ్రీధరునకు తలలువంచి నమస్కరించిరి. బ్రహ్మాదిదేవతలు హరిని దర్శించి నమస్క రించి వేనోళ్ళ భక్తి పూర్వకముగా స్తుతించిరి. అంతట సృష్టికర్త చేతులు జోడించి హరికి జరిగిన వృత్తాంతమంతయు తెలియజేసెను. అప్పుడు సర్వజ్ఞుడైన హరి అంతయును విని నవ్వి బ్రహ్మకొక రహస్యమైన విషయము నిట్లు చెప్పెను.

ఓ బ్రహ్మా! శంఖచూడుని వృత్తాంతమంతయు నాకు తెలియును. పూర్వము నాకతడు భక్తుడు గోపకుడు తేజస్వి. పూర్వము సుదాముడను గోపాలుడు నా పార్శ్వ మందుండెడివాడు. అతడు దారుణమైన రాధ శాపమునకు గురియయ్యెను. అందుచే రాక్షసుడాయెను. అతడు మరల గోలోకమునకు చేర గలడు. శివుడు

శూలముతో నాతని సంహరింపగలడు. నా కవచము ధరించి యున్నంత కాలము అతడు చావడు. నేను బ్రాహ్మణరూపమున అతనిని కవచ మిమ్మని యాచించెదను. అతని భార్య పాతివ్రత్యము భంగమైనకాని వానికి చావు లేదు. ఆపని నేను చేయగలను. అప్పుడతడు చావగలడు. అని జగన్నాథుడు శివునకు శూల మిచ్చెను. తదుపరి మాధవుడు అంతఃపురములోనికి వెళ్ళెను. బ్రహ్మ రుద్రాదులు భారతదేశమునకు వెళ్ళిరి.

# శక్తి ప్రాదుర్భావము - తులస్యుపాఖ్యానము

శ్రీనారాయణుడు నారదునకిట్లు చెప్పనారంభించెను. ధర్మధ్వజుడను వానికి మాధవి యను భార్య కలదు. ఆమె గంధమాదనగిరిపై విహరించుచుండెను. ఆమె రసికహృదయుడగు నొకరాజును ప్రేమించెను. ఆమె గర్భవతియై నూరేండ్ల గర్భమును మోసెను. ఒక శుభముహూర్తమున పద్మినియను శిశువును ప్రసవించెను. ఆ శిశువునకు "తులసి" యను మరియొక సార్థకనామము కలదు. ఆమె పెద్దదై యెందరు అడ్డగించినను లెక్కచేయక బదరికావనమునకు వెళ్ళి లక్ష సంవత్సరములు తపస్సు చేసెను. శ్రీమన్నారాయణుడే నాకు భర్తకావలయు నని ఘోరమైన తపస్సు చేసినది. ఆమె ఒంటి కాలిమీద తపస్సు చేయుచుండగా బ్రహ్మ చూచి ఆమెవద్దకు వెళ్ళెను. ఆమె హంసవాహనుడు చతుర్ముఖుడగు బ్రహ్మకు నమస్కరించెను. అప్పుడు బ్రహ్మ ఆమె కోరిక ఏమని అడిగెను. అమె యిట్లు పలికెను:-

నీవు అన్నియు తెలిసినవాడవు నీముందు నేను సిగ్గు పడనక్కరలేదు. పూర్వము నేను గోలోకమందలి "తులసి"యను గోపికను. నేను కృష్ణుని ప్రియురాలను. కృష్ణుని సేవకురాలను, కృష్ణాంశనుకూడ. ఒకనాడు రాసమండల మందు రాసేశ్వరియగు రాధ నన్ను చూచి గోవిందుని అనరాని మాటలని నన్ను కోపముతో శపించినది. నన్ను మనుష్య జన్మను యెత్తుమని శాపము నిచ్చినది. అప్పుడు గోవిందుడు నాయంశగల నాలుగు భుజములు కలవానిని పొందగలవని నాకు చెప్పెను. మరియు భారతదేశమున తపమొనర్చి బ్రహ్మ వరమున నీవు చతుర్భుజుని పొందగలవని చెప్పెను. వెంటనే అంతర్ధానము నొందెను. నేను రాధకు భయపడి శరీరము విడిచి భారతదేశమున జన్మించితిని. కాంతుడు శాంతుడు సుందర విగ్రహుడునగు నారాయణుని పతిగా పొందవలెనని కోరుచున్నాను. నాకీవర మిమ్మని ప్రార్థించెను. అప్పుడు బ్రహ్మయిట్లనెను:-

సుదాముడను గోపాలుడు శ్రీకృష్ణుని యంగములనుండి జన్మించెను. అతడు కృష్ణాంశముతో జన్మించెను. తేజశ్శాలియగు అతడు భారతదేశమున జన్మించి నాడు. అతడు రాధాశాపమున దనువంశమందు జన్మించెను. వానిపేరు శంఖ చూడుడు. ముల్లోకములందును అతనికి సాటియైనవాడు లేడు. పూర్వము గోలోకములో ఆతడు విన్నుచూచి ప్రేమించెను. రాధ ప్రభావముచే అతడప్పుడు విన్ను చేరలేక పోయెను. ఆ సుదాముడే యీశంఖచూడుడు. ఇతనికి నీవు భార్య కాగలవు. అటు పిమ్మట శాంతుడు కాంతుడునగు నారాయణుని పతిగా వరింప గలవు. అటు పిమ్మట నారాయణుని శాపముచే దైవయోగమున "చెట్టు"గా పుట్ట గలవు. నీవు వృక్షరూపమును పొందియు పవిత్రురాలవు కాగలవు. పూజాద్రవ్య ములలో ప్రధానమైన దానవు విష్ణువునకు ప్రాణముకంటెను ప్రియురాలవుకాగలవు. నీవు లేనిచో పుష్పముల పూజయంతయు వ్యర్థము. బృందావనమున నీవు వృక్షరూప మొందుటచే నీవు బృందావని యని పిలువ బడుదువు. గోపికా గోపకులు నీదళము లతో మాధవుని పూజింపగలరు. నీవు వృక్షాధిష్ఠానదేవతవు. నిత్యము శ్రీకృష్ణుని కలియుచుందువు. నా వరప్రభావమున నీవు స్వేచ్ఛగా విహరింపుము. అను బ్రహ్మ మాటలువిని చిరునవ్వుతో తులసి సంతోషించెను. తులసి బ్రహ్మకు నమస్కరించి యిట్లనెను:-

తండ్రీ నాకు శ్యామసుందరుడు రెండు భుజములు కలవాడు కృష్ణుడు అతని పై నాకు మిక్కిలి ప్రేమకాని దురదృష్ట వశమున దానికి భంగము కలిగినది. కనుక గోవిందుని మాట ప్రకారము నేను చతుర్భుజుని కోరుచున్నాను. కాని నీ దయవలన మరల దుర్లభుడైన గోవిందుని పతిగా చేయుము. నాకు రాధవలన భయము లేకుండునట్లను గ్రహింపుము. శ్రీకృష్ణుని చేరగలుగుదును. బ్రహ్మ యిట్లనెను నీవు రాధామంత్రము జపించుము. నీకు ఉపదేశింతును. ఆ మంత్ర ములో పదహారు అక్షరములు కలవు. నీవు నావరము చే రాధకు ప్రాణ సమాను రాలవగు దువు. కృష్ణునితో నీ శృంగార వినోదములను రాధ యెరుగజాలదు. ఓ సౌభాగ్యవతీ! నీవు కూడ కృష్ణునకు రాధతో సమానురాలవు కాగలవు. అని రాధా షోడశాక్షర మంత్రమును బ్రహ్మతులసికి ఉపదేశించెను. బ్రహ్మ రాధా మంత్రము, స్తోత్రము, కవచము, పూజావిధానము, పురశ్చరణ విధానము, తులసికి తెలిపెను. బ్రహ్మ యామెకు శుభాశీస్సు లొసగెను. తులసియును బ్రహ్మ చెప్పినట్లు చేసి యతని దయవలన లక్ష్మివలె మంత్రసిద్ధి నొందెను. మంత్రము సిద్ధించు నట్లనేక వరములను గూడ పొందినది. లోకములో ననేక దుర్లభములైన భోగముల నను భవించి ఆమె ప్రసన్నురాలాయెను. ఆమె చేసిన తపస్సు ఆమె పడిన శ్రమయు

ఫలించినది. ఆ సంతోషముతో భోజనపానములను నిర్వర్తించి పుష్ప చందనా లంకృతమగు కమ్మని శయ్యపై పరుండెను.

శ్రీ రాధాకృష్ణుల దివ్యాంగముల నుండి యావిర్భవించిన ద్రవరూపిణి గంగ. శుద్ధ సత్త్వ స్వరూపిణి శ్రీకృష్ణుని యవయవములనుండి పుట్టి యతనినే వరించెద ననెను. అప్పుడు రాధ ఆమెను మొత్తము త్రాగి తలంచెను. అందుకు భయపడి గంగ శ్రీకృష్ణుని చరణకమలముల శరణు జొచ్చెను. అప్పుడు గోలోకమంతయు నెండిపోయెను. కృష్ణుడు తన కాలిబొటన వ్రేలి గోరునుండి గంగను వెడలించెను. ఆమెకు రాధా మంత్రము ఉపదేశించెను.

అప్పుడు గంగ గోలోకమంతట నిండెను. కృష్ణుని యెడమభాగము నుండి పుట్టిన రాధ కుడిభాగము నుండి పుట్టిన లక్ష్మి వలెనే ఆతని అవయవముల నుండి పుట్టిన గంగయు నీకు భార్యయే యని బ్రహ్మ పలుకగా హరి స్వయముగా గాంధర్వవిధితో గంగను చేపట్టెను. విష్ణువు పాదము నుండి వెడలుటచే గంగ "విష్ణుపది" అనబడుచున్నది. దివ్యనది హరితో తీయని సరసకేళీ విలాసములకు మూర్ఛపోయెను. గంగ పారవశ్యమును చూచి సరస్వతి యోర్వలేకపోయెను. గంగ మాత్రము సరస్వతిపై అసూయ పూనలేదు. కాని యొక మారు గంగ సరస్వతిని భారతదేశమందు పుట్టుమని కోపముతో శపించినది. రమాపతికి లక్ష్మి సరస్వతి గంగ ముప్పురు కాక తులసి కూడ భార్యయయ్యెను.

ధర్మధ్వజ కుశధ్వజులు తీవ్రతపమొనర్చి మహాలక్ష్మి నారాధించి కోరిన వరములు పొందిరి. వారు మహాలక్ష్మి యనుగ్రహముచే మహారాజులుగా పుణ్యావం తులుగ పుత్రవంతులుగ కీర్తి గడించిరి. కుశధ్వజులు భార్య మాలావతి ఆమె కొంతకాలమునకు లక్ష్మి అంశవలన ఒక కుమార్తెను కనెను. పండితులామెకు వేదవతి యని పేరు పెట్టిరి. ఆ బాల ఎల్లరు వారించినను వినక నారాయణ పరా యణయై తపస్సుకై అరణ్యమున కేగెను. ఆమె పుష్కరతీర్థమున ఒక సంవత్సరము ఘోరతపస్సు మొనర్చెను. ఆమె కృశింపక నవయౌవనముతో పుష్టి కలిగియుండెను. ఒకనాడా కాశవాణి నీవు మరియొక జన్మలో శ్రీహరిని భర్తగా పొందెదవని పలికెను. ఆమె సంతసించి గంధమాదన పర్వతముపై తపస్సు చేయనారంభించెను. ఒక నాడు రావణాసురుడామెకు కనిపించెను. ఆమె యాతనికి అతిధిసత్కార మొనర్చెను.

పిమ్మట నాతడు ఆమెను బలాత్కరించి శృంగార చేష్టలకు తలపడెను. ఆమె కోపముతో నాతనిని నిశ్చేష్టునిగా చేసెను. మరియు నీవు కామముతో

నాచేయి పట్టుకొని లాగితివి కనుక నీ మూలమున నీవు నీ బంధువులును నశింతురని శపించెను. కొంత కాలమునకామె జనకుని బిడ్డ సీతగా అవతరించినది. శ్రీరాముడ డవిలో సీతాలక్ష్మణులతో నుండగా అగ్నిదేవుడు రామా! సీతాపహరణ సమయ మాసన్నమైనది. జగన్మాత సీతను నాయందుంచి మాయ సీతను నీవద్ద నుంచు కొనుము పరీక్షసమయమున తిరిగి నీకు సీత నర్పించెదను. నేను దేవతలచే పంపబడిన అగ్నిదేవుడను. అని పలికి అగ్ని మాయ సీతను సృజించి రామున కొసంగెను. ఈ విషయము రహస్యముగ నుంచుమని చెప్పి అగ్ని వెళ్ళిపోయెను. తరువాత బంగారు లేడిని చూపి సీతను రావణుడు అపహరించుట మొదలగు రామాయణ కథ జరిగెను.

# శివ శంఖచూడుల యుద్ధము

యుద్ధములో శివుని సేనలు రాక్షసుల చేతులలో ఓడిపోవుచుండిరి. దేవతలు నెత్తురుకారుచున్న శరీరములతో పరుగిడుచుండుట చూచి కుమార స్వామి యభయమొసంగెను. కుమారస్వామి కొన్నివందల అక్షౌహిణులను హత మార్చెను. కాళికాదేవి కూడ చాలమంది రాక్షసులును ఓడించెను. ఆమె మహా క్రోధముతో రాక్షసులనెత్తురు త్రాగెను. లక్షలాది ఏనుగులను కోట్లకొలది గుఱ్ఱములను చేతితో విలాసముగా పట్టుకొని చేతితో నోటబెట్టుకొనుచుండెను. యుద్ధరంగమున వేలకొలదిగా మొండెములు తలలు తెగినను తాండవమాడుచుండెను. కుమార స్వామి బాణముల దెబ్బకు దానవులు భయపడి పరిగిడుచుండిరి. కాని వృష పర్వుడు దంభుడు, విప్రచిత్తి మొదలగు కొందరు మాత్రము కుమార స్వామితో పోరుచుండిరి. రాక్షసులెల్లరు కుమారస్వామి శక్తిచే పీడింపబడి గగ్గోలుపెట్టిరి. ఇట్లుండ కుమారస్వామిపై పూలవానకురిసెను. కుమారస్వామి మహారుద్రుని వలె యుద్ధము చేయుచుండెను. దానవులు ప్రళయమాయని శంకించిరి.

అప్పుడు శంఖచూడుడు విమానమెక్కి బాణవర్షము కురిపించెను. అప్పుడు నందీశ్వరాది దేవతలందరు పలాయనము చిత్తగించిరి. శంఖచూడుడు పర్వతము లను పాములను శిలలను భయంకరముగా కురిపించెను. అతని బాణవర్షమునకు శివకుమారుడు మంచుతో కప్పబడిన వెలుగువలె కాంతిహీనుడై యుండెను. దానవుడు శక్తిని ప్రయోగించి కుమారుని మూర్ఛనొందించెను.

కుమారుడు తెప్పరిల్లి దానవుడు ప్రయోగించిన పాములను పర్వతము లను వృక్షములను రాళ్ళను కోపముతో తునాతునకలు చేసెను. ఆకాశవాణి దానవుడు

చంపబడడని పలికెను. తత్త్వజ్ఞానియగు శివుడు యుద్ధ వృత్తాంతమును విని తన గణములతో యుద్ధమునకు వెళ్ళెను. శంఖ చూడుడు విమానము దిగి భక్తి ప్రదర్శించినవాడై వెంటనే విమానమెక్కి విల్లుపట్టుకొని పెద్ద నవ్వునవ్వెను. శివ శంఖచూడుడులకు నూరేండ్లు యుద్ధము జరిగెను. యుద్ధములో మరణించిన దేవతలను శివుడు బ్రతికించెను. అదే సమయమున ఒక ముదుసలి బ్రాహ్మణుడు వచ్చి దానవునితో నిట్లనెను:-

రాజేంద్రా నేను బ్రాహ్మణుడను. నామదిలోని కోర్కె తీర్చుము. నీవు గొప్ప దాతవు. నేనే యాధారములేనివాడను. అనగా నీ యిష్టము వచ్చినట్లే కోరుకొన మనగా అతడు నీ కృష్ణకవచమిమ్మని యడిగెను. శంఖచూడుడు కవచమీయగనే దానిని ధరించి ఆబ్రాహ్మణుడు శ్రీహరి రూపమున తులసి వద్దకు వెళ్ళెను. మరియు నామె పాతివ్రత్యమును భగ్నమొనర్చెను. శివుడు నారాయణు డిచ్చిన శూలమును గిరగిం త్రిప్పి రాక్షస రాజుపై విసిరెను. ఆ శూలము రాక్షసుని వాని రథమును భస్మము చేసినది. దానవతి అప్పుడు గోపాలకవేషము దాల్చి రెండు చేతుల మురళిమ్రోయించుచు కోట్లాది గోపికలతో రత్న విమానము నెక్కి గోలోకమునకు వెళ్ళెను.

అచట బృందావనములో రాధాకృష్ణులకు పరమ భక్తితో తలవంచి నమస్కరించెను. రాధాకృష్ణులు సుదాముని చూచి ప్రసన్నులై పరమప్రీతితో నతనిని చేరదీసిరి. త్రిశూలము వేగమే శ్రీకృష్ణుని చేరెను. శంఖ చూడుని ఎముకలనుండి శంఖముల జాతి జన్మించెను. శంఖజలము దేవతలకు ప్రియము. శంఖమున్న చోట లక్ష్మి నివసించును. శంఖమున్నచోట హరి యుండును. శంఖము అమంగళముల నశింపజేయును. శూద్రులుగాని స్త్రీలుగాని శంఖధ్వని చేయరాదు. శివుడు దానవుని సంహరించి కైలాసమునకు వెళ్ళెను. స్వర్గములో దేవదుందుభులు మ్రోగినవి. కిన్నరులు గంధర్వులు పాడిరి. శివునిపై పూలజల్లు కురిసెను. మునులు దేవతలును శివుని ఘనముగా నర్చించిరి.

# తులసి పాతివ్రత్య భంగము

నారాయణుడు తులసి పాతివ్రత్యభంగము నారదునికిట్లు వివరిం చెను:- శ్రీహరి దేవతల కార్యము సాధించుటకు మాయతో శంఖచూడుని కవచము తీసికొనెను. శంఖచూడుని చంపవలెనని శ్రీహరి శంఖచూడుని రూపము ధరించి తులసియింటి ముందు జయజయధ్వనులు చేయించెను. తులసికిటికీ నుండి

చూచి సంతోషముతో బ్రాహ్మణులకు అనేకదానములు చేసెను. దేవుడు రథము దిగి దేవి మందిరములోనికి వెళ్ళెను. తులసి తన ప్రియునిచూచి ఆనంద బాష్పము లతో అతని పాదములు కడిగి అనేకములైన ఉపచారములొనర్చెను. తులసి యుద్ధ వృత్తాంత మడుగగా శంఖచూడుడి యాకారములోనున్న హరి దేవతల రాజ్యము వారికి యిచ్చివైచి యుద్ధము విరమించితిని. శివుడు తన యింటికి వెళ్ళెను. నేను నా యింటికి వచ్చితినని పలికెను.

మరియు జగన్నాథుడు తులసి పూలపాన్పుపై ప్రవ్వళించెను. తులసీ శ్రీహరుల సమావేశములో తులసి యీతడు తన పతికాడని గ్రహించి ఓమాయావీ నీవెవ్వడవు? నా సతీత్వమునకు భంగ మొనర్చిన నిన్ను శపింతునను చుండగా శ్రీహరి భయపడి తన దివ్యమంగళ విగ్రహమును చూపించెను. అతని చూచి తులసి మూర్ఛపోయి నది. కొంత సేపటికి తెలివిరాగా ఓ ప్రభూ! నీవు మోసముతో నాపతిని చంపితివి. యనగా నీవు చాల సంవత్సరములు నన్ను గూర్చి తపస్సు చేసితివి. నీ తపస్సునకు ఫలము నీకు ప్రాప్తించవలెను కదా!

కనుక నీ శరీరము విడిచి దివ్యదేహము ధరించి లక్ష్మికి సాటిగా నాతో సుఖింపుము. నీ యీ శరీరము భారతదేశమున గండకినదిగా పుణ్యమును వర్షించు చుండును. నీ కేశములు తులసివృక్షము రూపము నొందును. దేవీ పూజలలో తులసికి మిక్కిలి ప్రాధాన్యము. సుందరీ! స్వర్గమర్త్య పాతాళములందు గోలోక మందును నీ సమీపమందును పూజా ద్రవ్యములలో నీవే శ్రేష్ఠమైన వృక్షమగుదువు. బృందావనాది పుణ్యస్థలములందెల్ల నీవు తప్పక ఉందువు. తులసి చెట్టుక్రింద సర్వదేవతలు నివసింతురు. తులసీ పత్రజలమును మరణకాలమున త్రాగువాడు సకలపాపముల నుండి విముక్తుడై విష్ణు లోకము చేరును. ప్రతిదినమును తులసీ జలము త్రాగువాడు అశ్వమేధ యాగఫలమును పొందును. తులసిదళము మూడు దినముల క్రిందటిదైననను పరిశుద్ధమే. తులసి వృక్షాధిష్ఠాన దేవత పుణ్యదాయినివగు నీవు వైకుంఠమున నావద్ద లక్ష్మి సమానురాలవుగా విలసిల్లుచుందువు. నేను నీ శాపమువలన గండకీ నదీతీరమున పాషాణరూపము పొందియుందును. మరణ కాలమున సాలగ్రామ తీర్థము త్రాగినవాడు పాపములన్నియు నశించి విష్ణు లోకమును పొందగలడు. అని శ్రీహరి యామెనూరడించెను.

## సావిత్ర్యుపాఖ్యానము

నారదుడు సావిత్రి చరిత్రను చెప్పుమనగా నారాయణుడిట్లు పలికెను:- ఓ మునీ! వేదమాతను మొదట బ్రహ్మ పూజించెను. పిమ్మట వేదగణ ములు పిమ్మట

పండితులు కూడ సావిత్రిని పూజించిరి. తరువాత భారత దేశమున అశ్వపతిరాజు తదుపరి నాలుగు వర్ణములవారును త్రిపదయగు సావిత్రి నారాధించిరి. అశ్వపతి మద్రదేశమహారాజు. అతడు శత్రువుల నణచి మిత్రుల దుఃఖమును పోగొట్టువాడు. అతని పట్ట మహిషి మాలతి. ఆమె లక్ష్మీదేవితో సమానురాలు. ఆమె గొడ్రాలు. వసిష్ఠుని యుపదేశముచే నిర్మలభక్తితో సావిత్రీదేవి నారాధించెను. ఎన్నాళ్ళకును సావిత్రీదేవి దర్శనము కలుగలేదు. అప్పుడామె మిక్కిలి దుఃఖించుచు తన యింటికి వెళ్ళెను. రాజు దుఃఖపడుచున్న భార్య నోదార్చి తానుకూడ సావిత్రిని గూర్చి తపస్సు చేయుటకు పుష్కరతీర్థమునకు వెళ్ళి అక్కడ ఇంద్రియ నిగ్రహముతో నూరేండ్లు తపస్సు చేసెను. సావిత్రీదేవి దర్శనముగాని ఆజ్ఞగాని అతనికి కలుగలేదు. అప్పుడాకాశవాణి యిట్లు పలికినది!

"ఓరాజా పదిలక్షలు సావిత్రీ జపము చేయుము" అని అంతలో అక్కడకు పరాశరమహర్షి వచ్చెను. అతనికి రాజు నమస్కరింపగా ముని యిట్లు పలికెను. శ్రీగాయత్రీ జపము ఒక్కమారు చేసినచో ఆనాటి పగటి పాపములు తొలగి పోవును. పదిమార్లు జపించినచో ఒకరాత్రి ఒక పగలు చేసిన పాపములు పోవును. నూరుమార్లు జపించినచో ఒక నెలలో చేసిన పాపములు, వేయి మార్లు జపించినచో ఒక ఏడాదిలో చేసిన పాపములు ఒక లక్ష జపించినచో జన్మలో చేసిన పాపము లన్నియు, పదిలక్షల జపముచే ఇతర జన్మలలోని పాపములు, నూరు లక్షల జపము వలన అన్ని జన్మలలోని పాపములు, పదికోట్ల జపమువలన మోక్షమును పొందును.

తామరపూసలతోకాని స్ఫటికములతోగాని మాలను చేసి ఆ మాలతో పుణ్య తీర్థమునగాని దేవాలయమునగాని జపించవలెను. మాలను రావి యాకుపైగాని కమలమునగాని యుంచవలెను. స్నానముచేసి గాయత్రీదేవిని పూజించి అష్టోత్తర శతరము గాయత్రిని జపించవలయును. పంచగవ్యములతో గాని గంగాజలముతో గాని మాలను శుద్ధి చేయవలయును. ఓ రాజర్షి యిట్లు క్రమముగ పదిలక్షలు గాయత్రిని జపించుము. నీ మూడు జన్మల పాపములు తొలగిపోవును. అప్పుడు నీకు సావిత్రీదేవి సాక్షాత్కరించును.

రాజా! నిత్యము శుచిగా ఉదయము మధ్యాహ్నము సాయంకాలము సంధ్యా వందనమొనర్పుము. జ్యేష్ఠ శుద్ధ త్రయోదశినాడు శుభసమయమున నియమ ముతో నుండి చతుర్దశినాడు సావిత్రీ వ్రత మాచరింపవలయును. ఆ వ్రతము పదునాల్గు సంవత్సరము లాచరింపవలయును. పదునాల్గు నైవేద్యములు చెల్లింప

వలయును. దేవికి పుష్పదీప ధూపవస్త్ర నైవేద్యము లర్పించి మంగళ కలశమును స్థాపించవలెను. బ్రాహ్మణుడు గణపతిని సూర్యుని విష్ణువును అగ్నిని పార్వతీ పరమేశ్వరులను కలశమందావాహనచేసి పూజింపవలెను. మధ్యాహ్నమున సావిత్రిని గూర్చి చేయు ధ్యానస్తోత్ర పూజావిధానములు అన్ని కోర్కెలను తీర్చును. సావిత్రీదేవి మేలిమి బంగారు రంగు కలది. బ్రహ్మతేజముతో వెలుగొందునది. చిరునవ్వుతోగూడిన ముఖముగలది. రత్నభూషణములు ధరించినది. భక్తుల పాలిటపెన్నిధానము. సకలసంపదలనొసగు తల్లి. వేదశాస్త్ర స్వరూపిణి యగు వేద మాతను నేను సేవింతును అను ధ్యానముతో తలపై చేతులు మోడ్చి ధ్యానించి దేవిని నిశ్చలభక్తితో కలశమందావాహన చేయవలయును.

పిమ్మట తల్లిని వేదోక్తమంత్రములతో యథావిధిగా షోడశోపచార పూజలతో పూజింప వలయును. స్తుతింపవలయును. నమస్కరింపవలయును. శ్రీజగన్మాత కాసనము పాద్యము అర్ఘ్యము, స్నానము అను లేపనము వస్త్రధూపదీప నైవేద్య ములు చల్లని పానీయము తాంబూలము చందనము కఱ్ఱతో గాని బంగారముతో గాని నిర్మించిన సింహాసనము సమర్పింపవలయును. పండితుడు పదార్థములను దేవికర్పించి షోడశకళయగు సావిత్రీ స్తోత్రమును చదువవలయును. పిమ్మట బ్రాహ్మణునకు భోజనము పెట్టి తుష్టిగా దక్షిణలీయవలయును. ఓం శ్రీంహ్రీంక్లీం సావిత్ర్యై స్వాహా అను అష్టాక్షరిని జపించవలయును. ఈ మాధ్యందిన స్తోత్రమెల్ల కోరికలను తీర్చగలదు. ఈ సావిత్రీమంత్రము బ్రాహ్మణులకు ప్రాణమువంటిది.

దీనిని పూర్వము గోలోకమున కృష్ణుడు బ్రహ్మకుపదేశించెను. సావిత్రి బ్రహ్మతో బ్రహ్మలోకమునకు పోవ నిష్టపడలేదు అప్పుడు కృష్ణననుమతితో బ్రహ్మ సావిత్రిని ప్రసన్నురాలనుగా చేసికొనెను. అప్పుడా జగన్మాత సంతసించి బ్రహ్మను పతిగా స్వీకరించెను. బ్రహ్మ యిట్లనెను:-

ఓ సచ్చిదానంద స్వరూపిణీ! నీవు మూలప్రకృతి రూపిణివి. ఓ హిరణ్యగర్భ రూపిణీ! సుందరీ! నీవు ప్రసన్నవుకమ్ము సర్వమంగళ స్వరూపిణీ! విపుల మంత్ర సారమా! పరాత్పరా! సర్వస్వరూపిణీ! ప్రసన్నురాలవగుము. ఈ శరీరముతో మనస్సుతో వాక్కుతో మేమెన్నియో పాపములు చేసితిమి. నిన్నొక్కసారి స్మరించి నంతనే ఈ పాపములన్నియు భస్మమగును. అని జగముల సృష్టికర్త ఆ కొలువు కూటమున పలికెను. అంత సావిత్రి బ్రహ్మతో కూడి బ్రహ్మలోకమునకు వెళ్ళెను. అశ్వపతి కూడ ఇట్లే సావిత్రిని స్తుతించెను. అతడు సావిత్రిని దర్శించి - కోరిన వరములను పొందెను. సంధ్యావందనము చేసిన పిమ్మట ఈ స్తోత్రమును పఠింప

వలయును. అట్టివానికి నాలుగు వేదములు చదివినంత ఫలము లభించును. అశ్వపతి ఈ విధముగ సావిత్రిని స్తుతింపగా సావిత్రి దర్శనమొసగెను.

## బ్రహ్మ చేసిన స్తుతి - సావిత్ర్యుపాఖ్యానము

శ్లో॥ సచ్చిదానందరూపేత్వం మూలప్రకృతిరూపిణీ ।
హిరణ్యగర్భరూపేత్వం ప్రసన్నాభవసుందరి ॥
తేజః స్వరూపే పరమే పరమానంద రూపిణి
ద్విజాతీనాం జాతిరూపే! ప్రసన్నాభవ సుందరి।
నిత్యే నిత్యప్రియేదేవి! నిత్యానంద స్వరూపిణీ ।
సర్వమంగళరూపే చ ప్రసన్నాభవ సుందరి ॥
విప్ర పాపేధ్మ దాహాయ జ్వలదగ్నిశిఖోపమే ।
బ్రహ్మ తేజః ప్రదేదేవి! ప్రసన్నాభవసుందరి ।
కాయేనమనసావాచా యత్పాపంకురుతే నరః ।
తత్త త్స్మరణమాత్రేణ భస్మీభూతం భవిష్యతి ।

**స్తోత్రభావము:-** సచ్చిదానంద స్వరూపిణీ నీవు మూలప్రకృతి రూపిణివి. హిరణ్యగర్భరూపిణీ! సుందరీ! నీవు ప్రసన్నవగుము. నీవు తేజస్స్వరూపిణివి. పరమవు పరమానందరూపిణివి. సుందరీ! నీవు బ్రాహ్మణ జాతిదానవు. నిత్యా! నిత్య ప్రియా! నిత్యానంద స్వరూపిణీ! దేవీ! ప్రసన్నవుకమ్ము సుఖదా! పరమార్థప్రదా! సుందరీ! విప్రులపాపములనెడు కట్టెలు కాల్చు అగ్నిశిఖవు. దేవి! ప్రసన్నవగుము. అన్ని విధములగు మా పాపములును నిన్నొకసారి స్మరించినంతనే భస్మమగును. అని జగముల సృష్టికర్త కొలువు కూటమున పలికెను.

అంతట సావిత్రి బ్రహ్మ లోకమునకు వెళ్ళెను. తల్లి కొడుకుతో పలుకునట్లు సావిత్రి రాజుతో నిట్టనెను. రాజా! నీ మనస్సులోని కోరికయు, నీభార్య మనస్సులోని కోరికయు నాకు తెలియును. మీరెండు కోరికలను గూడ తీర్చగలను. నీ భార్యకు కన్యకావలయునని నీవు, పుత్రుడు కలుగవలె ననియు కోరుచున్నారు. క్రమముగా రెండును నెరవేర గలవు అని సావిత్రి బ్రహ్మలోకమునకు వెళ్ళెను. రాజు తన యింటికి వెళ్ళెను. వారికి మొదట కన్యయే పుట్టినది. కన్యకయును సావిత్రి నారాధించిన ఫలముగ రెండవ లక్ష్మియా యున్నట్లు ప్రకాశించుచుండెను. అశ్వపతి తన కూతురునకు సావిత్రియని పేరుపెట్టెను. ఆమె దినదినము శుక్లపక్ష చంద్రునివలె పెరుగుచు అందాల యువతిగా అయెను. ఆమె సకలసద్గుణములు

గలది. ఆమె ద్యుమత్సేనుని పుత్రుడగు సత్యవంతుని పతిగా వరించెను. సత్యవంతుడు సత్యశీలి. సావిత్రిని అత్తవారు తమయింటికి తీసుకువెళ్ళిరి. ఒక్క ఏడాది గడిచిన పిమ్మట సత్యవంతుడొకనాడు తండ్రి యాజ్ఞచే పండ్లు కట్టెలు తెచ్చుట కడవికి వెళ్ళెను. దైవ యోగమున ఆనాడు సావిత్రి కూడ అతని వెంట వెళ్ళినది. అతడు హఠాత్తుగా ఒక చెట్టునుండి క్రిందపడి మరణించెను.

## యమ సావిత్రీ సంవాదము

యముడు స్వయముగ వచ్చి అంగుష్ఠమాత్రుడగు నతని తీసుకుపోవు చుండగా సావిత్రి కూడ నతనిని వెంబడించెను. తనను వెన్నంటి వచ్చుచున్న పరమపతివ్రతను చూచి సజ్జనప్ర వరుడగు యముడు యిట్లనెను:- ఓ సావిత్రీ! ఈ మానవశరీరముతో నీ వెచటికి వచ్చుచున్నావు? నీ ప్రియునితో వెళ్ళదలచిన యెడల ఈ మానవశరీరము విడిచి రమ్ము. పాంచభౌతిక శరీరముతో నేనడును నాలోకమునకు రాజాలడు. నీ భర్త తన కర్మఫలము ననుభవించుటకు నా లోకము చేరుచున్నాడు. మానవుడు తాను చేసిన కర్మల ఫలితముగా సుఖదుఃఖముల ననుభవించును నరత్వము దేవత్వము విష్ణుసాలోక్యాది ఫలము లన్నియు జీవుని కర్మలఫలముగానే లభించును. రాక్షస కీటకాది జన్మలను గూడ తన కర్మ ఫలముగానే జీవులనుభవించుచున్నారు. అని విరమించెను.

పరమపతివ్రతయైన సావిత్రి యముని మాటలు విని మిక్కిలి భక్తితో అతని అనుగ్రహము సంపాదించి కర్మమననేమి? దానికి ఇంద్రియముల లక్షణమెట్టిది? భోక్త, భుజింపచేయువాడు భోగము మరియు జీవుడు పరమాత్మ ఇవన్నియు నీదయవలన తెలిసికొనగోరుచున్నాను. వీటిని తెలియజెప్పుటకు నీవే సమర్థుడవు అని ప్రార్థించెను. ధర్మరాజిట్లు పలికెను:-

వేదవిహితమైన కర్మము శుభము. వేదము నిషేధించిన కర్మ అశుభము. కోరిక లేకుండ చేసిన దేవకార్యము పరమభక్తిని కలిగించును. బ్రహ్మ భావము గలవాడు ముక్తుడు, వాడు ఫలభోక్తకాడు. అతడు నిర్లిప్తుడు. సాధ్వీమ తల్లీ! భక్తి రెండు విధములు. ఆ రెంటిలో నిర్గుణ భక్తి ముక్తి నొసగును. రెండవది సగుణభక్తి. అది శ్రీహరి సారూప్యము నిచ్చును. దీనిని పరమ వైష్ణవులు కోరుకొందురు కర్మలఫలము నొసంగువాడు పరమాత్మయే. భగవంతుడు కర్మ స్వరూపుడు ప్రకృతికి పరుడు అతనికి పరప్రకృతి కారణము. అతడు సృష్టి స్థితిలయముల నొనర్చువాడు. దేహి(జీవుడు)కర్మములు చేయువాడు, అంతర్యామి, కర్మ ఫల మనుభవింపజేయువాడు. సుఖదుఃఖములే భోగ్యములు (అనుభవింపబడునవి)

సత్తు అసత్తుల భేదము తెలియుట జ్ఞానము. బుద్ధి యనగా వివేచనాశక్తి. ఇది జ్ఞానమునకు బీజము. ప్రాణము వాయువులలోనొక భేదము. ఇది బలమును చేకూర్చును మన: స్వరూపము ఊహింపశక్యముకానది. ఇది చంచలము దీని భేదమేబుద్ధి. మనస్సు జ్ఞానేంద్రియములను ప్రేరేపించును. ఈ ప్రాణదేహములను ధరించువాడే జీవుడు, పరమాత్మ పరబ్రహ్మము సర్వ వ్యాపకము కారణ మనబడును.

అమ్మాయీ! శాస్త్రసమ్మతముగ నీవడిగినదంత యును చెప్పితిని, ఇక నీవు నీయింటికి వెళ్ళుము. అని ఆమెను వారించెను సావిత్రి యిట్లనెను. నాపతిని, జ్ఞానసముద్రడవగు.నిన్ను వదలి నేనెక్కడకు వెళ్ళుదును? ఈ జీవుడేయే కర్మల వలననే యే జన్మల నెత్తును? ఏ కర్మముచే స్వర్గమును పొందును దేనిచే నరక మును పొందును? ఏ కర్మముచే ముక్తి కలుగును? ఏ కర్మముచే భక్తి యేర్పడును? ఏకర్మముచే రోగియగును? దేనిచే యోగియగును? మొదలగు విషయములను దయతో తెలియజేయుము. ఈనేనడిగిన విషయములకు నీవే సమాధానము చెప్పగలవాడవు అని అడుగగా ధర్మదేవత యముడు ఆశ్చర్యపడి జీవుల కర్మ విపాకము గూర్చి యిట్లు చెప్పెను:-

నీవు చిన్నదానవైనను నీజ్ఞానము పరమయోగుల జ్ఞానముకంటెను గొప్పది. నీ తండ్రి తపస్సుచేసి సావిత్రీ వరమువలన నిన్ను కూతురుగా పొందెను. నీవు సావిత్రీ కళవలన జన్మించితివి. శివునకు భవానివలె నీవు సత్యవంతునకు పత్ని వైతివి. నీవు వరము కోరుకొనుమని యమ ధర్మరాజు పలుకగా సత్యవంతునకు ఔరసులుగా నూర్గురు కుమారులు జన్మింప వలెను. నాతండ్రికి కూడ నూర్గురు పుత్రులు కలుగవలెను. నా మామగారికి కండ్లు కనిపించవలెను. ఆయన కోల్పో యిన రాజ్యమును మరల పొందవలయును. ఇది నాకోరికయనియు లక్ష యేండ్లు గడచిన పిమ్మట నేను సత్యవంతుడును శ్రీహరి సన్నిధికి వెళ్ళవలెనని సావిత్రి కోరినది.

## యమధర్మరాజు చెప్పిన కర్మ విపాకము

అప్పుడు యమధర్మరాజు నీకోరికలన్నియు తీరునని వరమిచ్చి జీవుల కర్మ విపాకము నిట్లుచెప్పెను:- భారతదేశమున జీవులు శుభాశుభకర్మలు కారణముగా జన్మింతురు. ఇతర లోకములలో పుణ్యఫలమో, పాపఫలమో అనుభవించు చుందురు. మానవుడనేక జన్మల పొందుచు తన కర్మల ఫలితముల నుభవించు చుండును. జీవుడు శుభకర్మలచే స్వర్గ సుఖములను అశుభకర్మలచే నరకబాధలను

పొందుచుండును. ఇట్టి ఘోరకర్మలు నశించుటకు భక్తి ముఖ్యము. భక్తి రెండు విధములు. ఒకటి నిర్గుణ భక్తి, రెండవది సగుణభక్తి. మంచి పనులు చేసినవాడు చిరకాలము సుఖించును. చెడుపనులు చేసినవాడు కష్టాలపాలగును. చెడుపనుల వలన కుంటి, గ్రుడ్డి, వికలాంగుడుగా జన్మించును. ఎల్లరకుమేలు కలుగు పనులు చేయువారు సిద్ధులుగా జన్మింతురు.

దేవీ! ఇంతవరకు సామాన్య విషయమును చెప్పితిని. ఇంక విశేషము, అతి రహస్యము వినుము! భారతదేశమందలి సమస్త జాతులలో మానవ జాతి గొప్పది. వాటిలో బ్రాహ్మణజాతి శ్రేష్ఠము, ప్రశస్తము. బ్రాహ్మణుడు నిష్కాముడు సకాముడు అని రెండువిధములుగా నుండును. సకామునికంటే నిష్కాముడు గొప్పవాడు. ఏచింత చీకులేనివాడు నిష్కాముడు. కర్మలను కోరికతో చేసి అవి సిద్ధించిన సుఖము లేనిచో దుఃఖము నొందువాడు సకాముడు. నిష్కామభక్తుడు నిశ్చింతగా శరీరమును విడిచి పరమపదమును చేరును. వాడు మరల ఈలోకమునకు రాడు కృష్ణపరమాత్మను మనసార సేవించు పరమ భక్తులు గోలోకములో దివ్యరూపము లతో వెలుగొందుచుందురు. సకాములగు వైష్ణవులు వైకుంఠమునకు పోయి తిరిగి భారతభూమిపై సద్బ్రాహ్మణ వంశమున జన్మించి కొంత కాలమునకు వారు క్రమముగా నిష్కాములగుదురు.-

అట్టి వారికి నేను నిర్మల భక్తి నొసంగుదును. వైష్ణవులుగాని బ్రాహ్మణులన్ని జన్మలందును సకాములుగా నుందురు. వారిలో విష్ణుభక్తిలేనందున వారికి స్థిత ప్రజ్ఞత్వము కలుగదు. ఏదేని పుణ్యతీర్థము నాశ్రయించి తపస్సు చేసికొనునట్టి బ్రాహ్మణులు బ్రహ్మలోకమునకు వెళ్ళి తిరిగి భారతదేశమున జన్మ నెత్తెదరు. స్వధర్మనిరతులై పుణ్యతీర్థములందు నివసించు బ్రాహ్మణులు సత్యలోకమువరకు వెళ్ళి మరల భారతమున జన్మింతురు. స్వధర్మపరులు సూర్యోపాసకులైన బ్రాహ్మణులు సూర్యలోకము చేరి మరల భారతమున జన్మింతురు. ఇంక మూల ప్రకృతికి పరమభక్తులు నిష్కాములు ధర్మనిరతులునైన బ్రాహ్మణులు మరల జన్మించనక్కరలేని మణిద్వీపమున నుందురు. స్వధర్మనిరతులైన శైవులు శాక్తేయులు గాణాపత్యులును శివలోకమునకు వెళ్ళి తిరిగి భారతదేశమున పుట్టగలరు. స్వధర్మ పరాయణులు నిష్కాములు హరి భక్తులునైన బ్రాహ్మణులు భక్తి బలమున శ్రీహరిలోకమునకు పోయి మరల వచ్చెదరు. స్వధర్మరతులు-భూతప్రేతముల గొల్చువారునగు విప్రులు సకాములై భ్రష్టాచారులై నరకమున కూలుదురు. తమతమ ధర్మ కర్మముల నెరవేర్చునట్టి నాలుగు వర్ణముల వారు

శుభకర్మల ఫలితమనుభవింతురు. స్వధర్మరహితులు నరకమున కూలుదురు. తమ కర్మఫలముల ననుభవించుట వలన వారు తిరిగి భారతమున పుట్టరు.

నాల్గువర్ణములవారును స్వధర్మనిరతులైనచో శుభములను పొందుదురు. స్వధర్మనిరతుడు స్వధర్మనిరతుడైన బ్రాహ్మణునకు కన్యాదానము చేసినచో చంద్ర లోకమున పదునలుగురింద్రుల కాలము సుఖించును. కన్యను అలంకరించి దాన మిచ్చినచో దానికి రెండింతల ఫలమును పొందగలడు. కన్యాదాత సకాముడైననే ఫలము లభించును. నిష్కాముడైనచో అట్టి ఫలము లభించదు. ఫలకాంక్ష లేనివారు విష్ణులోకమునకు పోదురు. ఆవునెయ్యి వెండి, బంగారము, వస్త్రములు, పాలు, జలము, ఫలములు, బ్రాహ్మణులకు దానమిచ్చినవాడు చంద్ర లోకమునకు వెళ్ళగలడు. వాడచట ఒక మన్వంతరకాలము నివసింపగలడు. మంచి బ్రాహ్మణు నకు బంగారముతోగాని రాగితోగాని చేసిన ఆవు ప్రతిమను దానము చేసిన సూర్య లోకమున పదివేల సంవత్సరములు నివసింతురు. ఈ దానమొక పవిత్రుడగు బ్రాహ్మణునకీయవలయును. ఇచ్చినవారు నిరామయులై యందురు. బ్రాహ్మ ణులకు గొప్ప భూమిని ధనమును దానము చేయువాడు మనోహరమగు శ్వేత ద్వీపములో విష్ణులోకమునకు వెళ్ళగలడు.

అచట సూర్యచంద్రులుండు నందాక నివసించును. అట్టి పుణ్యాత్ముడు విశాలలోకములందు నివసించును. మిక్కిలి భక్తితో బ్రాహ్మణునకు గృహ దానము చేయువాడు సుఖదాయకమగు విష్ణు లోకమును చేరగలడు. ఏ దేవునకైన ఇంటిని దానము చేయువాడు ఆ దేవుని లోకమందు చిరకాలము సుఖించగలడు. ఈ దానము ప్రసిద్ధ పుణ్యక్షేత్రమున చేసినచో నూరురెట్లు ఫలములభించును. గొప్ప క్షేత్రమైనచో ఫలము రెండింత లెక్కువ యగునని బ్రహ్మచెప్పెను. పాపములన్ని యు తొలగుటకు చెరువు దానము చేయువాడు అచటి రేణువులంత కాలము జనలోకమున నివసించును. దిగుడు బావిదానము చేసినచో దానికి పదింతలు ఫలమును పొందును. అలంకరించి కన్యను దానమిచ్చినచో దానికి రెండింతలు ఫలమిచ్చును. బావిని దానమిచ్చినచో చెరువును దానమిచ్చిన ఫలము సిద్ధించును. తగినవానికి కన్యా దానము చేసినచో పదిబావులు దానము చేసిన ఫలము వచ్చును. పనికిరాని చెరువును దానము చేసినచో మంచి చెరువును దానము చేసిన ఫలమును పొందును. బావిలోని పూడిక తీయించినచో బావిత్రవ్వించిన ఫలము పొందును.

ఒక రావిచెట్టును ప్రతిష్ఠించువాడు పదివేలయేండ్లు తపోలోకమున సుఖ మొందును. సావిత్రీ! పూల తోటను దానము చేయు వాడు ధ్రువలోకమున పది వేల

సంవత్సరములుండును. విష్ణుమూర్తికి విమానము చేయించి యిచ్చువాడు మన్వంతరము వరకు విష్ణులోకములో ఆనందించును. శ్రీహరికి పల్లకి చేయించినచో విమానము చేయించిన ఫలములో సగము ఫలము వచ్చును. శ్రీహరికి అద్దాలమందిరము కట్టించి తూగు టుయ్యాల చేయించినవాడు విష్ణులోకములో నూరు మన్వంతరములు సుఖించును. పుణ్యవంతుడు స్వర్గసుఖములనుభవించి తిరిగి భారత భూమిపై జన్మించగలడు. ఎంతకాలము గడిచినప్పటికి నీ కర్మ ఫలమునైనను అనుభవింపక తప్పదు. మంచిగాని చెడుగాని చేసినదను భవింపవలసినదేగదా!

# యముడు చెప్పిన పుణ్యకర్మ ప్రభావము

పుణ్యవంతులగు సత్పురుషులు యెట్టి సత్కర్మచే స్వర్గమును పొందుదురో తెలియజేయుమని సావిత్రి అడుగగా యమధర్మరాజు ఇట్లు పలికెను:- కర్మ భూమియగు భారతదేశములో బ్రాహ్మణునకన్న దానము చేసినవాడు శివలోకమునందు చాల సంవత్సరములుండగలడు. అన్న దానమునకు మించిన దానము లేదు. దానములన్నిటిలో మహాదానమైనది అన్నదానము. ఈదానమునకు తగిన వ్యక్తిగాని తగినకాలముగాని కావలెయునను నియమములేదు. బ్రాహ్మణులకు దేవతలకును ఆసనము దానము చేసినవాడు విష్ణులోకమున పదివేల సంవత్సరములు ఆనందముతో నుండగలడు. బాగుగా పాలిచ్చునట్టి ఆవును బ్రాహ్మణునకు దానమిచ్చినచో దాని వెంట్రుకల సంఖ్యకు సరిఅగు సంవత్సరములు విష్ణులోకమున నివసింపగలడు. వస్త్రములులేని బ్రాహ్మణునకు వస్త్రదానము చేసినచో వాయు లోకమున చిరకాలము సుఖముండగలడు బ్రాహ్మణునకు సాలగ్రామము దానము చేసినవాడు వైకుంఠమున చిరకాలమానందించగలడు. దీపదానము చేయువాడు బ్రహ్మలోకమున నివసింపగలడు. బ్రాహ్మణునకు ఏనుగును దానమిచ్చినచో ఇంద్రుని ఆయుష్షుకాలము ఇంద్రుని అర్ధాసనమున కూర్చుండును. గుఱ్ఱమును దానము చేసినచో వరుణదేవుని భవనమందు సుఖించుచు చిరకాలముండగలడు. ధాన్య ము ను రత్నమును దానము చేసినవాడు చిరంజీవి యగును. పూర్ణిమనాటి రాత్రి దేవీ డోలోత్సవము జరుపువాడు జీవన్ముక్తుడగును. రాగి పాత్రను దానము చేసినవాడు ఇతర వస్తుదానముకంటె రెట్టింపు ఫలము పొందును. పచ్చని పొలమును దానమిచ్చినవాడు నూరుసంవత్సరముల కాలము విష్ణులోకమున సుఖించును. గ్రామదానము చేయువాడు గ్రామాధిపతికా గలడు.

ఎన్ని పుణ్యకార్యములు, దానములు చేసినవానికైన మరల జన్మఉన్నది కాని మహేశ్వరి భక్తులకు మాత్రము మరల జన్మలేదు. పరమపదమైన శ్రీదేవీ మణి ద్వీపమున నివసించు పరమభక్తులకు పుట్టుటగిట్టుట యుండదు. వారు బ్రహ్మల పుట్టుకలుగిట్టుటలు కూడ చూచుచుందురు. శ్రీదేవీమంత్రోపాసకులు మానవ శరీరము విడనాడి దివ్యరూపమును ధరించెదరు. వారు మణిద్వీపము చేరి దేవీ సారూప్యమును పొంది దేవి కైంకర్యములను, సేవలను చేయుచుందురు. శ్రీదేవీ భక్తులకు నాశములేదు. కార్తికమాసమున శ్రీహరికి ఒక్కటైన తులసిదళ మర్పించిన వాడు మూడు యుగములు శ్రీహరి మందిరమున మోదమందుచుండును. తరువాత అతడు జ్ఞానియై భారతభూమి పై జన్మనెత్తి జితేంద్రియుడు హరిభక్తుడు కాగలడు. సూర్యోదయ సమయమున గంగలోమునుగువాడు శ్రీహరి మందిరమున సుఖము ననుభవించును.

పిమ్మట భారతదేశమున పుట్టి ఉత్తమమైన కుటుంబము గలవాడై విష్ణు మంత్రము జపించును. గంగలో నిత్యము స్నానము చేయువాడు సూర్యునివలె పవిత్రుడగును. అతనికి అడుగడుగున అశ్వమేధయాగఫలములు సమ కూరును. అతని పాదధూళిచే భూమి పవిత్రమగుచున్నది. భారత భూమిపై మహా శివరాత్రి వ్రతము చేయువాడు శివ లోకమున సుఖములనొందును. మహాశివరాత్రి యందు పరమశివునకు మారేడుదళము అర్పించువాడు కైలాసపర్వతముపై సంతోషముతో నుండును. అతడు పిమ్మట ఉత్తమ జన్మమెత్తి శ్రీవిద్యా వంతుడు పుత్రవంతుడు శివభక్తుడును కాగలడు. చైత్రమాసమునగాని, మాఘమాసమునగాని శంకరుని పూజించువాడు శివలోక సర్వసుఖములను పొందగలడు. శ్రీరామనవమీ మహో త్సవము జరుపువాడు విష్ణులోక సుఖములను చాలకాలమనుభవింపగలడు. పిమ్మట అతడు ఉత్తమమైన జన్మమునెత్తి శ్రీరామభక్తుడుకాగలడు. అతడు జితేంద్రియుడు మహాధనవంతుడునుకాగలడు.

శుక్లాష్టమినాడు మహాలక్ష్మిని పూజించినచో లేక ఏదేని పుణ్యక్షేత్రములో పక్షముదినములు లక్ష్మీదేవిని షోడశోపచారములతో పూజించునో అతడు గోలోకమునందు సుఖశాంతుల ననుభవించుచుండును. పిమ్మట ఉత్తమమైన జన్మనెత్తి చక్రవర్తియై సర్వభోగముల ననుభవించును.

ఓ భామినీ! దేవతలందరియందు విష్ణువు, వైష్ణవులందు నారదుడు, శాస్త్రము లందు వేదములు, వర్ణములందు బ్రాహ్మణులు, తీర్థములందు గంగయు, పవిత్ర కరులందు శంకరుడు వ్రతములందు ఏకాదశియు, పూజా ద్రవ్యములందు తులసి,

నక్షత్రములందు చంద్రుడు పక్షులందు గరుత్మంతుడు స్త్రీలలో ప్రకృతి, రాధావాణీ, వసుంధరలును, ఇంద్రియములలో మనస్సు, ప్రజాపతులందు బ్రహ్మ, వనము లందు బృందావనము, వర్షము లందు భారతవర్షము, శ్రీయుతులలో శ్రీదేవియు విద్వాంసులలో సరస్వతి పతివ్రతలలో దుర్గసౌభాగ్యవతులలో రాధ, యజ్ఞములందు దేవీయజ్ఞము శ్రేష్ఠములు. అన్ని తీర్థములందుమునుగుట, ఎల్లతపముల ఫలము లను పొందుట నాల్గువేదములు చదువుట భూప్రదక్షిణము చేయుట వీటి అన్నిటి వలన కలుగుఫలము సమస్తము ఒక్క దేవీయజ్ఞము చేయుటవలన ప్రాప్తించును. శక్తిసేవముక్తికి త్రోవ. వేదపురాణాదులసారము శ్రీదేవీ పాదముల సేవయే. అమ్మాయీ! నీవు నిత్యము నిర్గుణము పరబ్రహ్మము పరప్రకృతియగు దేవిని కొలువుము. నీవు నీభర్తను తీసికొనిపొమ్ము నీమందిరమున సుఖముగ్గా నుండుము. కర్మవిపాకమును తెలిపితిని గదా అని యముడు వివరించెను.

శ్రీదేవి గుణకీర్తనము వినగనే సావిత్రి శరీరముగగుర్పాటు చెందినది. ఆమె యమునితో మరల నిట్లు పలికెను. ధర్మదేవా! శక్తిగుణ మహిమ గానము చేయు వారికి వినువారికిని చావుపుట్టువులు ముసలితనము ఉండవు. వేదవేత్తలలో శ్రేష్ఠుడా! దేవి నెట్లు సేవించపవలెనో తెలియజేయుము. ఈవిషయమును తెలియ జేయుటకు నీవే తగినవాడవు. అని సావిత్రి భక్తివినయములతో తలవంచి పలికెను. ఆమె వేదోక్త స్తోత్రముతో యమధర్మరాజు నిట్లు స్తుతించెను. నిన్ను గూర్చి తపస్సు చేసి ధ్యానించి వరము పొంది సత్యపీంద్రు డయ్యెను. మహేంద్రుడు తత్త్వజ్ఞానము నుపదేశింపమని శివుని ప్రార్థింపగా అతడు వాణిని తలచివానికి జ్ఞానము బోధించెను. దేవేంద్రుడు బృహస్పతిని శబ్దశాస్త్రము బోధింపుమనగా పుష్కర క్షేత్రమున నిన్ను ధ్యానించి వరము పొంది అప్పుడింద్రునకు వ్యాకరణశాస్త్రమును బోధించెను.

దేవీ! నీవిట్లు మునిమను మానవులచేత పూజింపబడి స్తుతింపబడుచున్నావు. బ్రహ్మ విష్ణు శివులచేత దేవదానవులచేత స్తుతింపబడి పూజింపబడితివి. ఐదు ముఖముల శివుడు నాల్గుముఖల బ్రహ్మయు నిన్ను స్తుతింపజాలరు. ఇక నేను ఒక్కనోటితో నెట్లు స్తుతింపగలుగుదును? అని యాజ్ఞవల్క్యుడు భక్తి వినయము లతో తలవంచి సరస్వతిని సంస్తుతించెను. ఈ స్తోత్రమునకు సంతోషించి సరస్వతి నీవు 'సుకవివి' అగుము అని వరమిచ్చి వైకుంఠమునకు వెళ్ళెను. ఈ యాజ్ఞ వల్క్యుడు చెప్పిన ఈ స్తుతిని చదివినవాడు మహాకవి మహావక్త బృహస్పతి సమానుడగును. మూర్ఖుడైనను ఒక ఏడు దీనిని చదివినచో తప్పక పండితుడు కవీంద్రుడు మేధావి కాగలడు.

# యమస్తుతి

శ్లో॥ తపసా ధర్మ మారాధ్య పుష్కరే భాస్కరః పురా ।
ధర్మం సూర్యః సుతంప్రాప ధర్మరాజం నమామ్యహమ్ ॥
సమతా సర్వభూతేషు యస్యసర్వస్యసాక్షిణః ।
అతోయన్నామ శమన ఇతితం ప్రణమామ్యహమ్ ॥
యేనాంతశ్చ కృతో విశ్వే సర్వేషాంజీవినాం పరమ్ ।
కామాను రూపం కాలేన తం కృతాన్తం నమామ్యహమ్ ॥
బిభర్తి దండం దండాయ పాపినాం శుద్ధిహేతవే ।
నమామి తందండధరం యశ్శాస్తా సర్వజీవినామ్ ॥
విశ్వంచ కలయత్యేవ యస్సర్వేషు చ సంతతమ్ ।
అతీవదుర్నివార్యంచ తంకాలం ప్రణమామ్యహమ్ ॥
తపస్వీ బ్రహ్మనిష్ఠోయః సంయమీ సంజితేంద్రియః ।
జీవానాం కర్మఫలదస్తంయమం ప్రణమామ్యహమ్ ॥
స్వాత్మారామశ్చ సర్వజ్ఞో మిత్రం పుణ్య కృతాంభవేత్ ।
పాపినాం క్లేశదోయస్తం పుణ్యమిత్రం నమామ్యహమ్ ॥
యజ్జన్మ బ్రహ్మణోంశేన జ్వలంతం బ్రహ్మతేజసా ।
యోధ్యాయతి పరంబ్రహ్మ తమీశం ప్రణమామ్యహమ్ ॥
ఇత్యుక్త్వాసాచ సావిత్రీ ప్రణనామయమం మునే ।
ఇదం యమాష్టకం నిత్యం ప్రాతరుత్థాయ యఃపఠేత్ ॥
యమాత్తస్యభయంనాస్తి సర్వపాపాత్ప్రముచ్యతే ।
మహాపాపీ యది పఠేత్ నిత్యం భక్తి సమన్వితః ॥
యమః కరోతి తం శుద్ధం కాయవ్యూహేన నిశ్చితమ్ ॥

**స్తోత్రభావము:-** పూర్వము సూర్యుడు పుష్కరతీర్థమున యమధర్మరాజు నారాధించెను. సూర్యుడు ధర్మరాజును పుత్రునిగా పొందెను. అట్టి ధర్మరాజునకు నమస్కారము. అన్ని ప్రాణులందు సమభావమున సాక్షిగా నుండువాడు శమనుడని పిలువబడు "సమవర్తి"కి నమస్కరించుచున్నాను. ఎవడు సమస్త ప్రాణులనంత మొందించువాడో అట్టికాలునకు నమస్కారము. ఎవడు పాపాత్ములను పరిశుద్ధులను చేయుటకై దండించుచున్నాడో అట్టి దండధరునకు నమస్కారము. ఎవడు దుర్నివారుడగు కాలస్వరూపుడో అట్టికాలునకు నమస్కారము, ఎవడు జీవుల

కర్మఫలప్రదుడై వెలుగొందునో అట్టి వైవస్వతునకు నమస్కరించుచున్నాను. స్వాత్మారాముడు సర్వజ్ఞుడు పుణ్యాత్ములకు మిత్రుడు పాపులను కష్టపెట్టువాడునగు పితృపతికి నమస్కరించుచున్నాను. ఎవడు బ్రహ్మాంశచే జన్మించెనో బ్రహ్మతేజముతో విరాజిల్లునో ఎవడు పరబ్రహ్మమును ధ్యానించుచుండునో అట్టి యీ శునకు నమస్కరించుచున్నాను. ఈ యమాష్టకమును నిత్యము ప్రొద్దున మేల్కొని జపించువానికి యముని వలన భయము కలుగదు. అతడు సర్వపాప విముక్తుడగును. ఎంతటి పాపాత్ముడైనను నిత్యము భక్తితో దీనిని చదివినచో యముడతనిని కాయవ్యూహముతో తప్పక పవిత్రుని చేయగలడు.

# సావిత్ర్యుపాఖ్యానము

యముడు సావిత్రికి మహా మంత్రమగు మాయాబీజము విధి పూర్వకముగ ఉపదేశించి అశుభకర్మ విపాకము గూర్చి యిట్లు చెప్పెను. నరుడు శుభకర్మ విపాకముచే నరకము పాలగును. నరక కుండములు పలురీతులు అని భయంకరములు. అవి మొత్తము ఎనుబదియారు నరకములుగా చెప్పబడినవి. వహ్ని కుండము మొదలగు కుండలము పేర్కొనబడినవి. హరిసేవలో నిమగ్నుడు శుద్ధాత్ముడు యోగసిద్ధుడు బ్రహ్మచారి తపస్వి నరకమునెన్నటికిని చూడరు. విద్యా ధనమదముచే బంధువులను పరుషముగా మాట్లాడువాడు వహ్నికుండమున పడును. ఆకలితో వచ్చినవాని ఆకలి తీర్చనివాడు తప్తకుండమున పడును. ఎడు వేదశాస్త్రములను నిందించునోవాడు క్షారకుండమున పడును.

మనుష్యులను ఇతర ప్రాణులను చంపువాడు అసిపత్ర నరకమందుండును. నగరములను, గ్రామములను తగులబెట్టువాడు అసిధార కుండమున వికలాంగుడై పడి యుండును/ ఒకరి ముందు వేరొకరిని నిందించువాడు, పరుల తప్పులెన్ను వాడు దేవబ్రాహ్మణుల నిందించువాడు, సూచీముఖ నరకమున కూలి, యచట వాడి సూదులచే గ్రుచ్చబడుచు మూడు యుగముల వరకుండును. ఇండ్లకు కన్నము వైచి వస్తువులను దొంగిలించువాడు- ఆవులను, మేకలను దొంగిలించు వాడు మూడు యుగముల వరకు యమబాధలను అనుభవించును.

పరదేవతను సేవించనంతవరకు కర్మము నశింపదు. మంచి పనుల వలన పుణ్యము, చెడు పనుల వలన నరకము కలుగును. సాలగ్రామమునుగాని దేవతా మూర్తిని గాని, చేతబట్టుకొని ప్రతిజ్ఞ చేయువాడు ప్రతిజ్ఞ నిలబెట్టుకొననిచో జ్వాలాముఖ నరకమున కూలి బాధపడును. తప్పుడు సాక్ష్యము చెప్పువాడు ఏడు జన్మలు కప్పగా నుండును. వేదవాక్యమునందు నమ్మకము లేనివాడు. వ్రతోపవాసములు

చేయనివాడు, మంచి మాటలు పెడచెవిని బెట్టువాడు ధూమ్రాంధ నరకమున కూలును. సావిత్రి మాటలు విని ధర్మరాజు హరిని స్మరించి కర్మ-జన్మ బంధముల తెగటార్చునట్టి కథ నిట్లు చెప్పసాగెను.

సుశీలా! వేద ధర్మశాస్త్ర పురాణేతిహాసము సర్వసమ్మతమైన సర్వసార/రసాయనమైనది పంచదేవతోపాసనము. ఈ ఉపాసనము జన్మ జరామృత్యువుల నశింపజేయును. వ్యాధిశోక సంతాపములను తుడిచి వేయును. ఇది సర్వమంగళ రూపము పరమానంద సంగమము. ఇది సర్వసిద్ధులకు మూలకారణము. నరకార్ణ వనము దాటించునది. ఇది భక్తి వృక్షమునకు మూలము. ఇది కర్మవృక్షమును ఛేదించునది. ఇది ముక్తికి సోపానము. ఇది శాశ్వత దివ్య ధామము. ఇది సాలోక్య సామీప్యవర్ణ సారూప్యముల నొసంగు శుభకర్మము. సదాచారపరుడైన బ్రాహ్మణుడును దేవీ భక్తుడుకాదేని ముక్తి నొందడు. హరిదాసుల నాశ్రయింపనివారు యమ లోకమున కేగుదురు. ఇప్పుడు శాస్త్రమందు తెల్పబడిన దేహవర్ణనము వినుము. ఆకాశము, వాయువు,నిప్పు, నీరు, నేల ఇవి పంచభూతములు. శరీరము పంచభూతములచే నిర్మితము. శరీరము కృత్రిమము, నశ్వరము, బూడియగునది. అంగుష్ఠ పరిమాణము గల జీవుడీ శరీరమందుండును. అతడు కర్మబద్ధుడు. సూక్ష్మదేహము అగ్నిలో పడినను నశింపదు. యాతనలు అనుభవించు దేహ వివరణమిది.

నరక కుండములన్నియు చంద్రబింబము వలె గుండ్రముగ నుండును. అందులో దారుణమైన అగ్ని భగభగమను మంటలు గ్రక్కుచుండును. ఈ కుండములీశ్వరాజ్ఞచే ప్రళయము వరకు నశించవు. నరకకుండములు అనేక రూపములతో పాపాత్ములకు బాధలు కలిగించుచుండును. అగ్ని కుండము నుండి వెలువడి మంటలు నూరు చేతులంత పొడవుగ ఆకాశము తాకుచుండును. ఆ నరక కుండము క్రోసుదూరము వ్యాసమున వెలుగుచుండును. నా భటుల దెబ్బలు తినుపాపుల వెడబొబ్బలతో మార్మ్రోగుచుండును. నా కింకరులు కుండములను రక్షించుచుందురు. నా దూతలు చితకబొడుచుచుందురు. ఈ విధముగా ఎన్ని రకములైన పాపకృత్యములు కలవో అన్నిటికిని తగినశిక్ష ననుభవించుటకు తగిన నరక కుండములు కలవు. ఎనుబదియారు కుండములలో వివిధ పాపాత్ములు శిక్షల ననుభవించుచు దుఃఖపడుచుందురు.

## యముడు చెప్పిన శక్తి-వివరణ

కర్మ విపాకమును విని సావిత్రి శ్రీదేవీ భక్తిని గూర్చి తెలుపుమనగా యమ ధర్మరాజు ఇట్లు పలికెను. బిడ్డా! నీ మనస్సులోని కోరికలన్నియు తీరగలవని

మొదటనే నీకు వరమిచ్చితిని గదా! ఇపుడింకను నావర ప్రభావమున నీకు దేవీ భక్తియు కలుగగలదు. కల్యాణీ! నీవు శ్రీదేవీ గుణ మాహాత్మ్య కీర్తనము వినదలచితివి. అది చెప్పువారి వినువారి కులమును తరింపచేయును. శేషుడు వేయి నోళ్ళతో దేవీగుణములను వర్ణింపజాలడు. శివుడు తన ఐదు ముఖములతో నైనను దేవిమహిమను తెలుపజాలడు. అట్లే బ్రహ్మ విష్ణువులకు కూడ తరముకాదు. ఇక యితరుల సంగతి చెప్పనేల! బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మొదలగువారును దేవి పాద పద్మములను సర్వకాలముల సేవించుచుందురు. దేవి గుణముల మహిమను గూర్చి యెవనికో యే కొంచెమో తెలియును. అందరికంటెను శివుడు ఎక్కువగా దేవిని గూర్చి తెలిసినవాడు.

పూర్వమొకప్పుడు శ్రీకృష్ణుడు గోలోకమందలి రాసమండల మందు శివున కేకాంతముగ దేవిని గూర్చి కొంచెము తెలిపెను. అప్పుడు కృష్ణుడు దేవీ గుణముల కీర్తనము గూర్చి కూడ శివునకు కొంత తెలియజెప్పెను. పరమశివుడు దానిని తన లోకమున ధర్మునకు వినిపించెను. ధర్ముడు సూర్యునకు చెప్పెను. నా తండ్రి సూర్యుడు దేవి నారాధించి తపస్సుతో మరికొంత గ్రహించెను. నా తండ్రి దేవీ గుణమహిమలు నాకు తెలియజేసెను. నేను నీకు దుర్లభములైన దేవీ గుణములును తెలుపుదును.

దేవి తన గుణములను తానే యెరుగదు. ఇంక ఇతరులెట్లు తెలియ గలరు. ఆకాశమునకు తనలో ఏమున్నదియు తెలియదు. సూర్యుడే ప్రకృతి. ప్రకృతి పురుషులొక్కరేగాని యిరువురుగాదు. అగ్ని అందలిశక్తి వేరుగాదు కదా! ఆ ప్రకృతి యే శక్తి- మహామాయ-సచ్చిదానందరూపిణి, ఆమెకు రూపములేదు. ఐనను భక్తులను కాపాడుటకు అనేక రూపములు తాల్చును. దేవి మొట్టమొదట మిక్కిలి మనో హరము, సుందరమునైన గోపాల రూపమును ధరించెను. ఆ గోపాలసుందర రూపము క్రొత్త మేఘము వలె శ్యామలకోమల బాలగోపాల వేషము దాల్చెను. ఆ గోపాలసుందర రూపము కోటి మన్మథుల లావణ్యముతో విరాజిల్లు విగ్రహము. పరబ్రహ్మస్వరూపము. ఆ రూపము ప్రియదర్శనము శాంత సుందరము రమణీయము. చిరునవ్వులు చిందించు గోపికల చూచుచుండెడి రూపము. రాసమండలము నడుమ రత్న సింహాసనమందున్న రూపము. వేణువు నూదుచున్న రూపము రెండు భుజములకు మధ్య విశాలవక్షస్థలమున వనమాల కౌస్తుభమణి ప్రకాశించుచున్నది. శరీరమంతయు మంచిగంధము పూయబడినది. కస్తూరి కుంకుమాగురుల పరిమళము విరజిమ్ముచున్నది.

పూలదండల పరిమళము వ్యాపించుచున్నది. శిఖిపింఛ మౌళియగు గోప సుందరదివ్యరూపమును భక్తులు భక్తి రసమున నోలలాడుచు కన్నులకరవు దీరచూచుచున్నారు. అట్టి గోపాలకృష్ణుని భయము వలన జగములు సృష్టించు బ్రహ్మ జీవకోటిని వారికర్మానుసారము సృజించును. అతని యాజ్ఞవలననే దేవతలు తపఃఫలము నిత్తురు. విష్ణువు అతని భయము చేతనే లోకాలను పాలించు చున్నాడు. అతని భయముచే రుద్రుడు ప్రపంచమును సంహరించును. శివుడు జ్ఞానులకు గురువు. అట్టి శివుడు కూడ కృష్ణునిజ్ఞా నోప దేశముచే తనే సర్వజ్ఞుడు. భక్తి వైరాగ్య సంపన్నుడునయ్యెను.

శ్రీకృష్ణుని భయ ముననే గాలి వీచుచున్నది. సూర్యుడు తపించుచున్నాడు. శ్రీకృష్ణుని ఆదేశము ననుసరించి గాలి నీటిని నీరు కూర్మమును కూర్మము శేషుని శేషుడు భూమిని సముద్రములను పర్వతములను ధరించుచున్నవి. ఆది దేవుడగు శ్రీహరి రెప్ప పాటున ప్రాకృతిక ప్రళయము జరుగును. ప్రకృతి ప్రళయమందు దేవతలు చరాచరప్రాణికోటి ధాతవిధాత యెల్లరును శ్రీకృష్ణుని నాభికమలమున లయింతురు. అప్పుడు పాలసముద్రముపై పవ్వళించు విష్ణువును వైకుంఠధామ మందలి చతుర్భుజుడును శ్రీకృష్ణపరమాత్ముని యెడమభాగములో కలిసిపోదురు. సనాతనుడగు శివుడును కృష్ణుని జ్ఞానమందైక్యమగును. విష్ణుమాయయైన దుర్గా దేవిలో సకలశక్తులు కలిసిపోవును. బుద్ధ్యధిష్ఠాన దేవియగు దుర్గయు శ్రీకృష్ణ భగవానుని బుద్ధిలో లీనయగును. నారాయణాంశ గల కుమారస్వామి అతని వక్ష స్థలమున లయమొందును. దేవాధీశుడు కృష్ణాంశుడునగు గణపతి కృష్ణుని బాహువులందు లయము పొందును. పద్మాంశ గల లక్ష్మి రాధాదేవిలో లయ మగును. దేవతాస్త్రీలు గోపికలు రాధలో కలియుదురు.

అప్పుడు కృష్ణుని ప్రాణాధిష్ఠానదేవియు రాసేశ్వరియునగు రాధ శ్రీకృష్ణుని ప్రాణములందు ప్రాణమైయలరారును. సావిత్రి సకల వేదశాస్త్రములును సరస్వతి లో కలిసిపోవును. సరస్వతి కృష్ణపరమాత్మ నాలుకపై వాణిగా వెలుగొందును. గోలోకము గోపాలురందరు కృష్ణుని రోమకూపములందు లయింతురు. సమస్త ప్రాణుల ప్రాణవాయువులు కృష్ణుని ప్రాణములందు కలిసిపోవును. అగ్నులు కృష్ణుని జఠరాగ్నియందు జలములు కృష్ణుని నాలుక చివరభాగమునందు పరమా నందయుతులైన వైష్ణవులు శ్రీకృష్ణుని పాదపద్మములందును కలసిపోయెదరు. భక్తశేఖరులు శ్రీకృష్ణుని కలియుదురు. క్షుద్రవిరాట్టు మహావిరాట్టులో మహా విరాట్పురుషుడు శ్రీకృష్ణుని లోనులయము నొందును. సమస్త ప్రపంచములును శ్రీకృష్ణ బ్రహ్మము రోమ కూపములందు కలిసి పోవును. ఆ కృష్ణపరమాత్మ కనురెప్ప

రెప్ప వేయుటచే ప్రళయము సంభవించును. అతడు శయనించిన మీదట సృష్టి మరల మొదలగును. అతడెంత కాలము కన్నులు మూసి యుండునో అంత కాలము కన్నులు తెరచియుండును. బ్రహ్మకు నూరేండ్లునిండగనే సృష్టిమాత్రము ఆగిపోవును.

ఓ సుశీలా! బ్రహ్మల సృష్టి లయములు లెక్కింపనలవికాదు. సర్వాంతరాత్మ డగు విరాట్పురుషుడు రెప్పవేయగనే ప్రళయము సంభవించును. కన్నులు తెరవగనే మరల సృష్టియు ఈశ్వరాజ్ఞచే సంభవించును. చివరకు కృష్ణుడు కూడా ప్రాకృత ప్రళయమున లీనుడగును. ఇట్లు కృష్ణుడు మూలప్రకృతియు, ఒక్కటికాగ పరాశక్తి మిగులును. ఆ శక్తియు, నిర్గుణుడగు పరమపురుషుడు నిర్వురు ఒక్కరే. వేదవేత్తలు సృష్టికి పూర్వము సత్పదార్థము మాత్రమే కలదని యందురు. అదియే పురుషుని తొలి స్వరూపము, అట్టి మూలప్రకృతిని "అవ్యక్తము" "అవ్యాకృతము"అను పేర్లతో పిలుతురు. అది చిత్పదార్థముకంటే భిన్నముకాదు. ప్రళయమునందిది యొక్క టియే మిగిలియుండును. అటువంటి పరాప్రకృతి గుణరత్నముల మహి మలు తెలుపుటకు ఈ బ్రహ్మాండములందు సమర్థుడెవ్వడును లేడు. నాల్గు వేదము లందును ముక్తి నాల్గువిధములనుండునని చెప్పబడినది. ఒకటి సాలోక్య ముక్తి, రెండవది సారూప్యముక్తి, మూడవది సామీప్యముక్తి, నాల్గువది నిర్వాణముక్తి. నిజమైన భక్తులీ నాల్గింటిని కోరరు. ఎందుకనగా ముక్తిలో ప్రభు సేవలేదు. భక్తి ముందు తక్కినన్నియు దిగదుడుపులే. ఇదియే భక్తికి ముక్తికి కలభేదము. ఇక నిషేకఖండనము గూర్చి చవులార వినుము. తాము చేసికొనిన కర్మఫలమునే నిషేకమని పండితులందురు. శ్రీవిభుని పరాప్రకృతిని సేవించుట వలన కర్మ ఫలము నశించి శుభము చేకూరును.

ఓ సాధ్వీ! వేద ప్రపంచమందు కూడ ఇటు వంటి తత్త్వజ్ఞానమే తెలుపబడెను. ఓ యమ్మాయీ! అది నిర్విఘ్నమైనది. శుభకరమైనది. ఇకనీవు నీ ఇష్టము వచ్చిన చోటికి వెళ్ళుము అని సూర్యపుత్రుడు యముడు సావిత్రి పతిని బ్రతికించెను. యముడు సావిత్రికి శుభాశీస్సులనిచ్చి వెళ్ళుటకు సిద్ధమాయెను. తనచోటికి వెళ్ళుచున్న యమునిచూచి సావిత్రి అతని పాదములు పట్టుకొని యేడ్చెను. ఆ దుఃఖము చూచి యమునికి జాలికలిగెను. తాను కూడ దుఃఖించి మరల సంతో షముతో ఆమెకిట్లనెను. అమ్మాయీ! నీవు ఈ పుణ్య భారత భూమిపై చిరకాలము సుఖము లనుభవింపగలవు. అటు పిమ్మట నీవు దేవీలోకమునకు వెళ్ళి విరాజిల్లు దువు. కల్యాణీ! నీవిక ఇంటికి వెళ్ళి సావిత్రీదేవి వ్రతము చక్కగా చేయుము. సావిత్రివ్రతము పదునాలుగు సంవత్సరములు చేసిన స్త్రీకి ముక్తి కలుగును.

జ్యేష్ఠశుద్ధ చతుర్దశినాడు సావిత్రీ వ్రతము చేయుటమంచిది. భాద్రపద శుక్లాష్టమినాడు లక్ష్మీవ్రతము చేయుట శుభప్రదము. పదహారు సంవత్సరములు లక్ష్మి వ్రతము చేసిన స్త్రీ చివరకు విష్ణువు యొక్క పరమపదమును చేరును. ప్రతి మంగళవారము మంగళ చండీవ్రతము జరుపవలయును. ప్రతినెల శుద్ధ షష్ఠినాడు మంగళనాయికయగు షష్ఠీదేవిని కొలువవలయును. ఆషాఢమాసము లో సంక్రాంతినాడు సర్వసిద్ధుల నిచ్చునట్టి మానసాదేవిని పూజింపవలెను. ప్రతి నెల శుద్ధాష్టమినాడు ఉపవాసము చేసి దుర్గాదేవి నారాధింపవలయును. శ్రీదుర్గా దేవి వరప్రద. విష్ణుమాయ- భగవతి - దుర్గ- ఆర్తినాశిని మరియు పతిపుత్రులు గల పతివ్రతనిత్యము శుభము కోరి మహా ప్రకృతియగు జగదంబ నారాధింప వలయును. ధనము సంతానము కోరిన స్త్రీ ఈలోకమున సుఖముల నను భవించి చివరకు దివ్యలోకము చేరును. ఈరీతిగా ఉత్తమసాధకుడు నిరతము దేవీ విభూతుల నారాధింపవలయును. ఎల్లవేళల విశ్వరూపయగు పరమేశ్వరి సేవింప దగినది. దేవి సేవతప్ప జన్మధన్యమగుటకు వేరు మార్గము లేదు. అని చెప్పి యమధర్మ రాజు తన నివాసమునకు వెళ్ళిపోయెను. సావిత్రీ సత్యవంతులు తమ యాశ్రమమునకు వెళ్ళిరి. సావిత్రి కోరికలన్నియు తీరెను.

# లక్ష్మీ చరిత్రము

శ్రీలక్ష్మీదేవి యెట్టిది? ఆమెను మొట్టమొదట నెవరు పూజించిరి. ఆ దేవి గుణములు, మహిమలు నాకు తెలియజేయుమని నారదుడు కోరగా నారాయణు డిట్లు చెప్పెను:- సృష్టికి పూర్వము శ్రీకృష్ణ పరమాత్ముని యెడమభాగమునుండి రాసమండలమున లక్ష్మి పుట్టినది. ఆమె అందాల కాటపట్టు నడియౌవనమందు న్నది. ఆమె చుట్టు మల్లిచెట్లు కలవు ఆమె చూపులలో ప్రేమనిండియున్నది. ఆమె ముఖకాంతి శరత్కాల చంద్రుని వెన్నెల కంటెమిన్నగా నొప్పుచున్నది. ఆమె కన్నులు నల్లకలువల కాంతులను తిరస్కరించుచున్నవి. ఆమె ఈశ్వరుని ఆజ్ఞచే రెండు రూపములుగా మారెను. రూపయౌవనాదు లందిద్దరు సమానలే. కుడివైపు రూపము రాధ-ఎడమవైపు రూపము లక్ష్మిగా వెలసిరి. మొదట రెండు భుజములు గల కృష్ణపరమాత్మను రాధపతిగా వరించెను.

తరువాత మహాలక్ష్మి కూడా ఆ సుందరాంగుని వలచినది. అంత కృష్ణుడా లోచించి తానును రెండు రూపములు ధరించెను. కుడియంశ రెండు చేతులుగల కృష్ణుడు ఎడమఅంశగా నాల్గు చేతులు గల శ్రీమహావిష్ణువయ్యెను. రెండు భుజ ములు గల కృష్ణుడు లక్ష్మిని చతుర్భుజుడగు విష్ణునకిచ్చెను. ఈ చరాచర ప్రపంచ

మంతయు ఆ లక్ష్మి చల్లని కంటికాంతులచే అందముగా కనిపించును. ఆమె మహాదేవి యగుటవలన మహాలక్ష్మి, బంగారులక్ష్మి అని పేరొందెను. రాధా రమణుడు కృష్ణుడు. లక్ష్మీరమణుడు విష్ణువు. శుద్ధ సత్త్వస్వరూపిణియగు రాధ గోపికలతో కొలువై యుండును. చతుర్భుజుడు లక్ష్మిని తీసికొని వైకుంఠమునకు వెళ్ళెను.

కృష్ణుడు విష్ణువు ఇద్దరు అన్ని విషయములందను సమానులు. మహాలక్ష్మి విష్ణువు అవతార విశేషముల కనుగుణముగా శృంగార రూపము లను ధరించును. శ్రీ వైకుంఠమందలి మహాలక్ష్మి పరిపూర్ణ తమ స్వరూప. సకల సౌభాగ్యలక్ష్మి లక్ష్మీ దేవియే స్వర్గమందు ఇంద్రుని సంపత్ స్వరూపము. పాతాళమున నాగలక్ష్మి రాజుల యొద్ద రాజ్యలక్ష్మి. గృహము లందు గృహలక్ష్మి (గృహిణి) గోమాతలలో సురభి. యజ్ఞములందు దక్షిణ క్షీరసముద్రపుత్రిక పద్మములందు చంద్రుని యందు శోభారూపిణి. సూర్యునితో ప్రభారూపిణి, ఇంకను అనేక పవిత్రములైన శోభావంతములైన స్థలములందును అనేక శుభనామములతో విలసిల్లు చుండును. విలువైన మాణిక్యములందు జాతిముత్యములందు, పూలమాల లోను వజ్రము లందు మంచిగంధమునందు పాలలోను అందమైన చెట్లకొమ్మల యందు తొలకరి నీలిమేఘాలలోను లక్ష్మికళ తేజరిల్లుచుండును. లక్ష్మీదేవిని మొట్ట మొదట వైకుంఠమందు శ్రీమన్నారాయణుడు పూజించెను. తరువాత లక్ష్మిని బ్రహ్మ పూజించెను.

పిమ్మట శంకరుడు భక్తితో ఆమెను పూజించెను. విష్ణువు పాలసముద్రమున కూడ నొకమారు లక్ష్మిని పూజించెను. స్వాయంభువ మనువు పలువురురాజులు ఋషులు మునులు ఉత్తమగృహస్థులు లక్ష్మీదేవిని పూజించిరి. పిమ్మట గంధర్వులు పాతాళమందలి నాగులు లక్ష్మీదేవిని కొలిచిరి. బ్రహ్మ భాద్రపద శుక్లాష్టమి నాడు లక్ష్మీదేవిని పూజించి కృతార్థుడయ్యెను. ముల్లోకములందలి వారును లక్ష్మిని భాద్రపద శుక్లపక్షమున పదిహేను దినములును పూజింతురు. చైత్ర భాద్రపద పుష్యమాసములందలి మంగళవారములలో లక్ష్మీదేవికి మహోత్సవములు జరుపుదురు. ఏడాది చివరలో పుష్య సంక్రాంతినాడు మాఘ పూర్ణిమనాడు మంగళ కలశమందావాహన చేసి మనువు మోక్షలక్ష్మిని పూజించెను. సర్వమంగళ మాంగళ్యయగు లక్ష్మిని యింద్రుడు పూజించి అమితైశ్వర్య సంపన్ను డయ్యెను. ముల్లోకము లందును ఎందరెందరో మహా లక్ష్మిని కొలిచి కృతార్థులైరి. లక్ష్మి సకలైశ్వర్య సంపదలకు ప్రతిరూపము. అనియిట్లు నారదునకు నారాయణుడు లక్ష్మి చరిత్రమును తెలియజేసెను.

లక్ష్మీదేవి భూలోకమున సముద్రుని కూతురుగా ఏలపిలువబడుచున్నదని ప్రశ్నింపగా నారదునకు నారాయణుడిట్లనెను. నారదా! పూర్వము దుర్వాసుని శాపముచే దేవేంద్రుడు స్వర్గలక్ష్మిని కోల్పోయెను. అప్పుడు దేవతలెల్లరు భూమిపై గుమిగూడిరి. స్వర్గసీమను వదలిన లక్ష్మి వైకుంఠమందలి మహాలక్ష్మిలో లీనమయ్యెను. అప్పుడెల్లరు చింతాక్రాంతులై బ్రహ్మసభ కేగిరి. అక్కడ నుండి వారు బ్రహ్మతో కూడ వారు వైకుంఠమునకు వెళ్ళిరి. అచట దైన్యముతో నారాయణుని శరణుజొచ్చిరి. అంతట విష్ణునాజ్ఞచే సాగరకన్యగా నవతరించెను. దేవదానవ గణములు పాలసముద్రమును మథించి లక్ష్మిని మరల పొందిరి.

లక్ష్మిని పూజించి వారు సుఖముగా నుండిరి. లక్ష్మి దేవతలకు వరములిచ్చి ప్రసన్నమైన ముఖముతో హరికి వనమాలనొసగెను. అంత దేవతలు దైత్యులకుచే జిక్కిన రాజ్యమును మరల పొందిరి. ఇంద్ర దుర్వాసులకు జరిగిన సంవాదమును చెప్పుమనగా నారా యణుడిట్లు చెప్పెను. పూర్వము వైకుంఠము నుండి కైలాసమునకు వెళ్ళుచున్న దుర్వాసమహర్షిని చూచి యింద్రుడు నమస్కరించెను. ముని విష్ణువు తనకిచ్చిన పారిజాత పుష్పమును యింద్రునకొసంగెను. యింద్రుడా పుష్పమును తన ఏనుగు తలపై నుంచెను. ఆ ఏనుగు యింద్రుని వదలి అడవులలోని కేగెను. ఇంద్రుడాప లేకపోయెను. అప్పుడు దుర్వాసుడు నేనిచ్చిన పుష్పమును మదాంధుడవై ఏనుగు తలపై నుంచితివి గాన సర్వలక్ష్మి నిన్ను విడిచి పరమపదము చేరగలదని శపించెను. దేవేంద్రుడు బృహస్పతికి శాపమును తెలిపి ప్రార్థింపగా నాతడు మధుసూదనుని స్మరించినచో ఆపదలు తొలగునని బోధించెను.

పిమ్మట యింద్ర బృహస్పతులు బ్రహ్మలోకమునకు వెళ్లి బ్రహ్మను వెంట పెట్టుకొని ముప్పురును శ్రీమహావిష్ణు వద్దకు వెళ్ళిరి. శ్రీహరి దైన్యముతో నున్న వారిని చూచి భగవంతుడు బ్రహ్మా! దేవతలారా! మీరు భయపడవద్దు. మీకు శాశ్వత లక్ష్మిని నేను ప్రసాదించగలను. శ్రీహరి పూజలు నామసంకీర్తనలు సాగు చోటి సర్వమంగళయగు లక్ష్మి తప్పనివసించును అని పలికి దేవతలందరు కలసి సముద్రమును మథించి లక్ష్మిని దేవతలకు సమర్పింపుడు అని దేవతలకు చెప్పి హరి లక్ష్మితో నీవు పాలసముద్రమున నవతరింపుమని పలికెను. ఇట్లు చెప్పి లక్ష్మిపతి అంతఃపురములోని కరిగెను. కొంతకాలమునకు పాలసముతరచగా లక్ష్మి యందుద్భవించెను. లక్ష్మి వైజయంతీమాలను విష్ణువు మెడలో నలకరించెను. అప్పుడు లక్ష్మిని బ్రహ్మ శివుడు దేవతలును పూజించిరి. అప్పటి నుండి మహాలక్ష్మి మరల దేవతల యిండ్లలో నివసింప నారంభించెను. మహాలక్ష్మి యనుగ్రహముచే దైత్యులాక్రమించిన స్వర్గమును దేవతలు మరల పొందగలిగిరి.

పూర్వమింద్రుడు పరమైశ్వర్య రూపిణియగు లక్ష్మీదేవి వాహనము చేసి బ్రహ్మను పురోహితునిగా చేసికొని దేవిని పూజించెను. సమస్తములైన ఉపచారములను సమర్పించెను. బ్రహ్మ యింద్రునకు లక్ష్మీ మూలమంత్రమును పదేశించెను. "ఓం శ్రీం ప్రీం క్లీం ఐం కమలవాసిన్యై స్వాహా" అనునది మూలమంత్రము. ఈ మంత్రమును జపించి కుబేరుడు పరమైశ్వరవంతుడయ్యెను. దక్షసావర్ణి జపించి రాజాధి రాజాయెను. మంగళుడు జపించి ఏడు దీవులకు పతియయ్యెను. ప్రియ వ్రతుడు ఉత్తానపాదులు కేదారుడు మహారాజులైరి. ఈ మంత్ర ప్రభావముచే రాజేంద్రులును సిద్ధులైరి. మంత్రసిద్ధిని పొందిన తరువాత లక్ష్మీదేవి దేవేంద్రునకు దివ్యదర్శన భాగ్యము నొసంగెను. దేవి వరమిచ్చుటకు రత్ననిర్మితమైన విమానము నెక్కి వచ్చెను. ఇంద్రుడు లక్ష్మీదేవిని జూచి యానందబాష్పములతో నమస్కరించెను. ఓ ముకుంద ప్రియా! మాకు జ్ఞానము ధర్మము సకలసౌభాగ్యములు ప్రభావము ప్రతాపము సర్వాధికారము లొసంగుము. తల్లీ! యుద్ధములందు పరాక్రమము విజయము పరమైశ్వర్యమును మాకు ప్రసాదింపుము అని యింద్రుడు సురగణములతో కూడి లక్ష్మీదేవిని ప్రార్థించెను. లక్ష్మి దేవతలందరకు వరములను నొసంగెను.

## స్వాహా దేవి చరిత్ర

యజ్ఞయాగాదులందు అగ్నిలో దేవతలకాహారము హవిస్సు నిచ్చునప్పుడు "స్వాహా" శబ్దముచ్చరింపబడుచుండును. అన్ని కర్మల యందు హవిస్సునిచ్చుటతో "స్వాహా"దేవి ప్రశంసనీయురాలు. కన్యా ప్రదానమందు నాందీ ముఖములో "స్వధా" దేవి ప్రముఖురాలు. దక్షిణాదేవి యెల్లకర్మలందును ప్రశంసింపదగినది. వీరి పుట్టుపూర్వోత్తరములు మహిమలు ప్రాధాన్యమును వినగోరుచున్నానని నారదుడడుగగా నారాయణుడు పురాతనమైన మరియొక కథ యిట్లు చెప్ప సాగెను. మొదటి సృష్టిలో దేవతలెల్లరు తమతమ ఆహారముకొరకు బ్రహ్మలోకమందలి బ్రహ్మకొలువు కూటమునకు వెళ్ళి తమకాహారమెట్లు లభించునని బ్రహ్మను ప్రశ్నించిరి. బ్రహ్మ దేవతల మాటలు విని శ్రీహరిని స్తుతించెను. నారదు డిట్లనెను:-

పరమాత్మ యజ్ఞస్వరూపుడు యజ్ఞమతనికళ. యజ్ఞమున బ్రాహ్మణు లిచ్చు హవిస్సును మునులు దేవతలు గ్రహింతురుగదా! అదివిని నారాయణు డిట్లనెను:- నారదా! బ్రాహ్మణులు క్షత్రియులు పరమభక్తితో హవిస్సునిచ్చెదరు కాని దానిని దేవతలు పొందుటలేదు. అందుచే దేవతలెల్లరు వెలవెలవారిన ముఖములతో

బ్రహ్మ సభకు వెళ్ళి తమకు ఆహారము లేని విషయము అతనికి తెలియజేసిరి. బ్రహ్మ ధ్యానములో అంతయు తెలిసికొని శ్రీకృష్ణ పరమాత్మను శరణుజొచ్చెను. అతని యాజ్ఞచే బ్రహ్మ మూలప్రకృతి నారాధించెను. అప్పుడు మూలప్రకృతి కళ సర్వశక్తి స్వరూపిణి, శ్యామ స్వాహా దేవి ప్రత్యక్షమయ్యెను. మరియు, ఓ బ్రహ్మ వరమడుగుము అని పలికెను. అదివిని బ్రహ్మ తొట్రుపాటుతో ఆమెకిట్లనెను.

ఓ పరమసుందరీ! నీవు అగ్నిలోని దహనశక్తివి. నీ శక్తి లేనిచో అగ్ని దహింప జాలదు. మంత్రము చివర నీనామముచ్చరించి హవిస్సు నిత్తురు. అప్పుడు దేవత లానందముతో ప్రసన్నులగుదురు. అగ్నికి సంపద లిచ్చుదానవు శ్రీరూపిణివి. గృహేశ్వరివి. అమ్మా నీవు దేవతలకు మానవులకును పూజనీయురాలవు. అను బ్రహ్మమాటలువిని ఆమె యాలోచించెను. అంతట దేవి వెంటనే తన యభిప్రాయమును బ్రహ్మ కిట్లు చెప్పెను:-

నేను చాలాకాలము వరకు శ్రీకృష్ణుని గూర్చి తపస్సు చేసెదను. కృష్ణుడు తప్ప మిగిలినదంతయు కలవంటిది. భ్రమమాత్రమే. నీవు జగములకు సృష్టికర్తవు. శంభుడు మృత్యువు (సంహారకుడు) శేషుడు విశ్వమును మోయును. సమస్త ధర్మములకు ధర్మదేవత సాక్షి. గణములన్నిటిలోను గణపతి మొదట పూజింప దగినవాడు. వీరి వలెనే ప్రకృతి కూడా శ్రీకృష్ణుని దయవలన అందరికీ పూజ నీయురాలైనది. కృష్ణ ప్రేమవలననే కృష్ణ సేవవలననే మునులు ఋషులు పూజింప దగినవారైరి. నేనును వారివలె శ్రీకృష్ణుని పాదపద్మములను నిరంతరము మనస్సులో భావించుచుందును. అని పద్మముఖియగు స్వాహాదేవి. బ్రహ్మతో పలికి విష్ణువును గూర్చి తపస్సు చేయదలచెను.

దేవి నిరామయుడగు కృష్ణుని ధ్యానించి తపస్సు ప్రారంభించెను. ఆమె ఒంటి పాదముపై నిలిచి లక్ష సంవత్సరములు తపస్సు చేసెను. అంతట ఆమె నిర్గుణుడు మిక్కిలి సుందరుడునగు శ్రీకృష్ణుని దివ్యమంగళ స్వరూపమును కన్నులార చూచెను. స్వాహాదేవి కామేశు డగు శ్రీకృష్ణుని రూపసౌందర్యములకు ముగ్ధురాల య్యెను. అప్పుడు సర్వజ్ఞుడైన పరమాత్మ ఆమె మనస్సులోని కోరికను తెలిసికొని ఆమెను లేవ దీసి తన తొడపై కూర్చొనబెట్టుకొని నీవు వరహాకల్పమున నాభార్యవు కాగలవు. దేవీ! ప్రేయసీ! నీవు నగ్నజితుని కూతురుగా పుట్టి నాగ్నజితియను పేర పిలువబడుదువు.

ఇప్పుడు మాత్రము నీవగ్నికి భార్యవు అగుము. నాదయవలన నీవు మంత్రాంగరూపవు పూజింపతగినదానవుకా గలవు. అగ్ని నిన్ను భక్తిభావముతో

గృహలక్ష్మిగా గ్రహింప గలడు. అని కృష్ణుడు స్వాహా దేవితో పలికి అంతర్ధానము చెందెను. అంత బ్రహ్మ ఆజ్ఞానుసారముగా అగ్నిసామ వేదోక్త ప్రకారము స్వాహాదేవిని ధ్యానించి పూజించెను. అగ్నిహోత్రుడు సమంత్రకముగా స్వాహాదేవిని చేపట్టి యామెతో నూరు సంవత్సరములు సుఖముగాగడిపెను. అగ్ని తేజము వలన ఆమె గర్భము ధరించెను. వారు వరుసగా దక్షిణాగ్నిగార్హ పత్యము, ఆహవనీయము అను పేర్లతో ప్రసిద్ధి నొందిరి.

అనాటి నుండియు ఋషులు, బ్రాహ్మణులు, క్షత్రియులు మొదలగువారు మంత్రములకు చివర "స్వాహా" అను పదము చేర్చి హోమము చేయసాగిరి. ప్రశస్తమైన స్వాహాంత మంత్రములతో హోమము చేసినయెడల అన్ని సిద్ధులను కలుగగలవు. విషములేని సర్పము, వేదము రాని బ్రాహ్మణుడు, పతిసేవలేని స్త్రీ, విద్యలేని పురుషుడు, కొమ్మలందు పండ్లులేని చెట్టు, చివర స్వాహాలేని మంత్రము ప్రయోజనములేనివి. స్వాహా అను మాటల చివర చేర్చకుండా మంత్రముతో హోమము చేయరాదు. చివర స్వాహా చేర్చిన మంత్రము ఫలించును. ఇది స్వాహా ఉపాఖ్యానమని నారాయణుడు నారదునకు తెలియజేసెను.

## స్వధాదేవి చరిత్రము

శ్రీనారాయణుడు నారదునకు ఉత్తమమైన స్వధోపాఖ్యానమిట్లు చెప్పెను. ఈ చరిత్ర పితృదేవతలకు తృప్తిని కలిగించునది. సృష్టికి మొదట, బ్రహ్మ యేడు పితృగణములను సృష్టించెను. వాటిలో మూడుతేజః స్వరూపములు, నాలుగు గణములు స్వరూపమును తాల్చినవి. ఈ ఏడు విధములైన గణములను మనోహర పితృగణములుగ శ్రాద్ధస్వరూపములుగ ఉండుటచూచి వాటికి శ్రాద్ధ తర్పణముల తోడనే శ్రాద్ధమాహారముగా నియమించెను. స్నాన, సంధ్యాహ్నిక కృత్యములు, తర్పణ శ్రాద్ధదేవతార్చనములు బ్రాహ్మణులు చేయదగు పనులుగా వేదములు చెప్పుచున్నవి. నిత్యము సంధ్యావందనము శ్రాద్ధ తర్పణము, భూత బలి, వేదాధ్యయనము చేయని బ్రాహ్మణుడు విషములేని పామువంటివాడు. శ్రీదేవి పూజ చేయనివారికి శ్రీహరికి నివేదింపక భుజించు వానికిని మరణపర్యంతము సూతక ముండును. అట్టివాడు అపవిత్రుడు. శుభకార్యములకు తగినవాడుకాడు. బ్రహ్మ దేవుడు శ్రాద్ధాదులను పితృదేవతల కొఱకు ఏర్పరచినాడు. కాని పితరులు బ్రాహ్మణులిచ్చు అన్నాది పదార్థములను స్వీకరించుటలేదు.

అప్పుడు పితరులు ఆకలిమంటతో వ్యాకులత చెంది బ్రహ్మ సభకు వెళ్ళి తమ బాధనంతను విన్నవించిరి. అప్పుడు బ్రహ్మ "మానస" యనే సుందరాంగిని

సృష్టించెను. ఆమె రూపయౌవన సంపన్నురాలు. చంద్రకాంతిని వెదజల్లు ముఖము కలది. ఆ దేవి విద్యావతి, గుణవతి, రత్నభూషణములను ధరించినది. విశుద్ధ-ప్రకృత్యంశ సస్మిత -వరదాయిని- శుభాంగి - స్వధ యని పిలువబడునది. లక్ష్మి లక్షణములు గలది. ఆమె పాదములందు నూరు పద్మచిహ్నాములు కలవు. బ్రహ్మ తుష్టిస్వరూప యగు స్వధాదేవిని పితృదేవతల కిచ్చెను. బ్రహ్మ స్వధాంత ముగ మంత్రముల నుచ్చరించి పితరులకు ఆహారము నీయవలెనని బ్రాహ్మణు లకు రహస్యమైన ఉపదేశము చేసెను. అట్లే బ్రాహ్మణులు పితృదేతలకు ఆహారము నిచ్చిరి. దేవతలకు స్వాహా శబ్దముచ్చరించి పితృదేవతలకు స్వధాశబ్దము చ్చరించి యు ఆహుతుల నీయవలయును.

దక్షిణాదేవి దేవపితృకార్యము లందన్నింట సుప్రశం సింపదగినది. దక్షిణలేని యజ్ఞము నిరర్ధకము. సమస్త పితృదేవతలు దేవతలు బ్రాహ్మణులు మునులు మనువులు మిక్కిలి గౌరవముతో పరమ శాంత యగు స్వధాదేవిని పూజించిను తించినారు. స్వధాదేవి యనుగ్రహముచే విప్రులు దేవతలు-పితృదేవతలు పరిపూర్ణ మనోరధులైరి. అని పలికి స్వధా స్తోత్రము నిట్లు చెప్పెను.

శ్లో॥ స్వధోచ్చారణమాత్రేణ తీర్థస్నా యీభవేన్నరః ।
ముచ్యతే సర్వపాపేభ్యో వాజపేయఫలంలభేత్ ॥
స్వధా స్వధా స్వధేత్యేవం యది వారత్రయంస్మరేత్ ।
శ్రాద్ధస్య ఫలమాప్నోతి తర్పణస్య జిలైరపి॥
శ్రాద్ధకాలే స్వధా స్తోత్రం యః శృణోతి సమాహితః ।
సలభేత్ శ్రాద్ధ సంభూతం ఫలమేవన సంశయః ॥
స్వధా స్వధా స్వధేత్యేవం త్రిసంధ్యం యః పఠేన్నరః ।
ప్రియాంవినీతాం సలభేత్ సాధ్వీం పుత్రగుణాన్వితామ్ ॥
పితౄణాం ప్రాణతుల్యాత్వం ద్విజజీవనరూపిణీ ।
శ్రాద్ధాదిష్ఠాతృ దేవీచ శ్రాద్ధాదీనాం ఫలప్రదా ॥
నిత్యాత్వం సత్యరూపాసి పుణ్యరూపాసిసువ్రతే ।
ఆవిర్భావతిరోభావౌ సృష్టౌచ ప్రళయేతవ॥
ఓం స్వస్తిశ్చ నమః స్వాహా స్వధా త్వం దక్షిణాతథా ।
నిరూపితాశ్చతుర్వేదైః ప్రశస్తాః కర్మిణాం పునః ॥
కర్మ పూర్వ్యర్థమే వైతా ఈశ్వరేణ వినిర్మితాః ।
ఇత్యేవ ముక్త్వా సబ్రహ్మ బ్రహ్మలోకే స్వసంసది ॥

తస్మాచ సహసాసద్యః స్వధాసాఽఽవిర్బభూవహి ।
తథా పితృభ్యః ప్రదదౌ తామేవకమలాననామ్ ॥
తాం సంప్రాప్యయయుస్తేచ పితరశ్చ ప్రహర్షితాః ।
స్వధా స్తోత్ర మిదంపుణ్యంయః శృణోతి సమాహితః ॥
సుస్నాతః సర్వతీర్థేషు వాంఛితం ఫలమాప్నుయాత్ ॥

**స్తోత్రభావము:-** ఈ స్వధా స్తోత్రము మొదట బ్రహ్మ నోటినుండి వెలువడెను. అది మానవుల కోరికలు తీర్చగలదు. "స్వధ" అను మాట ఉచ్చరించినంతనే మానవుడు తీర్థస్నానము చేసిన పుణ్యమును పొందగలడు. అతనికి వాజపేయ యాగము చేసిన ఫలము లభించును. ఓం స్వధా - స్వధా - స్వధా యని మూడు మార్లు పలికినచో శ్రాద్ధఫలము- బలి - తర్పణముల ఫలము సిద్ధించును. శ్రాద్ధకాలమున నియమముతో స్వధాస్తోత్రము వినువానికి శ్రాద్ధ - ఫలము తప్పక కల్గును. ఓం స్వధా - స్వధా - స్వధా యని మూడు సంధ్యలయందును మ్మారు పలుకువానికి వినయము కలిగిన సాధుశీల సంతానవతియగు చక్కని భార్య లభించును. స్వధాదేవి పితరులకు ప్రాణసమాన. బ్రాహ్మణులకు జీవన స్వరూపము. శ్రాద్ధముల ఫలములొసగుదేవి. శ్రాద్ధముల కధిష్ఠానదేవి. నిత్యసత్య స్వరూప. పుణ్యరూప సువ్రత. సృష్టియందావిర్భావము ప్రళయమందు తిరోభావ ముగల దేవి అన్నియు నీవే.

తల్లీ! ఓం స్వస్తి నీవు స్వాహా స్వధా దక్షిణాదేవివి. నీకు నమస్కారములు నాల్గువేదములందలి కర్మకాండలలో నీవే నిరూపింపబడితివి. అట్టి కర్మకాండ పూర్తికొరకు ఈశ్వరుడు స్వధాదేవిని సృష్టించెను. అవి బ్రహ్మ అంతయును తన సభలో అందరికీ చాటిచెప్పెను. అంతలోనే స్వధాదేవి ప్రత్యక్షమయ్యెను. బ్రహ్మ దేవుడామెను పితృదేవతలకు సమర్పించెను. పితరులు స్వధను పొంది సంతో షించిన మనస్సు కలవారైరి. ఈ స్వధా స్తోత్రమును విశ్చల మనస్సుతో వినువాడు సకలతీర్థములందు స్నానము చేసినవాడగును. అతని కోరికతీరును.

# దక్షిణాదేవి చరిత్రము

శ్రీ నారాయణుడు స్వాహా స్వధా దేవుల ప్రశస్తము మధురమునైన చరిత్రను చెప్పి దక్షిణాదేవి చరిత్రనిట్లు చెప్పదొడగెను. పూర్వము గోలోక మందు సుశీలయనే గోపికకలదు. ఆమె శ్రీహరికి అత్యంత ప్రియురాలు. రాధకు స్నేహితురాలు ధన్యురాలు మాన్యురాలు అందగత్తెయు. రూప విద్యాగుణవతియైన యువతి. చిరునవ్వుతో ప్రసన్నురాలు సర్వాలంకార భూషిత శ్రీకృష్ణుని ప్రియభామిని.

రసికురాలు ఆ సుశీల ఒకప్పుడు రాధ చూచుండగా శ్రీకృష్ణుని యెడమ భాగమున నిలుచుండెను. అప్పుడు గోపికలందరిలో అన్నిటియందు వందె వేసిన చేయియగు రాధ తన కన్నులయెదుట నుండుట చూచి భయముతో శ్రీకృష్ణుడు తలవంచు కొనెను. రాధ రక్తవదన - కమలనయన - కంపితాంగి తడబడు పెదవులు గలదై అంతయునెరిగి ఆ ప్రదేశమును వదలి వెళ్ళిపోయెను. అది చూచి శ్రీకృష్ణుడు అంతర్ధానమయ్యెను. సత్యమూర్తి - పరమశాంతుడు - కాంతుడునైన కృష్ణుడట్లు మాయమగుట చూచి అచట నున్న సుశీల మొదలగు గోపికలు కూడ గడగడ లాడిరి.

అప్పుడు కోట్లకొలది గోపికలు కృష్ణునకు భయభక్తులతో చేతులెత్తి నమస్కరించిరి. వారందరును రక్షింపుము రక్షింపుము అని శ్రీదేవికి శరణాగతులైరి. వారు భయకంపితలై రాజరాజేశ్వరిని శరణుజొచ్చిరి. అప్పుడు సుదా మాదులును భయపడినవారై శ్రీదేవి చరణకమలములు శరణుజొచ్చిరి. శ్రీకృష్ణుడు కనిపించకుండుట సుశీల పరుగెత్తిపోవుట తెలిసికొని రాధ గోపికనిట్లు శపించెను. ఈనాటి నుండి నీవు గోలోకమునకాలు పెట్టినచో భస్మమైపోదువు గాక అని శపించెను. ఇట్లు సుశీలను శపించి దేవదేవేశ్వరి రాసేశ్వరి యగు రాధ రాసమధ్యమునకు రాసేశుని రమ్మని పిలిచెను. కాని శ్రీకృష్ణుడు రాధ ముందు కనిపించలేదు.

అప్పుడామె ఒక్క క్షణమును కోట్లయుగములుగా తలచి కలత చెందెను. అప్పుడామె తన మనస్సులో నిట్లు తలచెను. కృష్ణ! ప్రాణనా యకా! ప్రాణాధిక ప్రియా! నా ప్రాణాధిష్ఠాన దేవా! వేవేగరమ్ము నిన్ను చూడక ప్రాణములు నిముసమైన నిలువజాలవు. తన భర్త సౌభాగ్యముచేతనే స్త్రీ యభిమానము దినదినము పెరుగుచుండును. సకలసౌఖ్యములు కలుగును. కనుక స్త్రీ తాను ధర్మపూర్వకముగ పతిసేవను చేయవలయును. కులయువతులకు కలకాలము పతియే ప్రాణ బంధువు. ఆదిదేవుడు భోగములను కల్పించువాడు. పతియే సతులకు ధర్మము, సుఖము, మానము నిచ్చువాడు, గర్వమణచువాడు, గౌరవము పెంచువాడును. భర్తకంటె ప్రియమైనవాడు భార్యకు మరియొకడు లేడు. ఉత్తమకులమందు పుట్టని ఆడుది, తన భర్త మహిమ నెరుగజాలదు.

తీర్థములలో స్నానము చేయుట, యజ్ఞములు చేయుట మొదలగు పుణ్య కార్యములన్నియు స్త్రీకి తన పతిసేవలో పదునారవవంతుకు కూడ సాటిరావు. కులసతికి పతియే గురువు. నేను సకల బ్రహ్మాండ గోళములకు ఈశ్వరినైనను నాకాంతుని గూర్చి యించుకంతయును యెరుగనైతిని. స్త్రీ స్వభావమ తిక్రమింప

రానిది. అని రాధికాదేవి భక్తిమీర శ్రీకృష్ణుని తన మనస్సులో ధ్యానించినది. నాథా! ప్రాణప్రియా! అని ఆమె పలుమార్లు ప్రేమతో మిక్కిలి దుఃఖించినది. మనోరమణా! నీ యెడబాటు సహింపలేక దుఃఖించు చున్నాను. వేగమేవచ్చి దర్శనమిమ్ము అని రాధ పలుకుచుండగనే దక్షిణాదేవి గోలోకము నుండి పదచ్యుతురాలయ్యెను. ఆమె చాల సంవత్సరములు ఉగ్రతపమాచరించి పిమ్మట లక్ష్మి శరీరములో ప్రవేశించెను. పిమ్మట దేవతలందరు దుష్కరమైన యజ్ఞములు చేసిరి. కాని వారు ఆయజ్ఞముల ఫలమును అనుభవింప లేకుండిరి.

అప్పుడు వారు వ్యాకులమైన మనస్సులతో బ్రహ్మవద్దకు వెళ్ళిరి. బ్రహ్మ వారి విన్నపము నాలకించెను. బ్రహ్మ కొంతకాలము తన మనస్సులో శ్రీహరిని భక్తితో ధ్యానించి సమాధానమును పొందెను. దాని ఫలితముగ నారాయణుడు మహాలక్ష్మి శరీరము నుండి దక్షిణాదేవిని పుట్టించి యామెను బ్రహ్మకు సమర్పించెను. బ్రహ్మకూడ యజ్ఞకర్మ పూర్తికి యజ్ఞమూర్తికి ఆమెను సమర్పించెను. యజ్ఞభగవానుడు దక్షిణను పూజించి ప్రసన్నురాలను చేసెను. దక్షిణాదేవి బంగారు వన్నెగలది. కోటిచంద్రుల కాంతిగలది. ఆమె అందాలరాశి. కామబాణములచే పీడింపబడిన దక్షిణాదేవిని చూచి యజ్ఞ భగవానుడు మూర్ఛిల్లెను. దక్షిణను యజ్ఞ భగవానుడు తన భార్యగా చేసికొనెను. పన్నెండు సంవత్సరములు గర్భము ధరించి యొక సుపుత్రుని ప్రసవించెను. ఆ పుత్రునిపేరు "ఫలము" అతడు కర్మలను పూర్తిచేసిన వారికి ఫలముల నిచ్చుచుండును. యజ్ఞుడు దక్షిణా పత్నితో పుత్రఫలముతో కర్మిష్ఠులకు ఫలము లొసంగుచుండును.

అప్పుడు దేవతలెల్లరు సంతోషించి తమ నివాసములకు పోయిరి. కర్తయగు వాడు తన కార్య పూర్తియైన వెంటనే బ్రాహ్మణులకు దక్షిణలీయవలయును. అప్పటికప్పుడే కర్తకు ఫలము సిద్ధించును. దైవికముగాకాని తెలియకకాని దక్షిణ నిచ్చుటలో ఆలస్యము జరిగినచో ఫలము రెండింతలు వ్యర్థమగును. దక్షిణ అసలే యీయనిచో అతని పుణ్యమంతయు బూడిదలో పన్నీరగును. అతడిచ్చు తర్పణములను పితరులు స్వీకరింపరు. అని చెప్పి యజ్ఞపురుషుడు దక్షిణాదేవి నిట్లు స్తుతించెనని పల్కెను.

## షష్ఠీదేవి చరిత్ర

నారదుడు దేవీ చరిత్రలలో షష్ఠీ- మంగళ చండిక- మనస అనువారల చరిత్రలు వినగోరుచున్నానని అడుగగా నారాయణుడిట్లనెను. ప్రకృతిలోని ఆరవ

యంశమగు దేవిని షష్ఠీదేవి యందురు. ఆమె బాలాధిష్ఠానదేవి- విష్ణుమాయ- పుత్రదాయిని. ఆమె మాతృకలందు దేవసేనగా ప్రసిద్ధినొందెను. ఆమె కుమార స్వామి భార్య. బాలురకు ఆయువు నిచ్చు తల్లి. ఆమె చరిత్రను వినుమని నారాయ ణునిడిట్లు చెప్పెను.

పూర్వము స్వాయంభువమను పుత్రుడు ప్రియవ్రతుడు యోగియై చిరకాలము తపమొనర్చెను. తరువాత బ్రహ్మ యాజ్ఞచే అతడు వివాహము చేసికొనెను. చాల సంవత్సరములు సంతతి కలుగకపోగా కశ్యపపుత్రుడతనిచే పుత్రకామేష్టి జరిపిం చెను. అతని భార్య మాలినికి యాగచరువు తినిపించగా గర్భవతియై పన్నెండేళ్ళు గర్భము మోసెను. చివరకు సుందరుడైన పుత్రుడు కలిగెను. కాని ఆతడు మృతుడై గ్రుడ్లుతేల వేసియుండెను. ఆ శిశువు మరణించెనని బంధువు లేడ్వసాగిరి. తల్లి పుత్రశోకముచే మూర్ఛిల్లెను. రాజు చచ్చిన శిశువును చూచి తానును చావసిద్ధ పడెను. అంతలో దివ్యవిమానమొకటి కనబడెను. రాజు దాని యందొక దేవిని దర్శించెను. ఆమె నిండుజవ్వని. రాజు తన బాలుని వదలి యామెను పూజించి సంతోషపరచెను.

పిమ్మట నీవెవ్వతవని ప్రశ్నించెను. దేవసేన యను పేరుగల యామె యిట్ల నెను. నేను బ్రహ్మమానస కన్యను. కుమారస్వామి భార్యను. నన్ను షష్ఠీదేవి యందురు. నేను సంతతి లేనివారికి సంతానము నిత్తును. కర్మమూలమున సుఖదుఃఖములు కలుగుచుండును. అని పలికి బాలుని బ్రతికించెను. కాని యా బాలుని తీసికొని స్వర్గమునకు పోయెను. పోవునప్పుడు రాజా! నాకు పూజలు చేసినచో కులదీపకుడైన పుత్రుని ప్రసాదింతుననెను. రాజు షష్ఠీదేవి పూజలు చేయుచు చేయించుచుండెను. ఈమె యనుగ్రహముచే ప్రియవ్రతుడు పుత్రుని కనెను.

# మంగళ చండీదేవి చరిత్ర

శ్రీనారాయణుడు నారదునకు మంగళ చండీదేవి చరిత్ర నిట్లు చెప్పెను:- మంగళమనగా శుభము, చండీయనగా కోప స్వభావురాలు, భక్తులకు శుభము లొసగుచు దుష్టులపై కోపము చూపునది గనుక మంగళ చండిక యను పేరు గాంచినది. మరియు మంగళుడనురాజు పూజించిన దేవత యగుట వలన కూడ 'మంగళ చండిక' యను పేరేర్పడినదనియు నందురు. ఈ మంగళచండిక మూలప్రకృతియగు దుర్గాదేవి మారు రూపమే. ఈమె స్త్రీల పాలిట కల్పవృక్షము, ప్రత్యక్షదైవము, దయామూర్తి. పరాత్పరయగు నామెను మొదటగా శివుడు త్రిపురములను సంహరించు సమయమున విష్ణువు ప్రేరేపించగా పూజించెను.

ఒకప్పుడు త్రిపురాసురుడు శివుని విమానమును ఆకాశమునుండి క్రిందికి పడవేసెను. అట్టి సంకట సమయమున బ్రహ్మ, శివునకు మంగళ చండిని గూర్చి తెలియజేసెను. అప్పుడు శివుడు బ్రహ్మ విష్ణువుల యాదేశము ప్రకారము దుర్గను స్తోత్రము చేసెను. ఆమెయే మారు రూపమున మంగళచండి యయ్యెను. ఆమె శివునితో నీవు భయపడ వలదని ప్రత్యక్షముగా చెప్పెను. సర్వేశ్వరుడగు విష్ణువు నీకు వృషభ వాహనముకా గలడు. నేను తప్పక యుద్ధ శక్తి స్వరూపిణినై నీకు అండగా నిలిచెదను.

శివా! నీవపుడు నాసాయమున విష్ణుమూర్తి యొక్క సహాయము నను ఆ రాక్షసుని జయింపగలవు. దేవతలను వారి పదవులనుండి తొలగించిన యా రాక్షసుని సంహారింపుము. అని శివునితో పలికి దేవి అంతర్ధానము చెందెను. శివుడు విష్ణువు ఇచ్చిన యస్త్రముతో ఆ రాక్షసుని సంహరించెను. రాక్షసుడు మరణించగా దేవతలెల్లరు మహర్షులును భక్తితో తలలు వంచి శంకరభగవానుని స్తోత్రము చేసిరి. వెంటనే శివుని తలపై దేవతలు పూలవాన కురిపించిరి. బ్రహ్మ విష్ణువులిరువురును శివునకు శుభాశీస్సులొసగిరి. బ్రహ్మ విష్ణువుల ఆదేశముచే స్నానము చేసి శివుడు భక్తితో మంగళచండికను పూజించెను. అర్ఘ్యపాద్యాదులను వస్త్రములను శివుడు దేవికి సమర్పించెను. పుష్పచందనము లతో పలువిధములైన నైవేద్యములతో పూలదండలతో పాయసముతో పిండివంటలతో తేనెతో పలు విధములైన పండ్లతో సంగీత నృత్యవాద్యములతో నామ సంకీర్తన మహోత్సవము లతో మధ్యాహ్న సమయమున ధ్యానించి శివుడు భక్తితో మంగళచండికను సంతోషపెట్టెను. శివుడు మూలమంత్రముతో పూజా ద్రవ్యములను దేవికి సమర్పించెను.

**మూలమంత్రము**-"ఓం ఐం హ్రీం శ్రీం క్లీం సర్వపూజ్యేదేవి మంగళచండికే హుం హుం ఫట్ స్వాహా" ఇది యిరువదియొక్క అక్షరములు గల మహామంత్రము. భక్తులకు కోరిన ఫలములనిచ్చుటలో కల్పవృక్షము - చింతామణి - కామధేనువు మున్నగువానిని మించినది. దీనివలన సిద్ధింపనిది లేదు. ఈ మంత్రమును పది లక్షలు జపించినచో తప్పక మంత్రము సిద్ధించును. ఈ దేవీ ధ్యానము వేదోక్తము. అన్ని శాస్త్రములకును సమ్మతమైనది.

**ధ్యానము** : దేవీం షోడశవర్షీయాం శశ్వత్ సుస్థిర యౌవనాం
బింబోష్ఠీం సుదతీం శుద్ధాం శరత్పద్మ నిభాననాం

శ్వేత చంపకవర్ణాభాం సునీలోత్పలలోచనాం
జగద్ధాత్రీంచ దాత్రీంచ సర్వేభ్యః సర్వసంపదాం
సంసార సాగరేఘోరే జ్యోతీ రూపాం సదాభజే
దేవ్యాశ్చ ధ్యానమిత్యేవం స్తవనం శ్రూయతాంమునే

**స్తోత్రభావము:-** ఆ దేవి పదునారు కళలతో నిండిన చంద్రునివలె నుండుటయే గాక పదునారు సంవత్సరముల వయసున్నదానివలె నుండును. మానవుల యౌవనమువలె నామె యౌవనము పోవునది-గతించునది కాదు. ఎంతకాలము గడచినను ఎన్నియుగములు మన్వంతరములు-సృష్టివిశేషములు గడచినను ఆమె పదునారు సంవత్సరముల నిండుజవ్వనము కలిగి యుండును. అందువలననే శాశ్వత సుస్థిరయౌవన. ఆమె పెదవులు దొండపండ్లవలె నెఱ్ఱగా మనోహరములై యుండును. ఆమెదంతములు చాల చక్కనివిగా నుండును. అనగా నామె పలు వరుస పక్వబింబము వంటిది. అనగా పక్వబింబమువలె పరిపక్వ వాక్యములనే పలుకును. అట్లు చెప్పుటయు మిక్కిలి మనోహరముగ నుండును. ఉద్రేకమును కలిగించు యౌవన పరిపూర్ణత యున్నను ఆమె శుద్ధ నిర్వికార. ఎట్టి మాలిన్యములేని పరిశుద్ధురాలు. అన్ని ఋతువులలో శరదృతువు ఉత్తమము. శీతోష్ణములు సమములై దిశలు ప్రసన్నములై రాజులు జైత్రయాత్ర చేయదగిన కాలమిది. అట్లే ఆ దేవి యనుగ్రహకాలము సర్వేంద్రియ జైత్రయాత్రాసమయము. అట్టి శరత్కాల మందలి పద్మము మాత్రమే సాటియగు పద్మమువంటి సర్వకళాపూర్ణ మనోహర మగు ఆననము - ముఖము కలిగినది. పద్యతే - అత్రలక్ష్మీః - అనగా నిచట లక్ష్మి పొందబడును అని యర్థము.

అనగా లక్ష్మీప్రదమగు ఆననము కలిగినది. అనితి- శ్వసతి -అనేన - ఆననం - అన-ప్రాణనే - దీనివలన బ్రదుకుదురు. ఆననమనగా బ్రదికించునది-ముఖము- అని యర్థము. శరత్కాలమందలి-సర్వకళాప్రపూర్ణమైన లక్ష్మీప్రాప్తి హేతువైన జీవన కారణమైన ముఖము. దర్శనము-మాటలు కలదియని భావము. దేవి - శ్వేత చంపకవర్ణాభ అనగా తెల్లని చంపకపుష్పమువంటి శరీర కాంతితో ప్రకాశించునది. చమ్యతే అళిభిరితిచంపకః తుమ్మెదలచే సేవింపబడునది. (సువాసనాదుల వలన) దేవియును భక్తులను తుమ్మెదలచే సేవింపబడునది. శ్రేష్ఠములగు నల్లకలువల వంటి నేత్రములు కలది. నల్లకలువల వలె సుందరములైన కన్నులు - కాటుకగల నేత్రములకు ప్రతీకలు. నల్లని కాటుకనూ యా సౌందర్యములకు సూచకము. ఇట్టి నల్లకలువలవంటి మనోహరనయనదేవి. జగములన్నిటిని ధరించునది. ధాత్రి అనగా- దాది - పోషించునది-కావున జగన్మాత ప్రపంచములను పోషించునట్టి

కరుణాపర. అందరకును అన్ని సంపదలను యిచ్చునట్టిది. సముద్రమున ప్రయాణించువారు - తీరమునందలి దీప స్తంభముల యందలి దీపకాంతిని గమనించి తమ తమ నౌకల గమనమును నిర్ణయించుకొందురు. అనగా ఆ దీపము వారికి అట్టి శక్తిని ప్రసాదించు నన్నమాట. దేవియును భీకర సంసారసాగర మున చిక్కి ప్రయాణించు యాత్రికభక్తులకు భక్తయాత్రికులకు-తీరమును చేరు విధానమును మార్గమును సూచించు జ్యోతీరూప. ద్యోతతే యితి జ్యోతిః ప్రకా శించునది - జ్యోతిస్ - అనగా - నక్షత్రము - తేజస్సు, చూపు - అని యర్థములు. ఈ పదములయందలి యంతరార్థమును - సూక్ష్మదృష్టితో పరిశీలించినచో శ్రీసూక్త మంత్రములచే ప్రతిపాదింపబడిన - శ్రీదేవీరూపమహిమ గోచరించును. పదములను బట్టి వచ్చిన సామాన్యార్థము. శ్రీదేవి బాహ్య రూప మును సూచింపగా నంతరార్థము వేదాది సమ్మతమగు శ్రీదేవీ - మహిమను సూచించును. మహా దేవుడు - సర్వజ్ఞుడు. సర్వశాస్త్ర నిర్మాత - అట్టివాడు చేసిన స్తుతియిది.

క్రింది శ్లోకములను స్తుతితో కలిపి మంగళ వారము నుండి మంగళ వారము వరకు చదివిన-దేవిని పూజించిన సద్యః ఫలము కలుగును.

ప్రథమే పూజితా దేవీ శివేన సర్వమంగళా
ద్వితీయే పూజితాసా చ మంగళేన గ్రహేణ చ
తృతీయే పూజితాభద్రా మంగళేన నృపేణచ
చతుర్థే మంగళే సుందరీభిః ప్రపూజితా
పంచమే మంగళాకాంక్షిన రైర్మంగళ
చండికా పూజితా ప్రతివిశ్వేషు విశ్వేశ పూజితాసదా
తతః సర్వత్ర సంపూజ్యాబభూవ పరమేశ్వరీ
దేవైశ్చమునిభిశ్చైవ మానవైర్మనుభిర్మనే
దేవ్యాశ్చమంగళస్తోత్రం యఃశృణోతిసమాహితః
తన్మంగళం భవేత్త స్యనభవేత్తద మంగళమే
వర్ధతే పుత్రపౌత్రైశ్చ మంగళంచ దినేదినే.

మరియొక విశేషము. మహాదేవుడు మొదటగా శ్రీదేవిని యీ స్తుతితో నర్చించెను. ప్రతిమంగళవారమును అర్చించెను. తరువాత మంగళుడు - కుజుడు -తరువాత-మంగళుడనురాజు- సుందరసువాసినులు, మంగళమును కోరిన నరులు, ప్రతివిశ్వమునందును విశ్వేశ్వరులు - ప్రతి మంగళవారమును - అర్చించి - సర్వ భద్రములను సర్వమంగళములను పొందిరి. శ్రీదేవియు ప్రతి మంగళవార

పూజచే - సర్వజీవులకు దేవులకును సర్వమంగళముల నిచ్చుటచే సర్వమంగళ అయ్యెను. దేవతలు మునులు మానవులు మనువులు అందరును పరమేశ్వరియగు శ్రీదేవిని సేవించి తరించిరి.

రక్షరక్ష జగన్మాతః దేవి మంగళ చండికే ।
హారికే విపదాంరాశేర్హర్ష మంగళకారికే ॥
హర్ష మంగళ దక్షే చ హర్ష మంగళదాయికే ।
శుభే మంగళ దక్షే చ శుభే మంగళచండికే ॥
మంగళే మంగళార్హేచ సర్వమంగళ మంగళే ।
సతాం మంగళదే దేవి! సర్వేషాం మంగళాలయే ॥
పూజ్యే మంగళవారేచ మంగళా భీష్టదేవతే ।
పూజ్యే మంగళ భూపస్య మనువంశస్యసంతతమ్ ॥
మంగళాధిష్ఠాత్రు దేవి మంగళానాంచ మంగళే ।
సంసారమంగళాధారే ! మోక్ష మంగళదాయిని॥
సారేచ మంగళాధారే! పారే సర్వస్యకర్మణామ్ ।
ప్రతి మంగళ వారేచ పూజ్యే సర్వసుఖప్రదే ॥

**స్తోత్రభావము**:- ఓ జగన్మాతా! మంగళదాయినీ! ఆనందకారిణీ! ఆపదలు బాపు తల్లీ! దేవి! మంగళచండికా! నన్ను రక్షించుము. ఆనంద మంగళదాయినీ! ఆనంద మంగళ ప్రవీణా! శుభమంగళ పరాయణా! శుభా! మంగళ చండికా! తల్లీ! మంగళా దేవీ! మంగళయోగ్యా! సర్వమంగళ మంగళా! సాధుజనులకు శుభము లొసగు జననీ! శుభమంగళనిలయా! మంగళవారపూజ్యా! మంగళాభీష్టదా! మను వంశమున జన్మించిన మంగళరాజుచే పూజలందుకొనిన తల్లీ! ఓ హోమాధిష్ఠాన దేవీ! మంగళ మంగళా! సంసార మంగళాధారిణీ! ముక్తి మంగళ దాయినీ! మంగళకారిణీ! మంగళాధారా! సర్వకర్మలకు పరాకాష్ఠయైనదానా! ప్రతి మంగళవారమున పూజింప బడుదానా! మంగళ సుఖప్రదా! నీకు నమస్కారము. నన్ను ప్రోవుము. ఈ స్తోత్రముతో శివుడు మంగళచండికను స్తుతించెను. ప్రతిమంగళ వారము నను మంగళచండికను శివుడు పూజించెను. అటు పిమ్మట మంగళుడను రాజు భద్రప్రద యగు మంగళదేవిని పూజించెను. పిమ్మట మంగళుడు అనగా కుజుడు మంగళ చండికను పూజించెను. పిమ్మట ప్రతి విశ్వము నందు శివునిచే పూజింపబడిన మంగళను దేవి ముని, మను, నరులు పూజించినారు. ఈ మంగళాదేవి స్తోత్రమును నిశ్చల మనస్సుతో వినువాడు శుభములను పొందగలడు. అతనికి అమంగళ మెన్నడును కలుగదు.

# మానసాదేవి చరిత్ర

ఇట్లు మంగళ చండికను గూర్చి చెప్పి నారాయణుడు నారదునకు "మానసా దేవి" చరిత్రను ఈవిధముగా తెలిపెను:- మానసాదేవి కశ్యపమహర్షి యొక్క మనస్సంకల్పముచే పుట్టినది. ఆమె తన మనస్సువలననే క్రీడించ గలదగుటవలన మానసాదేవి యని ప్రసిద్ధిని పొందెను. ఆమె తన మనస్సుతో పరమేశ్వరుని ధ్యానించును. పరమయోగములో మునిగిపోవును. కనుక ఆమె మానసాదేవి యయ్యెను. ఆమె ఆత్మారామ వైష్ణవి. సిద్ధయోగిని కృష్ణపరమాత్మని గూర్చి మూడు యుగములు తపస్సు చేసెను. తపస్సువలన ఆమె శరీరము కృశించుట వలన కృష్ణపరమాత్మ ఆమెకు "జరత్కారువు"అను పేరుపెట్టెను. శ్రీకృష్ణుడామె కోర్కెను దయతో తీర్చి యామెను పూజించి ఆమెకు కీర్తి కలిగించెను. ఆమెను బ్రహ్మలోక నాగలోక స్వర్గలోక భూలోకవాసులెల్లరు పూజించిరి. ఆమె లావణ్యవతి అతి మనోహర. సర్వజగములకు తల్లి గౌరి. జగములచే పూజింపబడుట వలన ఆమె జగద్గేయయ్యెను.

శివునిశిష్యురాలగుటచే "శైవి" విష్ణుభక్తు రాలగుటచే "వైష్ణవి" యని ప్రసిద్ధికెక్కినది. జనమేజయుని సర్పయాగమున ఆమె నాగులను కాపాడినది గనుక "నాగేశ్వరి" "నాగభగిని" యన విలసిల్లెను. విషము హరించుటలో నేర్పరి కనుక ఆమెను "విషహరి" యని కూడ పిలిచెదరు. ఆమె శివునినుండి సిద్ధ యోగమును పొందుటవలన సిద్ధయోగినిగ పేరుపొందెను. పండితులామెను 'మహా జ్ఞానయుత' యందురు. ఆమె తపస్విని అస్తీకము నీంద్రుని తల్లియు. లోకములో అస్తీకమాత యనికూడ నామెకు వ్యవహారము ఏర్పడినది. మహాత్మ డగు జరత్కారు మహామునికామె ప్రియురాలు. జగద్గౌరి. మానస సిద్ధ యోగిని-వైష్ణవి-నాగభగిని-శైవి- నాగేశ్వరి- జరత్కారు ప్రియ- అస్తీకమాత- విషహర -మహా జ్ఞానయుత- విశ్వపూజిత దేవి. అనే ఈ పన్నెండు పేర్లు పూజా సమయమున చదువవలెను. అట్లు చదివినవారికి నాగభ యము కలుగదు. అతని వంశము తామర తంపరగ వర్ధిల్లును. శయనించునప్పుడుగాని పాముున్న యింటిలోగాని వీటిని చదివినచో సర్పభయము కలుగదు. వీటిని నిత్యము చదువు వానిని చూచి పాములు పారి పోవును ఈ స్తోత్రమును పదిలక్షలు జపముచేసిన వాడు చివరకు మహావిష్ణువు సన్నిధిలో ఆనందించుచు నుండగలడు.

మానసాదేవిని గూర్చి యింకను నేను విన్న పుణ్యచరిత్రను చెప్పెదనని నారాయణుడు ఇట్లు చెప్పెను:- పూర్వము భూలోకవాసులు నాగభయ ముతో

పీడింపబడి కశ్యపమునిని శరణుజొచ్చిరి. అప్పుడు కశ్యపుడు బ్రహ్మ సాయముతో వేదబీజాక్షరములతో మంత్రములను సృష్టించెను. తరువాత కశ్యపుడు సర్వ మంత్రానుష్ఠానదేవిని తన మనస్సు నుండి సృష్టిచేసెను. మనస్సు నుండి పుట్టి నందున ఆమెను మానసాదేవి యందురు. ఆమె కైలాసమునకు వెళ్ళి శంకరుని భక్తితో పూజించి యతని అనుగ్రహమునకు పాత్రురాలాయెను. వేయి సంవత్స రములు శివుని కొలిచినది. శంకరుడామె సేవలకు ప్రసన్ను డయ్యెను. శివుడామెకు జ్ఞానోదయము కలిగించి సామవేదము చెప్పి కల్పవృక్షము వంటి కృష్ణమంత్రము ఉపదేశించెను.

"ఓం హ్రీం కృష్ణాయ స్వాహా" అనున శ్రీకృష్ణ మహామంత్రము. త్రైలోక్య మంగళ కవచమును పూజాక్రమమును మానసాదేవికి వివరించి చెప్పెను. పురశ్చరణ విధానము గూడ తెలియజేసెను. ఈ విధముగా ముని కుమార్తెయగు మానస శివుని నుండి మంత్రమును పొందెను. పిమ్మట ఆమె శంకరుననుమతితో పుష్కరతీర్థము చేరెను. అచట మూడు యుగములు కృష్ణుని గూర్చి ఆమె తపస్సు చేసెను. శ్రీకృష్ణుని దర్శనభాగ్య మామెకబ్బినది. కృశించిన యాముని బాలను శ్రీకృష్ణుడు స్వయముగా పూజించెను. నీవులోకములందు పూజనీయు రాలవగుదు వని శ్రీకృష్ణుడామెకు వరమిచ్చెను. మానసకు అట్లు వరములొసగి శ్రీకృష్ణుడం తీర్ధానమయ్యెను. కనుక మానసాదేవిని మొదట కృష్ణుడు పిమ్మట శంకరుడు తరువాత కశ్యపుడు మనువునాగులు మనుజులు పూజించిరి. జరత్కారు వను యోగి ఆమెను వివాహమాడెను.

ఒకనాడు జరత్కారు భార్యతొడపై తలనుంచి నిద్రించెను. సూర్యాస్తమ యము కావచ్చుటచే ఆమె సంధ్యావందనమునకై భర్తనులేపెను. ముని మేల్కొని నిద్రాసుఖమునకు భంగము కలిగినదని కోపించి భర్తసుఖమును పాడుచేసిన స్త్రీ అనేకానర్థములు పొందుననుచుండగా మానస మీకు సంధ్యావందన లోపము కాకూడదని మేల్కొలిపితిననగా జరత్కారువు సూర్యుని శపింప బూనెను. అప్పుడు సూర్యుడు మునివద్దకు వచ్చి తనను శపింపవలదని ప్రార్థించుచు మానస సాధ్వి ఆమె దోషమేమియులేదని విన్నవించగా ముని సంతోషించెను. సూర్యుడు బ్రాహ్మణానుమతితో వెడలిపోయెను. ముని తన ప్రతిజ్ఞకై భార్యను విడిచి పెట్టెను. ఆమె దుఃఖించుటను చూచి ముని మనసు బాధపడెను. అప్పుడు మానస శివుని, తండ్రి కశ్యపుని, బ్రహ్మను, హరిని స్మరించినది. వారందరును భార్యను వదలవల దనియు ఒకవేళ వదలుటయే నిశ్చయమైనచో సంతానము కలిగిన పిదప

విడిచిపెట్టుమని మహర్షితో ననగా మహర్షి మానసను తాకి నీకు సుపుత్రుడు పుట్టునని యాశీర్వదించెను. భర్త తనను విడిచిపెట్టినను. తాను తలచినప్పుడు సాక్షాత్కరింపవలెనని మానస కోరెను. సర్పయాగ సమయమున తక్షకుడు భయపడి దేవేంద్రు నాశ్రయించెను ఇది తెలిసి బ్రాహ్మణులు ఇంద్రునితో సహా తక్షకుని హోమము చేయతలపెట్టగా అప్పుడు ఆ యాపదను తొలగించుకొనుటకు మానసాదేవిని ఇంద్రుడు ఈ విధముగా స్తోత్రము చేసెను.

# సురభి వృత్తాంతము

నారదుడు సురభి వృత్తాంతము తెలుపుమనగా నారాయణుడిట్లనెను. సురభి గోవులకధిష్ఠాన దేవత, గోమాత, మొదటి గోవు. గోవులలో ప్రధానురాల గోలోకమున జన్మించినది. పూర్వము రాధికాలోలుడు. తన్ను గోపికలు చుట్టు చేరికొలువగా రాధను గూడి గోలోకమున కేగెను. అచట తిరుగుచుండగా నతనికి పాలు త్రాగవలెనని కోరిక కలిగెను. అతడు తన ఎడమవైపున నుండి సురభిని విలాసముగా సృష్టించెను. దాని వెంట దూడగలదు. దాని పేరు మనోరథ. శ్రీదాముడు దూడగల పాడియావును జూచి క్రొత్త కడవలో పాలు పితికెను. ఆ పాలు జన్మ మృత్యుజరా పాపములను పోగొట్టునవి. అమృతకంటె తియ్యనివి. ఆక్షీరమును గోపాలుడు స్వయముగా త్రాగెను. తరువాత మిగిలిన పాలు గలకడవ పగిలెను. అప్పుడచట పాలచెరు వేర్పడెను. ఆ సరోవరము రాధాకృష్ణులకు క్రీడా సరస్సుగ విరాజిల్లెను. దానికి రత్నాల మెట్లు నిర్మింపబడెను.

శ్రీకృష్ణుని సంకల్పముతో అక్కడలెక్కలేనన్ని కామధేవునులు జన్మించెను. వెంటనే సురభి రోమకూపముల నుండి గోపాలురు జన్మించిరి. ఆవు దూడలు లెక్కలేనన్ని జన్మించినవి. ఆ యావులమందలచే జగమంతయు నిండిపోయెను. ఇట్లు ఆవుల సృష్టి యేర్పడెను. మొదట శ్రీకృష్ణుడు సురభిని పూజించెను. తరువాత ముల్లోకము లందును గోపూజ వ్యాపించెను. దీపావళి మరునాడు ఉదయమున గోవును పూజింపవలెనని శ్రీకృష్ణుడు చెప్పెను. పూర్వము ముల్లోకములందును పాలు లేకుండునట్లు సురభి మాయకు కల్పించగా దేవతలు బ్రహ్మను స్తుతించిరి. పిమ్మట బ్రహ్మ అనుమతితో ఇంద్రుడు సురభిని యీ విధముగ స్తుతించెను.

శ్లో॥ నమో రాధా ప్రియాయైచ పద్మాంశాయై నమోనమః ।
నమః కృష్ణ ప్రియాయైచ గవాంమాత్రే నమోనమః ॥
కల్పవృక్ష స్వరూపాయై సర్వేషాం సతతం పరే।
ధనదాయై క్షీరదాయై బుద్ధిదాయై నమోనమః ॥

శుభాయై చసుభద్రాయై గోప్రదాయై నమోనమః ।
యశోదాయై కీర్తిదాయై ధర్మదాయై నమోనమః ॥
స్తోత్ర శ్రవణమాత్రేణ తుష్టాహృష్టా జగత్ప్రసూః।
ఆవిర్భభూవతత్రైవ బ్రహ్మలోకే సనాతనీ॥
మహేంద్రాయ వరందత్వావాంఛితంచాపి దుర్లభామ్ ।
జగామసాచ గోలోకం యయుర్దేవాదయో గృహద్ ॥
బభూవ విశ్వంసహసా దుగ్ధపూర్ణం చనారద।
ఈ స్తోత్రము చదివినవాడు సర్వసంపదలతో విలసిల్లును.

# శక్తి రహస్య నిరూపణమున పూజ

నారదుడు రాధా దుర్గల గూర్చి వివరముగ తెలుపుమని నారాయణుని అడుగగా అతడిట్లు చెప్పనారంభించెను. నారదా! వేదరహస్యము సారములలో సారము పూర్వమెవ్వరును చెప్పనిది. చెప్పుచున్నాను వినుము:- ఈ జగత్తులు పుట్టిన పిమ్మట ప్రకృతిరూప జగదీశ్వరి నుండి యిరువురు శక్తులు జన్మించిరి. ఒకరు కృష్ణుని ప్రాణాధిష్ఠానదేవి యింకొకరు కృష్ణుని బుద్ధ్యధిష్ఠానదేవత. వీరిద్దరును సమస్త జీవులను నియమించగలరు. ప్రేరేపించగలరు కూడ. ఈ విరాడ్విశ్వ మంతయు వీరి స్వాధీనమందుండును. వీరియనుగ్రహమునకు పాత్రులుగాని వారికి మోక్షము దుర్లభము. కనుక వీరి సంతోషము కొరకు వారిని రువురను నిత్యము సేవింపవలయును. వీరిలో మొదట రాధా మంత్రము భక్తితో వినుము. బ్రహ్మ విష్ణువు మొదలగువారిచే పరాత్పరుడు నిత్యము సేవింపబడును.

శ్రీరాధా శబ్దమునకు చతుర్థీ విభక్తి తరువాత స్వాహా శబ్దము. ఇది ఆరు అక్షరములు గల మహామంత్రము. ధర్మార్థ పురుషార్థముల నీయగలది. దీనికి మాయా బీజము చేర్చినచో అది కోరికలను తీర్చు చింతామణి యగును. "ఓం హ్రీం శ్రీరాధాయై స్వాహా" అనునది మూలమంత్రము. రాధామంత్ర మహా మహి మను కోటిముందియైనను వర్ణింపజాలరు. ఈ మంత్రమును మొదట శ్రీకృష్ణుడు భక్తి తత్పరుడై గోలోకరాసమండలమున రాధాదేవి యాజ్ఞ ప్రకారము జపించెను. కృష్ణుడు విష్ణువునకు విష్ణువు బ్రహ్మకు బ్రహ్మ ధర్మునకు ధర్ముడు నాకు ఈ మంత్రము నుపదేశించుట జరిగెను. నేనీ మంత్రము జపించుటవలన దీనికి ఋషినైతిని. బ్రహ్మాది దేవతలును నిత్యము రాధనే ధ్యానించెదరు. రాధ నర్చిం పనిచో శ్రీకృష్ణు నర్చించుట కధికారములేదు. ఇది వైష్ణవు లందరకును నియమము. కనుక మొదట రాధాదేవిని పూజింపవలెను. శ్రీకృష్ణుని ప్రాణాధిష్ఠా నదేవత రాధ.

కృష్ణుడామెకు వశుడైయుండును. ఆమె రాసేశ్వరి కృష్ణుడు లేక రాధ ఉండజాలదు. సమస్తములైన కోరికలను సిద్ధింపజేయునదిగాన ఆమెను రాధయని పిలుచుదురు.

ఈ రాధామంత్రమునకు ఛందస్సు గాయత్రి, దేవత రాధ, ప్రణవము బీజము భువనేశ్వరి శక్తి. మూలమంత్రము నారుమార్లు చెప్పి అంగన్యాసమును చేయవలెను. పిమ్మట శృంగారరసాధి దేవత రాసేశ్వరి మహా దేవియగు శ్రీరాధాదేవిని మనస్సులో ధ్యానించవలయును. సామవేదములో చెప్పినట్లు రాధాదేవి నిట్లు ధ్యానింపవలెను. సంపంగి పూవువంటి రంగుగల శరీరముతో కూడినది. చంద్ర బింబము వంటి ముఖముగలది. కోటి చంద్రుల కాంతిని విరజల్లునది. పద్మదళముల వంటి కన్నులు, దొండపండువంటి పెదవి మల్లెమొగ్గల వంటి పలువరుస గలది తెల్లని పట్టువస్త్రము ధరించినది. మేలి ముసుగు ధరించినది. చిరునవ్వుతో కూడిన ముఖము కలది. రత్నభూషణముల నలంకరించుకొన్నది. పన్నెండేళ్ళ వయస్సు గలిగిన సౌందర్యలహరి. భక్తానుగ్రహ పరాయణ పువ్వుల పరిమళము వెదజల్లు కేశపాశము కలది కుసుమకోమలి లతాంగి రాసమండల మధ్య మందున్నది. వరాభయకరముద్రలు గలది, శాంతమూర్తి రత్న సింహాసనమున కూర్చున్నదియు గోపీ మండలనాయిక వేదప్రబోధిత పరమేశ్వరి కృష్ణ ప్రాణాధికప్రియ.

ఈవిధముగ రాధాదేవిని ధ్యానించి సాలగ్రామ మందుగాని కలశమున గాని అష్టదళ పద్మయంత్రమున గాని విధివిధానముగా రాధాదేవి నావాహనము చేయవలయును. పిమ్మట మూలమంత్రముతో దేవికి ఆ సనపాద్యాదు లర్పించవలెను. మూలమంత్రముతో రాధాదేవి పాదములకు పాద్యమును చేతులకు అర్ఘ్యమును ఆచమనీయము నొసంగవలయును. తరువాత రాధాదేవికి మధుపర్కమును పాలిచ్చు గోవును కూడ సమర్పింపవలయును.

పిమ్మట భక్తి భావముతో స్నాన శాలకు తీసుకువెళ్ళి అభ్యంజనస్నానము చేయించి పట్టువస్త్రములను ధరింప జేయవలెను. శరీరమునకు మంచిగంధము పూయవలెను. రాధాదేవికి తులసిగుత్తుల పూలమాలలు సమర్పించవలెను. తరువాత దేవి పరివారమును పూజింపవలెను. ఆగ్నేయము నైరృతివాయవ్యము ఈశాన్యములందు దిక్పూజను చేయవలెను. పిమ్మట అష్టదళయంత్రము నందు దక్షిణము మొదలుగానన్ని దిక్కులయందు క్రమముగా అష్టశక్తుల నర్చింపవలెను. తూర్పుదళమున మాలావతిని, అగ్ని కోణమున మాధవిని, దక్షిణమందు రత్నమాలను, నైఋతిని సుశీలను, పడమట శశికళను బుద్ధిమంతుడైనవాడు పూజింప

వలయును. వాయవ్యమున పారిజాతను ఉత్తరమున పరావతిని ఈశాన్యమున ప్రియకారిణియగు సుందరిని పూజింప వలయును. ఆమెకు వెలుపల బ్రహ్మాదు లను భూమిపై దిక్పాలురను పూజింప వలయును. ఆమె ఆయుధములను గూడ పూజింపవలెను.

పిమ్మట ఆవరణ దేవతలను రాధను గంధము మొదలగు పూజాద్రవ్యము లతో రాజోపచారములతో పూజింపవలయును. రాధాసహస్రముతో రాధాదేవిని పూజింపవలెను. మూల మంత్రమును తప్పక వేయిమార్లు జపము చేయవలెను. ఈ విధముగ రాసేశ్వరి యగు శ్రీరాధాదేవిని పూజించువాడు విష్ణువుతో సమానుడు. అతడు గోలోకమునకు వెళ్ళగలడు. కార్తికపూర్ణిమనాడు రాధాదేవి జన్మదినోత్సవము జరుపు భక్తునివద్ద రాసేశ్వరి కటాక్షములతో నిలిచి యుండును. ఏదే నొకకారణమున గోలోకనివాసిని యగు రాధ, బృందావనమున వృషభాను నందినిగ నుద్భవించినది. ఇందు చెప్పిన మంత్రములకు చెప్పిన సంఖ్య ప్రకారము పురశ్చరణము దశాంశహోమము నెర వేర్పవలెను నువ్వులు తేనె, నేయి, పాలు మొదలగు వస్తువులతో భక్తిగా హోమము చేయవలెను అని నారాయణుడు చెప్పెను. ఇది విని నారదుడు మహాత్మా ఏ స్తోత్రముచేత రాధప్రసన్నురాలగునో యెరి గింపుమనగా నారాయణుడిట్లు చెప్పెను.

శ్లో॥ నమస్తే పరమేశాని । రాసమండలవాసిని ।
రాసేశ్వరి । నమస్తేస్తు కృష్ణప్రాణాధికప్రియే ।
నమస్సరస్వతీ రూపే నమోలక్ష్మీ స్వరూపిణి ।
నమోదుర్గే భగవతి । నమస్తే సర్వరూపిణి ।
మూల ప్రకృతి రూపాంత్వాం భజామః కరుణార్ణవామ్
సంసారసాగరాదస్మాదుద్ధరాంబ దయాంకురు
ఇదం స్తోత్రంత్రి సంధ్యం యః పఠేద్రాధాం స్మరన్నరః
తస్యవైదుర్లభం కించిత్ కదా చిన్న భవిష్యతి
దేహాం తేచవ సేన్నిత్యం గోలోకే రాసమండలే
ఇదం రహస్యం పరమం న చాఖ్యేయంతు కస్యచిత్ ॥

**స్తోత్రభావము**:- పరమేశాని! రాసమండలవాసిని! రాసేశ్వరి! కృష్ణప్రాణాధిక ప్రియా! నీకు నమస్కారములు. సరస్వతీ స్వరూపిణీ! సావిత్రీ! శంకరీ! గంగ! రూపా! షష్ఠీ! మంగళ చండికా నమస్కారములు తులసీ! లక్ష్మీ! దుర్గాదేవి! సర్వస్వరూపిణి! నీకు నమస్కారములు తల్లీ! మూల ప్రకృతి స్వరూపిణీ! దేవి! కరుణాలవాలా!

మేము నిరంతరము నిన్నే కొలిచెదము. ఘోరసంసారసాగరము నుండి మమ్ము ద్ధరింపుము. దయచూడుము. ఈ విధముగ రాధను స్మరించుచు మూడువేళల స్తోత్రము చదువు వాని కెచ్చటను దుర్లభమైనదుండదు. అతడు మరణించిన పిమ్మట గోలోక మండలి రాసమండలమున నివసింపగలడు. ఈ పరమరహస్య మితరులకు చెప్పరాదు.

# దేవీ లఘు నామమాల

శ్లో॥ పద్మోద్భవా జగన్మాతాదేవీ విశ్వేశ్వరీ శివా ।
విష్ణుప్రియా వేదమాతా లక్ష్మీ శ్శంకరవల్లభా ॥ 1
బ్రహ్మ విష్ణు మహేశానజననీత్వం సుసమ్మతా ।
బుద్ధిదా మోక్షదాచాజ్ఞా పురుష ప్రియదర్శనా ॥ 2
భుక్తిముక్తి ప్రదాపూర్ణా సత్వానాం సుఖసాధనా ।
సిద్ధిదాజయదా కీర్తిదా చాజ్ఞానాంతు దుఃఖదా ॥ 3
దేవేశ్వరీ మహేశానీ సర్వబ్రహ్మాండ నాయికా ।
కోటిసూర్య సమాదేవీదయారస తరంగిణీ ॥ 4
వేదాంత వేద్యా చిద్రూపా మాతా త్రిభువనేశ్వరీ ।
మహేశ్వరీ పార్వతీ చ మహేశానా శివప్రియా ॥ 5
బ్రహ్మస్వరూపిణీ భక్త కల్పలతా త్రిభువనేశ్వరీ ।
నిత్యా తృప్తాంబికేశానీ భైరవీ బగళారమా ॥ 6
మాతంగీతులజాదేవీ జంభినీ మోహినీతథా ।
ఛిన్నమస్తా గుహ్యకాళీ దశసాహస్ర బాహుకా ॥ 7
కామాక్షీ బగళా మాయా పంచకోశాంతరస్థితా ।
శాకంభరీ శతాక్షీ చ దుర్గమాసురభంజనీ ॥ 8
పరాశక్తిః పరబ్రహ్మ సచ్చిదానందరూపిణీ ।
జగత్కారణా దేవీ శ్రీ కారణ స్థానరూపిణీ ॥ 9
జ్యేష్ఠా దేవీ మహామాయా మహానందా మహోత్సవా ।
మహేశ్వరీ మహాభాగా మహాదేవప్రియంకరీ ॥ 10
వేదత్రయ ప్రమాణజ్ఞా వేదమూర్తి ర్మహేశ్వరీ ।
మహేశ్వరీ మహామాయా మహాభాగా మహోదయా ॥ 11
మహాదేవ ప్రియకరీ మహాదేవ ప్రియాసతీ ।
జ్యేష్ఠాదేవీ మహానందా మహా దేవప్రియా సతీ ॥ 12

దేవాదిపూజితా సర్వమంగళా భయహారిణీ ।
దేవీకీర్తిః స్మృతిః కాంతిః గిరిజాకమలా సతీ ॥ 13
దాక్షాయణీ వేదగర్భా బుద్ధిదాత్ర్యభయప్రదా ।
సర్వమంగళ మాంగళ్యా శివా సర్వార్థసాధికా ॥ 14
మంగలా వైష్ణవీ మాయా కాలరాత్రి ర్దురత్యయా ।
మహామాయా చ మాతంగీ కాలీకమలవాసినీ ॥ 15
శివా సహస్రచరణా సర్వ మంగళరూపిణీ ।
పాపహంత్రీ ప్రజోత్పత్తిః పరబ్రహ్మ స్వరూపిణీ ॥ 16
జగద్ధాత్రీ పుష్కరాక్షీ మహాదేవీ మహేశ్వరీ ॥ 17
పరమాపాప హంత్రీ చ పరమార్గ ప్రదాయినీ ॥ 18
మదదాత్రీ మదోన్మత్తా పరబ్రహ్మ స్వరూపిణీ ॥ 19
మానగమ్యా మునిధ్యేయా మార్తాండ సహచారిణీ ॥ 20
మహోన్నతా మహా మోహనాశనీ సురాసుర సుపూజితా ।
యమలోకాభావ కర్త్రీ యమపూజ్యా యమాగ్రజా ॥ 21
సమస్వభావా సర్వేశీ సంగనాశకరీ శివా ।
కామ్యరూపాచ కామాక్షీ మీనాక్షీ మర్మభేదినీ ॥ 22
మాధుర్యరూప శీలాచ మధురస్వరపూజితా ।
కారుణ్య విగ్రహాఽక్రూరా కంకాలా సంగనాశినీ ॥ 23
మహా మంత్రవతీ మంత్రా మన్మథారి ప్రియంకరీ ।
అశ్వత్థవట నింబామ్ర కపిత్థ బదరీగతా ॥ 24
పనస్కార కరీరాది క్షీర వృక్ష స్వరూపిణీ ।
దుగ్ధవల్లీ నివాసార్హా దయనీయా దయాధికా ॥ 25
దాక్షిణ్య కరుణారూపా సర్వా సర్వజ్ఞవల్లభా ।
దేవేశీ చ మధూకస్థా వ్రతపూర్ణత్వ సిద్ధిదా ॥ 26

## దుర్గా పూజ

ఇక దుర్గాదేవి పూజావిధానమును వినుము :- దుర్గాదేవిని తలచి నంతనే మహాపదలన్నియును తొలగిపోవును. దుర్గాదేవిని కొలువని వాని కెక్కడను యేమియు లభించదు. ఆమె విశ్వమాత, శైలి, సర్వోపాస్య, సర్వశక్తి, మహాద్భుత చరిత్ర, సర్వబుధ్యధిష్ఠాన దేవి, అంతర్యామి స్వరూపిణి, ఘోరసంకటములను

తొలగించునదగుటచే భూమిపై దుర్గయని ప్రసిద్ధినొందినది. ఈమె నిత్యము శైవులచే వైష్ణవులచేతను పాసింపదగినది. మూలప్రకృతి స్వరూపిణి, సృష్టి స్థిత్యంత కారిణి దుర్గనవార్ణ మంత్రము మిక్కిలి శ్రేష్ఠమైనది. అది వాగ్బీజము, శాంభవీ బీజము, కామబీజము కలిగియుండును. "చాముండాయై" పదము చివర 'విచ్చే' అను రెండక్షరములుండును. ఓం ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చేయను నవాక్షర మంత్రము సేవించువారికి కల్పవృక్షమను విషయమును తెలిపెను.

ఈ మంత్రమునకు బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరులు ఋషులు. గాయత్రి-ఉష్ణిక్, అనుష్టుపులు ఛందములు మహాకాళీ, మహాలక్ష్మి, మహాసరస్వతులు దేవతలు. రక్త దంతికా దుర్గా భ్రామరీబీజములు, నందా, శాకంభరి, భీమా దేవతలు శక్తులు. ధర్మార్థ కామమోక్షములందు దీని వినియోగము. న్యాసము చేసిన పిమ్మట వాగ్బీజమును హృదయమందు, మాయాబీజమును శిరస్సుపైన కామబీజమును శిఖయందు చాముండాయై అనునాలు గక్షరములను కవచమున "విచ్చే" అను రెండక్షరములను మూడునేత్రములందు మొత్తము నవార్ణమంత్రమును అస్త్రమున న్యాసము చేయవలెను.

ఈ అంగన్యాసమున చతుర్థ్యంతములైన "శిరసే" మొదలగు పదముల చివర వరుసగా నమః, స్వాహా, వౌషట్ - హుం, వేషట్, ఫట్, అను జాతిపదము లను చేర్చవలెను. కామరాజ బీజము మొదలు మూలమంత్రపు తొమ్మిది వర్ణములను వరుసగా, శిఖ, కుడికన్ను, ఎడమకన్ను, కుడిచెవి, ఎడమచెవి, కుడి ఎడమ ముక్కులు గుదమందున్యాసము చేయవలెను. ఖడ్గము, శంఖము, చక్రము, గద, విల్లు, బాణములు, పరిఘ, శూలము, భుశుండి, శిరము శంఖము ధరించినది. త్రిణయన, నానాభూషణ భూషిత నల్లని రూపు పదిపాదములు ముఖములు గలది. మధుకైటభనాశమునకు ముందు బ్రహ్మ స్తుతించిన కామబీజ స్వరూపిణి యగు మహాకాళిని ధ్యానించుచున్నాను.

అక్షమాల, పరశు, గద, కులిశము, పద్మము, ధనువు, కుండి, కరండము, శక్తి, కత్తి, చర్మము, అంబుజము, ఘంటిక, పానపాత్ర, శూలము, పాశము, సుదర్శనము, అను ఆయుధములు ధరించు అరుణప్రభ, రక్త కమలాసన, మాయాబీజ స్వరూపిణి, మహిషాసురమర్దిని యగు మహాలక్ష్మిని, ఘంట, శూలము, హలము, ముసలము, సుదర్శనము, ధనుర్బాణములను చేతులందు ధరించి మొల్లెపువ్వుల కాంతిగల శుంభాది రాక్షస సంహారిణి నవార్ణమంత్రమందలి వాగ్బీజమునకధి దేవత సచ్చిదానంద స్వరూపిణియైన మహాసరస్వతిని ధ్యానించు

చున్నాను. అని ధ్యానించవలయును దేవీ యంత్రము త్రికోణము, షట్కోణము, అష్టదళములు, ఇరవైనాలుగు దళములు భూగృహనిర్మాణము కలదానిగా ధ్యానింప వలయును. సాలగ్రామము, కలశము యంత్రము, ప్రతిమ, బాణలింగము వీటిలో దేనియందైనను, సూర్యునినందైనను నిశ్చలబుద్ధితో దేవిని ఆరాధింపవలయును. యంత్రమునకు తూర్పున సరస్వతితో సహా బ్రహ్మను, నైఋతి కోణమున లక్ష్మితో విష్ణువును, ధ్యానింపవలయును. వాయుకోణమున పార్వతితో శంభుని, ఉత్తర మున సింహమును, దక్షిణమున మహాసురుడైన మహిషుని పూజింపవలయును.

అరుకోణములందు నందజ - రక్తదంత- శాకంభరి, శివ, దుర్గ, భీమ, భ్రామరిలను పూజింపవలెను. అష్టదళములందు బ్రహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, నారసింహి, ఐంద్రి, చాముండీలను పూజింపవలెను. ఇరువది నాలుగు దళములందు క్రమముగా విష్ణుమాయ చేతన బుద్ధి, నిద్ర, క్షుధ, ఛాయ, పరాశక్తి, తృష్ణ, శాంతి, జాతి, లజ్జ, క్షాంతి, శ్రద్ధ, కీర్తి లక్ష్మి, ధృతి, వృత్తి, శ్రుతి, స్మృతి, దయ, తుష్టి, పుష్టి, మాత, భ్రాంతి, అను ఇరువది నలుగురు దేవతలను పూజింపవలయును. పిమ్మట భూగృహ కోణములలో గణపతిని, క్షేత్ర పాలుని, వటుకుని, యోగినిని పూజింపవలయును. దాని వెలుపల వజ్రము మొదలగు ఆయుధములు ధరించిన ఇంద్రుడు మొదలగు దేవతల నర్చింపవలయును. ఈ విధముగా ఆవరణ దేవతలను దుర్గాదేవిని పూజింపవలయును. పిమ్మట అనేక రాజోపచారములతో దేవిని సంతోష పెట్టవలెను. తరువాత నవార్ణ మంత్ర మును మంత్రార్థమును భావింప వలెను. పిదప దేవి సన్నిధిలో సప్తశతి స్తోత్రము పారాయణ చేయవలెను. సప్తశతి స్తోత్రమునకు సాటియైన స్తోత్రము లేదు. నిత్యము పరదేవతను మానవుడీ స్తోత్రముతో సంతోష పెట్టవలయును. ఇట్లు చేసిన నరుడు ధర్మార్థ కామమోక్షము లను సుఖముగా పొందగలడు.

# ఇంద్రుడు చేసిన మానసాదేవీ స్తుతి

శ్లో॥ దేవిత్వాం స్తోతుమిచ్ఛామి సాధ్వీనాం ప్రవరాంవరామ్ ।
నకాత్పరాంచపరమాం న హిస్తోతుంక్షమోఽధునా ॥
స్తోత్రాణాం లక్షణంవేదే స్వభావాఖ్యాన తత్పరం ।
నక్షమః ప్రకృతేవక్తుం గుణానాం గణనాంతవ ॥
శుద్ధ సత్త్వ స్వరూపాత్వం కోపహిం సావివర్జితా ।
నచశక్తో మునిస్తేన త్యక్తుం యాచ్ఞా కృతాయతః ॥
త్వం మయా పూజితాసాధ్వి! జననీ మేయథాఽవిదితిః ।

దయా రూపాచభగినీ క్షమారూపా యథాప్రసూః ॥
త్వయామే రక్షితాః ప్రాణాః పుత్ర దారాస్సురేశ్వరి।
అహంకరోమి త్వత్పూజాంప్రీతిశ్చాపి ప్రవర్ధతామ్ ॥
నిత్యాయద్యపి పూజ్యాత్వం సర్వత్ర జగదంబికే ।
తథాఽపి తవ పూజాంచ వర్ధయామి సురేశ్వరి ॥
యేత్వామాషాఢ సంక్రాంత్యాం పూజయిష్యంతి భక్తితః ।
పంచమ్యాం మానసాఖ్యాయాం మాసాంతేవాదినే దినే ॥
పుత్ర పౌత్రా దయస్తేషాం వర్ధంతే చ ధనానిచ ।
యశస్వినః కీర్తిమంతో విద్యావంతో గుణాన్వితాః ॥
యేత్వాంన పూజయిష్యంతి నిందత్యజ్ఞానతోజనాః ।
లక్ష్మీ హీనాభవిష్యంతి తేషాం నాగభయంసదా ॥
త్వం స్వయం సర్వలక్ష్మీశ్చ వైకుంఠే కమలాలయా ।
నారాయణాంశో భగవాన్ జరత్కారుర్మునీశ్వరః ॥
తపసాతేజసా త్వాంచ మనసా సస్సృజేపితా ।
అస్మాకం రక్షణాయైవ తేనత్వం మానసాభిధా ॥
మనసాదేవి శక్త్యాత్వం స్వాత్మనా సిద్ధయోగినీ ।
తేనత్వం మానసాదేవీ పూజితా వందితాభవ ॥
యే భక్త్యా మానసాం దేవాః పూజయంత్యనిశంభృశమ్ ।
తేన త్వాం మానసాదేవీం ప్రవదంతి మనీషిణః॥
సత్య స్వరూపాదేవీత్వం శశ్వత్సత్య నిషేవణాత్ ।
యోహిత్వాం భావయేన్నిత్యం సత్యాంప్రాప్నోతి తత్పరః ॥
ఇంద్రశ్చ మనసాంస్తుత్వా గృహీత్వాభగినీవరం ।
ప్రజగామ స్వభవనం భూషయాసపరిచ్ఛదమ్ ॥
పుత్రేణసార్ధం సాదేవీ చిరంతస్థే పితుర్గృహే ।
భ్రాతృభిః పూజితా శశ్వన్మాన్యావంద్యాచ సర్వతః ॥
గోలోకాత్సురభిర్బ్రహ్మన్ తత్రాగత్య సుపూజితామ్ ।
తాం స్నాపయిత్వాక్షీరేణ పూజయామాస సాదరమ్ ॥
జ్ఞానం చ కథయామాస గోప్యం సర్వం సుదుర్లభమ్ ।
తథాదేవైః పూజితాసా స్వర్లోకంచపునర్యయౌ ॥
ఇంద్ర స్తోత్రం పుణ్యబీజం మనసాం పూజయేత్పఠేత్ ।

తస్యనాగభయం నాస్తి తస్యవంశోద్భవస్య చ ॥
విషంభవేత్సుధాతుల్యం సిద్ధస్తోత్రోయదా భవేత్ ।
పంచలక్ష జపేనైవ సిద్ధ స్తోత్రోభవేన్నరః ॥
సర్పశాయీభవేత్సోऽపినిశ్చితం సర్పవాహనః ॥

**స్తోత్రభావము:-** దేవీ! సతులలో శ్రేష్ఠురాలవగు నిన్ను స్తుతింపదలచు చున్నాను. నీవు పరాత్పరవు. నిన్నెవడు నుతింపగలడు? వేదములందు నీస్తోత్రముల లక్షణము, స్వభావము, చరిత్రలు పెక్కుగలవు. దేవి! నీప్రకృతి సహజమైన గుణగణములు లెక్కింపగలవాడులేడు. నీవు శుద్ధ సత్త్వస్వరూపిణివి. క్రోధలోభహింసలు లేనిదానివి. తల్లివి. మునివరుడు నిన్ను వదలివెళ్ళలేక నీయనుమతితో వెళ్ళి పోయెను. సాధ్వీమ తల్లీ! నీవు నాతల్లి అదితివంటిదానవు. నిన్ను చక్కక పూజించితిని. నీవు దయకు, క్షమకు ప్రతిరూపమవు. నాభగినివి. సురేశ్వరీ! నీవల్లనే నేను, నా భార్యాబిడ్డలు రక్షింపబడిరి. జగదంబా! నీవు నిత్యపూజ్యవు. సర్వపూజ్యవు. ఇకమీద నీ పూజలందు నాకు ప్రీతి పెంపొందుగాక.

సురేశ్వరీ! నీ పూజలను ప్రచారము చేతును. పరమ భక్తితో ఆషాడ సంక్రాంతినాడుకాని, మానసా పంచమి నాడుగాని మాసము చివర గాని నిన్ను పూజించువారు పుత్రపౌత్రధన ధాన్యములతో వర్ధిల్లుదురు. అజ్ఞాన ముచే నిన్ను నిందించువారు దరిద్రులగుదురు. వారికి నాగభయము తప్పదు. దేవీ! నీవు లక్ష్మీస్వరూపవు. వైకుంఠపురమందలి లక్ష్మీదేవివి నీవే. నీపతి జరత్కారు ముని కేవలము నారాయణాంశజుడే. నీ తండ్రి నిన్ను మనస్సు నుండి సృష్టించెను.

నీ తండ్రి మా రక్షణకొరకే నిన్నట్లు సృష్టించెను. కనుక నీవు మానసాదేవివి, దేవతలు నిన్ను నిత్యము భక్తితో పూజింతురు. నిత్యము సత్యమే పలుకుట వలన నిన్ను మనీషులు సత్యస్వరూపిణిగా భావింతురు. నిన్ను భావించువాడు నిన్నే చేరును. అని యింద్రుడు మానసాదేవిని సన్నుతించి యామె నుండి వరము పొందెను. పిమ్మట యింద్రుడు తన కుటుంబముతో స్వర్గమునకేగెను. మానసాదేవి కుమారునితో తన తండ్రి యింటిలో చిరకాలము నివసించెను. మానసాదేవి నిత్యము పూజింపదగినది.

నారదా! గోలోకము నుండి సురభి మానస వద్దకు వచ్చి క్షీరాభి షేకము చేసినది. గౌరవముతో పూజించెను. దుర్లభము, రహస్యమునైన జ్ఞానము పదేశించెను. పిమ్మట సురపూజితయైన సురభి స్వర్గమునకు వెళ్ళెను. యింద్రుడు చేసిన ఈ పుణ్యప్రదమైన స్తోత్రముతో మానసను పూజింప వలయును. అట్టివానికి, వాని

వంశమునకు కూడ యేనాటికిని సర్పభయము కలుగదు. ఈ స్తోత్రము సిద్ధిచెందిన వానికి విషము అమృతమగును. ఈ స్తోత్రమును ఐదులక్షలు జపించినచో సిద్ధిచెందును. అతడు పన్నగ శయనుడు, పన్నగ వాహనుడునుకాగలడు.

# యజ్ఞపురుషుడు చేసిన దక్షిణాస్తుతి

శ్లో॥ పురాగోలోక గోపీత్వం గోపీనాం ప్రవరాపరా ।
రాధా సమాతత్సఖీచ శ్రీకృష్ణ ప్రేయసీ ప్రియా ॥
కార్తికే పూర్ణిమాయాంతు రాసే రాధా మహోత్సవే ।
ఆవిర్భూతా దక్షిణాం సాల్లక్ష్మ్యాస్తే నాపిదక్షిణా ॥
పురాత్వంచ సుశీలాఖ్యా ఖ్యాతాశీలేన శోభనే ।
లక్ష్మీ దక్షాంసభాగాత్త్వం రాధా శాపాశచ్చ దక్షిణా ॥
గోలోకాత్త్వం పరిభ్రష్టా మమ భాగ్యాదుపస్థితా ।
కృపాంకురు మహాభాగే! మా మేవ స్వామినంకురు ॥
కర్మిణాం కర్మణాందేవి! త్వమేవ ఫలదా సదా ।
త్వ యావినాచ సర్వేషాం సర్వం కర్మచ నిష్ఫలమ్ ॥
త్వయా వినాతధా కర్మ కర్మిణాం నచశోభతే ।
బ్రహ్మ విష్ణు మహేశాశ్చ దిక్పాలాదయ ఏవచ ॥
కర్మణశ్చ ఫలందాతుం నశక్తాశ్చ త్వయావినా।
కర్మరూపీ స్వయం బ్రహ్మ ఫలరూపీ మహేశ్వరః ॥
యజ్ఞరూపీ విష్ణురహం త్వమేషాం సారరూపిణీ ।
ఫలదాత్ర పరంబ్రహ్మ నిర్గుణా ప్రకృతిః పరా ॥
స్వయం కృష్ణశ్చ భగవాన్ నచశక్త స్త్వయాసహా।
త్వమేవ శక్తిః కాంతే మేశశ్వజ్జన్మని జన్మని ॥
సర్వకర్మణి శక్తోహం త్వయాసహవరాననే ।
ఇత్యుక్త్వా చపురస్తస్థౌ యజ్ఞాధిష్ఠాత్ర దేవతా ॥
తుష్టాబభూవసాదేవీ భేజేతం కమలాకలా ।
ఇదంచ దక్షిణాస్తోత్రం యజ్ఞకాలేచయః పఠేత్ ॥
వరంచ సర్వయజ్ఞానాం ప్రాప్నుయాన్నాత్ర సంశయః ।
రాజసూయే వాజపేయే గోమేధే నరమేధకే ॥
అశ్వమేధేలాంగలేచ విష్ణుయజ్ఞే యశస్కరే ।

ధనదేభూమదే పూర్తే ఫలదే గజమేధకే ॥
లోహయజ్ఞే స్వర్ణయజ్ఞే రత్నయజ్ఞేచ తామ్రకే ।
శివయజ్ఞే రుద్రయజ్ఞే శక్ర యజ్ఞేచ బంధుకే ॥
వృష్టావరుణ యాగేచకండకే వైరిమర్దనే ।
శుచియజ్ఞే ధర్మయజ్ఞే ధ్వరే పాపవిమోచనే ।
బ్రహ్మణీ కర్మయోగే చ యోని యోగేచ భద్రకే ॥
ఏతేషాంచ సమారంభే ఇదం స్తోత్రంచ యః పఠేత్ ।
నిర్విఘ్నేన చతత్కర్మ సర్వం భవతి నిశ్చితమ్ ॥

**స్తోత్రభావము:-** పూర్వము నీవు గోలోకమందున్న గోపికలలో గొప్పదానివి. శ్రీ కృష్ణుని ప్రియురాలవు. రాధాదేవితో సమానురాలవు. కార్తిక పూర్ణిమనాటి రాసమండలమున రాధాకృష్ణుల మహోత్సవమున లక్ష్మి దక్షిణభాగము నుండి వెలవడుటచేత దక్షిణయనుపేరు ప్రసిద్ధిమయ్యెను. శోభనాంగీ! గోలోకమందున్న సుశీల యనుబడు గోపికవు నీవే సుమా! నీవు రాధా శాపమువలన నాయదృష్టము పండి లక్ష్మి దక్షిణభాగము నుండి జన్మించితివి. మహనీయురాలా! నన్ను పతిగా వరింపుము. కర్మనిష్ఠులొనరించు కర్మల ఫలితము నీవేకదా! నీవులేనిచో కర్మ లన్నియు నిష్ఫలములు. నీవు లేనిచో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు కూడ కర్మ ఫలములీయజాలరు. కర్మస్వరూపుడగు బ్రహ్మ ఫల స్వరూపుడగు శివుడు యజ్ఞ స్వరూపుడైన విష్ణువును నేనే. నీవు కర్మలసారరూపిణివి. ఫలదాయకుడగు బ్రహ్మ నిర్గుణుడు. శ్రీకృష్ణభగవానుడు కూడ నిన్ను కూడినందునే శక్తిమంతుడగు చున్నాడు. ఓ ప్రియురాలా! నా జన్మజన్మలకు నీవే నాశక్తివి. అని స్తుతించ గనే లక్ష్మి కళనుండి పుట్టిన దక్షిణాదేవి యజ్ఞాధిష్ఠానదేవియై యజ్ఞభగవానుని సేవింప నతని సన్నిధానముననుండెను. ఈ దక్షిణా స్తోత్రమును యజ్ఞ సమయమున చదివినచో సకల యజ్ఞఫలములను పొందగలడు.

## శ్రీ నారాయణుడు చేసిన సరస్వతీ స్తుతి

శ్రీనారాయణుడు నారదునకు సరస్వతీదేవి యొక్క అన్ని కోరికలను తీర్చు నట్టి స్తోత్రమును చెప్పబోవుచు నిట్లుపలికెను. పూర్వము యాజ్ఞవల్క్య మహాముని ఈ స్తోత్రముచే సరస్వతిని స్తుతించెను. ఆ మునిగురువు శపించగా అన్ని విద్యలను మరచిపోయి దుఃఖార్తుడై పుణ్యప్రదమగు సూర్యుని స్థానమును చేరి అచట సూర్యుని గూర్చి తపస్సు చేయగా సూర్యుడు ప్రత్యక్షమయ్యెను. అప్పుడు మహర్షి మాటిమాటికి దుఃఖిస్తూ సూర్యుని పొగడనారంభించెను. సూర్యుడు సంతోషించి

అతనికి వేద వేదాంగములు బోధించెను. జ్ఞాపకశక్తి కొఱకు సరస్వతీ స్తోత్రము భక్తితో నిరంతరము చదువుమని చెప్పెను. సూర్యుడట్లు చెప్పి అంతర్ధానము చెందెను. అప్పుడు యాజ్ఞవల్క్యుడు భక్తిశ్రద్ధలతో సరస్వతినిట్లు స్తుతించెను.

శ్లో॥ గురుశాపాత్స్మృతి భ్రష్టం విద్యాహీనం చ దుఃఖితం ।
జ్ఞానం దేహి స్మృతింవిద్యాం శక్తిం శిష్యప్రబోధినీమ్ ॥
గ్రంథకర్తృత్వ శక్తించను శిష్యం సుప్రతిష్ఠితమ్ ।
ప్రతిభాం సత్సభాయాంచ విచారక్ష మాతాంశుభాం ॥
లుప్తం సర్వం ధైవయోగాన్న వీభూతం పునఃకురు ।
యథాంకురం భస్మనిచ కరోతి దేవతాపునః ॥
బ్రహ్మ స్వరూపా పరమాజ్యోతీ రూపాసనాతనీ ।
సర్వ విద్యాధికా దేవీ యాతస్యైవాణ్యై నమోనమః ॥
విసర్గ బిందు మాత్రాసు యదధిష్ఠానమేవచ ।
తదధిష్ఠాన దేవీయా తస్యైనీత్యై నమోనమః ॥
వ్యాఖ్యా స్వరూపా సాదేవీ వ్యాఖ్యాధిష్ఠాతృరూపిణీ ।
యయావినాప్ర సంఖ్యావాన్ సంఖ్యాం కర్తుం నశక్యతే ।
కాలసంఖ్యా స్వరూపాయా తస్యైదేవ్యై నమోనమః ॥
భ్రమ సిద్ధాంత రూపాయా తస్యైదేవ్యై నమోనమః ।
స్మృతిశక్తి జ్ఞానశక్తి బుద్ధిశక్తి స్వరూపిణీ ।
ప్రతిభాకల్పనాశక్తి ర్యాచ తస్యై నమోనమః ॥
సనత్కుమారో బ్రహ్మాణం జ్ఞానం పప్రచ్ఛయత్రవై ॥
బభూవ మూకవత్సోఽపి సిద్ధాంతం కర్తుమక్షమః।
తదాజగామ భగవాన్ ఆత్మా శ్రీకృష్ణ ఈశ్వరః ॥
ఉవాచసచతాంస్తౌహి వాణీమిష్టాం ప్రజాపతే ।
స చతుష్టావతాం బ్రహ్మ చాజ్ఞయా పరమాత్మనః ॥
చకార తత్ప్ర సాదేన తదా సిద్ధాంతముత్తమమ్ ।
యదాప్యనంతం పప్రచ్ఛజ్ఞానమేకం వసుంధరా ॥
బభూవ మూకవత్సోఽపి సిద్ధాన్తం కర్తుమక్షమః ।
తదాతాంచ సతుష్టావ సంత్రస్తః కశ్యపాజ్ఞయా ॥
తతశ్చకార సిద్ధాన్తం నిర్మలం భ్రమభంజనమ్।
వ్యాసః పురాణసూత్రం చ వాల్మీకిం పృష్టవాన్యదా॥

మేనే భూతశ్చ సస్మారతామేవ జగదంబికామ్ ।
తదాచకార సిద్ధాంతం తోష్ఠ్యేణ మునీశ్వరః ॥
సంప్రాప్య నిర్మలంజ్ఞానం భ్రమాంధ్యధ్వపదీకమ్ ।
పురాణసూత్రం శ్రుత్వాచ వ్యాసః కృష్ణకులోద్భవః ॥
తాంశివాం వేదదధ్యాచ శవర్షం చ పుష్కరే ।
తదాత్వత్తో వరంప్రాప్య సత్కవీంద్రోబభూవహ ॥
తదా వేద విభాగం చ పురాణం చ చకారసః ।
యదా మహేంద్రః పప్రచ్ఛ తత్త్వజ్ఞానం సదాశివమ్ ॥
క్షణంతా మేవ సంచింత్య తస్మైజ్ఞానందదౌ విభుః।
పప్రచ్ఛ శబ్దశాస్త్రం చ మహేంద్రశ్చ బృహస్పతిమ్ ॥
దివ్యవర్ష సహస్రం చ సత్వాందధ్యా చ పుష్కరే ।
తదాత్వత్తో వరంప్రాప్య దివ్యవర్ష సహస్రకమ్ ॥
ఉవాచశబ్ద శాస్త్రంచ తదర్థంచ సురేశ్వరమ్ ।
అధ్యాపితాశ్చయే శిష్యా యై రధీతం మునీశ్వరైః ॥
తేచతాం పరిసంచింత్య ప్రవర్తం తే సురేశ్వరీమ్ ।
త్వం సంస్తుతా పూజితాచ మునీంద్రైర్మను మానవైః॥
దైత్యేం ద్రైశ్చ సురైశ్చాపి బ్రహ్మ విష్ణు శివాదిభిః ।
జడీభూతః సహస్రా స్యః పంచవక్త్రశ్చతుర్ముఖః ॥
యాం స్తోతుం కిమహంస్తౌమి తామేకాస్యేన మానవః ।
ఇత్యుక్త్వా యాజ్ఞవల్క్యశ్చ భక్తి నమ్రాత్మకంధరః ॥
ప్రణనామ నిరాహారో రురోద చ ముహుర్ముహుః ।
జ్యోతీరూపా మహామాయా తేన దృష్టాప్యువాచతమ్ ।
సుకవీంద్రో భవేత్యుక్త్వా వైకుంఠం చ జగామహ।
యాజ్ఞవల్క్యకృతం వాణీస్తోత్రమే తత్తుయః పఠేత్
సకవీంద్రో మహావాగ్మి బృహస్పతి సమోభవేత్ ॥
మహా మూర్ఖశ్చ దుర్బుద్ధిర్వర్ష మేకంయదాపఠేత్ ।
సపండితశ్చమేధావీ సుకవీంద్రో భవేద్ధ్రువమ్ ॥

**స్తోత్రభావము:-** ఓ జగన్మాతా! నేను గురుశాపముచే విద్యాహీనుడనైతిని. జ్ఞాపక శక్తిపోయినది. తేజోహీనుడను దుఃఖితుడను. నన్ను దయజూడుము. నాకు జ్ఞానము, స్మరణశక్తి, విద్యను శిష్యులకు బోధించుశక్తి, గ్రంధరచనాశక్తి, ప్రతిభగల విద్యార్థులను

ప్రసాదించుము. సత్సభలందు మంచివిచారణశక్తిని, ప్రతిభను ప్రసాదించుము. నశించిన నావిద్య అంతయు మరల క్రొత్తదై నన్ను చేరుగాక. భస్మములోని బీజాంకురమును మరల మొలకెత్త చేసినట్లు చేయుము. నీవు పరబ్రహ్మ స్వరూపిణివి. సనాతన సర్వవిద్యాధిదేవివగు, ఓ వాణీ! నీకు నమస్కారములు. విసర్గబిందు మాత్రలాశ్రయించు వర్ణవనకు నీవు అధిష్ఠానదేవివి. నిత్య స్వరూపిణివి. వ్యాఖ్యాన స్వరూపిణివి. వాఖ్యాధిష్ఠాతృరూపిణివి. నీకు నమస్కారములు. సనత్కుమారుడు బ్రహ్మను, జ్ఞానమును గూర్చి అడిగెను. అప్పుడు బ్రహ్మ జ్ఞానచర్చ సిద్ధాంతము చేయజాలకపోయెను. అంతలో భగవంతుడు కృష్ణపరమాత్మ వచ్చెను. కృష్ణుని ఆజ్ఞ ప్రకారము, బ్రహ్మవాణిని స్తుతించి, బ్రహ్మ జ్ఞానమును పొందెను.

అప్పుడు వాణి దయవలన బ్రహ్మ సిద్ధాంతమును చేయ గలిగెను. పూర్వము భూదేవి అనంతునకు జ్ఞానము పదేశించెను. అనంతుడు తెలుపుటకు సమర్థుడు కాకుండెను. అప్పుడతడు కశ్యపుని ఆజ్ఞచేత వాగ్దేవతను స్తుతించెను. తరువాత భ్రమతొలగించు నిర్మలజ్ఞానమును సిద్ధాంతీ కరింపగలిగెను. అట్లే వ్యాసుడు పురాణసూత్రముల గూర్చి వాల్మీకి నడిగెను. అప్పుడు వాల్మీకి జగదంబను స్మరించెను. తరువాత వాణి దయచేసి సిద్ధాంతము చేసి చెప్పెను. పూర్వము వ్యాసుడు దేవిదయచే నిర్మలజ్ఞానమును పొందెను. వ్యాసుడు పుష్కరతీర్థమున నిన్ను గూర్చి తపస్సు చేసి ధ్యానించి వరము పొంది సత్కవీంద్రు డయ్యెను. మహేంద్రుడు తత్త్వజ్ఞానము నుపదేశింపమని శివుని ప్రార్థింపగా అతడు వాణిని తలచివానికి జ్ఞానము బోధించెను. దేవేంద్రుడు బృహస్పతిని శబ్దశాస్త్రము బోధింపుమనగా పుష్కరక్షేత్రమున నిన్ను ధ్యానించి వరము పొంది అప్పుడింద్రునకు వ్యాకరణశాస్త్రమును బోధించెను.

దేవీ! నీవిట్లు మునిమను మానవులచేత పూజింపబడి స్తుతింపబడుచున్నావు. బ్రహ్మ విష్ణు శివులచేత దేవదానవులచేత స్తుతింపబడి పూజింపబడితివి. ఐదు ముఖముల శివుడు నాల్గుము. ఖల బ్రహ్మయు నిన్ను స్తుతింపజాలరు. ఇక నేను ఒక్కనోటితో నెట్లు స్తుతింపగలుగుదును? అని యాజ్ఞవల్క్యుడు భక్తి వినయములతో తలవంచి సరస్వతిని సంస్తుతించెను. ఈ స్తోత్రము నకు సంతోషించి సరస్వతి నీవు 'సుకవివి'అగుము అని వరమిచ్చి వైకుంఠ మునకు వెళ్ళెను. ఈ యాజ్ఞవల్క్యుడు చెప్పిన ఈ స్తుతిని చదివినవాడు మహాకవి మహావక్త బృహస్పతి సమానుడగును. మూర్ఖుడైనను ఒక ఏడు దీనిని చదివినచో తప్పక పండితుడు కవీంద్రుడు మేధావి కాగలడు.

# దశమ స్కంధము

## శ్రీదేవి శతరూపను అనుగ్రహించుట

నారదమహర్షి నారాయణున్ని దేవీ చరిత్రను చెప్పుమనగా అతడిట్లు చెప్ప నారంభించెను. శ్రీదేవీ చరిత్ర పాపముల నశింపజేయునది. భక్తిన్నీ సంపదను కూడ నిచ్చునది. పూర్వము బ్రహ్మ మనస్సు నుండి స్వాయంభువమనువు జన్మించెను. శతరూపయు బ్రహ్మ మానసపుత్రికయే. ఆమె ధర్మస్వరూపిణి స్వాయంభువమనువు నామెభర్తగా చేసికొనెను. మనువు పరమపవిత్రమైన్న పాల సముద్రముచేరి అచట శ్రీదేవి నారాధించెను. మరియు నూరేండ్లు తపస్సు చేసెను. అతని తపస్సునకు ప్రసన్నయై దేవి వరము కోరుకొనుమనెను. అంతట దేవతలకు దుర్లభములైన వరములను ఆతడు కోరెను.

దేవీ! విశాలాక్షీ! నీ కటాక్షముచే బ్రహ్మలోకములను సృష్టించుచున్నాడు. వైకుంఠుడు పాలించుచున్నాడు శివుడు సంహరించుచున్నాడు. దేవతలందరును దివ్యశక్తివలననే వర్ధిల్లుచున్నారు. నీవు నాకిపుడు వరమీయదలచినచో నేను చేయు సృష్టికార్యములో నెటువంటి విఘ్నములు కలుగకుండునట్లు వరమిమ్మనెను. నీ కోరిక ప్రకారము అంతయు జరుగగలదని దేవి యానతిచ్చినది. నీకు వంశకరులైన పుత్రులు పుట్టుదురు. వత్సా! నీవు నాపై భక్తి గలిగియుండుము. చివరకు నీవు నా స్థానమును చేరగలవు అనిపలికి అతడు చూచుచుండగనే వింధ్య పర్వతముపైకి వెళ్ళెను. వింధ్యవాసిని, విష్ణుసోదరియగు ఆ దేవి భక్తజన సులభ. వరప్రద.ఋషులు సూతమహర్షి నిట్లు ప్రశ్నించిరి - మహర్షీ ఆ వింధ్య పర్వతమెవరు? అది పైకెదిగి సూర్యమండలము నేలయడ్డగించెను? అగస్త్యముని దానిని పెరుగ నీయక ఎట్లు ఆపు చేయగలిగెను. అనియడుగగా సూతుడు యిట్లు చెప్పనారంభిచెను.

## వింధ్యపర్వతము పెరుగుట

వింధ్య పర్వతము అన్ని పర్వతములలో శ్రేష్ఠమైనది. అది మహావృక్షములు గల వనములతో విలసిల్లుచున్నది. అందనేక జంతువులు నివసిస్తున్నవి. నదులు ప్రవహిస్తున్నవి. గంధర్వ కిన్నరకింపురుషాదులు అందు విహరించుచుందురు. ఫల వృక్షములు చాల కలవు. నారదుడొకప్పుడు దీనిని సందర్శించెను. ఆ పర్వతాధిష్ఠానదేవత మునికాతిథ్య మొసగెను. మరియు మునితో నిట్లనెను. మహాత్మా

మీరాకవలన నా స్థానము పవిత్రమైనది. సూర్యుని గమనమువలె మీరాకయు మేలు కొరకే జరుగును. మీమనస్సులోని విషయమును తెలుపుడనగా నారదుడు యిట్లు పలికెను. పర్వతశ్రేష్ఠమా! నేను సుమేరు పర్వతము నుండి వచ్చుచున్నాను. నేనక్కడి ఇంద్రాది దిక్పాలకుల, భవనములు మేరుపర్వతమునకు నలువైపుల నున్నట్లు చూచితిని. ఆభవనములు అనేక సుఖభోగములు కలిగించుట చూచి తిని. మహర్షి నిట్టూర్పువిడిచెను. వింధ్య పర్వతమతని చూచి నీనిట్టూర్పునకు కారణమేమని యడుగగా నారదుడిట్లు చెప్పసాగెను.

హిమవత్పర్వతము గౌరికి తండ్రి హిమవంతుడు శివుని సంబంధమువలన పర్వతములన్నింటిలో పూజ్యుడ య్యెను. కైలాసము శివుని నివాసస్థానము. అది పాపముల నశింప జేయుటచే పర్వతములలో మిక్కిలి పూజింపతగిన దాయెను. సూర్యుడు గ్రహ నక్షత్రగణము లతో మేరుపర్వతమునకు ప్రదక్షిణము చేయు చున్నాడు. ఈ భూమిపై నున్న పర్వతములన్నిటిలోను తనను మించిన పర్వతము లేదని మేరువు తలచుచున్నది. దాని స్వాభిమానము దర్పము చూచినాకు నిట్టూర్పు వచ్చినదని చెప్పి గొప్ప తపస్సంపన్నులమైన మాకెట్టి యభిమానము లేదు. నేనిక పోయి వత్తునని పలికెను.

# శ్రీ దేవీ చరిత్రము

పిమ్మట దేవర్షి నారదుడు బ్రహ్మలోకమునకు వెళ్ళెను. ముని వెళ్ళిన పిమ్మట వింధ్యపర్వతము తీరని విచారములో మునిగెను. అతని హృదయములో దుఃఖము చెలరేగి శాంతి లేకుండెను. ఇప్పుడు నా కర్తవ్య మేమి? మేరువును గెలుచుటెట్లు? నామనస్సు నాకు శాంతియెట్లు లభించును? పూర్వము మహాత్ములెంతగనో నన్ను పొగడిరి. ఇప్పుడు నాకులము బలము పౌరుషము మేరువు ముందు దిగదుడుపుగా నున్నవి. మేరువును గెలుచుటెట్లు? అని మనస్సులో చెడుతలంపు రేకెత్తెను. ప్రతిదినము సూర్యుడు మేరుపర్వతమునకు ప్రదక్షిణము చేయుచున్నాడు. అందుకే మేరువు అంతగా గర్వపడుచున్నది. నేనిపుడు నా శిఖరములను పెంచి సూర్యగమనమున కాటంకము కలిగించెదను.

అప్పుడు సూర్యుడు ముందుకు పోగలేడు. మేరుపర్వతమునకు ప్రదక్షిణము చేయజాలడు. ఇట్లు నేను సూర్యుని మార్గము కడ్డు తగిలినచో మేరుపర్వత గర్వము అప్పుడు సర్వమును దిగిపోవును. అని నిశ్చయించుకొని వింధ్య పర్వతము తన శిఖరములతో ఆకాశము నొరయు చుపెరిగెను. సూర్యు డెప్పుడు

దయించును? నేనెప్పుడతని నడ్డగింతును? అని తలపోయు చుండగనే రాత్రి గడిచిపోయినది.

సూర్యకిరణములచే గాఢాంధకారము తొలగిపోయెను. తెల్లవారినది ఉదయాద్రి పై సూర్యుడావిర్భవించెను. తన కిరణములచే వెలుగులు విరజిమ్ము చుండెను. కమలములు వికసించినవి. ప్రాహ్లో పరాహ్ణ కార్యములన్నియు జరుగు చుండెను. అతర్కితమగు వింధ్యపర్వతము పెరుగుదలచే భాస్కరుని రథ గమనము మందగించెను. సూర్యుని సారథియైన అనూరుడు ముందుకు సాగలేక సూర్యునితో నిట్లు పలికెను. గర్వముతో వింధ్య పర్వతముపైకి పెరుగుచున్నది. నీవు ప్రదక్షిణించు మేరువుతో అది పోటీకి దిగినది. అని పలుకగా సూర్యుడు చింతాక్రాంతుడైనాడు.

ఆహా! ఎంత వింత! గగనమార్గము కూడ అడ్డగింపబడుచున్నదే! నా గుఱ్ఱములు ఆగిపోయినవి. దైవబలము గొప్పది. చిరకాలము త్రోవలో నడ్డుగానుండు వీనినెట్లు సహింతును? నా సంచార మాగినచో లౌకికవైదిక కార్యము లన్నియు సక్రమముగా జరుగనేరవు. పాశ్చాత్యులు దాక్షిణాత్యులు తెల్లవారలేదని కన్నులు తెరవరు. తూర్పున ఉత్తరమున నున్న ప్రజలు తీవ్రతాపముతో మగ్గిపోవు చున్నారు అని సూర్యుడు విచారించెను. ఇంద్రాది దేవతలేమి చేయుటకును తోచక విచారములో మునిగియుండిరి. తరువాత దేవతలందరును బ్రహ్మను ముందుంచుకొని వెళ్ళి శివుని శరణువేడిరి. పెక్కు విధముల వినయముతో నమస్కరించి చంద్రశేఖరుడగు దేవుని ప్రార్థించి నిట్లు స్తుతించిరి.

# దేవతలు చేసిన శివస్తుతి

శ్లో॥ జయదేవ గణాధ్యక్ష ఉమాలాలితపత్ర్కజ ।
అష్టసిద్ధి విభూతీనాం దాత్రే భక్తజనాయతే ॥
మాహామాయా విలసిత స్థానాయ పరమాత్మనే ।
వృషాంకాయామరేశాయ కైలాసస్థితిశాలినే ॥
అహిర్బుధ్న్యాయ మాన్యాయ మనవే మానదాయినే ।
అజాయ బహురూపాయ స్వాత్మారామాయ శంభవే ॥
గణనాథాయ దేవాయ గిరిశాయ నమోస్తుతే ।
మహావిభూతి దాత్రేతే మహా విష్ణుస్తుతాయ చ॥
విష్ణు హృంత్కంజవాసాయ మహాయోగరతాయ చ ।
యోగ గమ్యాయ యోగాయ యోగినాంపతయే నమః ॥

యోగీశాయ నమస్తుభ్యం యోగానాంఫలదాయినే ।
దీనదానపరాయాపి దయాసాగర మూర్తయే ॥
ఆర్తి ప్రశమనాయోగ్ర వీర్యాయ గుణమూర్తయే ।
వృష ధ్వజాయ కాలాయ కాలకాలాయతే నమః ॥

**స్తోత్ర భావము :-** గణాధ్యక్షా! పార్వతీ సేవితపాదపద్మా! భక్తులకు అష్టసమృద్ధుల నొసంగు మహాదేవా! నీకు జయమంగళము. మహామాయను కూడి విలసిల్లు పరమాత్మా! వృషభవాహన! అమరేశ్వరా! కైలాసవాసా! అహిర్బుధ్న్యా! మాన్య! మను! మానదా! అజా! బహురూపా! స్వాత్మారామా! శంభూ! గణనాధా! దేవా! గిరీశా! నీకునమస్కారములు. దేవా! యోగివర్యా! మహావిభూతి దాయకా! మహా విష్ణు సన్నుతా! విష్ణురూపా! విష్ణుహృదయ కమలావాసా! మహాయోగరతా! యోగ గమ్యా! యోగరూపా! యోగీశా! నీకు నమస్కారములు. దేవా! యోగివర్యా యోగి ఫలదాయకా! దయాసాగరమూర్తీ! దీనదయాపరా! కాల! కాలకాల! నీకు నమ స్కారములు అని స్తుతించిరి.

ఇట్లు స్తుతింపగా శివుడు నవ్వుచు దేవతలతో మీకోర్కెలను తీర్చెదనని పలికెను. అప్పుడు దేవతలిట్లనిరి:- సర్వ దేవేశా! గిరిశా! చంద్రశేఖరా! మహాబలా! మాకు మేలుకలుగు వెలుగుబాటను చూపించుము. వింధ్య మనుపర్వతము మేరుపర్వతముతో పోటీపడియెత్తు పెరిగి సూర్యగమనమున కడ్డునిలచెను. అది అందరకు బాధను కలిగించుచున్నది. ఈశానా! అనఘా దాని పెరుగుదల నాపుము. సూర్యుని గమనమాగినచో కాలము తెలియదుకదా! లోకములో స్వాహాస్వధా కారములు ఆగిపోయినవి. నీకంటె మాకు దిక్కెవ్వరు? గిరిజాపతీ! దేవా! దయ చూడుము. మా దుఃఖమును తొలగింపుము అని వేడిరి. అప్పుడు భగవంతు డిట్లనెను:-

దేవతలారా! వింధ్యపర్వతము పెరుగుదలను నేనాపజాలను. ఈ విషయము నంతను శ్రీమహావిష్ణువునకు తెలుపుదము. మన కందరకు ఆత్మప్రభువు పూజ్యుడు, కారణరూపుడు నతడే. గోవిందుడు, భగవానుడు, విష్ణువు సర్వకారణ కారణుడు. అతని వద్దకు వెళ్ళి అంతయు తెలియజేయుదము. అతడు యీ ఆటం కము తొలగింపగలడు. అను శివుని మాటలువిని బ్రహ్మ యింద్రుడు దేవతలు రుద్రుని ముందుంచుకొని వైకుంఠమునకు వెళ్ళిరి. అచట దేవదేవేశుడు జగత్పతి, రమాపతి, కమలపత్రాక్షుడు ప్రభాయుతుడు నగు విష్ణువును దర్శించిరి. దేవతలు భక్తి పారవశ్యముతో గద్గదస్వరమున విష్ణుమూర్తి నిట్లు స్తోత్రము చేసిరి:-

# దేవతలు చేసిన విష్ణుస్తుతి

శ్లో॥ జయవిష్ణో రమేశాద్య మహాపురుష పూర్వజ ।
దైత్యారే కామజనక సర్వకామ ఫలప్రద ॥
మహా వరాహ గోవింద మహాయజ్ఞ స్వరూపక ।
మహావిష్ణో ధ్రువేశాఽద్య జగదుత్పత్తి కారణ ॥
మత్స్యావతారే వేదానా ముద్ధారాధార రూపక ।
సత్యవ్రత ధరాధీశ మత్స్యరూపాయతే నమః ॥
జయాకూపారదైత్యారే సురకాయసమర్పక ।
అమృతాప్తి కరేశాన కూర్మరూపాయతే నమః ॥
జయాది దైత్య నాశార్థమాది సూకరరూపధృక్ ।
మహ్యుద్ధార కృతోద్యోగ కోలరూపాయతే నమః ॥
నారసింహవపుః కృత్వా మహాదైత్యం దదారయః ।
కరజైరవధ్యప్రాంగం తస్మై నృహరయే నమః ॥
వామనం రూపా మాస్థాయత్రైలోక్యైశ్వర్యమోహితం ।
బలిం సంఛలయామాస తస్మై వామనరూపిణే ॥
దుష్టక్షత్ర వినాశాయ సహస్ర కరశత్రవే ।
రేణుకా గర్భజాతాయ జామదగ్న్యాయతే నమః ॥
దుష్టరాక్షస పౌలస్త్య శిరశ్ఛేదపటీయసే ।
శ్రీమద్దా శరథేతుభ్యం నమోఽనంత క్రమాయచ ॥
కంస దుర్యోధనాద్యైశ్చ దైత్యైః పృధ్వీశలాంఛనైః ।
భారాక్రాంతాం మహీం యో సావుజ్జహార మహావిభుః ॥
ధర్మం సంస్థాప యామాస పాపంకృత్వాసుదూరతః ।
తస్మై కృష్ణాయ దేవాయ నమోస్తు బహుధావిభో
దుష్టయజ్ఞ విఘాతాయ పశుహింసా నివృత్తయే ।
బౌద్ధరూపం దధౌయోసౌతస్మై దేవాయతే నమః ॥
కల్కిరూపం సమాదధ్యౌ దేవ దేవాయతే నమః ।
దశావతారాన్తే దేవభక్తానాం రక్షణాయవై ।
దుష్టదైత్య విఘాతాయ తస్మాత్త్వం సర్వదుఃఖహ్వాత్ ।
జయభక్తార్తి నాశాయధృతం నారీజలాత్మను
రూపం యేనత్వయా దేవకోన్యస్త్వత్తో దయానిధిః ॥

**స్తోత్ర భావము:-** ఓ మహాపురుష! మహాపురుష పూర్వజ! రమాకాంత! నీకు జయమ్ము,కామ జనకా! కామఫలదాయకా! విష్ణు! నీకు జయమగుగాక,మహావరాహా గోవింద! మహాయజ్ఞ స్వరూపా! మహావిష్ణూ! జగదుత్పత్తి కారణ! మత్స్యావతార! వేదోద్ధారకా! ఈశా! నీకు జయమగుగాక. మత్స్యరూప సత్యవ్రతపరాయణా! దాన వాంతకా! సురకార్య నిర్వాహకా! దయాసాగరా! నీకు నమస్కారము. అమృతము సంపాదించిన దేవా! ఈశానా! కూర్మరూపా! నీకు నమస్కారములు. దానవ నాశకా! ఆది వరాహరూప! నీకు నమస్కారములు భూమి నుద్ధరించుటకు వరాహ రూపము తాల్చినదేవా! మహాదైత్యుని చంపిన నరసింహరూపా! నీకు నమస్కారములు. వాడి గోళ్ళతో రాక్షసుని చీల్చిన నరసింహా! నీకు నమస్కారములు. వామనరూపమున త్రిలోక సంపదలకు గర్వించిన బలినణచి వైచితివి. బలి గర్వమణచిన వామనునకు నమస్కారములు. కార్తవీర్యార్జును నోడించిన వాడు దుష్టక్షత్రియులను దునుమాడినవాడు రేణుకకు జన్మించినవాడైన పరశు రామ రూపము దాల్చిన దేవా! నమస్కారములు దుష్టరాక్షసుడైన రావణాసురుని శిరముదును మాడినవాడును అనంత విక్రముడు ధర్మవిగ్రహుడు మోహన రూపుడునైన దశరథరాముడవు నీవు నీకు నమస్కారములు. కంసుడు దుర్యోధ నుడు మొదలగు రాక్షసరాజు లను భూమి భరింపలేకుండెను.

అప్పుడు ధర్మస్థాపనకు పాపులను చంపి భూభారమును తగ్గించితిని. అట్టి కృష్ణపరమాత్మవు విభువునగు నీకు పలుమార్లు నమస్కరించుచున్నాను. యజ్ఞ ములు వలదని పశుహింస తగదని ప్రబోధము చేసినవాడవు. బుద్ధరూపము దాల్చిన దేవుడవు నీకు నమస్కారములు. దేవతలు పీతవస్త్రధారి దేవదేశుడగు విష్ణువును స్తుతించిరి. వారి స్తోత్రము నాలకించి పురుషోత్తముడు నవ్వుచు దేవతలతో నిట్లనెను.

దేవతలారా! మీ స్తోత్రమునకు సంతసించితిని. మీరు చేసిన యీ స్తోత్రము సమస్తసుఖముల నిచ్చును. వేయేల ఈ స్తోత్రము సకలార్థసాధకము దీనిని చదివిన వారికి భుక్తిముక్తులు కరతలామలకములు దేవతలారా! మీ దుఃఖ మును తెలుపుడు. దానిని తప్పక తొలగింతును. ఈ విషయమున రవ్వంతయు సందే హము లేదు. అను భగవంతుని మాటలను దేవతలు విని తమ విషయము నిట్లు తెలుపమొదలు పెట్టిరి. దేవదేవా! సృష్టి స్థిత్యంత కారణ! విష్ణూ! వింధ్య పర్వతము సూర్యుని మార్గమున కడ్డముగా నిలిచి కదలుటలేదు. సూర్యుని సంచార మాగి పోవుటచే మాకు హవిర్భాగములు అందుటలేదు. ఇప్పుడేమిచేతుము? ఎక్కడకు పోదుము? అని అడిగిరి.

# అగస్త్యుడు వింధ్య పర్వతమును అణచుట

విష్ణుమూర్తి దేవతలతో ఇట్లు చెప్పదొడగెను. సమస్త జగత్తులను సృష్టించుదేవి అందరకు పూజనీయురాలు. ఆమెను పూజించువాడు గొప్ప శక్తిమంతుడు. అట్టి శక్తి గలవాడు అగస్త్యమహా ముని. అతడు కాశీనగర మందు నివసించు చుండెను. వింధ్య పర్వతము నణచగలిగిన వాడతడొక్కడే. అతడు తేజశ్శాలి బ్రాహ్మణ శ్రేష్ఠుడు ఆమునివర్యుని సంతోషింప జేయుడు. అతనివలన నీకార్యము తప్పక ఫలించునని చెప్పగా దేవతలు హరికి సవినయముగ నమస్కరించి కాశీనగరమునకు వెళ్లి అచట దాన ధర్మాదులొనరించి మునియొక్క ఆశ్రమము చేరిరి. ఆయాశ్రమము ప్రశాంతముగా నుండెను. అనేక జంతువులు కూడా పరస్పర వైరమును మాని స్వేచ్ఛగా సంచరించుచుండెను. మునివర్యుడు ప్రశాంతితో ప్రసన్నుడై ప్రకాశించుచుండెను. దేవతలు మునిని దర్శించి నమస్కరించిరి. బ్రాహ్మణోత్తముడగువానితో మునివర్యా! కుంభసంభవా! లోపాముద్రాపతీ! నీకు నమస్కారములు. నీటిని నిర్మలము చేయునుదయము గల మహర్షీ! నీకు నమస్కారములు. పూజ్యా! భార్యాసమేతా! నీకు నమస్కారములు. ప్రసన్నుడవగుము నీకు మేము శరణాగతులము. దుస్తరమైన వింధ్యపర్వత ప్రవర్ధనముచే మేము సంకటముల పాలైతిమి అని పలుకగా అగస్త్య మహాముని నవ్వుచు దేవతలారా! మీరు మహాత్ములు. మీరే పనినైన సాధించగలరు. ఐనను నావలనకాగల పనియున్నచో తెలుపుడు. నాశక్తి కొలది మీకు సహాయము చేయగలను. అని అగస్త్యుడు పలికెను.

మహర్షీ! వింధ్యపర్వతము సూర్యుని గమనము నడ్డగించినది. అందుచే ముల్లోకములు హాహాకారములు చేయుచున్నవి. మునీశా! నీపుణ్యతపస్సు ప్రభావమున ఆ పర్వతము తప్పక లొంగిపోగలదు. ఇది మాకు మీరు చేయవలసిన మహోపకారము అని దేవతలు ప్రార్థింపగా అగస్త్యమహర్షి మీకార్యము తప్పక నెరవేర్చగలనని మాట యిచ్చెను. దేవతలెల్లరు మహానందభరితులైరి.

# శ్రీ దేవీ చరిత్రము

తరువాత తన భార్యతో కాశిని విడిచి వెళ్ళ వలసిన యవసరమేర్పడినదని చెప్పి శ్రీ విశ్వనాథ దండపాణి కాలభైరవాది దేవతలకు నమస్కరించి సాక్షిగణపతి సన్నిధికి వెళ్ళి ప్రార్థించి దక్షిణ దిక్కుగా బయలుదేరెను. కాశీనగరమును వదలు చున్నందుకు బాధపడి ముని కాశికాశి యనిస్మరిస్తూ తన భార్యతో బయలు దేరెను. అర్ధనిమేష కాలమున సూర్యునడ్డగించియున్న వింధ్యపర్వతమును చేరెను.

తనయెదుట నిలిచిన మహర్షినిచూచి వింధ్యపర్వతము భయభక్తులతో పాదములకు నమస్కరించెను.

అగస్త్యమహర్షి ప్రసన్నవదనముతో వింధ్యపర్వతమును చూచి యిట్లనెను. వత్సా! నేను మరల తిరిగివచ్చువరకు నీవిటులేయుండుము. నీయెత్తైన శిఖరములను నేనెక్కలేను. అని ముని దక్షిణదిశకు వెళ్ళ ప్రయత్నించెను. వింధ్యను దాటి దక్షిణదిశగా వెళ్ళి ఆ మార్గములో శ్రీశైలమును దర్శించెను. పిమ్మట అచట నుండి మలయాచలమునకు వెళ్ళి అక్కడ నివసించుట కాశ్రమము నిర్మించుకొనెను. పూర్వము స్వాయంభువమనువు పూజించిన దేవికూడ వింధ్య పర్వతముపై స్థిరముగా నుండుటవలన ఆమెకు వింధ్యవాసిని యనుపేరు యేర్పడినది. జగదంబానుగ్రహముచేతనే అగస్త్యుడు వింధ్యపర్వతము నణచగలిగెను.

# మన్వంతర వృత్తాంతము - శ్రీదేవీ మహిమ

శ్రీనారాయణుడు నారదునకు దేవీమహాత్మ్యము వివరించుచు నిట్లు పలికెను. అంగరాజకుమారుడు చాక్షుషమనువు. ఇతడారవమనువు. ఇతడు పులహుడను మహర్షి వద్దకు వెళ్ళి అతనికి శరణు జొచ్చి ఇట్లు ప్రార్థించెను "బ్రహ్మర్షీ! దిక్కులేని వారిని కాపాడువాడా! నాకు సంపదలు కలుగు మార్గము నుపదేశింపుము. నేనీ భూమండలమునకు రాజగునట్లును. పుత్రపౌత్ర సంతానము, సంపూర్ణాయువు చివరకు మోక్షము లభించు నట్లనుగ్రహింపుము" అని ప్రార్థించెను. ముని ఆ మాటలు విని అమ్మవారిని సేవింపుము. ఆమె మాటలు వినుము. నీవు మంగళగౌరి నారాధించినచో యామె దయవలన నీకు సమస్తము లైన కోరికలును ఫలించగలవు. అని మహర్షి చెప్పెను. అంతట మహర్షీ! లోకజనని యారాధనమెట్లు చేయ వలయును? దయతో నాకు వివరింపుమని మనువు ప్రార్థించెను.

ముని యిట్లు చెప్పెను. శ్రీదేవి పూజావిధానము పరమ శాశ్వతమైనది. దివ్యమైనది. శ్రీ మహాసరస్వతీ బీజమును నిరంతరము జపము చేయుము. దానిని మూడు వేళలందును జపించువాడు భుక్తిముక్తులను పొందగలడు. ఆ వాగ్భవ బీజమును మించినది యేదియును లేదు. ఈ జపము చేత సాధకుడు బలవీర్యవృద్ధి సిద్ధులను పొందగలడు. దీనిని జపించియే బ్రహ్మ, సృష్టి చేయగలవాడయ్యెను. విష్ణువు దీనిని జపించి సృష్టిని పాలించుటలో పేరు పొందెను. రాజా! శివుడు దీనిని జపము చేసి సంహారము చేయగలిగెను. లోకపాలకులు దీనిని జపించియే నిగ్రహానుగ్రహ సమర్థులై బలవీర్య సంపదచే ప్రసిద్ధులైరి. కనుక నీవును సరస్వతీ బీజమును జపించి జగదంబికను సేవించి, ఆమె దయవలన కొలది

కాలములోనే మహాసంపదలను పొందగలవు. ఇట్లు పులహముని ప్రబోధింపగా అంగపుత్రుడు తపము చేయుటకు విరజానదీ తీరమునకు వెళ్ళెను. అచట వాగ్భవ బీజమును జపించుచు ఆకులు - అలములు తినుచు తీవ్రముగా తపస్సు చేసెను.

ఆ రాజు తొలి సంవత్సరము చిగురుటాకులు, రెండవయేడు నీరు మాత్రమే త్రాగుచు, మూడవయేడు గాలి మాత్రమే ఆహారముగా కలవాడై స్థాణువువలె కదలకుండెను. ఈవిధముగా పన్నెండు సంవత్సరములు వాగ్భవబీజమును జపించుచు ఆహారమును మానుటవలన అంగ రాజకుమారునకు మంచిబుద్ధి కలిగెను. ఇట్లేకాంతములో దేవి పరమ మంత్రము జపించుచుండగా జగన్మాతయైన పరమేశ్వరి తనంతట తానే ప్రత్యక్షమయ్యెను. ఆ సర్వదేవమయి జ్యోతిర్మయి మహేశ్వరి సుప్రసన్నయై లలిత మధుర వచనములతో అంగరాజుపుత్రున కిట్లనెను:- రాజా! నీ మనస్సులోని కోరికను తెలుపుము నీ తపమునకు సంతసించి తిని. శుభములైన వరములను వర్షింతును అనిపలుకగా. దేవతలచే పూజింపబడు దేవేశీ! నాభాగ్యముచే నీవు దర్శనమిచ్చితివి. నేనొక మన్వంతరము వరకు రాజ్యపరి పాలనము చేయునట్లు వరమిమ్మని ప్రార్థించుచున్నాను అనెను.

దేవి రాజా! నీకు మన్వంతరమంత కాలము సుస్థిరమైన రాజ్యము నిచ్చితిని. నీకు బలవిక్రమ సహితులు సుగుణ శాలురునగు కుమారులు పుట్టగలరు. నీ రాజ్యమున కెదురు లేదు. చివరకు నీకు మోక్షము కూడ లభించును. అని వరముల నిచ్చెను. అతని భక్తికి సంతసించుచు దేవి యంతర్ధానమందినది. అతడు భగవతి దయవలన అరవమనువయ్యెను. మరియు నాతడు మాన్యుడై సర్వసుఖములను పడసెను. అతని కుమారులు బలవీర్య సంపన్నులై కార్యభారనిర్వహణ సమర్థులై వన్నెకెక్కిరి. దేవీభక్తులు శూరులు పరాక్రమవంతులు మాననీయులు మహారాజ్య సుఖవంతు లునై కీర్తి నొందిరి. ఇట్లే చాక్షుషమనువు శ్రీదేవి నారాధించుటచే ముక్తిని పొందెను.

# మన్వంతర కథనము - సురథుని కథ

నారదుడు ప్రశ్నింపగా నారాయణుడు సురథుడను రాజు చరిత్ర నిట్లు చెప్పెను:- చైత్రవంశమునందు జన్మించిన సురథుడను రాజు మిక్కిలి బలపరాక్ర మములు గలవాడు. అతడు గుణగ్రాహి, కవి, యాచకులపాలిటి కల్పవృక్షము సకల శాస్త్రములందు నేర్పరి. ఒకప్పుడు శత్రువులు మ్లేచ్ఛులుసేనలతో వచ్చి యాతని నగరమును చుట్టుముట్టిరి. సురథుడు నగరము వెలుపల శత్రువు లను జయించుటకు సైన్యముతో సిద్ధపడెను. దైవవశమున ఆ యుద్ధములో సురథుడు

వాని మంత్రులు శత్రువులచేతిలో ఓడిపోయిరి. అతని ధనాగారము శత్రువుల వశమయ్యెను. పరాక్రమశాలియైన సురథుడు నగరమునుండి వెడల గొట్టబడెను. అతడు వేటనెపముతో గుఱ్ఱమెక్కి కలతఁ జెందిన మనస్సుతో జనసంచారములేని అడవియందు తిరుగుచుండగా ఒక మునియాశ్రమము కనబడెను. ఆశ్రమములో జంతువులు సైతము ప్రశాంతమగ నున్నవి. అనేకులు శిష్యులు అచటి సుమేధ సుడను మహర్షికి సేవలు చేయుచు ప్రశాంతచిత్తులై యుండిరి. పరమ పవిత్రమైన ఆయాశ్రమమందు రాజు సురథుడు కొంతకాలము నివసించెను.

ఒకనాడు సురథుడు ముని యనుష్ఠానము పూర్తియైన పిమ్మట ఆతని వద్దరకు వెళ్ళి నమస్కరించి వినయముతో తానొకరాజునని, శత్రువులు జయింపగా నగరమును విడిచి అరణ్యమునకు వచ్చితినని తన వృత్తాంతము మహర్షికి తెలియ జేసెను. ధనాగారమును, రాజ్యమును, ఆప్తులను కోల్పోయి మిక్కిలి బాధపడు చున్నానని మనవి చేసెను. మరియు నా యీ దుఃఖమెట్లు శాంతించును? నేనేమి చేయుదును? ఎక్కడకు పోదును? వేదవేత్తవగు మహర్షీ! నీ వనుగ్రహించి యేదేని యుపాయము చెప్పుము. నాకు మనశ్శాంతి ననుగ్రహింపుము అని ప్రార్థింపగా ముని యిట్లు రాజునకు చెప్పెను:-

రాజా! పరదేవత యొక్క అనుగ్రహ మాహాత్మ్యము సమస్త బాధలను తీర్చి సుఖముల నొసగగలదు. గొప్ప ఆశ్చర్యకరము యేమనగా. ఆ దేవి జగజ్జనని, హరిహరబ్రహ్మలను పుట్టింప జాలినది విశ్వమోహిని. సమస్త లోకములను లోకు లను తన మాయా మోహములో ముంచివేయగల శక్తితో కూడినది. ఆమె లోకము లను పుట్టించి రక్షించుచుండును. చివరికాలమున ఆమెయే రుద్రరూపముతో నంతయునంత మొందింపగలదు. సమస్త జగత్తులు నామెయందు పుట్టి యామె యందే పెరిగి పెద్దవగుచున్నది. చివరి కన్నియు నామె యందేలయించుచున్నవి. ఆ దేవి యనుగ్రహమెవనిపైబడునో ఆతడు మోహమునుండి విముక్తుడగును. అని చెప్పగా రాజు మహర్షీ! నీవు చెప్పిన ఆ దేవియేవరు? ఆమె ప్రాణుల నెల్లరను యేల మోహితులను చేయుచున్నది? మహర్షీ! ఆ దేవి యెవరివలన పుట్టినది? ఆమె పేరేమి? రూపము ఏది? ఆత్మ అనగా ఏది? ఈ సంశయము లన్నియు తొలగిపోవునటుల వివరముగా తెలియజేయగోరుచున్నాను అని అడిగెను.

## శ్రీదేవీ చరిత్రము

అప్పుడు మునియిట్లు చెప్పనారంభించెను. ఓ రాజా! పూర్వము యోగీశ్వ రుడైన శ్రీమన్నారాయణుడు జగత్తులనన్నిటిని లయమొనర్చి క్షీరసముద్రమున

శేషతల్పముపై యోగనిద్రలో మునిగి యుండెను. అప్పుడు దేవదేవుడగు విష్ణువు చెవుల మాలిన్యము నుండి మధుకైటభులను రాక్షసులు పుట్టిరి. ఆ రాక్షసులు బ్రహ్మను చంప పూనుకొనగా మధుకైటభుల క్రూరస్వభావమును గ్రహించి బ్రహ్మ దేవుడు ప్రార్థించినను దేవ దేవుడు నిద్ర నుండి మేల్కొనలేదు. రాక్షసులు క్రూరులై యున్నారు. ఇప్పుడు నాకేమి గతి? నేనిప్పుడేమి చేయవలెను? ఎక్కడకు వెళ్ళను? అని బ్రహ్మ విచారించుచుండగా అతని బుద్ధికి నిద్రాదేవిని శరణుజొచ్చినచో ఆమె యనుగ్రహముచే శ్రీహరి మేల్కొనగలడని తోచెను.

# బ్రహ్మ చేసిన శ్రీదేవీస్తుతి

బ్రహ్మ అప్పుడు దేవినిట్లు స్తుతించెను. ఓ మహామాయా! ఎల్లవారును నీయాజ్ఞకు లోబడుదురు.

శ్లో॥ కాళరాత్రి ర్మహారాత్రి ర్మోహరాత్రి ర్మదోత్కటా ।
వ్యాపినీవశగా మాన్యా మహానందైకశేవధిః ॥
మహనీయా మహారాధ్యా మాయా మధుమతీ మహీ ।
పరాపరాణాల సర్వేషాం పరమాత్వం ప్రకీర్తితా ॥
లజ్జా పుష్టిః క్షమా కీర్తిః కాంతిః కారుణ్యవిగ్రహా ।
కమనీయా జగద్వంద్యా జాగ్రదాదిస్వరూపిణీ ॥
పరమాపరమేశానీ పరానంద పరాయణా ।
ఏకాప్యేక స్వరూపా చ సద్వితీయాఽద్వయాత్మికా ॥
త్రయీ త్రివర్గనిలయా తుర్యాతుర్య పదాత్మికా ।
పంచమీ పంచభూతేశీ షష్ఠీ షష్ఠీశ్వరీతిచ ॥
సప్తమీ సప్తవారేశీ సప్తసప్త వరప్రదా ।
అష్టమీ వసునాథాచ నవగ్రహ మయీశ్వరీ ॥
నవరాగ కళారమ్యా నవసంఖ్యానవేశ్వరీ ।
దశమీ దశ దిక్పూజ్యా దశాశా వ్యాపినీరమా ॥
ఏకాదశాత్మికా చైకాదశరుద్ర నిషేవితా ।
ఏకాదశీతిథి ప్రీతా ఏకాదశ గణాధిపా ॥
ద్వాదశీ ద్వాదశ భుజా ద్వాదశాదిత్య జన్మభూః ।
త్రయోదశాత్మికాదేవీ త్రయోదశ గణప్రియా ॥
త్రయోదశ భిదా భిన్నా విశ్వేదేవాధి దేవతా ।
చతుర్దశేంద్ర వరదా చతుర్దశమను ప్రసూః ॥

పంచాది దశీ వేద్యా పంచాధికదశీతిధిః ।
షోడశీ షోడశ భుజా షోడశేందు కళామయీ ॥
షోడశాత్మక చంద్రాంశు వ్యాప్త దివ్యకళేబరా ।
ఏవం రూపాసి దేవేశి । నిర్గుణే తామ సోదయే ॥
త్వయాగృహీతో భగవాన్ దేవదేవో రమాపతిః ।
ఏతే దురాసదౌ దైతౌ విక్రాంతౌ మధుకైటభౌ ॥
ఏత యోశ్చవధార్థాయ దేవేశంప్రతి బోధయ ॥

**స్తోత్రభావము:-** ఓ కాళరాత్రీ! మహారాత్రీ! మోహరాత్రీ! మదోత్కటా! విశ్వవ్యాప్తా వశగామినీ! మాన్య! పరమానంద రసనిధీ! మహనీయా! మహారాధ్యా! మూల ప్రకృతీ! మధుమతీ! మహాదేవీ! పరాపరులకెల్ల పరమ స్వామిని. వన్నెకెక్కిన దానవు లజ్జ, పుష్టి, కాంతి, కీర్తి, కారుణ్యమూర్తి, మనోహారిణి జగన్నుత జాగ్రదాది స్వరూపిణి, పరదేవతా, పరమేశాని, పరానందపరాయణి, ఏకవచనమున ఏకవై ద్వివచనమున ద్వయవై, త్రివర్గ రూపమున త్రయీమయివై, తుర్యావస్థను చెందుట చేతురీయవై, పంచ భూతేశ్వరివగుటచే పంచమివై, షష్ఠీశ్వరివగుటచే షష్ఠివై, సప్తవారములకు ఈశానివైన సప్తమివి. సప్తసప్త వరదాయినివి,వసువులకు ఈశాని వగుటచే అష్టమివై, నవగ్రహమయివై వానికీశ్వరివి. నవశృంగార కళల సుందరివై, నవేశ్వరివై నవసంఖ్యవై యుండుటవలన నవమివై, దశదిశల వ్యాపించిన రమా దేవివి. దశదిశల పూజ్యురాలవగుటచే దశమివై, ఏకాదశ రుద్ర సంసేవితవు, ఏకాదశాత్మికవు ఏకాదశగణేశ్వరివి అగుటచే ఏకాదశివి. ద్వాదశాదిత్యులకు జననివి, ద్వాదశభుజవు నగుటచే ద్వాదశివి. త్రయోదశ గుణ ప్రియవు త్రయోదశాత్మికవు అగుటచే త్రయోదశివి.

విశ్వేదేవతల కధీశ్వరివై చతుర్దశేంద్రులకు వరము లిచ్చుటచే చతుర్దశ మనువుల సృష్టిచేసిన దానవగుటచే చతుర్దశివి. కామరాజ విద్యాస్వరూపిణి వగుటచే పంచదశివి. షోడశభుజవై షోడశ చంద్రకళలతో పూర్ణిమా చంద్రకిరణా లతో నిండిన దానవగుటవలన షోడశివై నీవు విశ్వవిఖ్యాతి గాంచితివి. దేవేశ్వరీ! ఇట్టి రూపగుణములతో కూడియు నిర్గుణవు. చీకటి యారంభించినపుడు దేవదేవే శుడు భగవంతుడగు రమాపతిని నీవావేశించితివి. ఈ మధుకైటభ రాక్షసులను చంపుటకై నీవు నారాయణుని మేల్కొలుపుము' అని ఇట్లు స్తుతింపగా తామసీ దేవి నారాయణుని వదలి రాక్షసులను మోహితుల నొనర్చెను. అంతట పరమాత్మ విష్ణువు వారిని సంహరించెను.

## శ్రీదేవీ చరిత్రము - మన్వంతర వృత్తాంతము

నారుదుడు స్వాయంభువమనువు పిమ్మట మనువుల చరిత్రము తెలుపు మనగా నారాయణుడిట్లు చెప్పెను. స్వాయంభువమనువున కిరువురు కుమారులు. ఉత్తానపాదుడు, ప్రియవ్రతుడనువారలు. రెండవ మనువు స్వారోచిషమనువు. అతడు ప్రియవ్రతుని పుత్రుడు. అతడు కాళిందీ తీరమున నాశ్రమము నిర్మించు కొని పండుటాకులు తినుచు తపమొనర్చెను. పన్నెండేళ్ళు తపస్సు చేయగా దేవి సాక్షాత్కరించెను. దేవి యాతని స్తోత్రమునకు ప్రసన్నురాలై వానికి మన్వంతర రాజ్యము ననుగ్రహించెను. అందుచే దేవికి "తారిణి" యను నామము ప్రసిద్ధ మయ్యెను. అతడు యథావిధిగ రాజ్యము నొనర్చితుదకు తన రాజ్యమును కుమారులకు వప్పచెప్పెను. తన మన్వతరము పూర్తియైన పిదప స్వర్గమలంక రించెను. ప్రియవ్రతుని కుమారుడు ఉత్తముడను పేర ప్రసిద్ధినొందెను.

అతడు వాగ్బీజమును జపించి నిష్కంటకమైన రాజ్యమును పూర్ణాయువులగు పుత్రులను పొందెను. అతడు రాజ్యసుఖము లనుభవించి స్వర్గము లంకరించెను. నాల్గవ మనువు తామసుడు. అతడు కూడ ప్రియవ్రతుని కుమారుడే. అతడు నర్మదా నదీతీరమున విశ్వమాతను కొలిచెను. అతడు దేవిని ప్రసన్నురాలను చేసికొనెను. అతనికి పదిమంది పుత్రులు. అతడు స్వర్గస్థుడైన పిమ్మట వాని సోదరుడు రైవతుడై దవమనువు. అతడు కామరాజ మంత్రమును జపించి సర్వ సిద్ధులు లభించుశక్తిని పొందెను. చిరాయువులగు పుత్రపౌత్రులను పడసెను. ఇట్లు రైవతమనువు ధర్మము నెలకొల్పి రాజ్యసుఖములననుభవించెను.

## శ్రీదేవీ చరితము - మహిషాసురమర్ధనము

రాజా! ఇపుడు మహాలక్ష్మి ఆవిర్భావమును చెప్పెదను వినుమని వ్యాసుడిట్లు పలికెను. మహిషి కడుపున పుట్టి ఎల్లవేల్పుల జయించి మహిషారుడు జగములకు ప్రభువయ్యెను. అతడు అధికారబలగర్వముతో లోకపాలకుల జయించి త్రిలోక సంపదలననుభవించెను. అపుడు దేవతలోడిపోయి స్వర్గము వదలి బ్రహ్మను ముందుంచుకొని శివకేశవుల వద్దకు వెళ్ళిరి. వీరితో మహిషుని చెడునడువడినిట్లు విన్నవించిరి. బలవీర్యమదోద్ధతుడై మహిషుడు ఎల్ల దేవతలస్థానములు వశము చేసికొని సంపదల ననుభవించుచున్నాడు. అని దేవతల ఆర్తిని వినగనే హరిహరు లకు దానవునిపై తీవ్రకోపము కలిగెను. రాజా! అట్లు కోపించిన హరి ముఖము నుండి వేయి సూర్యుల కాంతి ఆవిర్భవించెను. అట్లే యితర దేవతల శరీరముల

నుండియు దివ్యతేజములుద్భవింపగా సురలు సంతసించిరి. ఎల్ల దేవతల తేజముల నుండి మహిషాసురమర్దినిదేవి అవతరించెను.

అపుడు శివుడు శూలమును విష్ణువు చక్రమును వరుణుడు పాశము అగ్ని శక్తిని వాయుధనుర్బాణములను మహేంద్రుడు వజ్రాయుధమును యముడు కాలదండమును సాగరుడు కత్తిడాలును దేవికి సమర్పించిరి. దేవతలనేక విధము లైన ఆభరణములను కూడ దేవికిక్కైసేసిరి. మహిష పీడితులగు దేవతలెల్లరు శ్రీ మహాదేవిని సంస్తుతించిరి. దేవతల పూజకు స్తోత్రములకును దేవి ప్రసన్నురా లాయెను. అంతట శ్రీదేవి మహిషుని చంపుటకు భీకరమగు మహానాదమొనర్చెను.

రాజా! ఆ మహానాదము వినగనే మహిషాసురుని గుండె గడగడలాడెను. అపుడు మహిషుడు గొప్పసేనతో దేవి వద్దకు వెళ్ళెను. ఆమెతో పోరాటమునకు సిద్ధపడెను. అతడు శస్త్రాస్త్రములతో ఆకాశమున కప్పివైచెను. చిక్షురగ్రామణి దుర్ధరాది రణశూరులు వానికి తోడై వచ్చిరి. కోప తామ్రాక్షి విశ్వమోహిని యగుదేవి మహిషుని పక్షమున వచ్చిన యోధుల నెల్లరణమున నేలగూల్చెను. వారెల్లరు చావగనే మహిషునకు పిచ్చకోపము వచ్చెను. అతడనేక మాయలను ప్రదర్శించెను. మహా మాయ వాని మాయలన్నిటిని మట్టుపెట్టెను. తుదకు మహిషరూపముతో కనిపించెను. అపుడా మహాదేవి ఆ రాక్షస పశువును యమపాశముతో బంధించి వాడియైన ఖడ్గముతో వాని తలనొక్క వ్రేటున నరికివైచెను. అట్లు దేవాంతకుడగు మహిషుడు మరణించెను. రాక్షససేనలో హాహాకారములు చెలరేగెను. మిగిలిన సేనలు చెల్లా చెదరయ్యెను. దేవతలెల్లరు ఆనందభరితులై శ్రీదేవిని స్తుతించిరి. ఈ ప్రకారము మహిషాసురమర్దిని శ్రీమహాలక్ష్మి యవతరించెను.

## మన్వంతర కథనము - మనుపుత్రుల తపము

శ్రీనారాయణుడు వినినంత మాత్రముననే దేవీ భక్తి తప్పక కలుగునట్టి యితర మనువుల పుట్టుకలను నారదునకిట్లు వివరింప మొదలుపెట్టెను:- శ్రీవైవస్వతమనువునకు ఆరుగురు పుత్రులు జన్మించిరి. వారు కరూషుడు, వృషధ్రుడు, నాభాగుడు, దిష్టుడు, శర్యాతి, త్రిశంకుడు అనువారు మహాబల శాలురు. వీరారుగురును కాళిందీనది ఒడ్డునకు వెళ్ళిరి. వారక్కడ నిరాహారులై గాలిని బంధించి దేవీ మూర్తిని నిర్మించుకొని వేర్వేరుగ పూజింపసాగిరి. దేవిని వివిధోపచారములతో భక్తిగా పూజించుచుండిరి. వారు తపః ప్రభావముచే మహా పరాక్రమశాలురైరి. కొంతకాలము యెండుటాకులుతిని మరికొంత కాలము వాయుభక్షులై పడరానిపాట్లుపడిరి. వారు భక్తితో గౌరవముగా దేవిని సేవించు

చుండగా వారికి మోహనాశకరమైన నిర్మలమైనబుద్ధి యేర్పడెను. వారు నిరంత రము దేవి పాదములే చింతించుచు తమ నిర్మల హృదయ మందెల్ల లోకములను దర్శించుచు తాము చేసిన తీవ్రతపస్సునకు ఫలముగా అద్భుతమైన దేవీ సందర్శన భాగ్యమును పొందిరి. ఈవిధముగ పన్నెండేండ్లు గడిచిన పిమ్మట జగదీశ్వరి వేల సూర్యుల కాంతితో మిరుమిట్లు గొలుపుచు వారికి ప్రత్యక్షమయ్యెను. ఆర్గురు కుమారులును విమలాత్ములై దేవిని సందర్శించిరి. వారు భక్తి వినయములతో కూడిన హృదయములతో శ్రీదేవినిట్లు స్తుతించినారు:-

ఓ మహేశ్వరి! ఈశాని! పరమాకరుణాలయా! నీకు జయము. వాగ్భవ మంత్రముచే ప్రతిపాదింపబడు దేవీ! క్లీంకారమూర్తీ! దేవి! ఈశ్వరప్రియా! కామరాజజపముచే ఆనందమునిచ్చు దేవీ! మహామాయా! మహా సామ్రాజ్య దాయినీ! ఆనందమయి! హరిహర రవి మహేంద్ర స్వరూపిణీ! ప్రసాద సుముఖీ! దేవీ! నీకు జయము అని స్తుతించిరి.

అప్పుడు శ్రీదేవి యిట్లు పలికెను:- మహాత్ములైన రాజపుత్రు లారా! నాయుపాసనచే మీరు తపోమయుల్సునిర్మలచిత్తులు మంచిబుద్ధిగలవారు నైతిరి. వరములను కోరుకొనుడు. నేను మీ యెడల ప్రసన్నురాలనైతిని మీ మనస్సులందలి కోరికలను తెలుపుడు అనగా రాజపుత్రులు దేవీ! మాకు నిష్కంటకమైన రాజ్యము, చిరంజీవులగు పుత్రులును కావలయును. మాకు తరుగని భోగభాగ్యములు, యశము, తేజము, మతి కలుగ వలయును. ఇదే మేము కోరు విషయము అని పలికిరి. శ్రీదేవి యిట్లనెను:-

రాజ పుత్రులారా! నాదయవలన మీకు అఖండ బలసంపదలు. యశము, తేజము విభూతలు వరుసగా కలుగ గలవు. మీరెల్లరు మన్వంతరములకు పతులుకా గలరు. చిరంజీవులైన పుత్రులతో భోగభాగ్య సంగమములతో ఆనందింపగలరు అని పలికెను. ఇట్లు భ్రామరి జగదంబ వారిచేత భక్తితో స్తుతింపబడి వారికి వరములొసగి యంతర్ధానమయ్యెను. మరియు ఆ రాజపుత్రులు ఆ జన్మలోనే ఉత్తమమైన సకల రాజ్యభోగముల ననుభవించిరి. అఖండ సంతానముచే వంశ వృక్షమును పెంపొందించుకొనిరి. తుదకు మనువులైరి. అని శ్రీ నారాయణుడు వివరించెను.

## భ్రామరీ వృత్తాంతము

మనువులు పదునలుగురు మహా తేజస్సంపన్నులు మహాబలశాలురై భ్రామరీ దేవిని కొలుచుటవలన ఆదేవి యనుగ్రహముచే లోకవంద్యులు పూజ్యులునైరి.

అని నారాయణుడు చెప్పగా నారదుడు భ్రామరీదేవి యెవరు? ఎట్లవతరించెను? ఆమె శక్తి ఎట్టిది? తెలియజేయుమని ప్రార్థించెను? అప్పుడు నారాయణుడు నారదా! జగన్మాతచేష్టలు విచిత్రములు మోక్షప్రదములును. దేవి అచింత్య-అవ్యక్తరూపిణి. దేవి దివ్యచరిత్రలన్నియు నీలోకము నుద్ధరించుటకే. తల్లి పనులన్నియును నిష్కపటమైన దయజాలువార్చుచు తనయుని కాపాడుటకేగదా!

పూర్వము బలశాలి దేవతలకు శత్రువు పాతాళనివాసి మహాక్రూరుడు దుష్టాత్ముడైన "అరుణుడ"ను రాక్షసుడుండెను. అతడు దేవతలను గెలుచుటకు తన రక్షణకొరకును బ్రహ్మనుద్దేశించి ఘోరముగ తపమాచరించెను. అతడు మంచు కొండకు వెళ్ళి ఆకులనే తినుచు ప్రాణయామ పరుడై పవిత్ర గంగా తీరమున యోగముపూనెను. అతడు నీరు మాత్రమే ఆహారముగా తీసికొని తపస్సు చేసెను. మరియొక పదివేలేండ్లు గాలి పీల్చుచు గాయత్రిని జపించుచు తపస్సు చేసెను. ఏయాహారము తీసికొనకుండా మరొక పదివేల సంవత్సరములు తపస్సు నాచరించెను. అట్లు తపస్సు చేయుచుండగా అతని శరీరము నుండి పెద్దమంటలు చెలరేగి ఆశ్చర్యకరముగ లోకములనే కాల్చివేయనారంభించెను. దేవతలిదేమని భయకంపితులై బ్రహ్మను శరణువేడిరి. లోకములట్టుడికి పోవు చుండెను. దేవతల విన్నపమాలకించి గాయత్రితో హంసనెక్కి బ్రహ్మ అరుణుని వద్దకు వచ్చెను. ప్రాణము మాత్రమే మిగిలి ఎముకలగూటితో బక్కచిక్కిన అరుణుడు ధ్యానములో కన్నులు మూసికొని యుండెను. రెండవయగ్నివలె ప్రకాశించుచున్న యరుణుని చూచి బ్రహ్మ యిట్లనెను.

వత్సా! నీకు మేలగు గాక నీమనస్సులోని కోరికనెరిగింపుము అని చెవుల కింపుగా పలికెను. అరుణుడు కన్నులు తెరచి గాయత్రితో నాల్గువేదములతో తనముందు ప్రత్యక్షమైన బ్రహ్మను దర్శించెను. మరియు ప్రణవము జపించుచు చేతులుమోడ్చి అనేక స్తోత్రములతో బ్రహ్మను స్తుతించెను. తరువాత తనకు చావులేకుండునట్లు తన బుద్ధిలోని కోర్కెను తెలిపెను. అరుణుని మాటలు విని బ్రహ్మ అతనికెంతో మెల్లగానిట్లు పలికెను.

రాక్షసోత్తమా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులే కాలధర్మము నొందుదురు. ఇక సామాన్యులు మరణించుటలో వింత ఏమున్నది? నీవు తగినవరమడుగుము. దానిని తప్పక ఈయగలను బుద్ధిమంతులు ఈ విషయమున మొండిపట్టుపట్టరు. అను బ్రహ్మ మాటలు విని రాక్షసుడు మరల పలికెను:- ప్రభూ! నాకు యుద్ధములో శస్త్రాస్త్రములతో రెండు కాళ్ళ, నాలుగు కాళ్ళ జంతువులతో, రెండు ఆకారాలు

గల ప్రాణులతోను చావు కలుగకుండు నట్లు వరమిమ్ము. దేవా! నేను ఎవ్వనికిని ఓడిపోనిబలము నిమ్ము అనువాని మాటలువిని బ్రహ్మ అట్లేయగు గాక యని వరమిచ్చి తన స్థానమునకు వెళ్ళెను. తరువాత అరుణుడు పాతాళము నుండి తనపై విశ్వాసము గల రాక్షసులనందరను పిలిపించెను. ఆ రాక్షసుల కందరకు బ్రహ్మ తనకిచ్చిన వరమును తెలియజేసెను.

అప్పుడు రాక్షసులందరును వానిని రాజుగా చేసిరి. అతడింద్రునితో యుద్ధము చేయుటకు తన దూతనమరావతికి పంపెను. దూత వాక్కులు విని దేవరాజు భయముతో వణికిపోయెను. అతడు దేవతలను వెంట బెట్టుకొని బ్రహ్మలోకము నకు వెళ్ళెను. బ్రహ్మ విష్ణువులిరువురును కలిసి కైలాసమునకు వెళ్ళిరి. అచట రాక్షసుని చంపుటకు మంత్రాలోచనచేసిరి. ఆ సమయముననే అరుణుడు సేనలను తీసికొని త్వరగా స్వర్గముపై దండిత్తెను మరియు తానొక్కడైనను సూర్యచంద్రయ మాగ్ని రూపములను నానారూపములను తనతపోబలముచే ధరించెను. దేవత లందరు వంతకుముందే తమతమ నివాసములు విడిచి కైలాసమునకు వెళ్ళి యుండిరి. దేవతలు తమతమ కష్టాలను వేర్వేరుగ శంకరునితో మొరపెట్టుకొనిరి. రాక్షసునికిచ్చిన వరములను విమర్శించగా దేవతలేమియు చేయజాలకుండిరి. అంతలో వారికి ఆకాశవాణి యిట్లు వినిపించెను. మీరు త్రిభువనేశ్వరిని సేవింపుడు. ఆ దేవి మీకార్యము నెరవేర్పగలదు. ఆ రాక్షసుడు నిరంతరము గాయత్రిని జపించును. ఆ జపమాగిన వెంటనే వానికి చావు మూడును అను సంతోషకరమైన వాక్కు వారికి వినవచ్చెను. దేవి వాక్కును వినివారు దానిని గూర్చి శ్రద్ధతో ఆలోచింపసాగిరి. అంతలో దేవేంద్రుడు బృహస్పతిని పిలిచి ఇట్లనెను:-

గురువర్యా! నీవు దేవకార్యము నిమిత్తమై రాక్షసుని వద్దకు వెళ్లుము వాడు గాయత్రి జపము మానునట్లు చేయుము. ఇక్కడ మేము కూడ నిశ్చల ధ్యానముతో పరమేశ్వరిని కొలుచుచుందుము. దేవి ప్రసన్నయై నీకును సహాయము చేయ గలదు. అని గురువునకు మనవి చేసి ఇంద్రుడు దేవతలెల్లరును రాక్షస భీతులగు తమ్ము కాపాడుమని జాంబూనదీశ్వరి దేవి సన్నిధికి వెళ్ళిరి. వారందరు అచట మాయాబీజమును జపించుచు దీక్షతో శ్రీదేవీ యోగపరాయణులై తపమా చరింపసాగిరి. అప్పుడు బృహస్పతి వెంటనే రాక్షసుని వద్దకువెళ్ళెను. రాక్షసరాజు తనవద్దకు వచ్చిన మునివర్యు నిట్లు ప్రశ్నించెను. మునివర్యా! ఎక్కడనుండి రాక? ఎక్కడికి? ఏమిపని? నాకు తెలుపుము. నేను నీకు మిత్రుడను కాను శత్రువును అను రాక్షసుని మాటలువిని మునియిట్లనెను. మేము నిరంతరము జపించు గాయత్రి దేవిని నీవు కూడ సేవించుచున్నావు.

కనుక మాకు నీవు మిత్రుడ వెట్లు కావు? అను బృహస్పతి మాటలకు దేవ మాయచే మోహితుడై అభిమానమునకు లొంగి పరమమంత్రమగు గాయత్రిని వదిలిపెట్టెను. దానివలన రాక్షసుడు తేజో హీనుడయ్యెను. బృహస్పతియు వచ్చిన పనిత్వరలో నెరవేరుటవలన ఆచోటు విడిచివెళ్ళెను. జరిగిన విషయము నింద్రునకు తెలిపెను. దేవతలందరు సంతోషించి పరమేశ్వరిని మెచ్చుకొనిరి. ఇట్లు కొంత కాలము గడచెను. ఒక సమయమున జగన్మంగళకారిణి యగు జగన్మాత దర్శన మిచ్చెను. ఆమె కోటిసూర్యుల కాంతి కోటిమన్మథుల సౌందర్యముగలదై మైపూత లతో చిత్రవస్త్రములతో పుష్పమాలాభరణములతో పిడికిట నున్న విచిత్ర భ్రమర ములతో (తుమ్మెదలతో) వరాభయముద్రలతో పెక్కు తుమ్మెదలు మూగిన పూలమాలలు ధాల్చి దయామృతముట్టిపడుచు శాంతయై లెక్కకు మిక్కిలియైన చిత్రమైన తుమ్మెదలు తన చుట్టును చేరి కొలుచుచుండగా సకల శృంగార సంపదలతో కూడి సర్వవేదములచే పొగడబడుచుండెను. స్తోత్రము.

# వేదములు చేసిన శ్రీదేవీ స్తుతి

శ్లో॥ సర్వాత్మికా సర్వమయీ సర్వమంగళరూపిణీ ।
సర్వజ్ఞా సర్వజననీ సర్వాసర్వేశ్వరీశివా ॥
దృష్ట్వైతాంతరలాత్మానో దేవా బ్రహ్మపురోగమాః ।
తుష్టువుర్హృష్టమనసో విష్టర శ్రవసంశివామ్ ॥
నమోదేవి మహావిద్యే సృష్టి స్థిత్యంతకారిణి ।
నమః కమలపత్రాక్షి! సర్వాధారే! నమోఽస్తుతే ॥
సవిశ్వతైజస ప్రాజ్ఞ విరాట్సూత్రాత్మికే నమః ।
నమో వ్యాకృతరూపాయై కూట స్థాయై నమోనమః ॥
దుర్గే సర్గాదిరహితే! దుష్ట సంరోధనార్గళే ।
నిరర్గల ప్రేమ గమ్యే భర్గేదేవి నమోఽస్తుతే ॥
నమః శ్రీకాళికేమాతర్నమో నీలసర్వతి ।
ఉగ్రతారే మహోగ్రేతే నిత్యమేవ నమోనమః ॥
నమః పీతాంబరే! దేవి! నమస్త్రి పురసుందరి ।
నమో భైరవి మాతంగి ధూమావతి నమోనమః ॥
ఛిన్నమస్తే నమస్తేఽస్తు క్షీరసాగర కన్యకే ।
నమశ్శాకంభరిశివే! నమస్తే రక్త దంతికే ॥

నిశుంభశుంభదళని! రక్త బీజ వినాశిని ।
ధూమ్రలోచన నిర్ణాశే! వృత్రాసుర నిబర్హిణీ ॥
చండముండ ప్రమథిని! దానవాంతకరేశివే ।
నమస్తే విజయే గంగే శారదేవికచాననే ॥
పృధ్వీరూపే దయారూపే తేజోరూపే నమోనమః ।
ప్రాణరూపే మహారూపే భూతరూపే నమోఽస్తుతే ॥
విశ్వమూర్తే! దయమూర్తే! ధర్మమూర్తే! నమోనమః ।
దేవమూర్తే !జ్యోతిర్మూర్తే! జ్ఞానమూర్తే నమోనమః ॥
గాయత్రి వరదేదేవి! సావిత్రి చ సరస్వతి ।
నమః స్వాహే స్వధేమాతః దక్షిణే తే నమోనమః ॥
నేతి నేతీతి వాక్యైర్యాబోధ్యతే సకలాగమైః ।
సర్వ ప్రత్యక్స్వరూపాంతాం భజామః పరదేవతామ్ ॥
భ్రమరైర్వేష్టితా యస్మాద్భ్రామరీ యాతతః స్మృతా ।
తస్యై దేవ్యై నమో నిత్యం నిత్యమేవ నమోనమః ॥
నమస్తే పార్శ్వయోః పృష్ఠే నమస్తే పురతోఽంబికే ।
నమ ఊర్ధ్వం నమశ్చాధః సర్వత్రైవ నమోనమః ॥
కృపాంకురు మహాదేవి! మణిద్వీపనివాసిని ।
అనంతకోటి బ్రహ్మాండనాయికే జగదంబికే ॥
జయదేవి జగన్మాతర్జయ దేవి పరాత్పరే ।
జయ శ్రీభువనేశాని! జయ సర్వోత్తమోత్తమే ॥
కల్యాణ గుణరత్నానామాకరే భువనేశ్వరి ।
ప్రసీద పరమేశాని! ప్రసీదాస్మాసు సర్వదా ॥

**స్తోత్రభావము:-** సర్వాత్మిక సర్వమయి సర్వమంగళరూపిణి సర్వజ్ఞ సర్వ జనని, సర్వ, సర్వేశ్వరి, శివ, అగు తల్లిని బ్రహ్మ మొదలగు దేవతలెల్లరును దర్శించి తమ మనస్సులు సంతోషింప శివ భవాని నిట్లు స్తుతించిరి:-

కమల పత్రాక్షీ! సర్వాధారా! మహావిద్యాదేవీ! సృష్టి స్థిత్యంతకారిణి! నీకు మా ప్రణామములు. తల్లీ! విశ్వతైజసప్రాజ్ఞ విరాట్ సూత్రాత్మ అవ్యాకృత కూటస్థ రూపముగల దేవికి మా ప్రణామములు. సర్గాది రహిత! దుష్టులను చంపుటలో స్వతంత్రురాలా! నిరర్గల ప్రేమగమ్యా! భర్గతేజస్వినీ! దుర్గా! నీకు మా ప్రణామ ములు కాళీమాతా! నీల సరస్వతీ ఉగ్రతారా! మహోగ్రా! నీకు నిత్యమునివే మా

ప్రణామములు పీతాంబరధారిణీ! దేవీ! త్రిపురసుందరీ! భైరవీమాతంగీ ధూమావతీ! నీకు మా హృదయపూర్వక ప్రణామ ములు. ఛిన్నమస్తా! పాలకడలిపట్టీ! శాకంభరీ! రక్త దంతికే! శివా! నీకు మా భక్తి ప్రణామములు శుంభని శుంభనాశినీ! రక్తబీజ వినాశినీ! ధూమ్రలోచన సంహారిణీ! వృత్రాసుర నిషూదనీ చండముండమర్దినీ! దానవాంత కరీ! శివా! విజయా! నీకు మా ప్రణామములు, పృథ్వీప్రాణభూత మహోదయా తేజోరూపిణీ! నీకు నమస్కారములు విశ్వదేవ దయా ధర్మజ్ఞాన జ్యోతిర్మూర్తీ! నీకు నమస్కారములు.

దేవీ! గాయత్రీ! సావిత్రీ! సరస్వతీ స్వాహా స్వధాదక్షిణా, వర దాయిని! దేవి! నీకు మాకోటి ప్రణామములు. ఆగమశాస్త్రములు నేతినేతి యను వాక్యములతో నిన్ను వర్ణించును. సర్వ ప్రత్యక్ష్యరూపిణీ! పరదేవతా! నీకు మా ప్రణామములు తుమ్మెదలచే కొలువబడుటవలన భ్రామరీదేవియని ప్రసిద్ధి గాంచిన దేవీ! నీకు నిత్యము మా ప్రణామములు. అంబానీ ప్రక్కభాగములకు ముందుభాగమునకు పైభాగమునకు క్రిందిభాగమునకు ఎల్లెడల మా ప్రణామములు అనంతకోటి బ్రహ్మాండనాయికా! జగదంబికా! మణిద్వీపవాసిని! మహాదేవి! మాపై దయ చూపుము. జననీ! జగన్మాతా! పరాత్పరదేవీ! శ్రీభువనేశానీ! సర్వోత్తమ కల్యాణ గుణములకు నిలయమా! భువనేశ్వరీ! పరమే శానీ! విశ్వకారణా! మా యెడల ప్రసన్నవగుము" దేవతల తీయని యీ మాటలు విని మధురకంఠధ్వనితో జగదంబ వారికిట్లు పలికెను:-

దేవతలారా! మీ యెడల ప్రసన్నురాలనైతిని. మీకెల్లరకు వరములీయ గలను అను దేవి వాక్యములు విని తమ దుఃఖమునకు కారణమైన దుష్టరాక్షసుని చరిత్రను, వాడు జగములను బాధించు తీరును, దేవబ్రాహ్మణ వేదములను పరిహసించి నశింపజేయుటను, దేవతల స్థానభ్రంశమును దేవికి విన్నవించిరి. బ్రహ్మవానికిచ్చిన వరమును గూడ తెలిపిరి. దేవి దేవతలు చెప్పిన దంతయు విని తన చేతిలో ప్రక్కల నున్న పలురూపములుగల తుమ్మెదలను ప్రేరేపించెను. ఇంకను ఎక్కువ తుమ్మెదలను సృష్టించెను. అవియన్నియు మిడు తలదండువలె ముల్లోకములను వ్యాపించెను. అవియంతరిక్షమంతటను నిండిపోవుటచే నేలపై చీకట్లు వ్యాపించెను. దివిపై పర్వతశిఖరములందు చెట్లపై అడవులందును ఎల్లెడల తుమ్మెదల దండు మహాద్భుతముగా వ్యాపించెను. అవియన్నియు అరుణ రాక్షసుని రొమ్ముచీల్చి వేసినవి. తేనె తీయువానిని తేనెటీగలు కోపముతో పట్టి కుట్టినట్లు వానినవి యన్నియు మిక్కిలి బాధించెను.

అప్పుడు వాని శస్త్రాస్త్రము లేమియు పని చేయలేదు. సంభాషణలులేవు, యుద్ధములేదు, చావు మాత్రము తప్పించుకొనరాని దయ్యెను. ఎక్కడనున్న రాక్షసు లక్కడనే మరణించిరి. రాక్షస వీరులెల్లరు క్షణ కాలములో నశించిరి. ఈ విధముగ రాక్షసుల నశింపజేసి పిమ్మట తుమ్మెదలన్నియు దేవిని చేరినవి. ఏమివింత! ఏమి వింత! యనుచు లోకులాశ్చర్యపడిరి. ఇది యంతయు జగదంబ మాయ వలననే జరిగినది. అప్పుడు బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతలు సంతోష సాగరమున నోలలాడి జగదంబికను పూజించిరి. వారు వివిధోపచారములతో పలు కానుకలతో పూలమాలలు సమర్పించి జయజయ ధ్వనులు చేసిరి. దేవదుందుభులు మ్రోగినవి. అప్సరసలు నాట్యమాడిరి. మునులు వేదములు చదువగా గంధర్వులు పాడిరి ముల్లోకముల వారును వివిధ వాద్యధ్వనులతో దేవీ మహోత్సవములు జరిపిరి. అందరు వివిధస్తోత్రములు చదివిరి. నుతించిరి. అప్పుడు మహాదేవి సంతోషించి వారివారికి తగిన వరములిచ్చెను. కొందరు కోరుకొనగా వారికి నిశ్చలభక్తిని ప్రసాదించెను. తరువాత దేవతలు చూచుచుండగనే శ్రీదేవి యంతర్ధానము చెందెను.



# ఏకాదశ స్కంధము

## ప్రాతశ్చింతనము

నారదుడు దేవి సంతోషించునట్టి సదాచారమును తెలుపుమనగా నారాయణు డిట్లనెను. నారదా! ముఖ్యమైన ధర్మము సదాచారమని వేదములందు స్మృతు లందును చెప్పబడినది. సదాచారము వలననే చిరాయువు పుష్కలమైనయన్నము లభించును. సదాచారముచే ఇహపరలోకముల్లోదు సుఖసంపదలు కలుగును. వేద విరుద్ధమైనది ధర్మము కాదు. వేకువజామున లేచి ధ్యానము చేయవలెను. సమ ప్రదేశమున దర్భాసనముపై కూర్చొనవలయును. ప్రాణాయామము రెండు లేక మూడు మార్లు చేయవలెను. హృదయమందు వెలుగొందు విజ్ఞానజ్యోతిని ధ్యానించవలెను. ప్రాణాయామము సధూమము, అధూమము, సగర్భము అగర్భము, సలక్ష్యము, అలక్ష్యము అని ఆరువిధములు ప్రాణాయామము రేచక పూరక కుంభకములను మూడు విధములుగా నుండును. మొదటి ఇడానాడిలో పదహారుసార్లు అకారముతో పూరించి ఉ కారముతో 16 మాత్రలకాలము కుంభించి. 16 మాత్రలకాలము మ కారముతో వాయువునువిడుచుట సధూమ ప్రాణాయామము. తరువాత శరీరములోని ఆరుచక్రములకు నమస్కరింపవలెను. పిదప దేవిని ధ్యానింపవలెను. కుండలీ నీశక్తిని శరణుజొచ్చుచున్నానని తలచ వలెను. పిమ్మట సద్గురువును బ్రహ్మరంధ్రమున మానసికముగ నర్చించి ధ్యానించ వలెను. పిమ్మట మంత్రజపము చేయవలెను.

## ఆచార నిరూపణము

ఆచారము లేనివాని నేదియు పవిత్రము చేయజాలదు. ప్రాత:కాలమున లేచి కాలకృత్యములు తీర్చుకొని కాళ్ళు చేతులను మట్టి నీళ్ళతో శుద్ధి చేసికొన వలెను. ముఖము కడుగుకొని మూడు మార్లాచమనము చేయవలెను.

## ఆచార నిరూపణము రుద్రాక్ష ప్రాశస్త్యము

ఆచమన మారువిధములు:- వైదికము శ్రౌతము, శుద్ధము, పేరణము, స్మార్తము, తాంత్రికము అనునవి. మలమూత్ర విసర్జనానంతరము చేయు నాచమ నము శుద్ధము. స్మార్తకర్మలందు చేయునది స్మార్తము. పురాణకర్మలందు చేయు నది పౌరాణికము. బ్రహ్మ యజ్ఞములందు చేయునది వైదికము. అస్త్రవిద్య

యందలి ఆచమనము తాంత్రికము. ప్రణవమును గాయత్రిని స్మరించి జుట్టు ముడివైచుకొని యాచమనము చేసి స్నాన సంధ్యావందనములను దర్భలు చేత పట్టుకొని చేయవలెను. జపముతో చేసిన ప్రాణాయామము సగర్భము. ధ్యానముతో చేయునది అగర్భము. తరువాత దేవర్షి పితృతర్పణ మాచరింపవలెను. భస్మ రుద్రాక్షలను ధరింపవలెను.

# రుద్రాక్ష ప్రాశస్త్యము

నారదుడు రుద్రాక్షల ప్రభావమునకు కారణమేమని ప్రశ్నింపగా నారాయణుడిట్లు చెప్పెను. పూర్వము త్రిపురాసురుడు జయింప శక్యము కాకుండెను. అతడు బ్రహ్మ విష్ణువు మొదలగు దేవతలను లెక్కచేయుట లేదని నాకు తెలిసినది. అపుడు కన్నులు మూసికొని చిరకాలము తపస్సు చేసితిని. అపుడు నా కన్నుల నుండి నీటి బిందువులు రాలినవి. నాయాజ్ఞచే నాకన్నీటి నుండి రుద్రాక్ష వృక్షములు పుట్టినవి. వాటిలో ముప్పదియెనిమిది భేదములున్నవి. నా కుడినేత్రము నుండి ఎరుపు పసుపు రంగుగల పన్నెండు రకముల రుద్రాక్షలు పుట్టినవి. తెల్ల రుద్రాక్షలు, బ్రాహ్మణజాతివి. మిశ్రమము వైశ్యజాతివి. నల్లనివి శూద్రజాతివని తెలియవలెను. ఏకముఖము గల రుద్రాక్ష సాక్షాత్తు శివుడే. రెండు ముఖములు గలది శివాశివుల స్వరూపము. మూడు ముఖములు గలది అగ్నిరూపము. నాల్గు ముఖములు గలది బ్రహ్మరూపము. ఐదు ముఖములు కలది కాలాగ్ని, ఆరు ముఖములు గలది షణ్ముఖుడు దానిని కుడిచేతియందు ధరింపవలెను. ఏడు ముఖములు గలది అనంగ రూపము. ఎనిమిది ముఖములు గలది సాక్షాత్తు వినాయకుడే. తొమ్మిది ముఖములుగలది భైరవము. దీని నెడమభుజమున ధరింపవలెను. పది ముఖములు గలది జనార్ధనుడే. పదకొండు ముఖములు కలది శివుడే. పన్నెండు ముఖములు కలది చెవియందు ధరింపవలెను. పదమూడు ముఖముల రుద్రాక్ష కార్తికేయునితో సమానము. పదునాల్గు ముఖముల రుద్రాక్ష దుర్లభము దానిని తలపై ధరింపవలెను. ఇరువది యారు రుద్రాక్షలమాల తలపై ఏబది రుద్రాక్షలది హృదయముపై పదహారు రుద్రాక్షలది బాహువులందు పన్నెండు రుద్రాక్షలది మణికట్టున ధరింపవలెను. నూటయెనుమిది రుద్రాక్షల మాలగాని, ఏబది రుద్రాక్షల మాలగాని, ఇరువదేడు రుద్రాక్షల మాలగాని ధరించిన లేక దానితో జపించినవాని కనంత ఫలమబ్బును. నూటయెనిమిది రుద్రాక్షల మాల ధరించినవాడు అశ్వమేధ ఫలమంద గలడు. అ తరువది యొక్క తరముల వారి నుద్ధరించి శివలోకమున ప్రతిష్ఠగాంచును.

# జపమాలా లక్షణ నిరూపణము

రుద్రాక్ష ముఖము బ్రహ్మపై భాగము రుద్రుడు తోక విష్ణువు ముండ్లుగల ఇరువది యైదు పంచముఖి రుద్రాక్షలు మాలగా చేసిన కంటకమాల యందరు. పైన వెడల్పుగా క్రింద సన్నగా నుండునట్లు మాల కూర్చవలెను. అమాలను మొదట గంధజలముతో పిమ్మట పంచగవ్యములతో శుద్ధి చేయవలయును. పిమ్మట శుద్ధ చేసి మంత్రన్యాసము చేయవలయును, సద్యోజాతాది మంత్రములతో ప్రోక్షించవలయును. ఇట్లు మాల ప్రతిష్ఠ చేసినచో అది సకలకామములు తీర్చును. మౌనోనిగ్రహము కలిగి జపము చేయవలెను. ఈ జపమాల తలపై కంఠమందు గాని, చెవియందుగాని ధరించవలయును.

# జపమాలా లక్షణ నిరూపణము

దర్భముడుల మాల రుద్రాక్ష మాలలో పదహారవవంతునకు సరిపోలదు. పురుషులలో విష్ణువు గ్రహములలో సూర్యుడు నదులలో గంగ మునులలో కశ్యపుడు, అశ్వములలో ఉచ్చైశ్రవము. దేవతలలో మహాదేవుడు దేవతలలో గౌరీదేవివలె అన్నిటిలో రుద్రాక్ష శ్రేష్ఠమైనది. రుద్రాక్ష స్తుతిని మించిన స్తోత్రము లేదు. అక్షయ దానములన్నిటిలోను రుద్రాక్ష దానముత్తమోత్తమయు. శాంతుడు శివభక్తుడైన వానికి శ్రేష్ఠమైన రుద్రాక్ష దానము చేయవలెను. రుద్రాక్ష దాతకు పుణ్యఫలమనంతము మెడలో రుద్రాక్ష ధరించిన వానికంటె దానము చేసినవాడు పుణ్యాత్ముడు. అతని యిరువదొక్క కులములవారు ధ్ధరింపబడుదురు. అతడును రుద్రలోకము చేరగలడు.

# సదాచార విశేష నిరూపణము

బ్రాహ్మణుడు తెల్లని రుద్రాక్షలను, క్షత్రియుడెఱ్ఱనివి, వైశ్యుడు పచ్చనివి శూద్రుడు నల్లనివిధరింపవలెను. సమముగ గట్టిగ నునుపుగ ముండ్లతో నుండు రుద్రాక్షలు శుభకరములు. పురుగులు, తొలిచినవి, ఛిన్నభిన్నములు, ముండ్లులేనివి, దెబ్బలు, తిన్నవి, అనావృతమైనవి అను ఆరువిధముల రుద్రాక్షలు ధరింపరాదు. రుద్రాక్షలో రంధ్రము సహజముగా పడినచో ఉత్తమోత్తమము ప్రయత్నించి రంధ్రము చేయబడినది. మధ్యమము సమముగ నున్నగ గట్టిన గుండ్రముగనున్న రుద్రాక్షలు పట్టుదారముతో కట్టుకొనవలయును. బంగారము గీటురాతిపై వలె గీచిన గీటుపడు రుద్రాక్ష ఉత్తమోత్తమము. ఏకముఖి రుద్రాక్ష పరతత్త్వమునకు గుర్తు దానిని ధరించుటవలన పరతత్త్వము ప్రదీపించును. రెండు ముఖములు

గలది అర్ధనారీశ్వరము. దాని ధరించిన అర్ధనారీశ్వరుడు ప్రసన్నుడగును. త్రిముఖి సాక్షాత్తు అగ్నిరూపమే దీని ధరించిన స్త్రీ హత్యాపాపము తొలగును. చతుర్ముఖి బ్రహ్మకు ప్రతిరూపము దానివలన ఆరోగ్యభాగ్యము లభించును. పంచముఖి పంచబ్రహ్మ స్వరూపమైనది. దీని వలన మహేశ్వరుడు ప్రత్యక్షమగును. ఇట్లు వేర్వేరు సంఖ్యల ముఖములతో కూడిన రుద్రాక్షల విషయము పూర్వము చెప్ప బడియే యున్నది.

# భూతశుద్ధి

పరదేవత కుండలి నీశక్తి. ఆమె మూలధారమునుండి లేచి సుషుమ్నామార్గము ద్వారా బ్రహ్మ రంధ్రమును చేరినదని సాధకుడు తలచవలెను. మరియు హంస మంత్రముచే జీవబ్రహ్మల కైక్యము భావింపవలెను. భూమండలమును లం బీజముగా, జలమండలమును వంబీజముగా, రంబీజమునగ్ని మండలముగా, హం బీజమును ఆకాశముగా స్మరింపవలెను. ఈ విధముగా పంచభూతముల స్మరించి మరల ప్రతి దానిని లయింపజేయవలెను. భూమిని జలములో, జలము నగ్నిలో, అగ్నిని వాయువులో, వాయువునాకాశమందును లయ మొనర్పవలయును. ఆకాశమున హంకారములో ఆయహంకారమును మహత్తత్వములో మహత్తును, ప్రకృతిలో, ప్రకృతిని నాత్మలో లయమొనర్పవలయును.

అపుడు సాధకుడు శుద్ధ సంవిత్స్వరూపుడై తనకెడమ వైపున నల్లగ అంగుష్ఠ మంతగనున్న పాప పురుషుని తలంచవలెయును. వాయుబీజమును స్మరించుచు వాయువును లోపల పూరించుచు, పాపపురుషుని శుష్కింపచేయవలెను. రం బీజముతో తన శరీర మందలి పాప పురుషుని కాల్చిబూడిద చేయవలెను. మరల వాయు బీజము తో బయటకు నిశ్వాసరూపమున వెడలగొట్టవలెను. పిమ్మట బ్రహ్మ నుండి ఆకాశము గాలి అగ్ని నీరు భూమి వీటిని పుట్టినట్లు తలచవలెను. సోహం మంత్రముతో జీవాత్మను పరమాత్మనుండి వేరుచేసి హృదయపద్మములో జీవాత్మను స్థాపించవలయును. మొదట జీవాత్మ కుండలి నుండి బ్రహ్మలో కలసినట్లు భావించవలెను. ఇపుడు కుండవిని పరాత్మతో నమృతజీవనము పొంది మరల హృదయకమలము నుండి మూలాధారము చేరినట్లు సాధకుడు భావించవలయును.

# భస్మధారణ విధానము

బ్రాహ్మణుడు భస్మ త్రిపుండ్రములు వేదసిద్ధమైన భస్మముచే దేహమందు ధరింపవలయును. శివలింగార్చనమెన్నడును మానరాదు. త్ర్యంబకమంత్రముతో

కాని, పంచాక్షరముతో కాని, ఓంకారముతో కాని మానవుడు నొసట, హృదయమున భుజములందును త్రిపుండ్రములు ధరించవలెను. వీటిని సన్యాసికూడ ధరింపవలయును. బ్రహ్మచారి "త్ర్యాయుష" మంత్రముగాని, "మేధావ" మంత్రముతో కాని, భస్మమును త్రిపుండ్రములుగా ధరింపవలెను. ఇతరులును "శివాయ నమః" అను మంత్రముతో నిత్యము త్రిపుండ్రముల ధరింపవచ్చును. విభూతి యనగా ఐశ్వర్యము. దాని కొరకు విభూతిని ధరించుట సర్వధర్మములలో నుత్తమము. అగ్నిహోత్ర మందలి భస్మముగాని విరజాహోను మందలి భస్మమునుగాని భక్తితో శుద్ధ పాత్రయందుంబి కాళ్ళు చేతులుకడుగుకొని రెండు మార్లాచమనము చేసి సద్యోజాతాది పంచబ్రహ్మ మంత్రములతో భస్మము గ్రహించవలెను. ప్రాణాయామము చేసి "అగ్నిం"త్యాది మంత్రములతో అభిమంత్రించవలెను. తరువాత "ఓ మాపోజ్యోతి రసోమృతం బ్రహ్మ" అను మంత్రముచ్చరించి శరీరమంతట తెల్లని భస్మము పూయవలయును. సదాశివుని ధ్యానించుచు తలపై భస్మమును ధరింపవలెను నొసట, రొమ్మున, భుజములందు తన యాశ్రమమునకు తగినట్లు ధరింపవలయును. ఈ త్రిపుండ్రధారణము భక్తితో మూడుకాలములందును తప్పక చేయదగినది.

అగ్నితో నేర్పడిన భస్మము కూడ అజ్ఞానమును పోగొట్టును. విరజాగ్ని, ఔపాసనాగ్ని, సమిధాగ్ని, పాకాగ్ని, దావాగ్ని యను వాటినుండి చేసిన భస్మమును మూడు వర్ణముల వారలు ధరింపవచ్చును. విరజాగ్ని భస్మమును ప్రతివాడు ధరింపవచ్చును. ఔపాసనాగ్ని భస్మమును గృహస్థులే ధరింపవలెను. సమిధాగ్ని భస్మమును బ్రహ్మచారులే ధరించవలెను. వైదికుల వంటబూడిదను శూద్రులు ధరించవలెను. దావాగ్ని భస్మమును ప్రతివాడు ధరింపవచ్చును. చైత్ర పూర్ణిమనాడు మంచిచోట హోమము చేయవచ్చును. త్రయోదశినాడే శుచిగా స్నానము చేసి సంధ్యావందనము చేయవలయును. గురువు ననుమతితో తెల్లని వస్త్రములు ధరించి క్రొత్త జందెము తెల్లని పూలమాలలు ధరించి దర్భాసనముపై కూర్చొని దర్భలు చేతబట్టుకొని ముమ్మారు ప్రాణాయామము చేసి తూర్పుముఖముగాగాని, ఉత్తరముఖముగాగాని కూర్చొని ఇష్టదేవతను ధ్యానించి శిరోవ్రతము చేయుదునని సంకల్పించి విరజాహోమమునకగ్నిని ప్రతిష్ఠించి యందు నేయి సమిధలు చరువు వేల్చవలయును. విరజాహోమముచే పాపరహితుడగును. చతుర్దశినాడు, త్రయోదశినాడు చేసినట్లే చేయవలెను. ఆనాడు నిరాహారియై యుండవలెను. పూర్ణిమనాడు పంచాక్షరితో వేల్పవలెను. ఈ విరజాభస్మముచే ఆరోగ్యము అందము

శుభము పెంపొందును. శాంతికపౌష్టిక కామ్యములను మూడు విధముల నీ భస్మము విలసిల్లుచుండును.

భస్మము మూడు విధములెట్లో నారాయణుడు నారదునకు చెప్పుచున్నాడు. ఆవు పేడ క్రిందపడకుండగనే చేతబట్టుకొని పంచబ్రహ్మ మంత్రముతో కాల్చినచో అది "శాంతికర" మైనది. ఇది పేష్టిక భస్మమనబడును. అట్లు పట్టిన పేడతో చేసిన పిడకలు ప్రాసాదమంత్రములతో కాల్చి చేసినది "కామదమగు" భస్మము ఈరెండు విధములు కాక పిడకలుగా చేసి కాల్చిన భస్మము మూడవది. మధ్యాహ్నమునకు పూర్వము భస్మము తడిపి పూసుకొనవలెను. మధ్యాహ్నము పిమ్మట పొడి భస్మము పూసికొనవలెను. శిరస్సు, నొసట చెవులు, కంఠము, హృదయము బాహువులు భస్మము ధరించు స్థానములు. క్షత్రియ వైశ్యశూద్రులు శరీరమందంతటను భస్మము పూసికొనరాదు. అంత్యజులందరు మంత్రరహితముగనే భస్మమును పూసికొనవలయును. దీక్ష పొందనివాడు మంత్రరహితముగనే భస్మము పూసికొనవలెను.

క్రిందపడిన పేడయైనచో పైన క్రింద వదలి మధ్యనున్న పేడను గ్రహించి ముద్దగా చేసి యెండబెట్టి శివాగ్నిలో మూలమంత్రముతో భస్మము చేయవలెను. ద్విజుడు భక్తితో త్రిపుండ్రములను ధరింపవలెను. సమంత్రకముగ భక్తితో త్రిపుండ్రములు ధరించపక శరీరమునకు పూయనిచో కోటిజన్మలకైన ముక్తి లభించదు. త్రిపుండ్ర ధారణ చేయనివాడు శివార్చనకు పనికిరాడు. కాలుసేతులు కడిగికొని యాచమనము ప్రాణాయామము చేసి భస్మస్నానమొనర్పలెను. ఈ శానమంత్రముతో శిరస్సున భస్మము ధరింపవలెను. తత్పురుష మంత్రముచే ముఖమునందు అఘోరమంత్రముతో, హృదయమందు వామదేవమంత్రముతో, గుహ్యమందు సద్యోజాతమంత్రముతో, రెండు పాదముపైన భస్మము పూసికొనవలయును. ఓంకార పూర్వకముగ శరీరమంతటు భస్మము పూయుట అగ్ని స్నానమగును. తరువాత కాలుసేతులు కడిగికొని యథావిధిగ నొసట, కంఠమున, హృదయమున పంచబ్రహ్మ మంత్రములతో త్రిపుండ్రములను ధరింపవలెను.

నారాయణుడిట్లు చెప్పుచున్నాడు:- భస్మ ధారణముచే కలుగు పుణ్యఫలము చెప్పనలవి కాదు. అది యతులకు, జ్ఞానమును వానప్రస్థులకు వైరాగ్యము కలిగించును. గృహస్థులకు ధర్మమార్గమును, బ్రహ్మచారులకు స్వాధ్యాయము నొసంగగలదు. ఇది శూద్రులకు పుణ్యప్రదము. ఇతరులకు పాపహరము భస్మ త్రిపుండ్రధారణము సకలప్రాణులను కాపాడును. శరీరము నిండ భస్మము పూసి

కొనుట త్రిపుండ్రముల ధరించుట వేదసమ్మతము. యజ్ఞములందెల్లరురు భస్మధారణ చేయవలెను. భస్మధారణము త్రిపుండ్ర ధారణము శైవులకు గుర్తు. బ్రహ్మ క్షత్రియవైశ్య శూద్రులు సంకరజాతులు ఇతరులును త్రిపుండ్రముల ధరింతురు. సంతోషముతో భస్మము ఒడలినిండ పూసికొని త్రిపుండ్రములు ధరించువారే శిష్టులు విద్వాంసులుగా పరిగణింపబడుదురు. ఇతరులు కారు.

నిండ భస్మము పూసికొనినవానికి సంతోషముతో ధనమిచ్చినదాత చేసిన పాపములన్నియు తప్పక నశించును. శ్రుతిస్మృతి పురాణములన్నియును విభూతి మహిమను గొప్పగా వర్ణించినవి. కనుక ద్విజుడు తప్పక భస్మధారణము చేయవలెను. మూడు సంధ్యలందును తెల్లని భస్మము త్రిపుండ్రములుగా ధరించువాడు సర్వపాప విముక్తుడై శివలోకమున మహిమాన్వితుడగును. యోగినిత్యము మూడు సంధ్యలందును పాదమునుండి తలవరకును భస్మస్నానము చేసినచో అతడు త్వరలో యోగసిద్ధుడగును. భస్మ స్నానము చేసినవాడు తన కులమువారి నుద్ధరించును. జలస్నానము కంటె భస్మ స్నానమెన్నోరెట్లు శ్రేష్ఠమైనది. భస్మస్నానము వలన సర్వతీర్థములందలి స్నానముచే కలుగు పుణ్యములన్నియు లభించును. పాపరాసులన్నియు భస్మస్నాన మాత్రమున భస్మమగును. భస్మస్నానమును మించిన పవిత్రస్నానము వేరులేదు. ఆగ్నేయస్నానమగు శిరస్నాన మాచరించువాడు ఈ శరీరముతోడనే రుద్రుడగును. త్రిపుండ్రములు ధరించిన వాని చూచి భూత ప్రేతములు మొదలగునవి గడగడలాడును. అవి వెంటనే తప్పక నశించును. జలస్నానము చేసినను చేయకున్నను భస్మస్నానము తప్పక చేయవలెను.

భస్మధారణ చేయనిదే గాయత్రి నుపదేశింపరాదు. భస్మధారణ చేసిన పిమ్మటనే గాయత్రీ జపము చేయవలయును. మంత్రపూతమైన తెల్లని భస్మమెవని నొసట శోభిల్లునో అతడే బ్రాహ్మణుడు. భస్మధారణము చేయక ఫలాదులను తినరాదు. భస్మధారణ చేయనివాడే శుభమునకనర్హుడు. విభూతి ధారణ చేయక సంధ్యోపాసనము చేయని వానికి ప్రత్యవాయము కలుగును. భస్మధారణమొనర్పక గాయత్రికి యోగ్యుడుకాడు. సంధ్యాది కర్మలయందు ద్విజుడు తప్పక యథావిధిగ భస్మధారణ చేయవలయును. భస్మనిష్ఠుడైనవాని పాపము చేరదు. ఇకపై ఊర్ధ్వ పుండ్ర విధిని దానికి తగినవారిని గూర్చి చెప్పెదనని యిట్లు పలికెను:-

గిరిశిఖర - నదీతీర - శివక్షేత్ర - సముద్ర తీరతుల సీమూలములందు పుట్ట యందును గల మట్టిని గ్రహింపవలెను. నల్లని మట్టి శాంతికరము, ఎర్రనిది వశ్యకరము, పచ్చనిది శ్రీకరము, తెల్లనిది ధర్మప్రదము, అంగుష్ఠము పుష్టికరము, నడిమివ్రేలు ఆయుష్కరము, ఉంగరము వ్రేలు అన్నదము చూపుడు వ్రేలు ముక్తి

దాయకము. ఈ యంగుళి తిలకము ధరించవలయును. దీప శిఖవలెగాని వెదురాకువలెగాని తమ్మి మొగ్గవలెగాని నొసట నూర్ధ్వపుండ్రము ధరింపవలయును. చేపతాబేలు శంఖము వీనిలో యాకారమునగాని ధరింపవచ్చు. నొసట గోవింద నామముతో ఉదరమున నారాయణయని, గుండె మీద మాధవయని, కంఠమందు గోవిందయని, పొట్టకు కుడివైపున విష్ణువు, ఎడమవైపున మాధవ, ఎడమ భుజమందు శ్రీధర, కుడి భుజమందు హృషీకేశ, వీపుమద పద్మనాభ మూపున దామోదర, బ్రహ్మ రంధ్రమున వాసుదేవ నామములతో ధరింపవలెను. నారాయణుడిట్లు త్రిపుండ్ర ధారణమును గూర్చి చెప్పి యుత్తమమైన సంధ్యావందనము చెప్పడం ప్రారంభించెను.

# సంధ్యోపాసనా విధానము

నారాయణుడు నారదునకుత్త మోత్తమము పుణ్యప్రదమునగు సంధ్యోపాసనము నిట్లు వివరించెను. అనఘా! ప్రాతఃకాల సంధ్యావందనమును గూర్చి తెలుపుచున్నాను వినుము. ప్రాతఃకాల సంధ్యా వందనమును నక్షత్రములుండగా ప్రారంభించవలయును. సూర్యుడు ఆకాశమధ్య మందున్నప్పుడు మధ్యాహ్న సంధ్యావందనమును సూర్యుడస్తమిచకుండగనే సాయం సంధ్యావందనము నారంభింపవలయును. ఇట్లు మూడువేళల సంధ్యావందనమొనర్పవలయును. నక్షత్రములస్తమించిన పిమ్మట చేయు ప్రాతస్సంధ్యావందనము మధ్యమము, సూర్యోదయమైన పిమ్మట చేయు సంధ్యావందనము అధమము. సూర్యుడుండగనే యారంభించిన సాయం సంధ్యయుత్తమము, సూర్యుడస్తమించిన పిదప చేయునది మధ్యమము. నక్షత్రములు కనబడునప్పుడు చేయు సాయంసంధ్యా వందనము అధమము. బ్రాహ్మణుడు వృక్షము. సంధ్యలు వేర్లు. వేదములు కొమ్మలు. ధర్మకర్మలు ఆకులు. కనుక వేళ్ళను జాగ్రత్తగా రక్షించుకొనవలెను. మూలము నష్టమైనచో చెట్టుండదుకదా! కొమ్మల విషయము చెప్పనక్కర లేదు. సంధ్యావందనము నెరుగనట్టియు, సంధ్యావందన మాచరింపనట్టివాడు శూద్రుడే యగును. మరుజన్మలో నతడు కుక్కయగును. కనుక నిత్యము సంధ్యోపాసనము చేయదగినది. అది చేయనివాడయే పనిచేయుటకు తగడు. ఉదయాస్తమయము తరువాత మూడు గడియలవరకు సంధ్యను పాసింపవచ్చును. అంతకు కాలము మించినచో ప్రాయశ్చిత్తము చేసికొన వలయును.

కాలము మించినచో నాలుగవ యర్ఘ్యమీయవలయును లేక నూట యెనిమిది మార్లు గాయత్రిని జపించిన తరువాత సంధ్యావందనము చేయ వలయును.

ఏకాలములో నెట్టి పని చేయవలసివచ్చినను కాలాధీశ్వరియైన సంధ్యనుపాసించిన పిమ్మట కాల్యకృత్యములు తీర్చుకొనవలయును. సంధ్యావందనమింటిలో చేయుట సాధారణము. ఆవుల దొడ్డిలో మధ్యమము. నదీతీరమందుత్తమము. శ్రీదేవీ మందిరము లందుత్త మోత్తమము. ఇది కూడ దేవ్యుపాసనమే. కనుక దేవీ సన్నిధానమందే మూడుసంధ్యలు పాసించుచున్నచో ననంత పుణ్య ఫలములు కైవసములగును. బ్రాహ్మణులకు గాయత్రిని మించిన పరమదైవము వేరేలేదు. విష్ణు శివులను పాసించుట నిత్యానుష్ఠేయములుకావు.

శ్రీ మహాగాయత్రి నుపాసించుటయే సకలవేదచోదితము. శ్రీమహా దేవియగు గాయత్రి నుపాసింపుమని శ్రుతిప్రేరేపించును. కనుక గాయత్రి నుపాసించుట ముఖ్యము. బ్రహ్మాదిదేవతలే సంధ్యలయందు గాయత్రిని ధ్యానించి జపింతురు. వేదములును జపించును. కావున గాయత్రిని వేదోపాస్య గాయత్రి యందురు. ఇట్లు ద్విజులెల్లరు పరాశక్తి వేదమాతయగు దేవి నుపాసిం చుటచే శాక్తులగుదురు. కాని వైష్ణవులు శైవులు శాక్తులుకారు. మొదట యాచమనముచేసి కేశవాది నామములచే ప్రాణాయామ మొనర్పవలయును.

ఓం కేశవాయ స్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయ స్వాహా, ఓం గోవిందాయ స్వాహా, ఓం విష్ణవేనమ, ఓం మధుసూదనాయ నమః, ఓం త్రివిక్రమాయనమః ఓం వామనాయ నమః, ఓం శ్రీధరాయనమః, ఓం హృషీకేశాయనమః ఓం పద్మనాభాయ నమః, ఓం దామోదరాయనమః ఓం సంకర్షణాయనమః, ఓం వాసుదేవాయ నమః, ఓం ప్రద్యుమ్నాయనమః, ఓం అనిరుద్ధాయనమః, ఓం పురుషోత్తమాయ నమః, ఓం అధోక్షజాయనమః, ఓం నారసింహాయనమః, ఓం అచ్యుతాయ నమః, ఓం జనార్ధనాయనమః, ఓం ఉపేంద్రాయ నమః, ఓం హరయే నమః ఓం శ్రీకృష్ణాయ నమః ఇట్లు ఓంకారముతో కూడిన యిరువది నాల్గునామముల నుచ్చరింపవలయును. స్వాహాంతమైన కేశవాదినామ త్రయముతో నీరు త్రాగవలయును.

పిమ్మట నమః గల నామములతో నాయా యంగములను తాకవలయును. మొదట త్రాగిన నీరు బొడ్డునకు చేరినపిదప రెండవ మారు మూడవమారు నిట్లు త్రాగవలెను. నాలుగైదు నామములతో నరచేతులు కడుగుకొనవలయును. హృషీకేశయని యెడమచేతిని పద్మనాభ యని పాదములను ప్రోక్షించవలయును. దామోదరయని శిరస్సును తాకి సంకర్షణయని ముఖమును (నడిమి మూడు వ్రేళ్ళ) తోను వాసుదేవ ప్రద్యుమ్నా యని (బొటన - చూపుడు/ వ్రేళ్ళతో ముక్కును,

అనిరుద్ధ - పురుషోత్తమయని (బొటన, ఉంగరపు) వ్రేళ్ళతో కన్నులను, అధోక్షజ నారసింహాయని చెవులను, అచ్యుతయని (బొటన, చిటికెన) వ్రేళ్ళతో నాభిని, జనార్ధనయని యరచేత, హృదయమును ఉపేంద్రయని శిరస్సును ఓం హరయే నమః ఓం కృష్ణాయనమః యని కుడి యెడమ భుజములను తాకవలయును. కుడిచేతితో నీరు త్రాగు నపుడు ఎడమ చేతి నీరు తాకవలయును. ఎడమచేత తాకనంత వరకు జలము శుద్ధముకాదు.

ద్విజుడు తన చేతిని ఆవుచెవి మాదిరిగా చేసి మినపగింజ మునుగు నంత నీరు త్రాగవలయును. ఎక్కువ తక్కువలు త్రాగినచో నతడు మద్యపానము చేసిన వాడగును. కుడిచేతిలోని జలము బొటన చిటికిన వ్రేళ్ళు వదలి తక్కిన వానితో త్రాగవలయును. పిమ్మట ఓంకారమును తన హృదయమందు స్మరించుచు చతుష్పాద్గాయత్రిని జపించుచు ప్రాణాయామ మాచరించవ వలయును. ఎడమ ముక్కుతో గాలిని పూరించి, లోపల కుంభించి, కుడి ముక్కుతో విడువ వలయును. పండితులిట్లు చేయుటను ప్రాణాయామ మందురు. కుడిముక్కును బొటన చిటికిన ఉంగరపు వ్రేళ్ళతో మూయ వలయును. నడిమిచూపుడు వ్రేళ్ళతో ముక్కును మూయరాదు.

ఈ పూరక-రేచక-కుంభకములనే ప్రాణాయామ మని సకలశాస్త్రములందు విధేయ మనస్కులగు పరమయోగులు చెప్పియున్నారు. రేచకమనగా వాయువును వదలుట, పూరకమన గాలిని లోపలకు పీల్చుట. వాయువులోపల నుండుటయే కుంభకమనబడును. నీలకమలసుందరుడు చతుర్భుజుడు, మహానీయుడు నాభి కమల మధ్యమున విరాజిల్లుచుండును. పూరక మందట్టి హరిని, కుంభకమందు హృదయమున కమలాసనుడు జగన్నాథుడగు ప్రజాపతిని ధ్యానింప వలయును. రేచకమందు నొసట తేజరిల్లుచున్న మహేశుడు శుద్ధస్ఫటిక సంకాశుడు, నిర్మలుడు పాపహరుడు - హరుడునైన శంకరుని ధ్యానించవలయును. పూరకమున విష్ణు సాయుజ్యమును, కుంభకము బ్రహ్మ ప్రాప్తియు, రేచకమున శంకరుని పరమైశ్వర్యమును లభించును. శరీరము నిట్టనిలువుగ స్థాణువువలె నుంచి, యింద్రియములు గెలిచి, చూపులు కదలింపక, కనుబొమల నడుమనే నిలిపి యుండ వలయును. ఇది యోగులకు సుఖప్రదమైన సిద్ధాసనమనబడును.

పిమ్మట దేవీ నీవిధముగా నావాహనము చేయవలయును. వరప్రదా యినీ! దేవీ! వేదమాతా! నాశ రహితమైన వేదాంత నిశ్చితమైన బ్రహ్మ తత్త్వము మాకు బోధింపరమ్మ. పరబ్రహ్మ తత్త్వముపదేశింపుము. తల్లీ! దేవీ! నీభక్తుడు పగలు

చేసిన పాపము పగలే తొలగుగాక. రాత్రిచేసిన పాపము రాత్రియే తొలగుగాక. సర్వవర్ణాత్మికయు, మహాదేవియు, సంధ్యావిద్యా స్వరూపిణీయు, సరస్వతీ రూపిణీయు, అజరామరదేవియు, సర్వదేవియునగు, గాయత్రీదేవీ! నీకు నమస్కారములు తల్లీ! తేజోసియను మంత్రముతో గాయత్రి నావాహనము చేయవలయును దేవీ! నిన్ను గూర్చి చేయు మా అనుష్ఠానమంతయును పూర్ణ మగుగాక!

పిమ్మట బ్రహ్మ విశ్వామిత్రుల శాపములు తొలగుటకు వారిని చక్కగ విధి విధానముగ స్మరించవలయును. మరియు వసిష్ఠుని శాపము కలదు. ఇట్లు మూడు విధములగు శాపములు కలవు. బ్రహ్మను స్మరించుటవలన బ్రహ్మశాపము తొలగును. విశ్వామిత్రుని స్మరించినంతనే విశ్వామిత్ర శాపము పోవును. అట్లే వసిష్ఠుని తలచుటచే వసిష్ఠుని శాపము తీరును. తరువాత హృదయకమలమందు విజ్ఞానజ్యోతి వలె వెలుగొందు సత్యాత్మకుడు, విశ్వజగత్స్వరూపుడు, నిత్యుడు, పరమాత్మ, చిద్రూపుడు, మాటలకందని వాడునగు పురుషోత్తముని ధ్యానించుచున్నాను అని ధ్యానింపవలయును.

ఇపుడు సంధ్యా అంగభూతమగు న్యాసవిధిని చెప్పుచున్నాను వినుము. మొదట ప్రణవమొనరించి పిమ్మట మంత్రమును జపించవలెను. ఓం భూః పాదాభ్యాం నమః, ఓం భువఃజానుభ్యాం నమః, ఓం సువః కటిభ్యాంనమః, ఓం మహఃనాభ్యై నమః, ఓం జనః హృదయాయనమః, ఓం తపః కంఠాయనమః, ఓం సత్యం లలాటాయనమః, ఇది వ్యాహృతులతో అంగన్యాసము.

ఓం తత్సవితుః బ్రహ్మాత్మనే అంగుష్ఠాభ్యానమః, వరేణ్యం విష్ణ్వాత్మనే తర్జనీభ్యాంనమః, భర్గోదేవస్య రుద్రాత్మనే మధ్య మాభ్యాం నమః, ధీమహిసత్యాత్మనే అనామికాభ్యాంనమః, ధియోయోనః జ్ఞానాత్మనే కనిష్ఠి కాభ్యాంనమః, ప్రచోదయాత్ సర్వాత్మనే కలతలకర స్వష్ఠాభ్యాం నమః, అని గాయత్రితో కరన్యాసమొనరింపవలయును. ఓం తత్సవితుః బ్రహ్మాత్మనే హృదయాయ నమః, వరేణ్యం విష్ణ్వాత్మనే శిరసే స్వాహా భర్గోదేః స్యరుద్రాత్మనే శిఖాయై వషట్/ధీమహి సత్యాత్మనే కవచాయహుం. ధియోయోనః జ్ఞానాత్మనే నేత్రత్రయాయ వౌషట్/ప్రచోదయాత్ సర్వాత్మనే అస్త్రాయఫట్ అని గాయత్రితో అంగన్యాసము. ఇంక అక్షరన్యాసము చెప్పుచున్నాను వినుము.

గాయత్రీ వర్ణములతో న్యాసము సర్వపాపహరము మొదట ప్రణవము నుచ్చరించి "త" త్తని రెండు కాలిబొటన వ్రేళ్ళయందు న్యాసము. "స"కారమును మడమలందు "వి" కారమును పిక్కలయందు "తు"కారమును మోకాళ్ళందు

"వ" కారమును తొడలయందు "రే" కారము గుదమందు "ణి" కారము మేఢ్ర మందు "య" కారము నడుమునందు "భ" కారమునాభియందు "గో" కారము హృదయమున "దే" కారము స్తనములందు "వ" కారము హృదయమందు ముక్కు మీద "ధి" కారము నేత్రములందు స్యకారము కంఠమందు "దీ" కారము ముఖ మందును "మ" కారము తాలువులందు "హి" కారము నాసికయందు "యో" కారము కనుబొమలనడుమ "యో" కారము నొసట "న" కారము ముఖము ముందు "వ" కారము కుడిముఖమున "చో"కారము పడమటి ముఖమున"ద" కార ముత్తరముఖమున "యా" కారము శిరస్సున "త" కారము వ్యాపకమందు, న్యాసము చేయవలయును. కొందరు జపపరాయణులు ఈ యక్షరన్యాసమును చేయరు. పిమ్మట జగన్మాత మహాదేవి - అంబికను ధ్యానించవలయును.

ఎఱ్ఱని గంధానులేపనములతో ఎఱ్ఱని కమలాసనమున శోభిల్లుచున్న దేవిని జపాకుసుమ ప్రభలు విరజిమ్ము పరమేశ్వరిని కుమారిని ఎఱ్ఱని పూలమాలలు వస్త్రములు దాల్చి పద్మములు మూడు నేత్రములు స్రుక్కు స్రువనము రుద్రాక్షమాల కమండలువులు ధరించిన దేవిని సర్వాభరణములతో తేజరిల్లు దేవి ఋగ్వేదా ధ్యాయిని ఆహవనీయ మధ్యమున విరాజిల్లు హంస వాహనయగు బ్రహ్మ దేవతను నాలుగువేదములే నాల్గుపాదములు ఎనిమిది దిక్కులేనిమిది కుక్షులు సప్తశాస్త్రము లేడు శిరములుగ, అగ్ని ముఖముగ, రుద్రుడు శిఖగ, విష్ణువు హృదయముగ విలసిల్లు గాయత్రిని ధ్యానించవలయును.

బ్రహ్మకవచముగా సాంఖ్యాయన గోత్రమున పుట్టినదియు సూర్యమండల మధ్యమున విరాజిల్లుచున్నదియునగు మహేశ్వరిని గాయత్రిని ధ్యానించి పిమ్మట గాయత్రీ ప్రీతి కరములగు శుభముద్రలు ప్రదర్శింప వలయును. సుముఖము- సంపుటము- వితతము- విస్తృతము- ద్విముఖము- త్రిముఖము- చతుష్కము- పంచకము- షణ్ముఖము అధోముఖము వ్యాపకాంజలికము శకటము యమ పాశము- గ్రంథితము- సముఖోన్ముఖము- విలంబము- ముష్టికము- మత్స్యము - కూర్మము - వరాహకము- సింహాక్రాంతము - మహా క్రాంతము - ముద్గరము -పల్లవ అను ముద్రలు గాయత్రీదేవికి చూపవలయును.

అటు పిమ్మట బుద్ధిశాలి యగువాడు శతాక్షరా గాయత్రి నొకమారు జపించ వలయును. గాయత్రిలోని యక్షరము ఇరువదినాలుగు "జాతవేదసే" మంత్ర మందలి యక్షరములు నలభై నాలుగు "త్ర్యంబక" మంత్రము నందు ముప్పది రెండక్షరములు మొత్తము నూరు వర్ణములగుటచే గాయత్రి శతాక్షరియన నొప్పు

చున్నది. ఇది మహాపుణ్య భాగ్యప్రదము పండితులు దీనినొకమారు జపించ వలయును. తరువాత ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహిధియోయోనః ప్రచోదయాత్ అను గాయత్రీ మంత్రము జపించవల యును. ఈ విధముగ ప్రతి బ్రాహ్మణుడు నిత్యము ముమ్మారు గాయత్రీదేవిని జపించి సంధ్యాదేవి యొక్క సమగ్ర ఫలితములు పొంది నిత్య శాంతి సుఖములను పొందవ్వలయును.

# సంధ్యావందన విధానము

గాయత్రిలోని పాదములను విడిగా జపించినచో బ్రహ్మహత్యాది పాతకములు తొలగిపోవును. పాదములతో కలిపి యొక మారు జపించిన బ్రహ్మ హత్య పాపము సంభవించును. పాదములు కలిపి గాయత్రీ జపము చేయు బ్రాహ్మణులు నూరుకోట్ల కల్పముల వరకు తలక్రిందులుగ పడియుందురు. అనేక ధర్మశాస్త్ర పురాణములందును, ఇతిహాసములందును ఏకప్రణవ సంపుటముగ- ఆరు ప్రణవముల సంపుటముగ గాయత్రిని జపించవలయునని యున్నది. గాయత్రిని పంచప్రణవములు సంపుటము చేసి జపించవలయునను అను శాసనము కలదు. గాయత్రి నెంత జపము చేయుదురో అందులో ఎనిమిదవవంతు తురీయ గాయత్రి జపించవలయును.

అట్లు ఉపాసించిన బ్రాహ్మణుడే యుత్తముడు. అతడే దేవీసాయుజ్య మును పొందును. దానికి భిన్నముగ జపించనచో అంతయు నిష్ఫలమగును. ఊర్ధ్వ రేతస్కులు గాయత్రి ఆరు ప్రణవములు చేర్చి జపించవలయును. బ్రహ్మచారి, గృహస్థుడు, మోక్షార్థి వీరు ఓంకారముగల తురీయపాదమును గూడ జపించ వలయును. గాయత్రి నాల్గవపాదము 'పరోరజ సేసావదోమ్'దానిని సాంగముగా జపించిన ఫలప్రదమగును. ఇపుడు తురీయ పాద ధ్యానము తెలుపుదును వినుము. చిదానందమగు హృదయమందు, దివ్యకమలము వికసించియున్నది. సూర్య చంద్రాగ్నుల రూపమైన ప్రణవమందు దివ్యపీఠముగ విలసిల్లుచున్నది. అచలము- పరమము సూక్ష్మజ్యోతి- గగనసారము నగు సచ్చిదానంద స్వరూపము [illegible] బ్రహ్మమును గూర్చుగాక, ఈ తురీయపాదమునకు త్రిశూలముయోని, సురభి అక్ష మాల లింగము, అంబుజము మహా ముద్రయను నేడు ముద్రలు ప్రదర్శించ వలెను. రాగారుణసంధ్యయే గాయత్రి- సచ్చిదానంద స్వరూపిణి - బ్రాహ్మణుడు నిత్యము అట్టి సంధ్యను పరమభక్తితో జపించివలయును. ధ్యానింప బడు దేవతను

పంచోపచారములతో పూజింపవలయును. 'లం' పృథివ్యాత్మనే గంధం సమర్ప యామి నమోనమః, 'హం' ఆకాశాత్మనే పుష్పం సమర్పయామి నమోనమః, 'రం' అగ్నితత్త్వాత్మనే దీపం సమర్పయామి నమోనమః, 'వం' అమృత తత్త్వాత్మనే నైవేద్యం సమర్ప యామి యని నైవేద్య మర్పింపవలయును. యం రం లం వం హం అని భక్తి పుష్పాంజలి దేవికి సమర్పించవలయును. ఇట్లు పూజావిధి జరిపి పిమ్మట ముద్రలు ప్రదర్శించవలయును. మొదట గాయత్రీదేవిని హృదయముతో ధ్యానించి పిమ్మట మెల్లమెల్లగ మంత్రజపము చేయవలయును.

అప్పుడు తల మెడ కదలరాదు. పండ్లికిలింపరాదు. నూటయెనిమిది సార్లుగాని యిరువది యెనిమిది సార్లుగాని కనీసము పదిసార్లు కాని జపము చేయవలయును. అంతకు తక్కువ ఎప్పుడును చేయరాదు. తరువాత "ఉత్తమేశిఖరే" యను అను వాకముతో గాయత్రి నుద్వాసన చేయవలెను. గాయత్రి జపమెప్పుడును నీటి మధ్యమందుండి చేయరాదు (హారీతాదులు కొందరు చేయవచ్చుననిరి) ఏలయన కొందరు మహర్షులు గాయత్రినగ్నిముఖిగా తలంచెదరు. సురభి - జ్ఞానము- శూర్పము- కూర్మము- యోని - పంకజము- లింగము -నిర్వాణము అను నెనిమిది ముద్రలను జపము చివర ప్రదర్శింపవలయును. ఈ జపమందు స్వరవ్యం జనములు, పదములును, సరిగ నుచ్చరించనిచో, కశ్యపప్రియవాదిని యగు గాయత్రీదేవి దానినంతయును క్షమించుమని క్షమార్పణము కోరవలయును.

తరువాత గాయత్రీ తర్పణమాచరించవలయును. దానికి గాయత్రి- ఛందము విశ్వామిత్రుడు ఋషి-సవిత దేవత తర్పణమున వినియోగమని పలుకవలయును ఓం భూః ఋగ్వేదపురుషం తర్పయామి. ఓం భువః యజుర్వేద పురుషం తర్ప యామి, ఓం సువః సామవేద పురుషం తర్పయామి, ఓం మహః అథర్వవేద పురుషం తర్పయామి, ఓం జనః ఇతిహాస పురాణపురుషం తర్పయామి, ఓం తపరి సర్వాగమ పురుషం తర్పయామి, ఓం సత్యం సత్యలోకాఖ్య పురుషం తర్ప యామి, ఓం భూః భూలోక పురుషం తర్పయామి, ఓం భువః భువర్లోక పురుషం తర్పయామి, ఓం సువః సువర్లోక పురుషం తర్పయామి, ఓం భూః ఏకపదాం గాయత్రీం తర్పయామి, ఓం భువః ద్విపదాం గాయత్రీం తర్పయామి, ఓం స్వః త్రిపదాం గాయత్రీం తర్పయామి, ఓం భూర్భువస్సువః చతుష్పదాం గాయత్రీం తర్పయామి, పిమ్మట ఉషస్సుకు - గాయత్రికి - సావిత్రికి - సరస్వతికి వేదమాతకు పృధ్వికి అజకు - కౌశికికి సాంకృతికి - సార్వజితికి, వీరందరికిని తర్పణ మాచరింప వలయును.

అనంతరము శాంతికొరకు "జాత వేదసేసునవామ" యను మంత్రము చదువ వలయును. పండితుడైనవాడు శాంతికొరకు "మానస్తోకే తనయే" మంత్రమును గాని "త్ర్యంబకం యజామహే" మంత్రముగాని యుచ్చరింప వలయును. శాంతికి 'తచ్ఛంయో'మంత్రమును చ్చరింపవలయును. "అతోదేవా" యను రెండు మంత్ర ములతో సర్వాంగములను తాకవలెను. పిమ్మట "స్యోనాపృథివీ" మంత్రముతో భూమికి నమస్కారము చేయవలెను. పిమ్మట బ్రాహ్మణుడు తన గోత్రఋషి నామములు గల ప్రవర చెప్పి నమస్కరింపవలెను. ఈ విధముగా ప్రాత:కాల మందలి సంధ్యావందనము విధింపబడినది.

సంధ్యావందనము ముగిసిన పిమ్మట అగ్ని కార్యమాచరింప వల యును. అటు పిమ్మట సావధానచిత్తముతో పంచాయతన పూజ చేయవల యును. భవాని, శివుడు, గణపతి, సూర్యుడు, విష్ణువు వీరినర్చింప వలయును. వ్యాహ్రుతులు గల పురుషసూక్తముతో కాని శ్రీదేవీ మూల మంత్రముతో కాని "హ్రీశ్చతే" అను మంత్రముతోగాని నిశ్చలచిత్తముతో పంచాయతన పూజ జరుపవలెను. మధ్యన భవానీ దేవిని ఈశ్యానమున విష్ణువును ఆగ్నేయమున శివుని నైర్రుతిలో గణపతిని వాయవ్యమున సూర్యుని ఉంచి అర్చింపవలయును. ఇది దేవతలను ప్రతిష్ఠించు క్రమ పద్ధతి, పురుషసూక్తమందలి పదహారు మంత్రములతో పదహారు విధముల పూజలు చేయవలయును. మొదట భవాని నర్చించి పిమ్మట తక్కిన దేవతలను క్రమముగా నర్చింపవలయును. ఏలయన శ్రీదేవి పూజకంటె మిన్నయైన పుణ్యా భాగ్యము మరియొకటిలేదు.

అందుచేతనే సంధ్యలయందు తప్పక సంధ్యావందనము చేయుమని శ్రుతులు పలుకుచున్నవి. అక్షతలతో విష్ణుని, తులసితో గణపతిని, గరికతో దర్గను, మొగలి పూవుతో శివుని, ఎన్నడు పూజింపరాదు. మల్లియలు, జాజిపువులు, గిరిమల్లె పువులు, పసనముంకెన పొగడ మొల్లలొద్దుగ శింశుప అపరాజితబంధూక అగస్త్య మదంత సింధువారమోదుగ గరిక మారేడు దళములు కుశశల్లకి మాధవి జిల్లేడు మందారము మొగలి కొండగోగుపువ్వు కడిమిపువ్వులు పున్నాగము సంపంగి గురువింద తగరము మొదలగులైన పూవులు దేవికి ప్రీతిపాత్రములైనవి. నువ్వుల నూనెతో నేతితో దీపారాధన చేసి దేవికి అగరుధూపము సమర్పించవలయును.

ఈ విధముగా దేవతల పూజలుచేసి పిమ్మట తన కిష్టమైన మూలమంత్ర మును జపించవలయును. ఈవిధముగ తెలిసినవాడు పూజలు ముగించుకొని పిమ్మట వేదాధ్యయన మొసరింపవలయును. అటు పిమ్మట తన వృత్తికి తగినట్లు

తల్లి తండ్రి గురువులు పోష్యవర్గములను నియమ పూర్వకముగ శ్రద్ధగా తెలివితో మూడవజాముున పూజించి సేవించవలయును.

# శ్రీదేవీపూజా విశేష నిరూపణము

నారాయణుడు నారదునకు శ్రీదేవీపూజా విశేషము నిట్లు వివరించెను. శ్రీదేవీ పూజా విశేషము భుక్తిముక్తిప్రదము. ఎల్లయాపదలను పోగొట్టును. మొదట మౌనముగ ఆచమనము చేసి సంకల్పము చేయవలెను. తరువాత భూతశుద్ధి-మాతృకాన్యాసము-అంగన్యాసము చేయవలయును. శంఖమును స్థాపించి సామాన్యార్ఘ్యమునిచ్చి హ్రీం హ్రూంఫట్ అనుమంత్రములతో పూజా ద్రవ్యము లను ప్రోక్షించవలయును. పిమ్మట గురువు నాజ్ఞతో పూజ ప్రారంభించవలయును. మొదట పీఠపూజ చేసి తరువాత శ్రీదేవిని ధ్యానించవలయును. శ్రీదేవికి శ్రద్ధా భక్తులతో ఆసనాద్యుపచారములు సమర్పించవలయును.

పరదేవతకు పంచా మృతములతో స్నానమొనరింప వలయును. మంచి చెరకురసముతో నిండిన నూరుకలశములతో మహేశాని నభిషేకించినవాడు మరల జన్మించడు. జగదంబికను మంచి మామిడిపండ్లరసముతో స్నానము చేయించినను వేదపారాయణము చేయుచు ద్రాక్షరసముతో సకుటుంబముగ మహేశ్వరి నభిషేకించినచో అతడు మహారాజగును. ఆరసమందెన్నిబిందువులు గలవో అన్నియేళ్ళతడు దేవీలోకమందు వైభవములనుభవించును. అగరు, కుంకుమ, పువ్వు, కస్తూరి కర్పూరములు కలిసిన నీటితో వేదపారాయణముచే పాల కలశములతో దేవినభిషేకించునో అతడు పాలకడలిలో నొక కల్పము కాలము నిత్యము సంతోష మనుభవించును. పెరుగుతో దేవినభిషేకించువాడు దేవీలోక మందలి దధికుల్య నదికధిపతికా గలడు.

పట్టుతేనె / ఆవునెయ్యి / పంచదారలతో దేవికి స్నానము చేయించువాడు మధుకుల్యానదులకధిపతి యగును. భక్తితో వేయికల శములతో దేవికి స్నానము చేయించువాడు పరలోక మందు ఇహలోకమందును సుఖములనొందును. రెండు తెల్లని వస్త్రములు దేవికర్పించినచో వాయులోకమున చల్లగా సుఖమును పొంద గలడు. రత్నాభరణములను దేవికిచ్చినవాడు గనుల కధిపతియగును. కుంకుమ పువ్వు | చందనము | కస్తూరి సిందూరము | పాదములకు పారాణిని దేవికి సమర్పించు వాడు దేవేంద్రుడుకా గలడు. శ్రీదేవి కుపయోగించ దగిన పలువిధాల పువ్వులను సజ్జనులు తెలిపియుండిరి. వానిని శ్రీదేవికర్పించిన వాడు కైలాస నివాసియగును.

మంచి మారేడుదళములను దేవి కర్పించినవాడు అన్నిచోట్ల నన్నివేళలను సుఖము ననుభవించును. మూడు మారేడు దళములందు ఎఱ్ఱ చందనముతో మూడు మాయాహ్రీంబీజములను వ్రాయవలయును. పిమ్మట "ఓం హ్రీం భువనేశ్వర్యై నమః" అని యుచ్చరించి పరమభక్తితో పూజించినవాడు "మనువు"కాగలడు. క్రొత్త మొల్ల పూలకు అష్టగంధములు చేర్చి పూజించిన తప్పక ప్రజాపతియగును. ఒకకోటి పుష్పములు తెచ్చి పూజించినవాడు చతుర్ముఖుడగును. అట్టి పూలు పదికోట్లు సమర్పించినవాడు దేవదుర్లభమైన విష్ణుసాయుజ్యము నొందును. పూర్వము విష్ణువు తన పదవికిట్టులే దేవినర్చించెను.

ఇట్టి పుష్పములు నూరుకోట్లు దేవి కర్పించినవాడు తప్పక సూత్రాత్ముడగును. ఈ వ్రతమును పూర్వము ప్రయత్నించి భక్తితో జరిపి దాని ప్రభావమున హిరణ్యగర్భుడు తన పదవిని పొందగలిగెను. జపా పుష్పములు మంకెన పువ్వులు, దానిమ్మపూవులు నిటులే దేవికర్పించవలయును. ఈవిధముగ నితర పుష్పములును శ్రీదేవికి సమర్పించవలయును. అట్టి వాని పుణ్యఫలమును ఈశ్వరుడు కూడ తెలుపజాలడు. ఆయా ఋతువులలో విరబూచిన మంచిపూవులు దేవీ సహస్రనామములతో ప్రతి సంవత్సరము దేవికి సమర్పింపవలయును.

ఈ విధముగనెవడు పరమ భక్తితో నాచరించునో యతడు మహాపాపియైనను ఉపపాతకములు గలవాడైనను వాటినన్నిటినుండి విముక్తుడగును. అతడు చనిపోయిన పిమ్మట దేవదుర్లభమైన శ్రీదేవి పాదపద్మములను చేరగలడు. ఇందు సంశయమావంతయులేదు. ఓ మునీ! కాలాగురు కప్పురము, చందనము, కేసరము, నేయి, గుగ్గిలము వీటితో దేవికి ధూపము సమర్పించవలయును. ఇట్లు భవానిమందిరము నిండమంచి ధూపము వ్యాపింప జేసినచో ఆ దేవియు ప్రసన్నురాలై వానికి ముల్లోకములొసంగును. దేవికి నిరంతరము దీపము కర్పూరహారతి నిచ్చు పుణ్యాత్ముడు నిశ్చయముగా సూర్య లోకమున దివ్యప్రభతో సంచరించును. నూరుగాని వేయిగాని దీపములు వెలిగించి దేవియెదుట చోష్యలేహ్యాపేయములు గల షడ్రసముల నివేదించవలయును. మంచితీయని రసాలఫలములు బంగారు పాత్రలందుంచి శ్రీదేవికి నైవేద్యము సమర్పించవలయును.

అట్లు చేసినవానికి దేవి ప్రసన్నురాలగును. జగత్తులన్నియు తృప్తినొందును. ఎందుచేత ననగా జగమంతయు దేవీ స్వరూపమేగదా! త్రాడునందుపాము భ్రాంతివలె దేవి యందు జగద్భ్రాంతి కలుగు చున్నది. కర్పూరము పరిమళించు చల్లని గంగాజలమును కలశమందుంచి దేవికి పానీయముగ నిచ్చునో పిమ్మట

నోటికింపైన పలకులు లవంగాలు కర్పూరము కలిపి చేసిన కమ్మని తాంబూలము శ్రీదేవికి మహాభక్తితో సమర్పించువాడు దేవి యనుగ్రహమునకు పాత్రుడుగును.

పిమ్మట వీణమద్దెల మురజఢక్కా దుందుభిధ్వనులతో లలితరాగ గానములతో పురాణాది స్తోత్రములతో జగముల తల్లిని సంతోషపరచవలయును. దేవికి నిత్యము నియమముగ ఛత్రచామరములు సకలరాజోపచారములు సమర్పించవలయును. పెక్కురీతుల దేవికి ప్రదక్షిణ నమస్కారములు చేయవలయును. జగముల తల్లిని మాటి మాటికిని తన తప్పులు క్షమించుమని వేడుకొనవలయును. ఒక్కమారు తలచినంతనే ప్రసన్నురాలగు దేవి తనకిన్ని యుపచారములు సమర్పించునప్పుడు ప్రసన్నురాలగుటలో సంశయమేయున్నది? ఏ తల్లియైన తన కుమారుని మీద సహజముగనే దయచూపునుగదా! కొడుకు తల్లియెడల భక్తి చూపినచో నింకచెప్పవలసి నదేయున్నది?

ఇప్పుడు ప్రాచీనమైన బృహద్రధుడను రాజర్షిని గూర్చి చెప్పుచున్నాను వినుము. ఈ విషయము విన్నవారికి భక్తిప్రపత్తులు గలుగును. పూర్వము హిమాచలప్రదేశమున నొకచక్రవాకపక్షి యుండెను. అది పెక్కుదేశములు తిరిగి తిరిగి కాశీపురము ప్రవేశించెను. అది తన ప్రారబ్ధవశమున అన్నపూర్ణా దేవి యుండుచోటకు వెళ్ళెను. అదియనాధవలె అన్నకణములు పొందు నాశచే నచటికి వెళ్ళెను. అదియన్నపూర్ణాదేవికి ప్రదక్షిణము చేసి యాకాశమున కెగిరెను. మరల పలుదేశములు తిరిగి తిరిగి ముక్తిప్రదమగు 'కాశి'చేరెను.

అచట కొంతకాలమున కది చనిపోయి స్వర్గమునకు వెళ్ళి దివ్యపురుషుడై యనేక స్వర్గభోగములనను భవించెను. అచట రెండు కల్పముల కాలము సుఖములు పొంది తిరిగి భూలోకమున నుత్తమోత్తమమైన రాజకుటుంబమున జన్మించెను. అతడే యీ భూమిపై బృహద్రధుడను పేరున ప్రసిద్ధుడయ్యెను. అతడు మహాయోగములు చేసినవాడు ధర్మాత్ముడు సత్యవాది జితేంద్రియుడు త్రికాలవేది సార్వభౌముడు సంయమిశత్రు,భీకరుడు నయ్యెను. అతనికి నేలపై దుర్లభమైన పూర్వ జన్మ స్మృతియును కలిగెను. అదివిని మునులెల్లరు రాజును సమీపించిరి. వారు రాజుచే నాతిధ్యమును పొంది దర్భాసనములపై కూర్చుండిరి. మునులు రాజునిట్లడిగిరి.

మహారాజా! నీకే పుణ్యప్రభావమున పూర్వజన్మ స్మృతి గలిగినదో ఏ పుణ్య విశేషమున త్రికాలజ్ఞానము కలిగెనో అట్టి జ్ఞానము తెలుసుకొనుటకు నీవద్దకు

వచ్చితిమి దానిని మాకున్నదున్నట్లు కపటము లేకుండ తెలియపర చుము అని పలుకగా పరమధార్మికుడైన రాజర్షి యిట్లు చెప్పసాగెను. మునులారా! నాజ్ఞాన కారణము వినుడు. నేను పూర్వము నీచజన్మమైన చక్రవాకపక్షిగా నుంటిని. ఒక నాడు నేను తెలియకయే అన్నపూర్ణాదేవికి ప్రదక్షిణము చేసితిని. ఆ పుణ్య ఫలమువలన నేను స్వర్గమునందు రెండు కల్పములు సుఖముగా నున్నాను.

ఇపుడు భూ లోకములో త్రికాలజ్ఞానముతో నున్నాను. భవాని త్రిభువ నేశ్వరియగు తల్లి పాదపద్మములు స్మరించిన దాని ఫలితమెవ్వడు గ్రహించగలడు. ఆ తల్లి మహిమలు దయ తలచితలచి నాకన్నులానందబాష్పములతో నిండు చున్నవి. తల్లియైన శ్రీమాతనుపాసించి భజించనికృతఘ్నులగు పాపాత్ముల జన్మలు వ్యర్థములు వేదములందు శివవిష్ణుల యుపాసన నిత్యమని విధింప బడలేదు. పరదేవత సంధ్యాదేవి నిత్యముపాసింపదగినదని వేదములందు గలదు. దీని యందెట్టి సంశయమును లేదు. దీనిని నేనెక్కువగ నేమి చెప్పగలను?

శ్రీభగవతి పాదపద్మములు నిరంతరము సేవించదగినవి. ముజ్జగము లందెచ్చటనైన దీనిని మించినదేదియునులేదు. కనుక శ్రీపరదేవతను నిత్యము సేవించ వలయును. రాజర్షి ధార్మికుడు నగురాజు యొక్కయీ మాటలు విని మునులు ప్రసన్నులై తమ స్థానములకు వెళ్ళిరి. ఆ భగవతి యింత ప్రభావము గలది. ఆమెను పూజించిన కలుగు ఫలమెంతయుండునో! ఇంతఫలము కలుగునని కచ్చితముగ చెప్పగలవాడెవ్వడు గలడు? ఎవని జన్మము పుణ్యపరిపాకమున ధన్యమో - సఫలమో వానికే దేవియందు శ్రద్ధభక్తి కలుగును. అభాగ్యునకు దేని యందును శ్రద్ధ కలుగనేకలుగదు.

# మాధ్యాహ్నిక సంధ్యావందనము

మాధ్యాహ్నిక సంధ్యావందనమాచరించుట వలన నుత్తమఫలితము కలుగును. మధ్యాహ్న సమయమున సావిత్రీదేవి తెల్లనివర్ణము కలిగి యుండును. త్రిలోచన- వరదాయిని అక్షమాల ధరించినది త్రిశూలధారిణి అభయహస్త వృషభారూఢ యజుర్వేదము నుచ్చరించునది. రుద్రోపాస్య తమోగుణయగు భువర్లోక నివాసిని సూర్యుని మార్గమున సంచరించునది యగు మాయాదేవిని నమస్కరించుచు న్నానని యాదేవినిధ్యానించి మును పటివలెనే యాచమనము చేసి సంకల్పించ వలెను. అర్ఘ్యమునకు పూవులు ఏర్చికూర్చవలయును. పూలు దొరకనిచో మారేడు దళములు జలములు తీసికొని సూర్యునికెదురుగా నుండి పై వైపునకు అర్ఘ్య

మీయవలయును. కొందరికి మధ్యాహ్నమున నర్ఘ్యమొసగు సంప్రదాయము లేదు. చేసినచో కార్యహాని కలుగునందురు. ఏలయన రెండు సంధ్యలందును మందేహు లను రాక్షసులు సూర్యుని భక్షింతురని వేదములందు గలదు. ఆకారణమున రెండు రెండు సంధ్యలందు మాత్రమే అర్ఘ్యమీయవలయును. తరువాత ప్రణవము తో గాయత్రిని జపించవలయును.

కనుక మరల అర్ఘ్యమిచ్చినచో శ్రుతిఘాతు కమగును. "ఆ కృష్ణేన" "హగ్ంసశుచి" మంత్రము చదివి పూవులు జలము కలిపి యర్ఘ్యమీయవలయును. పూలులేనిచో బిల్వము గరికలతో నర్ఘ్యమీయు వలయును. ఇట్లు చేసిన సంధ్యాఫలము సాంగముగా లభించును. దేవమునీశా! ఇపుడు తర్పణవిధానము తెలిపెదను వినుము:-

ఓం భువః పురుషంతర్పయామి నమః, ఓం యజుర్వేదం తర్పయామి, ఓం మండలం తర్పయామి, ఓం హిరణ్యగర్భం తర్పయామి, ఓం అంతరాత్మానం తర్పయామి, ఓం సావిత్రీం తర్పయామి, ఓం వేదమాతరం తర్పయామి, ఓం సాంకృతిం తర్పయామి, ఓం సంధ్యాం తర్పయామి, ఓం యువపతిం తర్పయామి, ఓం రుద్రాణీం తర్పయామి, ఓం నిమృజాం తర్పయామి, ఓం సర్వార్థసిద్ధికరీం తర్పయామి, ఓం సర్వమంత్రార్థసిద్ధిదాం తర్పయామి, ఓం భూర్భువస్వః పురుషం తర్పయామి. ఇది మధ్యాహ్న తర్పణవిధి. ఓం ఉదుత్యమను సూక్తము "చిత్రం దేవానాం" సూక్తమును చదివి సూర్యోపస్థానము చేయవలయును.

పిమ్మట మంత్ర సాధనతత్పరుడై గాయత్రీ జపమును చేయువల యును. నారదా! యిక జపవిధానము చెప్పెదను వినుము. ఉదయమున చేతులు పైకెత్తియు సాయంకాలమున క్రిందివైపుంచియు మధ్యాహ్నమున చేతులు హృదయము కాన్చియు జపము చేయవలయును. ఉంగరము వ్రేలినడిమి మొదటి పర్వములు చిటికినవ్రేలి మూడు పర్వములును పిదప చూపుడువ్రేలి మూలపర్వము వరకు ఒక్కకరమాలయందురు. గోహత్య, పితృహత్య, మాతృహత్య, భ్రూణహత్య గురు తల్పగమనము విప్రధన హరణము సురాపానము ఈ పాపములన్నియు సహస్ర గాయత్రిని జపించుట వలన తొలగును. మనస్సు- వాకు- కర్మవిష యేంద్రియ ముల వలన కలిగిన పాపమంతయు మూడు జన్మలనుండి వెంటాడు పాప సంచయమంతయు గాయత్రీజపముచే నశించును. గాయత్రి నెరుగని వాని శ్రమ యంతయు వ్యర్థము నాలుగు వేదములు చదువవలయును. గాయత్రిని జపించ వలయును. అను రెంటిలో వేదాధ్యయనము కంటె గాయత్రీ జపమే యుత్తమము.

ఇట్లు మాధ్యాహ్నిక సంధ్యా సంధ్యా విధానము తెలుపబడినది. ఇక మీదట బ్రహ్మ యజ్ఞ విధానము తెలుపు చున్నాను శ్రద్ధగా వినుము.

# బ్రహ్మయజ్ఞ విధానము

ద్విజులు మొదట మూడుమార్లాచమనము చేసి రెండుమార్లు మార్జనము చేసికొనవలయును. కుడిచేయికడుగుకొని పాదములపై నీళ్ళు చల్లుకొనవల యును. పిమ్మట శిరస్సు, కన్నులు, ముక్కులు, చెవులు, హృదయము, తల వీటిని నీటితో ప్రోక్షించవలయును. దేశకాలములు చెప్పి బ్రహ్మయజ్ఞ మాచరింప వలయును. కుడిచేత రెండు, ఎడమచేత మూడు, ఆసనమున నొకటి జందెమున శిఖయందు పాదమూలమందు ఒక్కొక్కటి చెప్పున దర్భలుంచవలయును. ఇట్లు సర్వపాప నివృత్తికి ముక్తికి ఆచరింపవలయును.

సూత్రమందు చెప్పబడిన దేవతాప్రీతికి బ్రహ్మ యజ్ఞము చేయుచున్నానని సంకల్పము చెప్పవలెను. మొదట మూడుమార్లు గాయత్రిని జపించి తరువాత "అగ్నిమీళే" మంత్రము నుచ్చరింప వలయును. తరువాత "యదంగ" 'అగ్నిర్వై' మంత్రములు మహావ్రతం- పంథా ఏతచ్చ చెప్పవలెను. అటు తరువాత అథాత: సంహితాయా "విదామఘవత్"-"మహావ్రతస్య" "ఇషేత్వా" "అగ్న ఆయాహి" 'శంనోదేవీ'అనుమంత్రములను అథైతస్య- సమామ్నాయ: - "వృద్ధిరాదైచ్" అథశిక్షాం ప్రవక్ష్యామి పంచసంవత్సర మయం మయరసతజభనలగ గౌర్గ్నా అని యుచ్చరించ వలయును.

పిమ్మట "అథాతో ధర్మజిజ్ఞాసా" "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" "తచ్ఛంయో" "నమోబ్రహ్మణే" మంత్రములుచ్చరింపవలయును. తరువాత దేవతలకు తర్పణమును ప్రదక్షిణ మును చేయవలయును. ప్రజాపతి- బ్రహ్మ- వేదములు- దేవతలు- ఋషులు అన్ని ఛందములు- ఓం కారము- వషట్కారము- వ్యాహృతులు. సావిత్రి- గాయత్రి- యజ్ఞములు- దివిభువులు- అంతరిక్షము- అహోరాత్రములు సాంఖ్యము- సిద్ధులు- సముద్రాలు- నదులు- కొండలు ఔషధులు వనస్పతులు గంధర్వులు అప్సరసలు నాగులు పక్షులు గోవులు విప్రులు సాధ్యులు యక్షరాక్షసులు భూతములు మున్నగువానిని పేర్కొని తర్పణము చేయవలయును.

తరువాత జందెము తావళముగా వేసికొని ఋషితర్పణ మాచరించ వలయును. శతర్చిత - మధ్యమ - గృత్సమద - విశ్వామిత్ర వామదేవాత్రి

భరద్వాజ వసిష్ఠప్రగాథ - పావమాన్య క్షుద్రసూక్త మహాసూక్త సనకసనందన సనాతన సనత్కుమార కపిలా సురివో హరి పంచశిర్ష ఋషులకు తర్పణమాచరించవలెను. తరువాత ప్రాచీనా వీతిగ పితరులకు తర్పణము చేయవలెను. సుమంతుడు జైమిని వైశంపాయనుడు పైల, సూత్ర భాష్య భారత మహాభారత ధర్మాచార్యులు మొదలగువారు తృప్తి చెందునట్లు తర్పణమీయవలయును. జానంతి - బాహవిగార్గ్య - గౌతమ - శాకల-బాభ్రవ్య-మాండవ్య-మాండూకేయ ఋషులకు తర్పణమీయవలయును.

తరువాత గార్గి, వాచక్నవి- బడబ -ప్రాతిథేయిలకు సులభమై త్రేయిలకు కహోల - కౌషీతక - మహాకౌషీతక ఋషులకు తర్పణ మొనరింపవలెను. భరద్వాజుడు పైంగ్యుడు- మహాపైంగ్యుడు-సుయజ్ఞకుడు సాంఖ్యా యనుడు- ఐతరేయుడు- మహైతరేయుడు- బాష్కలుడు - శాకలుడు - సుజాతవక్త్రుడు - ఔదవాహి -సేజామి - సౌనకాశ్వలాయనులు - ఇంకను మిగిలిన యాచార్యులు అందరును తృప్తి చెందునట్లు తర్పణ మాచరింపవలెను. నాకులములో బుట్టి సంతానము లేక మరణించిన నా వంశమందలి వారెల్లరు నేనిచ్చునట్టి వస్త్ర నిష్పీడనజలమును గ్రహింతురు గాక. ఇది బ్రహ్మయజ్ఞ విధానము బ్రహ్మయజ్ఞ ముత్తమమైనది. దీని నాచరించినవాడు సర్వవేదాంగములు చదివిన ఫలమును పొందును. దీని తరువాత సాధకుడు వైశ్వదేవ మాచరించి నిత్యశ్రాద్ధ మాచరింప వలెను. ప్రతిదినమతిథులకన్నము పెట్టుట ముఖ్యముగ నాచరింపవలయును. పిమ్మట ఆవులకు మేతవేసి బ్రహ్మణులతో గూడి భుజింపవలెను.

# సాయం సంధ్యావందనము

సాయంసంధ్యావందన మాచరించుటవలన మహామాయాదేవి ప్రసన్నురాల గును. సాధకుడు ఆచమము చేసి ప్రాణాయామమొనరించి నిశ్చలచిత్తముతో పద్మాసనమున సాయంకాలము స్థిరముగా కూర్చొనవలయును. శ్రుతి- స్మృతి కర్మలయందు సగర్భప్రాణాయామ మొనరింపవలయును. ధ్యానమునందు అగర్భప్రాణాయామ మాచరింపవలయును. అది అమంత్రకమనబడును. భూత శుద్ధి మొదలగునవి జరిప తరువాత కర్మలాచరింపవలయును. రేచకపూరక కుంభకములు చేసి తన యిష్టదేవతను ధ్యానింపవలెను. పిమ్మట సాధకుడు సాయం సంధ్యాదేవినీ రీతిగ ధ్యానించవలయును. కృష్ణాంగములు కృష్ణ వస్త్రములు ధరించిన వృద్ధ సరస్వతీదేవి - గరుడవాహన - శంఖచక్రగదా పద్మహస్త- నానారత్న

భూషణ భూషిత- మంజీరమేఖులలు రవళించవగా ఎనలేని రతనాల కిరీటము ప్రకాశింపగ తారహారావళితో తాటంకమాణిక్యకాంతులతో నునులేత చెక్కు టద్దములతో ప్రకాశించుదేవి- పీతాంబరధారిణి సచ్చిదానంద స్వరూపిణి- సామగాన లోల సత్యమార్గగామిని- స్వర్గోక నివాసిని రవి మార్గగామినియైు సూర్య మండలము నందుండి భూమి దిగివచ్చు సంధ్యాదేవి నావాహనము చేయు చున్నాను. ఇట్లు సంధ్యాదేవిని ధ్యానించి సంధ్యావందన సంకల్పము చెప్పవలెను.

"ఆపోహిష్ఠామ" "అగ్నిశ్చ" మంత్రములు చదువవలయును. మిగిలిన దంతయును పూర్వమువలె నాచరింపవలయును. శ్రీనారాయణ ప్రీతికి గాయత్రీ మంత్రముచ్చరించి సాధకుడు శుద్ధ చిత్తముతో సూర్యున కర్ఘ్యమీయ వలయును. రెండు పాదములను సమముగానుంచి దోసిటనీరు తీసికొని సూర్య మండల సుందరిదేవిని ధ్యానించి వరుసగ నర్ఘ్యమీయవలయును. మూఢుడై తెలివిమాలి నీటిలో నర్ఘ్యమిచ్చినవాడు జ్ఞానహీనుడు. స్మృతి మంత్రముల పాటించని ద్విజుడు ప్రాయశ్చిత్త మొనరించుకొనవలయును.

"అసావాదిత్యో బ్రహ్మ" మంత్రముతో సూర్యోపస్థాన మొనర్ప వలయును. ఆసనమున కూర్చొని దేవి నుద్దేశించి వేయిగాని ఐదువందలుగాని జపము చేయవలెను. ఈ సాయం సంధ్యాదేవి సరస్వతికి వసిష్ఠుడు ఋషి విష్ణువు దేవత సరస్వతి ఛందము సాయం సంధ్యాతర్పణమున వినియోగము చేయవలయును. "స్వః"అని పురుషుడు సామవేదము మండలము హిరణ్యాగర్భుడు పరమాత్మ సరస్వతి- వేదమాత- సాంకృతి- సంధ్య- వృద్ధ- విష్ణురూపిణి ఉషసి నిమృజ- సర్వసిద్ధికారిణి సర్వమంత్రా ధిపతికి భూర్భువస్సువములు పురుషుడు నను వారందరికిని శ్రుతి సమ్మతముగ సంధ్యయందు తర్పణ మాచరించ వలయును. ఇది సాయం సంధ్యావిధానము. ఇది సర్వదుఃఖహారము వ్యాధినాశకము మోక్షప్రదము సదాచారములందు సంధ్యావందనమునకు ప్రాధాన్యము కలదు. సంధ్యావందన మాచరించిన వారియెడల శ్రీదేవి సుప్రసన్నురాలగును. దేవిభక్తుల వాంఛితములను నెరవేర్చును.

# గాయత్రీ పురశ్చరణము

పాపహరము ఇష్టఫలదాయకమునగు గాయత్రీ పురశ్చరణ విధాన మును నారాయణుడిట్లు చెప్పెను. పర్వతము చివర, నదీతీరము, మారేడు చెట్టు, మొదలు, కొలకులు, గోశాల, దేవాలయము, రావిచెట్టు, పూలతోట, తులసీవనము, పుణ్యా

క్షేత్రము గురువుసమీపము ఈ ప్రదేశములందు ఎచ్చటనైనను మనస్సు నిలుచు చోట పురశ్చరణము చేయువానికి తప్పక మంత్రసిద్ధి కలుగును. ఏ మంత్రమునకైన పురశ్చరణ చేయదలచినచో మొదట వ్యాహృతులతో గాయత్రిని పదివేలు జపము చేయవలయును. నారసింహము ఆదిత్యము వారాహము అనునవి వైదికము తాంత్రికమునని రెండు విధములుగ కలవు. ఈ రెంటిలో దేనినైన పురశ్చరణ చేయదలచిన, గాయత్రిని జపించనిచో నంతయు నిష్ఫలమగును. ద్విజులందరును శాక్తేయులేకాని శైవులు వైష్ణవులునుకారు. ఏలయన నెల్ల ద్విజులును నాదిశక్తి వేదమాతయగు గాయత్రి నుపాసించువారే. పురశ్చరణ చేయదలచినవాడు మంత్రశోధనకు పూర్వ మంగశోధనము ఆత్మశోధనము పూనికతో చేసికొనవలయును. పండితుడాత్మ శోధనకు మూడులక్షలు జపము చేయవలయును. లేక వేదమున చెప్పినట్లు లక్ష జపించవలయును.

ఆత్మశుద్ధి మంత్రశుద్ధి లేక చేసిన హోమములన్నియు వ్యర్థములేయగును. వేద మేయిటుల పలికినది. తపస్సువలన దేహమును తపింప చేయవలయును. దేవతలకు పితరులకును తర్పణము చేయవలయును. అట్టి తపస్సువలన స్వర్గము గలుగును. క్షత్రియుడు తన బాహుపరాక్రమముతో వైశ్యుడు ధనమువలన శూద్రుడు పరిచర్య చేత ద్విజోత్తముడు జపహోమాదులవలన ఆపదలను దాటగలడు. అందుచేతనే కడు పూనికతో తపమాచరింపవలెను. శరీరమును శోషింప చేయుటయే యుత్తమతపమనబడును. విధిప్రకారముగ కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములతో తపించవలయును.

నారదా! యిపుడన్న శుద్ధి కరణమును తెలుపు చున్నాను వినుము. యాచించక దొరికినది- ఉంఛవృత్తి - శుక్ల - భిక్షావృత్తి - యివినాలుగు వృత్తులు. ఇట్లు లభించినదానికి వైదికులు తాంత్రికులును అన్న శుద్ధిని పేర్కొనివారు. శుద్ధమైన భిక్షాన్నము తెచ్చి నాలుగు భాగములు చేయవలయును. అందొకటి ద్విజులకు రెండవది గోవులకు మూడవది అతిథులకు నాల్గవది తన కుటుంబమునకు తనకు నుపయోగించు కొనవలయును. ఆయా యాశ్రమములకు తగినట్లు కబళములు చేయవలెను. మొదట యథాశక్తిగ యథాక్రమముగ దానిపై గోమూత్రము చల్లవలెను.

పిమ్మట గృహస్థవాన ప్రస్థులకు చెప్పినట్లు కబళములు నిర్ణయించవలయును. అన్నకబళము కోడి గ్రుడ్డంతయుండవలయును. గృహస్థు డెనిమిది

కబళములను గ్రహించవలెను. బ్రహ్మచారి తొమ్మిది మార్లు - ఆరుమార్లు మూడు మార్లుగాని గోమూత్రము చిలకరించి తన యిష్టము వచ్చినన్ని కబళములు తిన వచ్చును. తన రెండు చేతులు శుభ్రము చేసికొని మనస్సుతో గాయత్రిని జపించి నీటిని ప్రోక్షింపవలయును. దొంగ చండాలుడు - వైశ్యుడు క్షత్రియుడు వీరిలో నెవరు ఇచ్చినను ఆయన్నమధమ మనబడును. శూద్ర సంపర్కముతో శూద్రుల కూడి శూద్రా న్నము తినువారు సూర్యచంద్రులుండునందాక ఘోర నరకమున కూలుదురు. గాయత్రీ మంత్రమున కెన్ని యక్షరములు కలవో అన్ని లక్షలు జపము చేసిన గాయత్రీ పురశ్చరణమగును ముప్పదిరెండు జపము చేసిన గాయత్రీ పురశ్చరణమగునని విశ్వామిత్రుడు పలికెను. జీవచైతన్యములేనిచో దేహామే లేదు.ఏ పనియునుకాదు.

అట్లే పురశ్చరణలేని మంత్రము నిరర్థకమే యందురు. జ్యేష్ఠము, ఆషాఢము, పుష్యము,మలమాసము మంగళ శనివారములు వ్యతీపాత వైధృతి యోగములు చవితి, షష్ఠి, అష్టమి, నవమి, త్రయోదశి, చతుర్దశి, అమావాస్య, ప్రదోష రాత్రి కాలములు భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, జ్యేష్ఠ, ధనిష్ఠ నక్షత్రములు జన్మనక్షత్రము- మేష, కర్కాటక, తులా, మకర, కుంభ లగ్నములు పురశ్చ రణమునకు పనికిరావు. చంద్ర తారాబలములు చూచుకొనవలయును. విశేషించి శుక్లపక్షమున పురశ్చ రణము ప్రారంభించినచో త్వరలో మంత్రసిద్ధి యగును. మొదట స్వస్తివాచనము -నాందీశ్రాద్ధము యథావిధిగ జరిపి బ్రాహ్మణులకు భోజన వస్త్రములిచ్చి తృప్తి పరచవలయును.

పిమ్మట వారి యనుమతితో పురశ్చరణము ప్రారంభింపవలయును. ద్విజుడు పడమర ముఖముగ శివాలయమునగాని యితర పుణ్యస్థలముల గాని జపించ వలెను. కాశికేదారము మహాకాలము నాసిక - త్ర్యంబకము అను ఐదు స్థానములు మహాక్షేత్రములు మంత్రసిద్ధి క్షేత్రములని భూమిపై పేరుగాంచినవి. ఇవికానిచోట కూర్మాసనము సిద్ధిప్రదము. మొదలు పెట్టిననాటి నుండి పూర్తి యగువరకు ప్రతిదినమును జపమెక్కువ తక్కువలు చేయక మౌనముగ నిరంతరముగ పుర శ్చరణము కొనసాగింపవలయును. ఉదయము మొదలు మధ్యాహ్నము వరకును జపము సాగింపవలెను. పవిత్రత - మనోనిగ్రహము- ధ్యానము మంత్రార్థ చింతనము జప మందు పాటింపవలెను. గాయత్రీమంత్రమునకెన్ని యక్షరములు కలవో అన్ని లక్షలు జపము పురశ్చరణకు చేయవలయును.

పిమ్మట సంఖ్యలో దశాంశము మంచి నెయ్యి- పాలు - అన్నము - నువ్వులు- మారేడు దళములు పూలు- పంచదార యవలు మొదలగు వస్తువులతో హోమము చేయవలెను. అప్పుడు మంత్రసిద్ధుడగును. కనుక ధర్మార్థకామమోక్షదాయినియైన గాయత్రి యెల్ల విధముల సేవింపదగినది. నిత్యనైమిత్తిక కామ్యమోక్షములు కావలసినవారు తప్పక గాయత్రీమాతను నమ్ముకొనవలయును. గాయత్రిని మించిన దేవత యీలోక మందేదియు లేదు. మరియొక పురశ్చరణ విధానమును వినుము. మధ్యాహ్నము నమితముగ భుజింపవలయును. మౌనము పాటించ వలయును. మూడువేళల స్నానము చేయవలెను. నీటిలో నేకచిత్తముతో మూడు లక్షలు గాయత్రిని జపించ వలెను. ఇట్లు పురశ్చరణ జరిపిన పిమ్మట కామ్యకర్మ గాని సహజకర్మగాని సిద్ధించువరకు జపము సాగింపవలెను. ఇపుడు కామ్యకర్మ విధానము తెలుపుచున్నాను వినుము.

ప్రతిదినము సూర్యోదయమున స్నానము చేసి సహస్ర గాయత్రి జపించవల యును. దీనివలన ఆయురారోగ్యములు తప్పక సిరిసంద పలును కలుగును. ఇట్లు చేసిన మూడునెలల- ఆరునెలల- లేక సంవత్సరమునకు చివర తప్పక కోరిక తీరును. నేతిలో నిండ తడిపిన లక్షకమలము అగ్నిలో గాయత్రీ మంత్ర ముతో హోమము చేసిన తప్పక మోక్షము చేతిలోని దైయుండును. మంత్రసిద్ధికాక చేసిన జపహోమములు కామ్యమోక్షక్రియ లన్నియు నిష్ఫలము లగును. పాలు పెరుగు కలిపి గాయత్రితో నిరువది యైదు లక్షలు హోమము చేసినవాడీ జన్మ మందే సిద్ధినొందునని మహర్షులు చెప్పిరి. అష్టాంగసిద్ధివలన ఏ ఫలితము కలుగునో మంత్రసిద్ధివలన నదే ఫలము తప్పక కలుగును.

ఆహారము తీసికొనుచు నియమముగ చేతనైన కాకున్న ఆరు నెలలు గాయత్రి జపించినచో గురుభక్తి గలవారికి తప్పక సిద్ధి కలుగును. ఒక దినమున పంచ గవ్యములు ఒకదినమున వాయువును ఒకదినమున బ్రాహ్మణాన్నమును తినుచు గాయత్రి జపము చేయవలెను. గంగాది పుణ్యతీర్థములందు స్నానము చేసి ఆ జలమందుండి శతగాయత్రి జపించి పిమ్మట తీర్థము తీసికొనినవాని సర్వ పాపములు పటా పంచలగును. దీనివలన తప్పక కృచ్ఛ్రచాంద్రాయణాదుల ఫలిత మబ్బును. రాజుగాని విప్రుడుగాని తన గృహమునందే జపించవలయును. బ్రహ్మ చారి గృహస్థుడు వానప్రస్థుడును వారివారి యోగ్యతలనుబట్టి యజ్ఞముల ఫలిత ములు పొందుదురు. ముముక్షువులు శ్రౌతస్మార్తకర్మలు తప్పకాచరింప వలయును. అగ్నిహోత్రాది సదాచార సంపన్నుడు పండితులచేత సుశిక్షితు డును

ప్రయత్నించి ఫలమూలములు జలములు భిక్షాన్నము గ్రహించ వలయును. ఎనిమిదిముద్దలు మాత్రమే భుజింపవలెను. దేవర్షీ! ఈ చెప్పిన పద్ధతిగా పురశ్చరణము జరిపిన వానికి తప్పక మంత్రసిద్ధి గలుగును. దీని ననుష్ఠించినవాడు ధనవంతుడు అగును. ఈ గాయత్రీ పురశ్చరణ విధానము విన్నవానికి మిక్కిలి పుణ్యమగును.

# వైశ్వదేవ విధానము - ప్రాణాగ్నిహోత్రవిద్య

వైశ్వదేవ విధానము చెవులపాపములను పోగొట్టును. దేవయజ్ఞము బ్రహ్మయజ్ఞము పితృయజ్ఞము భూతయజ్ఞము మనుష్యయజ్ఞమునని పంచ యజ్ఞములు గలవు. గృహస్థునకు పంచపాతకములు సంభవించును. ఊడ్చుట, పిసుకుట, అలుకుట, దంచుట, విసరుట, యనెడు పనులందు క్రిములు పడిచచ్చుచుండును. కనుక పాపశాంతి చేసికొనవలయును. పొయ్యిలోహపాత్ర నేల ఖర్పరము మొదలగుచోట్ల వైశ్వదేవము చేయరాదు. అగ్నికుండమున లేక స్థండిలమున చేయవలయును. చేయి- చేట - జింక తోలు వీటితో అగ్నిని మండించరాదు. నోటితో నూదవలయును. ఏలయన అగ్నినోటినుండియే యుద్భవించెను గదా!

అగ్నినివస్త్రముతో విసిరిన వ్యాధి చేటతో విసరిన దారిద్ర్యము చేతితో మృత్యువు నోటితో నూదిన కార్యసిద్ధియు కలుగును. అగ్నిలో ఫలములు పెరుగు నెయ్యి కూరలు గడ్డలు లేనిచో కట్టెలు వేళ్ళుగడ్డి నెయ్యి పెరుగు పాలతో ఇవి దొరకనిచో కనీసము నీటితోనైన తడిపి హోమము చేయవలయును. ఎండిన పాసిన యన్నము హోమము చేసిన కుష్ఠురోగము, ఎంగిలి హోమము చేసిన శత్రువులకు వశుడగును. ఎండిన వస్తువులవలన పేదరికము ఉప్పు హోమము చేసిన నరకము కలుగును.

పచనాగ్నిలో నుత్తర భాగమునుండి బూడిదగప్పిన నిప్పును వైశ్వదేవమునకు తేవలెను. క్షారములు మొదలగునవి కలిసిన యగ్నితో వైశ్వదేవము చేయరాదు. వైశ్వదేవము చేయక తిను మూఢుడు కాలసూత్ర నరకమందుకూలును. కూరలు దుంపలు పత్రము ఫలము వీటిలోనేదైన అగ్నిలో హోమము చేసి తరువాత భుజింపవలయును. వైశ్వదేవము చేయకముందే భిక్షవేయవలసి వచ్చినచో వైశ్వదేవభాగము వేరుగ తీసి మిగిలినది భిక్షవేయవల యును. వైశ్వదేవము చేయని దోషమును భిక్షుకుడు తొలగింపగలడు కాని భిక్షుకునికి పెట్టని దోషమును వైశ్వదేవము తొలగింప జాలదు. బ్రహ్మచారి యతి వీరిర్వురు సిద్ధాన్న స్వాములు.

వీరికి పెట్టక తినువాడు చాంద్రాయణవ్రత మాచరింపవలెను. వైశ్వదేవము నిర్వర్తించిన పిమ్మట గో పూజ చేయవలయును.

నారదా! దాని విధానము తెలుపుచున్నాను వినుము. గోమాతా! వైష్ణవీమాతా! విష్ణుపద నివాసినీ! సురభీ! నీకు గ్రాసమునిచ్చుచున్నాను తినుము తల్లీ! గోభ్యశ్చ నమః అనుచు గోమాతను పూజించి గోగ్రాసమీయవలెను. గోగ్రాసమువలన గోమాత - సురభి ప్రసన్నురాలగును. తరువాత ఆవును పితుకు నంతవరకు అతిధికెదురు చూడవలెను. ఏయింటినుండి అతిథి భగ్నాశుడై వెడలి పోవునో అతడా యజమాని పుణ్యము గ్రహించి తన పాపమునీ యజమానికిచ్చి వేయును. తల్లి, తండ్రి, గురువు , సోదరులు, దాసులు, ఆశ్రితులు, అతిథి అభ్యాగతుడు అగ్నివీరందరిని యజమాని తప్పక పూజింపవలయును.

ఇట్లు తెలిసియునెవడు మోహభ్రాంతిచే స్వార్థబుద్ధితో గృహస్థాశ్రమమును చక్కగా నిర్వర్తించడో వానికీలోకమునగాని పరలోకముగాని ధర్మము తోడుగా నుండదు. ధనవంతుడగు ద్విజుడు సోమయాగమున నెట్టి ఫలితమునొందునో బీదవాడును పంచమహాయజ్ఞములాచరించి యట్టి ఫలితమును పొందగలడు. మునిపుంగవా! ఇప్పుడు ప్రాణాగ్నిహోత్రమును తెలుపుచున్నాను. చక్కగా వినుము. దానినాచరించినవాడు జన్మమరణములు ముదిమియున్నగు వాటినుండి విడువబడును. దానినెరిగినప్పటికిని నరులు పాపవిముక్తులగుదురు. విధిప్రకారము భుజించువాడు ఋణ త్రయమునుండి విముక్తుడగును. అట్టి విప్రుడు యిరవైఒక్క తరముల వారిని నరకమునుండి యుద్ధరింపగలడు. అతనికి సర్వయజ్ఞ ఫల ప్రాప్తియు, సర్వలోకప్రాప్తియు కలుగును.

ఈ హృదయకమలముక్రింది యరణి మనస్సు పై యరణి వాయువు తాడుగ చేసి అగ్నిని మథించవలయును. కన్నుల ధ్వర్యుడు చూపుడు నడిమిబొటన వ్రేళ్ళుతో ప్రాణాహుతులు వేసుకొనవలయును. నడిమి ఉంగరపుబొటన వ్రేళ్ళతో నపానాహుతి, ఉంగరపు చిటికిన బొటన వ్రేళ్ళతో వ్యానాహుతి, చూపుడు చిటికిన బొటన వ్రేళ్ళతోను దానాహుతి, అన్ని వేళ్ళతో సమానాహుతి వేసికొనవలయును. ప్రణవము మొదట నుంచి స్వాహాంతముగా "ప్రాణాయస్వాహా" అనురీతిగనన్ని యాహుతులు వేసికొనవలయును.

ముఖమందాహవనీయము హృదయమున గార్హపత్యము నాభియందు దక్షిణాగ్ని క్రింద సభ్యాగ్ని ఆవసథ్యాగ్నియున్నట్లు భావించవలయును. వాక్కు హోత ప్రాణము ఉద్గాతకన్ను అధ్వర్యుడు మనస్సు బ్రహ్మచెవి ఆగ్నీధ్రుడు

అహంకారము యజ్ఞపశువు ప్రణవము క్షీరము బుద్ధియిల్లాలు గృహస్థుడామెకు వశుడై యుండును. హృదయము వేదిక రోమములు దర్భలు రెండుచేతులు స్రుక్‌స్రువములు "ఓం ప్రాణాయస్వాహా" అనుమంత్రము బంగారువర్ణము. దీని ఋషిక్షుధాగ్ని - దేవత సూర్యుడు ఛందము గాయత్రి ఓం ప్రాణాయ స్వాహా అనిన పిమ్మట "ఇదమాది దేవాయనమః" అని పలుకవలయును. అపాన మంత్రమునకు ఆవుపాలరంగు శ్రాద్ధాగ్నిఋషి సోముడు దేవత ఉష్ణిక్కు ఛందము "ఓం అపానాయ స్వాహా" అని 'ఇదం సోమాయనమః' అని పలుకవలయును. వ్యానమంత్రమునకు పద్మమురంగు హుతాశనాగ్ని ఋషి అగ్నిదేవత అనుష్టుపు ఛందము "ఓం అపానాయస్వాహా" అని తరువాత "ఇదమగ్నయేనమః" అని పలుకవలయును.

ఉదానమంత్రమునకు ఆరుద్ర పురుగురంగు. అగ్నిఋషి, వాయువు దేవత బృహతీఛందము "ఉదానాయస్వాహా" యని పూర్వమువలె చేసి "ఇదంవాయవే నమః" అని పలుకవలయును. నారదా! సమానవాయుమంత్రమునకు మెరుపు రంగు. అగ్నిఋషి పర్జన్యుడు దేవత పంక్తి ఛందము "ఓం సమానాయస్వాహా" అని వెనుకటివలెనే చేసి "ఇదం పర్జన్యాయనమః" అని పలుకవలయును. "ఓం పరమాత్మనేస్వాహా" అని "ఇదం పరమాత్మనేనమః" అని పలుక వలయును. ఇదంతయు ప్రాణాగ్నిహోత్రమనబరగును. ఈ ప్రాణాగ్ని హోత్రవిద్య సంక్షేపముగా తెలుపబడినది.

# పురశ్చరణ విధానము

సాధకుడు భోజనము చేసిన పిమ్మట "అమృతాపిధానమసి" అను మంత్రము చదివి నీరు త్రాగవలయును. పాత్రలో తినగా మిగిలిన యన్నము. నుచ్ఛిష్టము కోరువారికీయవలయును. నాకులములోనన్నము కోరునట్టి దాస దాసీజనులునే నిచ్చిన యుచ్ఛిష్టముతో తృప్తి చెందుదురు గాక రౌరవనరకమందు పడి దిక్కులేని వారికి జలము తృప్తి కలిగించుగాక యని నీరు వదలవలయును. పవిత్ర గ్రంధి విడదీసి మండల మందుపడ వేయవలయును. ఉచ్ఛిష్టమును పాత్రయందే యుంచిన పంక్తిదోషము పట్టును. ఉచ్ఛిష్టమును కుక్కలుగాని శూద్రుడుకాని తాకినచో ద్విజుడొక్కరాత్రి ఉపవాసముచేసి పంచగవ్యముతో శుద్ధి చేసికొన వలయును. ఉచ్ఛిష్టముకాని దానిని తాకినచో స్నానమాత్రమున శుద్ధి యగును. ప్రాణాగ్నిహోత్రములలో ఒక్కయాహుతి వలననే కోటియజ్ఞ ఫలము ప్రాప్తించును. ఐదుప్రాణాహుతుల వలన ఐదుకోట్ల ఫలము గల్గును. ప్రాణాగ్నిహోత్రము చేయు

వాని కన్నదానము చేసినచో దాతకే ఫలము గలునో/తినువానికి కూడ అదే ఫలితము కలుగును. వారిద్దరును స్వర్గము నలంకరింతురు. చేత పవిత్రము ధరించి విధిప్రకారము భుజించు బ్రాహ్మణునకు ప్రతిక బళమును పంచగవ్యము వలె శుభఫలమునిచ్చును. పూజాకాలము నందు మూడు వేళల జపము తర్పణము బ్రాహ్మణుల కన్న దానము హోమమును చేయుట పంచాంగ పురశ్చరణ మనబడును.

పురశ్చరణ సమయమున నేలపై పరుండ వలయును. ధర్మము చేయవలెను. ఇంద్రియములను క్రోధమును జయింపవలయును. మితముగ హితముగ తినవలెను. వినయశాంత స్వభావములు కలిగి యుండవలెను. నిత్యము మూడు వేళల స్నానము చేయవలెను. మంచి మాటలు పలుక వలయును. స్త్రీశూద్రపతిత వ్రాత్య నాస్తికోచ్ఛిష్టుల చండాలురతోడను మాటలాడరాదు. జపహోమార్చనలు చేయునప్పుడు యెవరికిని నమస్కరింపరాదు. మాట్లడరాదు. శృంగార సల్లాప ములు,మర్మభాషణములు పనికిరావు. ఈ చెప్పిన పద్ధతులనన్నిటిని పురశ్చరణ సమయమున విధిగా మనోవాక్కాయ కర్మలతో వదలవలయును. గృహస్థుడు రాజు నిర్వురును బ్రహ్మచర్యము పాటింపవలయును. రాజులు ఋతుస్నాతయైన భార్యతో కలియవచ్చును. సంస్కారవతియైన భార్యతో ఋతుకాలము నెరిగి ప్రయత్నించి రాత్రియందే యామెతో సుఖింప వలయును. ఇట్లు చేసినచో బ్రహ్మచర్యము చెడదు. ఋణత్రయము తీర్చుకొనక పుత్ర సంతానము కనక యజ్ఞములాచరింపక మోక్షము కోరువాడు అధోగతి పాలగును.

అట్టివాని జన్మము వ్యర్థము. ప్రతివ్యక్తియు ఋణ త్రయమునుండి విము క్తుడు కావలయును. బ్రహ్మచర్యమువలన ఋషి ఋణము నుండియు/ తర్పణ మువలన పితౄణము నుండియు/ యజ్ఞము వలన దేవఋణము నుండియు/ విముక్తుడు కావలయును. ప్రతివ్యక్తియు తన యాశ్రమధర్మమును పాటించవల యును. పండితుడు పాలుపండ్లు కూరగాయలు హవిష్యాన్నము భిక్షాన్నము తినుచు కృచ్ఛ్ర చాంద్రాయణము లాచరింపవలయును. పురశ్చరణ సమయమున/ నుండ వలసిన పద్ధతియది. ఉప్పు/ కారము/ గుంజనము/ కంచుపాత్రలో భోజనము/ తాంబూలము/ రెండుమార్లు తినుట/ చెడుసహవాసము/ ప్రమత్తత/ శ్రుతి స్మృతుల/ విరోధించుట/ రాత్రి జపించుట వదలవలయును. జూదము స్త్రీ అప వాదములందు కాలము వ్యర్థముగా గడుపరాదు. స్తోత్రపాఠములు వేదశాస్త్రములు ఆగమములు మొదలగునవి చదువుచు దేవపూజలు జరుపవలయును. భూశయనము బ్రహ్మ

చర్యము మౌనవ్రతము. నిత్యము మూడువేళల స్నానము శూద్రకర్మలు చేయింప పకుండుట నిత్యపూజ నిత్యదానము ఆత్మానందము దేవతాస్తుతి దివ్యహరి నామ సంకీర్తనము నైమిత్తికార్చనము తల్లితండ్రి గురుదేవత లందు దృఢభక్తి విశ్వాస ములు అను పన్నెండు ధర్మములు పురశ్చరణ జరుపు జపనిష్ఠునకు మిక్కిలి యవసరము.

నిత్యము సూర్యోపస్థానముచేసి సూర్యునకభి ముఖముగ గాయత్రిని జపించ వలయును. దేవతాప్రతిమ యందుగాని అగ్నియందు గాని జన్మసాఫల్య మంత్ర మగు గాయత్రి నర్చించవలయును. స్నానము పూజ జపము ధ్యానము హోమము తర్పణము అనువానిని నిష్కామముగా తనయిష్ట దేవునకర్పించవలయును. పురశ్చరణ మాచరించువాడు పై నియమములెల్ల యథావిధిగ పాటించవల యును. ద్విజుడు సంతుష్టచిత్తుడై జపహోమములందు ఆసక్తి కలవాడు కావలెను. నిత్యము తపము స్వాధ్యాయము భూతదయ కలిగియుండవలెను. తపము వలననే స్వర్గము మహత్త్వము కలుగును.

తపస్వి జితేంద్రియుడగును వాని కర్మలన్నియు ఫలించును. ద్వేషము మారణము, సంహారణము, రోగనాశము మొదలగువాటిని కోరి దేవఋషు లను స్తోత్రము చేసినచో వారివారి దయవలన తన కోరికలన్నియు తీరును. ఇప్పుడు కొన్ని పనులు నెరవేరు విధానము తెలుపుచున్నాను వినుము. ఏ పని సాధింప వలెనన్నను మొదట పురశ్చరణ తప్పక చేయవలయును. ద్విజుడు స్వాధ్యాయ మభ్యసించుటకు ముందు ప్రాజాపత్యవ్రత మాచరింపవలెను. తలగడ్డము మీసము గొరిగించుకొని గోళ్ళు తీయించుకొని స్నానము చేసి శుచికావలయును. రాత్రిం బవళ్ళు వాక్కు నియమించుకొని సత్యము పలుకుచు పవిత్రుడై వ్యాహృతులు జపించవలయును. మొదట ప్రణవ పూర్వకమైన గాయత్రిని జపించవలయును.

పిమ్మట పవిత్రము పాపనాశనమునైన "అపోహిష్ఠామ" సూక్తము జపించ వలయును. "పునంత్యః" స్వస్తిమత్యః - పావమాన్యః అను మంత్రములు ప్రతికర్మ కును మొదట, చివరను చదువవలయును. గాయత్రిని వేయి మార్లుగాని నూరు మార్లుగాని పది సార్లుగాని జపించవలయును. ప్రణవము వ్యాహృతులు కలిపి పదివేల గాయత్రిని జపించవలయును. ఆచార్య ఋషి ఛందోదేవతలకు జలముతో తర్పణము విడువవలయును. అనార్యులు శూద్రులు నిందితులు పతితులు నాచారితో మాటాడరాదు. రజస్వలతో పతిత చండాలురతో మాటాడరాదు. దేవ

బ్రాహ్మణ గురువులను నిందించరాదు. ద్వేషించరాదు. కన్న తల్లిదండ్రులను ద్వేషించరాదు.

ఈ విధానమున్న కృచ్ఛ్రములందు నాచరింపవలయును. ప్రాజాపత్య కృచ్ఛ్రము - సాంతపనము - పరాకకృచ్ఛ్రము - చాంద్రాయణము యధావిధిగా నాచరింపవలయును. దీనివలన బ్రహ్మహత్యాది సకల పాపములు పంచమహా పాతకములు నశించిపోవును. తప్తకృచ్ఛ్రముననొక క్షణములో పాపములు నశించును. మూడు చాంద్రాయణము లాచరించినవాడు పవిత్రుడై బ్రహ్మలోకము ననుభవించును. అట్లెనిమిది చాంద్రాయణము లాచరించుటవలన వరములిచ్చు దేవతలను సాక్షాత్కారింప చేసికొనవచ్చును. పది చాంద్రాయణము లాచరించుట వలన ఛందముల సారమెరిగి యెల్లకోరికలు అయాచితముగ సాధింపవచ్చును. మూడురోజుల ప్రాత:కాలమున మూడు రోజులు సాయంకాలమున మూడు రోజులు దొరికినవి తినుచు మరియొక మూడురోజులు నిరాహారదీక్షతో నుండ వలయును. ఈ పన్నెండు రోజులు వ్రతమునే ప్రాజాపత్యవ్రతమందురు. మొదటి నాడు గోమూత్రము - ఆవుపేడ, ఆవుపాలు, పెరుగు, నెయ్యి, దర్భల నీళ్ళు తీసుకొనవలయును.

పిమ్మట నొకరాత్రి ఉపవాసము చేయవలెను. ఇది సాంతపనకృచ్ఛ్రము. వెనుకటివలె మూడు రోజులయందొక్కొక్క కబళము తినవలెను. పిమ్మట మూడురోజు లుపవాసము చేయవలెను. ఇది అతికృచ్ఛ్రము. దీనినే మూడు మార్లాచరించిన మహాసాంతపన మగును. తప్తకృచ్ఛ్రమాచరించు బ్రాహ్మణుడు మూడేసిరోజులు నీరు, పాలు, నెయ్యి, గాలి భుజింపవలయును. ఒకసారే స్నానము చేయవలెను. విగ్రహము పాటించవలయును. నియమముతో నీరుత్రాగుట ప్రాజాపత్య వ్రతము పన్నెండు దినములు అన్నము తినకుండిన పరాకకృచ్ఛ్రము. ఇది దోషములను వెంటనే నశింపచేయును. కృష్ణపక్షమున ఒక్కొక్క కబలము పెంచుచుండవలెను. అమావాస్యనాడు భుజింపరాదు. మూడు వేళల స్నానము చేయవలయును. ఇది చాంద్రాయణవ్రతము. బ్రాహ్మడాహ్నిక కృత్యములు తీర్చుకొని ఉదయమున నాల్గుకబళములు సాయంకాలము నాల్గుకబళములు తినిన శిశుచాంద్రాయణ వ్రతమగును. మధ్యాహ్నమున నియతాత్ముడై ఎనిమిది కబళములు హవిష్యాన్నము తినుటయతి చాంద్రాయణము. దీనిని వసువులు రుద్రులు ఆదిత్యులు మరుత్తులు మొదలగు దేవతలు ఆచరించి సుఖముగా నుందురు.

ఈ చెప్పినవన్నియు ఒక్కొక్కటి యాచరించినచో వరుసగా చర్మము రక్తము మాంసము ఎముకలు మేధస్సు మజ్జవసయనునవి ఏడు రాత్రులకొక్కొక్కటి చొప్పున తప్పక శుద్ధి చెందును. ఈ వ్రతములవలన పవిత్రాత్ముడై సాధకుడు నిత్య కర్మలాచరింపవలెను. ఇట్లు శుద్ధాత్ముడైన వాని కర్మలన్నియు తప్పక సిద్ధి పొందును. సాధకుడు సత్యవాది జితేంద్రియుడు శుద్ధాత్ముడునై కర్మలాచరింపవలెను. దానివలన కోరిన కోర్కెలు తీరును. అన్ని కర్మలు విడిచి మూడు రాత్రులు ఉపవసించవలెను లేక మూడు రాత్రులు వ్రతము చేసియైన కర్మలు జరుపవచ్చును.

ఈ విధముగ పురశ్చరణ ఫలితము పొందునట్టి విధానము తెలుప బడినది. గాయత్రీ పురశ్చరణము సర్వకామములు తీర్చును. దేవర్షీ! నీ కటువంటి సర్వ పాపహరమైన వ్రతము గూర్చి వివరించితిని. మంత్రము జపించువాడు మొదట దేహశోధవకు వ్రతము చేయవలెను. అటు పిమ్మటనే అన్ని కోరికలు తీరునట్టి గాయత్రీ పురశ్చరణకు పూనుకొన వలయును. ఈ విధముగ గుహ్యాతి గుహ్యమైన పునశ్చరణ విధావము తెలిపితిని. ఇది శ్రుతిసారము. గాయత్రీ ప్రయోగ విశేష నిరూపణము శాంతి మొదలగు కార్యక్రమములందు గాయత్రిని ప్రయోగించు విధానమును తెలుపుచున్నాను బ్రాహ్మణుడు పాలలో తడిపిన జమ్మిసమిధలను గాయత్రీ మంత్రముతో హోమము చేసినచో భూత గ్రహరోగాదులు శాంతించును. పాలలో తడిపిన పాలచెట్టు సమిధతోగాని ముక్కలతో గాని హోమము చేసినచో భూతరోగాదులు శాంతించును. పిమ్మట దోసిటనీళ్ళు తీసికొని సూర్యునకు తర్పణ మీయవలయును.

# గాయత్రీ జపము-ప్రయోగములు-ప్రయోజనములు

కంఠము లోతునీటిలో గాయత్రిని జపించినచో ప్రాణాంతకమైన భయమైనను తొలగిపోవును. సమస్త శాంతికర్మలకు నీటియందుండి గాయత్రిని జపించవలయును. ఇప్పుడు వేర్వేరు ప్రయోగములు వినుము. బంగారము/ వెండి/ రాగి పాల/చెట్టు/మట్టి అనువాటిలో దేనితోనైన చేసిన చిల్లులులేని పాత్రలో పంచగవ్యము లుంచి వాటికి క్షీరవృక్ష సమిధలు కలిపి మండుచున్న అగ్నిలో హోమము చేయవలెను. వేయి గాయత్రి జపించి పంచగవ్యములు తాకి ప్రోక్షించి ప్రతి ఆహుతి హోమము చేయవలయుము. పిమ్మట బలియిచ్చి పరదేవతను మనస్సులో

ధ్యానించవలెను. దీనివలన అభిచారప్రయోగములవలన కలిగిన కృత్యనశించును. ఈ విధముగ హోమము చేసిన వానికి దేవతలు భూతములు పిశాచములు గ్రహములు పురములు గ్రామములు రాష్ట్రములు సర్వము వశమగును.

అట్టివాడు సకలబాధలనుండి విముక్తుడగును. ఒక చతురస్ర మండలమున ఎనిమిది గంధములతో ఒక శూలమునలంకరించి దానిని గాయత్రితో వేయిమారు లభి మంత్రించి యచ్చట నేలలో పాతిన సర్వశాంతియగును. బంగారము వెండి రాగి మట్టి వీటిలో దేనితోనైన కలశము చేసి దానికి గట్టి మంచి దారము చుట్టి దానిని స్థండిలము లేక యిసుక వేదికపై నుంచి దానిలో మంత్రవేత్త నీరు నింప వలయును. నాలుగు దిక్కులనుండి పుణ్యతీర్థముల నుండి బ్రాహ్మణులు తెచ్చిన నీటిని ఆ కలశమందుంచి దానిలో ఏలకులు చందనము కర్పూరము జాజి పాటలిమల్లికలు మారేడుదళములు విష్ణుక్రాంత సహదేవి వ్రీహియవలు నువ్వులు మినుములు పాలచెట్టు రావి చిగుళ్ళు ఉంచవలయును. తరువాత దానిలో ఇరవైఏడు దర్భలతో చేసిన కూర్చనుంచవలయును. బ్రాహ్మణుడు తరువాత స్నానము చేసి నిష్ఠతో వేయిమార్లు గాయత్రితో దాని నభిమంత్రించ వలయును. మూడు వేదములు తెలిసిన బ్రాహ్మణులు దానికి నలువైపుల చేరి సౌరమంత్ర ములు చదువవలయును.

ఇట్టి కలశములోని జలమును గాయత్రితో భూతాది రోగములున్న వానిని ప్రోక్షించి యానీట స్నానముచేయింపవలయును. అట్టి భూతరోగి అభిచార దోషముల నుండి విముక్తుడై శాంత చిత్తుడగును. ఇంతేల! చావబోవువాడైనను బ్రతుకగలడు. ఈవిధముగ దీర్ఘజీవనము కోరుకొను విద్వాంసులు రాజులును ఆచరింపవలయును. ఇట్లు అభిషేకింపబడినవాడు బ్రాహ్మణులకు నూరేసి గోవులు దానము చేయవలయును. బ్రాహ్మణులు సంతోషించు దానమునే చేయ వలయును.

ద్విజుడు శనివారమున రావిచెట్టు క్రింద నూరుమార్లు గాయత్రి జపించినచో భూతరోగాభిచారములు తొలగును. తిప్పతీగముక్కలు పాలలో నానబెట్టి హోమము చేసినచో అది మృత్యుంజయహోమమగును. ఇది సర్వరోగనివారకము జ్వర శాంతికి మామిడాకులు పాలు హోమము చేయవలెను. పాలలో వస నానబెట్టి హోమము చేసిన క్షయరోగము తగ్గును. పాలు పెరుగు నెయ్యి ఈ మూడిటిని హోమము చేసిన, రాజయక్ష్మ (క్షయ) శాంతించును. క్షీరాన్నము గాయత్రితో హోమము చేసి సూర్యునకు నివేదించి దానిని రాజయక్ష్మరోగికి తినిపించినచో

వాని రోగము తగ్గును. సోమలతను కణుపుల వరకు త్రుంచి వాటి తమావాస్య నాడు పాలతో హోమము చేసిన, క్షయవ్యాధి నివారించును.

శంఖవృక్ష పుష్పములు హోమము చేసిన కుష్ఠురోగము తొలగును. దుచ్చైన విత్తులు హోమము చేసినచో అపస్మారము తొలగును. పాలచెట్టు సమిధలతో హోమము చేసిన ఉన్మాదము తగ్గును. మేడిచెట్టు సమిధలతో హోమము చేసినచో ప్రమేహ రోగములు చెరకురసము తేనె కలిపి హోమము చేసినను ప్రమేహ రోగములు శాంతించును. పాలు, పెరుగు, నెయ్యి కలిపి హోమము చేసిన మశూచి మాయమగును. కపిల గోవునెయ్యి హోమము చేసినను మశూచి తొలగును. మేడిమఱ్ఱి రావిసమిధలు హోమము చేసిన ఆవుల గుఱ్ఱముల ఏనుగుల రోగాలన్నియు దూరమగును. జమ్మిసమిధలు పాలు నెయ్యి కలిపి రెండేసి వందల మార్లు హవనము చేసినచో చీమలు మొదలగు వాటి యుపద్రవములింటనుండవు. దానివలన నింటిలో శాంతి నెలకొనును. మట్టిబెడ్డను నూరుమార్లు గాయత్రితో నభిమంత్రించియే దిక్కుకు విసిరిన ఆ దిక్కునుండి అగ్ని గాలి భయము తొలగును. దొంగలభయము కూడ నుండదు. చెరసాలలో నున్నవాడు మనస్సులోనే గాయత్రిని జపించిన అతడు బంధవిముక్తుడగును. భూతశాంతికి నూరు మార్లు గాయత్రీ మంత్రముతో భస్మము నభిమంత్రించి నొసట ధరింపవలెను.

ఈ విధముగా స్వయంగా చేసికొనలేనివాడు బ్రాహ్మణులకు దక్షిణలిచ్చి చేయించుకొనవచ్చును. విరిసిన పూలు హోమము చేసిన, పుష్టి ఐశ్వర్యము కలుగును. ఎఱ్ఱకమలములతో హోమము చేసిన ధనవంతుడగును. ఎఱ్ఱని జాజి పూలతో హోమము చేసిన ఇంట లక్ష్మి తాండవించును. శాల్యన్నము హోమము చేసిన ఇంట లక్ష్మి కొలువైయుండును. మారేడు సమిధలు కాని ఫలపుష్పములుగాని పండ్లముక్కలుగాని మారేడు వేర్లుగాని హోమము చేసిన వానియింట తరుగని సిరిసంపదలు తులతూగును. మారేడు సమిధలు పాలతో నేతితో తడిపి దినమునకు రెండు వందలు చొప్పున హోమము వారము రోజులు చేసినచో వాని యింట లక్ష్మి తాండవించును. వానికి సుఖశాంతులు కలుగును. పాలు, పెరుగు, నెయ్యి, పేలాలు కలిపి హోమము చేసిన వానికి మంచి కన్య లభించును. ఈ విధముగ కన్య హోమము చేసిన మంచి వరుడు లభించును.

ప్రతిదినము నూరు చొప్పున వారమురోజులు ఎఱ్ఱకమలములతో హోమము చేసిన బంగారము లభ్యమగును. అన్నము హోమము చేసినవాడు అన్నము కలవాడగును. ధాన్యము లేనివాడు ధాన్యవంతుడగును. ఆవుపేడపాడి హోమము

చేసిన పశుసంపద వృద్ధియగును. పాలు, నెయ్యి, పెరుగు, కలిపిన క్రొర్రలు అన్నము హోమము చేసినచో సంతానవంతుడగును. పాయసము హోమముచేసి సూర్యునకు నివేదించి ఋతుస్నాతయగు బ్రాహ్మణస్త్రీకి తినిపించిన పండువంటి కుమారుడు కలుగును. మొలకెత్తిన మోదుగ సమిధలు తడిపి హోమము చేసిన నూరేండ్లు బ్రతుకగలడు. పాలు, పెరుగు, నెయ్యి కలిపి తడిపిన పాలచెట్టు మొలకలతో సమిధ హోమము చేసిన వానికి బంగారము చిరాయువును లభిం చును. నూరు బంగారు కమలములు గాయత్రితో హోమము చేసిన, దీర్ఘాయు వుకలుగును. గరిక పాలు, పెరుగు, నెయ్యి వీటిని ప్రతిదినము నూరుమార్లు చొప్పున ఏడుదినములు హోమము చేసిన అపమృత్యువు తొలగును.

పాలు నెయ్యి అన్నముతో జమ్మిసమిధలు కలిపి హోమము చేసిన, అపమృత్యువు నివారింపబడును. పాయసము మఱ్ఱిసమిధలు కలిపి వారము రోజులు వ్రేల్చిన కూడ అపమృత్యువు తొలగును. భోజనము చేయక మౌనముగ మూడురాత్రులు గాయత్రిని జపించినచో యమ భయము కలుగదు. మారేడు చెట్టు క్రింద నెలదినములు గాయత్రి జపించిన రాజ్యలక్ష్మి వశమగును. యవల పిండి పేలాలు కలిపి హవనము చేసినచో గ్రామాధిపత్యము లభించును. రావి సమిధలు వేల్చిన యుద్ధ ములో విజయలక్ష్మి వరించును. బొడ్డులోతు నీళ్ళలో వారము గాయత్రిని జపించిన కుంభవర్షము కురియును. నీటిలో నూరుమార్లు భస్మము వేల్చిన మహా వర్షమాగిపోవును. మోదుగ సమిధలు వేల్చిన బ్రహ్మ తేజము గలుగును. పాలు వేల్చిన మేధయు నెయ్యి వేల్చిన బుద్ధియును. గాయత్రితో నభిమంత్రించిన బ్రాహ్మీరసము త్రాగిన మేధాసిద్ధిగలుగును. దారములు వేల్చిన వస్త్రములు నాల్గునెలలు జపించుటవలన చిరాయువు సిరి సంపదలు భార్యాపుత్రులు కీర్తి కలుగును. గాయత్రీ తపఃఫలము వలననే నారదాదులు యెల్లలోకములను గెలిచిరి.

ద్విజుడు తన రహస్యపాపములు పోవుటకు మూడువేలు గాయత్రి జపించవలెను. నెల దినములు మూడువేలు గాయత్రి ప్రతిదినము చొప్పున జపించిన, గురు తల్పగమనదోషము నుండి పవిత్రు డగును. ఈ కామ్య ప్రయోగములన్నియు విశ్వామిత్ర మహర్షి వచించెను. మూడు వేల గాయత్రీ జపము ఒక్క ఉపవాసమునకు సాటి. ఇరువదివేల జపము ఒక్క కృచ్ఛ్ర వ్రతమువకు సమానము. అరవైవేల గాయత్రి జపము ఒక్క చాంద్రాయణ వ్రతమునకు సమానము. ప్రతిదినము ఉదయ సాయంసంధ్యలందు నూరేసి వంతున గాయత్రి జపించినచో సర్వ

పాపములు నశించును. నీటమునిగి నూరుమార్లు గాయత్రి జపించిన పిదప పవిత్రరూపిణియగు గాయత్రిని ధ్యానించినచో సర్వపాపపంకము కడిగి వేయ బడును. ఈ విధముగా శాంతి శుద్ధుల కొరకు గాయత్రీ ప్రయోగములు వివరించి తెలిపితిని. ఇవి యెల్ల రహస్యాతి రహస్యములు. సదాచారలక్షణములను సంక్షేప ముగా తెలిపితిని. వీటినన్నిటిని యథావిధిగ నాచరించినవానికి భుక్తి ముక్తులు సులభములు. అన్ని ధర్మముల కధిష్ఠాతృదేవి పరమేశ్వరి. ఇట్లే శాస్త్రములందును సదాచారమునకు మహాపుణ్యఫలము తెలుపబడెను. సదాచారము కలవాడు నిత్య పవిత్రుడు ధన్యజీవి. సుఖవంతుడు !



# ద్వాదశ స్కంధము

## గాయత్రి విచారణము

దేవా! సదాచార విధులను తెలుపుచు గాయత్రీ విధానము చెప్పితివి. ఆ విధానములో మిక్కిలి ముఖ్యమైనదియు అధిక పుణ్యప్రదమైనదియునగు దానిని మాత్రము దయతో తెలియజేయుమని నారదుడడుగ నారాయణుడిట్లు చెప్పెను. బ్రహ్మణుడు ఇతరానుష్ఠానములు చేసినను చేయకున్నను గాయత్రీ నిష్ఠ కలిగియున్నచో అతడు తప్పక తరించును. మూడు వేళల అర్ఘ్యప్రదానము మూడు వేల గాయత్రీజపము చేసిన వానిని దేవతలు కూడకొని యాడుదురు. అంగకర న్యాసములు చేయకున్నను మంచి మనస్సుతో సచ్చిదానంద స్వరూపిణిని ధ్యానించి యెంతేని జపించవలయును. ఇక గాయత్రీ మంత్రమునకు ఋషులు ఛందములు దేవతలు తత్త్వములు వరుసగా వివరింతును. నిశ్చలచిత్తముతో వినుము. వామదేవుడు- అత్రి- వసిష్ఠుడు- శుక్రుడు- కణ్వుడు - విశ్వామిత్రుడు- కపిలుడు - శౌనకుడు - యాజ్ఞవల్క్యుడు - భరద్వాజుడు జమదగ్ని -గౌతముడు ముద్గలుడు - వేదవ్యాసుడు- లోమశుడు- అగస్త్యుడు - కౌశికుడు - వత్సుడు- పులస్త్యుడు - మాండూకుడు. దుర్వాసుడు - నారదుడు - కశ్యపుడు అనువారలు వరసుగ గాయత్రి వర్ణములకు ఋషులు. గాయత్రికి చెప్పబడిన యిరువది నాలుగు ఛందములకు దేవతలను చెప్పుచున్నాను వినుము. మొదటి దేవత అగ్ని, రెండవ వాడు ప్రజాపతి మూడవనాడు చంద్రుడు నాల్గవవాడీ శానుడు ఐదవవాడు సవిత ఆరవవాడాదిత్యుడు ఏడవవాడు బృహస్పతి ఎనిమిదవవాడు మిత్రావరుణులు. తొమ్మిదవవాడు భగుడు పదవవాడర్యముడు పదకొండవాడు గణపతి పన్నెండవాడు త్వష్ట పదమూడు పూషి పదునాలుగు ఇంద్రుడు అగ్ని పదిహేను వాయువు పదహారు వామదేవుడు, పదిహేడు మైత్రావరణుడు, పదునెనిమిది విశ్వేదేవుడు, పందొమ్మిది మాతృకలు ఇరువది విష్ణువు, ఇరువది యొకటి వసువు, ఇరువది రెండు రుద్రుడు, ఇరువది మూడు కుబేరుడు, ఇరువదినాలుగు అశ్వినులు.

## గాయత్రీ వర్ణ శక్త్యాదికము

గాయత్రి వర్ణముల శక్తుల నిట్లు నారాయణుడు నారదునకు చెప్పెను:-

శ్రీ వామదేవి- ప్రియ-సత్య- విశ్వభద్ర - విలాసిని - ప్రభావతి - జయశాంత - కాంత - దుర్గ- సరస్వతి - విద్రుమ - విశాలేశ - వ్యాపిని - విమల- తమోపహారిణి - సూక్ష్మ -విశ్వయోని -విజయ - వశ - పద్మాలయ పరాశోభ- భద్ర - త్రిపద -

అనువారిరు నాల్గు వర్ణముల శక్తులుగా చెప్పబడుదురు. ఇరువది నాలుగు వర్ణముల వర్ణములిది-సంపంగి, అవిసె, పగడము, స్ఫటికమణి, పద్మపుష్పము, బాల సూర్యుడు, శంఖ కుందేందులు, పగడము, పద్మపత్రము, పద్మరాగము, ఇంద్ర నీలమణి, ముత్యము, కుంకుమము, కాటుక, రక్తము, వైడూర్యము, తేనె, పసుపు, కుందము, పాలమిశ్రవణము, సూర్యకాంతము, చిలుకతోక, శతపత్రము, కేతకి, మల్లిక, కరవీరము అను రంగులు వరుసగా ఇరువది నాల్గు వర్ణములకు చెప్పబడినవి. ఈవర్ణముల వర్ణములు మహాపాతకములను కడిగి వేయగలవు. నేల, నీరు, వెలుగు, గాలి, ఆకాశము, గంధము, రసము, రూపము, శబ్దము, స్పర్శ, ఉపస్థ, పాయువు, పాదపాణి వాక్కులు, ముక్కు, నాలుక, కన్ను, చర్మము, చెవి, ప్రాణము, అపానము. వ్యానము, ఉదానము సమానము అనునవి వరుసగా వర్ణముల ఇరువది నాల్గు తత్త్వములు. ఇపుడిక ముద్రలను చెప్పుచున్నాను. సుముఖము, సంపుటము, వితతము, విస్తృతము, ద్విముఖము, త్రిముఖము, చతుర్ముఖము, పంచముఖము, షణ్ముఖము, అధోముఖము, వ్యాపకాంజలికము, శకటము, యమపాశము, గ్రథితము, సమ్ముఖోన్ముఖము, ప్రలంబము, ముష్టికము, మత్స్యము, కూర్మము, వరాహకము, సింహాక్రాంతము, మహాక్రాంతము, ముద్గరము, పల్లము అనునవి ఇరువది నాలుగు ముద్రలు. ఇవి మహాపాతముల త్రుంచి వేయగలవు.

# గాయత్రీ కవచము

నారదుడు స్వామీ! మానవుడెట్లు బ్రహ్మత్వమొందును? దయతో తెలుపు మనగా నారాయణుడిట్లనెను. గాయత్రీ కవచమును చదివినను, వినినను సర్వ పాపముల నుండి విముక్తుడగును. కోరికలన్నియు ఫలించును. అతడు కేవలము దేవీ స్వరూపుడగును. ఈ గాయత్రీ కవచమునకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఋషులు ఋగ్యజుస్సామాథర్వణములు ఛందములు, బ్రహ్మరూపిణి దేవత గాయత్రి పరమకళ, తత్పదము, బీజము, భర్గః శక్తి, ధియః కీలకము ఈ అనుష్ఠాన వినియోగము మోక్షమందు మొదటి నాల్గక్షరములతో హృదయమున మూడు వర్ణములతో శిరమున ఐదు వర్ణములతో శిఖయందు మూడు వర్ణములతో కవచమున నాలుగు వర్ణములతో నేత్రములందు నాలుగక్షరములతో అస్త్రమున న్యాసము. తెలుపు కాంతులు గల ముఖముతో కూడినది. త్రినేత్ర చంద్రవంకతో కూడిన రత్నకిరీటము తాల్చినది.

ఇరువది నాల్గు వర్ణములు స్వరూపముగా గలది. వరదాభయాంకుశకశా శుభ్ర కపాల గదా శంఖచక్ర పద్మయుగళములను తన పదిచేతులతో ధరించినదగు దేవిని ధ్యానించుచున్నాను. నన్ను తూర్పు దిక్కున గాయత్రీదేవియు, దక్షిణమున

సావిత్రీదేవియు, పడమట బ్రహ్మ సంధ్యయును, ఉత్తరమున సరస్వతియు రక్షించుగాక! నన్నాగ్నేయమున పావకోజ్జ్వలశాలినియు నైరృతిదిశయందు యాతుధాన భయంకరియు కాపాడుగాక. నన్ను వాయువ్యదిశ యందు పవమానవిలాసినియు ఈశాన్యదిశ యందుఈ రుద్రాణియు, ఊర్ధ్వమున బ్రహ్మాణి, క్రింద వైష్ణవి రక్షింతురుగాక. ఇట్లు పదిదిశలయందు నాయంగము లన్నింటిని త్రిభువనేశ్వరీదేవి రక్షించుగాక "త" త్పదము నాచరణములను "సవితుః" పదము పిక్కలను "వరేణ్యం" కటి ప్రదేశమును "భర్గః" బొడ్డును, "దేవస్య" హృదయమును, "ధీమహి" చెక్కిళ్ళను "ధియః" నేత్రములను "యః" నాసలను "నః" శిరస్సును "ప్రచోదయాత్" శిఖను "తత్" శిరస్సును "స" నొసటిని "వి" కన్నులను, "తు" చెక్కిళ్ళను "వ" ముక్కును, "రే" ముఖమును "ణి"పై పెదవిని, "య"క్రింది పెదవిని "భ" ముఖమధ్యమును "గో" గడ్డమును "దే" కంఠమును, "వ" భుజములను, వ్యకుడి చేతిని "ధీ" ఎడమచేతిని "మ" హృదయమును "హి" పొట్టను "ధి" బొడ్డును "యో" నడుమును "యో" గుహ్యమును, "నః" తొడలను, "ప్ర" మోకాళ్ళను, "చో" పిక్కలను, "ద" మడమలను, "యా" పాదములను, "త" సమస్త శరీరమును, రక్షించుగాక. ఇది శ్రీ గాయత్రీ దివ్యకవచము. ఇది అన్ని బాధలను శాంతింప జేయును. అన్ని విద్యల నొసగును. మోక్షము నిచ్చునది. శ్రీ గాయత్రీ కవచమును మనస్సున ధరించినవాడు సకల పాపవిముక్తుడై బ్రహ్మ సాయుజ్యము నందగలడు. దీనిని విన్నను చదివినను వేయుగోవుల దానము చేసిన పుణ్యము కలుగును.

# గాయత్రీ హృదయము

నారదుడు గాయత్రీ హృదయమును వినిపింపు మనగా నారాయణుడిట్లనెను. గాయత్రీ హృదయము మిక్కిలి రహస్యమైనది యిది యథర్వవేదమున తెలుపబడినది. దానను చెప్పుచున్నాను. విరాడ్రూపిణి మహాదేవి వేదమాతయైన గాయత్రి నైక్యభావముతో ధ్యానించి తన యవయవముల యందు సాధకుడాయా దేవతలను న్యాసము చేసికొనవలయును. సాధకుడు తన శరీరమందు పిండాండ బ్రహ్మాండముల ఐక్యమును భావించవలయును. తనను గాయత్రీ స్వరూపునిగా తలచి తన్మయుడు కావలెను. ఏకాంతమున ఏకాగ్రతతో దేవిని ధ్యానింపవలెను. అర్థవ్యాసము చెప్పుచున్నాను. వినుము! తల యందు దివి, పలువరుసలందు అశ్వినులు పెదవులందు సంధ్యలను ముఖమునందగ్ని నాలుక యందు సరస్వతి మెదడు యందు బృహస్పతి స్తనము లందష్ట వసువులు భుజములందు మరుత్తులును హృదయమున పర్జన్యుడు పొట్ట యందాకాశము బొడ్డునందంత

రిక్షమును నడుమునందింద్రాగున్నలును పిక్కలందు ప్రజాపతి తొడలందు కైలాస మలయా పర్వత్పములు మోకాళ్ళయందు విశ్వేదేవతలను పిక్కలందు కౌశికుడు గుహ్య మందుత్తరాయణ దక్షిణాయనముల యధిష్ఠాన దేవతలు తొడలందు పితరుల పదములందు భూమిని, వ్రేళ్ళయందు వనస్పతిని, రోమములందు- ఋషులు గోళ్ళయందు ముహూర్తములు ఎముకలందు గ్రహములు, రక్తమాంస ములందు ఋతువులును రెప్పలందు సంవత్సరమును పగలు రేయియందు సూర్యచంద్రులను ప్రకాశింప వేయి కనుల తల్లియైన శ్రీ గాయత్రీ దేవిని నేను శరణు వేడుచున్నాను. శ్రేష్ఠుడైన సవితకు వందనములు. తూర్పున ఉదయించు దేవునకు నమస్కారములు. భాస్కరునకు నా ప్రణామములు. ప్రభాత భాస్కరునకు నిలయమైన దేవికి నమస్కారములు. ఈ గాయత్రీ హృదయము చదివినవాడు సర్వపాప విముక్తుడగును. పిమ్మట నారదుడు గాయత్రీ సహస్రనామము నడుగగా నారాయణాతని కిట్లు తెలియజేసెను.

## గాయత్రీ స్తోత్రము

**శ్రీనాయరాణ ఉవాచ:-**

ఆదిశక్తే జగన్మాతర్భక్తానుగ్రహకారిణి।
సర్వత్రవ్యాపికేనంతే శ్రీసంధ్యేతేనమోస్తుతే॥
త్వమేవసంధ్యా గాయత్రీ సావిత్రీ చ సరస్వతీ।
బ్రాహ్మీ చ వైష్ణవీరౌద్రీ రక్తాశ్వేతా సితేతరా ॥
ప్రాతర్బాలా చ మధ్యాహ్నే యౌవన స్థా భవేత్పునః ।
వృద్ధా సాయం భగవతీ చింత్యతే మునిభిస్సదా ॥
హంస స్థాగరుడారూఢా తథా వృషభవాహినీ ।
ఋగ్వేదాధ్యాయినీ భూమౌదృశ్యతే యాతపస్విభిః ॥
యజుర్వేదం పఠన్తీ చ అంతరిక్షే విరాజితే ।
సాసామగాపి సర్వేషు భ్రామ్యమాణా తథాభువి ॥
రుద్రలోకం గతాత్వంహి విష్ణులోకనివాసినీ ।
త్వమేవ బ్రహ్మణోలోకే ఽమర్త్యానుగ్రహకారిణీ॥
సప్తర్షి ప్రీతి జననీ మాయా బహువరప్రదా ।
శివయోః కరనేత్రోత్థా హ్యత్రు స్వేదసముద్భవా ॥
ఆనంద జననీ దుర్గా దశధా పరిపఠ్యతే ।
వరేణ్యావరదా చైవ వరిష్ఠా వరవర్ణినీ॥

గరిష్ఠా చ వరార్హా చ వరారోహా చ సప్తమీ ।
నీలగంగా తథా సంధ్యా సర్వదా భోగమోక్షదా ॥
భాగీరథీ మర్త్యలోకే పాతాళే భోగవత్యపి ।
త్రిలోకవాహినీ దేవీస్థాన త్రయనివాసినీ ॥
భూర్లోకస్థాత్వమేవాసి ధరిత్రీశోక ధారిణీ ।
భువోలోకే వాయుశక్తిః స్వర్లోకే తేజసాంనిధిః ॥
మహర్లోకే మహా సిద్ధిర్జనలోకే జనేత్యపి ।
తపస్వినీ తపోలోకే సత్యలోకేతు సత్యవాక్ ॥
కమలా విష్ణులోకే చ గాయత్రీ బ్రహ్మలోకదా।
రుద్రలోకే స్థితాగౌరీ హరార్ధాంగ నివాసినీ ॥
అహమోమహతశ్చైవ ప్రకృతి స్త్వంహిగీయసే ।
సామ్యావస్థాత్మికా త్వం హి శబలం బ్రహ్మరూపిణీ॥
తతః పరాపరాశక్తిః పరమాత్వహిగీయసే ।
ఇచ్ఛాశక్తిః క్రియాశక్తిః జ్ఞానశక్తి స్త్రిశక్తిదా ॥
గంగా చ యమునాచైవ విపాశా చ సరస్వతీ॥
సరయూర్దేవికా సింధుర్నర్మదేరావతీతథా ॥
గోదావరీ శతద్రూశ్చ కావేరీ దేవలోకగా ।
కౌశికీ చంద్ర భాగా చవితస్తా చ సరస్వతీ ॥
గండకీతాపనీ తోయాగోమతీ వేత్రవత్యపి ।
ఇడాచ పింగళాచైవ సుషుమ్నాచ తృతీయ కా॥
గాంధారీహస్తి జిహ్వా చ పూషాఽపూషా తథైవచ ।
అలంబుసాకుహూశ్చైవ శంఖినీ ప్రాణవాహినీ॥
నాడీ చత్వం శరీరస్థాగీయసే ప్రాక్తనైర్బుధైః ।
హృత్పద్మస్థా ప్రాణశక్తిః కంఠస్థా స్వప్ననాయికా ॥
తాలుస్థాత్వం సదాధారా బిందుస్థా బిందుమాలినీ ।
మూలేతుకుండలీ శక్తిః వ్యాపినీ కేశమూలగా॥
శిఖామధ్యాసనాత్వంహి శిఖాగ్రేతుమనోన్మనీ।
కిమన్యద్బహునోక్తేన యత్కించిజ్జగతీత్రయే॥
తత్సర్వంత్వం మహాదేవీ శ్రియే సంధ్యే నమోఽస్తుతే ।
ఇతీదం కీర్తితం స్తోత్రం సంధ్యా యాంబహు పుణ్యదమ్ ॥

మహాపాప ప్రశమనం మహాసిద్ధి విధాయకమ్ ।
ఇదంచ కీర్తయేత్ స్తోత్రం సంధ్యాకాలేసమాహిత:
అపుత్ర: ప్రాప్నుయాత్పుత్రం ధనార్థీ ధనమాప్నుయాత్ ।
సర్వతీర్థ తపోదాన యజ్ఞయోగ ఫలం లభేత్॥
భోగాన్భుక్త్వా చిరంకాలమంతే మోక్షమవాప్నుయాత్ ।
తపస్విభి:కృతం స్తోత్రం స్నానకాలేతు య: పఠేత్ ॥
యత్రకుత్ర జలేమగ్న: సంధ్యామజ్జనజం ఫలమ్ ।
లభతే నాత్రసందేహ: సత్యం సత్యం చ నారద॥
శృణు యాద్యోపి తద్భక్త్యా సతుపాపాత్ప్రముచ్యతే ।
పీయూష సదృశం వాక్యం సంధ్యోక్తం నారదేరితమ్ ॥

**స్తోత్ర భావము:-** ఆదిశక్తీ! జగజ్జననీ! భక్తానుగ్రహకారిణీ! విశ్వవ్యాపినీ! అనంతశ్రీ! సంధ్యాదేవీ! నీకివే నాహృదయ పూర్వక నమస్కారములు తల్లీ! నీవు సంధ్యవు గాయత్రివి, సావిత్రివి, సరస్వతివి, బ్రాహ్మివి, వైష్ణవివి, రౌద్రివి, రక్తవు. ఉదయమున బాలవు మధ్యాహ్నమున యువతివి. సాయంకాలమున వృద్ధవునైన భగవతివి. నీవేయని మునులు నిత్యము నిన్నే స్మరింతురు. హంసారూఢవు గరుడారూఢవు వృషభవాహనవు నీవే. ఋగ్వేదము చదువుచు పరమతాపసులకు నీవే భూమి పై దర్శనమిచ్చెదవు. యజుర్వేద మధ్యయనము చేయుచు నంతరిక్షమున విరాజిల్లు చుందువు. సామగానము చేయుచు భూమిపై నంతటను సంచరింతువు. నీవు బ్రహ్మ విష్ణు రుద్రలోకములందు నివసించుచు మనుజులపై నీయనుగ్రహమును ప్రసరింపచేయుదువు. సప్తర్షులను ప్రసన్నుల జేయు తల్లీ మాయావతీ శక్తీ! బహు వరప్రదాయినీ! శివభక్తుల చేతులను నుండి కనులనుండి యుద్భవించిన తల్లీ! వారికన్నీటి నుండి యుద్భవించిన దేవీ! ఆనందజననీ! దుర్గా! వరేణ్యా! వరదా! వరిష్ఠా! వరవర్ణినీ! పది విధములుగ కీర్తింపబడు తల్లీ! గరిష్ఠా! వరార్హా! వరారోహా! నీలగంగా! సంధ్యా! సర్వదా! భోగమోక్షదా! నరలోకమున భాగీరథిగ పాతాళమందు భోగవతిగ స్వర్గమునందు సీతగ త్రిలోకవాహినివైయె దేవివైయె ముల్లోకములందు నివసించుదానవునీవే. ఈ భూలోకమున లోకధరిత్రివి. భూమాతవునీవే. భువర్లోకమున వాయుశక్తివి నీవే. స్వర్గమునందు తేజస్వివి నీవే. మహర్లోకమున మహాసిద్ధివి జనలోక మున జననివి తపోలోకమున తపస్వినివి సత్యలోకమున సత్యవాదినివి నీవే. శ్రీవిష్ణులోకమందు కమలవు బ్రహ్మలోకమున గాయత్రివి రుద్ర లోకమున శివుని యర్ధాంగియగు గౌరివి నీవేయమ్మా!

"అహంస్ఫురణ మహత్తత్త్వము ప్రకృతి సామ్యావస్థాత్మిక శబల బ్రహ్మ రూపిణి నీవే"యని గానము చేయబడుచున్నావు. సకల పరాపరశక్తివి పరమవు ఇచ్ఛాశక్తివి, క్రియాశక్తివి జ్ఞానశక్తివి, త్రిశక్తిదాయినివి నీవే. శ్రీ గంగ యమున సరస్వతి సరయు దేవిక సింధు నర్మద ఐరావతి గోదావరి శతద్రు కావేరి దేవలోక గామిని కౌశికి చంద్రభాగ వితస్త సరస్వతి గండకి తాపివి తోయ గోమతివేత్రవతి నీవే. పింగళ సుషుమ్నగాంధారి హస్తిజిహ్వా పూష అపూష అలంబుస కుహు శంఖిని ప్రాణవాహిని ఈ శరీరమందలి నాడులన్నియు నీవేయని సనాతనులైన బుధులచేత నీవు కొనియాడబడుచున్నావు. హృదయకమలమందలి ప్రాణశక్తి కంఠమందలి స్వప్న నాయిక తాలువులందరి సదాధార భ్రూమధ్యమందలి బిందుమాలిని మూలాధార మందలి కుండలినీశక్తి కేశమూలమందలి వ్యాపిని శిఖామధ్యవాసిని శిఖాగ్రమున మనోన్మనియను రూపములన్నియు నీవే వేయేల!

ఈ ముజ్జగములందు ఏయే వస్తువులు కలవో అవన్నియునీవే మహాదేవీ! శ్రీదేవీ! సంధ్యాదేవీ! నీకు మాహృదయపూర్వక నమస్కారములు. ఈ గాయత్రీ స్తోత్ర మును విశేషించి సంధ్యలయందు చదివిన విశేషపుణ్యము కలుగును. ఈ స్తోత్రము మహాపాతకరాసుల నశింపజేయును. దీనిని సంధ్యలందు సమ చిత్తముతో కీర్తించవలయును. దీని మహిమవలన పుత్రహీనుడు పుత్రవంతు డగును. ధనార్థి ధనికుడగును. సకలతీర్థతపోదానములు యోగ యజ్ఞములు చేసిన ఫలము లభించును. దీనివలన చిరకాలము భోగముల ననుభవించి తుదకు మోక్షభాగ్యము నొందగలడు. పుణ్య తాపసులొనర్చిన యీస్తోత్రము స్నానకాలమున చదివినవాడు ఎచటనైన ఎప్పుడైన స్నానము చేసినవాడును సంధ్యాకాలమున స్నానము చేసిన ఫలితము లభించును. ఇందు సందేహమే మాత్రమును లేదు. దీనిని శుద్ధమనస్సుతో విన్నవాడును పాపవిముక్తుడగును. సంధ్యాకాలమందమృత రసాయనముతో సమానమైన ఈ గాయత్రీ సోత్రము నీకు వినిపించితిని.

## గాయత్రీ సహస్ర నామ స్తోత్రము

శ్లో॥ స్పష్ట్వాదౌయద్భగవతా పూర్వం ప్రోక్తం బ్రవీమితే
అష్టోతర సహస్రస్యఋషిర్బ్రహ్మ ప్రకీర్తితః ॥
ఛందోఽనుష్టుప్తథా దేవీ గాయత్రీ దేవతాస్మృతా
హలోబీజాని తస్యైవస్వరాశ్శక్తయ ఈరితాః ॥
అంగన్యాస కరన్యాసావుచ్యేతే మాతృకాక్షరైః
అథధ్యానం ప్రవక్ష్యామిసాధకానాంహితాయవై ॥

రక్తశ్వేత హిరణ్యనీలధవలైర్యుక్తాం త్రిణేత్రోజ్వలామ్
రక్తాంరక్తనవస్రజం మణిగణైర్యుక్తాంకుమారీ మిమాం
గాయత్రీం కమలాసనాంకరతలవ్యానద్ధ కుండాంబుజామ్
పద్మాక్షీంచవరస్రజంచదధతీంహంసాధిరూ ఢాంభజే ॥
అచింత్యలక్షణావ్యక్తా ప్యర్థమాతృ మహేశ్వరీ
అమృతార్ణవ మధ్యస్థాప్యజితా చాపరాజితా ॥
అణిమాదిగుణాధారా ప్యర్కమండల సంస్థితా
అజరాజా పరాధర్మా అక్ష సూత్రధరాధరా ॥
అకారాదిక్షకారాంతాప్యరిషడ్వర్గభేదినీ
అంజనాద్రి ప్రతీకాశాప్యంజనాద్రి నివాసినీ॥
అదితిశ్చాఽజపా విద్యాప్యరవింద విభేక్షణా
అంతర్బహి స్థితావద్యాధ్వం సినీచాంతరాత్మికే
అజాచజము కావాసాప్యరవింద నిభానిన్యా
అర్ధమాత్రర్ధ దానజ్ఞా ప్యరి మండలమర్దినీ
అసురఘ్నీహ్యమావాస్యాప్య లక్ష్మీఘ్నుంత్యజార్చితా
ఆదిలక్ష్మీ శ్చాదిశక్తి రాకృతిశ్చాయ తాననా ॥
ఆదిత్య పదవీచారాప్యాదిత్య పరిసేవితా
ఆచార్యా వర్తనాచారాప్యాది మూర్తి నివాసినీ ॥
ఆగ్నేయీచామరీచాద్యాచారాధ్యా చాసనస్థితా
ఆధారనిలయాధారాచాకా..తత నివాసినీ ॥
ఆద్యాక్షర సమాయుక్తా చాంతరాకాశరూపిణీ
ఆదిత్య మండలగతాచాంతర ధ్వాంతనాశినీ ॥
ఇందిరా చేష్టదాచేష్టా చెందీవరని భేక్షణా
ఇరావతీ చేంద్రపదా చేంద్రాణీ చేందురూపిణీ ॥
ఇక్షు కోదండ సంయుక్తా చేషు సంధాన కారిణీ
ఇంద్రనీల సమాకారా చేడా పింగళరూపిణీ ॥
ఇంద్రాణీచేశ్వరీ దేవీచేహాత్రయ వివర్జితా
ఉమాచోషాహ్యుడు నిభాఉర్వారుకఫలాననా ॥
ఉడుప్రభాచోడుమతీహ్యుడు పాహ్యుడు మధ్యగా
ఊర్ధ్వాచాప్యూర్ధ్వకేశీచాప్యూర్ధ్వాధోగతి భేదినీ ॥

ఊర్ధ్వబాహు ప్రియా చోర్మిమాలా వాగ్గంథదాయినీ
ఋతంచర్షిర్పతుడుమతీ ఋషిదేవనమస్కృతా ॥
ఋగ్వేదా ఋణహర్త్రీచ ఋషిమండలచారిణీ
ఋద్ధిదా ఋజుమార్గస్థా ఋజుధర్మా ఋతుప్రదా ॥
ఋగ్వేదనిలయా ఋజ్వీలుప్త ధర్మప్రవర్తినీ
లూతారి వరసంభూతాలూతాది విషహారిణీ ॥
ఏకాక్షరాచైకమాత్రాచైకా చైకైక నిష్ఠితా
ఐంద్రీహ్యైరావతారూఢాచైహికాముష్మిక ప్రదా ॥
ఓంకారాహ్యోషధీచోతాచో తప్రోతనివాసినీ
ఔర్వాహ్యౌషధి సంపన్నా ఔపాసన ఫలప్రదా ॥
అండ మధ్యస్థితా దేవీ చాఃకారమనురూపిణీ
కాత్యాయనీకాలరాత్రిః కామాక్షీ కామసుందరీ ॥
కమలాకామి నీకాంతా కామదాకాలకంఠినీ
కరికుంభస్తనభరాకరవీర సువాసినీ ॥
కల్యాణీ కుండలవతీ కురుక్షేత్ర నివాసినీ
కురువిందదళాకారా కుండలీకుముదాలయా ॥
కాలజిహ్వాకరాలాస్యా కాలికాకాలరూపిణీ
కమనీయ గుణాకాంతిః కలాధారా కుముద్వతీ ॥
కౌశికీకమలాకారాకామచార ప్రభంజనీ
కౌమారీ కరుణాపాంగీకకుబంతా కరిప్రియా ॥
కేసరీకేశవనుతాకదంబకు సుమప్రియా
కాళిందీ కాళికా కాంచీకల శోద్భవ సంస్తుతా ॥
కామమాతాక్రతుమతీ కామరూపా కృపావతీ
కుమారీకుండనిలయాకిరాతీకీరవాహనా ॥
కైకేశీ కోకిలాలాపాకేతకీకు సుమప్రియా
కమండలుధరా కాళీకర్మ నిర్మూలకారిణీ ॥
కలహంసగతిః కక్షాకృతకౌతుక మంగళా
కస్తూరీ తిలకాకమ్రా కరీంద్రగమనాకుహూః ॥
కర్పూరలేపనా కృష్ణా కపిలాకుహరాశ్రయా
కూటస్థాకుధరాకమ్రా కుక్షిస్థాఖిల విష్టపా ॥

ఖడ్గఖేటక రాఖర్వాఖేచరీఖగవాహనా
ఖట్వాంగ ధారిణీ ఖ్యాతాఖగరాజోపరిస్థితా ॥
ఖలఘ్నీ ఖండిత జరాఖండాఖ్యాన ప్రదాయినీ
ఖండేందు తిలకగంగా గణేశగుహ పూజితా ॥
గాయత్రీ గోమతీ గీతాగాంధారీ గానలోలుపా
గౌతమీ గామినీ గాథాగంధర్వాప్సరసేవితా ॥
గోవింద చరణాక్రాంతాగుణ త్రయవిభావితే
గంధర్వీ గహ్వరీ గోత్రాగిరీశా గహనాగమీ ॥
గుహావాసాగుణవతీ గురుపాప ప్రణాశినీ
గుర్వీగుణవతీ గుహ్యా గోప్తవ్యాగుణదాయినీ ॥
గిరిజా గుహ్యామాతంగీ గరుడధ్వజ వల్లభా ॥
గర్వాపహారిణీ గోదాగోకులస్థా గదాధరా
గోకర్ణనిలయాసక్తా గుహ్యామండల వర్తినీ
ఘర్మదా ఘనదాఘంటా ఘోరదానవమర్దినీ ॥
ఘృణి మంత్రమయీఘోషా ఘనసంపాతదాయినీ
ఘంటారవప్రియా ఘ్రాణాఘృణి సంతుష్టికారిణీ ॥
ఘనారి మండలా ఘూర్ణాఘృతాచీ ఘనవేగినీ
జ్ఞానధాతుమయీచర్చాచర్చితా చారుహాసినీ ॥
చటులాచండికా చిత్రా చిత్రమాల్యవిభూషితా
చతుర్భుజా చారుదంతా చాతురీచరితప్రదా ॥
చూలికా చిత్ర వస్త్రాంతా చంద్రమఃకర్ణకుండలా
చంద్రహాసాచారుదతీచ కోరీచంద్రహాసినీ ॥
చంద్రికా చంద్ర ధాత్రీచ చౌరీ చోరాచచండికా
చంచద్వాగ్వాది నీ చంద్రచూడాచోర వినాశినీ ॥
చారు చందనలిప్తాంగీ చంచచ్చామరవీజితా
చారు మధ్యాచారుగతిశ్చందిలా చంద్ర రూపిణీ ॥
చారుహెూమ ప్రియాచార్వా చరితా చక్రబాహుకా
చంద్ర మండల మధ్యస్థా చంద్రమండల దర్పణా ॥
చక్ర వాకస్తనీ చేష్టా చిత్రాచారు విలాసినీ
చిత్స్వరూపా చంద్రవతీ చంద్రమాశ్చందన ప్రియా ॥

చోదయిత్రీచిర ప్రజ్ఞాచాతకా చారుహేతుకీ
ఛత్రయాతాఛత్రధరా ఛాయాఛందః పరిచ్ఛదా ॥
ఛాయాదేవీ ఛిద్రనఖా ఛన్నేంద్రియ విసర్పిణీ
ఛందోనుష్టు ప్ప్రతిష్ఠాంతా ఛిద్రోపద్రవ భేదినీ ॥
ఛేదా ఛత్రేశ్వరీ ఛిన్నాఛురిక ఛేదన ప్రియా
జననీ జన్మరహితా జాతవేదా జగన్మయీ ॥
జాహ్నవీజటిలా జేత్రీ జరామరణ వర్జితా
జంబూద్వీపవతీ జ్వాలా జయంతీజలశాలినీ ॥
జితేంద్రియా జితక్రోధా జితామిత్రా జగత్ప్రియా
జాతరూపమయీ జిహ్వాజానకీ జగతీ జరా ॥
జనిత్రీజహ్ను తనయా జగత్త్రయహితైషిణీ
జ్వాలాముఖీ జపవతీ జ్వరఘ్నీజితవిష్టపా ॥
జితాక్రాంతమయీ జ్వాలా జాగ్రతీ జ్వరదేవతా
జ్వలం తీజలదాజ్యేష్ఠా జ్యాఘోషాస్ఫోటదిజ్ముఖీ ॥
జంభి నీజ్రుంభణా జృంభా జ్వలన్మాణిక్యకుండలా
ఝూఝికారుణనిర్ఘోషా ఝుంఝూమారుతవేగినీ ॥
ఝల్లరీ వాద్యకుశలా ఞభూజాసమ్బలా
టంక బాణసమాయుక్తా టాంకి నీటంక భేదినీ
టంకీ కృతగణాఘోషా టంకనీయ మహోరసా
టంకార కారిణీ దేవీ ఠఠశబ్దని నాదినీ ॥
డామరీడాకినీడింభాడుండు మారైక నిర్జితా
డామరీతంత్ర మార్గస్థాడమడ్డమరు నాదినీ ॥
డిండీరవసహా డింభలసత్క్రీడా పరాయణా
ఢుంఢి విఘ్నేశ జననీఢక్కా హస్తా ఢిలిప్రజా ॥
నిత్యజ్ఞానా నిరుపమా నిర్గుణానర్మదా నదీ
త్రిగుణా త్రిపదా తంత్రీతులసీ తరుణాతరుః ॥
త్రివిక్రమ పదాక్రాంతా తురీయ పదగామినీ
తరుణాదిత్య సంకాశా తాను సీతుహినాతురా ॥
త్రికాలజ్ఞాన సంపన్నా త్రిగుణాచ త్రిలోచనా
త్రిశక్తి స్త్రి పురాతుంగా తురంగవదనా తథా ॥

తిమింగిలగిలా తీవ్రాత్రిస్రోతా తామసాదనీ
తంత్ర మంత్ర విశేషజ్ఞాతను మధ్యాత్రివిష్టపా ॥
త్రిసంధ్యా త్రిస్తనీతోషా సంస్థాతాల ప్రతాపనీ
తాటంకి నీతుషారాభా తుహినా చలవాసినీ ॥
తంతు జాలసమాయుక్తా తారహారావలి ప్రియా
తిలహోమ ప్రియా తీర్థాతమాలకు సుమాకృతి: ॥
తారకా త్రియుతాతన్వీ త్రిశంకు పరివారితా
తలోదరీ తిలాభూషాతాటంక ప్రియవాదినీ ॥
త్రిజటా తిత్తిరీ తృష్ణా త్రివిధా తరుణాకృతి:
తప్తకాంచనం సంకాశా తప్తకాంచన భూషణా ॥
త్రైయంబకా త్రివర్గాచ త్రికాలజ్ఞాన దాయినీ
తర్పణా తృప్తిదా తృప్తా తామసీ తుంబురుస్తుతా ॥
తార్క్ష్యస్థా త్రిగుణాకారా త్రిభంగీతను వల్లరి:
ధాత్కారీధారపథంతా దోహినీ దీనవత్సలా ॥
దానవాంత కరీదుర్గా దుర్గా సురనిబర్హిణీ
దేవరీతిర్ది వారా త్రిర్ద్రౌపదీ దుందు భిస్వనా ॥
దేవయానీ దురావాసా దారిద్ర్యోద్భేదినీదివా
దామోదర ప్రియా దీప్తాదిగ్వాసా దిగ్విమోహినీ ॥
దండకారణ్య నిలయాదండినీ దేవ పూజితా
దేవ వంద్యాది విషదాద్వేషిణీ దానవాకృతి: ॥
దీనానాథస్తుతా దీక్షా దైవతాది స్వరూపిణీ
ధాత్రీధనుర్ధరా దేనధారిణీ ధర్మచారిణీ ॥
ధురంధరధరాధారాధనదా ధాన్యదోహినీ
ధర్మశీలాధనాధ్యక్షా ధర్మవేద విశారదా ॥
ధృతిర్ధన్యా ధృతపదా ధర్మరాజ ప్రియాధ్రువా
ధూమావతీ ధూమకేశీ ధర్మశాస్త్ర ప్రకాశినీ ॥
నందానంద ప్రియా నిద్రానృనుతానంద నాత్మికా
నర్మదా నలినీ నీలా నీలకంఠ సమాశ్రయా ॥
నారాయణ ప్రియా నిత్యానిర్మలా నిర్గుణా నిధి:
నిరాధారా నిరూపమా నిత్య శుద్ధా నిరంజనా ॥

నాద బిందు కళాతీతా నాదబిందు కళాత్మికా
నృసింహినీ నగధరా నృపనాగ విభూషితా ॥
నరక క్లేశదమనీ నారాయణ పదోద్భవా
నిరవద్యాని రాకారానారద ప్రియకారిణీ ॥
నానా జ్యోతిస్సమాఖ్యాతానిధిదా నిర్మలాత్మికా
నవనక్షత్ర ధరానీతిర్నిరుపద్రవ కారిణీ ॥
నందజా నవరత్నాఢ్యా నైమిషారణ్యవాసినీ
నవనీత ప్రియానారీ నీలజీమూతనిస్స్వనా ॥
నిమేషిణీ నదీరూపా నీలగ్రీవానిరీశ్వరీ
నా మావలిర్ని శుంభఘ్నీ నాగలోక నివాసినీ ॥
తప్తజాంబూ నదప్రఖ్యా నాగలోకాధి దేవతా
నూపురాక్రాంత చరణా నరచిత్త ప్రమోదినీ ॥
నిమగ్నారక్తనయనా నిర్ఘాత సమనిస్వనా
నందనోద్యాన నిలయా నిర్వ్యూహో పరిచారణీ ॥
పార్వతీ పరమోదారా పరబ్రహ్మాత్మికాపరా
పంచకోశవి నిర్ముక్తా పంచపాతక నాశినీ ॥
పరచిత్త విధానజ్ఞా పంచికా పంచరూపిణీ
పూర్ణిమా పరమా ప్రీతిః పరతేజః ప్రకాశినీ ॥
పురాణీ పౌరుషీ పుణ్యాపుండరీకని భేక్షణా
పాతాల తలనిర్మగ్నా ప్రీతాప్రతివివర్ధినీ ॥
పావనీ పాద సహితా పేశలాప వనాశినీ
ప్రజాపతిః పరిశ్రాంతా పర్వతస్తనమండలా ॥
పద్మప్రియా పద్మ సంస్థా పద్మాక్షీ పద్మసంభవా
పద్మపత్రా పద్మపదా పద్మినీ ప్రియభాషిణీ ॥
పశుపాశ వినిర్ముక్తా పురంధ్రీ పురవాసినీ
పుష్కలా పురుషావర్హా పారిజాత సుమప్రియా ॥
పతివ్రతా పవిత్రాంగీ పుష్పహాస పరాయణా
ప్రజ్ఞావతీ సుతాపౌత్రీ పుత్ర పూజ్యాపయస్వినీ ॥
పట్టి పాశధరాపంక్తిః పితృలోక ప్రదాయినీ
పురాణీ పుణ్యశీలాచ ప్రణతార్తి వినాశినీ॥

ప్రద్యుమ్న జననీ పుష్టా పితామహ పరిగ్రహా
పుండరీక పురావాసా పుండరీక సమాననా ॥
పృథు జంఘా పృథు భుజా పృథుపాదా పృథూదరీ
ప్రవాల శోభాపింగాక్షీ పీతవాసాః ప్రచాపలా ॥
ప్రసవాపుష్టిదా పుణ్యా ప్రతిష్ఠా ప్రణవాగతిః
పంచవర్ణా పంచవాణీ పంచికా పంజర స్థితా ॥
పరమాచ పరంజ్యోతిః పరప్రీతిః పరాగతిః
పరాకాష్ఠా పరేశానీ పావినీ పావకద్యుతిః ॥
పుణ్యభద్రా పరిచ్ఛేదా పుష్పహాసా పృథూదరీ
పీతాంగీ పీతవసనా పీతశయ్యా పిశాచినీ ॥
పీతక్రియా పిశాచ ఘ్నీపాటలాక్షీ పటుక్రియా
పంచ భక్ష ప్రియాచారా పూతనా ప్రాణఘాతినీ ॥
పున్నాగవన మధ్యస్థా పుణ్యతీర్థ నిషేవితా
పంచాంగీచ పరాశక్తిః పరమాహ్లాదకారిణీ ॥
పుష్పకాండస్థితా పూషాపోషితాఖిల విష్టపా
పానప్రియా పంచశిఖా పన్నగో పరిశాయినీ ॥
పంచ మాత్రాత్మికా పృథ్వీ పథికా పృథుదోహినీ
పురాణన్యాయమీ మాంసా పాటలీ పుష్పగంధినీ ॥
పుణ్య ప్రజాపారదాత్రీ పరమార్థైక గోచరా
ప్రవాల శోభా పూర్ణాశాప్రణవా పల్లవోదరీ ॥
ఫలినీఫలదా ఫల్గుః ఫూత్కారీ ఫలకాకృతిః
ఫణీంద్ర భోగశయనా ఫణమండల మండితా ॥
బాల బాలా బహు మతా బాలా తపనిభాంశుకా
బలభద్ర ప్రియాబంద్యాబడ బాబుద్ధి సంస్తుతా ॥
బందీదేవీ బలవతీ బడిశ ఘ్నీబలిప్రియా
బాంధవీ బోధితా బుద్ధిర్బంధూకకు సుమప్రియా ॥
బాల భాను ప్రభాకారా బ్రాహ్మీ బ్రాహ్మణ దేవతా
బృహస్పతి స్తుతా బృందాబృందావన విహారిణీ ॥
బలాకినీ బలాహారా బిలావాసా బహూదకా
బహునేత్రా బహుపదా బహు కర్ణావతంసికా ॥

బహు బాహుయుతా బీజరూపిణీ బహురూపిణీ
బిందునాదకళ తీతాబిందు నాదస్వరూపిణీ ॥
బద్ధగోధాంగులి త్రాణాబదర్యాశ్రమవాసినీ
బృందారకా బృహత్ స్కంధా బృహతీ బాణపాతినీ ॥
బృందాధ్యక్షా బహునుతావనితా బహువిక్రమా
బద్ధ పద్మాసనాసీనా బిల్వపత్రతల స్థితా ॥
బోధిద్రుమ నిజావాసా బడిస్థా బిందు దర్పణా
బాలా బాణా సనవతీ బడబానలవేగినీ ॥
బ్రహ్మాండ బహిరంతస్థా బ్రహ్మ కంకణ సూత్రిణీ
భవానీ భీషణవతీ భావినీ భయహారిణీ ॥
భద్రకాళీ భుజంగాక్షీ భారతీ భారతాశయా
భైరవీ భీషణాకారభూతిదా భూతిమాలినీ ॥
భామి నీ భోగనిరతా భద్రదా భూరివిక్రమా
భూతావాసా భృగులతా భార్గవీ భూసురార్చితా ॥
భాగీరథీ భోగవతీ భువనస్థా భిషగ్వరా
భామినీ భోగినీ భాషా భవానీ భూరిదక్షిణా ॥
భర్గాత్మికా భీమవతీ భవబంధ విమోచనీ
భజనీయా భూతధాత్రీ రంజితా భువనేశ్వరీ ॥
భుజంగ వలయాభీమా భేరుండా భాగధేయినీ
మాతా మాయా మధుమతీ మధుజిహ్వా మధుప్రియా ॥
మహాదేవీ మహాభాగా మాలినీ మీనలోచనా
మాయా తీతా మధుమతీ మధు మాంసా మధుద్రువా ॥
మానవీ మధు సంభూతా మిథిలాపురవాసినీ
మధుకైటభ సంహర్త్రీమేది నీ మేఘమాలినీ ॥
మందోదరీ మహామాయా మైథిలీ మసృణప్రియా
మహాలక్ష్మీర్మహాకాళీ మహాకన్యా మహేశ్వరీ ॥
మా హేంద్రీ మేరుతనయా మందారకు సుమార్చితా
మంజు మంజీరచరణా మోక్షదా మంజుభాషిణీ ॥
మధుర ద్రావిణీ ముద్రామలయామలయాన్వితా
మేధా మరకత శ్యామామాగధీమేనకాత్మజా ॥

మహా మారీమహావీరా మహా శ్యామా మనుస్తుతా
మాతృకామిహిరా భాసామకుంద పదవిక్రమా ॥
మూలాధార స్థితాముగ్ధా మణి పూరకవాసినీ
మృగాక్షీ మహిషా రూఢామహిషాసుర మర్దినీ ॥
యోగాసనా యోగగమ్యా యోగాయౌవన కాశ్రయా
యౌవనీ యుద్ధమధ్యస్థా యమునా యుగధారిణీ ॥
యక్షిణీ యోగయుక్తాచ యక్షరాజ ప్రసూతినీ
యాత్రాయాన విధానజ్ఞా యదువంశ సముద్భవా ॥
యకారాది హకారాంతా యాజుషీ యజ్ఞరూపిణీ
యామినీ యోగనిరతా యాతుధాన భయంకరీ ॥
రుక్మిణీ రమణీ రామా రేవతీ రేణుకా రతిః
రౌద్రీ రౌద్ర ప్రియాకారా రామమాతా రతిప్రియా ॥
రోహిణీ రాజ్యదా దేవీ రేవా రాజీవలోచనా
రా కేశీరూప సంపన్నా రత్న సింహాసన స్థితా ॥
రక్త మాల్యాంబరధరా రక్తగంధాను లేపనా
రాజ హంస సమారూఢా రంభా రక్త బలిప్రియా ॥
రమణీయ యుగాధారా రాజితాఖిల భూతలా
రురు చర్మపరీధానారథినీ రత్నమాలికా ॥
రోగేశీ రోగశమనీ రావిణీరో మహర్షిణీ
రామచంద్ర పదాక్రాంతా రావణ చ్ఛేదకారిణీ ॥
రత్న వస్త్ర పరిచ్ఛన్నా రథస్థా రుక్మభూషణా
లజ్జాధిదేవతలోలా లాలితా లింగధారిణీ ॥
లక్ష్మీర్గోలాలుప్త విషాలోకినీ లోక విశ్రుతా
లజ్జాలంబోదరీ దేవీలల నాలోక ధారిణీ ॥
వరదా వందితా విద్యావైష్ణవీవి మలకృతిః
వారాహీ విరజా వర్షా వరలక్ష్మీర్విలాసినీ ॥
వినతావ్యోమ మధ్యస్థా వారి జాసన సంస్థితా
వారుణీ వేణు సంభూతా వీతిహోత్రా విరూపిణీ ॥
వాయు మండల మధ్యస్థా విష్ణురూపా విధి ప్రియా
విష్ణుపత్నీ విష్ణుమతీ విశాలాక్షీ వసుంధరా ॥

వామదేవ ప్రియా వేలా వజ్రిణీ వసుదోహినీ
వేదాక్షర పరీతాంగీ వాజపేయ ఫలప్రదా ॥
వాసవీ వామజననీ వైకుంఠ నిలయావరా
వ్యాసప్రియా వర్మధరా వాల్మీకి పరిసేవితా ॥
శాకంభరీ శివాశాంతా శారదా శరణాగతిః
శాతోదరీ శుభాచారా శుంభాసుర విమర్దినీ ॥
శోభావతీ శివాకారా శంకరార్ధ శరీరిణీ
శోణా శుభాశయా శుభ్రా శిరస్సంధాన కారిణీ ॥
శరావతీ శరానందా శరజ్జ్యోత్స్నా శుభాననా
శరభా శూలినీ శుద్ధ శబరీ శుకవాహనా ॥
శ్రీమతీ శ్రీధరానందా శ్రవణానందదాయినీ
శర్వాణీ శర్వరీ వంద్యాషడ్భాషాషడృతు ప్రియా॥
షడాధార స్థితా దేవీ షణ్ముఖ ప్రియకారిణీ
షడంగరూపాసుమతిః సురాసుర నమస్కృతా
సరస్వతీ సదాధారా సర్వమంగళకారిణీ ॥
సామగాన ప్రియా సూక్ష్మా సావిత్రీ సామసంభవా ॥
సర్వావాసా సదానందా సుస్తనీ సాగరాంబరా
సర్వైశ్వర్య ప్రియా సిద్ధిః సాధు బంధుపరాక్రమా ॥
సప్తర్షి మండల గతా సోమమండలవాసినీ
సర్వజ్ఞా సాంద్ర కరుణా సమానాధికవర్జితా ॥
సర్వోత్తుంగా సంగహీనా సద్గుణా సకలేష్టదా
సరఘా సూర్య తనయా సుకేశీ సోమసంహతిః ॥
హిరణ్య వర్ణాహరిణీ హ్రీంకారీ హంసవాహనా
క్షౌమ వస్త్రపరీతాంగీ క్షీరాబ్ధి తనయాక్షమా ॥
గాయత్రీ చైవ సావిత్రీ పార్వతీచ సరస్వతీ
వేదగర్భావరారోహా శ్రీగాయత్రీ పరాంబికా ॥
ఇతి సాహస్ర కంనామ్నాం గాయత్ర్యాశ్చైవ నారద
పుణ్యదం సర్వపాపఘ్నం మహాసంపత్తిదాయకమ్ ॥
ఏవం నామాని గాయత్ర్యాస్తోషోత్పత్తి కరాణి హి
అష్టమ్యాంచ విశేషేణ పఠితవ్యం ద్విజైస్సహ ॥

ఇదంరహస్యం పరమంగు హ్యోద్గుహ్యాతరం మహత్
పుణ్యప్రదం మనుష్యాణాం దరిద్రాణాం నిధి ప్రదమ్॥
మోక్షప్రదం ముముక్షుణాం కామినాం సర్వకామదమ్
రోగాద్వైముచ్యతేరోగీ బద్ధోముచ్యేత బంధనాత్ ॥
బ్రహ్మహత్యా సురాపానం సువర్ణస్తేయినోనరాః
గురుతల్పగతో వాపి పాతకాన్ముచ్యతే సకృత్ ॥
అ సత్ప్రతి గ్రహాచ్చైవా భక్ష్య భక్షాద్విశేషతః
పాఖండానృతముఖ్యేభ్యః పఠనాదేవముచ్యతే॥
ఇదం రహస్యమమలంమయోక్తం పద్మజోద్భవ
బ్రహ్మసాయుజ్య దంన్నృణాం సత్యంసత్యంనసంశయః ॥

# గాయత్రీ జపము మోక్షప్రదమనుట

జనమేజయుడు వ్యాసునితో నిట్లనెను. మహాత్మా! ద్విజులకు శక్త్యుపాసనము ముఖ్యమని వేదములు చెప్పినవి. త్రికాలములందును గాయత్రీ మాత పరమ యని ద్విజులు పాసింపవలయును గదా! అట్లైన ఇతరదేవతలను పాసించుటేల? వైష్ణవులు గాణాపత్యులు కాపాలికులు చీనమార్గరతులు పల్కలధారులు దిగంబరులు బౌద్ధులు చార్యాకులు ఇట్లెందరో పెక్కు తెగలవారు వేదములందు శ్రద్ధ లేనివారై వర్తింతురు గదా! ఇందరిన్ని దేవతలను కొలుచుటకు కారణమేమి? దీనికి నీవే సమాధానము చెప్పజాలుదువు. మతిమంతులు పండితులు నానాతర్కములందు నేర్పరులును వేదములందు శ్రద్ధ మానివర్తింతురు. ఎవడైన తన బుద్ధితో తన మేలు చెడగొట్టుకొనడు గదా! ఈ భిన్నత్వమునకు కారణమేమో తెలుపుము. అని జనమేజయుడడుగగా వ్యాసమహర్షి యిట్లనెను. మొట్టమొదట మదగర్వితులైన రాక్షసులు దేవతలతో నూరు సంవత్సరములు యుద్ధము చేసిరి. వారి యుద్ధములోక క్షయకరముగా సాగెను. అందు దేవతలు పరాశక్తి దయవలన గెలిచిరి. రాక్షసులు ఓడిపోయి స్వర్గమును వదలి పాతాళమునకు పోయిరి. దేవతలు తమ గొప్పతనములను గోరంతలు కొండలంతలు చేసి అభిమానగర్వముతో నిట్లు పలికిరి.

మేము సర్వశ్రేష్ఠులము మాలో గొప్ప మహిమలుకలవు. మాకు జయమేల చేకూరును? దైత్యులు పామరులు - శక్తిహీనులు మేము సృష్టిస్థితి లయకారకులము కీర్తిమంతులము ఇక మా ముందు పామరులగు దైత్యుల ఆటకట్టినట్లే. ఇట్లు పలికి పరదేవత మహిమ నెరుగక మోహితులైరి ఆ తల్లి కోటిసూర్యులకాంతి విరజిమ్ముచు వారికి కనువిప్పు కలిగింపదలచి అవయవములేనిదై జ్యోతియై

ప్రకాశించుచుండెను. ఆ దివ్యతేజస్సును చూచి ఇదియేమి? యిది యేమని వారెల్లరునివ్వెర పోయిరి. ఇది యెవ్వడేని చేసిన మాయయా? లేకయే దేవతలేని ఆశ్చర్యకరముగ నిట్లు కల్పించిరా? అని పరిశీలింపసాగిరి. మనమా యక్షము సన్నిధి కేగి నీవెవరవని యడుగుదము. బలాబలము కెరిగి ప్రతిక్రియ జరుపదమని తలచిరి. అపుడింద్రుడగ్నిని పిలిచి యిట్లనెను.

ఓ యగ్నీ! నీవు మాకు ముఖమువంటివాడవు. నీవు వెళ్ళి ఆయక్షమెవరో యెరిగి రమ్మనగా అగ్ని వేగముగా యక్షము సన్నిధి కెగెను. అపుడు యక్షమిట్లు ప్రశ్నించెను. "నీవెడవు? నీ బలమెంతటిది? నాకు తెలియజెప్పుము" అపుడగ్ని నేను జాతవేదుడను, అగ్నిని ఈ విశ్వమంతటిని కాల్చుశక్తి నాలో కలదు అని సమాధానమిచ్చెను. అపుడా యక్షము అగ్నిముందొక గడ్డి పోచనుంచెను. మరియు నిట్లు పలికెను. నీలో అంతటి శక్తియున్నచో దీనినికాల్చుము చూతమని అగ్ని ముందొక గడ్డి పోచనుంచెను. అపుడగ్ని తన సంపూర్ణ శక్తితో ప్రయత్నించియు కాల్చలేకపోయెను. అపుడగ్ని తలవంచుకొని దేవతల వద్దకేగి జరిగినంతయు తెలిపెను. మరియు మనము సర్వసమర్థులమని విర్రవీగుట హాస్యాస్పదమని పలికెను. అంతనింద్రుడు వాయువును పిలిచి నీయందే ప్రపంచమంతయు నిలిచియున్నది. నీవందరకును ప్రాణమవు.

కనుక నీవు వెళ్ళి ఆ యక్షమెవరో తెలిసికొని రమ్మనెను. అంత వాయువు దురభిమానముతో యక్షము వద్ద కెగెను. యక్షము వాయువును చూచి మెల్లగా నిట్లు ప్రశ్నించెను. నీవెరవు నీశక్తి యెంతటిది? యని వాయువు గర్వముతో నేను వాయువును ఎల్ల వస్తువులను కదలించు శక్తి కలవాడను. నావలననే ప్రపంచ మంతయు క్రియాశీలమగుచున్నది. అనగా యక్షమిదిగో నీ ముందు గడ్డి పోచ నుంచితిని దీనిని కొంచము కదలించుము. నీ చేతకానిచో తలవంచుకొని యింద్రుని వద్దకు వెళ్ళమనెను. వాయువు తన శక్తినంతను విని యోగించి దానిని కదల్ప జూచెను. కాని యాతడు కదల్పలేకపోయెను. తన గర్వము విడిచి వాయువు దేవేంద్రుని వద్దకేగెను. మరియు నాతనిట్లు పలికెను.

మనము చేతకాని వారలము. అహంకారవంతులము. అతని నిజరూపము తెలిసికొను శక్తి మనకు లేదు. ఆ యక్షములో లోకాతీతమైన శక్తి కలదు. అపుడు దేవతలందరు నీవు దేవరాజువు ఆ యక్షము తత్త్వము నీవే తెలిసికొన సమర్థుడ వనగా ఇంద్రుడు మహాగర్వముతో బయలుదేరెను. అంతలో యక్షము ఇంద్రుని చూచి మాయమాయెను. ఆ యక్షము మాటనైన వినకపోతిమేయని యింద్రుడు

తనను తక్కువవానిగా తలచెను. నేనిపుడు దేవసభకు వెళ్ళజాలను. దేవతల ముంద తలయెత్తుకొని తిరుగజాలను నా యసమర్థతను వారికెట్లు తెలుపగలను? అభిమా నము లేని బ్రతుకు మరణమువంటిదే అని తలచి యచటనే తన గర్వము విడిచి అత్యద్భుతశక్తి గల ఆ వ్యక్తిని నేను శరణువేడుచున్నానని పలికెను.

అదేక్షణమున ఆకాశము నుండి ఇంద్రా! మాయాబీజము జపించుము. దాని వలన నీకు సుఖము కల్గును. అంతట నింద్రుడు మాయాబీజమును జపించుచు నిరహారుడై ధ్యాననిమగ్నుడై లక్ష సంవత్సరములు దేవిని గూర్చి తపస్సు చేసెను. ఒక చైత్ర శుద్ధనవమినాడు పట్టపగల కసాత్తుగా అదేదివ్యతి తేజస్సు అదేచోటన అవతరించెను. ఆ దివ్యతేజమందొక కుమారి జపాకుసుమకాంతులతో సూర్యుని కంటె మిన్నగా వెలుగొందుచుండెను. ఆ భగవతి తన కిరీటమందు చంద్రవంక ధరించి తన నాల్గుచేతులందును పాశాంకు శవరాభయముద్రలు దాల్చి పరమ లావణ్యవతియై నానాభూషణ భూషితయై భక్తులపాలిట కల్పతరువై విరాజిల్లు చుండెను. ఆమె త్రినేత్ర తెల్లనికాంతులు విరజిమ్ము మల్లికామాలలతో శోభించు కేశపాశము కలది. నలుదిక్కులందు రూపము దాల్చిన వేదములచే స్తుతింప బడునది. తనదంత కాంతులతో తెల్లెడల పద్మరాగకాంతులు విరజిమ్ము చున్నది. సుప్రసన్న హాసము కలది. సుందరాంగి రక్త వస్త్రము రక్తచందనము దాల్చి 'ఉమ' అనబడు హైమతీదేవి. ఆమె కరుణామయి. సర్వకారణఅట్టి శ్రీదేవి తనయెదుట వెలుగుచుండ దర్శించి యింద్రుడు ప్రేమ గద్గద కంఠడయ్యెను. ఇంద్రుడుపులకిత శరీరుడై శ్రీభువనేశ్వరి చరణ కమలములకు ప్రణామ ములా చరించెను. నిర్మల భక్తితో నామెను పలురీతుల స్తుతించి కడువినయముతో దేవి! ఆ యక్షమెవ్వరు? ఎచటి నుండి వచ్చినది? నాకు తెలియజేయుమని ప్రార్థింపగా దేవి యిట్లనెను.

అంతయు నాసూయయే. నా రూపము మాయాధిష్ఠానము. సర్వసాక్షిని రానయము. ఎల్లవేదములు వర్ణించు దివ్యపదము ఎల్ల వేదములు వర్ణించు దివ్యపదము ఎల్ల తపస్సు కీర్తించు గుణములు గలది యగు ఓంకారము ఏకా క్షరము అది బ్రహ్మము అదే హ్రీం స్వరూపము ఆరెండును నామంత్రమునకు ముఖ్యమైన బీజములు ఆ రెండు భాగములతోనే నీజగత్తును సృష్టింతును. అందొక భాగము సచ్చిదానంద స్వరూపమనబడును. రెండవ భాగము ప్రకృతి పరము మైన మాయ ఆ మాయయే పరశక్తి ఆ యీశ్వరీ శక్తి. ఇవన్నియు నేనే చంద్రుని నుండి వెన్నెల వేరుకానట్లు నా మాయనాకంటె వేరుకాదు. ప్రళయమందీజగమంతయు నాకంటె వేరుగా నుండును. ప్రాణుల కర్మ పరిపాకవశమున సృష్టి జరుగును.

అప్పుడు నాయందు వ్యక్తరూపమే వ్యక్తరూపము తాల్చును. నా అంతర్ముఖమగు అవస్థయే మాయ అనబడును. నా బహిర్ముఖమగు మాయ తమస్సనబడును. బహిర్ముఖమైన తమో రూపము నుండియే సత్త్వరూపము ఉదయించును. దాని నుండి రజోగుణము కలుగును. దాని నుండి త్రిగుణాత్మకులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులుద్భవింతురు. అందు రజోగుణమెక్కువైనచో బ్రహ్మ, సత్త్వగుణ మెక్కువైన విష్ణువు, తమోగుణమెక్కువైన రుద్రుడు నుద్భవింతురు. స్థూలదేహము బ్రహ్మ సూక్ష్మదేహము హరి కారణదేహము రుద్రుడు, తురీయ స్వరూపము నేనే. త్రిగుణముల సామ్యావస్థయే నా అంతర్ముఖత్వము. అది సర్వాంతర్యామి స్వరూపము. అదియే తురీయమైన యుపాధితో కూడినది. దీనికేవలరూపము లేని పరబ్రహ్మము కలదు.

నా రూపములు సగుణనిర్గుణములుగా రెండువిధములు మాయను కనుక నేనే యెల్ల జగముల సృజించి వానియందు ప్రవేశించి వారివారి కర్మానుగుణముగ నిరంతరము జీవులను ప్రేరేపింతును. కారణరూపులగు బ్రహ్మ విష్ణువు రుద్రులను నేనే ప్రేరేపింతును. నాకు భయపడి గాలి వీచును. సూర్యుడుదయించును. ఇంద్రాగ్నులు మృత్యువును నాభయము వలన తమతమ పనులు చక్కగా నిర్వహింతురు. నేను సర్వోత్తమురాలను నా దయవలననే నీవు జయ మును పొందుచున్నావు. నేను మిమ్ము బొమ్మలవలె ఆడింపజాలుదును.

ఒకప్పుడు దేవతలకు మరొకప్పుడు రాక్షసులకును జయము చేకూర్చెదను. అందరును తమతమ కర్మలను బట్టి సర్వస్వతంత్రనగు నా స్వేచ్ఛచే తమతమ పనులు నిర్వహించుచుందురు. అట్టి సర్వాత్మికనగు నన్ను గర్వాంధులై దురహంకారులై మీరు మరచితిరి. మోహగ్రస్తులైతిరి. మిమ్ముల గ్రహించుటకే మీ అందరి శరీరముల నుండి నాయక్షరమమగు తేజస్సు ఆవిర్భవించెను.మీరు మీమీ తనువున బుట్టిన గర్వములు విడిచి సచ్చిదానంద స్వరూపిణియగు నన్ను శరణు వేడుడు. ఈ విధముగ పలికిన సర్వేశ్వరి మూలప్రకృతి భగవతి భక్తి ప్రపత్తులు గల దేవతల చేత స్తోత్రము చేయబడి అంతర్ధానమొందెను.

అపుడు దేవతలెల్లరు గర్వముడిగి భగవతియైన పరాత్పరశక్తి చరణకమలము లారాధించిరి. అందరు త్రికాలమునప్పుడు గాయత్రీ ధ్యానముల నిమగ్నులైరి. యజ్ఞభాగములతో నెల్లరు శ్రీదేవిని సంసేవించిరి. ఈ విధముగ నెల్లరును సత్యయుగము గాయత్రీ జపపరాయణులైరి. వారు ప్రణవము - హృల్లేఖమునను మంత్రములు జపించి అందేనిష్ఠ గలవారైరి. వేదములందెచ్చటను విష్ణూపాసన గాని, విష్ణు దీక్షగాని, శివోపాసనగాని చెప్పబడలేదు. సర్వవేదములును శ్రీగాయత్రి

నుపాసించవలయునని నొక్కి వక్కాణించినవి. ఆ తల్లినుపాసించని బ్రాహ్మణులెల్లభంగుల నధఃపతితుడుగాక మానడు. బ్రాహ్మణుడొక్క గాయత్రీ జపముననే ధన్యజీవుడగును. మరియేయితర మార్గమును లేదు.

గాయత్రీ జపపరాయణుడైన ద్విజుడు నిక్కముగ మోక్షపదవి నలంకరింప గలడు. ఇతరములు చేసినను చేయ కున్నను బ్రాహ్మణుడు గాయత్రిని మాత్రము తప్పక జపించవలయునని మనువు చెప్పెను. అట్టి గాయత్రిని వదలి విష్ణువును పాసించువారు శివునుపాసించువారు నగు విప్రులు నరకమున కూలుదురు. కనుక రాజా! పూర్వపు సత్యయుగమందెల్ల రాజులు గాయత్రీ జపతత్పరులై శ్రీదేవీ పదాంబుజనిరతులై యుండిరి. కనుక నెల్ల దేవతలును శ్రీ గాయత్రి చరణ కమలములనే భక్తితో కొలుచుచుందురు.

# గాయత్రీ దీక్షా లక్షణము

దీక్ష పొందనినాడు దేవీ మంత్రము జపించుట కధికారికాడు కాన దీక్షా లక్షణము తెలుపుమని నారదడడుగగా నారాయణుడిట్లనెను. దీక్షకు గురుశిష్యు లిరువురును పవిత్రులై యుండవలెను. గురువు వేకువజామున లేచి స్నానసంధ్యా విధులను నిర్వర్తింపవలెను. పిమ్మట యాసనముపై కూర్చొని అచటనుంచి ప్రాణా యామము చేయవలెను. గంధ పుష్పములతో నీటిని ఏడుమార్లు 'ఫట్' అను మంత్రముతో ఆరుమార్లు శుద్ధి చేయవలెను. అస్త్రమంత్రముతో మండప ద్వార మును నీటితో ప్రోక్షించి పూజనారంభింపవలెను. దక్షిణ ద్వారమున గంగా గణపతుల పూజింపవలెను. అస్త్రమంత్రముతో విఘ్నముల తొలగింపవలెను.

పిమ్మట ఎడమవైపు తాకుచు కుడిపాదము మొదట నుంచవలెను. ఇట్లు మండపమున ప్రవేశించి కలశము స్థాపించి సామాన్యార్ఘ్యం మొసంగువలెను. అర్ఘ్యజలముతో నైర్ఋతిదిశ యందు వాస్తునాథుని బ్రహ్మను గంధపుష్పాక్షతాదు లతో పూజింపవలెను. అర్ఘ్యజలముతో పంచగవ్యము సిద్ధము చేయవలెను. మండ పము నుండి తోరణస్తంభము వరకు జలము ప్రోక్షించవలెను. భక్తితో మూలమంత్ర మును జపించవలెను. 'ఫట్'తో మండపపునేల తాకవలెను. 'హుం' మంత్రముతో నచట నీటిని చిలకరించవలెను. పిమ్మట ధూపము వేయవలెను. విఘ్నహారములగు అక్షతాదులను వెదలజల్లవలెను. దర్భకుంచెతో ఊడ్వవలెను. వాటిని ఈశాన్యదిశ యందుంచి మార్జన చేయవలెను. పుణ్యాహవాచనమొనర్పవలెను.

పిమ్మట శిష్యుడు గురువునకు నమస్కరించి తూర్పుముఖముగ కూర్చొని మంత్రదేవతను ధ్యానించవలెను. అంగన్యాసమొనర్చి ముమ్మారు చప్పట్లుకొట్టి

ముమ్మారు చిటికలు వేసి దిగ్బంధము చేయవలెను. ప్రాణాయమము చేసి మూల మంత్రము నుచ్చరించుచు తన దేహమందు మాతృకాన్యాసము చేయవలయును. శిష్యునకు ఉపదేశించవలసిన మంత్రమునకు షడంగన్యాస/కరన్యాస/హృదయ న్యాసములొనర్చవలయును. మూలమంత్రముతో వర్ణన్యాస మొనర్చవలెను. ఇట్లు కల్పోక్త ప్రకారముగా గాయత్రీ దీక్ష పొందవలెను. ఇట్లు నారాయణుడు నారదునకు చెప్పి కన్నులు మూసికొని సమాధిలో ముని శ్రీదేవిని ధ్యానింపసాగెను. అంత నారదుడు తన పరమగురువగు నారాయణునకు నమస్కారించి దేవీ దర్శన కాంక్షతో తపమాచరింపనరిగెను.

# గాయత్రీ మహిమ

వేదవ్యాస మహర్షి జనమేజయునకు గాయత్రీ మహిమ నిట్లు చెప్పెను. రాజా! పూర్వమొకప్పుడు ప్రాణులచెడు పనులవలన పదిహేను సంవత్సర ములు వానలు కురియలేదు. ఆ అనావృష్టి వలన కరువుకాటకము లెక్కు వయ్యెను. ఇంటింట పీనుగులసంఖ్య లెక్కకు మిక్కిలిగా నుండెను. కొందరాకలిబాధ కోర్వలేక జంతువుల మాంసమునుతినిరి. కొందరు పీనుగులను తినజొచ్చిరి. మనుష్యులను మనుష్యులే తినతలపడిరి. అప్పుడు బ్రాహ్మణు లందరు కలిసి యీ సమయమున మహాతపస్వియైన గౌతముడొక్కడే మన బాధలను పోగొట్టగలవాడని నిర్ణయించి అతని యాశ్రమమునకు వెళ్ళ నిశ్చయించుకొనిరి. అతడు గాయత్రీ జప తత్పరుడగుటచే అతని ఆశ్రమ సమీమంతయు సుభిక్షముగా నున్నది. అక్కడ పెక్కుమంది సుఖముగా బ్రతుకుచున్నారు. అని తలచి నిత్యాగ్ని హోత్రులు గృహస్థులైన బ్రాహ్మణులు తమతమ ఆవుల మందలతో దాసదాసీ జనముతో గౌతమముని యాశ్రమము చేరిరి. వారిలో కొందరు దక్షిణదిశనుండి మరి కొందరు పడమరనుండి ఉత్తరము నుండి మరికొందరు ఇట్లు పెక్కు దిక్కుల నుండి వచ్చినవారు కలరు.

ఆ బ్రాహ్మణులను చూచి గౌతమమహర్షి వారికి నమస్కరించెను. వచ్చిన వారికి ఆసనములిచ్చి పూజలొనర్చి కుశలప్రశ్న పూర్వకముగా వారిరాకకు కారణ మడిగెను. వారందరును గౌతమ మహర్షికి తమ తమ కష్టములు తెలుపుకొనిరి. దు:ఖించుచున్న బ్రాహ్మణులను చూచి మహర్షి వారికి అభయమిచ్చి యిట్ల నియెను:- ఇది మీయిల్లు. నేను మీ దాసుడను నేనుండగా మీకు విచార మెందు లకు? తపోధనులగు మీయందరి సందర్శన భాగ్యముచే చెడుకూడ మంచి కాగలదు. మీయందరి పాదధూళిచే నా గృహము పవిత్రమైనది. మీయందరి

యనుగ్రహామునకు పాత్రుడనైన నాకంటె ధన్యుడెవడు? మీరందరు సంధ్యా జపపరాయణులై యిచ్చట సుఖముగా నుండుడు అని గౌతమ మహర్షి వారి నందరిని ఊరడించెను. గౌతముడు పరమభక్తితో వినయముగా తలవంచి గాయత్రీ దేవిని ప్రార్థించెను.

ఓ వేదమాతా! పరాత్పరా! మహావిద్యా! వ్యాహృత్యాది మంత్రరూపిణీ! సామ్యావస్థాత్మికా! హ్రీం కారరూపిణీ! స్వాహా స్వధా రూపిణీ! సకలార్థ ప్రదాయినీ! భక్తకల్పలతికా! నీకు కోటి నమస్కారములు. తురీయా! విశ్వరూపిణీ! సచ్చిదానంద స్వరూపిణీ! సర్వవేదాంతవేద్యా! సూర్యమండల వాసినీ! నీవు ఉదయమున ఎఱ్ఱని రంగు కలదానవు బాలవు. మధ్యాహ్నమున నవయువతివి. సాయంకాలమున నల్లనిదానవు వృద్ధురాలవు. నిత్యము నీకు కోటినమస్కారములు. సకలప్రాణుల తరింపజేయు పరమేశ్వరీ! నాయపరాధములను క్షమించుము అని స్తుతించెను. అనునీ స్తుతిని విని గాయత్రీదేవి ప్రత్యక్షమయ్యెను. ఆమె గౌతమ మహర్షికి ఒక పూర్ణ పాత్రమునిచ్చెను. ఆ పాత్ర యెందరినైన పోషించగలదు. ఓ మునీ! నీవు కోరిన దానిని ఈ పాత్ర నీకీయగలదు. అట్టి పాత్రను నీకిచ్చితిని. అని చెప్పి గాయత్రీ దేవి అదృశ్యమయ్యెను.

అప్పుడా పాత్రనుండి అన్నము కావలసిన పదార్థములు రాసులురాసులుగా బయలువెడలెను. షడ్రసములతో కూడిన పదార్థములు పలువిధములైన గడ్డి అనేక విధములైన పాత్రలు వస్త్రములు సొమ్ములు యజ్ఞసాధనములు విరివిగా వెలువడెను. ఆ మునిరాజు కోరిన ప్రతిపదార్థము అపాత్రనుండి వెలువడు చుండెను. అప్పుడు గౌతమ మహర్షి బ్రాహ్మణుల నందరిని పిలిచి వారికి ధన ధాన్యములు వస్త్రములు సొమ్ములు సమృద్ధిగాయిచ్చెను. వేయేల ఆపూర్ణ పాత్రలో నుండి ఆవు బఱ్ఱెమొదలగు పశువులలును యజ్ఞపరికములును, వెలసినవి. గౌతముని మాటచొప్పున వారందరు కలిసి యజ్ఞము నారంభించిరి. అప్పుడా ప్రదేశము స్వర్గసీమయా అన్నట్లు విలసిల్లెను. ముల్లోకములలోను ఎక్కడెక్కడ ఏయే అందమైన వస్తువులు గలవో అవి యన్నియు పూర్ణపాత్ర నుండి వెలువడ జొచ్చెను. స్త్రీలు దివ్యభూషణములు ధరించి దేవతాస్త్రీలవలె విరాజిల్లిరి మునులు దివ్యవస్త్రములు భూషణములు చందనము ధరించి దేవతలవలె విలసిల్లిరి.

ఈ విధముగా గౌతమ మునియాశ్రమున నిత్యోత్సవములు సాగు చుండెను. అచట రోగభయముగాని రాక్షసభయముగాని మచ్చుకైనలేదు. గౌతమాశ్రమము నూరు ఆమడల దూరము వ్యాపించినది. ఎందరో ప్రాణులు అక్కడకు చేరి బ్రతుకుచుండిరి. ఆత్మవంతుడగు గౌతమముని వారందరికిని అభయమిచ్చి

వారిని పోషించుచుండెను. అక్కడ అనేక విధములైన యజ్ఞములు జరిగినవి. దేవతలు సంతోషించిరి. అందరును గౌతముని కీర్తిని వేనోళ్ళపొగడ జొచ్చిరి. గౌతముడు కల్పవృక్షము వంటివాడయ్యెను. మహానుభావుడు మహర్షి మా కోరికలును తీర్చి మమ్మానందింపజేయు చున్నాడు. ఇతడు లేనిచో ఈ కరువు రోజులలో మలమల మాడిపోయి ఉండెడి వారము అని అందరును మహర్షినభి నందించి నమస్కరించిరి. గౌతముడీవిధముగ కన్న బిడ్డలవలె అందరినీ పోషించెను. గౌతముడు తన యాశ్రమమును గాయత్రీ పీఠము చేసెను. ఆనాటినుండి మునిజనులెల్లరును గాయత్రిని పూజింప నారంభించిరి. గాయత్రి పురశ్చరణలు సాగుచుండెను.

ఇట్లుండగా ఒకనాడు అక్కడకు నారదమహర్షి వచ్చెను. గాయత్రీ గుణ గణమును గానము చేయుచు ఆతిథ్యము స్వీకరించి గౌతముని పలుతెరగుల ప్రశంసించెను. మరియు మహర్షి ఇంద్రుడు కూడ దేవసభలో గౌతముడు మును లను పోషించి గొప్ప కీర్తిని గడించెనని నిన్ను పొగడెను. ఇంద్రుని మాటలువిని నేను నిన్ను చూచుటకు వచ్చితిని. జగదంబ యనుగ్రహముచే నీవు ధన్యుడవని పలికి గాయత్రి యున్నచోటికి వెళ్ళి ఆనందముచే విశాలములైన నేత్రములతో దేవిని దర్శించెను. మరియు ఆమెను స్తోత్రము చేసి స్వర్గమునకు వెళ్ళెను. తరువాత గౌతమమునిచే పోషింపబడి అక్కడనున్న బ్రాహ్మణులు ముని యొక్క గొప్ప తనమును విని అసూయతో బాధపడుచు అతని కీర్తిని పోగొట్టతలచి సమయము ఎప్పుడు వచ్చునాయని యెదురుచూచుండిరి. అట్లుండగ కొంత కాలమునకు వానలు కురిసినవి. అప్పుడన్ని దేశములును పచ్చని పైరులతో పాడి పంటలతో కళకళలాడుచుండెను. అప్పుడు బ్రాహ్మణులందరు ఒకచోట గుమిగూడిరి. వారందరును తమకు అన్నము పెట్టిన గౌతముని శపించ పూనుకొనిరి. అందరును కలిసి చావ సిద్ధమైన ఒక ముసలి ఆవును కల్పించిరి. ఆయావు గౌతముడు హోమము చేయు సమయమున అక్కడకు వచ్చినది. అప్పుడు గౌతముడు దానిని చూచి హుంకారము చేసెను. వెంటనే ఆయావు ప్రాణములు విడిచినది. అప్పుడు ఈతడెంతటి దుష్టుడు? అకారణముగా గోవును చంపినాడు. అని యాబ్రాహ్మణు లందరు మునిని నిందింపసాగిరి.

## భువనేశ్వరీ స్థాన (మణి ద్వీపవర్ణనము)

జనమేయునకు వ్యాసమహర్షి పదునాలుగులోకాలకు మూలకారణమైన శ్రీత్రిభువనేశ్వరీదేవి నివసించు పరమధామమును గూర్చి యిట్లు చెప్ప నారంభించెను:-

బ్రహ్మలోకమునకు పైన సర్వలోకమనునది యేదికలదో అదియే "మణిద్వీప'మని ప్రసిద్ధిగాంచినది. అన్ని లోకములకంటెను గొప్పదగుటచే మణిద్వీపమును సర్వలోకమని కూడపిలిచెదరు. శ్రీ పరాంబిక దానిని తన సంకల్పము చేతనే నిర్మించినది. శ్రీమూల ప్రకృతి దేవి యీ సమస్త సృష్టికి పూర్వము మణి ద్వీపమును తన నివాసముగ ఏర్పరచుకొనెను అది కైలాసము కంటే గొప్పది. వైకుంఠము కంటే శ్రేష్ఠమైనది. గోలోకముకన్న నుత్తమమై వెలుగొందుచున్నది. కనుకనే దానిని సర్వలోకమనుచున్నారు. ఈ మూడులోకము లందును దానిని మించిన అందమైన నగరమింకొకటిలేనేలేదు. అది ముజ్జగములకు గొడుగు వంటిది. సంసార సంతాపమును నశింపజేయునది. బ్రహ్మాండము లన్నిటికిని చల్లని నీడవంటిది. ఇది ఎన్ని ఆమడల వైశాల్యము గలదో అంత గంభీరమైనది.

ఆ మణిద్వీపమునకు నాల్గువైపుల అమృతసముద్రము ప్రకాశించుచుండును. అందు గాలితాకునకు ఉవ్వెత్తుగ లేచు చల్లని కెరటములు. రత్నాలయినుక ప్రదేశములును దక్షిణా వర్తము మొదలగు వివిధ శంఖములును పలువన్నెల చాపలును కనులపండువు చేయుచుండును. అందు తరంగముల వరుసలచే కలిగిన చల్లనినీటి తుంపురులును వివిధటెక్కెముల టెక్కుతో అటు నిటు ప్రయాణము చేయు అందాల పడవలును భాసమానములై యుండును. ఆ పొడవైన గట్టులందు కనులకింపైన సొంపైన బంగారు చెట్ల వరుసలుగలవు. వాటికావల ఇనుముతో నిర్మించబడిన ఏడామడల ఎత్తుగల దృఢమైన ప్రాకారము కలదు. అచట అనేక శస్త్రాస్త్రముల నుపయోగించి పోరుటలో నేర్పరులగు రక్షకులు వీరోత్సాహముతో నివసించుచుందురు. దానికి నాలుగు ద్వారములు గలవు. ప్రతి ద్వారమందును వందలకొలది ద్వారపాలకులు కాపలాకాయుచుందురు. అందు దేవీభక్తులు గణములుగ నివసింతురు. వారెప్పుడును జగదీశ్వరీదేవి దివ్య దర్శనమునకే తెంచుచుందురు ఆ దేవీభక్తులు తమ దివ్యవాహనములపై వచ్చు చుందురు వారి వేలాది విమానముల గంటల చప్పుడులు గుఱ్ఱము సకిలింపులును వాటి డెక్కల టకటక ధ్వనులు దిక్కులకు చెవుడు పుట్టించు చుండును.

అచట దేవి పరిచారకులు చేత బెత్తములు పట్టుకొని దేవతలను గోలచేయ వద్దని మోదుచుందురు. ఆ కోలాహలములో ఎవడేమి చప్పుడు చేసినదీ తెలియ పిలుబడదు. ఆ మహాధ్వనిలో ఒకరిమాట యింకొకరికి వినిపించదు. అక్కడ అడుగడుగనను స్వచ్ఛమైన మధురమైన నీటితో నిండిన సరస్సులు కలవు. మరియు నచట రత్నమయములైన చెట్లు, ఉద్యానవనములు. లోపలివైపున కంచుతో నిర్మించిన పెద్ద ప్రాకారము కలదు. ఆ ప్రాకారము ఆకాశము నంటు

చుండును. ఇది యినుప ప్రాకారముకంటె నూరురెట్లు గొప్పది. ప్రాకారద్వార ములు మిక్కిలి యెత్తైనవి. అచట అన్ని జాతుల చెట్లును కలవు. ఆ చెట్లు కొంగ్రొత్త చిగురుటాకులతో సుందరములై యుండును. మరి పూలగుత్తులు రంగు రంగుల సౌందర్యములతో పరిమళములను వెదజల్లుచుండును. తీయని పండ్లు నోరూరునట్లు కనిపించును.

పలువిధములైన వృక్షములతో వనములు/ఉపవనములును/వందలకొలది దిగుడుబావులు. అత్యంత సుందరములై ప్రకాశించుచుండును. చెట్లపై కూయు కోకిలలు/ఝుంకారములు చేయు తుమ్మెదలును చెవులకు పండుగ చేయు చుండును. నదుల తీరములు అతిమనోహరములు (పూవులను వాసనలను) విర జిమ్ముగాలులచట ఘ్రాణతర్పణ మొనర్చును. జింకలు గుంపులు గుంపులుగా అటునిటు సంచరించుచు, పరుగెత్తుచు నేత్రానందము కలిగించు చుండును. నెమళ్ళ గుంపులు నాట్యము చేయుచుండును. వాటి తీయని కేకారావములు దిక్కులకు వ్యాపించుచుండును. ఆ కంచుప్రాకారము లోపల రాగిప్రాకారము కలదు. అది చతురస్రాకారముగ ఏడు ఆమడల యెత్తుగ ప్రకాశించుచుండును. కంచు, రాగి ప్రాకారముల మధ్య కల్ప వృక్షముల వరుసలు గల వనములుండును.

అక్కడి పువ్వులు బంగారుకాంతులతో వెల్లవేళల విప్పారియే యుండును. కల్ప వృక్షముల వరుసకు గ్రీష్మఋతువు నాయకుడు/అతని భార్యలు శుకశ్రీ, శుచిశ్రీలు. సంసార తాపములకు భయపడినవారు/ఆ వృక్షముల క్రింద శాంతిగా విశ్రమించుదురు. దేవతలు|సిద్ధులు కూడ అక్కడ నివసించుచుందురు. అచటి విలాసినులు గుంపులు గుంపులుగ ఒయ్యారము లొలకపోయుచుందురు. అచటి ప్రాణులు చల్లని తీయని మంచినీటిని త్రాగుదురు. రక్తచందన వృక్షముల వనములు అతిమనోహరములై కన్పట్టును. వాటికధిపతి మేఘవాహనుడైన వర్షర్తువు. అతని కన్నులు మెరుపులవలె పచ్చని రంగుకలవి. అతని కవచము మేఘముల గుంపు. అతడు వజ్రాయుధము మాదిరి గర్జించును. ఇంద్రధనువు/ చేత బూనికుండ పోతగా| అన్నిచోట్ల వర్షించును. వర్షర్తువునకు పన్నెండుగురు మదవతులైన శక్తులు ప్రసిద్ధులు. ఆ ప్రదేశము చిగురించిన చెట్లతోను లేదీగల తోను పచ్చని పైరులతోను కన్నులపండువుగా నుండును. అచటి (నదీ నదములు) నిరంతరము ప్రవాహవేగముతో హృదయానందకరములై యొప్పారు చుండును.

అచట శ్రీదేవికి మహోత్సవములు జరుపు సిద్ధులు దేవతలును నివసింతురు. వాపీకూపతటాకములు దేవిసేవకుకు యోగింప బడుచుండును//అచటి గణములు విలాసినులగు తమ స్త్రీలతో కూడి విహారములు సలుపుచుందురు. అచట వెండి

ప్రాకారము తళతళ మెరయుచుండును. దేవీపూజలు భక్తులకు ప్రసన్నత కలుగ జేయుచుండును. అచటి హేమంతఋతువు తన గణములతో ఆయుధములతో అనురాగవతుల మనస్సులను పరవశింపజేయు చుండును. అతని భార్యలు సహశ్రీ సహ్యశ్రీలు. అచట దేవీవ్రతము లాచరించు సిద్ధులుందురు. బంగారు ప్రాకార మున కెగువన పుష్యరాగమణుల ప్రాకారము శోభతో నుండును. అచటినేలపైనున్న వనములు ఉపవనములు అన్నియు పుష్యరాగ మయములే. పుష్యరాగపు చెట్ల పొదులు సొంపుగానుండును. అక్కడ రత్న ప్రాకారము కూడ కలదు. దానిలోని చెట్లు పక్షులు వనభూములు అన్నియు రత్నమయములే. మండపములు స్తంభ ములు సరోవరములు కమలము లును రత్నమయములే.

అచట దిక్పతులైన యింద్రాదులు ఆయుధములను ధరించి దిక్పాల సమ ష్ట్యాత్మరూపముతో ప్రకాశించుచుందురు. ఆ ప్రదేశము నకు తూర్పున ఎత్తైన శిఖరములు గల అమరావతీ పట్టణము పలువిధముల వనములతో అలరారు చుండును. అక్కడ మహేంద్రుడు విరాజిల్లుచుండును. వేల యింద్రుల తేజము గల మహేంద్రుడు వజ్రపాణియై ఐరావతము నెక్కి దేవసేనలతో గంభీరమ్ముగ వెలుగొందుచుండును. ఇంద్రాణియు దేవాంగనలతో కూడి యుండును. దానికాగ్నే యమున అగ్నిమయ పట్టణమోయున్నట్లు అగ్ని పురము వెలుగొందుచుండును. అగ్ని అక్కడ తనభార్యలైన స్వాహా స్వధా దేవులను గూడి తన వాహనభూషణ దేవగణములతో ప్రకాశించు చుండును. దక్షిణదిశ యందు యమపురము గలదు. అందు యముడు దండధారియై చిత్రగుప్తుడు మొదలగువారితో కూడి యుండును. నైరృతి యందు రాక్షసులుందురు.

అచట రాక్షసులతో ఖడ్గధారియైన నైర్పతి వెలుగొందుచుండును. పడమట వరుణుడు పాశపాణియై ప్రతాపవంతుడై ఒప్పుచుండును. అతడు మహామత్స్యమును అధిరోహించి దేవసేనలను గూడి తనశక్తితో వరుణలోకమందు వరుణానితో రతిక్రీడలమునిగి తేలుచు ప్రమోదమొందుచుండును. ఇక వాయవ్యమున వాయు లోకములో వాయుదేవుడు నివాసముండును. అతడు వాయు సాధనమున సిద్ధు లైన యోగులనుగూడి ధ్వజహస్తుడు విశాలాక్షుడు మృగవాహనుడై వెలు వొందును. మరుద్గణములు తనను సేవింపగా అతడు తనశక్తిని గూడియుండును. ఉత్తర మున యక్షలోకము ప్రకాశించుచుండును.

అచట వృద్ధిబుద్ధులను శక్తుల గూడి యక్షరాజు విరాజిల్లుచుండును. అతడు ధనపతి నవనిధులకధిపతి. మణి భద్రుడు పూర్ణభద్రుడు మొదలగు యక్షసేనాధి

పతులతో కుబేరుడు తనశక్తితో అధిక సంపన్నుడై తేజరిల్లును. ఈశాన్యమున మహారుద్రలోకము విరాజిల్లుచుండును. అది విలువైన రత్నములతో నిర్మించ బడినది. అందు మహారుద్రుడు స్వయముగా ప్రకాశించుచుండును. అతడు మహోగ్రుడు దీప్తనయనుడు మూపున శమ్ముల పొదిని ధరించినవాడు. అతడు ప్రకాశించు ధనువును యెడమచేత ధరించి తనతో సమానమైన అనేక రుద్రులతో చేరి యుండును. ఆ రుద్రులు కూడా ఆయుధములను ధనుస్సులను ధరించి యుందురు. వారి భీకరముఖముల నుండి నిప్పులు కురియుచుండును. అచట వీరభద్రాదులను కూడి మహారుద్రుడు కొలువై విరాజిల్లుచుండును. అచట ప్రమథగణములు భూతసంఘముతో కూడి మహాట్ట హాసము చేయుచు శబ్దముతో భయమును కలిగింతురు.

మహేశ్వరుడు ఈశానదిక్కునకు ప్రభువగుటవలన ఈశానుడనబడు చున్నాడు. అతడు అష్టమూర్తియు మహారుద్రుడునై విరాజిల్లుచుండును. పుష్యరాగ మణుల ప్రాకారములోపల పద్మరాగమణుల ప్రాకారము ప్రకాశించుచుండును. అచటి నేలకూడ అట్లే ఎఱ్ఱగా ఉండును. ఆ ప్రాకారము పదియోజనములు ఎత్తు గలది. దానికి గోపుర ద్వారములు గలవు. అచట పద్మరాగమణులతో ప్రకాశించు మండపము లెన్నియో కలవు. ఆ ప్రాకారముల మధ్య అనేకా యుధములు కలవు. రత్నభూషణముల ధరించిన వీరులును అరువదినాలుగు కళలునుగలవు. ఆ వీరులకు ప్రత్యేకము నాయకులు గలరు. వారికి ప్రత్యేకముగ లోకములు కూడ కలవు. ఆ లోకములు కూడ పద్మరాగమణులతో నిర్మింప బడినవే. పింగలాక్షి మొదలగువారు అరువది నాలుగు కళలు శక్తులు అనబడుదురు. వారందరికినీ నిప్పులు గ్రక్కుచున్న మహోజ్జ్వలమైన నాలుకలు కలవు. వారిముఖముల నుండి అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లుచునుండును.

అందరును ధనుస్సులను బాణములను ధరించి కయ్యమునకు కాలుదువ్వు చుందురు. పటపట పండ్లు గీటుటచే కల్గు ధ్వనికి దిక్కులు పిక్కటిల్లుచుండును. ఆ వీరులందరకును కేశములూర్ధ్వముగా నుండును. వారికి విల్లంబులు ధరించిన అనేకాక్షౌహిణులసేన కలదు. ఒక్కొక్క శక్తికి లక్ష బ్రహ్మాండముల నైన సంహరింప గల శక్తి యున్నది. నూరు అక్షౌహిణులసేనలు గలవు. ఈలోకములో ఆ శక్తులకు సాధ్యము కానిదిలేదు. ఆ ప్రాకారములో వారి యుద్ధసామగ్రి భద్రపరచబడును. అచట రథములు గుఱ్ఱములు శస్త్రములు లెక్కకు మీరియున్నవి. వారందరును దేవి కొఱకై యుద్ధము చేయుటకు సన్నద్ధులైయుందురు. వీరు కోపించినచో

బ్రహ్మాండములనెల్ల నశింపజేయగలరు. గోమేధిక ప్రాకారము దాటినచో లోపలి వైపున వజ్రాలప్రాకారము ప్రకాశించుచుండును. అదియును పదియోజనములు ఎత్తుగలది. గోపుర ద్వారములందు గొలుసులు బిగించిన తలుపులు గలిగి దివ్యశోభతో నుండును. అచటి వీధులు సందుగొందులు తీగలు పక్షులు అన్నియు వజ్రమయములే బావులు చెరువులు దిగుడు బావులు వజ్రమ యములే అచ్చట భువనేశ్వరీ దేవి దాసీజనము నివసింతురు.

ప్రతి దాసియు లక్షదాసీ జనముచే సేవలందుకొనును. కొందరు విసిన కఱ్ఱలు కొందరు పాత్రలు కొందరు తాంబూలపాత్రలు చేతులతో పట్టుకొని నిలువబడి యుందురు. కొందరు దేవి పాదకమలముల నొత్తుటయందు తన్మయులగు చుందురు. కొందరు పూలదండ లల్లుచుందురు. అచటి స్త్రీలు విలాసవతులై చతురలై రాణకెక్కుదురు. ఆ యువతులెల్లరును దేవీ సేవకైనడుము బిగించి యుందురు. దేవి దయాదృష్టి ముందు ముజ్జగములను సైతము తుచ్ఛముగా తలంచెదరు. శ్రీదేవి దాసులు శృంగార మదగర్వితలు. వారెల్లరును మెరుపు తీగలవంటి శరీరము కలవారు. వారు ధ్వనిచేయు అందెలతో ఒయ్యారము లొలుకపోయుచు నిటునటు సంచరించు చుందురు. కన్నులపండువుగొనుందురు.

వజ్ర ప్రాకారము దాటగా దానికెదురుగ లోపలి భాగమున వైడూర్యమణుల ప్రాకారము గలదు. అదికూడ పదియోజనముల ఎత్తైన గోపుర ద్వారము లతో విలసిల్లుచున్నది. అచటి నేల వీధులు సందులు గొందులు అన్నియు వైడూర్య మణిమయములే. అచటి వాపీకూపములు చెరువులు నదీతీరములు ఇసుక భూములు అన్నియు వైడూర్యమయములే. అచటి ఎనిమిది దిక్కులందును బ్రహ్మ మొదలగు దేవతల మండలముల గలవు. వారందరు తమతమ గణములతో కొలువులో నుందురు. బ్రాహ్మి, మహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి చాముండ యను వీరలు సప్తమాతృకలు. ఎనిమిదవ మాతృక శ్రీ మహాలక్ష్మి ప్రసిద్ధిగాంచినది. వీరు జగములకు శుభకారిణులు.

ఈ ప్రాకారము నాల్గు ద్వారములందును నిత్యము మహేశ్వరీదేవి దివ్య వాహనములు చక్కగ అలంకరింపబడి సంసిద్ధముగా నుండినవి. అచట కోట్ల కొలది ఏనుగులు గుఱ్ఱములు, రాయంచలు, సింహములు, గరుత్మంతులు వృష భములు పల్లకీలు నెమళ్ళు వాహనములై సిద్ధముగా నుండును. మరియు కోట్ల కొలది రథములు వాటికి రువైపుల పార్శ్వచరులు కలవు. అచట పలువిధముల జెండాలతో గుర్తులతోను వాద్య విశేషములతో అందమైన విమానములు కోట్ల

కొలది కనిపించుచుండును. వైడూర్యమణి ప్రాకారమునకు యెదుట ఇంద్రనీల మణులతో నిర్మింపబడిన యేడుయోజనములెత్తు గల మరియొక ప్రాకారము కలదు. అందలి వీధులు యిళ్ళు చెరువులు నూతులు యిళ్ళు అన్నియు ఇంద్ర నీలమణి నిర్మితములే.

అచట అనేక యోజనములు విస్తారము గల పద్మమొకటి కలదు. దానికి పదహారు రేకులు కలవు రెండవ సుదర్శనచక్రమా అన్నట్లుండును. అచట పదు నారు శక్తుల స్థానములు అన్ని వస్తువులతో నిండియుండును. ఆశక్తులు నీల మేఘము వంటికాంతి గలిగి చేతులందు కత్తిడాలు ధరించి యుద్ధమునకు సన్నద్ధులై యుందురు. వారుజగదీశ్వరీదేవి యొక్క సేనానాయికలు. వారు బ్రహ్మాం డములను తలక్రిందులు చేయగలశక్తితో కూడినవారు. దేవీశక్తి సంపన్నులు అనేక రథములనెక్కి అనేక శక్తులను ధరించి యుందురు. ఆదిశేషు నకు కూడ వారి పరాక్రమమును తెలుప శక్యము కాదు. అట్టి యింద్రనీల ప్రాకారము ముందు పది యోజనములు పొడవు గల గొప్ప విస్తారముతో కూడిన ముత్యాలప్రాకారము కలదు. అచటి భూమి యంతయు మౌక్తికమయమే.

అచట మధ్యభాగమున ఎనిమిది రేకులుగల పద్మమున్నది. అదికూడ ముత్యాల కాంతి తోనే ప్రకా శించుచుండును. ఆ కమలమందలి కింజల్కములు లెక్కకు మిక్కిలిగా నుండును. అచట దేవితో సమానమైన ఆకారమును ఆమె ఆయుధములవంటి ఆయుధములను ధరించినవారుందురు. వారు అష్ట మంత్రి ణులు దేవితో సమానమైన సుఖభోగముల నుభవించుచుందురు. పాండిత్యము కలిగినవారు. ఇంగితమెరిగినవారు. సమస్త లోకముల వార్తలను తెలుపజాలినవారు. అన్ని పనులందును వారు చాతుర్యము కలవారు. స్వామి కార్యపరాయణులు. అతిలోక సుందరులు. దేవి మనస్సును బాగుగా అర్థము చేసికొనినవారు. ముత్యాల ప్రాకారమునకెగువ లోపలివైపున మరకత ప్రాకారము విరాజిల్లుచుండును. అదికూడ పదియోజనముల ఎత్తున కలదు. భోగభాగ్యముల కాటపట్టు. అందలి వేలభవనములు మరకతమణులతో నిర్మింపబడి కాంతులు విరజిమ్ముచుండును. అచట ఆరుకోణములందు గాయత్రి, సావిత్రి మొదలగు దేవతలు కలరు.

అక్కడ అరువది నాలుగు ఆగమములు స్వరూపములు ధరించి భాసించు చుండును. అగ్నికోణమున చేతులందు రత్నకుంభము మణికరండము ధరించి కుబేరుడు వెలుగొందు చుండును. ధనపతి అక్కడ తన దేవితో గణములతో కూడి నివసించుచుండును. పడమటి కోణమున కామదేవుడు రతిదేవితో కూడి

చెలువు మీర నివసించుచుండును. అతడు పాశాంకుశములను చెరకు విల్లు అమ్ములను ధరించి శృంగారాది రసములు మూర్తిమంతములై సేవించుచుండ సొబగుగ నుండును. గణపతి విభూతులెన్ని కలవో అన్నియు నచట గొప్ప సంపదలతో తులతూగు చుండును.

అచట బ్రహ్మాదులు దేవతలు అందరు జగదీశ్వరిని నిత్యము సేవించు చుందురు. మరకత ప్రాకారము నకెగువ లోపలపది యోజనముల యెత్తు గల పగడాల ప్రాకారము మెరయు చుండును. దానినడుమ నున్న భవనము లన్నియు పగడాలవలె ఎఱ్ఱగా మిరుమిట్లు గొలుపు చుండును. దాని నడుమ పంచ భూతముల స్వామినులైదుగురు కలరు- హృల్లేఖ- గగన- రక్త- కరాళిక, మహోచ్ఛుష్మ యను వారలు పంచభూతముల వంటికాంతి గలవారు. వరాభయ పాశాంకుశములు ధరించి పెక్కు సొమ్ములతో దేవివలె వేషభూషలు గలిగి నవయౌవనముతో గర్వించియుందురు. పగడాల ప్రాకారమునకు ముందు పెక్కు యోజనముల వైశాల్యము గల నవరత్న ప్రాకారము కలదు. అందు ఆ మ్నాయ దేవతల భవనములు చాలకలవు. (పూర్వ దక్షిణ పశ్చిమోత్తరోర్ధ్వా మ్నాయములు) అచటి చెరువులు కొలకులును నవరత్న మయములే.

అచట శ్రీదేవి మహావతారములు ప్రకాశించుచుండును పాశాంకుశే శ్వరి, భువనేశ్వరి, భైరవి, త్రిపుట, అశ్వారూఢ, నిత్యక్లిన్న, అన్నపూర్ణ, త్వరిత రాజకాళి- తారషోడశి, భైరవి, మాతంగి మొదలగు పది మహావిద్యలచట స్వరూపము ధరించి ప్రకాశించు చుండును. అచట సకలదేవీ రూపములు తమతమ ఆవరణ దేవతలతో భూషణములు ధరించ కోటిసూర్యుల కాంతితో విరాజిల్లుచుందురు. అచటనే ఏడుకోట్ల మహా మంత్రములు రూపుదాల్చి శోభిల్లుచుండును. నవరత్న ప్రాకారమునకు ముందు శ్రీకరమైన చింతామణి గృహము మహోజ్జ్వలముగ ప్రభలు విరజిమ్ముచుండును. అందలి ప్రతి వస్తువుకూడ చింతామణులతో నిర్మింపబడినదే. సూర్యకాంత, చంద్రకాంత శిలలతో మెరుగుకాంతుల మణుల తోను నిర్మింపబడిన వేలమణి స్తంభము లచట దివ్యకాంతుల వెదజల్లుచుండును. చింతామణుల మధ్యభాగమున శ్రీదేవి దివ్యమందిరము విరాజిల్లుచున్నది.

ఆ దివ్యమండపమునకు వేయిమణి స్తంభములును నాలుగు మండపము లును శోభించుచుండును. అందొకటి శృంగారమండపము, రెండవది ముక్తిమండ పము, మూడవది జ్ఞానమండపము, నాలుగువది ఏకాంత మండపము, అవి ప్రసిద్ధి నొందినవి. వీటియందెన్నియో మణులు అరుగులు కలవు. అవి అనేక ధూపముల

సువాసనలతో నిత్యము పరిమళముల వెదజల్లుచుండును. ఈ నాల్గింటిలో ప్రతి మండపమును కోటిసూర్య కాంతులు విరజిమ్ము చుండును. ఆ మండపములకు నాలుగువైపుల కాశ్మీరవనములు కనుల కింపుగా నుండును. అచట మంచి మల్లెపూవుల తోటలు కుందవనములును ఎన్నో పరిమళాలను వెదజల్లుచుండును. ఆ తోటలందె న్నియో మదించిన మృగములు స్వేచ్ఛగా తిరుగుచుండును. అక్కడ రత్నాల మెట్లుగల సరస్సులతో మహాపద్మ వనములు గలవు. ఆ పద్మములందు మకరందము జాలువారుచుండును. తుమ్మెదలు ఝుంకారములతో చెవుల కానందము చేకూర్చుచుండును. హంస కారండవాది పక్షులు చూడ ముచ్చటగా విహరించుచుండును. ఆ దివ్యవనము లందలి సువాసనలు నాలుగుదిక్కులకు వ్యాపించుచుండును. శృంగార మండపమందు దేవతలు మధురసుందర స్వరములతో దివ్యగానము లాలపించుచుందురు. అచట దేవతలందరు సభా సదులై వినుచుందురు. శ్రీ జగదంబ దేవి వారి నడుమ దివ్యసింహాసనముపై విరాజిల్లుచుండును.

జగదంబముక్తి మండపమందుండి బ్రహ్మాండమందలి మహాభక్తులకు ముక్తిభాగ్యమును ప్రసాదించుచుండును. జ్ఞానమండపమందుండి జ్ఞానకాంతుల వెలగిం చుచు విధేయులగు వారికి పరమజ్ఞానము నుపదేశించుచుండును. నాల్గవ మండపమునందు దేవి తన మంత్రిణులతో కొలువుండి లోకరక్షణ గూర్చి ఆలోచించుచుండును. చింతామణి గృహమందు శక్తి తత్త్వాత్మ కములైన పదిమెట్ల వరుసతో దివ్యకాంతులు విరజిమ్ము మంచము శోభిల్లు చుండును. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు ఆ మంచమునకు నాలుగు కోళ్ళు, సదాశివుడు ఆ నాల్గు పాదములపై పలకగా అలరారుచుండును. దానిపై త్రిభువనేశ్వరుడు మహా దేవుడు అయిన కామేశ్వరుడు విరాజిల్లుచుండును.

శ్రీ త్రిభువనేశ్వరీదేవియే తన లీలా విలాసమునకు రెండు రూపములు ధరించును. ఈ సృష్టికి మొట్టమొదట మహాదేవుడు త్రిభువనేశ్వరికి అర్ధాంగుడ య్యెను. అతడు మన్మథుని దర్పమడచుటకు పూనినకోటి మదనసుందరుడు. అతనికి ఐదు ముఖములు మూడు నేత్రములు కలవు. మణిభూషణ భూషితుడై అతడు తన హిరణ్యబాహువులతో జింక గొడ్డలి వరద అభయముద్రలు తాల్చి విరాజిల్లుచుండును. ఆ మహాదేవుడు సర్వేశ్వరుడు పదహారేళ్ళ యువకుడు. కోటిసూర్యుల వెలుగు కోటిచంద్రుల చల్లదనముగల దేవుడు. అతడు శుద్ధ స్ఫటి కమువలె ప్రకాశించు వాడు ముక్కంటి దయతో చల్లని చూపులు విరజిమ్మువాడు.

అట్టి త్రిభువనేశ్వరుని కెడమ ప్రక్కన శ్రీ త్రిభువనేశ్వరీ దేవి నవరత్నములు పొదిగిన వడ్డాణముతోను మేలిమిబంగారమున వైడూర్యములు పొదిగిన చేతి కంకణములతోడను ప్రకాశించుచుండును. మేలిమి బంగారముతో చేయబడిన శ్రీ చక్రాకారముగల తాటంకముల కాంతులతో అందమైన ముఖపద్మము గలదై దేవి ప్రకాశించుచుండును. ఆమె ముఖకాంతి ముందు చంద్రుడు వెలవెలబోవు చుండును. దొండ పండుకంటె అందమైన క్రింది పెదవితో నుదుటిపై కుంకుమ కస్తూరి తిలకముల సౌభాగ్యముతో దివ్యకాంతి యుతమైన ముఖముతో దేవి వెలు గొందుచుండును. సూర్యచంద్రకాంతులను మించిన దివ్యచూడామణి శిరోభూషణముగా కలదియై ఉదయించుచున్న శుక్రనక్షత్రమువంటి నాసా భరణము కలిగియున్నది. మంచి జాతిముత్యాల గుత్తులతో శోభిల్లు చింతాకు పదకము వ్రేలాడుమెడగలది.

మంచిగంధము కర్పూరము కుంకుమపూవు అలదినవక్ష స్థలము గలది. చిత్రవిచిత్రములైన అనేకా భరణములు ధరించినది. శంఖము వంటి కంఠము గలది. దానిమ్మపండు గింజలవంటి పలువరుసగలది. గండు తుమ్మెదలు మూగిన ముంగురులతో కూడిన ముఖపద్యము గలది. సుడివంటి నాభిగలది. మాణిక్య ములు పొదిగిన బంగారు టుంగరములతో శోభిల్లు చేతి వ్రేళ్ళు గలది. కమలదళ కాంతుల విరజిమ్ము మూడు నేత్రములతో నొప్పారు నది. మహోజ్జ్వలమై సర్వకళల విరజిమ్ము సహజలావణ్యా శోభగలది. రత్నాల కంకణములు గలది. మెడలో మణులముత్యాహారములందు తరళమను బంగారు పద్మముగలది. రత్నపు టుంగరాల కాంతుల చిమ్ముర్రేళ్ళు గలది.

దేవి యిచ్చాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తులతో కూడియుండును. లజ్జ, తుష్టి మొదలగువారు స్వరూపము ధరించి యుందురు. జయవిజయ/అజిత, అపరాజిత, నిత్య, విలాసిని -దోగ్ధ్రి-అఘోర- మంగళ- నవయను పీఠశక్తులు నిత్యము పరాంబి కను సేవించుచుందురు. దేవికి రెండుప్రక్కలను శంఖపద్మ నిధులు ఎల్లప్పుడును నిండియుండును. నవరత్నములు బంగారములను ప్రవహించు నదులక్కడ పారుచుండును. ఆ నదులన్నియు తుదకు అమృత సాగరములో కలియును. శ్రీ త్రిభువనేశ్వరి కామేశ్వరి శ్రీ మహాదేవునకు ఎడమవైపున ప్రకాశించుచుండును.

మహాదేవుడు మహాశక్తితో కూడియుండుటవలననే సర్వశక్తి సహితుడై యెల్ల పనుల నెరవేర్పగలుగుచున్నాడు. చింతామణి గృహము నూరామడల వైశాల్యము గలది. దానికి ఉత్తరము వైపునున్న ప్రాకారము తూర్పు దానికంటె రెండింతలు

యెత్తుగనుండును. అది మహాకాశమున నిరాధారముగ నిలిచి యున్నది. అది నిరంతరము సంకోచవ్యాకోచముల నొందుచుండును. అది సృష్టి మొదలైనప్పుడు విప్పిన వస్త్రమువలె వ్యాకోచము నొందును. ప్రళయమున సంకోచము నొందును. చింతామణి గృహము పరమశోభలతో పరిపూర్ణమై విరాజిల్లును. ఆ చింతామణి గృహమందు దేవి తేజస్వినియై ధగద్ధ గాయమానముగ విలసిల్లుచుండును. ఉపాసకులెల్లరును శ్రీదేవి దివ్యసన్నిధానమునకు వచ్చి చేరుదురు. కోరినకోరికలను తీర్చు వృక్షములు దిగుడు బావులు నూతులు చాలకలవు. అచట నీరు త్రాగిన వారి కోరికలెల్లతీరును. ఇందే మాత్రమును సందేహింప పనిలేదు. అచటి నీరు త్రాగినవారికి ముసలితనము రోగము వెంట్రుకలు నెరియుటయుండవు.

అచట నున్నవారికి దిగులు మాత్సర్యము కామక్రోధములుండవు. యువకులు సహస్ర సూర్యప్రభలతో తమ తమ స్త్రీల గూడి స్వేచ్ఛగా విలాసముగా విహరింతురు. వారందరును శ్రీ త్రిభువనేశ్వరీ దేవిని సేవించుచుందురు. వారిలో కొందరు సాలోక్యముక్తిని, కొందరు సార్ష్టిముక్తిని, మరికొందరు సామీప్యముక్తిని, సారూప్య ముక్తిని, గూడ పొందినవారు కలరు. ప్రతి బ్రహ్మాండమందలి ఆయా దేవత లందరును శ్రీదేవిని చేరి సమష్టిగ దేవిసేవలు చేయుచుందురు. అచట ఏడుకోట్ల మహామంత్రములు రూపము ధరించి చేతులు జోడించి దేవినుపాసించు చుండును. అక్కడ మహా విద్యలన్నియు సౌమ్యావస్థను పొంది దివ్యకారణ బ్రహ్మరూపిణి మాయా శబల విగ్రహయైన భగవతి నుపాసించుచుండును.

## జనమేజయుడు శ్రీదేవీ దీక్షను స్వీకరించుట

వ్యాసమహర్షి జనమేజయునితో రాజా! పరమాద్భుతమైన దేవీ మహాపురాణ మును వినినవాడు ధన్యజీవుడగును. శ్రీదేవికి ప్రీతిపాత్రుడగును. నీ తండ్రి దుర్గతి నొందుట వలన నీవు దుఃఖపడుచున్నావు. కానీ తండ్రి నుద్ధరించుటకు నీవు దేవీ యాగమును చేయవలయును. నీవు మొదట ఉత్తమోత్తమమైన మహాదేవీ మంత్రమును దీక్షావిధానముతో స్వీకరింపుము. దానిని విధావిధానముతో నాచరించిన యెడల నీ జన్మము ధన్మమగును. అని పలుకగా వ్యాసమునీంద్రుని ప్రార్థించి యతని వలన శ్రీదేవీ ప్రణవసంజ్ఞతో నొప్పుడు శ్రీదేవీ మహామంత్రమును దీక్షా విధానముతో స్వీకరించెను. అటు పిమ్మట ధౌమ్యుడు మొదలగు మహర్షులను పిలిపించెను. దేవీ నవరాత్రములందు జనమేజయుడు ధనలోపము లేకుండ దేవీ మహాయజ్ఞమును కొనసాగించెను. బ్రాహ్మణులవలన శ్రీదేవీ మహాపురాణమును చదివించెను.

శ్రీదేవీ ప్రీతికొరకప్పుడు రాజు దేవి సన్నిధిలో చక్కగ శ్రద్ధగా శ్రీదేవీ భాగవతా మృతమును తన చెవులనుదొన్నెలతో త్రాగెను. ఎందరెందరో బ్రాహ్మణులకు ముత్తైదువులకు భోజనములు పెట్టించెను. వారికి విస్తారముగ ద్రవ్యములొసగి రాజువారి నెల్లరను సంతోషపరచెను. అగ్నికాంతులు వెదజల్లు నారదుడు తన ... యను వీణను మీటుచు వచ్చినంతనే రాజు చూచి తొందరపాటుతో లేచి నిలబ డెను. రాజు మునికాసనాదులొ సంగి యతనిని పూజించి కుశలప్రశ్నలడిగి అతని రాకకు కారణము నడిగెను. సాధుసత్తమా! తామెక్కడ నుండి వచ్చితిరి? నేను మీకేమి ప్రియము గూర్చగలను? మీ రాకవలన ధన్యుడను అని పలుకగా ముని సత్తము డిట్లనెను రాజా!

దేవలోకము నందొక ఆశ్చర్యము చూచితిని దానిని నీకు చెప్పుటకై యిక్కడకు వచ్చితిని. నీ తండ్రి తన చెడు కర్మకు ఫలితముగ దుర్గతి పొందియుండెను. కాని నేడతడే దివ్యరూపము ధరించి దేవతలచే స్తోత్రము చేయబడుచున్నాడు. అప్సరసలతో సరస సల్లాపములాడుచు దివ్యవిమాన మెక్కి మణిద్వీపమునకు వెళ్ళెను. దీనకంతటికిని కారణము నీవు దేవీ భాగవతమును వినిన ఫలమే. నీవును ఆ యజ్ఞమును నాచరించుట వలన నీ తండ్రి సద్గతి నొందెను. నీ జన్మము చరితార్థమైనది. ధన్యమైనది- సఫలమైనది- కులభూషణా! నీవు నీ తండ్రిని నరక కూపము నుండి ఉద్ధరించితివి. ఇపుడు దేవీలోకమున నీ ప్రశంసలు మిన్నుముట్టి నవి. అంతట జనమేజయుడు ప్రేమతో అద్భుతకర్ముడగు వ్యాసుని పాదములపై పడి నమస్కారించెను.

మహాముని! నీ యనుగ్రహముచే ధన్యుడనైతివి. ఈ నీమహోపకారమునకు నమస్కారము చేయుటకన్న ప్రతిఫలమే మీయగలను? ఇప్పటివలె నీ దయనాపై ఎప్పటికిని నిలిచి యుండనిమ్ము. అను రాజు మాటలు విని వ్యాసుడు తన నాశీస్సులచే నభినందించెను. మరియు ప్రియమృదువచనములతో నిట్లనెను. రాజా! నీవన్నియుమునది శ్రీదేవి పాదపద్మములు నిత్యము కొలుచుచుండుము. ప్రతిదినము విధేయుడవై శ్రీ దేవీ భాగవతమును శ్రద్ధగా చదువుము. భక్తితో దేవీ యజ్ఞము చేయుచుండుము. అట్లు చేయుటచే సంసార బంధములనుండి విడువబడి సుఖముగా ముక్తిని పొందెదవు. యిదికాక శివ పురాణము, విష్ణు పురాణము, ఇతర దేవతల పురాణములు ఎన్నో కలవు అవియన్నియు దేవి పురా ణములో పదహారవంతుకు సాటిరావు. ఈ దేవీ భాగవతమెల్ల పురాణముల సారము. ఏలయన ఇందులో శబల బ్రహ్మరూపిణియైన మూలప్రకృతి ప్రతిపాదింప బడినది. ఇది త్రిగుణముల సామ్యావస్థను తెలియజేయును. ఇతర పురాణములు

తెలుపవు. కావున అవి దీనికి సరిగావు. జనమేజయా! దేవీ భాగవతము చదువుట వలన వేదము చదివినంత ఫలము కలగును. పుణ్యము కలుగును. ఉత్తమ విద్వాంసులు తప్పక నిత్యము దేవీ భాగవతము చదువుచుండవలయును. అని పలికి వ్యాస మహాముని జనమేజయుని వీడ్కొని వెళ్ళెను. ధేమ్యాది మునులు నుతమత తావులకరిగిరి. వారందరు దేవీ భాగవతమును ప్రశంసింపదొడగిరి. తరువాత జనమేజయుడు సంతోషముతో చక్కగా రాజ్యము చేసెను. మరియు నతడు దేవీ భాగవతమునే వినుచు చదువుచు తన జీవితమును సార్థకమొనర్చుకొనెను.

# శ్రీదేవీ భాగవత శ్రవణాధిఫలము

సూతమహర్షి ఇట్లనెను. శ్రీదేవి ముఖపద్మమునుండి సగము శ్లోకము వెలువడినది. అదే వేదసిద్ధాంతమును ప్రబోధించునట్టి శ్రీదేవీ భాగవతముగా రూపొందినది. ఈ శ్లోక సగభాగమే పూర్వము శ్రీదేవి వటపత్ర శాయియగు శ్రీవిష్ణువునకు తెలియజేసెను. దానియందున్న గొప్ప యర్థమును బ్రహ్మ నూరుకోట్ల శ్లోకములలో వివరించాడు. ఆ శ్లోకములలోని సారమంతయు గ్రహించి వేదవ్యాస భగవానుడు శుకమునికొరకు పద్దెనిమిది వేల శ్లోకములుగల పన్నెండు స్కంధములుగా విభజింపబడిన దేవీభాగవతము నుపదేశించెను. బ్రహ్మ రచించిన దేవీ భాగవత మహా పురాణము నేటికి దేవలోకమందు ప్రసిద్ధి పొందియున్నది. దేవీ భాగవతముతో సమానమైన పాపనాశనము పవిత్రము పుణ్యప్రదము నగు పురాణ మింతవరకును మరియొకటిలేదు. దీనిని శ్రద్ధతో చదివిన మానవుడు అడుగడున అశ్వమేధయాగఫలమును పొందును.

ఈ పురాణమును చదివి చెప్పు వానిని వ్యాసునిగా తలచి అతనిని సత్కరించి నియమముతో అతని ముఖము నుండి దేవీ భాగవతమును చక్కగా విసవలయును. ఈ దేవీభాగవతమును వ్రాసినవాడు వ్రాయించినవాడు భాద్రపద శుద్ధ పూర్ణిమనాడు పీటపై నుంచి పౌరాణికునకు దానము చేయవలయును దూడగల పాడియావును దక్షిణగా బ్రాహ్మణునకు దానమీయవలయును. పిమ్మట బ్రాహ్మణులకు ముత్తైదులకు కన్యకలకును బ్రహ్మచారులకు భోజనము పెట్టవలయును. కన్యలను ముత్తైదువులను దేవీ భావముతో సత్కరించి పువ్వులతో పూజింపవలయును. పాయసమును వారికి తృప్తిగా అర్పించవలయును. దేవీ పురాణ దానము భూదానముతో సమానమైన ఫలము నిచ్చును.

అట్టిదాత యీలోకమున సుఖించి చివరకు దేవ లోకమును చేరును. ఈ దేవీ భాగవతమును నిత్యము శ్రద్ధా భక్తులతో చదువువానికి ఎక్కడైనను ఎప్పుడై

నను ఏదియైనను అసాధ్యముకాదు. దీని చదువుట వలన పుత్రులు లేనివారికి పుత్రులు, సంపదలేనివారికి సంపద విద్యార్థికి సంపూర్ణ విద్య ప్రాప్తించును. భూమిపై అతడు కీర్తిగలవాడై గౌరవము సంపాదించును. గొడ్రాలు సంతానవతి యగును. ఈ విషయమున ఎట్టి సంశయమునులేదు. ఏయింట శ్రీదేవీ భాగవతము నిత్యము పూజింపబడునో ఆయింట లక్ష్మీ సరస్వతులు నివాసముందురు. ఆయింటినిదాకి నీ(భేతాళాదులు కన్నెత్తి చూడ జాలరు. జ్వరరోగ బాధలో నున్న వానిని తాకి దీనిని పఠించినచో ఎంతటి దాహ జ్వరమైన శాంతించును. దీని నూరుమార్లు చదివినచో క్షయరోగములు తొలగును.

ప్రతిదినము సంధ్యావందనము చేసి తరువాత నియతముగ ఒక్కొక్క అధ్యాయము చొప్పున దీనిని చదువువాడు మహాజ్ఞానికాగలడు. మనము చేయు పనులు ఆ దేవిని తలచుకొని చేసినచో నెట్టియాటంకము లేక నెరవేరగలవు. నవ రాత్రములలో భక్తితో దేవీ భాగవతమును నిత్యము చదువవలయును. చైత్రాషాఢ ఆశ్వయుజ మాఘ మాసములందు శుక్లపక్ష నవరాత్రులందు దేవీభాగవతమును తప్పక చదువవలెను. దేవి ప్రసన్నురాలై కోరికలను పండించును. అన్ని దేవతల ఉపాసనలు శక్తిమూలముననే జరుగు చుండును. గనుక దేవీ భాగవతము పఠనము తప్పక చేయుదగినది. ఇంక వేయి మాటలేల? దేవీ భాగవతము వేదసారము హ్రీంమయి శ్రీదేవిని నమస్కరిస్తున్నాను. నైమిశారణ్యవాసులు దీనిని విని సూతమహర్షిని పూజించిరి.

శ్రీదేవి పాదపద్మముల నిత్యము పూజించు భక్తుల మనస్సులు ఆనందమున నోలలాడుచుండును. గనుక సూతమహర్షి నుండి విన్నవారందరు/ప్రసన్న హృదయులై వారివారి నివాసములకు వెడలిరి. వెళ్ళిపోవునప్పుడు సూతమహర్షికి శ్రమ కలిగించినందుకు మునులెల్లలరును మాటిమాటికి ఆతనికి నమస్కారము లొనర్చిరి. ఈ విధముగ సకలవేద రహస్యము దుర్గమమునైన ఈ శ్రీదేవీ భాగవత మహాపురాణమును సూతమహాముని మునివరులకు విని పించి వారిచేత స్తుతింపబడి వారి నాశీర్వదించి జగదంబా చరణకమలముపై తిరుగాడు తుమ్మెదయైన యెదతో తన యాశ్రమమునకు వెళ్ళెను.

# గౌతముని శాపము

గౌతముడప్పుడాశ్చర్యము చెంది హోమమును ఆపివైచెను. వెంటనే సమాధిలో మనస్సును నిలిపి దీని కారణము తెలిసికొనెను. ఇది యంత బ్రాహ్మణులు

పన్నినపన్నాగమేయని అతడు తెలిసికొనెను. ఆ సమయమున గౌతముడు ప్రళయరుద్రుని వలె కనులెఱ్ఱజేసి బ్రాహ్మణు లనందరను ఈవిధముగా శపించెను. ఓ బ్రాహ్మణాధములారా మీరు వేదమాతయగు గాయత్రి ధ్యానము జపము మానివేయుదురుగాక. గాయత్రీమాతను వదలుటవలన మీరు తప్పక బ్రాహ్మణాధములగుదురుగాక. వేదములందు యజ్ఞములందును మీరు చెడుభావము కలవారగుదురుగాక. మీరు మూల ప్రకృతియైన శ్రీదేవి యొక్క ధ్యానమందు కథలయందును రుచిలేని వారగుదురు గాక.

శ్రీదేవీమంత్రము యొక్క అనుష్ఠానమును విడిచి బ్రాహ్మణాధములగుదురుగాక. శ్రీదేవీ మహోత్సవములు చూచుటకు శ్రీదేవీ దివ్యనామమును కీర్తించుటకును మీరు నోచకుందురుగాక. రుద్రాక్షలు, మారేడు, భస్మము వీటి యందు ప్రీతికలుగ కుండుగాక. శృతిస్మృతులందలి సదాచారమును జ్ఞానమార్గమును వదలితిరుగుబోతులై బ్రాహ్మణులలో నీచులై ప్రవర్తింతురుగాక. నికృష్టజీవనులగ బ్రాహ్మణ భ్రష్టులుగ తిరుగుదురుగాక, నిత్యకర్మా నుష్ఠానమును అగ్నికార్యమును నెరవేర్చుటకు పెడమొగము పెట్టెదరుగాక. గోదానము, పితృ శ్రాద్ధములు చేయుటకు ఇష్టపడని నికృష్టజీవనులగుదురుగాక. కృఛ్ర చాంద్రా యణాది ప్రాయశ్చిత్తములాచరింపక దురాచారపరులై సంచరింతురుగాక. ఇతర దేవతలను కొలిచి చెడిపోదురుగాక. కాపాలిక బౌద్ధపాషండాది మతములందాసక్తి కలవారై చెడుదురుగాక. తల్లిదండ్రులను కన్నబిడ్డలను, సోదరులను, భార్యను అమ్ముకొని బ్రతువారగుదురు. పర స్త్రీ వ్యామోహము కలవారుగుదురుగాక మీరే కాక మీ మీవంశములందలి స్త్రీ పురుషులును నాశాగ్నికి భస్మమగు దురు. ఇంత చెప్పనేల!

ఆ మూలప్రకృతి మహేశ్వరియైన గాయత్రీదేవియు మిమ్ములను కోపించియుండును. మీరు అంధకూపము మొదలగు నరక యాతనలందు మ్రగ్గుదురుగాక. ఇట్లు గౌతముడా బ్రాహ్మణులను శపించి నీటిని స్పృశించెను. తరువాత మహానందముతో గౌతమముని గాయత్రీ దర్శనమునకు బయలుదేరెను. మహాదేవిని దర్శించి గౌతముడు ప్రణమిల్లెను. పరాత్పరయగు దేవియును బ్రాహ్మణులు చేసిన దురాచారము నకు ఆశ్చర్యపడెను. మరియు చిరునవ్వుతో నామె మునివర్యునికిట్లు పలికెను. పామునకు పాలుపోసిన విషమగును. మహాను భావా! నీవిప్పుడు శాంతించుము కర్మగతి యిట్లేయుండును. దేవి వాక్కులువిని గౌతముడు దేవికి నమస్కరించి తనయాశ్రమమునకు వెళ్ళెను. బ్రాహ్మణులందరు శాపదగ్ధులగుటచే వేదములు మరచిరి. గాయత్రీమంత్రము గుర్తు వచ్చుట లేదు.

ఇది యంతయు విచిత్రముగా నుండెను. శాపగ్రస్తులైన బ్రాహ్మణులు పశ్చాత్తాపము నొందిరి. వారు గౌతమునికి సాష్టాంగ నమస్కారము చేసిరి. సిగ్గుచే వంచిన తలను యెత్తలేకుండిరి. ప్రసన్నుడ వగుము ప్రసన్నుడ వగుము. అనివారు మునిని పలుమార్లు ప్రార్థించిరి. వారందరును గౌతముని చుట్టుచేరి వేడుకొన సాగిరి. ముని హృదయము ద్రవించినది.

అతడు దయతో వారికిట్లనెను:- మీరందరును శ్రీకృష్ణావతారము వరకు నరకము నందుండుడు. మీరు మరల కలియుగమున జన్మించెదరు. అప్పుడు మీకు నేనిచ్చిన శాపములన్నియు అనుభవమునకు వచ్చును. ఇది నిజము నమ్ముడు. నా మాటకు తిరుగులేదు. కాని నాశాపమునుండి విముక్తి పొందదలచినచో మీరు గాయత్రీదేవి పాదపద్మములను సేవింపుడు. ఇట్లు గౌతమ మునిపలికి వారిని విడిచి అంతయు ప్రారబ్ధ కర్మఫలమని తలచి శాంతచిత్తుడయ్యెను.

కృష్ణావతారము ముగియగనే కలియుగము ప్రారంభించినది. అప్పుడు శాపమును పొందినవారే ఇప్పుడే గాయత్రీజపము చేయని బ్రాహ్మణులు ఇకవారట్లే దురాచారపరులై నరక దుఃఖము లనుభవించుచుందురు. నీవు మాత్రము సర్వాత్మభావముతో శ్రీ పరమేశ్వరినే సేవింపుము. గాయత్రీ మహాదేవి నుపాసించుటయే నిత్యోపాసనమనబడును. గాయత్రీదేవి నుపాసించనివాడు తప్పక పతితుడు కాగలడు. అని యిట్లు గాయత్రీ దేవి మహిమను వివరముగా వ్యాసుడు రాజుకు చెప్పెను.

## శ్రీదేవీ భాగవత సంగ్రహము
## పన్నెండు స్కంధముల సారాంశము సమాప్తము

**ఓమ్ సర్వచైతన్యరూపాం తా మాద్యాం విద్యాం చ ధీమహి।**
**బుద్ధిం యా నః ప్రచోదయాత్**

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం।
దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్॥
అచతుర్వదనో(బ్రహ్మా ద్విబాహురపరోహరిః।
అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః॥
ఏతత్ సర్వం పరదేవతార్పితమస్తు పరదేవతానుగ్రహ సిద్ధిరస్తు
శ్రీమాత్రే నమః శ్రీ మాత్రే నమః శ్రీ మాత్రే నమః

# శ్రీ దేవీ ఖడ్గమాలా స్తోత్రరత్నమ్

శ్లో॥ హ్రీంకారాసనగర్భితానలశిఖాం సౌః క్లీం కళాం బిభ్రతీం
సౌవర్ణాంబరధారిణీం వరసుధా ధౌతాం త్రినేత్రోజ్జ్వలాం
వందే పుస్తక పాశ మంకుశధరాం స్రగ్భూషితా ముజ్జ్వలాం
త్వాం గౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్ర సంచారిణీమ్ ॥

అస్యశ్రీ శుద్ధశక్తిమాలామహామంత్రస్య, ఉపస్థేంద్రియాధిష్ఠాయియా వరుణాదిత్య ఋషిః దైవీ గాయత్రీ ఛందః, సాత్విక కకార భట్టారక పీఠస్థిత కామేశ్వరాంకనిలయా మహాకామేశ్వరీ శ్రీలలితా పరాభట్టారికా దేవతా, ఐం బీజం, క్లీం శక్తిః, సౌః కీలకం, మమ ఖడ్గసిద్ధ్యర్థే సర్వాభీష్ట సిద్ధ్యర్థే జపే వినియోగః మూలమంత్రేణ షడంగన్యాసం కుర్యాత్, ధ్యానమ్; తాదృశం ఖడ్గమాప్నోతి యేన హస్త స్థితేనవై, అష్టాదశమహా ద్వీప సమ్రాడ్భోక్తా భవిష్యతి॥ ఆరక్తాభాం త్రినేత్రా మరుణిమ వసనాం రత్న తాటంక రమ్యాం । హస్తాంభోజైస్స పాశాంకుశ మదనధనుస్సాయ కైర్విస్ఫురంతీం । ఆపీనోత్తుంగ వక్షోరుహా పరివి లుఠత్తారహారోజ్జ్వ లాంగీం। ధ్యాయే దంభోరుహస్థా మరుణిమ వసనా మీశ్వరీ మీశ్వరాణామ్ ॥

లమిత్యాది పంచపూజాం కుర్యాత్, యథాశక్తి మూలమంత్రం జపేత్.

ఓం ఐం హ్రీం శ్రీం ఐం క్లీం సౌః ఓం నమస్త్రిపురసుందరి, హృదయదేవి, శిరోదేవి, శిఖాదేవి, కవచదేవి, నేత్రదేవి, అస్త్రదేవి, కామేశ్వరి, భగమాలిని, నిత్యక్లిన్నే, భేరుండే, వహ్నివాసిని, మహా వజ్రేశ్వరి, శివదూతి త్వరితే కులసుందరి, నిత్యే, నీలపతాకే, విజయే, సర్వమంగళే, జ్వాలా మాలిని, చిత్రే, మహానిత్యే పరమేశ్వర పరమేశ్వరి, మిత్రేశమయి, షష్ఠీశమయి, ఉడ్డీశమయి, చర్యానాథమయి, లోపాముద్రామయి, అగస్త్యమయి, కాల తాపనమయి, ధర్మా చార్యమయి, ముక్తకేశీశ్వరమయి, దీపకళానాథమయి, విష్ణు దేవ మయి, ప్రభాకర దేవమయి, తేజోదేవమయి, మనోజ దేవమయి, కళ్యాణ దేవమయి, వాసుదేవమయి, రత్నదేవమయి, శ్రీరామానంద మయి, అణిమాసిద్ధే, లఘి మాసిద్ధే, గరిమాసిద్ధే, మహిమాసిద్ధే, ఈశిత్వసిద్ధే, వశిత్వసిద్ధే, ప్రాకామ్యసిద్ధే, భుక్తిసిద్ధే, ఇచ్ఛాసిద్ధే, ప్రాప్తిసిద్ధే, సర్వకామసిద్ధే, బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండే, మహాలక్ష్మి, సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశే, సర్వఖేచరి, సర్వబీజే, సర్వయోనే, సర్వత్రిఖండే, త్రైలోక్య మోహన చక్ర స్వామిని, ప్రకటయోగిని, కామాకర్షిణి, బుద్ధ్యాకర్షిణి, అహంకారాకర్షిణి, శబ్దాకర్షిణి, స్పర్శాకర్షిణి, రూపాకర్షిణి, రసాకర్షిణి, గంధాకర్షిణి, చిత్తాకర్షిణి, ధైర్యాకర్షిణి, స్మృత్యాకర్షిణి, నామాకర్షిణి, బీజాకర్షిణి, ఆత్మాకర్షిణి, అమృతాకర్షిణి, శరీరాకర్షిణి, సర్వాశాపరిపూరక చక్రస్వామిని, గుప్తయోగిని, అనంగ కుసుమే, అనంగమేఖలే, అనంగ

మదనే, అనంగమదనాతురే, అనంగ రేఖే, అనంగవేగిని, అనంగాంకుశే, అనంగ మాలిని, సర్వ సంక్షోభణ చక్ర స్వామిని, గుప్తతరయోగిని, సర్వసంక్షోభిణీ, సర్వవిద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వాహ్లాదిని, సర్వ సమ్మోహిని, సర్వస్తంభిని, సర్వ జృంభిణీ, సర్వవశంకరి, సర్వరంజని, సర్వోన్మాదిని, సర్వార్థసాధికే, సర్వసంపత్తి పూరణీ, సర్వమంత్రమయి, సర్వద్వంద్వ క్షయంకరి, సర్వసౌభాగ్యదాయక చక్రస్వామిని, సంప్రదాయ యోగిని, సర్వసిద్ధిప్రదే, సర్వసంపత్ప్రదే, సర్వప్రియంకరి, సర్వమంగళ కారిణీ, సర్వకామప్రదే, సర్వదుఃఖ విమోచని, సర్వమృత్యు ప్రశమని, సర్వవిఘ్ననివారిణీ, సర్వాంగసుందరి, సర్వసౌభాగ్యదాయిని, సర్వార్థసాధక చక్రస్వామిని, కుళోత్తీర్ణయోగిని, సర్వజ్ఞే, సర్వశక్తే, సర్వైశ్వర్య ప్రదాయిని, సర్వజ్ఞానమయి, సర్వవ్యాధివినాశిని, సర్వాధార స్వరూపే, సర్వ పాపహరే, సర్వానందమయి, సర్వరక్షాస్వరూపిణీ, సర్వేప్సిత ఫలప్రదే, సర్వరక్షాకర చక్ర స్వామిని, నిగర్భయోగిని, వశిని, కామేశ్వరి, మోదిని విమలే, అరుణే, జయిని, సర్వేశ్వరి, కౌళిని, సర్వరోగహర చక్రస్వామిని, రహస్య యోగిని, బాణిని, చాపిని, పాశిని, అంకుశిని, మహాకామేశ్వరి, మహావజ్రేశ్వరి, మహాభగ మాలిని, సర్వసిద్ధిప్రద చక్రస్వామిని, అతి రహస్యయోగిని, శ్రీశ్రీ మహాభట్టారికే, సర్వానందమయ చక్రస్వామిని, పరాపర రహస్య యోగిని, త్రిపురే, త్రిపురేశి, త్రిపురసుందరి, త్రిపురవాసిని, త్రిపురాశ్రీః, త్రిపురమాలిని, త్రిపురాసిద్ధే, త్రిపురాంబ, మహాత్రిపుర సుందరి, మహామహేశ్వరి, మహామహా రాజ్ఞి, మహామహాశక్తే, మహామహాగుప్తే, మహామహాజ్ఞప్తే, మహామహానందే, మహా మహాస్కంధే, మహామహాశయే, మహామహా శ్రీ చక్రనగర సామ్రాజ్ఞి, నమస్తే నమస్తే నమస్తే నమః.

# దుర్గా స్తోత్రం

శ్లో॥ మాతర్మే మధుకైటభఘ్ని మహిష ప్రాణపహారోద్యమే
హేలానిర్మిత ధూమ్రలోచన వధే చండ ముండార్థినీ
నిశ్శేషీ కృత రక్తబీజ దనుజే నిత్యే నిశుంభాపహే
శుంభ ధ్వంసిని సంహరా శు దురితం దుర్గే నమస్త్యంబికే ॥

శ్లో॥ శరణాగత దీనార్త పరిత్రాణ పరాయణే
సర్వస్యార్తి హరే దేవి నారాయణి నమోస్తుతే ॥

శ్లో॥ సర్వ స్వరూపే సర్వేశే సర్వశక్తి సమన్వితే
భయే భ్యస్త్రాహినో దేవీ దుర్గాదేవి నమోస్తుతే ॥

శ్లో॥ సర్వబాధా ప్రశమనం - త్రైలోక్యస్యాదఖిలేశ్వరి
ఏవ మేవ త్వయా కావా మస్మద్వైరి వినాశనం ॥

